శ్రీరస్తు

శ్రీ సీతాలక్ష్మణ భరత శత్రుఘ్న హనూమత్సమేత

శ్రీరామచంద్ర పరబ్రహ్మణేనమః

# పీఠిక

---

శ్రీమద్రామాయణంబును లోకోజ్జీవనార్థమై మునీంద్రచంద్రులగు శ్రీవాల్మీకి మహర్షులవారు సంస్కృతభాషయందు విరచించిరి, దాని ప్రభావాతిరేకంబును గూర్చి అగస్త్యసంహిత, బ్రహ్మాండపురాణము, ఆగ్నేయపురాణము, ఉమాసంహిత ఇత్యాది మహర్షిప్రోక్తంబులగు గ్రంథరాజంబులు మిక్కిలియు నభివర్ణించుచున్నవి. శ్రీవాల్మీకి మునీంద్రులవారు పరమ కారుణ్యైక మానసులగుచు తపస్స్వాధ్యాయ నిరతులగు నారద మునీంద్రులచేత బ్రహ్మానుగ్రహానుసారంబుగ సంబోధితులయి రామాయణాత్మకమయిన ఈ పరమార్థమును మనకుఁ బరమప్రీతితోడ ననుగ్రహించియున్నారు.

"వేదవేద్యే పరేపుంసి జాతే దశరథాత్మజే, వేదః ప్రాచేతసాదాసీత్ సాక్షాద్రామాయణాత్మనా" —(వేదములచేత నెఱుంగఁదగిన పరబ్రహ్మము దశరథునకుఁ బుత్రుండై యవతరించినపుడు వేదసముదాయము వాల్మీకులవారిచేత సాక్షాత్ రామాయణ రూపముగా వెలసెను)— అనెడు ప్రమాణంబుచేత సాక్షాత్ వేదసముదాయమే వాల్మీకిమహర్షి ప్రోక్తంబయిన శ్రీమద్రామాయణంబని విదితమగుచున్నది. "సంకటే విమయే ప్రాప్తే కి ముపాయం వదస్వ నః, ఇత్యుక్తః కుంభజో హృష్టో ఋషీన్ ప్రోవాచ పూర్ణధీః"— (ఆపదలు గలిగినప్పుడు శాంతికై చేయవలసిన యుపాయ మేది?— అని యడిగిన మునీంద్రులను గాంచి బ్రహ్మజ్ఞాన సంపన్నులయిన అగస్త్యమునీంద్రులవారు ఇట్లనిరి) "పశుపుత్ర ప్రదంపౌత్ర వృద్ధిదం కల్మషాపహం, ధనమాయుష్య మారోగ్య దాయకం పుణ్యవర్ధనం... బ్రహ్మతేజోభివృద్ధించ హృష్టార్థ ప్రదాయకమ్...తత్పారాయణతస్సిద్ధి ర్యదినైవ భవేద్భువి, కేనాపి భవేత్సిద్ధి రితి బ్రహ్మానుశాసనం, సమస్త మంత్ర రాజంత

న్నాత్రసంశయ మ_స్తిచ...''—(శ్రీమద్రామా
పుత్ర పౌత్ర ధనధాన్యాదిక సమృద్ధిని గలిగిం
బులఁ బోకార్చును. ఆయురారోగ్యైశ్వర్యంబ
...బ్రహ్మతేజంబు నభివృద్ధిచేసి యెంతటి దుర్ఘ
బుల నేనియు సునాయాసంబుగ నొనగూర్చును.
సేయుట వలన సిద్ధింపని కార్యములు లోకంబున
పవు—అనుట బ్రహ్మానుశాసనమైయున్నది. ఇది
కును శ్రేష్ఠమయిన మంత్రరాజంబనుటకు సేమా
లేదు...)—అని అగస్త్యసంహిత పంచమోధ్యాయ
నాథగ శ కోటి ప్రవిస్తరం, ఏకైక మక్షరం ప్ర
నాశనమ్ శృణ్వన్ రామాయణం భక్త్యా యః ప
స యాతి బ్రహ్మణస్థానం బ్రహ్మణా పూజ్యతే సదా''.
స్తరంబగు శ్రీమద్రామాయణంబునందు నొక్కొక్క
మహాపాతకంబులఁ బోఁగొట్టును. శ్రీమద్రామాయణం
దలి యొక పాదమునైనను, తుదకు నొక్కపదంబునైనను
వాఁడు సంపూర్ణంబుగ నైహికసుఖంబుల ననుభవించి
స్థానంబును జెంది యచ్చట బ్రహ్మచేత నిరంతరమును
చుండును.)—అని శ్రీమద్రామాయణ సంహిత లుఘ్నో
మఱియు, దేశక్షోభలు గృహచ్ఛిద్రంబులు శత్రుభయంబు
నంబులు మొదలగు ననిష్టంబులు సమకూరినపుడు శాంత్యర్థ
ద్రామాయణంబును పారాయణము సేయవలయును''—అన
సనాతన ధర్మమైయున్నది. ఇట్టి మహిమోన్నతులచేత స
సేవ్యంబగుచుండెడి శ్రీమద్రామాయణంబునకు విశేషార్థద
లగు నామాఘట్టములలో మన పూర్వాచార్యవరేణ్యులగు
నుజాచార్యులవారు, గోవిందరాజులవారు, తిలకులు, మహేశ్వ
వారును సంస్కృతభాషయందే విపులంబుగ వ్యాఖ్యానము ర
యున్నారు.

ఈ పవిత్రచారిత్రము మన యాంధ్ర దేశీయులకు మహా
యుక్తంబగునట్లు తొలుత రంగనాథుండను కవివరేణ్యుండు ది
కావ్యంబుగ రచించెను. పిమ్మట మంత్రి భాస్కరాది కవిపుంగవులు
కావ్యముగ రచించిరి. ఈ రంగనాథ భాస్కరాదులు యుద్ధకాండాం
బునకే విరచించుటంబట్టి యుత్తరరామాయణ చారిత్రంబును నిర్వ

నంబుగ—"కవిబ్రహ్మ" యని సన్నుతిఁగాంచిన తిక్కనసోమయాజులవారు, కొండొకకాలంబునకు "నిర్వచనోత్తర రామాయణ" మను నామంబున రచించి యశోన్నతిఁ గాంచిరి ఈ మధ్యకాలంబున, విదుషీమణియగు కుమ్మ మొల్లమ్మగారు శ్రీరామచారిత్రంబును, సంగ్రహంబుగ "మొల్లరామాయణ" మను నామంబునఁ బద్యకావ్యముగ రచించిరి. ఇప్పటి కాలంబునకు, శ్రీమద్రామాయణంబును మూలానుగుణంబుగ గోపీనాథ వేంకటకవీంద్రులవారు "గోపీనాథ రామాయణ" మను పేరను, వావిలికొలను సుబ్బారాయ కవీంద్రులవారు "ఆంధ్ర వాల్మీకి రామాయణ" మను నామంబునను బద్యకావ్యంబులుగ రచించి కీర్తి వహించిరి. ఇంకను కవీంద్రు లనేకులు శ్రీరామచరిత్రంబును ననేకవిధంబుల వ్రాసియున్నారు.

ఇంతటి ప్రభావోన్నతిచే లోకైక పూజనీయం బగుచుండెడు శ్రీమద్రామాయణంబును నాంధ్రీకరించిన పండితవరేణ్యులలోఁ బ్రథమగణ్యుండు రంగనాథకవీంద్రుండు. ఈ కవీంద్రుని కులంబునుగూర్చి కొంత యోచింతము. కృష్ణామండలములోని మనుమూరి సంస్థానమును కోన కాటభూపతి కుమారుండు రుద్రరాజును, నాతని కుమారుండు బుద్ధరాజును, నతనిపుత్రుండు విఠ్ఠలరాజును, నాతని తనూజుండు బుద్ధరాజును బారంపర్యముగఁ బాలించుచుండిరి. వారిలో నీకడపటి బుద్ధరాజు హూణశకము పదుమూఁడవ శతాబ్దారంభమునను డినవాఁడనియు, నాతనికి రంగనాథకవీంద్రుం డాశ్రితుఁడగుటయేగాక బంధువనియుఁ జెప్పుదురు రాజబంధువని నిర్ణయించుటకుఁ దగిన యాధారంబు లేకున్నను నీతఁడు రాజాస్థాన విద్వాంసుఁడగు బ్రాహ్మణుండనుటకుఁ గొంత యాధారంబు గాన్పించుచున్నది.

చ. అనఘు హుళక్కిభాస్కరు మహామతి పిల్లలమఱ్ఱి పెద్దిరా
జును చినవీరరాజుఁ గవిసోమునిఁ దిక్కనసోమయాజిఁ గే
తనకవి రంగనాథు నుచితజ్ఞుని నెఱ్ఱన నాచిరాజు సో
మన నమరేశ్వరుం దలఁతు మత్కులచంద్రుల సత్కవీంద్రులన్,

అని—ఆఱువేల నియోగియైన కోవెల గోపరాజు చెప్పిన పద్యమునుబట్టి రంగనాథుండు, నియోగి బ్రాహ్మణవంశ సంభవుండని తెలియవచ్చెడిని.

ఈ రంగనాథకవీంద్రుండు శ్రీమద్రామాయణంబున యుద్ధకాండాంతము షట్కాండంబులను ద్విపదకావ్యంబుగ నాంధ్రీకరించెను. అయినను గ్రంథమునందు నెచ్చటనైనను దాను రచించినట్లుగ లేక

పోవుట యటుండ, కాండంబుల యంతములందు—కోనబుద్ధరాజు, తాను రామాయణంబును ద్విపదకావ్యంబుగ రచియించి, తన తండ్రియయిన విఠ్ఠలరాజునకు నంకితమొసంగినట్లు చెప్పఁబడియున్నది—

"అనియాంధ్రభాష భాషాధీశనిభుఁడు"
వినుతకావ్యాగమ విమలమానసుఁడు
పాలితాచారుఁ డపార ధీ శరధి,
భూలోకనిధి కోన బుద్ధభూవిభుఁడు
తమతండ్రి విఠ్ఠల ధరణీశు పేరఁ.
గమనీయగుణధైర్య కనకాద్రిపేరఁ
బనిపూని యరిగండ భైరవుపేర,
ఘనుపేర మీసరగండని పేర
నాచంద్ర తారార్కమై యొప్ప మిగిలి,
భూచక్రమున నతి పూజ్యమై వెలయు
నసమానలలిత శబ్దార్థసంగతుల,
రసికమై చెలువొందు రామాయణంబు
పరగ నలంకార భావనల్నిండఁ
గరమర్థి.........కాండంబు సెప్పె.

ఇట్లు—బుద్ధరాజు, తన్నును దనకావ్యంబును బొగడుకొనినట్లుగా నుండెడు విధంబును బట్టి చూడఁగఁ బండితు లాత్మస్తుతి పరాయణులు గాఁజాలరు గనుక, గ్రంథమును మఱి యెవ్వరో యితరులు రచించిరనియే యూహింప వలసియున్నది.

ఇందలి కాండముల యంతమందలి వివరణమునుబట్టి, గ్రంథకర్త కోనబుద్ధరాజనియే యెన్నఁదగియున్నను— నీ గ్రంథంబునకు నాదికాలంబుగ "రంగనాథ రామాయణ" మనియే పేరు కలిగియుండుటచే బుద్ధరాజునొద్ద నాస్థానకవియగు నీరంగనాథకవీంద్రుండు దారిద్ర్యభూతంబునకుఁ దగులువడి, ధరపిశాచంబునకు లోనగుచు, నింతటి మహోత్కృష్ట గ్రంథరాజంబును దన యాశ్రయుండగు బుద్ధరాజుపేర విరచించి తదీయాజ్ఞానుసారంబుగ విఠ్ఠల ధరణీశుపేర నంకితము గావించి యుండవచ్చునని తోఁచుచున్నయది. అట్లుగాకున్న నీగ్రంథరాజంబునకు "రంగనాథ రామాయణ" మను నామంబుగలుగుటకుఁ గారణాంతరము కానంబడదు.

ఈ రంగనాథకవీంద్రుండు, తన గ్రంథప్రారంభమున నాంధ్ర కవివర్యుల నెవ్వరిని స్తుతింపక పోవుటచేత, నీతఁడు నన్నయభట్టారకుని కంటెను బూర్వుఁడని కొందఱు చెప్పుదురుగాని యందునకుఁ దగిన నిదర్శనము లేవియుఁ గానరావు. ఈతఁడు హూణశకము పండ్రెండవ శతాబ్దాంతమునందో, కొంతవఱకుఁ దఱువాతనో యుండినవాఁడని వీరేశలింగము పంతులవారు తమ యాంధ్రకవులచరిత్రమునందు వ్రాసియున్నారు. పదుమూఁడవశతాబ్దంబున నుండిన, భాస్కరరామాయణ గ్రంథకర్తయగు మంత్రి భాస్కరకవీంద్రుండును నీరంగనాథకవీంద్రుండును సమకాలికులనుట కొక గాథ కలదు—

హూణశకము పదుమూఁడవశతాబ్దంబున మనుపూరి సంస్థానంబును పాలించుచుండిన కోన బుద్ధరాజు తన యాస్థానకవీంద్రుఁడగు రంగనాథునిచేత శ్రీమద్రామాయణంబును ద్విపదకావ్యంబుగ వ్రాయించు చున్నట్లును, నాగ్రంథము హెచ్చుతక్కువగ ముప్పాతిక భాగమునకు ముగింపఁబడుచుండఁగ నాస్థానమంత్రియైన భాస్కరునకు నాసంగతి తెలిసి యతఁడు రాజుతోఁ దాను రామాయణంబును బద్యకావ్యమునుగ రచించి యంకిత మొనర్చునట్లుగఁ జెప్పినట్లును, "ముందుగా రచించి తెచ్చిన గ్రంథమునే కృతినందెద" నని రాజు చెప్పినట్లును, భాస్కరుం డా గ్రంథమును నతిశీఘ్రకాలంబున రచియింప నెంచి తన యాశ్రితుండును గవీంద్రుండు నైన హుళక్కిభాస్కరుని కెఱిఁగింపఁగ నాతం డారణ్యకాండమును మాత్రము రచింపక తక్కనభాగమును మాత్రము తెనిఁగించి తెచ్చుటగా నొప్పుకొనినట్లును, మహాభారతంబున నారణ్యపర్వంబును నాంధ్రీకరించిన నన్నయభట్టారకునకుఁ గలిగిన దురవస్థయే యారణ్యకాండమును రచించునెడలఁ దనకును గలుగవచ్చునని హుళక్కిభాస్కరుండు జడియుటచేత నాభాగంబును మాత్రము మంత్రిభాస్కరుండు స్వయముగ రచించినట్లును, నంతట హుళక్కిభాస్కరుఁడు తనపుత్రుఁడగు మల్లికార్జున భట్టుచేత బాల కిష్కింధా సుందరకాండములను, శిష్యుఁడయిన కుమార రుద్రదేవునిచేత నయోధ్యాకాండంబును, మిత్రుఁడయిన యయ్యలార్యునిచేతఁ దాను రచియింపఁ బూనిన యుద్ధకాండమునందలి యుత్తరభాగంబును జేయించి, తాను యుద్ధకాండ పూర్వభాగంబును రచించి మంత్రిభాస్కరునకు సమర్పించినట్లును, మంత్రిభాస్కరుండు తన యారణ్యకాండమును గూడఁ జేర్చి యా సంపూర్ణరామాయణ గ్రంథమును రాజసాన్నిధ్యమున సమర్పింపఁ

బోయినప్పుడే రంగనాథుఁడు సయిత్రము తన ద్విపదరామాయణంబును సంపూర్తిగావించి సమర్పింపఁ దెచ్చినట్లును, మహీపాలుం డాశ్రిత పక్షపాతంబున రంగనా విరచిత రామాయణ బును దక్షిణహస్తంబున గ్రహించి భాస్కర రామాయణంబును వామహస్తంబునఁ బుచ్చుకొనఁ బోఁగా భాస్కరుం డవమానితుఁడగుచు నావిధంబుగఁ దన్ను చులకన చేసినందులకై యాగ్రహమువహించి, తన యుత్తమకావ్యంబును నట్టి పక్షపాతియగు రాజునకు నంకితమొనర్చుటకంటెను గుజ్జుపువానికిఁ గృతి నొసంగుట మేలని పలుకుచుఁ గొలువు విడిచి పోవుచు డినట్లును, నచ్చటి యా మాట ...ంచుండిన యశ్వాధ్యక్షుఁడయిన సాహిణిమారుఁడు కవీంద్రునిసమీపించి నమస్కారపూర్వకంబుగ "స్వామీ! నేను గుజ్జుపు వాఁడను మీ రాడినమాటను జననాటక నాకుఁ గృతినొసంగుఁడు" అని ప్రార్థి ...క భాస్కరుండు తన రామాయణమున ... తనిని గృతిపతిని గఁ జేసినట్లును నొక కథగలదు ఈ చరిత్రాంశమునందలి సత్యాసత్యంబు ... సమాదరణీయంబులో యటుండ, దీనిచే రంగనాథ కవీంద్రుఁ ... శతాబ్దంబున నుండినవాఁడనియు రాజాస్థాన కవీంద్ర ... నాతని గ్రంథము రాజప్రీతి పాత్రంబనియు భావింపనగును ...

ఇఁకను రంగనాథుని కవిత్వముం గూర్చి యించుక విచారింతము. కథాప్రారంభమ్మున శ్రీ ...రామాయణమునందు "తపస్స్వాధ్యాయ నిరతం తపస్వీ వాగ్విదాంవరం, నారదం పరి పప్రచ్ఛ వాల్మీకి ర్మునిపుంగవమ్. కోన్వస్మిన్ సాంప్రతంలోకే గుణవాన్ కశ్చ వీర్యవాన్, ధర్మజ్ఞశ్చ కృతజ్ఞశ్చ సత్యవాక్యో దృఢ వ్రతః" (తాపసోత్తముఁడగు వాల్మీకిమునీంద్రుఁడు పరమార్థంబు నెఱుంగఁగోరి తపస్స్వాధ్యాయ నిరతుండును, వాగ్విదాంవరుండును నగు నారదమునీంద్రుని భక్తితోనడిగెను. "ఓ మునీంద్రా! (అస్మిన్ లోకే) ఈ లోకమునందు (సాంప్రతం) ఇప్పుడు గుణవంతుఁడెవఁడు? వీర్యవంతుఁడెవఁడు? ధర్మాధర్మవిదుండెవఁడు? కృతజ్ఞుడును సత్యవంతుండును దృఢవ్రతుండును నెవఁడు?)—అని చెప్పఁబడి యుండుటచేత, వాల్మీకులవారు స్వర్గలోక పాతాళలోక విషయంబులను గూర్చి యడుగక యీ భూలోకవిషయమును గూర్చియే యడిగెననియు, నందు ముఖ్యముగ భూత భవిష్యత్కాలంబుల వర్తనంబులను దెలియఁగోరక, ప్రస్తుతపు వర్తమానకాల వర్తంబునే తెలియఁగోరి ప్రశ్నించెననియుఁ దెలియుచున్నది. మఱియు, శ్రీరామచంద్రుండు

రావణాది రాక్షసులను బరిమార్చి సీతాసమేతుఁడగుచుఁ బట్టభద్రుఁడై ప్రజాపరిపాలనంబు గావించుచుండిన యా కాలమునందే, బ్రహ్మనుగ్రహంబుచేత నారదోపదిష్టుండై వాల్మీకిమునీంద్రుండు శ్రీమద్రామాయణంబును రచించెనని శ్రీమద్రామాయణమే బాహాటంబుగ నుద్ఘోషించుచున్నది. ఇట్లుండఁగా నీ రంగనాథరామాయణంబున— (పుట

ఘనతపస్స్వాధ్యాయ కమనీయశీలు, — పుట.
మునినాథు నారదముని లోకవంద్యు
ననఘతపోనిధి యైన వాల్మీకి, ండము 24 పుట.
కనుఁగొని యొకనాఁడు కరమర్థి నడిగె
ఎవ్వఁడు శ్రీమంతుఁ డెవ్వఁడు శాంతుఁ,... గాండము 63 పుట.
...ఎవ్వఁడు సుచరిత్రుఁ డెవ్వండు సముఁడు
ఎవ్వనికిన్ జ్ఞ నింద్రాదిసు లు, కాండము 55 పుట.
దవ్వుదవ్వులనుండి తలఁకుచుండుదురు
అట్టివాఁడిలఁబుట్టి యరిగెనో యిఁక — యుద్ధకాం 812.
పుట్టెనో యిటమీఁదఁ బుట్టనున్నాఁడొ
యనినఁ ద్రిలోకజ్ఞుఁ డైన నారదుఁ
తన బుద్ధి నెంతయుఁ దలపోసి చూచి

— యని వ్రాయుటలయందు "అట్టి సర్వకల్యాణగుణ ప్రపూర్ణుఁడు మున్నుండెనో? యిప్పుడున్నాఁడో? యిఁక [illegible]ఁబోవునో?"—యనెడు ప్రశ్నాభిప్రాయము వాల్మీకిమునీంద్రుని యభిప్రాయంబునకు భిన్నంబగుచున్నయది.

ఇక్కవీంద్రుండు, యథామూలముగ రామాయణము నాంధ్రీకరింపక కొన్నిచోట్లఁ బెంచియుఁ, గొన్నితావుల సంకుచితము చేసియుఁ, గొన్నిస్థలంబుల నమూలకంబులగు కథలను జేర్చియు వ్రాసియున్నాఁడు. మూలమున లేని "సులోచనా సహగమన" చారిత్రంబును "గాలనేమి" చరిత్రంబును నే యాధారంబుచే నిందుఁ జేర్పఁబడినవియో తెలిసినది కాదు. ఇట్టి మార్పులును గూర్పులును నెన్నేవియు నుండినను ముఖ్యములగు నంశములు మాత్రము విడువక యాంధ్రీకరింపఁ బడెననుటయం దెంతయు సందేహము గలుగఁ జాలదు.

రంగనాథ రామాయణము లాక్షణిక గ్రంథమని యే యప్పకవి మొదలగువారు పరిగ్రహించియున్నారు. అట్టి యీగ్రంథంబున నఁదం డును—యతిప్రాసభంగంబులు, రేఫశకటరేఫమైత్రులు, సంధిదోషం

బులు, విరుద్ధక్రియారూప ప్రయోగంబులు మొదలగు స్ఖాలిత్యములు గానంబడుచున్నవి. హెచ్చుతకువగ నేఁడువదల సంవత్సరములనాఁడు తాళపత్రంబులపై వ్రాయఁబడిన గ్రంథంబగుటచేత నాయాస్థలంబుల యందు నుత్పన్నంబు లగుచు వచ్చినభాగంబులను నప్పుడప్పుడును లేఖ పూరించుచు వచ్చుటచేతనో లేక కవీంద్రుని ప్రమాదంబుచేతనో ందుఁ గళంకముంబోలె నిక్కావ్యంబున నట్టిదోషంబు లేర్పడి ను అట్టిదోషంబులలోఁ గొన్నింటికి నుదాహరణంబులు—

ఐనఘుగంగాయము నలుగూడియునికి,
అయోధ్యాకాండము 112 పుట.

రియూవానరుఁ డున్నాఁడో లేఁడో.
రాకు వివరింపుమనిన— యుద్ధకాండము 330పుట.

సైంధ
అడు లు నంటంటిచూచి—అయోధ్యకాం 119 పుట.
మునుకొ వార్ధు ముంచి ముంచెత్తు—కిష్కింధాకాం 206 పుట.
మొలపెట్టవార్ధుల ముంచిముంచీడ్చి— యుద్ధకాం 330 పుట.

ఇత్వసంధి—
కరుణావతనియెడు కన్నికఁదొల్లి— కిష్కింధాకాం 119 పుట.
అనిచెప్పికరుణావ తమరేంద్రుపురికి—కిష్కింధాకాం 119 పుట.

కొనున శాదేశము—
బ్రహ్మాదులకునడ్డ పడరానియట్టి,
బ్రహ్మాస్త్రమవలీలఁ బట్టుక్రమించె— బాలకాండము 49 పుట.
అడవుల కేనును నర్థితోవత్తు,
దోడుకపొమ్మన్నఁ దూలి రాఘువుఁడు—అయోధ్యకాం 95 పుట.

అసాధుక్రియారూపంబులు—
వరతపోనియతిమై వర్షసహస్ర,
మరుగఁబారణసేతు ననియున్నచోట...బాలకాండము 56 పుట.
ఏతల్లికనిసేతు నేతల్లిఁగొలుతు— ఆరణ్యకాండము 177 పుట.
మనఁజేతునిప్పుడు మహిమీఁదననిన— యుద్ధకాం 335 పుట.

కుమతృటీకయందు నగాగమములేమి—

శరభంగమౌనియా శ్రమముకేతెంచె—అరణ్యకాం 143 పుట.

తనమదినూహించి ధరణీశుకనియె—యుద్ధకాండము 446 పుట.

అనవుడు వెఱగంది యాజాంబవంతు,

కనియెవిభీషణుం డతిసంభ్రమమున— యుద్ధకాం 424 పుట.

రేఫశకటరేఫ మైత్రి—

రెండుహస్తములెత్తి తెక్కలతోడి— బాలకాండము 24 పుట.

ధరణీశుఁడార్రాత్రి దప్పితోనంత.

మఱపొందియాయజ్ఞ మందిరమందు—బాలకాండము 63 పుట.

ధారాకరాళమై దనుజవర్గములఁ,

గాఱించినొంచి చీకాకుగావించి— అరణ్యకాండము 155 పుట.

మీఱితాపసులను మ్రింగెదవీవు,

వారు తాపసులను వడిఁబ్రోతురెపుడు— యుద్ధకాం 312 పుట.

మొఱపెట్టవార్ధుల ముంచిముంచీడ్చి,

కరుణించివిడువఁడే ఘనుఁడైనవాలి— యుద్ధకాం 330 పుట.

ఈగ్రంథమున దచ్చటచ్చట నింకను గానంబడుచున్న యిట్టి యలాక్షణికంబు లుత్పన్నంబులగు భాగంబుల సంస్కరించిన లేఖకుల ప్రమాదంబువలనఁ గలిగినవిగా భావించువాఁడను.

ఈరంగనాథకవీంద్రుని కవిత్వము, ద్రాక్షాపాకమై రసపూరితమై మృదుమధురపదగుంఫనంబై యర్థగాంభీర్యదాయకంబై యలంకారశోభితంబై చదువఁజదువ మనంబునకెంతయు నానంద సంధాయకంబై యుండును. అన్వయకాఠిన్యములేక సార్థకంబులగు నాంధ్రజాతీయంబులతో నొప్పారుచుండుననుట సర్వరసజ్ఞశేఖర సమాంగీకరణ మను టలో సందేహ మేమాత్రమును గలుగఁజాలదు. అట్టి రామణీయకంబులగు భాగంబులయందుఁ గొన్నింటి నిట నిరూపింతము—

ఆంధ్రపదగుంఫనము—

వ్రతములఁగడుడస్సి వనటులఁగ్రుస్సి,

యతిదుఃఖములఁగుంది యాత్మలోఁగంది

విపులాశ్రువులఁదోఁగి విరహాగ్నిఁగ్రాఁగి,

కపటవృత్తులఁజిక్కి కడుముట్టుసుక్కి

జీనంబుపై రోసి చెలువంబు బాసి
యావిధమదిమీఱి యలసతమీఱి
చెక్కుటఁ జెయిఁ జేర్చి చింతలకోర్చి,
దిక్కు లేమిఁ దలంచి ధృతిదూర డించి
యినరశ్మి వాడిన యెలదీఁగవోలె,
ఘనధూమయుతదీప కళికయుఁ బోలె

సుందరకాండము 287 పుట.

సాంస్కృతిక సమాసప్రయోగము—
బర్హిణవర్ణ నిబర్హణపవన,
గర్హణచణకాంతి ఘనవేగతురగ
సందోహసంభృత్య స్యందనోత్తమము—ఆరణ్యకాం 152 పుట.
మండితపరివేష మధ్యందినార్క,
మండలపరివేష మహితానుకారి
కుండలీకృతచండ కోదండదండ,
ఖండనాత్యుత్సాహ బాహువిపై వ్రేయ.

ఆరణ్యకాండము 154 పుట.

చండవాతాఘాత జాతడిండీర,
గండూషితాశావకాశనీకాశ
వీచీసమీచీన విహరమాణాది,
వైచిత్రకరవాల వరవాలములను.

కిష్కింధాకాండము 224 పుట.

నానార్థదాయక లలితపదప్రయోగము—
పుండరీకంబులఁ బోలుపారువారు,
పుండరీకాక్షులఁ బోలుపారువారు
పుండరీకచ్ఛాయఁ బోలుపారువారు,
పుండరీకోన్నతిఁ బోలుపారువారు.

యుద్ధకాండము 421 పుట.

రామణీయక ప్రయోగము—
కోమలమృదుల దుకూలంబులుండ.
నీ మైలచీర నీ వేల కట్టితివి
పసిడిశలాకతోఁ బ్రతిమైన మేనఁ,
బొసఁగ భూషణములఁ బూనవేమిటికిఁ

జలపట్టివెన్నెల చందమామ నుదుటఁ,
దలపట్టు వేయ నీ తలఁపెట్టు పుట్టె
నీలాలకంబుల నిగ్గులు దేర,
నేల పాపట దీర్చ విన్నాణ్ల రీతిఁ
గెమ్మోవి కినుమడి కెంపుసంధిల్లఁ,
గమ్మ తమ్మల మేలకై కోపు బాల
జిలుగువెన్నెలతేట చిఱునవ్వు మొలక,
మొలిపింప వేటికి ముఖచంద్రునందు.

అయోధ్యాకాండము 84 పుట.

శ్లేషార్థప్రయోగము—

ఆతతానంత భోగాస్పదంబగుచుఁ,
బాతాళమును బోలెఁ బరగినదాని
మహనీయశతకోటి మహిమ చేనింద్రు,
మహితాలయము వోలె మానైనదాని
నిఖిలంబునందును నెగడు తేజమున,
శిఖనివాసము వోలెఁ జెలువైన దాని
సమధికంబైన భీషణ వృత్తిగలిగి,
యముని వాసము వోలె నమరినదాని
వివిధ మేదోమాంస వితతిఁ గ్రవ్యాదు,
భవనాంగణము వోలె భాసిల్లుదాని
నిరుపమతర వారుణీయుక్తమగుచు,
వరుణాలయము వోచె వ్రాలినదానిఁ
దిరమైన యా సుగంధి స్పర్శనమున,
మరుదాలయము వోలె మానైనదాని
విలసిత నిధులచే వెలసి కుబేరు,
నెలవును బోలె వర్ణితమైనదాని
నురువిభూతికి నెల్ల నునికిపట్టగుచు,
హరు నివాసము వోలె నమరినదాని.

యుద్ధకాండము 381 పుట.

శయ్యావైచిత్ర్యము—

మాటమాత్రంబున మహియు నాకసము,
మీటను నాట నమ్మోటియే నేర్పుఁ

గార్చిచ్చునైనను గరువలినైన,
నార్చను గూర్చను నాతఁడే నేర్చు
భువనంబులన్నియు బూదిగావిరప,
నవి బోదిగావిరప నతఁడే నేర్చుఁ
బాల్పడి బ్రహ్మాండ భాండంబునైన,
నిల్పఁ బగల్ప నా నిపుణుండె నేర్చు.

అరణ్యకాండము 159 పుట.

పెట్టిన సొమ్ములు పెట్టెలోఁ బెట్టి,
దట్టమౌ కస్తూరి తలపట్టు పెట్టి
మలినవస్త్రముఁ గట్టి మదినల్కఁ దొట్టి,
చలము చేపట్టి భూస్థలిఁ బండె నంత.

అరణ్యకాండము 88 పుట.

చమత్కార సారస్యము—

ఘనమైనపరుష రాక్షసభాషణములు,
సనకాదియోగీంద్ర సన్నుతుల్ గావు
ఉరవడిఁ బరతెంచు నుగ్రదానవులు,
పరిచారకామర ప్రతతులుగావు
చలమున నార్చు రాక్షసభటోత్తములు,
వలిఁ బాడు తుంబురు నారదుల్ గారు
వ్రాలుచు నీమీఁద వచ్చు నా గాలి,
యాలవట్టంబుల యనిలంబుగాదు
యుద్ధరంగం బమృతోదధిగాదు,
యుద్ధంబుమటి కొలువుండుటగాదు.

యుద్ధకాండము 404 పుట.

శబ్దాలంకార గుంఫనము—

రాముని జితభృగురామునిఁ గాంతి,
సోముని సద్గుణస్తోముని కీర్తి
కాముని సౌందర్యకాముని కాంత,
ధాముని రవిసమధాముని బాసి.

అయోధ్యాకాండము 87 పుట.

కమనీయమృదుకర కమలయుగ్మములఁ,
గమలముల్ ద్రుంతురు కమలంగఁబట్టి

కమలాకరంబులఁ గమలాప్తకులుఁడు,
కమలారియనుబోలి కమలముల్ నొంచు.
యుద్ధకాండము 272 పుట.

జగతీతనూజాత జగదేకమాత,
నిగమసన్నుతపూత నిగమవిఖ్యాత
యమితగుణోపేత యైనయాసీత— యుద్ధకాం 312 పుట.

అర్థాలంకారవైభవము—

చనుదెంచి రామలక్ష్మణ పయోదముల,
గనుఁగొనిసురజాత కములుబ్బుపగిదిఁ
గనుఁగొనఁబర్వెడు ఘనపయోదముల,
గనుగొని దివిచాతకములుబ్బఁదొడఁగె
ధిమిధిమియనుచు మద్దెల్మ్రోయు పాట,
లమరసతీమణు లాడు చందమున
ఘుమఘుమమనుచు మేఘుఁడుఘుర్జింప,
నమితగేకాస్ఫూర్తి నాడెనెమిళ్లు
రాక్షసాంగములపై రాముబాణములు,
లక్షింపఁబడునిట్టి లాగునన్నట్లు
పర్వతాగ్రములపై భయద ఘోషములు,
పర్వి నిర్ఘాతముల్ వడియె నందంద
రావణుఁ జంపుచో రఘురాము మీఁద,
దేవతలటఁ జూచి దివ్యపుష్పముల
నెడనెడవర్షింతు రీక్రియ ననిన,
వడువున మహిరాలె వర్షోపలములు.
కిష్కింధాకాండము 209 పుట.

వర్షాకాలవర్ణనము—

రావణురాజ్యంబు రఘురాము చేత,
నీవిధి చలియించు నింకనన్నగిది
నొలసి యొండొండ విద్యున్నికాయములు,
జలదంబులందుండి చలియింపఁదొడఁగెఁ
గైకొనియింక నిక్ష్వాకువల్లభుఁడు,
నాకారిపైదండు నడచుచున్నాఁడు

అని సురలకుఁ జెప్ప నరిగెనో ధాత్రి,
యనవాయువులతోడ నటధూళి యెగసె
నమరులురామున కై దండునెడలఁ,
గొమరారి భేరులు ఘోషించుపగిది
నున్నతధ్వనులతో నొండొండఁ బర్వి,
మిన్నెల్ల భేదిల్ల మేఘుంబు లఱిమె
నలరు ప్రావృట్కాల మనుపురుషుండు,
లలిమీఱ నాకాశ లక్ష్మితోఁగదియు
నాగినరుల్ దెగిరాలు చున్నముత్యముల,
పగిదిఁ దొల్చినుకులు బడియె నందంద.

కిష్కింధాకాండము 209 పుట.

చంద్రోదయవర్ణనము—

కృతకృత్యుఁడగురాము కీర్తిపుష్పములు,
చతురతమై విదచల్లినయట్లు
కరమొప్పఁజుక్కలు గాన్పించెనంతఁ,
జిరకాలములసీమ శిశువులమామ
పాలుపొందుకలువల పోరానివిఁదు,
కలసిన జక్కవ కవఁబాపు మందు
పాలవెల్లిని ద్రచ్చి పడసిన వెన్న,
శూలి యకాఁదలపువ్వు చుక్కలనవ్వు
నెఱిచకోరకముల నెలవెలపంట,
యురవేది విరహుల నుడికించు మంట
గగనంబుతోడవు దొంగలగుండెదిగులు,
నాగినబ్ధిఁబొంగించు నూఱటపట్టి
హరిహరబ్రహ్మల యానందదృష్టి,
సరసిజరిపుఁడైన చంద్రుండు వొడిచె.

యుద్ధకాండము 301 పుట.

ఇట్టి వర్ణనాతిరేకంబు లీ గ్రంథంబున నందందు నెన్నేనియుఁ జూడఁగట్టుచుండును. ఇట్టి సర్వోత్తమ పవిత్రగ్రంథరాజంబును రసాలంకారభావనాదిక వైభవోపేతంబుగ రచియించిన రంగనాథకవీంద్రుండు తనవిషయమై గ్రంథంబున నెచ్చటను జెప్పుకొనక. తనదివ్యనామంబు

నెంతవఱకు నాచ్ఛాదించుకొనినను, నిమ్మహాకవీంద్రునకు లోకవిఖ్యాతం బగు కీర్తి యాచంద్ర తారార్కంబుగ వచ్చియే తీఱినందులకు నెంతయు సంతోషింపవలయును, భగవదనుగ్రహ హేతుకంబును బరమపావనంబును సకల పురుషార్థప్రదంబును గలికల్మష విధ్వంసన చణంబును నగు నేతద్రామాయణామృతంబును నాస్వాదించి యాంధ్రదేశీయులయిన యాస్తికసోదర మహాశయులెల్లరుఁ బరమానందవార్ధి నోలలాడుచు శ్రీసీతాలక్ష్మణ భరత శత్రుఘ్న హనూమత్సమేత శ్రీరామచంద్రమూర్తుల పరమకారుణ్యంబునకుఁ బాత్రులై విలసిల్లుదురు గాక!

చెన్నపట్టణము, } విద్వజ్జన విధేయుఁడు,
24-5-27. } బొగ్గర - ఆదినారాయణార్యుఁడు.
ప్రధానాంధ్రపండితుఁడు—ముత్యాలపేట హైస్కూలు

---

# హెచ్చరిక

—:*:—

ఇందువలన తెలియజేయుడము యేమనగా పమ్మి త్యాగరాయ శ్రేష్టిగారి మనుమడు పమ్మి మన్మథసుందరం వారిచే శ్రీరంగనాథ రామాయణము ద్విపదకావ్యము అను గ్రంథము యొక్క కాపీరైటు సర్వహక్కులను పొందియున్నాము. ఈ గ్రంథము వలయువారు యీ క్రింది చిరునామాకు వ్రాసి తెప్పించుకోగలరు.

ఇట్లు

సి. జి. మురుగేశ మొదలియార్

ప్రొప్రైటర్—సి. వి. కృష్ణా బుక్ డిపో,

తపాలుపెట్టె నెం, 1805 మదరాసు-1

*

శ్రీ ర స్తు

# శ్రీరంగనాథ రామాయణమునందుగల కథాసూచిక

—:*:—

శ్రీరంగనాథ రామాయణమునందుగల కథాసూచిక సమాప్తము.

శ్రీరస్తు
శ్రీహయగ్రీవాయనమః
—( * )—
శ్రీ సీతా లక్ష్మణ భరత శత్రుఘ్న హనుమత్సమేత
శ్రీరామచంద్ర పరబ్రహ్మణేనమః



# శ్రీ రంగనాథ రామాయణము

## బాలకాండము

—( ం )—

శ్లో. చరితం రఘునాథస్య శతకోటి ప్రవిస్తరమ్,
ఏకైకమక్షరం ప్రోక్తం మహాపాతక నాశనమ్,
రామాయ రామభద్రాయ రామచన్ద్రాయ వేధసే,
రఘునాథాయ నాథాయ సీతాయాః పతయేనమః.

శ్రీకామినీనాథు జితదైత్యనాథు ♦ లోకరక్షణ కృత్యులోకైకనిత్యు
నిత్య సదానందు నిర్వాణకృత్యు ♦ గృత్యాదిదూరున కృత్రిమాధారు
నాధారకమల మధ్యామోదభేద ♦ సాధనక్రమ సమాచరణషట్చరణ
సింధురవరదు నాశ్రితలోకబంధు ♦ బంధమోచను బలిబంధనోదగ్రు
నారూఢపంచ దశాక్షరప్రసవ ♦ పరిజాతాకారుఁ బ్రణవానుకారు
నగ్రామగోపికా భ్యంతరవ్యగ్రు ♦ నగ్రసదాకారు నాకారరహితు
యోగిమానసల సదోంకారదీప్తు ♦ యోగసందర్శితా భ్యుదయప్రచారు
శ్రుతిశిరోభాగ విశుద్ధచైతన్య ♦ నతిలోకుసర్వ లోకాశ్రయశ్లోకు
నఖిలాండమౌక్తిక యుతనిత్యసూత్రు ♦ నఖిలతత్త్వాతీతునాద్యంతరహితు
నమలాత్మునక్షరు నామ్నాయకమల ♦ కమలాప్తునక్షీణ కల్యాణసదను
శంకావినిర్ముక్త సద్భక్తవర్య ♦ కైంకర్యవత్సలుఁ గారుణ్యసింధు
బోధకుండై వచ్చి బోధ్యమైతోఁచి ♦ బోధమైవీక్షించు పూర్ణస్వరూపు
నాదితత్త్వముతత్త్వ మస్యాదివాక్య ♦ భేదాతిదూరున భేద్యస్వరూపుఁ

గడుకొనినియతులై కర్మబంధములు ♦ గడచి యేకతమునఁ గదలక నిలిచి
పరిమితాసనములఁ బదిలులై యుండి ♦ యరుదుగా నింద్రియవ్యాప్తులు మఱచి
వెలయ డెబ్బదిరెండు వేలనాడులను ♦ గలయ వివేకించి కసటువోఁ దుడిచి
కవరెండ త్రోవలు గైకొని మెలఁగు ♦ పవను నిరోధించి పశ్చిమవీధి
జొనిపి కోణత్రయ శుద్ధిగావించి ♦ మనసుతోడ నెకూడ మఱిపించి దెచ్చి
కుండలినిజశక్తిఁ గూర్చి సంప్రీతి ♦ నొండొండఁ గమలంబులొగి నాఱు గడచి
యటఁ జంద్రమండలం బల్లనఁ జేర్చి ♦ యట పరమవ్యోమమై తన్ను మఱచు
పరమయోగీంద్రుల భావమ్ముకేలి ♦ పరికింపరానైన బ్రహ్మస్వరూప
ముగి రెంటఁ బెరయక మాటఁ నేర్పడక ♦ తగిలి నాల్గవత్రోవ తత్త్వమై యుండి
యైదింటికాదియై యాఱింటిఁ గడచి ♦ యేదికి నాదియై యమరిన శివుఁ
డనుతర నిర్మలాంతర్నాడియూప ♦ మనురూపమగు మనంబాబద్ధపశువు
నిష్ఠాభిరతి వేది సిఖిలేంద్రియములు ♦ కాష్ఠములొబ్బధ మఖండపావకుఁడు
యోగామృతము ఘృతముజ్జ్వలానంద ♦
యోగంబు ఫలముగా నొగి జెల్లుచున్న
యభిమతాంతర్యజనానూనకర్మ ♦ విభవంబు కడపట విలసిల్లు పరముఁ
బరమేశు సవ్యయుఁ బరమకల్యాణుఁ ♦ బరమాత్ము నపరోక్షుఁ బ్రక్షీణకర్ము
మాదేవుఁ గమలాక్షు మమ్మేలు దేవు ♦ నాదినారాయణు నఖిలలోకేశు
భావించి కీర్తించి ప్రార్థించి మ్రొక్కి ♦ సేవించి యభిమతసిద్ధిగా విప
హారకర్పూర నీహారగోక్షీర ♦ తారకాకృతి శారదాదేవిఁ గొలిచి
చారురామాయణ చంద్రాబ్ధియగుచు ♦ వారక విలసిల్లు వాల్మీకిఁ దలఁచి
భారతమంజరీ పారిజాతంబు ♦ సారమానసుఁ బరాశరసూనుఁ దలచి
యతని తనూభవుఁ నాశుకబ్రహ్మ ♦ నతిభక్తియుక్తమై యభినుతిచేసి
యేకథఁ జెప్పిన నెల్లసజ్జనులు ♦ సేకొని కీర్తులు చేయుచునుందు
రేకథఁ జెప్పిన నిహపరోన్నతులు ♦ ప్రాకటంబుగఁ జేర్చి ఫలియించుఁ బ్రీతి
నేకథఁ జెప్పిన నీప్సితార్థములు ♦ గైకొని పుణ్యముల్ గడఁగి కాన్పించు
ననువిచారములు నాయంతరంగమునఁ ♦ గొనకొని కృతిసేయఁ గోరుచున్నం
శ్రీరమణీయులై సృష్టిమత్తములు ♦ గోరి వర్ణనసేయఁ గోనవంశమునతి
ఫలితసదాచారభానుఁడై తోఁచి ♦ కలికాలదోషాంధకారంబు దోలి
గురుబుధపదముల కొలఁదులు దెలిసి ♦ పరనృపసత్త్ర పఙ్క్తుల నణఁచి
నిత్యపుణ్యోదయ నియతిఁ బెంపొందు ♦ సత్యోన్నతప్రతాపాభిరాముఁ డకుఁ
గరదీప్తనిజఖడ్గ గంగాంబుధారఁ ♦ బరధరణీపాల ఫాలాక్షరముల
గలపూర్వగర్వపంకములొప్పఁ గడుగు ♦ నలవుమైనసమానుఁడగు సత్యసిధకి

శరణార్థి రాజన్యషట్పదాధార ♦ కరపద్మునకుఁ గోనకాటభూపతికి ప్రొందు
నయనయోదయదయాయతనిత్యమతికిఁ ♦ బ్రియతనూజన్ముఁడై పృథివిఁ బెం
రుద్రప్రతాపుండు రుద్రనిర్మలుఁడు ♦ రుద్రాత్ముఁడగుకోన రుద్రనరేంద్రు
పౌత్రుఁడభంగుఁడ ప్రతిమవిక్రముఁడు ♦ గోత్రధీరుఁడు కులగోత్రవర్ధనుఁడు
దివిజేంద్రవిభవుండు ధీరవర్తనుఁడు ♦ భువనవిఖ్యాతుఁడు బుద్ధభూపాలు
తనుజన్ముఁడక్షీణ దాక్షిణ్యధనుఁడు ♦ ధనధాన్యధనదుండు ధర్మధర్మజుఁడు
అతిపుణ్యసౌజన్యుఁ డరిభీమజన్యుఁ ♦ డతిశౌరశరజన్ముఁ డాజన్మసుఖుఁడు
కామినీకాముఁ డఖండవిక్రముఁడు ♦ రామత్రయోదారరణవిశారదుఁడు
చందనమందార చంద్రికాహార ♦ కందళత్కుందేందు ఘనకీర్తిధనుఁడు
పరఁగ కోనాన్వయ పారిజాతమునఁ ♦ పరిపక్వఫలభాతి బరగినవాఁడు
పాలుచు కోనాన్వయ పూర్వాద్రియందు ♦

వెలుగు భానుఁడువోలె విలసిల్లువాఁడు

దొరకి కోనాన్వయ దుగ్ధాంబురాశిఁ ♦ బరిపూర్ణచంద్రుఁడై భాసిల్లువాఁడు
నిక్కమంతంతకు నిర్మలంబగుచు ♦ దిక్కులఁ దనపేర్మి దీపించువాఁడు
దానధర్మక్రియా తాత్పర్యకేళిఁ ♦ దానవైవినుతులఁ ధనరారువాఁడుఁ
మగటిమినసమాన మహిమదీపింప ♦ బగతుర నవలీల భంజించువాఁడు
బలవదుగ్రారాతిబలసముద్రములఁ ♦ గలఁచు మందాద్రిగతి బేర్చువాఁడు
విమతోగ్రరాజన్య విపులాంధకార ♦ కమలాప్తబింబ ఖడ్గప్రభావిభవ
విలసితామరవధూవిమలాస్యకమల ♦ మూలవీరమధుకరంబులఁ గూర్చువాఁడు
అరినృపప్రాణానిలాహారభుజగ ♦ వరభుజాస్థాపితావనిగలవాఁడు
కురుకేరళావంతి కుంతలద్రవిళ ♦ నరనాథసభల వర్ణన నెక్కువాఁడు
ఆతతసామభేదాదులనొప్పు ♦ నీతిక్రమంబుల నెరసినవాఁడు
రమణమై నాదిమరాజన్యరీతి ♦ నమితవైభవముల నమరినవాఁడు
వినయనయోపాయ విజయసుస్థిరుఁడు ♦ మనుమూర్తికీర్తిలక్ష్మాపాలవరుఁడు
రాజసర్వజ్ఞుండు రాజసింహుండు ♦ రాజశిరోమణి రాజపూజితుఁడు
సకలజగద్ధితచాతుర్యధుర్యుఁ ♦ డొకనాఁడు కొలువున నున్న [illegible]లు
బహుపురాణజ్ఞులు బహుశాస్త్రవిదులు ♦ బహుకావ్యనాటకప్రౌఢమానసు
హితులు మంత్రులు పురోహితులు నాశ్రితులు ♦

సుతులు రాజులు బహుశ్రుతులును గొల్వ

దీపించి భూలోక దేవేంద్రు పగిది ♦ నేపారియున్నచో నింపుసొంపొంద
రసికులు భారత రామాయణాది ♦ రసగోష్ఠిఁ జెల్లింప రసికశేఖరుఁడు
రామకథాసుధా రసరక్తుఁడగుచు ♦ నామహాసభలోన నందఱఁ జూచి

రమణమైతెనుగున రామాయణంబు ♦ క్రమమొప్పఁజెప్పెడిఘనకావ్యశక్తి
గలకవులెవ్వారు గలరుర్వి ననుచుఁ ♦ దలఁపోయవిఠ్ఠల ధరణిపాలునకు
నున్నతమూర్తికి నారయశోనిధికి ♦ విన్నవించిరి వేడ్క విబుధులుగడఁగి
నీతనూజన్ముఁడు నిపుణమానసుఁడు ♦ ధూతకల్మషుఁడు బంధురనీతియుతుఁడు
సర్వజ్ఞుడనఘుండు చతురవర్తనుఁడు ♦ సర్వపురాణ విచారతత్పరుఁడు [దు
కమనీయబహుకళాగమవిచక్షణుఁడు సుమనీషిపోషణోత్సుకసుఖోన్నతు
కవిసార్వభౌముఁడు కవికల్పతరువు ♦ కవిలోకభోజుండు కవిపురందరుఁడు
ప్రత్యర్థిరాజన్య బలవజ్రపాణి ♦ ప్రత్యర్థి నృపదావ పావకోజ్జ్వలుడు
భీకరకరఖడ్గ బింబితస్వర్గ ♦ లోకానురక్త త్రిలోకదుర్గముఁడు
వరసాధుజలజాత వనజాతహితుఁడు ♦ పురుషచింతామణి బుద్ధభూవిభుడు
నీకతిభక్తుండు నిఖిలశబ్దార్థ ♦ పాకజ్ఞుడత్యంత పాండిత్యధనుడు
మఱియు రామాయణ మర్మధర్మజ్ఞ ♦ డెఱుగునాతనిబిల్చి మీకథ జెప్ప
ననినమజ్జనకుడుదాత్తవర్తనుడు ♦ ననుసర్థిబిలిపించి ననుగారవించి
భూమిగవీంద్రులు బుధులును మెచ్చ ♦ రామాయణంబుపురాణమార్గంబు
తప్పకనాపేర దగగ్రంథబాధ ♦ జెప్పిప్రఖ్యాతంబు సేయింపుమర్వి
ననియానతిచ్చిన నమ్మృదూక్తులకు ♦ ననయంబు హర్షించి యట్లకావింప
బనిపూనియరిగండ భైరవుపేర ♦ ఘనుపేర మీసరగండాంకుపేర
లలితసద్గుణగణాలంకారుపేర ♦ నలఘునిశ్చలదయా యతబుద్ధిపేర
నాతతికృతిపేర నతిపుణ్యుపేర ♦ మాతండ్రివిఠ్ఠ లక్ష్మానాదుపేర
రాజులుబుధులును రసికులుసుకవి ♦ రాజులుగోష్ఠిని రాగిల్లిపొగడ
బదములర్థంబులు భావముల్గతులు ♦ పదశయ్యలర్థ సౌభాగ్యముల్యతులు
రసములకల్పనల్ప్రాససంగతులు ♦ ననమాసరీతుల నన్నియుగలుగ
నాదికవీశ్వరుడైన వాల్మీకి ♦ యాదరంబున బుణ్యులందరుమెచ్చ
జెప్పిన తెలుగున శ్రీరామచరిత ♦ మొప్పజెప్పిద గథాభ్యుదయమెట్లనిన

## కథా ప్రారంభము

ఘనతపస్స్వాధ్యాయ కమనీయశీలు ♦ మునినాథునారద మునిలోకవంద్యు
ననఘతపోనిధి యైనవాల్మీకి ♦ కనుఁగొని యొకనాఁ కరమర్థినడిగె
ఎవ్వడు శ్రీమంతు డెవ్వడు శాంతు ♦ డెవ్వడుఘనపుణ్యు డెవ్వడున్నతుడు
ఎవ్వడు నీతిజ్ఞు డెవ్వడు ప్రాజ్ఞు ♦ డెవ్వడు దుర్గముం డెవ్వడుత్తముడు
ఎవ్వడు జితకాము డెవ్వడజేయు ♦ డెవ్వడునిరసూయు డెవ్వడాఢ్యుఁడు
ఎవ్వడు సువ్రతుం డెవ్వడుదారు ♦ డెవ్వడుసుచరిత్రుఁ డెవ్వండుసముడు
ఎవ్వని కిన్కకు నింద్రాదిసురలు ♦ దవ్వుదవ్వులనుండి తలఁకుచుండుదురు

అట్టివాఁడిలఁ బుట్టి యరిగెనో యిప్పు ♦ పుట్టెనో యిటమీఁదఁ బుట్టనున్నాఁడో
యనినఁ ద్రిలోకజ్ఞుఁడై నారదుఁడు ♦ దనబుద్ధి నెంతయుఁ దలపోసి చూచి
యీ మహిఁ శ్రీవిష్ణుఁ డిపుడు జన్మించె ♦ రాముఁడై దశరథరాజునకతఁడు
నియతాత్ముఁ డతిశౌర్యనిధి కృపాజలధి జయశాలి స్వజనరక్షణవిచక్షణుఁడు
కంబుకంధరుఁడు చక్కని మేనివాఁడు ♦ బిబ్బారుణోష్ఠుండు పీనవక్షుండు
వెడదకన్నులవాఁడు విపులాంసతలుఁడు నిడుదచేతులవాఁడు నియతవర్తనుఁడు
వేదవేదాంగకోవిదుఁడు కోదండ ♦ వేదవిదుండు వివేకభూషణుఁడు
కమలాప్తతేజంబు కడలిగాంభీర్య ♦ మమరాద్రిధైర్యంబు నవని సైరణయు
ధనదుని త్యాగంబు దనయందు మిగుల ♦ ననువొందు నిత్యకల్యాణవిగ్రహుఁడు
కౌసల్యకానందకరుఁ డట్టి రాముఁ ♦ నాసక్తి యౌవరాజ్యాభిషిక్తునిఁ గాఁ
బట్టంబు గట్ట భూపతి సమకట్టఁ ♦ గట్టిడి కైక సంగరముఁ దొల్లి
రెండువరంబు లర్థించిన దాటఁ ♦ జండించి కానన స్థలికి రాఘవునిఁ
బనిచిన జనకుని ప్రతినకై పూని ♦ జనకజాలక్ష్మణ సహితుడై వెడలి
దేవనంబునను నెంతే వనంబునను ♦ బావనముని చర్యఁ బరగు సంయముల
గరుణమైఁ గాపాడి ఖరదూషణాది ♦ శిరములు శరములఁ జెండు జెండాడి
ఋష్యమూకంబున నినజుఁ జేపట్టి ♦ వశ్యత నొక కోల వాలి దూలించి
సీతకై చలపట్టి సేతువుగట్టి ♦ పాతకదశకంఠు పదితలల్ గొట్టి
సీతతోఁ గూడి యాశ్రితలోకపారి ♦ జాతంబు వనచరజాతంబు గొలువ
నింద్రాదివినుతుఁడై యేతెంచి రామ ♦ చంద్రుఁడు నిజపూజ్య సామ్రాజ్యలక్ష్మి
బాలించుచున్నాఁడు ప్రజలకు వేడ్క ♦ గీలించుచును గృతకృత్యుఁడై యనుచు
నారామచరిత మాద్యంతంబు చెప్పి ♦ నారదముని పోయె నలినజుపురికి
మునిపతి వాల్మీకి మూఁద మొప్పవంతఁ ♦ దనశిష్యుఁడగు భరద్వాజుండుఁ దాను
ప్రకటింపసజ్జన భావంబుపోలె ♦ నకలుషజీవనంబై కరంబలరు
తమసా నదికిఁ బోయి తన్నలివారిఁ ♦ దమయనుష్ఠానము ల్దగఁ జేయుచుండి
యా యేటి దరిఁ గ్రౌంచయుమళంబు ప్రేమఁ ♦

గాయజకేళిమైఁ గవయుచో నొకటి

నొకబోయ చంపిన నున్నయా క్రౌంచి ♦ ప్రకటశోకంబునఁ బలవింప జూచి
దగవుకు ధర్మంబు తలపోసి మౌని ♦ వగదాయునబ్బోయ పైనల్కవొడమి
యోరి నిషాదుండ యోరి పాపాత్మ ♦ యోరి నీకేగేమి యొనరించితోని
కామిఁ జిక్రౌంచము ల్గవయుచో నొకటి ♦ నేమిటికై చంపి తిబ్బంగి గదిసి
యీపాతకమున ననేక దుఃఖములు ♦ ప్రాపించి తిరుగుము బహువత్సరములు
అని బోయ శపియించి యంత వాల్మీకి ♦ దనశిష్యుడగు భరద్వాజునిం జూచి

ఛందోనిబద్ధమైసమవర్ణపఙ్క్తి ♦ బొందినాలుగుపదంబులహృద్యమగుచు
నిడిచాలనిస్మయ మీశాపవాక్య ♦ పదములుదమయంత బద్యమైనిలిచె
ననినభరద్వాజ డాదిగాశిష్యు ♦ లనురక్తిఁజతియించి రాపద్యమంత
ననఘుడావాల్మీకి యాశ్రమంబునకుఁ ♦
జనియున్నచోఁ బ్రహ్మ చనుదెంచుటయును
నెమ్మిఁగేగిపదముల కెరఁగితో డ్తెచ్చి ♦ కుదురుగాగుశపీఠిఁ గూర్చుండఁజేసి
కరమర్థిఁబూజించి కరములుమొగిచి ♦ పరగశాపాక్షర పద్యంబుఁజదువ
విని బ్రహ్మనగిపద్య విషయమైవాణి ♦ యనఘునీముఖమున ననతరించినది
శ్రీరాముచరిత మశేషంబుఁనీకుఁ ♦ గోరినారదుఁడు సకోసించిచెప్పె
నదివిస్తరించి నీ నఖిలంబు చెప్పు ♦ నదిసర్వమునుదోచు నని చెప్పిపోయె
నీరీతిగృపవరం బిచ్చియున్నించి ♦ పారసగర్భుండు సనినపిమ్మటను
మతినిర్మలధ్యాన మతిబూనిమౌని ♦ తతిగానిసకలంబు దలపోసిచూచి
రఘుచరిత్రము దశరథుచరిత్రంబు ♦ రఘురాముజన్మంబు రామువర్తనము
తాటకవధయును దండరాక్షసుల ♦ యాటోపహరణంబు యజ్ఞరక్షణము
దనరుగంగామహత్త్వంబు గౌతముని ♦ వనితను శాపంబువలనఁ బాచుటయు
ధనువు ద్రుంచుటయు సీతావివాహంబు ♦
చనుచోటజమదగ్ని జాతునాగ్రహము
రామాభిషేక సంరంభంబుదుష్ట ♦ కామిని కైకేయి కష్టభాషణము
నభిషేకవిఘ్నంబు నడవికిరామ ♦ విభుఁడుపోవుటయు భూవిభునిశోకంబు
దశరథుమరణంబుదశరథ రాము ♦ గుశలసంభాషియైగుహుఁడుగాంచుటయు
నురుపుణ్యులటగంగ యుత్తరించుటయు ♦
వరతపోనిధి భరద్వాజుఁగాంచుటయు [టయు
నరిగియాచిత్రకూటాద్రి యెక్కుటయు ♦ భరతుండురఘురామపజ్జవచ్చు
నన్న చేఁబాదుక లర్థిమైబడసి ♦ మన్ననలింపార మగుడివచ్చుటయు
దండకాగమనంబు తగిలివిరాధుఁ ♦ జండవిక్రమునందుసంహరించుటయుఁ
బరమపుణ్యునిశరభంగుఁ గాంచుటయుఁ ♦
బరువడిమునులతోఁ బ్రతినలాడుటయు [వడయుటయు
చనియయ్యగస్త్యు నాశ్రమముచొచ్చుటయు ♦ మునిచేతదివ్యాస్త్రములు
స్రుక్కకరామానుజుండు శూర్పణఖ ♦
ముక్కును జెవులును మ్రోడుసేయుటయు
నదిపోయిఖరదూషణాదిరక్కసుల ♦ కొదవచెప్పినవారునొడువవచ్చుటయు
నురువడిరఘురాముఁడొక్కఁడేకడగి ♦ ఖరదూషణాదులఖండించుటయును

నటరావణునిబుద్ధినలుకవుట్టుటయు ♦ గుటిలమారీచుండు క్రొవ్విచచ్చుటయు
నసురాధిపతిసీతనపహరించుటయు ♦ విసువక రాముఁడు విలపించుటయును
ననిజటాయువుచావునవలఁగబన్ధు ♦ గనుటయుమతిపంపకడకుఁబోవుటయు
గరమర్థిఋష్యమూకమునసుగ్రీవు ♦ డరుదెంచికనుటయునతనిసఖ్యంబు
వాలిసుగ్రీవులవైరంబుతెఱఁగు ♦ వాలినొక్కమ్మున వధియించుటయును
తారావిలాపంబు దశరథసూను ♦ డారవిసూనురాజ్యమున నిల్పుటయు
మానపతియంత మాల్యవంతమున ♦ వానకాలంబెల్లవసియించుటయును
గాకుత్స్థుకోపంబుకపిసమాగమము ♦ నేకతంబునముద్రకిచ్చిపుచ్చుటయు
నలయక కపులు సీతాన్వేషణంబు సలుపుటయునుబిల సందర్శనంబు [ము
నాతుణంబునమహేంద్రాద్రియెక్కుటయు ♦ బక్షీంద్రుఁడైనసంపాతిదర్శన
వనధిలంఘనమును వనధిమధ్యమున ♦ జనుచోటమైనాక సందర్శనంబు
మదమెత్తిసింహిక మారుతసూను ♦ గదిసిచచ్చుటయులంకాప్రవేశంబు
నంతఃపురంబున కరిగిచూచుటయు ♦ నంతనశోకవనావలోకనము
దెఱఁగొప్పనందువైదేహిఁగాంచుటయు ♦ నెరుకకునానవాలిచ్చిదేర్చుటయు
బెనఁచియావనమెల్లబెఱికివైచుటయు ♦ హనుమంతుడత్తటినక్షుజంపుటయు
బవనజుడటబట్టువడిపోవుటయును గపిసింహుఁడాపురిగలయఁగాల్చుటయు [యు
మానినీమణిశిరోమణియిచ్చుటయును ♦ వానితాత్తుండబ్ధిమరలదాటుట
మధువనహరణంబుమణిప్రీతినిచ్చి ♦ యధిపతిమారుతియాశ్వసించుటయు
నినకులాధిపుఁడుదండెత్తిపోవుటయు ♦ వనధితీరంబునవచ్చినిల్పుటయు [ను
వనరాశిత్రోవయివ్వకక్రొవ్వుటయును ♦ గోసకొనిరాముఁడుగోపించుటయు
నంతవిభీషణుఁ డధిపుఁగాంచుటయు ♦ జింతించుటయుమరి సేతుబంధనము
జలధిదాటుటయునుజనిలంకమీఁద ♦ విడిసిపేర్చుటయుదోర్వీర్యంబుమెరసి
కరముగ్రులగుకుంభకర్ణాదివీర ♦ వరులఁద్రుంచుటయురావణునిజంపుటయు
నావిభీషణుని లంకాధినాయకుని ♦ గావించిపట్టంబు కరుణఁగట్టుటయు
ననుపమశుద్ధిబ్రహ్మాదులుమెచ్చ ♦ జనకజరఘురామ చంద్రుఁబొందుటయు
నెలమిపుష్పకమెక్కియె దునుగీర్తు ♦ లలరనయోధ్యకునరుగుదెంచుటయు
భరతుఁగాంచుటయును బట్టాభిషేక ♦ మరుదుగా రఘురాముఁ డవధరించుట
గపిదైత్యవరులనర్కజవిభీషణుల ♦ విపులసంపదలిచ్చివీడుకొల్పుటయు [యు
బరికించిప్రజల కాపదలొందకుండ ♦ గరుణఁబ్రోచుటయును గతలెల్ల దెలిసి
వెలయనిర్వదినాల్గువేల శ్లోకములు ♦ గలిగియేనూరు సర్గలవిస్తరిల్లి
కాండంబులారింటికరమొప్పమిగిలి ♦ యుండరామాయణమొప్పఁగావించి
యొనరదక్కనకథ లుత్తరకాండ ♦ మునజెప్పివాల్మీకిమునినాథుఁడంత

ఈకథ పఠియింప నెవ్వరునేర్తు ♦ రీకథ జగముల కెబ్బంగి వెలయు
ననుచుండ కుశలవులనఘమానసులు ♦ మనసిజాకారులు మంజుభాషణులు
జననుతుల్ సంగీతసాహిత్యపరులు ♦ మునివేషధారులిమ్ములఁ జిత్రమొక్క
యనఘ రామాయణాబ్ధిఁ జదువుచును దెంచితిమి మమ్ము చదివింపవలయు
ననిన సంతోషించి యమ్మునీశ్వరుఁడు ♦ తనమనోరథమెల్ల తలకూడెననుచు
గేయమై పాఠ్యమై కేవలపుణ్య ♦ దాయకం బగు రఘూత్తము చరిత్రంబు
ననుపమతంత్రీలయాన్వితఫణితి ♦ మునిపతి చదివింప ముద మొప్ప చదివి
రమణ శృంగారాది రసము లేర్పడఁగ ♦ సమవృత్తిభేదముల్ సంధిసమాస
సమధికశబ్దార్థ సంగతు లెరిగి ♦ క్రమ మొప్పఁ బాడుచు గవగూడి వారు
మునిజనసభ నిమ్ముల పూజనముల ♦ గొని వినోదింప కాకుత్స్థవల్లభుఁడు
వెలయ దమ్ములు దాను వేడ్కలింపొంద ♦ కొలువుకు వారలఁ గోరి రావించి
వారిరూపంబులు వారినిల్కడలు వారినిర్మలతర వాగ్విశేషములు
తనకు నింపొనరింప తత్కథాక్రమము ♦ వినుచుండె రాముఁ డవ్విధ మెట్టిదనిన
ద్వాదశయోజనాత్యాయతంబగుచు ♦ నైదు యోజనముల నది వెడల్పగుచు
నిపుణత మయుని చే నిర్మితంబగుచు ♦ నెపుడు శాత్రవకోటి కెదురుచుక్కగుచు
కొలదిమీరిన భానుకులజుల కెల్ల ♦ కులరాజధానియై కొనియాడఁ బరగి
సరయువుపొంత కోసలదేశమునను ♦ ధరణికిఁ దొడవ యయోధ్యాపురంబొప్పు
మణిగోపురంబుల మణితోరణముల ♦ మణికుట్టిమంబుల మణిగవాక్షముల
కేళికాగృహముల కృతకశైలముల ♦ బాలానికంబుల పటహనాదముల
మహితవారణముల మానితాశ్వముల ♦ బహురథప్రతతుల భటకదంబముల
విమలసౌధంబుల విపణిమార్గముల ♦ కమనీయవనముల కమలాకరముల
చెరువుల బావుల చెరుకుతోటలను ♦ తరుచైన శాలి కేదారవారముల
పరిఘల కోటల పసిడిమాడువుల ♦ కర మొప్పు లోకవిఖ్యాతమై బరగు
నాపురి దశరథుండను మహారాజు ♦ చాపవిద్యావర శిక్షార్మకుఁడు
చతురుపాయజ్ఞుండు షాడ్గుణ్యశాలి ♦ సతతశక్తిత్రయ సంధానకర్త
ధర్మోత్తరుఁడు కృతాధ్వరుఁడు శ్రీకరుఁడు ♦ ధర్మశాస్త్రపురాణతాత్పర్యపరుఁడు
యజునినందనుఁడు బాల్యాదిగా నిరతి ♦ ప్రజలపాలించిన పరమపావనుఁడు
జంభారికై పోయి శంబరాసురుని ♦ దంభంబణంచి సుత్రాముని చేత
మందారపుష్ప దామములు గైకొన్న ♦ యిందుమతీపుత్రుఁ డినకులాధిపుఁడు
తేజంబు కాంతియు తెగువయు నేర్పు ♦ రాజసంబును దారతయు దైర్యంబు
మొదలైన సద్గుణంబుల ప్రోదియగుచు ♦ నుదయార్కు గతి దనయుగ్రతేజంబు
దీపితంబై యేడుదీవులఁ బర్వ ♦ భూపాలతిలకమై పొలుపొంద నేలు

నన్నరనాథు కులాంగనామణులు ♦ మున్నూటయేబండ్రు ముఖ్యలై యందు
నచలితసౌశీల్య యైనకౌసల్య ♦ కుచకుంభనిర్జిత కోకయా కైక
యనఘచరిత్రయా నా సుమిత్రయును ♦ వినుతికెక్కిరిత్రయీవిద్యలోయనగ
గలమీఁదనతనికి హితపురోహితులు ♦ పొలుచు వసిష్ఠాదిపుణ్యాసంయములు
అనఘాత్మకుడుదృష్టి యనువాడువిజయు ♦
డనువాడు సిద్ధార్థు డనువాడుమఱియు
నర్థసాధకుడు జయంతుడు నీతి ♦ తీర్థుడశోకుండు ధీమంతుడైన
మంత్రిపాలకుడు సుమంతుడనంగ ♦ మంత్రులగలరె మండ్రునాతనికి
ఆమాత్యులందఱు ననోన్యహితులు ♦ స్వామికార్యవిచారచతురమానసులు
పరమర్మభేదనోపాయధౌరేయు ♦ లగసిప్రజారక్ష యాచరింపుదురు
అట్టివారెసమ ప్రుసఖిలకార్యంబు ♦ లట్టుగదిద్ది దీర్పను జాలికొలువ
నష్టాక్షరముల బాహాష్టకంబును ♦ స్పష్టమై వెలయు నారాయణుకరణి
దశరథుండలరె నాతనిదేశమునను ♦ గృశుడుకొండీడుగోగియుదరిద్రుండు
జారుండుమరి దురాచారు డపుణ్యు ♦
దూరుడు క్రూరుండు తుచ్ఛుండుజడుడు
మందుండుమరి లేరు మంగనకైన ♦ నందఱుమణికుండలాద్యలంకృతులు
అందఱుధర్మపరాయణచిత్తు ♦ లందఱువిహిత కులాచారరతులు
ఈ చందమున రాజ్యమేపుదీప ♦ భూచక్రమెల్ల నేర్పున నేలియేలి
ప్రకటరాజ్యాంగ సంపద దేలి తేలి ♦ యొకనాడు దశరథుండుల్లంబులోనఁ

## దశరథుండు మంత్రులతో పుత్రకామేష్టి సేయ నాలోచించుట.

దనకుసంతతి లేమి దలపోసిచూచి ♦ తనకు నాయువు వేగ తగబోయెననుచు
మనమునగుందుచుమఱియునాతండు ♦ తనమంత్రివరులనందఱనురప్పించి
ఘనముగ గొలువిచ్చి ఘనతగూర్చుండి ♦ తనమంత్రివరులనందఱజూచి పలికె
పెక్కుదానంబులు పెక్కుధర్మములు ♦ పెక్కుయాగంబులు పెక్కువ జేసి
పెక్కేండ్లుమటి శోభితకీర్తిగంటి ♦ మక్కువమీవంటి మంత్రులుగలుగ
గొదువలేదేమిటఁ గొడుకులు లేని ♦ కొదువయొక్కటిగానికుఁ ముద్ధరించు
కొడుకులు లేకున్నఁ గోరిపుణ్యము లు ♦ వడయుత్తమలోకపదవులెవ్వరును
గావంబుత్రులఁగానఁగా నాకువలయుఁ ♦ గాననేవింక లోకములెల్ల మెచ్చ
దలకొనియశ్వమేధము సేసిపిదప ♦ నెలమితోఁ బుత్రకామేష్టి వేల్చెదను
గనితగుపనులకు నందఱిబనుప ♦ ననఘులుమఱి వసిష్ఠాదులువచ్చి
యలవడనీచేయుహయమేధమునకు ♦ నెఁకొని యేమింక నిర్వహించెదము

నాదినెన్న శక్యమే మఘరాదమహిమ ♦ యిదిగాక పుత్రకామేష్టి యుఁజేయ
దనయులఁగాంచెదు ధన్యమానసుల ♦ ననవుడు హర్షించి యవనినాయకుఁడు
అందరఁబనిచి శుద్ధాంతంబుసొచ్చి ♦ సుందరీమణులకా శుభవార్తఁ జెప్పి
యనురక్తి నేకాంత మైయున్న వేళ ♦ ననఘుండు సూతుఁడిట్లనియె భూపతికి
ధరణీశ మీకు సంతాన సంప్రాప్తి ♦ వెరవైన కథమున్ను విన్నాఁడ నేను
భూమీశ వినుమంగభూమీశకొడుకు ♦ రోమపాదుఁడు ఘనాఢ్యుండు దొల్లి
తానేలి పాలించు ధరణిపై నెందు ♦ వానలు లేకున్న వగలును జెంది
వరమునీంద్రులచేత వర్షహోమములు ♦ పరువడిఁ జేయించి బడయు రాకున్న
భూరిశోకంబున బొగులుచు నున్న ♦ యారాజుఁ గనుఁగొని యటమునులనిరి
పరహితోన్నతుఁడు విభాండకసుతుఁడు చిరపుణ్యనిధి ఋశ్యశృంగుఁడన్వాఁడు
నగధైర్య పుట్టిన నాటనుండియును ♦ నగరరాష్ట్రంబు లెన్నఁడు నెరుగమిని
నతఁడెందు నాడువారను పేరు నెరుఁగ ♦ డతఁడు తాపసవృత్తి నడవులనుండు
వసుధీశ యతఁడిందు వచ్చిన జాలు ♦ వెసఁబాయు నీయనావృష్టిదోషంబు
నావుడు మునినాథు నగరికే రీతి ♦ రావింతునని విచారము చేసి తెలిసి
యనురక్తిఁ గడుఁ బ్రోడలగు వారసతుల—వినుతయౌవనరూపవిభ్రమగతుల
మనసిజమోహనమంత్రదేవతలఁ—బనిచె నొప్పుగ వారి గాటించి యతఁడు
అతివలమ్మునియున్న యడవికిఁబోయి—యతనియాశ్రమభూమికల్లన జేరి
చతురనర్తనకళా సంగీతగతుల ♦ నతనికిఁ దమయొప్పు లర్థిఁ జూపుటయు
నాపుణ్యనిధి వారి నాడువారగుట ♦ రూపింపనేరక రుచులఁ జేపడక
యలసమానములనీ యడవిలో నొప్పు ♦ మెలఁగెడు నిది వింతమృగములో గాక
యనుచుండ నొక్కనాఁ డతివల్లు ప్రీతిఁ ♦ దను జేరవచ్చినఁ దప్పక జూచి
చన్నులఁ బేరడిగి చన్నులమీఁద ♦ నున్న హారములకు నుపదేశమడిగి నను
మాకుకొమ్మొక్కటి మస్తకమ్మునను ♦ మీకుఁ గొమ్ములరెండు మెఱసె నొమ్ము
నేవృత్తములగలైనివి యపూర్వములు ♦ మీవల్కములతిమృదులంబులరయ
మాజటాబంధంబు మాడ్కి విగావు ♦ మీజటాబంధము మైరుగులఁ దితే
మేనిబూఁది దెపూత మేల్తావిగొట్టు ♦ వీనులవిందురీ వేదనాదములు
కనివిని యెఱుఁగమి కాకనభూమి ♦ మునులకు నీవేషములుగలవొక్క
ఎక్కడిమునులన్న నింతలాఘనుఁడు ♦ దిక్కట భావించిఁ జెంగినవ్వుచును
మానపూర్తిగ గ్రుమ్మరియాసామ ♦ గానంబు పాడి చక్కఁగఁ బద్రిమము
శుద్ధమార్గంబుఁ జూపంగ నేర్తు ♦ మిద్ధరమాచర్య లెరుగమీతర మెల్లు
యనినేర్పు రూఢలనమ్మునిస్వామిఁ ♦ గనుఁ బ్రాముటియు నక్కన్యకామణు
ఎవ్వరితనయుండ వెవ్వఁడవేల ♦ యివ్వనంబుననుండు టెరిగింపుమనుడు

అమలకీర్తులఁబుణ్యుఁడగువిభాండకుని ♦ కొమరుఁడఋశ్యశృంగుఁడునాఁ బేరు
విపులతపోనిష్ఠ వెలయనీయడవిఁ ♦ దపముసేయుటకునై తగిలి వర్తింతు
భాగీరథిస్నానపరత మాతంగ్రశి ♦ యోగిపుంగవులతో నొగినేగినాఁడు
వినుఁడుమీరిచటికి విచ్చేయుకతన ♦ ననఘుఁడనైతిఁ గృతార్థుఁడనైతి
ననిమునులనువారినాశ్రమంబునకు ♦ గొనిపోయిఋశ్యశృంగుండుపూజించె
నెలనాగలమ్ముని యిచ్చినపూజ ♦ యలరుచుఁగైకొని యతనివీక్షించి
మునివరమావనంబునఁ దెచ్చినార ♦ మనుపమఫలరాజమనుచులడ్వములు
అతిరసంబుల మనోహరములైనట్టి ♦ యతిరసంబులు వడలలరుమండిగలు
నారసరసములు చవులుగ్గడించి ♦ పేరువెట్టఁగరాని పెక్కుభక్ష్యములు
ఇచ్చిననమలుచు నెడనెడఁజవుల ♦ మెచ్చుచువనిసి యామెలఁతలఁజూచి
గ్రుక్కిళ్లుగ్రుంగుమగోసరియుఁడగుచును ♦ జొక్కుచునందందసారిదిజేచాచి
ముష్టిఫలముల మునివరులార ♦ యెన్నఁడేనెరుఁగను యేవనంబులను
మీతపంబెట్టితపంబు మీతపోవనమె ♦ యీతపోవనముల కెక్కుడుగలదె
ననిపల్కుచయ్యింతు లల్లననగుచు ♦ నమవారదనులత లటసోకగదిక[ త్రి
తావియూర్పులచేత దాలిమిదూలి ♦ పోవనోయ్యనముఖాంబురుహంబులో
పలుకులదళుకుల కాటకేటలను ♦ బిలుపులసొలపుల కేలించియుతని
హృదయ ముగరుగంగనిలుచన్నుగవలుగదియించిబిగియారఁగౌగిళ్లమరపి
యనఘుపోయెదముమదాశ్రమంబునకు ♦ ననివిభాండకుదెసనదరినభీతి
నరిగిచేరువనుండిరావనంబునను ♦ నరవిందలోచన లరిగినపిదప
వారికన్నెన్నఁడు వత్తురోయనుచు ♦ నాఋష్యశృంగుండు నటనిద్రలేక
యారాత్రివేగించి యమ్మరునాడు ♦ యారమణులగన్న యచటికేతేర

## ఋష్యశృంగుండు వారాంగనల తగిలి రోమపాదుని యింటికివచ్చుట

నందియుల్మొరయంగనసదుగావిగె ♦ లందందపడకరా యంచలుడల
మగువలువచ్చియా మహితాత్ముగాంచి ♦
నగుమొగంబులతోడ నయవాక్యములను
మునివరమావనంబునకు రావలయు ♦ ననిపల్కరాకకుననుమతించుటయు
దమయుపాయంబులదమవిలాసముల ♦ దమకంబుపుట్టించిదరలాత్ములంత
విస్తారపథమని వెఱచిపోవమికి ♦ హస్తపల్లవముల నాందోళికగను
నొనరెకుదీమంబులొకవింతమృగముగొనివచ్చు తెఱఁగునఁగొనివచ్చిరతని
నతనువచ్చుటయు నయ్యంగరాజ్యమున ♦
నతులవర్షములు సస్యములొప్పెనంత

ననఘుండు కుదనకూతుఁ నారాజు శాంత ♦ యును దానినిచ్చిన నారాజునింట
నతఁడుండ దశరథుం డమ్మునిఁ దెచ్చి ♦ హితమతి బుత్రకామేష్టి నాబరగు
క్రతువమ్మునీంద్రు చేఁ గావించెనేని ♦ సుతుల నల్వుర బహుశ్రుతుల నున్నతుల
నాతతోన్నతిఁ గాంచు నని చెప్పి దెలియ ♦ నాతోడ దొల్లి సనత్కుమారుండు
అటుగాన నీ వింక నా ఋశ్యశృంగు ♦ బటుభక్తియుక్తిమై బ్రార్థించి తెమ్ము
అనిన నా దశరథుం డా రోమపాద ♦ జననాథుపీటికిఁ జని ఋశ్యశృంగు
క్రతువున కాచార్యు గావరియించి ♦ యతులిత చతురంత యానాఢ్యుఁ జేసి
వచ్చుచోఁ దూతల వలన వీక్షించి ♦ పుచ్చి ముందర వారి బురమును నగరు
వాసవు పురితోడ వైభవంబొప్ప ♦ గైసేయు నలయును గడువేగ మీరు
అనిపల్క వారును నరిగి పౌరులకు ♦ వినుపింప జేసిరి వివిధశిల్పముల
దుందుభిశంఖాది తుములనాదముల ♦ నందంద మ్రోయించి రంత భూపతియు
బురమున కేతేర బురజనుల్ సేయు ♦ పరమమంగళకళతుల్ పరగ గైకొనుచు
నతని నిరోధ్యాసాధ్యగాన యోధ్యయను ♦ జతురుడై తోడ్తెచ్చె శాంతతోఁ గూడ
నీరీతి నా ఋశ్యశృంగుని దెచ్చి ♦ భూరమణుండంత పురమున నునిచి
వితతార్ఘ్యపాద్యాది విధుల బూజించి ♦ యతికృతార్థుడనైతి నని సంతసించె
నా సమయంబున నా రాజసతులు ♦ కౌసల్య మొదలుగా గలవారు వేడ్క
నలువొంద తపోనిధానకిఁ బూని గ్రాల ♦ నలరి సంతసమున నా శాంతకపుడు
మహితభూషణవస్త్రమాల్యాదులిచ్చి ♦ బహువిధంబుల వారి బ్రార్థించ నంత
కొంత కాలమునకు గువలయజనులు ♦ సంతోషమొసంగ వసంతమే తేర
నడరుడు లేదుకదా ఋశ్యశృంగు ♦ కడకు భూపతి వచ్చి కడు భక్తి మ్రొక్కి
సన్నుతస్థితి నమ్ము సంయమిప్రవరు ♦ చెన్నొందఁ జన్నంబు సేయింపవలయు
ననివిన్నవించిన నౌగాక యనుచు ♦ వినకలోత్తముఁ జూచి యిట్లని పలికె
వేగంబె తెప్పింపు హితంబులైన ♦ యాగసంభారంబు లన్నియు నధిప
యనవుడు దగువారి నఖ్యా తెలంగ ♦ నొకరింపుడనుచు నియోగింవబనిచి
యఖిలసంభారంబు లన్ని దెప్పించి ♦ మఖము చూచుటకు సుమంతుని బంపి
కేకయతన్మ్నానాథుఁ గీర్తిపనాథు ♦ నా కాశిరాజు నవ్యాహతతేజు
జనకాంగరాజాది జననాథవరుల ♦ ననఘచరిత్రుల నర్థిరప్పించి
మనుజనాయకుఁడు సుమంతుతో ననియె ♦ ననఘుల వేదవేదాంగపారగుల
గృహమేధులగు వారి కృతతంత్రభావ్య ♦
మహితార్థనిశ్చయమతుల భూసురుల
బరఁగ సుయజ్ఞ జాబాలిఁ గశ్యపుని ♦ సుగచిరాత్మురి వసిష్ఠుని వామదేవు
రయమున దోడ్కొని రమ్మునీవనినఁ ♦ బ్రియమున నాతండు పెంపార నరిగి

యురుభక్తినందఱ నొగిఁదోడి తేరఁ ♦ బరువడిఁ దాఁ గశ్యపాద్యాదులిట్ల
నిర్మలవ్రతనిత్య నిష్ఠార్థమైన ♦ ధర్మార్థయుతము గాఁ దగుమాటఁ బలికె
మునులార కొడుకులు మునునాకు లేమి ♦ మనమునఁ దలపోసి మమత రెట్టించి
మిత్రసూక్తుల నశ్వమేధయాగంబు ♦ పుత్రులకొఱకునై పుత్రకామేష్టి
సేయంగ నీ ఋశ్యశృంగుఁ దోడ్తెచ్చి ♦ మీయనుగ్రహము గామించి యున్నాఁడ
ననవుడు నా వసిష్ఠాది సంయములు ♦ జననాథు మాటకు సంతోష మంది
యినకులోత్తమ లోకహిత మాచరింపఁ ♦ దనయులఁ గోరుట తలపొప్పు నింక
నశ్వంబు విడువు మీ యశ్వమేధమున ♦ విశ్వరక్షకులై సవిక్రమోజ్జ్వలులు
నలువురు కొడుకులు నరనాథ నీకుఁ ♦ గలిగెద రని పల్కఁ గడు సంతసిల్లి [ట
సవన యోగ్యంబైన జవనాశ్వమఱసి ♦ భువనపావనమూర్తి పూజించి నొసల
బ్రకటిత బిరుదాంక పట్టిక గట్టి ♦ యొక యేఁడు దనయిచ్చ నుర్విఁ జరింప
సమకట్టవిడిచె నశ్వ బురక్షింప ♦ విమతోగ్రులగు సైన్య విభులతోఁ గూడ
సంగవసిష్ఠాదు లనుమతి సేయ ♦ వింతగా శిల్పులో విదుల రావించి
సరయువునుత్తర స్థలి యాగశాల ♦ విరచింపగాఁ బంచె వేదోక్తసరణి
మఱియు నానా దేశమనుజవల్లభుల ♦ వఱలు విప్ర నృపాల వైశ్యశూద్రులను
రప్పించె నంత వర్షము పూర్ణమైన ♦ నప్పటి యధ్వమానమే తేర నృపుడు
చిరతపోనిధి ఋశ్యశృంగుసమ్మతి యుఁ ♦ గురునియానతిఁ గైకొని మంచివేళ
స్పృహను శాంతా ఋశ్యశృంగులతోడ ♦
విహితసంభారవర్ణిత హోమగుండ
సహితమై యేకవింశతి రమ్యయూప ♦ మహితమై శ్రౌత ధర్మక్రియాచార
విహితమై మాయాప్రవీణదైతేయ ♦ రహితమైన కలామరహితమై యెప్పు

—*: దశరథుండు యాగదీక్ష వహించుట :*—

యాగవాటము చొచ్చి హాయము వచ్చుటయు ♦
యాగదీక్ష వహించి యతిశుద్ధిఁ బొంది
మునులు వసిష్ఠాది మునిజనోత్తముల ♦ ఘనులరుత్విక్కులగా వరియింప
సవనత్రయం బభిషేక మొనర్చి ♦ ప్రవిమలయూపాగ్ర బంధంబులైన
జలచరంబులరణ్యచరములు విహగములు నురగంబులు మొదలుగా నొప్ప
పశువులమున్నూటి ప్రథితాశ్వమొకటి ♦ విశసించి క్రతుకర్మవేదులు ప్రీతి
నేమంత్రములతోడ నేపలలములు ♦ గామించి వేలుపగా జెప్ప శ్రుతులు
నామంత్రములతోడ నాపలలములు ♦ కామించి వేల్చిరి కడగి ఋత్విజులు
అనలుండు సప్తజిహ్వల ప్రజ్వరిల్లె ♦ ననిమిషుల్దనిసిరా హవిరాజికముల
నాయాగదినముల నాకొన్నవాడు ♦ నాయాసపడినవా డరసిన లేడు

సారమృష్టాన్నవస్త్ర పటీరకవక ♦ హీరభూషాదిసంతృప్తులే కాని
యేక్రియలందును నెడపడకుండ ♦ నీక్రియ హయమేధ మీడేరుటయును
వెనుక జ్యోతిష్టోమ విశ్వజిదాది ♦ ఘనయాగతతులు సాంగముమీఱ జేసి
అధ్వరదక్షిణకై పూర్వదేశ ♦ మధ్వర్యునకును బ్రహ్మకు దక్షిణంబు
హోనరంగ బశ్చిమ భూమిహోతకును ♦ దనరనుత్తరమునుద్గాతకునిచ్చె
నిలనయోధ్య యుదక్క నెల్ల దేశముల నరియిచ్చినముదమంది ఋత్విజులు
మెప్పుడేలుదము నీవిచ్చినదేశ ♦ మెప్పుడనుష్ఠాన మేము సలుపుదుము
ఏమేమ దేశంబు లేలుటలేద ♦ భూమికి వెలయిమ్ము భూమీశ మాకు
ననవుడు బదికోటులగు సువర్ణములు ♦ కనకంబు నలుమడి కలధౌతచయము
గోరంగ నొకలక్ష గోవులనిచ్చె ♦ నాఋశ్యశృంగాదులైన ఋత్విజులు
అవి పంచుకొని ముదమందిరి ప్రీతి ♦ ప్రవిమలాశ్వరక్షకర్మపరిచారకులకు
నరనాయకుండు సువర్ణములు కోటియును వరభూషణంబులు వలయు వారలకు
యమితార్థములను గామించువా ♦ కేమి వారడిగిన నింపారనిచ్చి
పరగు భూసురులకు భక్తితో మ్రొక్కి ♦ వరుస వారిచ్చు దీవనలు గైకొనుచు
ప్రకటదివ్యాంబరాభరణాదులొసగి ♦ యకలంకచిత్తుడై యవభృథంబాడి
శ్రీమహితుండు ఋశ్యశృంగుచే బుత్ర ♦ కామేష్టి జేయింపంగా నేగుదెంచి
క్రమమొప్ప యాగభాగములు గైకొన్న ♦ యమరులా రావణు నాత్మలో దలచి
బ్రహ్మ గనుంగొని ప్రణమిల్లి నిలిచి ♦ బ్రహ్మ నీవరశక్తి పంక్తికంధరుడు
ప్రవిమలాచారుల బ్రహ్మర్షివరుల ♦ దివిజుల మునుల బాధింపుచున్నాడు
దారుణవరశక్తి దలప మా చేత ♦ వారిజాసన వాడు వారింపబడడు
సురగణంబులతోడ సుత్రాము బట్టి ♦ పరిభవింపుచు నేను బహుదర్పమున
గంధర్వయక్షాది గణముల మునుల ♦ బంధించు సాధుల బట్టి బాధించు
వాడన్న కులగిరుల్ వడవడ వడకు ♦ వేడిమి చూపంగ వెఱచు భాస్కరుడు
వీకతో నతడున్న వీట నన్నడుచు ♦ దేకువ చెడి గాలి దిరుగంగ వెఱచు
నన్నిశాచరు గన్న నాటోపమెసగ ♦ మన్నీరుకడలొత్తి మ్రోయంగ వెఱచు
నేపున గనలెప్పుడెల్ల మమ్మేచు ♦ పాపాత్ముడగు నట్టి పంక్తికంధరుని
నంతంబు నొందించు నాయుపాయంబు ♦ చింతింపవలయు నీచిత్తంబులోన
ననవుడు నాతెఱం గంతరంగమున ♦ గని బ్రహ్మయును దేవగణము నీక్షించి
యమరుల చే జావ డసురుల చేత ♦ సమయడు గంధర్వ సమితిచే జెడడు
రజనీచరుల చేత గ్రాగడెన్నడును ♦ భుజగసంఘములచే బొలియడెన్నడును
యక్షుల చే నీల్గ డాలంబులోన ♦ బక్షియూథంబుచే బడడు వానికిని
వరమిచ్చునప్పుడు వాక్రువ్వడయ్యె ♦ నరుల గావున వాడు నరులచే జచ్చు

విశదంబుగానింక వినుడుహిరణ్య ♦ కశిపుఁడులోకము ల్గారించునాఁడు
నరసింహరూపంబు నారాయణుండు♦ధరియించివాని విదారించునాఁడు
వాఁడెవీడై విశ్ర వసునకుఁబుట్టె♦నాఁడుగావున నేఁడు నారాయణుండు
వీనినిర్జించు నవ్విష్ణునినభయ ♦ దానంబుమనమింకఁ దగవేఁడవలయు
నని దేవతలతోడ నవ్విష్ణుగాంచి ♦ కనకాక్షశిక్ష లోకత్రయాధ్యక్ష
వలజాలయారక్ష వసుమతీరక్షఁ ♦ వనజాక్షమాకు నెవ్వరులేరుదిక్కు
నీవొక్కఁడవుదక్క నిక్కమీమాట ♦ గోవిందపరిపూర్ణ గుణచిదానంద
దేవజగన్మయ దేవాదిదేవ ♦ దేవసిన్నారక దివ్యావతార [దొల్లి
శుభమూర్తిశరణంబుజొచ్చినమాకు ♦నభయమిచ్చితిగాదెయమృతాబ్ధిం
తలపోయదానవ దళననీబాహు ♦ బలవిక్రమంబులఁ బరఁగులోకములు
భక్తవత్సలనిన్ను బరికింపఁదరమె♦భక్తియోగముదక్క బయలుమాటలను
మధుసూదనుఁడనిన్ను మదిలోననమ్మ♦నధికపుణ్యులకెందునాపదల్గలవె
జగదుద్భవస్థితి సంహారగతుల ♦ దగవినోదంబులై తనరునీమాయ
ఆధారభూతమై యఖిలలోకములు ♦ మాధవదాల్చునీ మహనీయతనువు
అహిరాజతల్పనీయలరువైభవము♦మహిమజూడఁగనవాఙ్మనసగోచరము
శరణాగతత్రాణ శరణులోకేశ ♦ శరణార్థుఁగుమమ్ముఁ జనుఁగాననీకుఁ
గావుఁ త్రైలోక్య కంటకుండైన ♦ రావణుఁబొలియించి రక్షింపుమమ్ము
మాకొకకార్యంబు మసలకచేసి ♦ లోకకర్తులబొందు లోకైకవినుత
నిర్మలచిత్తుండు నిశ్చలవ్రతుడు ♦ ధర్మశీలుండు నుత్తమగుణాన్వితుఁడు
నగుచున్నదశరథు డశ్వమేధంబు ♦ తగజేసిమదిశుచిత్వమున నున్నాడు
కాకుత్స్థవంశుని కాంతలదలప ♦ నేకాంతలనువారి కెనసేయరాదు
నరమూర్తులొప్పంగ నాలుగంశముల♦సరసిజోదరనీవుజనియింపవలయు
నరశక్తిసురల కవధ్యుఁడై లోక ♦ పరితాపకరుడైన పంక్తికంధరుని
మునులగంధర్వకింపురుషులసురల ♦ బవడజంపిన పాపాత్ముఁజంపి
నవనముల్సేయింపు సంయమివరుల ♦ భువనముల్రక్షింప పుండరీకాక్ష.
యనివిన్నపముసేయ నమరులజూచి ♦ వనదగర్జితగతి వనజాక్షుఁడనియె
సురలారమీరింక సుఖముననుండు ♦ డరిగిమర్త్యమున నే నవతారమంది
యాదటబంధు మిత్రామాత్యపౌత్ర ♦ సోదరయుతు దశాస్యునిగీటడంచి
నిండార నేలెద ననియతొబలుకునొ ♦ కొండు వేలేడులీకుంభినీతలము
నిజునివరంబున నవనీతలమున ♦ రజనీచరేంద్రుండు రాజిల్లగలిగె
ననుచువరంబిచ్చియజునివీడ్కొలిపి♦యనిమిషులనుబంపియసురారి చనియె
అప్పుడువిమలహోమాగ్నిలోనుండి ♦ యొప్పెడుపుణ్యాత్ముఁడొకదివ్యమూర్తి

—*: దశరథునకు యజ్ఞపురుషుడు దివ్యపాయస మిచ్చుట. :*—

హరినీలనీలాంగు డరుణాంబరుండు ♦ తరుణార్క తేజు డుదగ్రవిక్రముడు
పరగ బాయసముతో బసిడిపాత్రంబు ♦ కరమునదరియించి గ్రక్కున వెడలి
తనుజూచియున్న నాదరమున లేచి ♦ వినయాఢ్యుడై యున్న విభుని వీక్షించి
భూనాథ వినుయజ్ఞ పురుషుండ సుతుల ♦ నీకునుగోరి యేతెంచినాడ
నాదట నీ పాయసాన్నంబు పుచ్చి ♦ నీ దేవులకుబెట్టు నిష్ఠతోననిన
ననురాగమును బొందియవనీశుడతని ♦ ననయంబు పూజించి యాపాయసంబు
తానందుకొనియె సుధాకలశంబు ♦ చేనందుకొన్న శచీపతిమాడ్కి
నంత బ్రాజాపత్యు డటుమాయమైన ♦ నంత పురంబున కరిగి భూవిభుడు
రమణు లెదురేగ నిప్రమదాబ్ధి దేల ♦ సమరసిర్తమై యాపాయసంబు
సగము కౌసల్యకు సగములో బుచ్చి ♦ సగముసుమిత్రకా సగములో సగము
కైకకునిచ్చియుత్కంఠ నాసగము ♦ ప్రాకటంబుగ సుమిత్రకునిచ్చె మతియు
నప్పాయసాన్నంబు లర్థిభుజించి ♦ యప్పుడు గర్భిణులైరి వారెలమి
తగిలి వారలజూచి దశరథేశ్వరుడు ♦ మిగు నానందించి మెఱసెజూపఱకు
మొగి ఋశ్యశృంగాది మునుల భూపతుల ♦ తగునర్చనములిచ్చి తగ వీడుకొలిపి
పరమానురాగుడై పడతులు దాను ♦ ధరణీశుడయ్యయోధ్యను నేగుదెంచె
దమయాగభాగము ల్దగిలి గైకొన్న ♦ యమరులుదమలోక మరిగెడుచోట
నాకంజగర్భుడింద్రాదుల జూచి ♦ లోకరక్షణ కళాలోలుడై శౌరి
ధారుణిపై నవతారంబు సేయ ♦ మీరును దోడ్పాటు మేకొనవలయు
నటుగాన లోకహితార్థ వర్తనుల ♦ బటుపరాక్రమరూప బలపయోనిధుల
బలగర్వములమిము బ్రతిపోల్పజాలు ♦ బలియుర వానర పతులు బెక్కండ్ర
గిన్నరగంధర్వ ఖేచరయక్ష ♦ పన్నగామరసిద్ధ భామలయందు
బుట్టింపుడేమున్న పుట్టించినాడ ♦ నెట్టన బలపయోనిధి జాంబవంతు
నదియెట్టిదనిన నేనావులించుటయు ♦ నుదయించె జిరతరా ఋక్షమంతుడతడు
అని బ్రహ్మ దమతోడ నానతిచ్చుటయు ♦ వినిసంతసిల్లి యావేల్పులందరును
అనిమిషపతి వాలి ననలుండు నీలు ♦ నినుడు సుగ్రీవు సురేజ్యుండు తారు
సింధువల్లభుడు సుషేణు గుహ్యకుడు ♦ గంధమాదను విశ్వకర్మ నలుని
దివిజవైద్యయుగంబు ద్వివిదమైందులను ♦ దివిరిపర్జన్యాధి దేవతశరభు
గరువలి హనుమంతు గడగి పుట్టింప ♦ ధరణిపుట్టించిరి తక్కినసురల
తమతమ సత్త్వముల్దగ బుచ్చి పేర్చి ♦ యమిత శౌర్యులు వానరాధీశవరుల
నావానరులు జగదాప్తవర్తనులు ♦ దావాగ్నితుల్యు లుదగ్రవిక్రములు
పర్వతాకారులై భాసిల్లువారు ♦ పర్వతయోధులై పరగెడువారు

భీమసాహసికులై పెంపారువారు ♦ కామరూపంబుల గర మొప్పువారు
దతిమియబ్ధులనైన దాటెడువారు ♦ బెరికికొండల నైన భేదించువారు
నఖదంష్ట్రిహేతుల నలిగ్రాలువారు ♦ నఖిలలోకోత్తరులై యొప్పువారు
ధారుణినైన విదారించువారు ♦ నైరూఢికెక్కియు శౌంకులై వారు
కొందఱుసుగ్రీవు గొందరు వాలి ♦ గొందరుహనుమంతు గొందరునీలు
కొందరునలమైంద కుముదులఁగొలిచి ♦ యెందున భేద్యులై యేపుదీపించి
మలయదుర్దరగంధమాధనవింధ్య ♦ ములు మొదరగు శైలములగాననముల
బహుజలనదన దీప్రాంత దేశముల ♦ విహరించు చుండిరి వేడ్కతో నంత
మహనీయపాయసమహిమ చే జేసి ♦ యహిమాంశుకులపత్నులఁదుగర్భంబు
లరవడనాధాన మైనది మొదలు ♦ కలిమిగ్గైకొని పేదకౌను లెంతయును
నమృతాన్నరుచిలోన నడగక వెలికి ♦ గమనించెనన దేహకళలెల్ల బారె
రాజును సామ్రాజ్యమును ముక్కనల్పు ♦ గావించుటకు సూచకములిటు యునగ
ననపత్యతాదోష మంతయు వెడల ♦ మొన సెనాదగె జనుముక్కలనల్పు
చెక్కులుపలచెక్క జిట్టుముల్బలిసె ♦ నిక్క నాభులువళు ల్నేరులకు బాలె
దలచూపెగోర్కనంతట క్రమంబునను ♦ నెలుతొమ్మిది యును నిండినపిదప
వర్ణితమధుమాస వరశుక్లపక్ష ♦ పూర్ణయానవమిని బుధవాసరమున

—:* (శ్రీ)రాముల జననము *:—

మహిబునర్వసుతార మధ్యాహ్నవేళ ♦ గ్రహపంచకమునుదగ్రస్థివనర
దొలగక గురుడుచంద్రుడుగూడియుండ ♦ లలితకర్కాటకలగ్నంబునందు
సర్వలోకాధారు జగదేకవీరు ♦ శర్వాదిదేవతా సంస్తూయమాను
దివ్యలక్షణకళా దేదీప్యమాను ♦ నవ్యయునసమాను నార్తార్తిహరణు
నాకమలోదరు నర్థాంశమునను ♦ కాకుత్థ్సకులు రాముగనియెగౌసల్య
యదితియింద్రునిగన్న యనువుసతూర్పు ♦ సుదతిచంద్రునిగన్న చొన్ననంత
భూలోకవిదితమై పుష్యనక్షత్ర ♦ లాలితంబగు మీనలగ్నంబునందు
గమలాస్తసను తెజు గమలాస్తవంశు ♦ గమలాపుభరతునిగనియెగై కేయి
ప్రణుతింపదగునట్టి ఫణితారకమున ♦ గణితకర్కటక లగ్నంబునఁగవల
దరళలోచన సుమిత్రాదేవిమిత్ర ♦ చరితులలక్ష్మణు శత్రుఘ్నుగనియె
దివిమ్రోసెనప్పుడు దేవదుందుభులు ♦ దివినాడిరప్పుడు దేవకామినులు
సొరిదిబువ్వులవాన సోనలై కురిసె ♦ బరితోషమందిరి బ్రహ్మాదిసురలు
కలయనయోధ్యలో గలవారలెల్ల ♦ వెలసిరుత్సవకల వీరువారనక
అప్పుడుదశరథుం డనఘువసిష్ఠు ♦ రప్పించి జాతకర్మములుసేయించి
పుత్రోత్సవంబున బొరియించెదివిజ ♦ నేత్రోత్సవంబుగా నిఖిలపౌరులకు

బురుడుదీరినయంత బుణ్యాహవేళ ♦ వరుసనాసుతులకు వంశోన్నతులకు
లక్ష్మీసమన్వితులకు రామభరత ♦ లక్ష్మణశత్రుఘ్న లలితాఖ్యలెసఁగ
నొగినామకరణంబు లొప్పఁగావించి ♦ తనగర్థకోటులు దానంబులిచ్చి
వారలుతల్లులు వరుసదాదులును ♦ బోరామిదమునర్థి బోషింపఁబెరిగి
కల్లరినగవుల గన్నులుదెరిచి ♦ యల్లనల్లదప్పు టడుగులువెట్టి
మల్లగొనుడొంకు మాటలునేర్చి ♦ యెల్లవారికిజాల నింపులొనర్చి
కొద్దిగాముత్తెంపు గొనబువజ్రాల ♦ మద్దికాయలడాలు మలయజెక్కుళ్ళ
బ్రాకటంబుగఫాల బాలేందుకళల ♦ శ్రీకరాకృతిరావి రేకలల్లాడ
బాగడొందుమగరాలపులిగోళ్ళ మేలిజిగిడెందములయందు జిందులుద్రొక్క
నెడనెడబలుపచ్చలేయడ్డిగలుగ ♦ గడునొప్పుమొలనూళ గంటలు మొఱయ
మువ్వలందెలు పదంబులరొదసేయ ♦ నవ్వులాటలబాల్య నటన లేర్పడగ
విద్దెలునెఱపుచు విభునిముందరను ♦ ముద్దులుగులుకుచు మోహనాకృతుల
నంతనానలువురు నభివృద్ధిబొంది ♦ సంతతపుణ్యులై సమచిత్తులగుచు
దమలోనగవగూడిదశరథాత్మజులు ♦ రమణీయమూర్తులు రామలక్ష్మణులు
భరతశత్రుఘ్నులు పాయకపుణ్య ♦ నిరతులై చాలొప సీతులై యంత
మాయావినోదముల్మరిగియాడుచును ♦ నాయెడరఘురాము డాప్తులుదాను
నిండారుప్రేమతో నెట్టెలుగట్టి ♦ చెండునుదండంబు చెలువొప్పబట్టి
తరమిడియాడెడు తఱినిగ్గై కేయి ♦ వరవుడామందర వడినేగుదెంచి
చిట్టట్టుచేతుల జెండుడట్టుటయు ♦ కట్టల్కరాముడా కాష్ఠంబుచేత
నడచిననొక్కకా లప్పుడెవిరిగె ♦ దడయకయందంద దమకించిరాము
నడరెనువేడ్కతో నాడంగజూచి ♦ తడయకరాముపై దగ గ్రూరముంచి
విరిగినకాలితో వెసగ్గై కనగరి ♦ కరిగితద్వృత్తాంత మంతయుదెలుప
దరమిడిక్కై కేయి దశరథాధిపున ♦ కెఱిగింపనంతయు నెరిగిభూవిభుడు
అలవసిష్ఠునినయోధ్యకునురావించి ♦ వలగొనిమ్రొక్కి యావరమునిచంద్ర
వీరికివేదాది విద్యలన్నియును ♦ నేరుపుడనుచునా నృపుడప్పగింప
ననఘుడమ్మునినాథు డట్లకావించె ♦ జననాథుతనయులాసంయమికరుణ
గరిమాయారోహణ క్రమములెరింగి ♦ వరరథారోహణ వైఖరుల్దెలిసి
యఖిలవేదంబులు నఖిలశాస్త్రములు ♦ నఖిలశస్త్రాస్త్రవిద్యలునేర్చిరంత
వారిలోరాముడ వార్యశౌర్యమున ♦ సారవివేకాది సద్గుణావళుల
దేజరిల్లుచువిష్ణు దేవుండుగాన ♦ రాజిల్లెనా దశరథుడునంత
గొడుకులపెండ్లిండ్లు కొమరొప్పజేయ ♦ నడరిచింతింప విశ్వామిత్రుడంత
వచ్చినిల్చుటయుదా వారికుల్దెలిసి ♦ వచ్చియాదశరథ వరునర్థిజూచి

యువధారుదేవ విశ్వామిత్రమౌని ♦ తివిరి వాకిట నేగుదెంచియున్నాడు
అనవుడు దశరథుండాప్తులతోడ ♦ మునివసిష్ఠుడు దానుముదముతో నపుడు
పరమేష్ఠికెదురేగు పాకశాసనుని ♦ కరణి నెదుర్కొని ఘనశక్తి నెరిగి డు
యమ్మునిగొనిపోయి యర్ఘ్యపాద్యముల ♦ నెమ్మిబూజించిన నృపుజూచి యత
కుశలమే ప్రజలకు గుశలమే నీకు ♦ గుశలమే నీముద్దు కొడుకు గుఱ్ఱలకు
విశదవ్రతాచార వినుతవసిష్ఠ ♦ కుశలమే మునులార కుశలమేయనిన
నేమిటగొఱత లే దేముధన్యులము ♦ నామందిరము పావనమ్ము చెన్నొంద
భావితమూర్తియో పరమమునీంద్ర ♦ నీవువిచ్చేసితి నేడుమాకడకు
గానలోకముల బ్రఖ్యాతుడనైతి ♦ మానవాధిపులలో మాన్యుండనైతి
వచ్చినకార్యంబు వలనొప్పజెప్పు ♦ డిచ్చమై జేసెద నేకార్యమైన
ననినవిశ్వామిత్రు డారాజుజూచి ♦ జననాథదశరాత్ర జన్నంబుదొడరి

*: కౌశికుడు యజ్ఞరక్షణార్థమై దశరథునితో రాముని బంపుమనుట :*

కోరియే జేయుచో క్రూరరాక్షసులు ♦ దారుణాకారు లిద్దరువచ్చివచ్చిలు
మాయాగశాలలో మాంసరక్తములు ♦ పాయక కురియుచు బ్రబలవిఘ్నము
సేయుచున్నారు సృష్టీశమాకు ♦ నాయాగమధ్యంబు నందల్లరాదు
అటుగాన నీపుత్రు నభిరామరాము బటుసత్త్వు గ్రతువొప్ప బాలించుకొఱకు
గొనిపోవవచ్చితి క్రూరులు దనుజు ♦ లనిజావరోరులచే నతనిచేగాని
యతనిమహాత్త్వమే నెరుగుదు బ్రహ్మ ♦ సుతుడైన యీవశిష్ఠుండును నెరుగు
ననఘు రాముడు బాలుడను బుద్ధిమాను మనఘునీ పుత్రకు డనులోభముడుగు
క్రతుకర్త క్రతుమూర్తి క్రతుభాగభోక్త అతడులోకారాధ్యుడతనిబు త్రెంపు
అతులకస్త్రాస్త్రంగలతని కేనిత్తు ♦ నతనిచే క్రతురక్ష యగుమాకుననుడు
బెలుకరి మార్చిల్లి పెద్దప్రొద్దునకు ♦ దెలిసి వెల్వెలబారి దీనుడై మిగుల
గలగికపించి గద్గదకంఠుడగుచు ♦ బలికె విశ్వామిత్రు బ్రార్థించినృపుడు
రాముడు బాలుండు రాముడునిసువు ♦ రాముండెఱుంగడు రణకళాకేళి
పదియునునైదేండ్ల ప్రాయంబువా. ♦ కదలెడిచిప్పకుంకటిగలవాడు
పరికించితనయందు బగవారియందు ♦ సురుబలాబలగతులూహింప లేడు
ఇటువంటి పసిబిడ్డ నేల వేడితి ♦ కటకట ఘనదయాకలితుండవ యుగ్రక్షసులు
బహువిద్యశస్త్రాస్త్రప్రవతులు రాక్షసులు మహితమాయోపాయమతులు రా
నిపుణసంగరకళానిధులు రాక్షసులు ♦ విపుల బాహాటోపనిధులు రాక్షసులు
వారితో బోర నెవ్వడు రాముడనగ ♦ వారేడయితడేడ వరమునిచంద్ర
యటువదివే లేడు లవనిపాలించి ♦ తఱిదప్పి ముదిసి యీతనిగంటి నేను
ఇతనిబు త్రెంచుట కేజాలనయ్య ♦ క్రతురక్షకై విచారము లేలమీకు

నేను సేనలఁగూడి యీప్రొద్దెకదలి ◆ పూనివచ్చెదనదె పొండుమీ వెనుక
మునినాథ మీయాగమున విఘ్నకర్త ◆ లనురాక్షసుల శక్తులది యెంతగలవు
వారెవ్వరెవ్వరు వారిపేరేమి ◆ యీరాఘవుఁడు వారి నెబ్బంగి గెలుచు
ననిన విశ్వామిత్రుఁడనియె భూపతికి ◆ మనుపులస్త్యబ్రహ్మ మనుమండు ఖలుఁడు
ఆవిశ్రవసుకొడు కఖిలకంటకుఁడు ◆ రావణుఁ డుగ్రసంరంభుఁడై పనుప
బలసి మారీచసుబాహులవ్వారు ◆ నలిరేఁగి యాగ విఘ్నములు సేయుదురు
రాముఁడొక్కఁడుదక్క రణభూమి వారి ◆ నేమిచందంబున నెదురలేరొరులు
అనిపల్కనమ్మక యధిపతి మఱియు ◆ మునినాథుతో బల్కె మోమాటలేక
బ్రహ్మనాలవవాఁడు పరమసాహసుఁడు ◆ బ్రహ్మచే వరములు వడసినవాఁడు
అట్టిరావణుచేత నటుపంపువడసి ◆ నట్టివారలఁ గెల్వ నతఁ డేమి చాలు
వారిలావెరుఁగక వచ్చెదననుచు ◆ మీరిబల్కితినింక మెల్లన జనుఁడు
ననవుడు రోషతామ్రాక్షుఁడై చూచి ◆ కనలుచుఁ గటములుత్కటములై యదర
నొడలెల్లఁ గంపింప నుదురుచు బలికె ◆ నడరి విశ్వామిత్రుఁ డారాజుఁ జూచి
కాకుత్స్థకులజుల గతివిచారించ ◆ కీకష్టదుర్భాష లేల భాషింప
నేను వచ్చినపని యెఱిగింపమంటి ◆ పూనిచేసెదనంటి బొంకెదవిపుడు
క్రతురక్షకై రాముఁ గడఁగి వేఁడుటయు ◆ ధృతిమాని యీనని తెగిపల్కె దీవు
సూనృతేతర నిన్నుఁ జూడఁగారాదు ◆ గాపబోయెదనంచుఁ గడఁగి పల్కుటయు
జలనిధులింకి భూచక్రంబు గ్రుంగె ◆ గలఁగె లోకములు దిగ్గజములు మ్రొగ్గ
దివిజులు వెఱచిరి దిశలు గీడ్పడియె ◆ నవశంబులుగ జొచ్చె నఖిలభూతములు
అప్పుడు మౌని కోపాటోపవృత్తి ◆ తప్పక భావించి దశరథుఁ జూచి
యావసిష్ఠుఁడు పల్కె నర్కవంశజులు ◆ భూవలయంబునఁ బొంపరెన్నఁగను
మిన్నందు నీకీర్తి మీవారికీర్తు ◆ లన్నియు జెడుఁగల్ల లాడితివేని
నిచ్చెదనని పల్కి యీకున్నఁ బోలియు ◆ నచ్చుగాఁ జేసిన యఖిలధర్మములు
దశరథాధీశుండు ధర్మాత్ముఁడనఁగ ◆ విశదకీర్తుల నీవు వినఁ బ్రసిద్ధుఁడవు
పుడమిలో నవనీశ భువనరక్షణము ◆ గడవంగ ధర్మములు గలవె రాజులకు
గాన రాముని నిచ్చి గాధినందనుని ◆ మానసీయుని బంపు మానవాధీశ
ఘనబలోన్నతులు రాక్షసులీకుమారు ◆ డనికి దక్షుండుగాఁ డనుచు నీకొడుకు
శైశవంబునకింత శంకింపనేల ◆ కౌశికుఁ డుండంగ గలుగునే భయము
అధిప విశ్వామిత్రు నత్యుగ్రతపము ◆ లధికసామర్థ్యంబు లతివిచిత్రములు
భూనాథ యిమ్మహాపుణ్యుండు దేవ ◆ దానవ గంధర్వ దైత్యులకంటె
నెఱుఁగు దివ్యాస్త్రంబు లిమ్మహాబాహు ◆ డెఱుఁగని విషయంబు లెందును లేవు
జనలోకనాయక జయయు సుప్రభయు ◆ ననఁగ దక్షునికూతు లాజయవలన

సుప్రభవలన రక్షోవధార్థముగ ♦ సుప్రభుండగు భృశాశ్వుండు వేర్వేఱ
శస్త్రాస్త్రతుల బుత్రులరయనేబండ్ర ♦ శస్త్రాస్త్రకృతులతనూజన్మలేబండ్రు
గావదూపంబులు గలవారిగాంచి ♦ భూమీశ యిచ్చెనీ పుణ్యాత్మునకును
అదిగారణంబుగా నఖిలశస్త్రాస్త్ర ♦ విదుడీమునియునీవు వెరువంగవలదు
ఈమునిమహిమ పెం పెరుగ వేయకట ♦ యీమునితోనాడి యేలతప్పెదవు
ఈమునిచంద్రుతో నేగ రామునకు ♦ సేమంబుజయము ను సిద్ధమ్ముసుమ్ము
ఇతడురక్కసుల జయింపగాలేడె ♦ హితరుతి నీపుత్రు నిర్దచారిత్రు
నలఘుశస్త్రాస్త్ర విద్యల బెద్దసేయ ♦ వలసియిచ్చుటికి భూవరవచ్చెగాక
కానరాముని బంపు క్రతువురక్షింప ♦ నీనిర్మలాత్మున కిచ్చుట మేలు

—:* కౌశికునితోడ రామలక్ష్మణుల బంపుట *:—

అనివసిష్ఠుడుపల్క నాత్మలోనమ్మి ♦ జననాథుడారామ చంద్రునిబిలిచి
బాలభావముచూచి బాష్పముల్నిండ ♦ యాలింగనముసేసి యర్థిదీవించి
చిప్పకూకటిదువ్వి చెక్కిలిపుడికి ♦ తప్ప యొక్కింత తడవుచింతించి
పుణ్యాహవాచన పూర్వంబుగాగ ♦ బుణ్యవతంబులు పుణ్యహోమములు
గ్రహపూజనలుసేసి కమనీయవస్త్ర ♦ మహితభూషణములు మనసారనిచ్చి
యొగితానుగౌసల్య యునువసిష్ఠుడు ♦ తగి దీవనలిచ్చి దశరథేశ్వరుడు
పుణ్యలగ్నంబున బుత్రరత్నంబు ♦ పుణ్యాత్ముడగుగాధి పుత్రునకిచ్చి
నెమ్మియుదెగువయు నెఱిబిరిగొనగ ♦ నమ్మునిగొలిచి పొమ్మనివీడుకొలిపె
నప్పుడులక్ష్మణుండారామునిగొలిచి ♦ తప్పకభక్తితో దానునుజనియె
బొదివిపువ్వులవాన పోరిపోరిగురిసె ♦ వదలకయనుకూల వాయువుల్వీచె
వరఘోషమంగళ వాద్యముల్మ్రోసె ♦ సురలాకసంబున జూచిరిప్రీతి [ను
నారాఘవుండప్పు డరుదుచిత్రముల ♦ వారిపాటులమహోన్నతవస్త్రముల
మహితతూణీరముల్ మండలాగ్రముల ♦ సహజంబుగాబూని సంప్రీతితోడ
నక్షీణతూణగోధాంగుళీత్రాణ ♦ కక్షలంబకృపాణి కలితులై దివ్య
శరచాపహస్తులై సాయమిపిరుద ♦ కరముసంప్రీతిమై గదలిరాఘవుడు
ఆవనజాప్తుని నర్థితోగొలిచి ♦ పోవునశ్వినులను బోవుచోవేడ్క
సురుపుణ్యమతులర్థయోజనంబరిగి ♦ సరయువుడగ్గర శ్రమముబొందుటయు
రామసౌమిత్రుల రమ్మనియపుడు ♦ తామున్న దారుణ దపముచేగొన్న
కనకగర్భునిపుత్రి కలసర్వమంత్ర ♦ జననులసర్వదా సౌఖ్యదాయినుల
బలయతిబలయన బరగుమంత్రముల ♦ నెలమిమైవారల కిచ్చెగౌశికుడు
ఆరామలక్ష్మణు లామంత్రశక్తి ♦ నాధరవితేజులై బడలికయు
నాకలినీరు వట్టాదిగారుజలు ♦ సోకకబలసమృద్ధి శోభిల్లిరంత

సరయూనదీతట స్థలినాటిరాత్రి ♦ దరుణకోమలదర్భ తల్పంబులందు
గౌశికుచేబుణ్య కథలొప్పవినుచు ♦ దాశరథులుప్ర మోదమునని్ద్రింప
నా గాధితయుండు నాప్రభాతమున ♦ వేగంబె మేల్కని వేడ్కచిత్తమున
దనరంగనటతృణ తల్పంబులందు ♦ గనునోడ్చియున్న రాఘవులఁ దట్టించి
నరుణోదయంబయ్యె ననఘాత్ములార నిరుపమపూర్వాహ్ణనిత్యకృత్యములు
వలయునేమంబులు వరుసగావింప ♦ వలయుట మేల్కన వలయు మీరనిన
దెలిసిసంధ్యా విధుల్దీర్చి కౌశికుని ♦ కలరుచిత్తములతో నతిభక్తి మ్రొక్కి
తరణివంశోత్తము ల్దారర్థిజనుచు ♦ సరయుసురాపగా సంగమంబునను [ల
బహుసహస్రాబ్దము ల్బాయనినియతి ♦ బహుతపంబులు సేయు పరమసంయము
గనుగొనిసంతోష కలితుడై గాధి ♦ తనయుతో బలికెనా దశరథాత్మజుడు
ఎవ్వరియాశ్రమంబిదిసంయమీంద్ర ♦ యెవ్వరుండుదురయ్య ఈతపోభూమి
ననపుడురామయనంగాశ్రమమనగ ♦ వినబడు నిదిలోక విఖ్యాతమగును
నీయాశ్రమంబున నెలమితోదపము ♦ సేయుచులీలమై శివుడున్న జూచి
కందర్పుడతిదర్ప గర్వితుండగుచు ♦ నిందుశేఖరుమీద నేయంగ జూచి
యడరియాదేవు ఫాలాక్షానలమున ♦ జెడుటననంగాఖ్య జెందెలోకముల
నంగసంగతిదదీ యాశ్రమభూమి ♦ యంగదేశంబయ్యె నంతనుండియును
అరుదారదపములీ యాశ్రమభూమి ♦ జరియించుపుణ్యులు చరితార్థులెందు
ననుచువిశ్వామిత్రుండత్తెఱంగెల్ల ♦ వినుపించియారఘు వీరులుదాను
నిలిచినాడానాహి నీసంగమమున ♦ విలసితస్నానాది విధులనుష్టించి
యానందమంద దదాశ్రమవాసు ♦ లైనమునీశ్వరు లాత్మలోనెఱిగి
రమణీయమూర్తుల రామలక్ష్మణుల ♦ నమితతపోధను డైన కౌశికుని [చి
గొనిపోయివేడ్కలుగొనలొత్తనపుడు ♦ వినుతార్ఘ్యపాద్యాదివిధులబూజిం
పుణ్యకథాగోష్ఠి బొందనారాత్రి ♦ పుణ్యరాత్రము జేసి పుణ్యసంయములు
మఱునాడునిత్య కర్మంబులయేనిట ♦ దెఱగొప్పనందఱు దీర్చియమ్మీద
నీనావికుడునేర్చు నియ్యేరుగడప ♦ భానువంశజులకు బదిలమీనావ
యనుచువిశ్వామిత్రుడలరంగబలుక ♦ వినిరామలక్ష్మణుల్వారొప్పునపుడు
వారికిబ్రణమిల్లి వారుదమ్మనుప ♦ నాఋషితోగూడ నానావయెక్కి [చి
సరయువుదాటుచోసరయువునడుమ ♦ గరమునిస్సమయమందికరములుమొగి
యునిమహాధ్వనులు పెల్లైసగుచున్నవియు ♦

దివినుబ్బియిదియేమి తెలుపవేయనుడు

గరమొప్పమీఱుచు గైలాసశిఖరి ♦ సరయువుమానస సరసిజన్మించి
పొంగారుసాకేత పురిచుట్టుగవిసి ♦ గంగలోగూడెడు కరదులమోత

యనిముని చెప్పిన నర్థితో మ్రొక్కి ♦ యనఘులన్నది దాటి యరుగుచో నెదుర
కరులు సూకరములు కాసరంబులను ♦ హరిణములు శరభంబు లజగరంబులును
బులులు భల్లూకము లొప్పెదలు సింగములు ♦
గలమహాటవిజొచ్చి ఘనుడు రాఘవుడు
ఖదిర తిందుక పూగ ఖర్జూర నింబ ♦ బదరీ వట ప్లక్ష పాటలీ తరులు
బహుళ కంటక లతా పరివృత వృక్ష ♦ సహితంబు నిర్మానుషంబును నైన
నివ్వనభూమి మునీశ్వరచంద్ర ♦ యెవ్వరి యాశ్రమం బెరిగింపుమనుచు
నడుగ విశ్వామిత్రు డంతయు జెప్ప ♦ దొడగి యారామలక్ష్మణులతో ననియె
నలుక నింద్రుండు వృత్రాసురు జంపి ♦ మలకలుష ప్రాప్తి మలినాంగు డైన
సురలును మునులును సుత్రాము నిటకు ♦ దురితము క్తుని జేయ దోడ్కొనివచ్చి
పుణ్యోదకంబుల బుణ్యమంత్రముల ♦ బుణ్యాభిషేకము లొప్పెలు పార జేయ
నాదుఃకలుషంబు లనునవి రెండు ♦ భూములనిడ శుద్ధి బొంది వాసవుడు
మలయుక్తమైనది మలదంబు కలుష ♦ కలితమైనది యొప్పగా గరూశంబు
ననియు శాపఘ్నంబు లనియు శేరొపగి ♦ జనపదంబున దొల్లి బంభారి తనకు
నలవృత్రువధ పాపమందు దీరుటయు ♦ గనుతింప ధనధాన్య విభవముల్బొదల
బొలుపార వరములా పురములకిచ్చి ♦ వెలయు చెనిక నొండు విను రఘురామ

—* విశ్వామిత్రుడు రామునకు దాటకిజననము దెలుపుట *—

ధరణి దాటకి యను దానవురాలు ♦ కరులు వెయ్యింటికి గలలావు గలిగి
పొలుపేది నీరెండు పురములు సొచ్చి ♦ యలవుమై బాధించు ననుడు రాఘవుడు
ఎవ్వరు లావిచ్చి రీయింతికింత ♦ యెవ్వరి నిజపుత్రి యీదుష్టబుద్ధి
యీపురంబులు రెండు నేల కాఱించు ♦ నీపాపకర్మ రా లెఱిగింపుమనుడు
నవని సుకేతుడ న యక్షుండు తొల్లి ♦ తవిలి పద్మజునకు దపమాచరించి
యదరెదునిష్ఠమై నతని మెప్పించి ♦ కొడుకు వేడుట యును గొడుకు నీకీను
వెలసిన గజముల వేయింటి లావు ♦ గలకూతు నిచ్చితి గనుము పొమ్మనిన
నావరంబున దాని నాతండు గాంచి ♦ భావించి సుందుని భార్యగా జేసె
నతడవ్వధూటి యం దతిఘోరసత్త్వ ♦ వతులమారీచ సుబాహుల న్వారి
బడసి లోకాంతర ప్రాప్తుడౌటయును ♦ గొడుకులు దానును గూడి గర్వమున
నాయింతి యటి యగస్త్యాశ్రమంబునకు ♦ బోయి మహాత్ముల సారె బొదిలి కాఱింప
గలశజుడా పాపకర్మ్ములజూచి ♦ యలిగి రాక్షసులు గండని శాపమిచ్చె
నది యాదిగా రాక్షసాకృతులూని ♦ యుదయత మాన వాహారముల్ గొనుచు
దానిందు వసియించి దరణి గాఱించు ♦ దీని జంపగ లేరు తెగువ నెవ్వరును
నీవొక్కడవు దక్క నీచేత గాని ♦ చావదాడుదియని చంపరాదనకు

మెనసిగోబ్రాహ్మణ హితమైనజాలు ♦ జనుజ పగామినీ జనులరాజులకు
దొల్లిధారుణియెల్ల ద్రుంపజింతించు ♦ ప్రల్లదురాలైన బర్జన్యుడలిగి
సంపన్నమతివిరోచనకూతుబట్టి ♦ చంపడెయది ప్రశస్తముగాదెయె దు
నెరయంలోకంబుల నిద్రముల్గాంగ ♦ జెలపజిత్తంబున జింతించుచుయను
నలుకదృఢవ్రత యగుభృగుపత్ని ♦ జలమొప్పవిష్ణుండు చంపడేదొల్లి
యదిగానలోక హితార్థమైనతుల ♦ బొదివిచంపుటయును బుణ్యంబులనఘ
యనినవిశ్వామిత్రునతులవాక్యములు ♦ తనతండ్రిపనుపున దలచిరాఘవుడు
హాటకగర్భాభు డగుమౌనిమాట ♦ దాటకతాటక దండింతుననుచు
ఘనధనుర్ఘోషము ల్గగనంబునిండ ♦ వినుచుటయునునుండి నిండగోపించి
కర్ణకఠోరమౌ కార్ముకధ్వనికి ♦ ఘూర్ణితారుణనేత్ర కుటిలాస్యయగుచు
రెండుహస్తములెత్తి రెక్కలతోడి ♦ కొండరివ్వనవచ్చు కొమరుదీపింప
వికటాట్టహాసంబు వెలిదంష్ట్రరుచుల ♦ వెదచల్ల దివియెల్ల వెసబెల్లగిల్ల
జరణఘట్టనముల జటులసత్వంబు ♦ ధరణికిదెలుపుచు దవిలియేతెంచు
తాటకగనుగొని దశరథరాము ♦ డాటోపముప్పొంగ ననియెనమ్మునికి
జూచితేలక్ష్మణా చూచితీదీని ♦ నీచందమేయంద మీయుగ్రదృష్టి
దీనిజూచినగుండె దిగులెక్కెన ♦ మానునేయుటగాన మర్దింతుదీని
ననుచుండ గర్జన మాకసంబగల ♦ జనుదెంచిపదధూళి సకలంబుగప్ప
నలిమీఱిఘోర దానవురాలురాలు కలగొనగురియ రాఘవుడుకోపించి
యనుపమాస్త్రంబున నమ్మహాశిలలు దునుమాడిదానిచేతులుద్రుంచివైచ
నప్పుడులక్ష్మణుం డసురేశుచేలియ ♦ కప్పాటుగావితు ననియున్నకరణి
ముక్కునుజెవులును మొదల టగోసె ♦ నక్కామరూపిణి యక్కజ బొదవ
మాయలుధరియించిమరియుబెక్కమ్ము ♦ లాయింతిగురియవిశ్వామిత్రుడనియె
ననఘసంధ్యాకాలమగుచున్నదియు ♦ దనుజులనెందుసంధ్యలగెల్వరాదు
నీవింకగృపమాని నెలకొనిదీని ♦ నీవిశ్వహితముగా నిటచంపుమనుడు
గాధేయమునిమాట గడపకశబ్ద ♦ వేదిబాణముల నవ్వేడమాయలడచి
పెడపెడనార్చుచు బిడుగుచందమున ♦ నడతెంచుచున్న దానవినిరీక్షించి
మహితాస్త్రమొకటిచన్నాననాటసేయ ♦ బహురక్తధారలుపర్వనావనిత
యసురశిఖారంభ మందదిరాము నొసగెనోశరముల కుపహారమనగ [లి
బ్రళయమారుతమునబగిలిసంధ్యాభ్ర ♦ మిలగూలుతెరగుననిలగూలెనూ
యప్పుడానందించె నఖిలభూతములు ♦ నప్పుడానందించిరమరులుమునులు
ఆరాముదీవించి యాలింగనంబు ♦ గారవంబునజేసె గౌశికుడంత
దేవగంధర్వాది దివిజులుగొలువ ♦ దేవేంద్రుడచటికి నేతెంచి శ్రీరామ

దేవునిగాంచి ప్రార్థించిపూజించి ♦ దేవవిధేయుగా ధీమునీక్షించి
మమ్మురక్షింప నిమ్మహిబుట్టినట్టి ♦ యిమ్మహామహునకు నిమ్ము కృశాశ్వ
సంతానమైనయస్త్రములు శస్త్రములు ♦ నంత మునని చెప్పియరిగినదిశకి
నినుకంత గు క వయ్యెడనురాముంకి ♦ మునిమచురాముని ప్రేమజేరి
* శ్రీరాములకుభృశాశ్వసంతానములైనయస్త్రశస్త్రములనిచ్చుట *
రామనీవిక్రమ రణకేళి మాచి ♦ యేము మెచ్చితిమిప్పనీకిచ్చెదమింక
నమరోరగా సురయక్షయుద్ధముల ♦ సమధికమగునస్త్రశస్త్రంబులనుచు
దన శుద్ధిలోడ సుస్థిలిని కూర్చుండి ♦ మునిపతిరాము ప్రాఙ్ముఖుని గావించి
యమలమనస్కుడై యఖిలంబుదలంచి ♦ క్రమమునదండచక్రంబునుధర్మ
చక్రంబుమఱికాల చక్రంబువిష్ణు ♦ చక్రంబుశక్రు వజ్రంబునునసియు
బాశిపాశము ధర్మపాశంబుకాల ♦ పాశంబునీశాను భయదశూలంబు
నాగిశక్తియుగ్మంబు నక్రమైమిగుల ♦ నెగడునుస్థాను ష్ణునిర్మితాశనులు
కంకాలమున ఘోరకరవాలమునల ♦ కంకణాఖ్యంబులు గ్రొంచబాణంబు
బ్రాహ్మంబు తేజప్రభంబునైంద్రంబు ♦ బ్రహ్మశిరంబును బ్రస్థాపనంబు
నారయణంబుపై నాకంబుశిఖర ♦ దారుణశౌర్య సుదామనంబులును
బ్రశమనమును విలాపనముసత్వంబు ♦ విశదప్రభలబాల్చు విద్యాధరంబు
వాయవ్యసౌమన వరాస్త్రముల న ♦ మాయాధరాస్త్రంబు మానవమన న
సౌమనసహరుద సంతాపనముఖ ♦ తాపకమానసల దర్పకాస్త్రములు
కాయశిరంబును మాయులడరించిచాల ♦

జయమిచ్చుగాంధర్వ సంమోహనములు
సారిదినైష్టిక మునుశోణితాఖ్యంబు ♦ నరుదుగనాగ్నేయమనుసాయకంబు
గరుడబాణంబును గాబేరశరము ♦ నారసింహాస్త్రంబు నాగబాణంబు
రౌద్రబాణంబును రాక్షసాస్త్రంబు ♦ భద్రప్రదంబైన పాశుపతాస్త్రి
మొగిక త్రరీచక్రములునుమేఘాస్త్రి ♦ మగణితంబైనట్టియస్త్రజాలముల
నఖలదారుణమైన యమరమోదకియు ♦ సిఖమునదగు నుల్లసిల్లుగదఖడ్గ
వామనపైశాచ వాయవ్యశస్త్ర ♦ సోమసౌమ్యాఖ్యాన సంవర్తనములు
సామంబుమథనంబుసంతాపనంబు ♦ తామసంబునజగదాస్త్రిదారుణము
కంకోలకాహల కరవాలముసల ♦ కింకిణల్ మొదలుగాగిలితాస్త్రిముల
నెలమినిచ్చినదాని నెల్లగైకొనుచు ♦ నలరిరాముండమ్మహాత్ముజూచి
మునినాథసకలాస్త్రిములుభవత్కరుణ ♦ గనికృతార్థుడనై తిగావునవింక
నలలితంబుగనుపసంహారణాస్త్రి ♦ ములనొసంగుమటన్న ముదమంది యతడు
సత్యవంతమురభసముపరాఙ్ముఖము ♦ సత్యకీర్తియుదశాక్షమునవాఙ్ముఖము

ప్రతిహారతరముమారణమునుశుచియు ♦
శతవక్త్రిదైత్యదృష్టములులక్ష్యములు
గ్రశనంబు కరవీరకరిసత్యకీర్తి ♦ దశశీర్షమునుశతోదరముజ్యోతిషము[ర్వ
విమలంబుమకరంబువిరుచినిష్కలిము ♦ ప్రమథనంబును సునాభంబునుస
నాభంబుమరిఖండునాభంబుపద్మనాభంబుదృఢనాభనైరాశ్యములును
గామరూపంబు యౌగంధరవరణ ♦ సౌమనమువినిద్ర సంధానములును
మోహనవిషమాక్షములుమహానాభబాహువిభూతిజృంభకములుధాన్య
ధనువులువృత్తవంతమురుచిరంబు ♦ నెనయసార్చిర్మాలి ధృతిమాలియనగ
గామరూపంబులుగ మహాస్త్రములు ♦భూమీశునకుజెప్పిపొల్పారమరియు
నివియునుగాక యనేకశస్త్రాస్త్ర ♦ నివహముల్రఘువంశనేతకునొసగి
తత్ప్రభావంబులుతన్మంత్రములును ♦దత్ప్రయోగంబులుఁదదుపసంహృతులు
వి సిల్లుశస్త్రాస్త్రవిద్యారహస్యములుసర్వమును దెల్పమొగిరాము నెదుట
నంగారసదృశంబులై కొన్ని ఘోర-భంగులధూమ్రనిభంబులై కొన్ని
అనుపమదీప్తి రమ్యంబులై కొన్ని ♦తనరారుబహుదివ్యతనువులై కొన్ని
పరువడిచంద్రప్రభంబులై కొన్ని ♦ పరికంపభాను దీప్తంబులై కొన్ని
బహుళాంధకార విభ్రమములై కొన్ని ♦మహిటాట్టహాసభీమంబులై కొన్ని
యకలంకమూర్తు లిట్లమరనేతెంచి ♦ ముకుళితకరయుగ్మములతోడనిలిచి
యేకార్యమొనరింతు మేమిటబనుపు ♦ మాకేమియానతి మనుజలోకేశ
యనుడునేవలచినయప్పుడేమీరు ♦ చనుదెండుపొండన్నసకలశస్త్రములు
వలగొనిమ్రొక్కియవ్వసుమతీపతకి ♦ నెలమితోమ్రొక్కుచునేగెనంతటను
మునినాథుజూచి కేల్మోగిచిరాఘవుడు ♦వినయంబుభక్తియువిశ్వాసమెసగ
ననఘకృతార్థుడనైతినీకరుణ ♦ ననివినుతించి విశ్వామిత్రువెంట [డు
నరుగుచోనటవామనాశ్రమభూమి ♦కగ మొప్పటయుజూచి కాకుత్స్థకులు
ఈపర్వతముచెంత నిదియొక్కవనము ♦చూపులకిపారిసాంపులనలరి [చు
పొలుచునానామృగంబులుగలధ్వనులుగలపక్షిమృగములుగలిగిచెన్నగు
నున్నదీయాశ్రమంబోసంయమీంద్ర ♦యెవ్వనెవ్వరిదియిన్నెల్లజంతువులు
సుఖులైయున్నవి చూడనిక్కడికి ♦ నిఖిలజ్ఞయెక్కడ నీయజ్ఞభూమి
యెటయుండిచనుదెన్తురేచిరాక్షసులు చటులోద్ధతులునీదుజన్నంబు చెఱుప
యాగరక్షణముగా నఖిలరాక్షసుల ♦ వేగంబెవిర్జింతు విశిఖాళిననిన
నకౌశికుడు జగదభిరాముగాము ♦ జెక్కిలివుణికి సుస్నేహుడైపలికె
ననఘునీవెఱుగని యర్థంబుగలదె ♦వినుమునాచే విన వేడుకనియే [చట
మునువిష్ణుదేవుండు ముదముతోదపము ♦గొనకొనికావించుకొఱకునై యి

యుగములనేకంబులుండగాననఘ♦మగునాశ్రమం బండ్రుమఱిదీని

—*: శ్రీరాములకు కౌశికుడు ఆశ్రమాదుల నెఱింగించుట :*—

మరియును సిద్ధాశ్రమంబుననగ ♦ వరలునీయాశ్రమ వనములోకముల
జననాథబలి విరోచనుతనూజుండు ♦ ఘనరాజ్యపదమున గర్వంబుమిగిలి
యేచిమఖుత్తుల నింద్రాదిసురల ♦ వేచికారింపంగ విబుధులుమునులు
నీయాశ్రమంబునకే తెంచి మ్రొక్కి ♦ తోయజనాభునితోడఁ దామనిరి
శరణాగతప్రియ శరణులోకేశ ♦ సరసిజోదర మాకు శరణంబునీవ
పన్నగామమ్మేచు బలియనువాఁడు ♦ చెన్నొందఁజన్నంబు సేయుచున్నాడు
అవ్వారిదానన యజ్ఞవాటమున ♦ నెవ్వరేమడిగిన నిచ్చుచున్నాఁడు
క్రతువుదీఱకమున్న కావింపుమాకు ♦ హితమంచు బ్రార్థింప నెల్ల దేవతలు
నాసమయంబున నదితియుఁగూడ ♦ భాసురవ్రతనిష్ఠఁబరఁగుకశ్యపుఁడు
ఇమ్ములదపము వెయ్యేడులు సేయ ♦ సమ్మదంబునవిష్ణు సాక్షాత్కరించె
నీమహాతనువున నిఖిలలోకములు ♦ సోమార్కలోచన చూపుము మాకు
నాద్యంతరహితుండ వగునిన్ను వేద ♦ వేద్యునిశరణంబు వేఁడెదమనిన
గరుణనావిష్ణుండు కశ్యపుజూచి ♦ వరమునీకిచ్చెద వాంఛితంబేది
యడుగుమునీయన్న నలరికశ్యపుడు ♦ కడుభక్తితోగర కమలముల్మోగిచి
యతిబలోద్ధతినాకు నదితికినీవు ♦ సుతుఁడవై జన్మించి సురలరక్షింపు
మిదికోర్కెనాకుననీ దేవతలకు ♦ మదిలోనమన్నింపు మమ్మునందఱను
అనవుడునావిష్ణువదితి గర్భమున ♦ వనపమంబగు తేజ మలరజన్మించి
వామనత్వముదాల్చివచ్చియద్దనుజ ♦ భూమిమూడడుగులు పొసగంగనడిగి
రెండడుగులనేధరిత్రియు దివియు ♦ దండిమైగొలిచి యానన్యబంధించి
లోలతనీమూడు లోకములెల్లయ ♦ నేలుమునీవంచు నింద్రునకిచ్చె
నదిగాననిదివామనాశ్రమం బండ్రు ♦ ఇదియమాయాశ్రమంబీపుణ్యభూమి
సిద్ధించునిటు దపస్సిద్ధులుగాన ♦ సిద్ధాశ్రమంబునా జెల్లునెల్లెడల
నీవెవామనుడవై నెగడిత్రివిక్ర ♦ మావతారముదాల్చి నట్టివిష్ణుఁడవు
నాడుననిదినీవనంబు శ్రీరామ ♦ నేఁడుననారీతి నీవనంబయ్యె
ననుచుగౌశికుండు నిజాశ్రమంబునకు జనియందురామలక్ష్మణులబూజించె
నచ్చటమునిజనం బంతయుగొంత ♦ ముచ్చటదీఱ రామునిఁబూజసేసె
నంతరాఘవుడు విశ్వామిత్రుజూచి ♦ సంతసంబున మునీశ్వర నేఁడుమీరు
యాగదీక్షకుఁజొరుం డనుమానముడిగి ♦ యాగశత్రులనెల్ల నడచెదనేను
అనినవిశ్వామిత్రుడంత హర్షించి ♦ మునులరప్పించి యిమ్ముగదీక్షవడసి
యాగవేదులమునులర్థిఁగావింప ♦ యాగాంగములబూర్ణమయి వేదియొప్పె

నంచితాజ్యాహుతు లందందుఁదోరుఁగ
    మించియగ్నులు మండిమింటికిఁ బ్రాఁక
హోమాగ్నిఁ బ్రభవించుచున్నతధ్వనులు ♦ సామాది వేదప్రసన్న ఘోషములు
నాతతదేవతాహ్వాన నాదములు ♦ హోతలపుణ్య మంత్రోపనాదములు
దిక్కులన్నియు నిండి తివిరి ఘోషింప ♦ నక్కజమయి యాగ మటు చెల్లుచుండ
రామభద్రుండు ధనుర్ధరుఁడునై మైత్రి ♦ సౌమిత్రియును దానుఁ జాగరూకతను
రక్కసుల్వచ్చుమార్గము మున్నెఱింగి యక్కౌశికునిమానినైయున్నవాని
విశ్వమాతయుదమోవృతముగాకుండ శాశ్వతధృతిఁ గాంచుచ ద్రాక్షులనఁగ
గాచిరి కంటికిఁ గనుఱెప్పకరణి ♦ నేచినభక్తి నయ్యెడ నైదునాళ్ళు
నలవుమైఁ గవగూడి యాఱవనాఁడు ♦ బలిమి మారీచ సుబాహులేతెంచి
మేలిఖడ్గద్యుతుల్మెఱుఁగులుగాఁగ ♦ గాలుకాలాంబుదోత్కరములోయనఁగ
దళములు దారునుద్భటవృత్తి మింట ♦ నిలిచి గర్జనములు నిగుడించి మించి
వనలకయ్యజ్ఞ వాటంబులోన ♦ మదమున నుప్పొంగి మాంసరక్తములు
గుదియుచో హోతల కోలాహలంబు ♦ గరిమ సదస్యుల కలకలధ్వనియు
బరిచారకుల దీన భాషణధ్వనియు ♦ బరికించి విని రామభద్రుండు పొంగి
లక్ష్మణా చూడు నాలావంచు విజయ ♦ లక్ష్మిధనుర్ఘోషలక్షణం బెసఁగ
నెలకొని వినువీధి నిజదృష్టి నిలిపి ♦ బలువడి వాయవ్య బాణమేయుటయు
నురువడి మారీచు నువ్వెత్తుగాఁగ ♦ సరభసవృత్తిమై శతయోజనములు
గొనిపోయి యరిమురి క్రూరరాక్షసుని ♦ వనధిలోపల బాఱవైచె నాశరము
అడరి వజ్రమునకు నళికి యంబోధి ♦ బడినమైనాకమై బడినయయ్యసుర
యొకరీతి దరిచేరి యుగ్రాంశుకులుని ♦ యకలంకవిక్రమ బంధ దపాగడి
దనుజుల బాసి యాతతనిష్ఠతోడ ♦ ననయంబు నాసు చంద్రార్కనుభూమి
శూరత విడిచి యా సురవృత్తి నడచి ♦ కోరిదపంబు సేయుచునుండె నంత
అతిమతి రఘురాముఁ డగ్ని బాణమున ♦ నుఱక సుబాహుని యురమేసి చంపె
దక్కిన రాక్షస దళముల నొకట ♦ చక్కమానవ శరమహాత్మ్యమున
సుకలు మోదించి యచ్చోఁ బుష్పవృష్టి ♦ కురిసిరి మునికోటి గొనియాడె నతని
నతనిష్ఠ వెలయు విశ్వామిత్రుఁ డంత ♦ క్రతుకర్మమంతయుఁ గడ తేర్చి వచ్చి
నెలకొని రఘురామ నీ ప్రసాదమున ♦ గలఁక చెల్లింపఁ గంటిని క్రతువు
ననికృతార్థుఁడనైతి ననికౌఁగిలించి ♦ వినుతించి రాము దీవించి హర్షించి
యనఘమానసుఁడు విశ్వామిత్రవరుఁడు ♦ అనురాగమును బొల్గి యచ్చోట దాను
భూవరులా రాత్రి బుచ్చి యచ్చోట ♦ వేవిన పూర్వాహ్ణ విధులాచరించి
మునులకుఁ బ్రణమిల్లి మునులతో గాధి ♦ తనయుని గనుగొని తాపసప్రవర

యింక నెయ్యది కార్య మెరుగింపు నీకు ♦ గిరికరుల మునీంద్రు కృపకు పాత్రులము
అనిన నచ్చటి మౌను లందరు గాధి ♦ తనయు మున్నిడుకొని తా మిట్టు లనిరి
జలజాప్తకులవర్య జనకభూవిభుడు ♦ చెలువొప్ప జన్నంబు సేయుచున్నాడు
మనమందఱ బోదము మనుజేశునింట ♦ త్రిణయను పాటించు దివ్యకార్ముకము
గంధాదిపూజల గరము నొప్పదేవ ♦ గంధర్వయక్ష రాక్షస వీరవరులు

—:* రాముడు మిథిలానగరము నకుఁబోవ మునులు ప్రేరేపించుట *:—

మొదలయినవారికి మున్న నేరులకు ♦ నదియెత్త నెక్కడ నలవిగాకుండు
జననాథ యా శరాసనలాభంబు ♦ జనకుని జన్నంబు చనుజూడ నీకు
ననుచు విశ్వామిత్రు డాదిగా సకల ♦ మునులు నాపీగోత్తములు దాశరథుల
లలితపుణ్యుల మిథిలాపురంబునకు ♦ జెలువార బయనంబు సేసి సమ్మదము
నొంది భాగీరథీ యుత్తరతటము ♦ జెంద హిమాద్రియు సిద్ధాశ్రమంబు
వలపటనిడియుత్త వల్లభుదిశకు ♦ నలుపార బొందిన భూరిమార్గమున [న
మూడుయోజనములు మూడుజాములకు ♦ నాడేగి యటశోణనదముతీరము
విడిసి తీర్థస్నాన విహితకర్మములు ♦ నడిపి రమ్యస్థలి నరనాథసుతులు
సంతోషమున మునీశ్వరులతోనుండి ♦ యంత కౌశికు జూచి యారాముడనియె
గరము ప్రజావృద్ధి గలుగు నీదేశ ♦ మయ్య యెవ్వరిదేశ మానతిండనిన [డు
భూనాథ విను బ్రహ్మపుత్రుండు కుశుడు ♦ నా నొక్క మునిమహోన్నతకీర్తిగల
అతడు సువైదర్భి యను నింతివలన ♦ సుతుల నల్వుర గాంచె సురుచిరాకృతుల
బ్రశమితాత్మ ధూర్తరజసు గుశాంబు ♦ గుశనాభు వసువు నక్కుమరు మిగిలి
యనివార్యశౌర్యులై యనుపమాతిల ♦ దనరు మహాక్షత్రధర్మంబు నడుప
గొడుకుల చరితంబు గుణములు జూచి ♦ యడరు సంతసమున నా కుశుం డనియె
నీ ప్రజాపాలనంబె మీ గావింపు ♦ డలఘుకీర్తులు గల్గు ననముద మంది
కౌశలంబున నొప్పు నా గుశాంబుండు ♦ కౌశాంబి యనుపేర గావించె బురము
దశరథాత్మజ మహోదయ మను పురము ♦ కుశనాభు డొనరించె గుశలుడై ధరణి
శూరుండు ధూర్తరజుండు నిర్మించె ♦ నారంగ బురము ధర్మారణ్యమనగ
వసువు నిమ్ముల గిరివ్రజమను పేర ♦ బసదుగ నిర్మించె బట్టణం బొకటి
యిది ప్రీతి సవ్వసుడేలు దేశంబు ♦ ముదమంది గిరులైదు ముందర నొప్పె
నానగమధ్యంబు నందును మాగ ♦ ధా నామమున నొక తటిని చెన్నొందు
జాలనమ్మగధ దేశంబెల్ల వసువు ♦ పాలించుచుండును బరమధర్మమున
నచ్చెరువడరంగ నా కుశనాభు ♦ డచ్చరలేమ ఘృతాచి యందెలమి
గన్నులు మరునంపగములు నా నొప్పు ♦ కన్నెల నూర్వుర గడురూపవతుల
గనియె నత్తరుణుల కమనీయకాంతి ♦ వినుతయౌవనకళా విస్ఫూర్తులమర

మంజీరమేఖలా మధురనాచాల♦మంజులకంకణ మధురశింజితములు
కరమొప్పగాదాళ గతులనగూడి♦మొరయలీలా లాస్యములుసల్పువారు
మురిపెంబు లింపార మొగిమృదఙ్గాది♦వరవాద్యములువేడ్క వాయించువారు
పాణిపల్లవముల స్ఫారితలీల♦వీణ మృదుక్వాణ వితతంబుగాగ
మాకందమంజుల మధుపానమత్త♦కోకిలధ్వనికూడుకొని పాడువారు
నగుచునుద్యానంబు నందుగ్రీడింప♦దగిలియాచెలువల దప్పకచూచి
కామాంధుడై సర్వగతుడైన పవను♦డామానినులజూచి యర్థితోబలికె
నన్నువరింపు నలినాక్షులార ♦ చెన్నారనమరత్వ సిద్ధిగైకొనుడు
ఎన్నడుజరలేం మెలజవ్వనంబు♦నున్నతయశముమీ కొప్పారగలుగు
ననిననల్లననవ్వి యనిలుందునఖల♦జనహృదయంబుల జరియింతువీవు
నేనెరుంగుదుమమ్ము నీమహత్వంబు♦భావింపకదియేమి పలికెదనకట
నియతుడై వర్తించు నిర్మలధర్మ♦నయశీలుడగు కుశనాభుకూతులము
ఓడకమాతండ్రి యుండమాయంత♦గూడుటయటుసేయ గులహానిగాదె
యిరవారమాతండ్రి యెవ్వరికిచ్చు ♦ బరికింపనాతడు పతిమాకునవిన
బవనుడుకోపంబు పట్టలేకప్పు♦డవయవంబుల జొచ్చి యాతలోదరుల
గుదియంగదిగిచి గుబ్జలైతండ్రి♦కడియెల్ల నెఱిగింప నందరువచ్చి
విన్ననై పదవార విదమ్ముల్వ్రాంచి♦సన్నిధినిల్చి బాష్పములునించుటయు
గుశనాభుడప్పుడా కూతులకైన♦కశచూచి వెఱగంది తావారికనియె
నిట్టిరూపములు మీకేలనాగలార♦యెట్టుగాబాటిల్లె నెవడిట్టుసేసె
మీకేలపలుకరు మీరింతకేమి♦ కారణంబనవుడు గరములుమోగిచి
తమతండ్రితోడనాథవళాక్షులనిరి♦మముజూచి పవనుండుమానంబువిడిచి
నన్నువరింపుడు నలినాక్షులార♦యన్ననామాటకు నొగాకయనక
మాతండ్రినడుగు మీమాటనీవనిన♦నాతండు కామాంధుడై యల్గిమమ్ము
గుబ్జలగాజేసె క్రూరాత్ముడనిన♦నబ్జలోచనలతో నాతడిట్లనియె
తగవునుధర్మంబు దలపోసిమీరు ♦ తగదనిశీలంబు దాటనోడితిరి
కన్నియలారమీ గౌరవంబుననుష♦నన్నుతసత్కీర్తి నొందెనాకులము
దేవతావిషయమై తెగియొల్లరైతి ♦ రీనిధిమీరుసహించుటే లెస్స [యును
క్షమయెసత్యంబును క్షమయెశీలతయు♦క్షమయెతపంబును క్షమయెకీర్తి

—:* విశ్వామిత్రుడు తనవంశక్రమంబు దెల్పుట *:—

క్షమయధర్మంబును క్షమయశోకంబు♦సమరంగరక్షించు నవివిచారించి
తనమంత్రివరులతో దలపోసిచూచి ♦
యనఘాత్ముడగుచూడి యనుమునీంద్రునకు

దనుజన్ముఁడగుణోత్తరు బ్రహ్మదత్తు ♦ డనువాని రప్పించియమ్మహాత్మునకు
ధర్మపత్నులుగాఁగ దనదుకన్నియల ♦ నిర్మలబుద్ధిమై నెమ్మినిచ్చుటయు
చూడిపుత్రుడు వారిజూచి గ్రైకొనఁగ ♦ వీడెవానూర్వ్యరవికృతిరూపములు
అవనీశయది మొదలాపురోత్తమము ♦ అవనిఁగన్యాకుబ్జ మను పేరబరఁగ
నాకుశనాభుండు నప్పుడొప్పారు ♦ నాకృతుల్గలతనయుల గను గొనుచు
నలరియాకూతుల నల్లునిననిచి ♦ యెలమిమై పుత్రకామేష్టిగావింప
గొడుకై నకుశనాభు గుశుడువీక్షించి ♦ బడసెదుపుత్రుని బరమధర్మాత్ము
వినుతనిర్మలకీర్తి విఖ్యాతుగాధి ♦ యను పేరుగల పుణ్యునని యెఱిఁగించి
పరమప్రియంబున బ్రహ్మలోకమున ♦ కరిగెనాకునుమన్మడై పుట్టిగాధి
దశరథాత్మజగాధి తనయుండనేను ♦ కుశవంశమునఁ గౌశికుండండ్రునన్ను
మతిధర్మనిష్ఠమాయక్క–సత్య ♦ వతిభక్తిమై సురేశ్వరలోకమునకు
వేడుకదనప్రాణ విభుఁడైనరుచికు ♦ తోడశరీరంబు తోడఁదానరిగి
యీలోకమునలోకహితమాచరింప ♦ బ్రాలేయపర్వత ప్రాంతదేశమున
నదిఁగౌశికీనామనదియయ్యెఁదాను ♦ వెలయునన్నదిచెంత విహరింతునేను
సిద్ధాశ్రమమునఁ బ్రవేశించినకతన ♦ సిద్ధబుగాఁ దపస్సిద్ధుండనైతి
నాటినుండియునుదీయన్వయస్థితియు ♦ నీదేశవిధమును నేర్పడవింటి
నడురాత్రియరుదెంచె నరలోకనాథ ♦ కడుడస్సినాఁడవు కనుమోడ్తుగాక
చలియింపకున్నవి సకలవృక్షములు ♦

మెలఁగవువనమున మృగసమూహములు
నెరివిహంగంబులు నీడముల్చేరి ♦ మరిచియున్నవి తమమంజులధ్వనులు
యామినీచరులైన యక్షరాక్షసులు ♦ భూమివిచ్చలవిడిఁ బరిచరించెదరు
దీటుఁకచీకటి దెసలునాకసము ♦ కాటుకబూసిన కరణినున్నదియు
నీలాంబరంబున నిండుముత్తెములు ♦ గీలించిబ్రహ్మాండ గేహగోళమున
గడునొప్పుగామేలు కట్లిత్తినట్లు ♦ యుడుగుణంబులతోడ నున్నదినింగి
యడరంగజనులకునానందమొంద ♦ నుడురాజుపొడతెంచుచున్నాడటన్న
నామాటలకుమెచ్చి యఖిలసంయములు ♦

నామునీంద్రునితోడ ననిరప్పుడలరి
నెఱయనీవంశంబునిర్మలంబనఘ ♦ గురిలేనిమహిమ నీకులమువారెల్ల
బ్రహ్మసమానులు పరికింపనీదు ♦ బ్రహ్మవర్చసమును బరికింపనొప్పు
ననినవిశ్వామిత్రుడమ్మునీశ్వరుల ♦ వినుతించెనంత నావిభులుసంయములు
నారాత్రినిద్రింప నాప్రభాతమున ♦ నాఋషిపుంగవు లాగాధిసుతుడు
జననాథనిద్రయు జాలింపుమనిన ♦ విని లేచిబూర్వాహ్ణ విధులాచరించి

కౌశికుఁజూచియు గాధమైమూఁడ ♦ నీశోణనదరత్న మింతయొప్పగునె
యాకర్ణమీనంబు నతిరమణీయ ♦ సైకతంబును సుప్రసన్నతోయంబు
పరిచితహారితాది పక్షిసంఘమ్ము ♦ తరుణనీలోత్పల త్తరళతరంగ
మైయున్నదీయేరు ననఘాత్మకమన ♦ మేయెడదాటెద మెత్తెఱఁగనిన
దరుచుగామును లెల్ల దాటెదుమార్గ ♦ మెరిగిబోదమటంచు నెడదవ్వుపోవ
గలహంససారస కారండవాది ♦ జలపక్షిరవములు సరిరమ్ముబిలుచు
విధమున జెలగంగ నీనులింపార ♦ నధిపుడాలించి మధ్యాహ్నకాలమున
సిద్ధమునీంద్రసం సేవ్యతీరమును ♦ శుద్ధపుణ్యోదక సుప్రవాహమును
గలిగినదీతిలకంబై ధరిత్రి ♦ నలుపారు జాహ్నవిబొడగాంచి మ్రొక్కి
గాధేయుచూడన గాధమైతోచు ♦ కాధునీరత్నంబు నటదాటిబోవ
దెరువింక నెయ్యది దెప్పవేయనిన ♦ నరనాథయటశోణ నద ముత్తరించి
మొగిమూడుయోజనమ్ములు దాఁటిపోవ ఁగునమ్మహానదియందాఁకమనకు
తోయఫలాదులు ద్రోవబెక్కనుచు ♦ నాయేరుదాఁటి వారటుపోవుచోట
జెలగుసారసగణ సేవ్యమైపుణ్య ♦ సలిలమైయుత్ఫుల్ల జలజమైమిగుల
ఫేనమైనిత్య గంభీరమైచారు ♦ మీనమైయతిపుణ్య మిళితమై యమరు
గంగాతటంబున ఘనలతాసంఘ ♦ సంగతంబగుసమస్థలమున నిలిచి
మనుజేంద్రతనయులు మాధ్యాహ్నికంబు ♦

లొనరించిముదమంది యుచితభోజ్యముల
నోజమైమునిగోష్టి నొవ్వచున్నంత ♦ రాజన్యతిలకమా రామచంద్రుండు
రాజహంసోద్ధూత రాజీవరేణు ♦ రాజీవరాజిత రంగత్తరంగ
గంగనాలోకించి కౌశికుఁజూచి ♦ గంగయీవసుధ కేక్రమమునవచ్చె
నేతెఱంగునబోయె నిటనాకమునకుఁ ♦ బాతాళమునకు నెబ్భంగిదానరిగె
నేచిపారావార మేగతిఁగొచ్చె ♦ నేచందమువఁబుట్టె నిమ్మహాతటిని
చెప్పవేయనపుడు శ్రీరాముఁజూచి ♦ యప్పుణ్యాత్ముఁడువిశ్వామిత్రుడనియె
గమనీయకాంతులుగఁ రూపవతులు హిమవంతునకుఁ గూతులిరువురుగలరు
అనరులందరుగూడి యాగంబుకొఱకు ♦ హిమవంతువేడియాయిద్దఱిలోన
గురుపుణ్యయగుపెద్ద కూతురిగంగ ♦ నరుదారకొనిపోయిరట నాకమునకు
నటమీదపార్వతీ యనుపిన్నకూతు ♦ బటుతపోనిష్ఠతో బరితృప్తుడైన
ఫాలలోచనునకుఁ బత్నిగానిచ్చె ♦ నాలోలలోచన నాసగాధిపుడు
సురుచిరరుచిగంగ సురలోకమునకు ♦ నరిగితాసురనది యనుపేరబరగ

—:* కౌశికుడు కుమారస్వామి జననము దెల్పుట *:—

ననిచెప్పిమునినాథుడవనీశుచూచి ♦ వినుమువృత్తాంతంబు వెండియునొకటి

పార్వతివరియించి పరమానురక్తి ♦ సార్వకాలంబును జంద్రశేఖరుడు
అతిలోకగతిలోలుడై దివ్యవర్ష ♦ శతముదారతికేళి సలుపుచున్నడను
కమలాసనుండాదిగా సర్వసురలు ♦ దమలోననెంతయు దారుచింతించి
వెలయునీయిరువుర విషయతేజంబు ♦ దలపనెవ్వరికైన ధరియింపవశమె
యనుచునందఱు నమ్మహాదేవుకడకుఁ ♦ జనుదెంచివినతులై సద్భక్తితోడ
దేవదేవమహేశ దేవసర్వేశ ♦ దేవనిస్తారకదేవ నీమహిమ
సర్వగీర్వాణులు సన్నుతించెదరు ♦ సర్వజ్ఞమాకు బ్రసన్నుండవగుమ
యేపారనీతేజ మెవ్వరుదాల్ప ♦ నోపుదురటుగాన నుడుగుమీవిధము
కరుణదపోవృత్తి గైకొనిమీరు ♦ సరిబ్రహ్మచర్యంబు చరియింపవలయు
ననవుడునౌఁగాక యనుచునాసురలు ♦ గనుగొనిముదముతో గౌరీశుడనియె
జనియించెనిదె నిజస్థానంబువలన ♦ నెలకొనిమీలోన నిర్జరులార
యెవ్వరుదాల్చెద రీతేజమనిన ♦ నివ్వసుంధర దాల్చు నింపారననిరి [ము
మారుఁడునాసురలతోఁ నౌఁగాకయనుచు ♦ ధరణిపై గావించెదద్వ్యోమకేశు
దివిజులయ్యెడ నగ్నిదేవునీక్షించి ♦ పవనునితోఁగూడి పావకనీవు
యిలమీదబడియున్న యిమ్మహాతేజ ♦ మెలమిఁబ్రవేశింపుమింపారననిన
బవనసఖుండు నబ్భంగిఁగావింప ♦ నవనిపై శ్వేతాద్రి యనగడుఁనొప్పె
నరయనాశైలంబు నందుఁగుమారుఁ ♦ డరుదారజన్మించెనతని తేజమున
జననప్రదేశంబు శరవణంబగుట ♦ జననాథయతఁడొప్పె శరజన్ముఁడగుచు
నిలకృత్తికలు చన్నులిచ్చుటఁజేసి ♦ యలరుచుగార్తికేయాఖ్యజెన్నొందె
నారయనమ్మాత లాఱ్వురుగాన ♦ వారుసంతోషింప వదనంబులాఱు
ధరియించిరముచితస్తన్యపానంబు ♦ సరినొప్పజేయుట షణ్ముఖుండయ్యె
దరుణేందుమౌళి రేతస్కంధమునను ♦

నరుదారగా స్కంధుఁ డనఁనొప్పెనంత
బరువడిదముసురల్ ప్రణుతింపనెఱిఁగి ♦ గిరిపుత్రికన్నులఁ గెంపరఁజూచి
సురలారసంతానశూన్యతమీకు ♦ ధరణికిగానిమ్ము ధరణికినింక
బహునాయకత్వంబు పాటిల్లనిమ్ము ♦ బహువిధంబుల నవిపలికెగోపించి
కలగిరిసురలంత గౌరీశాపము ♦ సలువహేమాద్రిక జనియెనీశ్వరుడు
అమరేంద్రుఁడాదిగా నఖిలదేవతలు ♦ కమలసంభవుఁడున్న కడకుదానేగి
జలజసంభవభుజా సత్వసంపన్ను ♦ నెలమిసేనాపతి నిమ్ముమాకనిన
వారిజగర్భుండు వారినీక్షించి ♦ గౌరీశసుతుడైన కార్తికేయుండు
సేనాధిపత్యంబు సేయుమీకనిః ♦ నానిలింపులువేడ్క నౌఁగాకయనుచుఁ
జేకొననాతఁడుఁ సేనానియయ్యె ♦ నాకనాయకున కున్నతిసౌఖ్యమెసఁగ

ననిపల్క రఘురాముఁడధికసంతోష ♦ మునుబొంది మఱియు నమ్మునినాథుఁ జూచి
యీమహానదిసంయ మీశ్వర త్రిపథ-గామినియగు టేమి, కారణంబనిన
ననఘుఁడు కౌశికుఁ డా రాముఁ జూచి ♦ వినుమని యాకథ వివరింపఁదొడఁగె
ననఘుఁడయోధ్యకు నధిపుఁడై సగరుఁ- డను చక్రవర్తి యుద్ధతకీర్తిగలఁడు
హిమవంతమున నాతఁడిచ్ఛలో సుతులఁదమకించి భృగుఁగూర్చి తపమాచరింప
నంతనాభృగుఁడును నాతపంబునకు ♦ సంతుష్టహృదయుఁడై సగరునీక్షించి
పృథివీశ కొడుకులు పెక్కండ్రు నీకు ♦ ప్రథితోరుకీర్తులు పరఁగఁ బుట్టెదరు
అంచితకీర్తిని నతివలందొకతె ♦ గాంచు నొక్కని వంశకరుఁడైన పుత్త్రు
మఱియొక్క సతి గాంచు మానుగా సుతుల ♦ నఱువదివేవుర నతుల విక్రముల
ననివరంబిచ్చిన నారాజసతులు ♦ వినికరంబులు మోడ్చి వినయంబుతోడ
మునినాథునకు మ్రొక్కి ముదమందు నొక్క

తనయుఁడే సతికన్న తనయులే సతికి

ననవుడు మీకోరినట్ల యెపుత్త్రి ♦ జననంబులనిపల్క సంతోషమంది
యుదగ్రమహిషి వి జాన్వయరుచిర ♦ నందను నొక్కని నరనాథుఁ గోరె
మఱికోరె నాయున్న మగువ యుసుతుల ♦ నఱువదివేవుర నధికమోదమున
సగరుండు భృగునకు సతులతోఁగూడ ♦ నొగి బ్రదక్షిణమంతనొనరించి ప్రీతి
బురమున కేతెంచి పాలుపారనంత ♦ గరము వేడుకఁ గొంత కాలంబుచనఁగ
మానుగాదనయగ్ర మహిషి కేశినియు ♦ సూనుని నసమంజసుండను వాని
గనియె నా సుకృతియు గాంతకు బుట్టె ♦ ఘనతరంబైనట్టి గర్భతుంబంబు
కరుకైన యా సొరకాయలో బుట్టి ♦ నఱువది వేవు రత్యద్భుతలీల
నంతదాదులు వారి నాజ్యకుండముల ♦ గొంతకాలము పెంపఁగొమరారి వారు
రూపయౌవనముల రూఢిమై బెరిగి ♦ రా పెద్దవాఁడందు నతుఁదర్పమున
వాపోవ దమ్ముల వడి జుట్టిపట్టి ♦ చాపలంబున గట్టి సరయువులోన
వైచిన నవ్వుచు వచ్చినమాగుడ ♦ ద్రోచుచునుండు నా దుష్టాత్ముఁడైన
యసమంజసునకంత నంశుమంతుండు ♦ దెసల దేశంబులు దీపింపఁబుట్టె
నాయసమంజసుం డతిదుష్టచిత్తుఁ ♦ డై యున్న నతనిఁబో నడచియారాజు

—*: శ్రీరాముఁడు సగరుల వృత్తాంతము దెల్పుమనుట :*—

శాశ్వతధర్మనిష్ఠాపరుండగుచు ♦ నశ్వమేధము సేయ ననురక్తిఁదొడఁగె
ననిన గౌశికుఁజూచి యారాముఁడనియె ♦ మునినాథ మావంశముల వారి కథలు
విన వేడ్క పుట్టెడు వివరించి చెప్పు ♦ మనిన విశ్వామిత్రుఁ డనియె రామునకు
విడువక హిమశైల వింధ్యశైలముల ♦ నడుమనా సగరు జన్నంబు వర్తించి
యాగంబు చేరువ నంశుమంతుండు ♦ రాఁ గిల్లి యశ్వంబు రక్షించు నెడను

ననిమిషపతిదైత్యుఁడై ముచ్చిలించి♦కొనిపోయిపాతాళకుహరంబుసొచ్చి
కపిలసంయమిచెంతఁ గడఁకతోఁగట్టి♦యపరిమితానందుఁడై పోయెదివికి
భూపాలుఁడశ్వంబు పోడగానకిచ్చఁ♦ గోపించిమండుచుఁ గొడుకులఁజూచి
యిటకానమశ్వంబు నెవ్వండొవచ్చి♦కుటిలుఁడై ముచ్చిలికొనిపోయెనాఁడు
మూఁడులోకంబులు మునుమిడి వెదకి♦ వాఁడెవ్వఁడైనను వానినిర్జించి
తెండుగుఱ్ఱము వేగఁ దెగునమైఁ గడఁగి♦పొండన్న సాగరుల్ భుజశక్తి మెఱసి
నెఱసి బ్రహ్మాండంబు నిండఁ గర్జించి♦ యరువదివేవురు నాప్రాగ్దిశదలి
యానాకమర్త్యంబు లంతయు వెదకి♦కానక ధరణి వ్రక్కలుసేయఁదొడఁగి
యొక్కొక్కఁడొక్కొక యోజనంబుర్వి♦

నక్కజంబుగఁ ద్రవ్వఁడని యుర్వరించి

పరువడిపూర్వ దిగ్భాగంబుతొడరి♦ధర ప్రదక్షిణముగాఁ ద్రవ్వుదమనుచు
బొరిపొరికుద్దాల భూరిశూలముల♦ ధరరసాతలము సందారఁ ద్రవ్వుచును
బాతాళవాసులఁ బ్రకటసత్వముల♦భూతసంతతులఁ జంపుచు జెలంగుచును
వెసనప్పుడరువది వేలయోజనము♦ లసమునఁ ద్రవ్విరా యసమానబలురు
భూరిసత్వముల జంబూద్వీపమిట్లు♦ వారక తిరిగిరా వడిఁద్రవ్వ బెటిఁగి
యమరగంధర్వ సిద్ధాదులు బెదరి♦ కమలగర్భుం గన్న కడికేగి మ్రొక్కి
వనపర్వతద్వీప వతియైనభూమి♦ చని ద్రవ్వుచున్నారు సగరనందనులు
బలువడిసత్వ సంపన్నంబులైన♦ జలచరంబులఁ బట్టి చంపుచునటియు
వీఁడు యజ్ఞమునకు విఘ్నంబుఁ జేసెఁ♦ వీఁడశ్వహారుడంచు విసువక పట్టి
బలియురై లెమస్పృష్టిఁ బడువారినెల్ల♦జలజసంభవ వృథా చంపుచున్నారు
దలఁచి నీవిది సమాధానంబు సేయ♦వలయునన్నను బ్రహ్మ వారితోననియె
గపిలమునీంద్రుఁడై కైకొన్నవాఁడు♦

తపమునవ్యయుఁడునై దామోదరుండు

అమ్మునికోపాగ్ని యందందవారి♦ గ్రమ్మ భస్మంబుగాఁ గలవారలింక
అనిపల్కసురలెల్ల నేఁగారయనుచు♦ జనిరంత నక్కడ సగరనందనులు
పిడుగులఁబోలెడు భీకరధ్వనుల♦కడు మ్రోయనిల ప్రదక్షిణముగాఁ గలయ
జుట్టును ద్రవ్వియవ్వోటఁ ఘోటకము♦ పట్టుగానక తండ్రి పాలికేతెంచి
యశ్వంబుపోడగాన మఖిలంబు వెదకి♦ యశ్వచోరుని గానమైతిమి దేవ
యేమిమిసేయుదు మిటమీఁదననిన♦భూమీశుఁడలిగి యాపుత్రులకనియె
విశ్వంబుకలగొని వెదకినాయెదుట♦ నశ్వంబు దేకమీరరు దేరవలవ
దనిపల్కనేఁగాక యనుచు నాసగర♦ తనయులుద్ధతి రసాతలమునకరిగి
యలమిశిరఃకంప మలుక గావించి♦ తలకొనియుందంద ధరణికంపింప

బరువడిపూర్వ దిగ్భాగంబుదొడఁగి ♦ ధర బ్రదక్షిణముగా ద్రవ్వుదమంచు
దొరకొనియందరు తూర్పుదిక్కెల్ల ♦ నరసిగుఱ్ఱముగాన కచ్చోటసకల
ధారుణీమండలో ద్ధరణముకుంద ♦ చారుభుజాదండ సమదండ కాండ
చతురగ్రముఁ ధరా చక్రంబు మోప ♦ జతురతగలశుభ్ర సామజేంద్రంబు
బొడగాంచి సంప్రీతిపూజించియచట ♦ దడయక మఱిబృహద్భానుదిక్కునకు
బోయినానావిధంబుల నంకు వెదకి ♦ యాయశ్వరత్నంబు నందు జెప్పడక
సతతదానచ్ఛటా సమ్మదామోదఁ ♦ భృదళిలీముఖపుండరీకాఖ్యగజము
గనుగొనిపూజించి కడవేడ్కతోడ ♦ వినుతించియవ్వల వెదకుచుయామ్య
భాగంబునకునేగి పరికించిహయము ♦ లాగొకింతైనను లక్షింపలేక
ఘనతరత్వము త్రివిక్రమునాక్రమించు ♦ ననిమిచ్చు వామనంబనుదంతిగాంచి
యర్చించియవ్వలి కరిగి నైరృతిని ♦ జర్చించియందు నశ్వముగానలేక [బు
కుముదమార్దవమునఁ గుముదవర్ణమున ♦ గుముదంబు నానొక్క కుంజరేంద్రుం
గనినమస్కారంబు గావించియవల ♦ జనిచనిపశ్చిమాశాప్రదేశమున
శోధించితురగంబు చొప్పింతయైన ♦ సాధింపలేక యంజనశైలమునఁగ
రంజితమదనిర్ఝరంబులుగలిగి ♦ యంజనంబను నేను నచ్చోటఁగాంచి
వివిధసత్కృతులుగావించియామీఁద ♦ బవనుని దెసకేగిబహువిధంబులను
నెమకిగుఱ్ఱముగాన నేరకయచట ♦ నముచిసంహార వారణప్రతిమాన
దంతమయ్యునుబుష్పదంతాఖ్యఁబరగు ♦
దంతినీక్షించి మోదమునఁ బూజించి
యటబాసిచనికుబేరావాంతరమున ♦ దటుకునవరసిసైంధవముగానంగ
లేకయచ్చటనొక్క లేఖాదినాథ ♦ లోకగజాధిప లోకైకసార్వ [క్క
భౌమమోయనసార్వ భౌమాభిధాన ♦ సామజేంద్రముగాంచిసద్భక్తిమ్రొ
సార్వభౌమునిపుత్త్రిసంఘ బుగదలి ♦ శర్వుని దేశకేగుసమయంబు నందు
ననతిదూరమున హుతాగ్నినిఁబోలిఁ ♦
కనఁగవమోడ్చి యేకతనుగూర్చుండి
తననిష్ఠపెంపునఁ దపమాచరించు ♦ ననఘాత్ముఁగపిల మహామునింగాంచి
యతనిచెంగటనున్న హయమువీక్షించి ♦ యతనిభర్జించిన నతఁడుగ్రదృష్టి
నరిమురిసగరుల నలిగిచూచుటయు ♦ నరువదివేవురు నటభస్మమైరి.

—*: అంశుమంతుడు అశ్వరాశ్వము దెచ్చుట :*—

కొడుకులయ్యశ్వంబు గొనరాక చాల ♦ దడసినసగరుండుదాపంబు నొంది
మనుమనినయ్యంశుమంతుబంపుటయు ♦ జనియంశుమంతుడా జాడనేపోయి
యమరేంద్రుదెసవిరూపాక్షుంబుగాంచి ♦ సముచితస్థితిప్రదక్షిణముగా వచ్చి

మాతంగపురగవ మాపినతండ్రు ♦ లేతెంచి రెటుపోయి రెందున్నవారొ
తురగచోరకుఁడెందు దూఁకినవాఁడొ ♦ వరుసఁసీ వెతకింప వలయునాకనిన
నాదిగ్గజాధీశుఁ డాయంశుమంతు ♦ నాదరంబునఁ జూచి యప్పుడిట్లనియె
బ్రియయారనొక్కెడ బృథివీశతనయ ♦

హాయముగాంచెదవన్న నొగాకయనుచు

నున్నదిక్కరులను నొగిదాటి దాటి ♦ యన్నిటనిబ్బంగి నడుగంగనవియు
బరువడి తామిట్లు పలుకంగ వినుచు ♦ నరిగియాముందర నధ్వరాశ్వంబు [లు
నరయుచు గపిలసంయమిఁ బొ_న్తగనియె ♦ సరిప్రోవులై యున్నసగరభస్మము
కనిచాలశోకించి కరఁగితండ్రులకు ♦ బానరదిలోదకంబులువోయ వెదకి
యుదకంబుగానక యున్నయయ్యెడకు ♦

సదయుఁడై గరుడుండు సనుదెంచి పలికె

గపిలునినలుకమై గలచియవ్వాని ♦ కుపితాగ్నిసగరులు కూలిసీత్రైరి
యిదియే-శోకింప నిఁటుశోకమంద ♦ నిదివేళ గాదొక్క టేర్పఱవినుము
సరసిజాసనవంద్య చరణారవిందు ♦ డరవిందదళనేత్రు డాదిపూరుషుడు
బలిదానవేశ్వరు బంధించునప్పు ♦ డలుకత్రివిక్రముడై నిండబెరిగి
యగణితశక్తిరె. డడుగులయందు ♦ జగతీతలంబెల్ల సరినాక్రమించి
జలజాతజలచర శంఖచక్రమ్ము ♦ లలపడఁ వట్టిమూడవ పదాంబుజము
కడుకొని బ్రహ్మలోకముదాఁకఁ జాప ♦ గడువేగమునవచ్చి కమలసంభవుడు
తలకొన్నభక్తితో దనకమండలువు ♦ జలములదత్పాద జలజముల్ గడిగె
బొగడొందదజ్జలంబులు నభోవీధి ♦ దగిలివర్తించు మందాకినియనగ
గావుననీవింక గమలసంభవుని ♦ భావించితపమతి భక్తిగావించి
కడకమైనాకాశ గంగదోడ్తెచ్చి ♦ తడయకభస్మముల్ తడిపినగాని
పరలోకసుఖములు పడయరువారు ♦ గురుబుద్ధితురగంబుగొనియేగుమనిన
దురగంబుగొనిపోయితోడరియు_న్తయునుపరమిడి మాతదుతమతాతతోడ
జెప్పినశోకించి చేయగ్రైకొన్న ♦ యప్పుణ్యమఖము సమాప్తంబుచేసి
కామించియాకాశ గంగనీయుర్వి ♦ కెమ్మెయిదెత్తునో యేనంచుజింత
విడువకముప్పది వేలేండ్లుతపము ♦ పుడమినెంతయుజేసి పోయెనుదివికి
నారాజుమనుము డయ్యంశుమంతుండు ♦ ధారిణీగంగకు దపమొప్పబూని
వరుసముప్పదివేల వర్షముల్సలిపి ♦ పరలోకగతుడయ్యె బదపడియతడు
అతః పుత్త్రుడుదిలీపావనీనాథు ♦ డతినిష్ఠతోడ జాహ్నవిదెత్తుననుచు
విడువకముప్పది వేలేండ్లుతపము ♦ గడపియునతఁడు రోగములచేజచ్చె
ననఘుడాతనిపుత్త్రుడగు భగీరథుడు ♦ దనరాజ్యమరయ బ్రధానులనిల్పి

సారధర్మజ్ఞులు సద్గుణోజ్జ్వలులు ♦ శూరులునగునట్టి సుతులనుగోరి
యెల్లపాపంబుల నిలమీఁద బాప ♦ దెల్లంబుగాగంగ దెచ్చెదననుచు
గరమర్థిదపము గోకర్ణాశ్రమమున ♦ నరుదుగాబదివేల యబ్దములేసియు
ననుపమంబగుచున్న యాతపంబునకు ♦ వనజసంభవుడంత వందుడై వచ్చి
యడుగుమువరమన్న నాభగీరథుడు ♦ కడుభక్తిబ్రహ్మకు గరములుమొగిచి
భారతనేత్ర ప్రపంచనిర్మాత ♦ పౌరలోకత్రాత సత్యసఘాత
ధాతమాతాతలు దగ్గులై వచ్చి ♦ యాతతకపిలు క్రోపాగ్నిచేఁగ్రాగి
నూరువేలేండ్లు నన్నుతగతిలేక ♦ నాఁడిపడిభస్మమై యున్నవారు
కడగియాభస్మముల్ గంగోదకముల ♦ పడుపకగతిలేదు దయసేయుమనిన
హరుడొక్కరుడుదక్క నన్యులాగంగ ♦ దరియింపనేరరు దగిలియెవ్వరును
నీవింకహరునకు నిష్ఠమైతపము ♦ గావించిప్రార్థింపు గంగధరింప
ననిపల్కమదిలోన నతడుప్రార్థించు ♦ తనయులనిచ్చి యుద్ధరణీశుకొరకు
దనరంగనాగంగ ధరకేగుననుచు ♦ జనియెపద్మజుడట జనిభగీరథుడు
అంగుష్ఠమొక్కటి యవనిపై మోపి ♦ యంగజహరునకు నతిఘోరతపము
దలకొనిచేయ బ్రత్యక్షమైశివుడు ♦ తెలదాల్పుదెమ్ము మందాకినినసియె
నంతభగీరథుం డర్థిబ్రార్థింప ♦ నంతరిక్షస్థల మందుండిగంగ [చును
గగనమండలమునక్షత్రమాడలము ♦ బగులలోకములెల్లబగులమ్రోయు
గులపర్వతములతో గుంభిసతోడ ♦ బలసిమహాదేవు పాతాళమునకు
గొనిపోవుతెఱగున ఘోరంబుమెఱువ ♦ చనుదెంచునురువడి జగములుబెదర
వచ్చునాగంగ గర్వముశాపశివుడు ♦ హెచ్చిజూటముబెంచెసంతలోగంగ
వచ్చిమహాదేవు నరజటావీధి ♦ జొచ్చి వెల్వడుత్రోవ చొప్పడకున్న

—:* భగీరథుఁడు గంగను దెచ్చుట *:—

హరుజటాజూట మహాటవిజిక్కి ♦ తిరుగుడుపడుచు వర్తించుచునుండె
నంతభగీరథుం డతులప్రవాహ ♦ మంతయునిప్పుడెం దరిగెనోయనుచు
వెఱగందిమఱియును విషకంధరునకు ♦ దరిగొనియత్యుగ్రతపమాచరింప
నపరిమితప్రీతి నాభగీరథుని ♦ తపమంతమెచ్చి కందర్పహరుండు
లోలతదనమౌళి లోనున్నగంగ ♦ భూలోకమునకింక బొమ్మనియనుప
వలనొప్పజూటంబు వాకిలివెడలి ♦ పొలుపొంద పాతాళమునజూపునిలిపి
తనదివ్యదృష్టి మందాకినికపిలు ♦ గనిమునిమహిమకు గడుజోద్యమంది
తగిలినిన్నలచిన దారుణాకృతుల ♦ సుగతికి బంపవచ్చుచునున్నదాన
గినియకుమీవని కేలర్థిమొగిచె ♦ ననబద్మముకుళంబు లమరజూపఱకు
నడరునమ్మునికిన్న నముపోవవెరచి ♦ సుడివడుతెఱగున సుడులొప్పమిగుల

మామీఁదఁ జఱుదెంచు మలయుచుఁ గంగ ♦
యే మొక్కడికిఁ బోదు మిటమీఁద ననుచు
బఱతెంచి సగరుల పాలిపాపములు ♦ మొఱపెట్టుచున్నవి ముక్కటిక నగ
నోలిఁ బంకజముల నుండ రాకున్న ♦ దూలి యూకసమున దుమ్మెదల్మ్రోయ
భూతాధిపతిజూట మున నుండి ధరణి ♦ కేతెంచు గంగకు నెండ గాకుండ
గొడుగులు వట్టిన కొమరున హంస ♦ లుడువీధి సుడివడి యొప్పారుచుండ
నొడరి యాసగరుల దోషోత్కరములు కడక మైబోఁ ద్రోచు కరములో యనగ
గమనీయతరములై ఘనతరంగముల ♦ గములంతకంతకు గర మొప్పమిగుల
దనవారిలోపల దగ భగీరథున ♦ కనుపమ సితకీర్తు లందంద బుట్టి
నెఱసి భూతల మెల్ల నిండ నేతెంచు ♦ వఱుసన నుఱువులు వరలంగ గంగ
యప్పటప్పటికి నిసతుల ఘోషంబు ♦ లుప్పొంగి యుప్పొంగి యుడువీథి ముట్టి
బ్రహ్మాండ భాండము ల్వ్రగుల బెల్లుబ్బి ♦ బ్రహ్మాది దేవత ల్భక్తితో బొగడ
జనుదెంచి బిందువ ల్సరసిలో జొచ్చి ♦ యెనయు బ్రవాహంబు లేఱులై పారి
యనఘాత్మ పావని హ్లాదిని నలిని ♦ యను బ్రవాహములు మూడరిగె దూర్పునకు
సీత సుచక్షువు సింధువు నాగ ♦ ఖ్యాతితో మూడేగ బడమటి దెసకు
నడరుచు నుప్పొంగి యందులో నొకటి ♦ కడగి భగీరథ క్ష్మాపాలు పిఱుద
ఘనతర విశదోదక ప్రవాహంబు ♦ వినువీథి శరదభ్ర విభ్రమం బెసగ
దివికేగ మదిలోన దివురు భూజనుల ♦ కవిరళ నిశ్రేణులమరు చందమున [మర
నిలయు నింగియు మ్రోగు నెడ బ్రవాహంబు ♦ గలయ నానామాలికలు వీచుల
నీభంగి ద్రిప్పుదు నెల్ల పాపముల ♦ నా భంగి జూడుడీ యనసుడులొప్ప
జెలిమిదారలతోడ జేయు జక్కరణి ♦ బెలుచ నింగికి నంబు బిందువు లెగయ
ధర్మాత్ములగు వారి ధర్మకీర్తులకు ♦ నిర్మలస్థానమై నెరిబొల్తు ననుచు
గేలి నయ్యాసగా కీర్తులు నవ్వ ♦ లీ డిండీర మాలికలుల్లసిల్ల [లయ
బెక్కగన్నుల గాంతు బృథివి పెంపెల్ల ♦ మక్కువ ననుభంగి మత్స్యములా
జరియించు కొమరారు జలచరావళులు ♦ పొరినొప్ప నేతెంచె భూలోకమునకు
సంతతతార్క్ష్యమైయుమరు చందమున ♦ గాంతిమద్బహురత్న ఖచితంబులైన
నిజభూషణంబుల నింగి వెలుంగ ♦ గజవిమానాదులు కరమర్థి నెక్కి
యసురగంధర్వ సిద్ధాదులు చూడ ♦ నమరంగ నేతెంచి రజుడు నేతెంచె [ను
నటమహానాగంబులా ప్రవాహంబు ♦ చటుల వేగము చూచి సరి మ్రొగ్గుటయు
నంతయు నా నిర్జరాదులు చూచి ♦ చింతించి జపములు చేసి రాలోన
నానదిగట్లనే యవగాహమంది ♦ యానందమును బొంది యాడి రచ్చరలు
అమరమునీంద్రాదు లంతనంతోష ♦ మమర గాబువ్వుల నర్చించి రెలమి

నా పుణ్యనదిలోన నతిపాపరతులు ♦ శాపదగ్ధులుకృత స్నానులై దివికి
జనుచుండసురలునచ్చరలుగంధర్వ♦దనుజపన్నగయక్షదైత్యరాక్షసులు
కిన్నరాదులునా భగీరథురథము ♦ వెన్నాడికనుగొంచు వేడ్కనేతేర
బెరిగిపర్వతములుభేదించుకొనుచు నరుగజహ్నుడుయాగమాత్రోవఁజేయు
వరదగానటువచ్చి వలగొనిగంగ ♦ సరిచుట్టుముట్టిన సరగుననపుడు
యాగోపకరణంబు లవివెల్లిఁబోయి♦యాగవిఘ్నంబైన నతఁడాగ్రహించి
నింగికినుప్పొంగి నెఱినేగుదెంచు♦గంగనాకర్షించి కలుషించిక్రోలె
అనిమిషమునివరు లాభగీరథుని ♦ గనుగొనిపల్కిరి కరమర్థిమీఱ
నుమిసియొంగిలిసేయ నొల్లకయతడు ♦ రమణమైదనకర్ణ రంధ్రంబునందు
వెడలింపనెప్పటి విధమునగంగ ♦ యడరుచుజాహ్నవి యనుపేరబరగె
బరుషపురాకృతపుణ్యంబునడుమ♦దారకొన్నవిఘ్నంబుద్రోచియేతెంచు
వెరవుననారాజు వెంటనేవచ్చి♦శరనిధిజొచ్చి యాజాహ్నవీదేవి
దిగిరసాతలమున దిరిగియందున్న ♦ సగరులభస్మము ల్సరినిండబాఱె
నంతనంబుజగర్భు డాభగీరథుని ♦ సంతసంబునజూచి జననాథవినుము
జలనిధినిందాక సలిలంబులుండు ♦ దలపనీసగరుల తనయులందాక
దివ్యభూషణముల దివ్యాంబరముల ♦ దివ్యమాల్యంబుల దివ్యగంధముల
దివ్యమూర్తులనొప్పి దివిజలోకమున♦దివ్యభోగముల వర్తించుచుండెదరు
అడరంగనిదిమొద లనఘనీపేర ♦ నడచుభాగీరథీ నామమీనదికి
త్రిపథయనంగవర్తిలువరదయన నృపజాహ్నవియనంగ నెగడులోకముల
దగబితలకు దిలోదకములునడిపి ♦ జగములన్నిటసత్య సంధుడవగుము
అనఘమీసగరుండు నంశుమంతుండు♦ఘనుడుదిలీపుడుఁగైకొన్నవ్రతము
నెఱపజాలమినీవు నెఱపంగదివిరి ♦ తెఱగొప్పనీగంగ దెచ్చితికాన
గంగాంబునిర్మల కమనీయపదము ♦ మంగళచిరకీర్తి మహితుండవగుము
కాకుత్స్థకులజుల గౌరవశ్రీల ♦ కాకరంబగుదన యావళిగనుము
లలితధర్మముల మూలస్తంభమైతి ♦ పొలుపారనింక నీపుణ్యోదకముల
వెలయదీర్థస్నాన విధులొప్పనీర్చి ♦ ఫలముగైకొనమంచుబ్రహ్మసంభవుడు
తనలోకమున కేగె దదనంతరంబ ♦ తనరనాగంగ కృతస్నానుడగుచు
నఱువదివేవుర కాభగీరథుడు ♦ నెరిదిలోదకములు నిష్ఠతోనిచ్చె
నాతిలోదకములు నమరులైసగరు ♦ లాతనిదీవించి యరిగిరిదివికి [చుండె
ననఘుండుమరియయోధ్యాపురంబునకు ♦ జనిభగీరథుడురాజ్యముసేయు
గలుషఘ్నమీ యుపాఖ్యానంబుభక్తి ♦ చెలువారజదివిన జెప్పగావినిన
నొనరబుణ్యములనాయుష్మంతులగుచు♦ధనధాన్యకీర్తులదనరుచునుందు

రెప్పుడువారల కెల్లదేవతలు ♦ నొప్పఁ బ్రసన్నులై యుండుదురెలమి
సమరంగ సిద్ధించు నఖిలకార్యములు ♦ సమకొనునంచిత స్వర్గభోగములు
పెరుపారగా వారి పితృగణంబులకు ♦ ననుపమసద్గతు లనిశంబు గలుగు
ననిన రాఘవుఁడు గంగావతారంబు ♦ విని కౌశికునిఁ జూచి వినుతులు సేసి
నేఁడు విశ్వామిత్ర నీచేత వింటి ♦ బోఁడిమి నీగంగ భూలోకమునకు
వచ్చిన తెఱఁగును వారి తెఱంగు ♦ నచ్చెరువడఁగంగ ననిముదంబంది
యాధాత్రియందుండి యఖిలలోకముల ♦ నారూఢికెక్కిన యానది గ్రుంకి
యాహ్నికకృత్యంబు లన్నియుఁ దీర్చి ♦ జాహ్నవి దాఁటి విశ్వామిత్రుతోడ
నుత్తరతటమునందున్న సంయముల ♦ చిత్తంబు లలరఁ బూజించి వీడ్కొనుచు
జనిచని యెదుట విశాలయన్పురము ♦ కనుఁగొనఁ గింపైన గాధేయుఁ జూచి

—*: దేవతలమృతంబు వడయుట *—

యీపురి పేరేమి యేరాజవంశ్యుఁ ♦ డేపుమై నేలించు నెఱిఁగింపుమనిన
ఘనుఁడు కౌశికుఁడు రాఘవుఁ జూచి పలికె ♦ వినుమింద్రుకడమున్న విన్నాఁడ నేను
దితిసుతులైన దైతేయులుఁ నదితి ♦ సుతులైన సురలు భాసురలీలఁ దొల్లి
నోలి రసంబులు నోషధుల్ నించి ♦ పాలసముద్రంబు పఱువడిఁ ద్రచ్చి
శ్రమ మొప్ప నమృతంబు గైకొందమనుచు ♦

సమమైత్రి నాసుధాజలరాసిలోన
కవ్వంబు తరిత్రాఁడు గా మందరంబు ♦ న వ్వాసుకిని జేసి యమృతాబ్ధి దరువ
వెలయంగ నటఁ బుట్టె విషము గ్రమమగుచు ♦ కలయ లోకంబులఁ గాఱించి మించ
బరగ రోషానల పరుషంబునైన ♦ హరుఁడదిగొని మ్రింగె నంతనె మియుట
నురుగముల్దరియించె నోలి నద్విషము ♦ మరిమరి తరువఁగ మఱియును బుట్టె
వంచన మన్మథావాప్తి లోకముల ♦ ముంచి యెత్తఁగఁజాలు మారిపెంబులమర
గాంచీఝుణత్కారఘననితంబములు ♦ నించుక నడుమును నెరియఁ జన్గవలు
చన్చలతనులతల్సరిదంతచయము మించ్చుకన్గవయును మెఱయు మోవియును
గోమలభ్రూలతా కోదండుఁడైన ♦ కాముని విలువిద్య గతిచూపనొప్పి
కడగంటిచూపుల గతుదీధితుల ♦ వెడలించు భుజలతా విక్షేపములును
అమరనూతనయావనాభిరామముల ♦ నమర నఱువదికోట్లయప్సరోగణము
లీలమైనచ్చర లేమలనెల్ల ♦ నోలి దేవతలు దైత్యులును గైకొనిరి
వారక దరువనా వరుణాత్మజాత ♦ వారుణి ప్రభవించె వైభవంబలర
నాసురదితిసుతు లపుడొల్లకున్న ♦ నసురులై వర్తిల్లి రవని నెల్లెడల
సురనాదితేయులు సారిది గైకొన్న ♦ సురలన బ్రఖ్యాతి శోభిల్లిరపుడు
సంతసంబున రమాసతి దురంగంబు ♦ కాంతిమిన్నగు దంతి కౌస్తుభమణియు

నమృతాంశుడును బుట్టె నమృతంబు సురభి ♦
నమరుసుధాపూర్ణ మగుకమండలవు
కలిగి ధన్వంతరి కర మొప్ప బుట్టె ♦ వెలయంగ మరి బుట్టె విషముగ్రముగను
పరుషగోపానల భావమైదనరు ♦ హరుఁడది యనుక్రమింగె నద్భుతంబుగను
నంత సురాసురు లమృతంబుకొఱకు ♦ నెంతయు దమలోన నేచి దర్పమున
ననుపమస్థితిఁ బోర నసురులసురల ♦ గనుఁగొని సురలపై గరుణించి మించి
మానినీరూపమై మధుమర్దనుండు ♦ తానమృతము బంచి తగనిచ్చువేళ
నసురుల గనుఁబ్రామి యమృతంబు సురల ♦
కొసఁగి వారికి జయం బొసఁగె యుద్ధమున
దైతేయకోటి యంతఱఁ ద్రుంచి యింద్రుఁ ♦ డాత్రిజగంబు లర్థిఁ బాలింప
దితియంత దనసుతుల్ దెగుటకు నొగిలి ♦ పతియైన కశ్యపుఁ బ్రార్థించి యింద్రు
జంపఁజాలిన మహాసత్త్వప్రతాప ♦ సంపన్ను నొకని బ్రసాదింపుమనిన
నంగీకరించి సహస్రవర్షంబు ♦ లంగన ఘనశుచివై యుండగల్గు
మూఁడు లోకంబులు మొగి గెల్చువాని ♦ వాడిమి మైనింద్రు వధియించువాని
గని యెదవొక పుత్త్రుఁ గాంతు నావలన ♦ ననిపల్కి దితిమేను హస్తాంబుజమున
ననయమారఁ బరిమార్జనము సేసి మఱియుఁ దయఁజూచి యతఁ డేగె దపమాచరింప
జనియె నా దితియును సమ్మదం బెసఁగ ♦ జనియుగ్రదప మొప్ప సల్పుచునుండె
నంతట మఘవంతుఁ డత్తెఱంగెఱిఁగి ♦ చింతించి దితిఁ జేరి శిష్యుంబు బోలె
పాయక కుశసమిత్ఫలమూలభవ్య ♦ తోయాదు లతిభక్తితోఁ దెచ్చుచును
జరణంబు లొత్తుచు సత్కృతుల్ గరియు ♦ బరిపాటి సేవము బరిచర్య సేయు
నే వేళ నెచ్చట నేమి గావలయు ♦ గావలసిన వెల్ల గనుసన్న దెచ్చి
యుపచరింపుచు వేడ్కనుండె బెక్కేండ్లు ♦ నపుడొక్కనాఁ డింద్రు నాదితి చూచి
యలరుచు మది రహస్యము దాపలేక ♦ వలభేది వినుము నా పల్కు నీవొకటి
తనయుని గోరి మీ తండ్రి నే నడుగ ♦ వినుము వెయ్యేడులు వెడలిన పిదప
నిచ్చితి సుతు నంచు నింపార నాకు ♦ నచ్చుగా వరమిచ్చె నటుగాన నీకు
నిటమీఁద బదియేను లేగినపిదప ♦ బటుశక్తి దమ్ముఁడు ప్రభవింపగలఁడు
అలరంగ నీవును నాతండుఁ గూడి ♦ పొలుపార నేలుఁడీ భువనత్రయంబు
వినుతకీర్తుల మీరు విలసిల్లుచుండుఁ ♦ డనిపల్క నంత మధ్యాహ్నకాలమున
దలనిడి కాల్గడ దలయుంపిగాఁగ ♦ నలతమై నిద్రించు నాదితిఁ జూచి
శతమన్యుఁ డెంతయు సంతోషమంది ♦ వితడవై ఖరి నిదె వేళ నాకనుచు
దితిగర్భమతి యోగధీశక్తిఁ జొచ్చి ♦ శతకోటిచే దనశత్రువా శిశువు
నేడు తునకలు సేయ నెలుఁగెత్తి బాలు ♦ డేడువ దితియును నయ్యెడ మేలుకాంచె

మఘవుడుమారుదో మారుదయనుచు ♦ లఘురీతిబలుక బాలకజంపవలదు
వలదనియెదుదితి వాక్యమాలించి ♦ వెలువడిగర్భ మవ్వేళ వాసవుడు
కరములుముకుళించి కలకచిత్తమున ♦ తిరమైనభక్తిచే దితికొండబలికె
వనరంగగాల్లడ తంయంపిగాగ ♦ గొనిముక్తకేశివై కూర్కుటజేసి
యరసీకుశుచివైతివిగాన తెకువ ♦ కార్యంబుకొరకేనుకడుపులోజొచ్చి
గొనకొనివినుజంప కోడిగర్భంబు ♦ దునిమితినేనేడు తునియలుగాగ
నన్నకుసన్నా శత్రుండుగాన ♦ జిన్నిపాపని బరిచ్ఛిన్నుజేసితిని
జననిధర్మజ్ఞవై సైరింపవలయు ♦ ననినదు ఖంపుచు నాయింద్రుజూచి
నానేరమంతయు నాకలోకేశ ♦ నీకేరమదిలేకు నిక్కవంబరయ
ననివల్కిమరుదాఖ్యలమర తేజంబు ♦ లెనయంగ ఖండంబులేడ్వురనగుచు
నిమ్ములనాపుత్త్రి లెలమినెల్లెడల ♦ నమ్మదమింపార చరియించనిమ్ము
సప్తఖండంబులై సగివొప్పువీరి ♦ సప్తమారుతగణ స్కంధనాయకుల
గావింపుమనివేడ గాసట్లుచేసి ♦ దేవేంద్రుడమరావతికబోయెనంత
వారుమదేవతావల్లభుచెలిమి ♦ మారుతగణసంజ్ఞ మతిదివ్యులైరి
దేవేంద్రుడతిభక్తి దితికిశ్రీరామ ♦ గావించెనీ పుణ్యదేశమున
నీపుణ్యధరణి మున్నిక్ష్వాకునృపతి ♦ భూపవర్యుండలంబుసయందుగన్న
కొడుకువిశాలు దనుకవలయాధిపుడు ♦

పుడమినేలివిశాల పురియిందొనర్చె
నావిశాలునిపుత్త్రుడై హేమచంద్రు ♦ డావిర్భవించెను నతనిసుచంద్రు
నతడుధూమ్రాశుని నతడుసృంజయుని ♦

నతడంతసహదేవు నతడుకుశాశ్వు
నాతండుసోమదత్తాఖ్యుగాకుత్స్థు ♦ డాతనికంతయు నమరంగసుమతి

—:* సుమతియనురాజు విశ్వామిత్రుని నెదుర్కొనుట *:—

భావింపనెప్పుడు పరమధర్మముల ♦ నీవిశాలాపురం బేలెడిరాజు
లనఘులై శాలిను లనపీనుజగతి ♦ వినుతికెక్కిరిధర్మ విభవసంపదల
నిచ్చలరఘునాధ యిచటనీరాత్రి ♦ బుచ్చివేగింజూడ బోవమిజ్జనకు
ననుసంతగాధేయు డటవచ్చుటెరిగి ♦ మనమునసంతోష మగ్నుడై సుమతి
తనపురోహితులును దనబంధుజనులు ♦ తనతోడజనుదేర దనపట్టణంబు
వెలువడిచనుదెంచి విహితమార్గమున ♦

నెలమితోనాసంయమీంద్రుబూజించి
కర్మములుముకుళించి కడుభక్తిబలికె ♦ ధరణిలోపలనేను ధన్యుడనైతి
జరితార్థమయ్యెనాజననంబటంచు ♦ బరమప్రియంబునబలికియుండొరుల

సమరంగకుశలంబు లడిగినపిదప ♦ సుమతివిశ్వామిత్రు జూచి తాననియె
మునినాథ యసమాన మూర్తులీఘనులు ♦
ఘనభుజాంసి మిష క్రమపరాక్రములు
కరిరాజగమనము ల్కాంతీవరముల ♦ బుజడింపజాలిన భుజసత్త్వములును
లలితంబులైన పుల్లసితారవింద ♦ దళములదెగడు నేత్రములు జెన్నొంద
గర వాలములు గార్ముకంబులు దొనలు ♦ ధరియించి దమదుపదన్యాసము ను
జగతినారవిచంద్ర సంచారలీల ♦ మదునాకసమవలె నలరించువార
లిరువురుదమలోన నెల్లచందముల ♦ సరియగుచున్నారు జనులచూడ్కులకు
నీకుమారకులెవ్వ రెవ్వరీసుతులు ♦ నాకు నేర్పడ గాథ నందన చెపుమ
యనినవిశ్వామిత్రు డాతనిజూచి ♦ వినిపింపదొడగెను వీరలుబ్బంగ
యారాఘవునప్పు డర్థిబూజింప ♦ వారునుబూజలు వరుసగైకొనుచు
నారాత్రియందుండి యాప్రభాతమున ♦ నారాజుతముబంప నర్థింతో జనిరి
చనిచని గౌతమాశ్రమము రాఘవుడు ♦ కనుగొని పలికె నాగాధినందనుని
సలలిదపల్లవ సంపదల్లలిగి ♦ వెలయుమామిళ్ళును వేణుపనసలును
నారంగజంబీర నారికేళములు ♦ పారిభద్రంబులు బదరికాతతులు
మాతులుంగలవంగ మంజీరతరులు ♦ శ్రీతరుసంపంగి సింధువారములు
పొన్నలుపొగడలుపోకమ్రాకులును ♦ నెన్నంగనగటులు నెఱయు పుప్పొళ్లు
చిత్రజాంబకములై చెలగునశోక ♦ లత్తుకదాడిమ లలితమల్లికలు
తిందుకంబులుశివ తిలకశాల్మలులును ♦ చందనకర్పూగ సహకారములును
భల్లాతగుగ్గులు బ్రహ్మకౌశికము ♦ లెల్లచోనల్లిన యేలకీలతలు
అల్లిన మొల్లలు నలరుచేమంతి ♦ చల్లనిపుష్ప వాసనల జెన్నొందు
కాసారములచేత గడురమ్యమగుచు ♦ భాసిల్లుపక్షుల పటురవంబులను
సమధికమిట్టియాశ్రమభూమిసకల ♦ రమణీయమయ్యు నిర్జనమేటికయ్యె
మున్నిందుదపము స మునివర్యుడెవ్వ ♦ డన్నియు నెరిగింపుమనిననిట్లనియె
గౌతముండిక్కడ గడకతోదొల్లి ♦ యాతతనిష్ఠ నహల్యతోగూడి [యుప
యతిఘోరతపము సేయగ నింద్రుడెఱిగి ♦ యతనితపంబు దానంతయు జె
కుక్కుటంబై పోయి కటజంబు సేరి ♦ 'కొక్కొరో'యనికూయగొమరొప్పమౌని
మనమునజింతించి మఱియొక్కనాడు ♦ మునినిజానుష్ఠానమునకుబోవుటయు
గౌతమాకారంబు గైకొనివచ్చి ♦ యాతనిసతి నహల్యాదేవిగదిసి
ఋతుకాలమనరు కోరికగలవారు ♦ మతిదలంపగ బ్రొద్దు మఱిచాలగలదు
పొలతుకనీతోడి భోగేచ్ఛ నాకు ♦ వలయుటదఁ పోసి వచ్చితిననిన [చు
నెఱిగియహల్య నీవింద్రుండవగుట ♦ యెఱుగుదుగాకేమి యిందురమ్మను

జలజాక్షితమ పర్ణశాలలోపలికి ♦ బలభేదిగానిపోయి పరగ గ్రీడించె
సుదవాఘుడప్పుడు ప్రసుక్కచుభీతి ♦ నరుగుచో గౌతము డంతలోవచ్చి
యోరిపాపాత్మక యుచితమేనీకు ♦ నారూపుగై కొని నాపత్నిగవయ
నీపాపఫలమున నీవముష్కుండ ♦ వై పొమ్ముపొమ్మని యంతశపించె
గౌతమ శాప మఖండమైతాకి ♦ యాతనియండ బు లంతలోదెగియె
నడరిగౌతము డహల్యాదేవిజూచి ♦ పడతిపాషాణమై పడియుండుమీవు

—:* గౌతముఁ డహల్యకు శాపమిచ్చుట *:—

కరము గ్రమగు నెండ గాలివెంధూళి ♦ బొరలుచు నెందును బొడగానబడక
అనినశాపమున కెయ్యదితుదినాకు ♦ ననినన హల్య కిట్లనియెగౌతముడు
వైకుంఠధాము డవాప్తకాము ండు ♦ లోకరక్షణకై లోలతత్పరత
రాముడై వచ్చి పురాణపూరుషుడు ♦ భూమిపై జన్మించి పొగడుదీపించి
చను దెంచికౌశికు జన్నంబుగాచి ♦ యినకులాధీశ్వరుఁ డీత్రోవవచ్చి
తొగి పోనకనిన్ను ద్రొక్కినజలు ♦ బలజలోచన నీదు శాపంబుదీఱు
నని చెప్పిశీతాద్రి కరిగెగౌతముడు ♦ మునిపత్ని యారూపు ముననుండెనంత
సురరాజుదనపాటు సురలతో దెల్ప ♦ దరమిడిపితృ దేవతల వారు వేడి
వెరవరులై మేష వృషణము ల్దెచ్చి ♦ సురలుసంధించిరి సురలోకపతికి
నతులపుణ్యాత్మకు లదియాదిగాగ ♦ క్రతువులజంపు దుర్కడగి మేషముల
నాడాదిగా మునినాథుశాపమున ♦ బోడిమిచెడి యీతపోవనినున్న
యీయహల్యనతుల్య హాతమనశ్శల్య ♦ జేయవే శ్రీరామ చిరపుణ్యధామ
యని చెప్పిగౌతము నాశ్రమంబునకు ♦ జను దేర శ్రీరామ చరణంబుసోక
మొగులెల్లవిరియ సోమునికళవోలె ♦ బొగయడంగినహవ్య భుక్కీలవోలె
గలకదొలంగిన కమలినివోలె ♦ బలమష్టుగడిగిన బంగారువోలె
శ్రీరామపాద రాజీవపరాగ ♦ దూరీకృ తాఘ సందోహమైయపుడు ని
వెలదియంతయుశిలా వేషంబుమాని ♦ తిలకించితనతొంటి దేహంబుపూ
మునిపతి చేత రాముని మహత్త్వంబు ♦ వినినదిగాన నావేదండయాన
యీమహామహునకు నాతిథ్యమొసగి ♦ శ్రీమీఱనిటుకు పిచ్చేసితిగాన
జరితార్థనైతి మీచరణపద్మములు ♦ దరినిచ్చిరఘునాథ త్రైలోక్యనాథ
మీపాదతీర్థమా మిన్నేనుభువన ♦ పాపంబులెడబాప బాల్పడెననగ ట్టి
నిలమెల్లనొగట మిన్నొక్కటగొలిచి ♦ బలిమెట్టిబ్రహ్మాండ ఖండంబుమ
వేదశిరోవీథి విహరించునీదు ♦ పాదముల్ నాదుశాపము బాచుటరుదె
యనిరాముకినుతించెనంత గౌతముడు సను దెన్చిరఘురామచన్ద్రుబూజించి
ప్రాకటజన్మ సాఫల్య నహల్య ♦ గైకొనితొల్లింటి గతివిలసిల్లె

గ్రొవ్విరిజడి బాన కుంభిని గురిసె ♦ నవ్వేళ దేవతూర్యంబులు మొరసె
ఘనపుణ్యులందుఁడికదలిమిన్నంటి ♦ తనరు ప్రాకార సౌధముల యూధముల
వమరికరత్న గేహముల వాహముల ♦ రమణీయ రాజమార్గముల దుర్గముల
వలనొప్పు శృంగారవనుల జవ్వనుల ♦ లుచు సంతతశుభంబుల నిభంబులను
ననువొందు శైరిసద్రాశిథిలకును ♦ జనకనిమిథిలకు జనుదెంచిరంత
గాళింగనేపాళ కర్ణాటలాట ♦ మాళవసౌవీర మగధపాంచాల
కురుపాండ్యబర్బర కుంతలావంతి ♦ మరుతురుష్కాభీర మాన జవల్లభుల
ఘనతర యాగోపకరణభాగముల ♦ ననురూపపశుగణా యతనయూపముల
భూరిదధిక్షీర పూర్ణకుంభముల ♦ సారసమిద్భార చారుదేశముల [సుల
నడరి ఘోషించు సామాది వేదముల ♦ నుడుగక చనుదెంచుచున్న తాప
నుడువీధి నప్పొంగు హోమధూమముల ♦ నడరెడు దేవతాహ్వానరావముల
బూజలు గైకొన్న పుణ్యసంఘముల ♦ బూజింపఁ జాలు మునిభూసురోత్తముల
నరుదైన జనకుని యజ్ఞవాటంబు ♦ కరమర్థి జొచ్చె నగ్గాధినందనుడు
అంత నా జనకమహారాజవర్యు ♦ డెంతయు మహిమతో నెదురుగా వచ్చి డిగి
మునినాథునకు మ్రొక్కి మొదమొప్పతోడ ♦ గొనిపోయి పూజించి కుశలంబుల
నీవు వచ్చితి కాన నేడు నేమిగుల ♦ బావనాత్ముడనైతి బ్రబలె నా క్రతువు
లని చాలఁ గొనియాడి యమ్మునిచంద్రు ♦ వెనుకనె వినతులై విలసిల్లుచున్న
గరుతరస్ఫీత పక్షులగాకపక్ష ♦ ధరుల మహాధనుర్ధరుల శ్రీకరుల
గోమలాంగా లనఘంగు రయశోనిధుల ♦

భూమి జరించు వేల్పుల బోలుఘనుల
సదయాంతరంగుల సతతప్రసన్న ♦ వదనుల భువనపావన చరిత్రులను
చారుప్రభాభాను చంద్రసన్నిభుల ♦ ధీరుల నయ్యశ్వి దేవతాకృతుల
నాజానుబాహుల నతులవిక్రముల ♦ రాజీవనేత్రుల రామలక్ష్మణుల
జూచి యా శరచాప శోభితాకారు ♦ లీచతురాత్మకు లెవ్వరి వార
లీపల్లవారుణ మృదుపాదపద్మ ♦ లేపగిదిని వచ్చి రిచటికి నడిచి
యనిన విశ్వామిత్రుడనఘులు వీరు ♦ జననాథ దశరథ జనపాలసుతులు
నాయతశక్తి నా యాగంబు గాచి ♦ యాయహల్యను బ్రోచి యనుకంప నేచి
నిరుపమతరశక్తి నీయింటనున్న ♦ హరుని చాపము జూడ నరుదెంచి రనుడు
మునినాథు మాటకు ముదమంది జనకు ♦ డనునయంబున వారి నర్థి బూజించె

—*: శతానందుడు విశ్వామిత్రు ప్రభావంబు దెల్పుట :*—

గాశికుగను గొని గౌతమసూను ♦ డా శతానందు డిట్లనియెరాగిల్లి
నీవు రాముని దెచ్చి నెమ్మి మమ్మేలి ♦ తీవిశ్వవిభుదేర నెవ్వరితరము

అదరి మాతల్లి యహల్యాపాపములు ♦ కడగి రాముని పాద కమల రేణువుల
గౌతమశాప దుర్గతిని స్తరించి ♦ గౌతము గ్రమ్మఱ గలసె మాతల్లి
రామచంద్రుని పాద రాజీవమహిమ ♦ లేమందు నని రాము నీక్షించి పలికె
ఈ కౌశికుఁడు పుణ్యుఁ డీక్షోణిమీఁద ♦ నీకు రక్షకుఁడట నీ కేమి కొదువ
యరయ విశ్వామిత్రు సతులప్రభావ ♦ మరిది ప్రస్తుతిసేయ నైన నను వినుము
దశరథాత్మజ బ్రహ్మతనయుండు కుశుఁడు ♦ కుశుఁ డర్థితోఁ దత కుశనాభుఁ గనియె
కుశనాభునకు గాధి కొమరుఁడై పుట్టె ♦ కుశపవిత్రుఁడు గాధి కొడుక య్యె నితఁడు
అతిధర్మనిరతుఁడై యఖిలంబు పొగడ ♦ నితఁడు మహీచక్ర మేలుచుండె
నొలసిన వేడుక నొకనాఁ డదన్ను ♦ బలసి యక్షౌహిణీ బలములు గొల్వ
వెడలి కాననముల వేడ్కలు సల్పి ♦ పుడమి యంతయు జరింపుచు జాలబడలి
బహుగంధబంధుర ప్రసవమంజరుల ♦ బహుఫలంబుల నొప్పు పాదపావళుల
బహుపక్షిరవముల బ్రహ్మఘోషముల ♦ బహుసరోవరముల బహుళ వేదికల
నలరుచు జాతివైరాదులు లేక ♦ మెలఁగు నానావిధ మృగసమూహముల
ననిలాంబుజీర్ణ కర్ణాశులై తపము ♦ నొనరించు తపసుల యోగిపుంగవుల
బన్నగ ఖేచర ప్రముఖ గంధర్వ ♦ కిన్నరాదుల వాలఖిల్యాదిమునుల
గడు నొప్పి బ్రహ్మలోకము పోలెమిగుల ♦ నడరు వశిష్ఠుని యాశ్రమంబునకు
నతిముదంబున వచ్చి యావసిష్ఠునకు ♦ నతినిష్ఠ మ్రొక్కిన నతఁడు దీవించి
యుచితాసనంబున నునిచి పూజించి ♦ ప్రచురరసస్వాదు ఫలమూలతతుల
వరుసతో నిచ్చిన వాని గైకొనుచు ♦ గరములు ముకుళించి కడుభక్తి బలికె
ననఘాత్మ తపసులు నగ్నిహోత్రములు ♦

జనలోకనుతములై జరుగుచున్నవియె

మీరును శిష్యులు మీయాశ్రమమున ♦ నారంగ వీరు వారన కెల్లవారు
ముదమున నున్నారె మునినాథ యనిన ♦ నొదవు సమ్మదమున నున్నార మేము
నీతితోఁ జేయుదె నీవు రాజ్యంబు ♦ ప్రీతిమై భరియించు భృత్యవర్గముల
ముద మొప్ప రాజ్యాంగములు పరీక్షింతె ♦ వదలక నిర్జింతె వాలు శాత్రవుల
గుశలమే సర్వంబు కుశలమే నీకు ♦ కుశలమే నీపుత్ర కలత్ర బత్నులకు
ననిపల్క మీకృప నఖిలంబు కుశల ♦ మనియె గౌశికుఁ డంత నవ్వసిష్ఠుండు
కరమర్థి మాయింటి కడ విందుగుడిచి ♦ యరుగుమయీ యని యతని బ్రార్థింప
నందుకు కౌశికుం డనుమతించుటయు ♦ విందుసేయుటకునై వేగంబ యతఁడు
తన హోమధేనువు దలచి రప్పించి ♦ జననాథవరునకు సకలసేనలకు
వివిధ భక్ష్యంబులు వివిధ భోజ్యములు ♦ వివిధ భంగుల విందు వేడ్క గావింప
వలయు గావున నీవు వలయు వస్తువులు ♦ గలిగింపు మనవుడు గామధేనువను

గలమాన్నతతులు శాకములు భక్ష్యములు ♦
        కలవంటకము లూరుగాయ లంబళ్లు
ఘనవిశేషంబులు పాయసాన్నములు ♦ చెలువారు వెన్నలు చీనిచక్కెరలు
సద్యోఘృతములు రసాయనంబులును ♦ మధ్యవిశేషము ల్మాంసభేదములు
వాపిరిమఱియు నవ్వారికినేమి ♦ కావలెనవి యడుగకయె కల్పింప
నాధేనుమహిమ కత్యాశ్చర్యమొంది ♦ గాధేయుడప్పుడు కడిమాడసేయు
గుడిచిసేనలుదాను గోర్కిదీపింప ♦ గడుదృప్తిఁజెంది యాగాధితనూజు
డీకామధేనువు వెబ్బగ్నైనఁ ♦ జేకొందుననుచు వసిష్ఠుని జేరి
లక్షగుఱ్ఱంబులు లక్షధేనువులు ♦ లక్షయేనుగులు వేలక్షలుమణులు
నిచ్చెదనీధేను విమ్మునాకనిన ♦ నిచ్చలోమునినాథుఁ డంతయువగచి
యిదినాకుజీవనం బిదినాకుఁబ్రాణ ♦ మిదినాదపంబుల కెల్లసాధనము
హవ్యకవ్యంబులు నతిథిసత్కార ♦ మవ్యాహతముగ నీయావుచేనడచు
నీపుణ్యధేనువు నీజాలననిన ♦ నాపూర్ణబలుడు విశ్వామిత్రుఁడలిగి
యిమ్మనిబలిమాలి యేవేడనేల ♦ రమ్మనిభట సహస్రంబులఁదాను
గోవునుద్ధతిఁబట్టి కొనిపోవఁబోవ ♦ బోపకయదిముని పుంగవుఁజూచి
యనఘవసిష్ఠసంయమిచంద్రనన్ను ♦ గొనిపోవుచున్నాడుక్రొవ్వి కౌశికుఁడు
వారింపవకట దుర్వారుండవయ్యు ♦ యూరకతగునయ్య యొప్పింపనన్ను
ననఘాత్మనీయెడ నపరాధిగాను ♦ ననునుపేక్షించుట నాయమేనీకు
ననుడుధేనువుమాట కావసిష్ఠుండు ♦ మనమునఁగృపపుట్టి మఱుమాటఁబలికె
నేనేలవిడుతు నిన్నంతయుబలిమి ♦ భూనాయకుఁడుగొని పోయెడుగాని
క్షత్రియులుద్దండ చారిత్రులైన ♦ ధాత్రిసురోత్తము ల్దారెంతవార
లీక్షోణికధిపతి యీగాధితనయుఁ ♦ డక్షౌహిణీబలం బతనికిగలదు
ఏవిధంబునగెల్తు నితనినేననిన ♦ నావసిష్ఠునితోడ నాధేనువనియె
మునినాధనృపతేజ మునకంటెనెందు ♦ వినుతింపనెక్కుడు విప్రతేజంబు
గావుననీకంటె గౌశికుండెక్కు ♦ డేవెంటఁగాకుండు టేనెఱుంగుదును
బనుపుమునన్ను నీబలములనెల్ల ♦ మునుకొనియడచెద మునినాథయనిన
నావసిష్ఠుఁడుధేను నపుడుసైన్యముల ♦ గావించుబలములఖండింపుమనక
ననవినిహుంకారమడరించుటయును ♦ గనుగొనఁ ధేనుహుంకారంబునందు
ఘనవాలలతయందు గర్ణంబులందుఁ ♦
        దనురుహంబులయందు దంతంబులందు
ఖురమధ్యములయందుఁ గొమ్ములయందు ♦
        నురులోచనములందు నూర్పులయందు

మొనయజంఘులయందు మోకాళ్లయందు ♦
ననునొందఁ దొడలందు నధరంబునందు
గాఢతరంబైన గంగడోలందు ♦ రూఢిగాఁగూడిన రోమకూపములఁ
గరలురంకెలను సక్థిప్రదేశమునఁ ♦ బోరినుద్భవించిరి భువనభీకరులు
కైరాతపల్లవ కాంభోజయవన ♦ వీరులు పెక్కండ్రు విషమవిక్రములు
చిత్రరూపాఢ్యులు చిత్రాయుధులును ♦ జిత్రవిలోచనుల్చిత్రహుంకృతులు
నై వీరులై ధీరులై మహోదారు ♦ లై వారుసేనా సహాయులై మఱియు
వారులతోఁ గరులతో సందందగడిమి ♦ బరగివిశ్వామిత్రుబలము లద్రుంప
జూచియాకౌశికు సుతులనూర్వురును ♦ నేచినానాహేతి హేతులనిగుడ
వచ్చివసిష్ఠుని వధియింపఁగడఁగ ♦ యచ్చటభస్మమై రతని హుంకృతికి
నంతవిశ్వామిత్రుఁ డఖిలసైన్యంబు ♦ లంతకుపీటికి నరుగుటచూచి
యతులపరాక్రములగుచున్నతనదు ♦ సుతులచావునుజూచిశోకించియంత
దనరాజ్యమునొక్కతనయునినునిచి చనిహిమాచలమునజలమునవిలిచి
త్రిపురారిగూర్చి యతిప్రయత్నమున ♦ దపమొనరింపబ్రత్యక్షమౌటయును

—* కౌశికుడు ఈశ్వరునిచేతనస్త్రాదులబడసి వసిష్ఠునితో బోరుట *—

హరుచేతవివిధ శస్త్రాస్త్రముల్వడసి ♦ యురువడిజనుదెంచి యుగ్రుడై కడగి
మొగివసిష్ఠాశ్రమంబున వహ్నిశిఖలు ♦
నెగయబల్లెగసె నాగ్నేయ బాణముల
నప్పుడుబాణాగ్నులాశ్రమంబెల్ల ♦ గప్పిమండుటయును గనివసిష్ఠుండు
కాలదండముఁగొన్నకాలుండొయనగ ♦ గేలదండముదాల్చికినుకతో వెడలి
హోరివిశ్వామిత్ర యోరిపాపాత్మ ♦ భూరిపుణ్యాశ్రమంబులుగాల్పదగునె
మొనయనీవెక్కడ నేనెక్కడనిన ♦ ఘనరోషచిత్తుఁడై కౌశికుండప్పు
డతనిపై రౌద్రంబు పాశుపతాస్త్ర ♦ పటుతరవజ్రంబు బ్రహ్మపాశంబు
కనలుపైశాచంబు కాలపాశంబు ♦ ఘనవిష్ణుచక్రంబు కాలచక్రంబు
వారుణగాంధర్వ వాయవ్యసార ♦ ఘోరాస్త్రకోటులు క్రూరుడై యేయ
గలయంగ విస్ఫులింగంబులుచెదర ♦ బలువిడినుగ్గాడె బ్రహ్మదండమున
నలుకవిశ్వామిత్రుడంత బ్రహ్మాస్త్ర ♦ మలవడసంధించియార్చియేయుటయు
సకలగీర్వాణులు సకలసంయములు ♦ సకలగంధర్వులు సకలపన్నగులు
సకలభూతంబులు సకలదిక్పతులు ♦ సకలతారాగ్రహ చంద్రసూర్యులును
సకలలోకంబులు చలనంబునొంది ♦ సకలదిక్కులుమండ జండవేగమున
బ్రహ్మాండభాండంబు బలువిడినగడి ♦ బ్రహ్మదండముదాటి పరతేరఁజూచి
బ్రహ్మాదులరు నడ్డపడరానియట్టి ♦ బ్రహ్మాస్త్రమవలీల బట్టుకమింగె

సుకుచిర బ్రహ్మతేజోమూర్తి వెలుఁగ ♦ నరుదార నమ్మునియంగరోమముల
నెఱిమంటలెగయ ననేక బాణంబు ♦ లరిమురి వెడలి విశ్వామిత్రుఁ దాఁకి
చుఱుబుచ్చ దొడగిన జూచి కౌశికుడు ♦ నెరిచెడి యెంతయు నిజసత్త్వమెడలి
తరమిడి యాబ్రహ్మదండ మొక్కటను ♦ వరశస్త్రకోటులు వమ్ములై పోలిసె
నస్త్రస్త్రమకలమీ యన బ్రహ్మబలము ♦ క్షత్రబలంబది గాల్పనేయనుచు
చెనటియై మునిగిడి కౌశికుఁడాలుదాను ♦ జనిఘోరతపమర్థి సలుపుచునుండె
అటమీఁద సుతుల విశ్వామిత్రుమౌని ♦ పటుసత్త్వవంతుల బడసెనల్వురను
వినుము దుష్యంద హవిష్యంద నాము ♦ లసదృఢనేత్ర మహారథులనగ
జ॰ ముడింపక పెక్కుసంవత్సరమ్ము ♦ లలఘునిష్ఠల దపం బటుసేయ మెచ్చి
వనజసంభవుడంత వచ్చి కౌశికుని ♦ గనుగొని యెంతయుఁ గరుణించి పలికె
నీతపంబున మెచ్చి యిచ్చితినీకు ♦ బ్రీతిమైనిటరాజ ఋషిపదంబనఘ
యనిపోవ గాధేయుఁ డతిదీనుఁడగుచు ♦ నెనయంగనీతపం బెంత చేసినను
గడపట బ్రహ్మర్షిగా నేరనైతి ♦ నెడపడి చెడిపోయి యీయుగ్రతపము
ఈరాజఋషిపదం బేనొల్లననుచు ♦ ఘోరతపంబు గైకొని సేయుచుండె
అంత నిక్ష్వాకుకులాగ్రణియైన ♦ సంతతకీర్తి త్రిశంకుడన్రాజు
తనువుతోడను గూడి తానాకమునకు ♦ నొసరంగ జనుజన్న మొనరింపదలచి
భక్తి వసిష్ఠుని పాలికేతెంచి ♦ యుక్తమార్గంబున నుపచరించుచును
దివిజలోకమునకీ దేహంబుతోడ ♦ సవనంబు గావించి చనగోర్కె నకు
ననురక్తిగావింపుఁ డనఘ నాచేత ♦ మునులరప్పింపుడు ముదమొప్పననిన
నరనాథ యొడలితో నాకలోకమున ♦ కరుగ నసాధ్యమీ యవనీశులకును
అనవుడు రాజన్యుఁ డటదక్షిణమున ♦ ఘననిష్ఠఁ దపమర్థిఁ గావించుచున్న
చిరపుణ్యులైన వసిష్ఠపుత్త్రులకు ♦ గరమర్థిఁ బ్రణమిల్లి కరములుమోగిచి
దేవలోకమునకీ దేహంబుతోడ ♦ బోనచ్చు యాగంబు పూని నాచేత
జేయింపుఁడనిన వసిష్ఠుఁడీ తెఱఁగు ♦ సేయుఁడీయనినేని చేయింతుమనుడు
నా రాజచంద్రుఁ డిట్లనియె వసిష్ఠుఁ ♦ డేరాజులును జేయ రీక్రతువనియె
మీకడనిటురాక మీరైననన్ను ♦ జేకొని యజ్ఞంబు సేయింపవలయు
నరయ బురోహితు లగువారుగారె ♦ ధరణీశులకు సర్వధర్మసాధకులు
అనిన వాసిష్ఠులా యవనీశుఁ జూచి ♦ ఘనుఁడు వసిష్ఠుండు గాదన్న తెఱగు
నిర్మలమతి నోరు ల్నేర్తురే సేయ ♦ దుర్మతి వగునీకుఁ దోఁపదు గాక [యె
యనిపల్కి నిర్విణ్ణుఁడై సంయమీంద్రు ♦ తనయులఁ జూచి యా ధరణీశుఁడని
మీతండ్రి నిరసించె మీరును జేయ ♦ రైతిరే తెఱఁగున నైనసీక్రతువు
హితబుద్ధిలేని మీరేల నాకింక ♦ నితరులచేతఁ జేయించెదఁ గాక

యనినజండాలుండ వగుమంచునలుక ♦ గసుగొనిపల్కి రాఘవపుణ్యులంత
థ సురంబగుభూమి పాలుతేజంబు ♦ వాసిష్ఠకోపాగ్ని వడిఁగావలెననఁగ
నారయనీ దేహంబునుసీలి ♦ చీరయుజుంజురు శిఖయునుదనర
నంటనశుద్ధంబు లై నమాలిన్య ♦ మంటించునీరూప మసుభంగిఁదోఁపఁ
బ్రణుతిసర్ణసూత్రిబంగినకనక ♦ మణిభూషణములోహమయములై తనర
నొజమైగప్టరా మో క్తిభేదముల ♦ నాజాతికనురూపమైనరూపమున
జననాథుడతిఘోర చండాలభావ ♦ మొనరంగ జేద్పడి యున్నసీక్షించి
పౌరభృత్యామాత్య బంధువర్గంబు ♦ లారాజువర్జించి రంతనారాజు [ను
నొదవినభయమునసొయ్యమెట్టుచును ♦ నొదుకుచుజనులకునోసరించుచు
జనిమహామహుని విశ్వామిత్రుగనిన ♦ గనికరంబొదవ నాగాధితనూజు
డిలనయోధ్యాపురం బేలెడినీకు ♦ నెలిమిజండాలత్వ మేలపాటిల్లె
నేశలంపుఁవచ్చె నెరిగింపుమనిన ♦ నాతండుముకుళిత హస్తుడై పలికె
నిరవొన్దభొద్దితో నింద్రలోకమున ♦ కరుగజొప్పకుసట్టి యాగంబుమున్ను
చేయింపుడనిన వసిష్ఠు డీతెఱగు ♦ సేవింపరాదని చెప్పెను త్తరము
నావసిష్ఠునిపుత్రు లగువారునతడు ♦ గావింపగాదన్న గాదనిపలికి
రితరులచేత జేయింతునన్నాట ♦ కతిరోషమునమాల వగుమన్న నె తి
నసఘునా చేసెద నన్నయధ్వరమ ♦ నొనరింతునామాట కొగిబొంకు లేదు
ఇట్టియాపదయందు నిటమీదన్న న ♦ నెట్టనసత్యంబు నెగడబాలింతు
బెక్కుధర్మంబులు పెక్కుజన్నములు ♦ పెక్కువతో జేసి పెంపుగై కొంటి
గురులబూజించితి గురులునావలన ♦ గరుణచాలమి ధర్మకార్యంబునిలిచి
పౌరుషంబది దేవ ఫలములేకున్న ♦ నేరమివాటిల్లు నిక్కువంబరయ
నేవిధంబునన్నె న నీవునాపాలి ♦ దైవమైరక్షింప దగుదునాకనియె
ననినవిశ్వామిత్రు దతనినీక్షించి ♦ జననాథనీవింక సంతాపముడుగు

—:* త్రిశంకునికై కౌశికుఁడు యజ్ఞంబుచేయ నారంభించుట *:—

దీనుని జేపట్టితిని త్రిశుద్ధిగను ♦ మానులరప్పించి మఖము సేయించి
దేహంబుతోడనే తివిరి నీబలుక ♦ పోహంబుగాకుండు బుచ్చెదదివికి
వినునిన్నుబరమ పవిత్రుగావింతు ♦ ననిపల్కి శిష్యుల నంపరజూచి [సకు
మునుకొనియీరెల్ల మును బుత్విజుల ♦ గొనిరండువే త్రిశంకుని యాగము
నవిని యోగించిన నట్లవారేగి ♦ మునివరేణ్యులనెల్ల మొగిదోడితెచ్చి
కలయువిశ్వామిత్రు కడకునే తెంచి ♦ చ మెదినిల్చిరి సంయమీశ్వరుల
వారువసిష్ఠు నాశ్రమవాసులెల్ల ♦ వారలుదక్కంగ వచ్చిరందఱును
ఆవసిష్ఠునిపుత్రు లాడిరికొన్ని ♦ యావాక్యములు వినుమంచువారనిరి

మతివిచారింపక మఘముసేయించు ♦ నతడురాజటమాలడటసేయువాడు
చండాలుమఘమున సకలమునీంద్రు ♦ లుండిభోజనములే యుక్తిజేసెదరు
అడకేమొగముల నరుగుదెంచెదరు ♦ వేడుకసురలు హావిర్భాగము నకు
బరగవిశ్వామిత్ర పాలితుండైన ♦ నరుడెట్లులొందెడు నాకలోకంబు
వినవిస్మయంబని వెలయదూషించి ♦ రనినవిశ్వామిత్రుఁ డగ్నియైమండి
కడునిష్ఠదపమిట్లు గావించునన్ను ♦ నడరిదూషించు పాపాత్ములిందఱును
మాతనగతినేడు నూఱుజన్మముల ♦ బాగుగాగ్రవ్యాద భావంబుదాల్చి
మానవశునకాది మాంసముల్దినుచు♦హీనులై చరియింప నిమ్ములోకముల
నసమునన్నాడు నామహోదయుడు ♦ వసుధనిషాదుడై వర్తింపనిమ్ము
అనిశపియించి సంయములవీక్షించి♦మునులారయీరాజ ముఖ్యుత్రిశంకు
నున్నతకులశీలు నురుకీర్తిలోలు ♦ సన్నుత ధర్మజ్ఞు సత్యప్రతిజ్ఞుఁ [గనిన
గ్రతువు సేయింపుఁడు గాత్రంబుతోడ ♦ నితఁడింద్ర పురికేగు నిరవొప్ప
నాఋషిమాటల కమ్మహామునులు ♦ దారువిచారించి తమలోనననిరి
గాధిసూనునిమాటగాదంటిమేని ♦ క్రోధించిశపియించుగ్రూర వాక్యముల
గానఁజేయింతముగ్రతువుకౌశికుఁడు ♦ మానుగాజెప్పినమహితమార్గమున
ననిపల్కిమునులెల్ల సధ్వరకర్మ ♦ మొనరింపనామంత్ర యోగాదులమర
నాగాదితనయుండుయాజకుండగుచు ♦ యాగభాగములకునమరులబిలిచె
బిలిచినరామంచుఁ బేరెలుంగెత్తి ♦ పలికిరిసురలటు పలుకఁగౌశికుఁడు
కుశపవిత్రముచేత గొనిస్రువంబెత్తి ♦ దిశలరోషానల దీప్తులునిగుడ
నాకేంద్రలోకంబునకు త్రిశంకుండ ♦ నీకోరినటువలె నిన్నుబుచ్చెదను
నడరంగనేబాల్య మాదిగానియతి ♦ విడువకతపము గావించితినేని
బొందితోడనెకూడ బోయిస్వర్గంబు♦నందుముపొమ్మన్న నాత్రిశంకుండు
తత్తపోబలమునఁ దడయకయెల్ల♦సత్త్వములేగెడి సరణిబోవుటయు
జండాలుడవునీవు స్వర్గలోకమున ♦ నుండనీనని యింద్రుండుదరిత్రోపింప
గ్రడకవిశ్వామిత్ర కావవేయనుచు ♦ నడిదలక్రిందుగా వచ్చుచునున్న
శరణార్థియైన త్రిశంకునిజూచి ♦ కరుణావిధేయుడై గాధేయుడపుడు
జననాథ నీవాకసమునందెనిలువు♦మనిపల్కినిలుపుచు నటదక్షిణమున
పలుకత్రిశంకున కమరేంద్రుతోడి ♦ చలమునవేఱొక్క స్వర్గంబుసేసి
లలినందుసప్తర్షులనుతారకముల ♦ నలవడగల్పించి యారాకమునకు
వేఱుదేవతల గావింపనింద్రునకు ♦ మారింద్రుగల్పింప మదిదలంచుటయు
జాలభీతిలిసర్వ సంయముల్సురలు ♦ నోలివిశ్వామిత్రు నొద్దకేతెంచి
యిలలోనమునినాథ యాత్రిశంకుండు ♦ దలపోయగురుశాపదగ్ధుండుగాన

దగనాకమున నుండ దగదన్నమాట ♦ తగవుగాఁగొని గాధితనయుండు పలికె
సురలార యీతని సురలోకమునకు ♦ నరిగెడి మేనితో ననిపల్కినాఁడ
నామాట నిజముగా నైన నీనాక ♦ మీమహీనాథున కిటు చెల్లనిండు
ప్రభనొప్పు లోకముల్పరగు నందాక ♦ నభమున బోలించి యీనక్షత్రములను
గలయ నచ్చరవీధి గంటెను మీఁద ♦ దొలఁగని తేజంబుతో జెలువొంది
బృందారకస్ఫూర్తి పెంపొందు శిరము ♦ క్రిందై త్రిశంకుఁడు కృతపుణ్యుఁడగుచు
కర మొప్పు నీ తారకంబుల నడుమ ♦ నురుతరకీర్తిమై నుండ నిండనిన [సులు
ననుమతించుచు నప్పుడాయనుగ్రహముఁ ♦ గొనియాడి మునివీడుకొని సురల్మ
లలి నిజస్థానంబులకు వేగిరంత ♦ నెలమి గౌశికుఁడు మునీంద్రులఁ జూచి
యిమ్ముగానట మీఁద నిదితపంబునకు ♦ సమ్మర్దమిక్కడ జాలంగ గలుగు
మునులార మనమింక ముదముచిత్తమున ♦
దనర నొక్కెడకు బోదము రండటంచు
గడక నక్కడ బాసి కదలి విశాల ♦ కడ కేఁగి యందు బుష్కరతీర్థమాడి

—:* అంబరీషుఁడు యజ్ఞపశువుగా శునశ్శేపుని గొనిపోవుట :*—

యంబుఫలాహారి యగుచు బెక్కేండ్లు ♦ పంబిన నిష్ఠఁ దపంబు గావించి
యంబరీషుండ యోధ్యాపురీవిభుఁడు ♦ శంబరరిపుమూర్తి సముఁడట్టియెడను
వెలయంగ క్రతువు గావింపగా బూని ♦ బలభేది చే యాగపశువు గోల్పోయి
యరసి లేకున్న బ్రాయశ్చిత్తవిధికి ♦ నరపశు నడుగుచు నానాశ్రమముల
నరయుచు నందంద నటనొక్కమౌని ♦ వరునింటికడకు భూవరుఁ డేగుదెంచి
భృగుతుంగవాసియై పేదయై నియతి ♦ దగనున్న ఋచికునొద్దకు బోయి మ్రొక్కి
కరుణాఢ్య యేనా యాగము సేయఁగోరి ♦ పరికింపనేరక పశువు గోల్పడితి
గొనకొని యొకలక్ష గోవుల బుచ్చు ♦ కొని యాగపశువుగా గొడుకు నాకిమ్ము
నావుఁడు నాతండు నా పెద్దకొడుకు పై వేడ్క సేయుదుఁ బశువుగా నీను
నావుడు మునిపత్ని నా పిన్నకొడుకు ♦ పై వేడ్క సేయుదుఁ బశువుగా నీను
అని యిరువురు పూని యాడువాక్యములు ♦ విని శునశ్శేపుడుర్వీపాలుజూచి
తన పెద్దకొడుకు మా తండ్రి పాటించు ♦ దన పిన్నకొడుకు మా తల్లి పాటించు
వారలు నీకేల వచ్చెద నేను ♦ కోటి వీరల కిమ్ము గోసహస్రముల
ననిన నట్లయొనర్చి యమ్మునిపుత్త్రుఁ ♦ గొనిర. ంబెక్కించుకొని శీఘ్రవృత్తి
జననాథుఁ డంతయు సంతోషమొప్ప ♦ జనచని పుష్కరాశ్రమభూమి జేర
నచట శునశ్శేపుఁ డతితపోనిష్ఠ ♦ నచలుఁడై యున్న విశ్వామిత్రుఁ గాంచి
తన మేనమామ యాతఁడు గాన ప్రేమ ♦ ననలొత్త ననుచితప్రణాముఁడై పలికె
ననుదల్లితండ్రు లీ వరవరాగ్రణికి ♦ ననఘాత్మ పశువుగా నమ్మిపొమ్మనిరి

చెలువొప్ప నీ రాజు సేయు జన్నంబు ♦ ఫలియింపఁ జేసి నా ప్రాణముల్ గావు
దల్లియుదండ్రియు దైవంబు గురువు ♦ నెల్ల చుట్టములు నాక వేఱ నీవె
యని దైన్యమొంద విశ్వామిత్రమౌని - దనతమాభవుల నందఱ జూచి పలికె
ప్రాకటంబుగఁ దమ పరలోకమునకు ♦ నైక దా సుతులఁ బుణ్యాత్ములుగనుట
పరలోకమిదియె నా పాలికి నన్ను ♦ శరణంబు జొచ్చె నీ సంయమి పుత్త్రు
డితఁడు నా మేనల్లు డితని రక్షింపు ♦ డితనికై ప్రాణంబు లిడుఁడు మీ రొకరు
అడిగెద మిమ్మన్న నలు సేయఁ గొడుకు ♦ లొడఁబడమన్న త్యాగుడై మండి
శునకమాంసము దిన్ను సారిది వేయేడులనుభవింపుఁడు దుఃఖమని శాపమిచ్చి
కౌశికుఁడత్యంత కారుణ్యబుద్ధి ♦ నా శునశ్శేపు నొయ్యన జేరఁబిలిచి
యేను మంత్రములు రెండిచ్చెద నీకు ♦ వాని ననుష్ఠింపు వదలక నీవు
అవి నిన్ను రక్షించు నంబరీషునకు ♦ నవసతంత్రంబును సఫలంబు సేయు
నని చెప్పి మంత్రంబు లవి రెండు నిచ్చె ♦ ననుపమ భక్తితో నతఁడు గైకొని యె
వాఱు నాడు వచ్చి యమ్మనుజవల్లభుఁడు ♦ వఱలెడు తన యజ్ఞవాటంబు జొచ్చి
విశసింపఁ బూని యా విమలాత్ము దెచ్చి ♦ పశుపూజ చేసి యూపమున బంధించి
నంత శునశ్శేపు డమ్మంత్రజపము ♦ శాంతుఁడై చేయుచు జలియింపకున్న
నచటికిం ద్రోపేంద్రు లర్థితో వచ్చి ♦ సుచరిత్రు నంబరీషుని జేరఁబిలిచి [యె
క్రతుపూర్ణఫలమిచ్చి కడనున్న రుచికు ♦ సుతు జిరాయువు చేసి సురలతో జని
అరుదైన తపమున నంత వెయ్యేండ్లు ♦ జరిపిన బ్రహ్మ విశ్వామిత్రు గదిసి
నీకు ఋషిత్వంబు నీ తపశ్శక్తి ♦ జేకూడె నని యొప్ప జెప్పి విచ్చేసె
నంతటఁ దనియక యత్యుగ్రతపము ♦ సంతతనియతితో సలుపుచునుండ
గాముదీమము లీల గైకొన నేర్చు ♦ కాముని బాణంబు కమనీయకంబు

—:* విశ్వామిత్రుడు మేనకను గూడుట *:—

చెలువొందనప్సర స్త్రీమూర్తి దాల్చి ♦ మెలగెడు గతితోడ మేనక యపుడు
లలితయౌవనకళా లావణ్యగణ్య ♦ జలకేళి దేల నా సతి జారుకొప్పు [లును
చికిలి చూపులును నును జెక్కుల ముద్దు ♦ మొకము కెంపుల మోవి మొలక నవ్వు
బాంగారు కుచకుంభములు పదార్వన్న ♦

బంగారు పోడిరాలు బాహుమూలములు

చిన్నారి నూగారు సింగంపు గౌను ♦ సొన్నపూ పొక్కిలి బొదలెడు పిఱుదు
లూరులతీసనో రూరగా జూచి ♦ పేరు వాడి మరుండు పెళపెళనార్వ
ధ్యానంబు మౌనంబు దపము బోకార్చి ♦ మేవగకళ్లరిమ్ము మేనకజూచి
నన్ను గాయజకేళి సలినాక్షి పొందు ♦ మన్న నామాటను నంగీకరించిం
పదియేండ్లు మదిసోలి భావజకేళి ♦ పదమదంబుగ సౌఖ్యసరసిని దేలి

మఱివివేకముపూని మానియెంతేని ♦ దఱుగనితనతపో ధనముపోవుటకు
బరితపించుచుమది పదిలంబుచేసి ♦ సురలోకమునకు నాసుదతివీడ్కొలిపి
యింద్రుని యత్నంబు లివియంచుదెలిసి ♦

యింద్రియ జయశుద్ధి యేగాంతుననుచు
శీతాద్రికరిగి కౌశికిచెంతఁజేరి ♦ యాతపంబునను మహాతపంబవుడు
వర్షముల్ పైకైకొన వచ్చివిరించి ♦ హర్షించినీవు మహర్షి వైతనిన
నీరజాసననన్ను నీవునీచిత్త ♦ మారంగ బ్రహ్మర్షి యన్నంతదాఁకఁ [దు
జరియింతుదపమన్నఁ జరియింపుమనుచు ♦ నరవిందభవుడేగ నంతకౌశికు
బ్రహ్మదేవుడుపోవ బరమపావనత ♦ బ్రహ్మర్షి తనకును బడసెదననుచు
నూరుపువుచ్చకయూర్ధ్వబాహుండు ♦ మారుతాహారుణ్డుమానియు నగుచు
బనివడి వేసవి బంచాగ్నిమధ్య ♦ మువవానకాల మిమ్ములబట్టబయిట
మంచుకాలంబున మడుగులయందు ♦ నంచితంబుగ జేసె నత్యుగ్రతపము
నీభంగి వెయ్యేడు లేగినపిదప ♦ సౌభాగ్యవతిరంభ జంభారిచూచి
యెలమిమై దేవతాహితకార్యమొకటి ♦ చెలువార నేనీకు జెప్పెద వినుము
సురహితంబుగ గాధిసూనుతపంబు ♦ పురుచిర బుగమాన్పుసుందరియనుడు
క్రూరతపంబుగైకొని యున్ననతని ♦ జేరనాతరమె శచీనాథనీకు
మ్రొక్కెదనమ్మహా మూర్ఖునిదిక్కు ♦ నిక్కచూడగనోప నీపాదమాన
నా కేశకోపించు ననుశపించు ♦ నాకౌశికని సైపననిజాలిబడుచు
నెఱఁగిమెఱింగి తా రెట్టివెంగలులు ♦ కొఱవిచేదలగోకు కొనువారు గలరె
యనవినియింత భయంబేసనీకు ♦ మనసిజమాధవు ల్మరిసహాయముగ
వత్తురుచనుమన్న వనితయునితని ♦ చిత్తమెఱింగి చచ్చెఱభూమికరిగి
గాధిసూనుండున్న ఘనతపోవనము ♦ మాధవమన్మథుల్మరి సహాయముగ
గిరకోకిలసమా కీర్ణమయూర ♦ శారికానిడశుకీ సహితమైచొచ్చి
యారంభయును మనోహరలాస్యగరిమ ♦

వారంభమొనరింప నలిగికౌశికుడు
పదివేలవర్షము ల్పాషాణభావ ♦ మొదవంగగైకొని యుండియామీద
నురుతపోనిధియైనయొకవిప్రువలన ♦ సరసిజాననపొందు శాపమోక్షంబు
ననిపల్కపాషాణ మయ్యెనారంభ ♦ మనసిజుడును నేనె మతిభీతుడగుచు
దనతపంబొక్కింతి దఱిగిననంతఁ ♦ దనలోననగ్గాధి తనయుఁ డూహించి
యపుడు కామంబున గెడఁ చెనాతపము ♦ నిపుడు క్రోధంబునకిచ్చితిననుచు
మదిలోననగచి కామంబుక్రోధంబు ♦ వదలినిరాహార వంతుఁడై నియతి
జితేంద్రియుండునై వేయువత్సరము ♦ లజుడు మెచ్చగదపం బతినిష్ఠ జేసి

యనయంబు బ్రహ్మర్షి ననిపించుకొందు ♦
ననియుత్తరము వాసి యటదూర్పు దెసకు
నెనసి వెండియును దేవేంద్రుండు సేయు-ఘనవిఘ్నకోట్లకు గదలక నిలిచి
యరుదెన్నియంత సిద్ధాశ్రమభూమి ♦ నురుఘోరతపము సేయుచునుండఁగలిగ
వరతపోనియతిమై వర్షసహస్ర ♦ మరుగఁ బారణసేతు ననియున్న చోట
నివ్వరిబియ్యంబు నెరినెరిఁ దెచ్చి ♦ యవ్వియన్నియుఁ బాక యత్నంబు చేసి
యారయ దేవతార్పణముగాఁ జేసి ♦ వారవిభుజియింపవడిఁ దలంచుటయు
బలభేదియొకముది బాపఁడై వచ్చి ♦ నిలిచి గ్రాసము వేఁడ నెమ్మితో నిచ్చి
నాయమరాధీశుఁ డడరి భోజనము ♦ చేయుచో నన్నంబు శేషింపకున్న
మఱియును వెయ్యేండ్లు మౌనియైనిలిచి ♦ తఱుగని నిష్ఠతో దపమాచరింప
నప్పుడు మునినాథునొదలఁ బుట్టి ♦ కప్పెలోకములనుత్కటమైనపొగయు
గలగెబయోధులు కంపించెధరణి ♦ కలగిరులదరె దిక్కులుఁ జిక్కువడియె
నమరులుగంధర్వులఖిలసంయములు ♦ కమలగర్భుని బ్రీతిగని మ్రొక్కియనిరి
యాయతచిత్తుడై యత్యుగ్రతపము ♦ చేయుచున్నాడు చెలగి కౌశికుడు
అతని మనోరథం బర్థిసిద్ధింప ♦ మతిమెచ్చి తపమింక మాన్పకయున్న
యనఘువిశ్వామిత్రు నత్యుగ్రమైన ♦ ఘనతరవహ్నిచేఁ గాలు లోకములు
అనవినివారితో నప్పుడు కదలి ♦ వనజాసనుఁడు వచ్చి వరదుడై నిలిచి
వినుముకౌశిక యింక విపరీతతపము ♦ పనిలేదు చాలింపు బ్రహ్మర్షివైతి
వనిన గౌశికుడు బ్రహ్మాదిదేవతల ♦ గనుగొని పల్కె నక్కజమైనభక్తి
బ్రహ్మర్షి పదమేను పడసితి నేని ♦ బ్రహ్మపుత్త్రుఁడు లోకపావన మూర్తి
చిరపుణ్యశాలి వసిష్ఠుఁడు వచ్చి ♦ యరసి నన్ బ్రహ్మర్షి వనకున్న నమ్మ
ననిన వసిష్ఠుని నబ్జసంభవుడు ♦ ననిమిషులును బిల్వ నర్థితో వచ్చి
బలితంపు దపమున బ్రహ్మర్షివైతి ♦ తెలిసితి మింక సందేహంబు లేదు
ముదమొప్ప ననుమన్న మునివసిష్ఠునకు ♦ బదిలుడై మ్రొక్కి సద్భక్తి బూజించె
సంతవిశ్వామిత్రు నఖిలదేవతలు ♦ నెంతయు దీవించి యేగిరి దివికి
నాహూథపదుడు విశ్వామిత్రు మహిమ ♦ లారయ నిట్టి మహాద్భుతక్రియలు
అనిపల్క రాముడు నాలక్ష్మణుండు ♦ జననాథులును సభాసదులు మోదిలిరి
యిల్లడ జనకుని యింటను గ్రాత్తు ♦ డెల్లరెఱుంగమున్నిడిన చాపంబు
కడకమైవిఱిచి రాఘవుడేపుమెఱసి ♦ కడుమోదమున సీత గైకొనునెల్లి
ననిరసాతలమున కంతయుఁ జెప్ప ♦ జనినచందమున భాస్కరుఁడస్తమించె
జనకుపీడ్కొని గాధిసంభవుకొక్క ♦ యునికిపట్టున రామయుక్తుడై యుండె
ననుపమప్రీతితో నారాత్రిగడపి ♦ యనుపొడుపున నిత్యకృత్యముల్దీర్చి

జనకుచెంతకు రామసహితుఁడై పోయి ♦ యనియె విశ్వామిత్రుఁ డందఱు వినఁగ
నినకోటిసమ తేజు లీవిశ్వమూర్తు ♦ లనఘకీర్తులు వీర లన్యగోచరులు
యీపుణ్యధనులు నీయింటిలో నున్న ♦ చాపంబు చూడఁగ జనుదెంచినారు

—:* జనకుండు శివుని చాప మెఱింగించుట *:—

ఆవిల్లు దెప్పింపు మనవుడు జనక ♦ భూవరుం డప్పు డద్భుతమంది పలికె
భవుఁ డంధకాసుర భస్మాసురాది ♦ దివిజారివరుల సాధించె నావింట
నుల్లాసుఁడై శివుఁ డుగ్రదానవుల ♦ దొల్లి యనేకులఁ ద్రుంచె నావింట
విపులకోపాటోప విభవుఁడై హరుడు ♦ త్రిపురదుర్గములు సాధించె నావింట
నావింట మఱి దక్షు యాగంబు జెరిచె ♦ దేవేంద్రముఖ్యుల త్రిదశులఁ దోలి
నియతాత్ము మాతాత నిమిచక్రవర్తి ♦
నయనయాన్వితునకు నాఁ టవతరము
నగు దేవరాతుచే హరు డిచ్చె దొల్లి ♦ యగణితబలమైన యావిల్లు పిదప
నదియా నిగా నుండు ననఘ మా యింట ♦ విదితమై యావిల్లు వినుతుల నొప్పి
జన్నంబు గావింప సమకట్టి యేను ♦ సన్నుతనియతి భూస్థలిశుద్ధి కొఱకుఁ
గ్రతుశాల మున్నాగటిచాలులోన ♦ నతులితంబుగ జాలు నందొప్పమిగిలి
మందసంబు నురాగ మది నుబ్బి చూచి ♦ మందసంబున నేను మమతదీయజ్ఞ
నత్మవైభవంబుగా నందులోనపుడు ♦ నతివయొక్కతె పుట్టె నాశ్చర్యలీలఁ
బ్రీతితో సీతయనఁ బేరొప్పఁ బెట్టి ♦ యాతన్వి నా కూఁతురని పెంచుచుండ
నిలవపంతంబుల నెలతీఁగెఁ బోలి ♦ నళినాక్షి కళఁ బోలి నానాఁటఁ బ్రబలి
యింతమై యంతయై యెలజవ్వనమున ♦ వింతయై యీయింతి వెలయుటఁ జూచి
తలకొని తరుణికై ధరణీవల్లభులు ♦ బలియులై యేతెంచి పడఁచు నుదమకు
నడిగినవారల కంటి నేనప్పు ♦ డుడురాజబింబాస్య కుంకువ గలదు
హరుని విల్లిదిదీని నతిసత్వయుక్తిఁ బెరిగి యేతెంచి మోపెట్టిన జాలు
నతనికి నాకూఁతు నర్ధాంగి నిత్తు ♦ నతిమోహమున నన్న నన్నరేశ్వరులు
నత్తినకడఁకతో నేతెంచి చాప ♦ మెత్తఁజాలక పోదు రెందరేనియును
ధనువెత్తఁజాలని ధరణీశులెల్లఁ ♦ దనరారు సిగ్గునఁ దలలెత్తలేక
కూఁతు నిచ్చెదనని కోదండమొకటి ♦ బ్రాతిగా నెపమిడి భ్రమియించె మనల
జనకుఁ డాతని నింక సకలయత్నముల ♦ ననిసేసి సాధింతమని విచారించి
చనుదెంచి కోటపై సంవత్సరంబు ♦ ఘనసైన్యములతోడ గడిమిమై విడియ
దగ మున్ను గూర్చు నాధాన్యాదులెల్ల ♦ నొగిదీర మదిలోన నొకటి చింతించి
వడి దేవతలఁ గొల్చి వారిచే నపుడు ♦ బడసిన చతురంగ బలము గైకొనుచు
విడిసిన బలముపై వీఁకతో నడువఁ ♦ దొడరఁజాలక భీతితోఁ గొందఱుఱుగఁ

గొందరుమూఁకతోఁడ ఘోరాజి చేసి ♦ చిందరవందరై చెడి వారలోడి
రక్కజముగుశక్తి నావిల్లురాముఁ ♦ డెక్కు వెట్టినఁగూఁతు నెలమినిచ్చెదను
విల్లున్నమ దస వేగ దెమ్మనుచు ♦ బల్లిదులగువారిఁ బదివేలఁబనిచె
నదిలోహమయమును నత్యాయతంబు ♦
విదితాష్టచక్రంబు విపులంబునగుచు
నమరెడుమందస మావింటితోడ ♦ తమతమసత్త్వము ల్దగఁగొనివారు
కనకాద్రితోఁగూడ కమలజాండంబు ♦ గొనివచ్చుగతనీక్షుకొనివచ్చుదాని
జనకునంతఃపుర చారులౌ తారు ♦ పనివడిదాదులు పరతెంచి వేగ
జానకినూర్మిళ జనకునిదేవి ♦ కానంగఁజనుదెంచి కనిచెప్పి రెలమి
వినరమ్మ చెలులార విన్నపంబొకటి ♦ మనరాజుసభలోన మరిమునులుండ
గాధినందనుఁడైన కౌశికువెనుక ♦ నరవరోత్తములు నాజానుబాహువుల
నమరంగ దేవ గంధర్వులకన్న ♦ కొమరైన తేజంబు కొమరొప్పువారి
చెలువైన తేజంబు చెలగివీక్షించి ♦ యలవీరులెవ్వార లనిజనకుండు
అడిగినఁ గౌశికుఁ డతిహర్షమాత్మ ♦ సడరంగ దశరథు నాత్మజుల్వీరు
హరుచాపమెక్కిడ హర్షించిరిటకు ♦ ధరణీశ తెప్పింపు తగువారిఁబనిచి
యనయిట్లు కౌశికు ననుమతిమీఱ ♦ దనమంత్రులనుబిల్చి ధనువుదేబనిచె
పౌరణాగండ్లలోఁ చూడఁగవచ్చు ♦ నారయ వేగ రండనివాఁతిపిలువ
కులముశౌర్యమురూపు గుణమునుబాగడ ♦ చెలగిచెవులసుధ చిలికినట్లుండ
ప్రేమవెగ్గలమైన పృథివీజయపుడు ♦ రోమాంచమయ్యెనా రూఢమై మేన
ప్రియమును భయమును బిరిగొనిపొదల ♦
నయమొంచి తలవాంచి నగఁబోణియుండె
అలివేణిసిగ్గున నటఁబోయి కన్న ♦ చెలువకుఁబరిచర్య చేసిరిసఖులు
పన్నీటకంకమ పదనిచ్చెనొకతె ♦ చెన్నారమకరిక లెచ్చెక్కవ్రాసె
తట్టుపునుంగును తగుచందనంబుఁ ♦ దట్టంబుగాఁబూసెఁ దరళాక్షి యొకతె
నుదుటఁగస్తురిలేఖ నుతముగాదీర్చె ♦ నెదుటనద్దముబెట్టె నెలనాగయొకతె
కురులుమన్నగ మువ్వి కొప్పమర్చుచును ♦ విరులందునొకతనివిరితగాదురిమె
వాసించుభాగాలు వడివారమడువు ♦ లాసతీజనమణి కందిచ్చెనొకతె
అలినీలవేణికి నందంబుగాను ♦ మొలనూలిఘంట లిమ్ములబ్రోయసిడియె
కులుకుశాలిండ్లపై గొప్పముత్యముల ♦ విలసిల్లుహారముల్ వేసెనొక్కరితె
కాంతకట్టించె చంద్రకావివల్వలను ♦ వింతగానెరిగొప్ప వెసదీర్చెనొకతె
యీమాడ్కి చెలికత్తె లెలమిగైసేయ ♦ హేమపీఠంబున నెలమితోనుండ
నప్పుడుకల్యాణి నవనినందనను ♦ నప్పుడవీక్షించి తల్లిదానపుడు

కనకసౌధగవాక్ష కలితగానపుడు ♦ వనజాక్షిదోడ్కొని వచ్చినాయెడకు
నెప్పుడువీక్షింతు మినవంశజాతు ♦ నెప్పుడుగనుగొందు మేమురాఘవుని
అనివారలందఱు హర్షంబుతోడ ♦ ఘనగవాక్షములందు గనుగొనిరంత
రామునిలోకాభి రామునిదివ్య ♦ ధామునిగన్గొని తరలాక్షులపుడు
ఘనశౌర్యరూపముల్ గలిగినవాని ♦ కనకచేలునిమాడ్కి గళలొప్పువాని
జోకపువ్వులవిల్లు జొనిపినవాని ♦ జ్యాకిణాంకితహస్త జలజుఁడౌవాని
రూపంబులొక్కట రుచిరవర్ణముల ♦ నేపారవేఱుగా నెన్నఁగవచ్చు
శ్రీపతియంశజుల్ క్షితిపాలసుతులు ♦ భూపాలరత్నము లొప్పలుపారుటార
జనకజదగు రామచంద్రునకిరవు ♦ ఒనరుసౌమిత్రికి నూర్మిళయనుచుఁ
దనరుగాకనివారు దగనెన్నికొనుచు ♦ ననుపమప్రేమతో నటఁజూచుచుండ
నమరేంద్రసభబోలు నాసభనడుమ ♦ నమరంగమందసమట జేర్చిరపుడు
సభలోననునుపంగ జనకభూవిభుఁడు ♦ శుభమూర్తినగ్గాధిసుతునివీక్షించి
కిన్నరగంధర్వ గీర్వాణయక్ష ♦ పన్నగరాక్షస ప్రభృతులెవ్వరును
నెక్కెట్టఁగలజాల రీచాపమనిన ♦ దక్కనసరులకుఁ దలపంగతరమె
కౌశికరామ లక్ష్మణులకుఁజూపు ♦ మీశరాసనమన్న నెలమినమ్మునియు
రామచంద్రుఁనిజూచి రఘువంశవర్య ♦ యీమహాధనువెత్తియెక్కిడితివియు
మాడ్కివరాహమై యవలీలఁగోట ♦ మేదినీతలమెత్తి మెఱసిననీకు
తనరసీవిల్లెంత తలపోయనసఘ ♦ యనియిట్లుమునివరుఁ డానతిచ్చినను
మనువంశతిలకుఁడు మరివేగఁబుత్తు ♦ ననిమునిసభలోన నారాజుక్రియను
సౌమిత్రియునుదాను జయ్యనలేచి ♦ ప్రేమయుదమకంబు పెనగొనుచుండ
జెలఁగుచు దనమీఁది చెఱగురాఁదిగిచి ♦

మొలనూలు బిగఁజుట్టి మోహనాకృతులఁ
దిరముగానిగ్గులు దిశలశోభిల్ల ♦ నరవిందలోచనుం డసమసాహసుఁడు
మొలనూలిఘంటలుమ్రోవుమిన్నగను ♦ మలగుచునవరత్నమాలికల్వ్రేల
బాహువుర్లంగరా ల్పటుకంకణములు ♦ బాహువులఁగుళావళికాంతులీన
నమరంగకర్ణభూషాదులకాంతి ♦ కోమరారుచెక్కిళ్లగుదిగొనిమెఱయ
అలకలువెడఁగెల నటనృత్యమాడ ♦ తళుకొందుబంగారుతరుకాంతులీన
కోటిమన్మథలీలఁ గొమరుదీపింప ♦ నీటుగానటువచ్చి నెల్లవారెఱుఁగ
జనకజాసభలోన జననుతంబైన ♦ మనువంశతిలకుండు మందసదెరిచి
ధరణీతలంబెల్లఁ దనమీఁదనునిచి ♦ చిరనిద్రసుఖియించు శేషాహియనగ
గాలమేఘములోనఁ గదలనిరుచుల ♦ దూటకపోలుచు విద్యుద్దండమనగ
నిరుపమాకారత సిందారియందుఁ ♦ గరమొప్పువిల్లెత్తి గవిసెనవుచ్చి

## —*: శ్రీరాములు శివునివిల్లు విఱుచుట :*—

గర్వించితను నెత్తఁగడఁగి యేతెంచు ♦ నుర్వీశబలములాహుతులుగ గ్రమింగ
వరుణరత్నప్రభ యనుమంటలొలుక బెరుగుచు నిలుచున్న పెనుచిచ్చువోలె
నక్కజముగ శక్తి నావిల్లు రాముఁ ♦ డెక్కుపెట్టుచునుండ నటగి కౌశికుఁడు
హరుని చాపము రాముఁ డతిసత్త్వయుక్తి ♦
బెరిగినేఁడిదె యెక్కుపెట్టుచున్నాడు
అవరకు భూదేవి యాత్మలో నీవు ♦ చెదరిచలింపకు శేషాహి నీవు
కడక ధరింపుము కమఠేంద్ర నీవు ♦ కడు నేమరకుఁడు దిక్కరులారు మీర
లనియనిపల్కగ నామేటివిల్లు ♦ గొనయమెక్కించి కైకొనక రాఘవుఁడు
తన బాహుసత్త్వంబు దర్పంబు మెఱసి ♦ జనకునికనియె నాచాపంబు చూచి
యిది చాలఁ జాలక నయది చాల బ్రాఁత ♦ యిది చాల నిస్సార మిది చాల నలతి
తెగ గొన నిలువదు దీని నా యెదుట ♦ బాగడితి పలుమాఱు భూపాల యనుచు
సురలు ఖేచరులు భూసురులు కిన్నరులు ♦ నరులును నృపతులు నలిబర్వి చూడ
నెడపక తనజయం బెల్లెడఁ జాటు ♦ వడువున విలుగుణ ధ్వని చెలఁగించి
సీతగుణంబులు చెవిసోఁకెననఁగ ♦ చేతివింటిగుణంబు చెవిసోక దిగువ
వడి రక్కసులపట్టు వదలె నన్నట్టు ♦ పిడిపట్టు వదలినఁ బెకలి పేటెత్తి
పెళపెళధ్వనులను బెటపెటధ్వనులు ♦ కలయదిక్కుల ద్రువగా బెల్లు విఱిగె
విఱుగ రాదన్యా విపులమానములు ♦ పఱియలు వాటె భూభాగమంతయును
జెదిరె దిగ్గజములు శేషాహి క్రుగ్గె ♦ బెదరె భూతములు కంపించె లోకములు
జనకుడు రామ లక్ష్మణులును గాధి ♦ తనయుండు నొగిదక్క దక్కినవారు
బిట్టులిక్క మూర్ఛిల్లి పృథివిపైఁ బడిరి ♦ నెట్టనఁ బొడము నా నిష్ఠురధ్వనికి
జనకభూవిభుడంత సంతోషమంది ♦ ఘనవిస్మయము నొంది కౌశికుఁ జూచి
నా మాట వప్పక నా ముద్దుకూఁతు ♦ నీమహితాత్మున కిచ్చెద నింకఁ
దడయక పెండ్లికి దశరథాధీశు ♦ గడుసంభ్రమమున నిక్కడికి రప్పింతు
ననిదశరథునకు నత్తెఱంగెల్ల ♦ వినిపించి తోడ్తేర వేడ్కతో నపుడు
తనయాప్తమంత్రుల దడయక పిల్చి ♦ పనిచిన పనిపూని పరువడి నేగి
జవనాశ్వములమీఁద సాకేతపురికి ♦ దివసత్రయమున నెంతే వేగవచ్చి
తనయుల సేమంబు దలపోసి పోసి ♦ వనరుచునున్న యవ్వసుధేశుఁ గాంచి
వినతులై జనక భూవిభుఁడ పినట్టి ♦ జననుతవస్తువుల్ సన్నిధి నునిచి
నీకుమారుడు శౌర్యనిధి రామచంద్రుఁ ♦ డా కౌశికుని యాగ మర్థితోఁ గాచి
జనకు జన్నము జూడ జనుదెంచి యందు ♦
మునులు రాజన్యులు ముదమునంది చూడ

ధరసురాసురులకు ధరియింపరాని ♦ హరువిల్లు మోపెట్టి యవలీల విఱిచ
వఱిచిన జనక భూవిభుఁ డిచ్చె సీత ♦ నలిలేక తనకూఁతు నా రాఘవునకు
ప్రియమున బెండ్లికి బిలువఁబుత్తెంచె ♦ రయమున విచ్చేయు రాజన్యచంద్ర
యనవుడుఁ దనమది నానందమంది ♦ జనపతి పెండ్లికిఁ జాటింపఁబనిచి
జనకుమంత్రులకు నుత్సవ మొప్ప నిచ్చె ♦ ఘనరత్న భూషణ కనకాంబరములు
అలిలేని కలుగులు డై వసిష్ఠు ♦ డెలగొప్పదా వాసుదేవు జాబాలి [ను
ఘనుని కశ్యపుని మార్కండేయు నత్రి ♦ దనరు బాంధవుల దనయమాత్యుల
నిమ్ములఁ బిలిపించి యిట్లని పలికె ♦ సమ్మదంబడర విశ్వామిత్రునొద్ద
దేజంబుతోడ విదేహదేశమున ♦ రాజిల్లుచున్నారు రామలక్ష్మణులు
అందు రాముఁడు రాజు లందఱు చూడ ♦ నెందు నసాధ్యమౌ నిందుశేఖరుని
చాపంబు విఱిచిన జనకుండు సీత ♦ నేపార రామునకీ నిశ్చయించి
యెలమి బెండ్లికిని మిమ్మేగు దెమ్మనుచుఁ ♦ బోలుపార నిటవీరిఁ బుత్తెంచినాఁడు
జనునతఁ బనుఁగదా జనకుసంబంధ ♦ మనినవందఱు మెచ్చి యమ్మరునాఁడు

—*: దశరథుఁడు మిథిలకు బోవుట :*—

మొగి వసిష్ఠాది సన్మునులతోఁ గూడ ♦ దగు బంధు రాజన్య తతులతోఁ గూడ
రమణీయ దివ్యాంబరములతోఁ గూడఁ ♦ విమల మౌక్తిక వజ్ర వితతితోఁ గూడఁ
కరిరథభటతురంగములతోఁ గూడఁ ♦ బరమాప్తవర మంత్రివతులతోఁ గూడ
వినుత పుణ్యాంగనా వితతితోఁ గూడ ♦ ననుపమ వైభవం బలరఁగాఁ జేసి
కరమొప్ప రథ మెక్కి కల్యాణమునకు ♦ నరనాథతిలకుఁ డానందము ప్పొంగ
గడుఁ గెలంకుల గజస్కంధంబులందుఁ ♦

గొడుకులు ముత్యాల గొడుగుల నీడ
బరమసమ్మతమున భరత శత్రుఘ్ను ♦ లిరువురు గొల్చిరా నేపు దీపింపఁ
గ్రందుగా నిండి మంగళతూర్యకోటు ♦ లందంద మెరయ మహాభూతి మెరయ
నెడనెడ విడుదు లనేక వస్తువులు ♦ నడపింప మంత్రులు నాల్గు దినముల
జని యెను మిథిలకు జనకుండు నంత ♦ యినకులాధిపునకు నెదురుగా వచ్చి
కొనిపోయి వేడ్కలు కొమరొత్తనపుడు ♦ జనపతికుచితోపచారముల్ సేసి
మునివర నివహంబు ముదమందఁ జనకు ♦ డనియె మహానంద మరలనాతనికి
నాకూఁతు దశరథ నరనాథ యేను ♦ నీకుమారునికిచ్చి నెమ్మి బెండ్లికిని
నిటు బిల్వబంచిన నీవు విచ్చేసి ♦ తటుగాన నేను గృతార్థుండనైతి
నీవసిష్ఠ మహా మునీంద్రుఁడీవామ ♦ దేవాది మునులు నేతెంచుటఁ జేసి
నాకోర్కె సిద్ధించె నా జన్మ మలరె ♦ నాకులంబతి పావనంబయ్యె నేఁడు
రవికులోత్తములయిన రాజులతోడి ♦ యవిరళ సంబంధ మది నాకుఁ గలిగె

నెల్లి పెండ్లికి లగ్న మిష్టులఁ బిలిచి ♦ తెల్లంబుగాఁ బ్రవర్తింపుఁడు ప్రీతి
ననవుఁడు దశరథుం డట్లగాక యనుచు ♦ ననురాగ మొంది యత్యంత ప్రీతి
జనకుఁ డమర్చిన సదనరాజమున ♦ ననురక్తి వసియించె నంతనచ్చటికి
గడుఁ బ్రీతి రామలక్ష్మణులతోఁ గూడ ♦ నడరి విశ్వామిత్రుఁ డరుగుదెంచుటయు
ననఘుండు దశరథుం డమ్మహామునికి ♦ వినతుఁడై పూజించి వినయంబుతోడ
దనరా నీకయ ధన్యుండనైతి ♦ ననఘాత్మ యనవిని యక్కౌశికుండు
అకలంక చరితుండ వైననీవనఘ ♦ సుకృతంబు గావించి శుద్ధుండవైతి
రవికులోత్తముఁడైన రాముండు పుత్రుఁ ♦ డవుట విశేషించి యధిక పుణ్యుఁడవు
క్రతురక్షణార్థమై కడఁగి రాఘవుల ♦ హితబుద్ధి నీవె మాకిచ్చితి నాఁడు
నెమ్మదినున్నారు నీసుతుల్వీరె ♦ నెమ్మిఁ గన్గొనుమన్న నృపతి యాసుతుల
నాలోన మ్రొక్కిన నలరదీవించి ♦ యాలింగనము చేసె ననురాగ మెసఁగ
జనకుండు నా దివసంబున నంతఁ ♦ దనయాగకర్మమంతయు నెఱవేర్చి
యలరు వేడుకనిను దస్త్రాదికరుగ ♦ పొలుపొందనా రాత్రి పోయిన పిదప
మరునాఁడు కల్యాణ మంటపవేది ♦ నెఱయ మంత్రులతోడ నిండు గొల్వుండి
యిమ్ములఁ దన పురోహితు శతానందు ♦ సమ్మదంబునఁ జూచి జనకుండు పలికె
ననఘాత్మ మా తమ్ముఁ డగు కుశధ్వజుఁడు ♦ ఘనుఁ గొనవలయు నీ కల్యాణమతఁడు
తిరముగా నిక్షుమతీ తీరభూమిఁ ♦ బొరి నొప్పు సాంకాశ్య పురినున్నవాఁడు
అతనిఁ దోడ్తేర నీవరుగుమనంగ ♦ నతిజవాశ్వములతో నమరు తేరెక్కి
యతివేగముగ నేగి యా కుశధ్వజుని ♦ నతులితంబుగఁ గని యర్థిమైఁ జెప్పి
జనక పుత్రికి నేఁడు జననాథవర్య ♦ మనువంశ చంద్రుఁడై మను రాము నకును
ఘనముగ బెండ్లియాగడు వేడ్కతోడ ♦ జనకుఁడు యత్నంబు జరుపంగ గోరి
పతినిన్నుఁ దోడ్తేరఁ బనిచె నన్నిపుడు ♦ సతులతో హితులతో సకలసైన్యముతి
గదలుద మిప్పుడే ఘనతమిథిలకును ♦ పదమని చెప్పిన బరఁగ నందఱును
దనరారు వేడుక నగరథంబెక్కి ♦ తనయాద్వయముతోడఁ దానేగుదెంచి
యనఘ మానసుఁడు శతానందునకును ♦ జనకభూవిభునకు సద్భక్తి మ్రొక్కి
యెలమి నమ్మానవాధీశు సమ్మతిని ♦ నలువొప్ప సింహాసనమున గూర్చుండె
నంతసుధామాఖ్యుఁడను మంత్రిజనకుఁ ♦ డెంతయు ముదమున నీక్షించి నీవు
జని వసిష్ఠునితోడ సచివులతోడ ♦ దనయులతోడ నాదశరథేశ్వరుని
వెరవారఁ దోడ్కొని వేగరమ్మనిన ♦ నరిగి యాతఁడు ప్రీతి నమ్మహీపతికి
వినతుఁడై యిట్లను వేడ్కతోనన్ను ♦ జనకుండు పుత్తెంచె జనలోకనాథ
నీయుపాధ్యాయులు నీతనూభవులు ♦ నీయమాత్యులు నీవు నేతేరవలయు
ననిన నా దశరథుం డందఱితోడఁ ♦ జనిసుఖాసీనుఁడై జనకుతో ననియె

పరఁగ వసిష్ఠుండు పరమదేవతయు ♦ గురువు నీయిక్ష్వాకు కులమునకెల్ల
సర్వజ్ఞుఁడగుటనీ సంయమీశ్వరుఁడు ♦ సర్వకాలముఁ గుఁజాలుమాకనిన
నప్పుడు దశరథు నన్వయక్రమము ♦ జెప్ప భావించి వసిష్ఠుఁడిట్లనియె
వరనాథ వినుఁ నిర్గుణబ్రహ్మమైన ♦ హరిసగుణైక లీలాకృతిఁ దాల్చి
నిజలీలకై నాభి నీరజంబ దు ♦ నజునిఁ గల్పింపంగ హరికజుఁ డొదవె
భూమీశ బ్రహ్మకు బుట్టె మరీచి ♦ యా మరీచికి బుట్టె నవని గశ్యపుఁడు
నతని కర్కుఁడు సుతుఁడా జగదాప్త ♦ మతికి వైవస్వత మనువునఁ దనుఁడు
నతనికి నిక్ష్వాకుఁ డను రాజరత్న ♦ మతనికి గుక్షియా నాత్మసంభవుఁడు
కుక్షియనృపనాథు కొడుకు వికుక్షి ♦ యుక్షరాత్ముఁడు బాణుఁ డతని నందనుఁడు
నతనికి ననరణ్యుఁ డతనికి బృథువు ♦ చతురమానసుఁడు త్రిశంకుఁ డాతనికి
నతనికి దనయుండు నా హరిశ్చంద్రుఁ ♦ డతనికి లోహితాస్యాఖ్యపుత్త్రుండు
అతనికి దుందుమారావనీనాథుఁ ♦ డతనికి యువనాశ్వుఁ డను నరేశ్వరుఁడు

—*: వసిష్ఠుఁడు యువనాశ్వుని వృత్తాంతముఁ దెల్పుట :*—

నతనికిఁ బ్రియభార్య లతిరూపవతులు ♦ సతులిద్దఱకు బుత్త్ర సంతతి లేమి
సంతటనా రాజు నఖిలసన్మునుల ♦ సంతతికోఱకునై సరగ రప్పించి
యా మహాత్ములకును నర్ఘ్యపాద్యములు ♦
ప్రేమతో దగనిచ్చి ప్రియవాక్యములను
ఘనులార నన్నను గరుణించి మీరు ♦ తనయుల నాకును దయ సేయవలయు
నని విన్నవించిన నా రాజునకును ♦ ననువొంద నమ్మును లపుడిట్టులనిరి
ఐంద్రయాగము సేయు మవనీశ భక్తి ♦ సాంద్రంబుగా బుత్త్రసంతతి గలుగు
ననజన్నమునకప్పు డఖిలవస్తువుల ♦ ననువొంద దెప్పించె నాక్షణంబునను
నైంద్రయాగంబును నా మఖంబపుడు ♦
సాంద్రానుమోదులై సంయమీశ్వరులు
పుత్త్రలాభంబుకై పొలుపొందనంత ♦ చిత్రయజ్ఞము దారు సేయగ నందు
జలములు మంత్రించి జలకుంభములను ♦ నలరార నియతి చేసటు దాచియుండ
ధరణీశుఁ డారాత్రి దప్పితో నంత ♦ మఱపొందియా యజ్ఞ మందిరమందు
కలశంబులో నీళ్లు గ్రక్కున ద్రావ ♦ జలహీనమగు కలశంబును జూచి
యెవరు ద్రావిరి జలఁ బెటుపోయెననుచు ♦ ప్రవిమలాత్ములు వారు భావనిచేత
సరసి యా నృపతి యేయా నీరు ద్రావు ♦ టెఱిఁగి చోద్యంబంది యిది దైవమాయ
యని చూచుచుండంగ నా నృపాలకుఁడు ♦ ఘనమగు గర్భంబు కడు వేగ దాల్చె
గర్భమంతటబడి కడు చోద్యమలర ♦ నర్భకుండుదయించె నా రాజు చచ్చె
గడగు ఋషులెల్ల గడుదుఃఖమంది ♦ సడలని యమ్మంత్రసామర్థ్యములను

బనివడియువనాశ్వుఁ బ్రతికించిరంత ♦ ననుపమశుభమూర్తియైయుండినతఁడు
వరుసతోడుత చక్రవర్తిచిహ్నంబు ♦ లరుదారనుండఁగ యాపుత్త్రుఁజూచి
యితఁడేడుదీవులు నేలుఁగటంచు ♦ చతురతఋషులెల్ల సంతోషపడిరి
అలయువనాశ్వుండు నామానిజనుల ♦ కెలమితోధనరాసు లిచ్చినఁజనిరి
తల్లి యేలేని కతంబునబాలు ♦ డల్లననాకొని యటనేడ్చుచుండ
వరుసనాయింద్రుండు వచ్చితానప్పు ♦ డరయంగనాశిశువాఁకలిదీరఁ
బెనుపొందగానోర బెనువ్రేలువేగ ♦ నునిచిననమృతంబు నొయ్యనద్రావ
సుధగ్రోలుటయుఁ జేసి శుభయుతుపేరు ♦
బుధులతో మాంధాత భూమీశుఁడనుచు
నతనికినామధేయంబటుచేసి ♦ యతివేగమునబోయె నాబిడౌజుండు
అంతనామాంధాతయలపూర్ణచంద్రు ♦ నంతటిప్రభతోడ నతిశయిల్లుచును
రూఢిగాయౌవనారూఢుఁడై యంత ♦ గాఢశౌర్యస్ఫూర్తిఁగడు తేజరిల్లి
రావణాదులబహు రణములగెలిచి ♦ భూవలయంబెల్ల పొందుగానేలి
విష్ణునిభక్తుఁడై వెలసియాగములు ♦ జిష్ణుబలంబున జేయుచునుండె
నారాజునకు విమలాంగియన్నతికి ♦ భూరితేజోయుతు ల్వుత్రరత్నములు
నరయంగముచుకుందుఁడాసుసంధియును ♦ దరుణులేబండ్రునుదగజనియింప
సుదతులప్రాయంబు సొరిదివచ్చినను ♦ ముదమునసౌభరి మునిపతికిచ్చి
నతివలకగ్రజుఁడగుముచుకుందుఁ ♦ డతివేడ్కహరిభక్తుఁడై యేగదివికి
నాతనిసోదరుం డాసుసంధియును ♦ నాతతపుణ్యాత్ముఁడై భువినేలె
నతనికిధ్రువసంధి యనురాజుపుట్టె ♦ నతఁడుప్రసేన జిత్తనురాజుఁగనియె
తోరయప్రసేన జిత్తుకుభరతుండు ♦ నరయనాభరతున కసితుండుబుట్టె
నతఁడురాజ్యముసేయ నాతనిశత్రు ♦ లతులపరాక్రములైన హైహయములు
దారుణాకారులు తాళజంఘులును ♦ నారంగసేనబిం దనువాఁడుగూడి
యతిఘోరయుద్ధంబు నతులతఁజేసి ♦ నతనినెయ్యనిలోన హతుఁజేసిచనిరి
అంతనాతనిసతు లతిదుఃఖమంది ♦ మంత్రులరాజ్యంబు మరిదీర్పనునిచి
మేలిమినుండిరి మొలతిలిద్దఱును ♦ కాళిందియనుసతి గర్భమైయున్న
మేలోర్వలేక యామొలతలందొకతె ♦ చాలంగసవతి మచ్చరమునఁజేసి
గర్భిణియైయున్న కాళిందికపుడు ♦ గర్భంబుజెఱుప నొక్కటెవిచారించి
తొర్వ్యాకవిషము ప్రయోగించెనంత ♦ నావిషమునగర్భ మాటవీడిపడక
తావేగివేదనఁ దల్లడంబంది ♦ యావనితయు దుషారాద్రికిఁజనుచు
చ్యవనునిగాంచియా సంయమీంద్రునకు ♦ నవిరళభక్తితో నల్లనమ్రొక్కి
తనదువృత్తాంతంబు తగవిన్నవింప ♦ వినియునాపుత్త్రిని వెఱవకుమనుచు

బొందారఁగరుణతో బూబోడిన త్తి ♦ కందువ ద్రుష్టిని కడగిలో జూచి
ప్రతిపక్షదమనుండువరమ ధారిష్ఠుడు♦నతుల తేజుండుమహోత్సుండు నగుచు
వరకీర్తివంతుండు వంశవర్ధనుడు ♦ పరమరూపంబున భాసిల్లుజగతి
బొగడొందగరముతో బుత్రుండనీకు♦నగుగాకగాళించి యనుచు దీవించె
వలగొనియమ్మునీశ్వరునకుమ్రొక్కి ♦మెలమితోదనయింటి కేగి యాయువతి
యతిమందంబుననున్న యాశుభాంగికిని ♦

సుతుడుదయించెను శుభముహూర్తమున
గరమొప్పబుత్త్రునిగాంచికాళింది♦గరముతో ముదమ న్దగడుసంభ్రమమున
నాతంద్రుశత్రుల నణచిరాజ్యంబు ♦ చేతోముదంబున జేయుచునుండ
నతతంబుఁలసిల్లె సగరుడన్ పేర ♦ నతనికిదనుజన్ము డసమంజసుండు
అతనికిసుతుడయ్యె నంశుమదాఖ్యు డతనిపుత్త్రుడు దిలీపావనీనాథు
డతనికున్నతపుణ్యుడగుభగీరథుడు♦సుతుడాతనికిగకుత్ స్థుండనురాజు
నతనినూనుడురఘువనమహీపాలుఁ ♦ డతనిపుత్త్రుడు పురుషాదకుండగుచు
గమనీయసితకీర్తి కల్మాషపాదు ♦ డమరశంఖణుడయ్యె నతనికాతనికి
సుతుడుసుదర్శన క్షోణీతలేశు ♦ డతనితనూజన్ము డగ్నివర్ణుండు
అతనికిబుతుపర్ణు డతనికిమరువు ♦ అతనికిశీఘ్రగుం డతనికిమనువు
సుతుడయ్యెనంబరీషుండనురాజు♦సుతుడాతనికిజన స్తుత్యుంమునహుషు
డతనికసుతుడు యయాతియన్ మేటి ♦ యతనికినాభాగు డాతనికజుడు
అతనికిదశరథు డనఘునీపుణ్యు ♦ సుతుడయ్యెసభల నిస్తులమనోరథుడు
రాముడీదశరథ రాజతనూజు ♦ డేమనవర్ణింతు నింక నేనధిప [లము
యితనికినీకూతు నీకంటివీవు ♦ కృతకృత్యుడవు శుభాంకితమయ్యెగు
అనియిట్లురఘువంశ మభినుతి సేయు♦వినిశతానందుండు విమలమానసుడు
జనకానుమతిసభాసదులెల్లవినగ ♦ మునివసిష్ఠునిజూచిముదమొప్పబలికె
మునినాథమీచేతముదమారవింటి♦ననఘాత్ముదశరథునన్వయక్రమము
సన్నుతికెక్కనే జనకునన్వయము ♦ చెన్నగుమీకేను జెప్పెదవినుడు

—*:శతానందుడు జనకుని వంశక్రమంబు దెల్పుట:*—

సద్విజపరమ హంసప్రతిపాద్యు ♦ డద్వితీయబ్రహ్మ మైనయచ్యుతుని
నాభిసరోజంబు నను బ్రహ్మపుట్టె ♦ నాభూతనిర్మాత యగుధాతవలన
బుట్టెమరీచి యాపుణ్యవర్తనుని ♦ పట్టియెకశ్యప బ్రహ్మజనించె
నతనికిదిననాథు డాత్మజుండయ్యె ♦ మతిమంతు డతనికి మనువుజన్మించె
నమ్మనువచ్యుత ధ్యానకాలమున ♦ దుమ్మి గవైవస్వతుడుతుమ్ము వలన
నిర్మలాచారుడు నీతికోవిదుడు ♦ ధర్మశీలుడు జగద్భరితమానితుడు

విమలమూర్తి త్రిలోకవిశ్రుతకీర్తి ♦ నిమియను రాజు మానితతేజుఁడొప్పె
నతనిపుత్త్రుఁడు మిథియతనికి జనకుఁ ♦ డతనికుదావసుం డమ్మహీజాని
తనయుండు నందివర్ధనుఁడును కేతుఁ ♦ డనువిభుఁ డతనికి నమ్మహాత్మునకు
రాజర్షియగు దేవరాతుఁ డెల్లెడల రాజిల్లె మరి బృహద్రథుఁ డుదత్సుతుఁడు
నతనినందనుఁడు మహావిభుఁ డతని ♦ సుతుఁడయ్యె సుధృతి యా సుధృతికి ధృష్ట
కేతుఁ డాతనికరుఁ గీర్తిహార్యశ్వుఁ ♦ డాతనికిని మరుం డా మరునకును
సుకుఁడు ప్రతీంధకక్షోణీశుఁ డతని ♦ సుతుఁడు కీర్తిరథుండు సుతుఁ డావిభునకు
దేవమీఢుఁడు తదీయుఁడౌ విబుధుఁ ♦ డా విబుధుని పుత్త్రుఁ డా మహీంధ్రునకు
గీర్తిరాతుఁడు వానికిని మహారోముఁ ♦ డార్తిదూరుఁడు వానికా స్వర్ణరోముఁ
డా స్వర్ణరోముండు హ్రస్వరోమాఖ్యు ♦ భాస్వరగుణశాలిఁ బడసె నాతనికి
జనకభూపాల కుశధ్వజుల్వీరు ♦ జనియించి రిరువురు సౌజన్యధనులు [డు
జనకుఁడంతట మహీజనులఁ బాలింప ♦ గని యొక్కనాఁడు సాంకాశ్యభూవిభు
ధన్యవిక్రముఁడు సుధన్వుఁడన్వాఁడు ♦ సైన్యసమేతుఁడై చనుదెంచి మిథిల
సీతాసమేతంబు శివునివిల్లడుగ ♦ దూతఁ బుత్తెంచినఁ గ్రోధించి వెడల
పై వచ్చి హరుని చాపంబు సీతయును ♦ గావలెనని ఘోరకలహంబుఁ జేయ
జనకుండు సంగరస్థలి వానిఁ గూల్చి ♦ తన తమ్ముఁ బూన్చె సద్ధరణికి ననుచు
జనకుఁడాదిగ వంశజాతులందరికి ♦ జనకనామము ప్రశస్తము ధాత్రిలోన
నిమివంశమునఁ బుట్టు నృపతులందఱును ♦ సమధిక యోగ విజ్ఞానసంపదల
చిరజీవులటుగానఁ జెప్పె జవీరి ♦ తరమునఁ గొంచెమై తగును లెక్కకును
జనకునివంశంబు సద్వర్తనంబు ♦ గొనియాడి యాసీత గుణమున బొగడి
విశదప్రతాపుని విమలభాషణుని ♦ దశరథుఁ గనుఁగొని దశరథాధీశ
నితనూజుని రాము నిత్యాభిరాము ♦ సీతతోడుతఁ బెండ్లి చెలువొప్పఁ జేసి
యులఘుకీర్తులఁ బొందుమనుశతానందు ♦ పలుకులు దశరథపతి యుత్సహించి
ఘనుఁడా వసిష్ఠుని గాధినందనునిఁ ♦ గనుగొని వారితోఁ గడువేడ్కఁ బలికె
చారువిచారుని జనకభూవిభుని ♦ మీరడుగుండు సౌమిత్రికూర్మిళను
బ్రకటగుణోత్తరుల్ భరతశత్రుఘ్ను ♦ లకుఁ గుశధ్వజనృపాలకుని కూతులను
అనవారు జనకునకత్తెఱంగెల్ల ♦ వినిపించి యనుమతి వేవేగ వడసి
జనకుని వాక్యము లనకలంబు వేడ్క ♦ దనరారఁ జెప్పిరా దశరథుతోడ
ననురాగముప్పొంగ నా మఱునాఁడు ♦ ఘనశుభగ్రహదృష్టి గలుగఁట జేసి
పనివడి యుత్తరఫల్గునియందె ♦ జనకుండు లగ్న నిశ్చయము సేయించి
ధపుమును దనయంతి పురముగ్గై సేయఁ బరిచారకుల వేగ పంపిన వారు
రంగకస్తూరికా కలితాంబుపూర ♦ గంధిలసకల మార్గధరాంగణంబు

చీనిచీనాంబర శ్రేణీవితాన ♦ నానామణీతోరణ ధ్వజాంచితము
ఫలభారకమ్ర రంభాస్తంభపూగ ♦ కలితప్రతిద్వార కక్ష్యాంతరంబు
సాంకవలిప్త విస్తారవితర్ది ♦ కాంకితరంగ వల్ల్యాదిశోభితము [బు
మణిశాతకుంభ కుంభవితర్కితార్క ♦ గణసౌధగోపురోత్కరశిరోగ్రం
దీపితమాణిక్య దీపసాంబ్రాణి ♦ ధూపపుష్పకలాప ధూర్వహాణంబు
నైపురమెల్లెడ నలరఁగైసేసి ♦ నైపుణిమెఱసి యంతఃపురంబంతఁ
గరమొప్పఁగైసేసి కల్యాణవేది ♦ విరచింపుఁడనశిల్ప వేదులంతయునుక్కై
బచ్చుతాఁడగతిపైఁ బసిఁడికంబములు ♦ మెచ్చుగానిల్పియా మీఁదనీలంపు
బోదెలుగురువిందముల దూలములును ♦ పాదుగానిడిదీరు పడజెక్కడంపు
గోమేధికంబుల కోణిగెలఁబరిచి ♦ గామల్చిపైవజ్ర గారయొసంగి
హాటకశాణిమయా యతకవాటములు ♦ వాటంబుగానాల్గు వాకిళ్ళమర్చి
అందులబంగరు హరువుచిత్తరువు ♦ లందంబుగాఁదీర్చి హరినీలగరుల
గమిగమిచిన పటికంపుసింగముల ♦ గమకమౌసోపాన గతులేర్పఱించి
కలితలామజ్జక కాయమానములు ♦ కలువడంబులు డంబుగాఁజుట్టికట్టి
యాలోననేకాండమాబలుపచ్చ ♦ మేలిపెండ్లియరుఁగుమృగనాభియలికి
ముత్తెంపునిగుల ముగ్గులేర్పఱిచి ♦ చిత్రజజనక లక్ష్మీవివాహంబు
గుజరాతికెంపుల గోడలిఖింపఁ ♦ బ్రజలకుఁగన్నుల పండువైయుండె
అంతవసిష్ఠ విశ్వామిత్రమునుల ♦ సంతతపుణ్యుల జనకుండుచూచి
మీరలయోధ్యకు మిథిలకుఁగర్త ♦ లేరూపముచితమౌ నిటమీఁదిపనులు

—*: దాశరథుల నలంకరించుట :*—

అదిసేయుమనుఁగాక యనవుడువారు ♦ చదురొప్పదశరథ జనపాలచంద్రు
కొడుకులనల్వురఁ గోమరొప్పనప్పు ♦ డెడతెనగట్టియా యెల్లవాద్యముల
చాటలుపాడుచుఁ బరఁగనంగనలు ♦ తేటగానందఱు తెచ్చిపీఁటలను
గూర్చుండఁదలలంటి కుదురుగవార ♦ లేర్చినల్వురుపెట్టి యెంతయుఁబ్రీతి
స్నానముల్ సేయించి చక్కగానుదుట ♦ మానవతిలకంబుమఱిభూషణములు
చీనాంబరంబులు చెలువొప్పనిచ్చి ♦ నానావిధంబుల నలువుగఁబొంగి
దశరథుభార్యలు దశరథేశ్వరుఁడు ♦ విశదప్రతాపుండు వేడ్కనుప్పొంగి
సకలభూషణములు సరసతఁబెట్టి ♦ యకలంకమతితోడ నంతటనుండి
యాయతశుభమైన యభ్యుదయంబు ♦ సేయింపనర్థితోఁ జేసెనవ్విభుడు
ఎక్కుడుసంతోషమెసగఁజిత్తమున ♦ నొక్కొక్కసుతునకభ్యుదయంబుకొఱకు
వెలయంగనన్నియువేదోక్తయుక్తి ♦ గలయఁబదాఱులక్షల ధేనువులను
గలధౌతఖురములుకనకశృంగములుతలకొనఁ జెలువొందు తామ్రపుచ్ఛములు

దారయమిచ్చినకాంస్యదోహళంబుల్ను ♦ వరుసవేష్టించినవరవస్త్రముల్ను
గలిగినవత్సలై కర మొప్పువాని ♦ లలిభూసురోత్తములకు భక్తినిచ్చి
మఱియునసంఖ్యాత్యమహిత హేమములు ♦ తఱుచుగానంతటదక్షిణలొసగి
భూదానవసుదానములు మొదలైన ♦ వేదోక్తదానము ల్వేర్వేఱనొసగి
తదవసరమున యుధాజిత్తు ప్రేమ ♦ తుదమీఱగా భరతుని మేనమామ
తనతండ్రి కేకయ ధరణీశ్వరుండు ♦ మనుమని భరతుని మైత్రిదోడ్తేర
దనునంపగా నయోధ్యకువచ్చియచట ♦ దనయులపెండ్లికిదశరథేశ్వరుడు
జనకునివీటకి జనుటయెఱింగి ♦ యనురక్తి వేవేగ యచటికే తేర
దశరథుండతనినాదరణబూజించి ♦ కుశలంబులెల్ల బేర్కొనుచుండెనంత
మఱునాడుస్నాతకమహితకృత్యములు ♦ తఱితోడగావించితమ్ములుదాను
రాముడత్తఱి దశరథునొద్దనిలువ ♦ శ్రీమీఱనతనిగైసేయింపనృపుడు
నారామునొదలనమరెకిరీట ♦ మారోహణాద్రిశృంగాగ్రమో యనగ
బద్ధకంకణుడయ్యె భక్తులబ్రోవ ♦ సిద్ధమన్నట్లు దాల్చెనుగంకణములు
ఎదమున్నుపుట్టినయిందుదీధితులు ♦ పొదలెనేడనహారములుచెన్నుమీఱె
దనకనకాంబరత్వము భూమిదెల్ప ♦ ననగనకాంబరం బలరారెగటిని
గష్టరావణునిచే గాసిల్లినట్టి ♦ యష్టదిక్పాలుర యశములిర్వంక
మౌక్తికచ్ఛలమున మనవులుదెల్ప ♦ యుక్తమైజౌకట్టు లొప్పెవీనులను
వదనశృంగార మీవైఖరినొప్ప ♦ బొదలినగస్తూరి బొట్టుచూపట్టె
బదపడిలక్ష్మణ భరతశత్రుఘ్ను ♦ లుదయార్కతేజులొంపారులు వేర్వేఱ
గుండల కేయూర కోటీరహార ♦ మండనావళి సుకుమార దేహములు
గైసేయనందు దిక్పతులమధ్యమున ♦ వాసవుండనరామ వల్లభుండొప్పె
అంతనక్కడ జనకావనీనేత ♦ కాంతిమైనలువురు కన్యకామణుల
గైసేయసైరంధ్రికల బంపవారు ♦ భాసురమణిపీఠిపై వారినునిచి
పేరటాండ్రోగిబాడు పెండ్లిపాటలకు ♦ శారికాకీరముల్ నందడిసేయ
గుంకుమకస్తూరి గోరోచనంబు ♦ సంకుమదంబు వాసనగదంబింప
నలుగురికొక్కటనలుగులుపెట్టి ♦ కలమృదుధ్వానులగంకణములుమొఱయ
కురులసంపెగనూనె గూర్చియింపొంద ♦ హరిచందనంబుల నటకలుపెట్టి
ఘనసారసురభి నఖంపచాంబువుల ♦ జనకపుత్రికలకు జలకముల్దీర్చి
జిలుగులదడియొత్తి చెంగావివన్నె ♦ చలువపావడలపై జాళువాసరిగ
కొంగులనొప్పుదుకూలముల్గట్టి ♦ శృంగారములుగుప్ప జేసిగొయ్యసగ
నొప్పగానొప్పుగా గొప్పులమర్చి ♦ విప్పుగాజాజి క్రొవ్విరులందు దుఱిమి
పచ్చకప్పురముతో బన్నీటితోడ ♦ పచ్చికస్తురి కలపముగూర్చియలది

బంగారుసరిగె గన్పడుకుట్టుపనుల ♦ కంగులఱయికలు కనుపట్లఁదొడిగి
చనుకట్లమీఁదఁబచ్చలబన్నరసములును దారహారంబులును బొందుపఱిచి
ముద్దుమోములకొక్క ముఱువుగాఁగోర ♦ దిద్దుచుకస్తూరి తిలకముల్దీర్చి
చెక్కులమకరికలచ్చిత్రించిగొప్ప ♦ ముక్కరల్ నాసాగ్రములఁగీలుకొల్పి
మగరాలతళుకుఁగమ్మలును గట్టంణి ♦ బొగడలుచుకుఁగెంపులబవిరెలును
బచ్చకడియము లపద్మరాగములు ♦ గ్రుచ్చిన మొలనూళ్లు గోమేధికముల
యందియల్ మొదలైనహార భూషణము♦లన్దంబుగాఁజేర్పనపుడుకన్యకలు
శారదపూర్ణిమా చంద్రునికళలో ♦ చారువసంత వాసనపుష్పలతలో
సానదీరినమంచి జాతిరత్నములో ♦ శ్రీనిండఁబట్టి నార్చినకుందనంపు
గమ్మలోకరిఁబులు గడిగినముత్తి ♦ యమ్మలో నెఱతావి నలరుగంధంపుఁ
గొమ్మలోయనఁబెండ్లి కూఁతులొప్పారి♦రమ్మక్కయనిసతులక్కజంబంద
వారిలోసీత లావణ్యవిఖ్యాత ♦ సారగుణవ్రాత జగదేకమాత
యాదిమలక్ష్మి దానై పుట్టఁగాన ♦ నాదేవి చెలువ మింతంతని తెలిసి
భూషింపశక్యమే భూషణంబు కు ♦ భూషణంబై యొప్ప భూదేవికరణి
మెఱసిరత్నాకర మేఖలయగుచు♦మరిగంధవతివసు మతియుఁదానగుచు
అంతవసిష్ఠ సంయమిలగ్నసమయ ♦ మంతయుజనకున కరసియేతెంచి
దశరథుతో సమస్తము దెల్పనతఁడు♦కుశికపుత్రవసిష్ఠ గురులతోఁగదలి
యమరేన్ద్ర విభవుడై యర్హయానముల ♦

గొమరొప్ప గైసేసి కొడుకులు నడువ
శృంగారములు సేసి చెలువలునడువ ♦ సంగడిఁగొలిచి రాజన్యులునడువఁ
గ్రంతలుగొన పుణ్య కాంతలునడువ ♦ నంతంతఁబొగడుచు పర్థులునడువ
గైసేసిహయమత్త గజములునడువఁ ♦ గైసేసిమంత్రి వర్గంబుతోనడువ
వేదనాదములతో విప్రులునడువ ♦ మోదంబుతోముని ముఖ్యులునడువ
నడచియజ్జనకుని నగరొప్పఁజొచ్చి ♦ పుడమిఱేఁడప్పుడు పుత్రులుదాను
వనజలోచనలు నివాళులొసంగ ♦ జనకుఁడెదుర్కొని సంభ్రమంబెసఁగ

## —:* శ్రీ సీతారాముల పాణిగ్రహణము *:—

ఖచితోరునవరత్న కల్యాణవేది♦నుచితపీఠంబున నున్నచోఁబ్రీతిఁ
దనపురోహితునితోఁ దడయకజనకుఁ♦డనలుఁబ్రతిష్ఠించి హైమవేదికను
వేదోక్తగతిహోమ విధులాచరించి ♦ యాదేవకన్యక లనొప్పుతనదు
కన్యకామణుల నగణ్యలావణ్య ♦ మాన్యలనలువుర మైత్రిరావించి
జనకుండుమధుపర్క సమయంబుదీర్చి ♦ తనకూర్మిపుత్త్రి సౌదామినీగాత్రి
గామినీజనమణిఁ గమలాక్షిసీతఁ ♦ గోమలిదెర మఱుంగుగ వేడ్కనిలిపి

రామాభిరాముఁడా రామచంద్రునకుఁ ♦ గామితసిద్ధి సంకల్పపూర్వముగ
శ్రీరామ నాపుత్త్రి సీత సద్ధర్మ ♦ చారిణిఁ గొనుమగ్ని సాక్షిగా ననుచు
ధారవోసెను దేవతాపుష్పవృష్టి ♦ ధారతో దివ్యవాద్యధ్వనుల్ మీఱఁ
బ్రమదంబుతోడ దీపాలపళ్లెములు ♦ సమదయానలు మహాసంభ్రమంబునను
దలఁబ్రాలు బంగరు తబుకులనునిచి ♦ కెలఁకుల రమణులు కెరలుచు బట్ట
గుడముతో జిల్కుటంగూర్చి యిద్దఱకు ♦ వడిశిరస్సులమీఁద వననొప్పనుంచి
రంతట సుముహూర్తమని తెరదీయఁ గాంత నెమ్మోము మున్గనుఁగొని యలరె
రామునికనుఁగవ రాకాసుధాంశు ♦ గోమున సలరెడు కుముదంబులనఁగ
భామచూపులు నిల్పెఁ బతిపాదయుగళిఁ ♦ దామరపై తేటి తండంబపోలె
నింతిలావణ్యాబ్ధి కెదురెక్కు మీన ♦ సంతానమై రామచంద్రుచూపడరె
వరుదేహకాంతిప్రవాహమధ్యమున దరుణిచూపులు పద్మదళములై గ్రాలె
సతిచూపుఁ బతిచూపు సరసతఁ జూపు ♦ రతిరూపు రతిమనోరమణుని రూపు
నెలమి నొండొరులు మేనెఱుఁగరాకుండ ♦ గళలంట వ్రాకిన గతిఁ గొంత సేపు
వెలసె నంతట రఘువీరకుంజరుఁడు ♦ చెలికేలుఁ గెందమ్మిఁ జెలువునఁ బట్టి
యొండొరుల్ పులకించి యొక్కపీఠమున ♦ నుండి హోమము సేయుచున్నిరి ప్రీతి
ఉరువరోధన్య నా యూర్మిళాకన్య ♦ గరము సంప్రీతి లక్ష్మణకుమారునకు
వలనొప్ప నా కుశధ్వజకూఁతు లందు ♦ నలినాయతాక్షి మాండవి భరతునకు
నతిజబింబాస్య యగు శ్రుతకీర్తి ♦ శత్రుఘ్నునకు నిచ్చె జనకుఁడు ప్రీతి
నిగమోక్తవిధిని బాణిగ్రహణములు ♦ తగిలి కావించిరా దశరథాత్మజులు
తలఁబ్రాలు వోసి రందఱు లాజహోమ ♦ ములు దీర్చి కాంచిరి మునులదీవనలు
దివినుండి ఘోషించె దేవదుందుభులు ♦ భువినిండ వర్షించె బువ్వవర్షములు
అప్పుడానందించి రఖిలదేవతలు ♦ నప్పుడానందించి రఖిలసన్మునులు
పాడిరి గంధర్వపతు లుత్సహించి ♦ యాడిరి సంప్రీతి నమరకన్యకలు
అపుడు వసిష్ఠుఁడా యవనీశసుతుల ♦ నుపమింపవైవాహికోక్తమైనట్టి [ణము
హోమ[illegible]మున వారి యుచితకృత్యములు ♦ నేమంబుతో నగ్ని నెఱిఁబ్రదక్షి
సేయించి సప్తర్షి సేవలొనర్చి ♦ యాయతంబుగ దీక్ష నలరుచు నపుడు
కూర్చుండి రందఱు కుదురుగా నందు ♦ నేర్చుచు మానులు నెసఁగు భూసురులు
సరగున నందఱు సంతోషమెసఁగ ♦ పరఁగ దీవనలిచ్చి పరమపావనుల
శుభలక్షణంబుగా సుందరీజనుల ♦ విభవసమృద్ధిగా విలసిల్లినప్పు
డాయతంబుగ దీక్ష నలరి మోదమున ♦ జేయించి మఱునాడు చెలగి సదస్యు
గావించి సంతోషకలితులై యపుడు ♦ దీవించి రందఱు దివ్యచిత్తముల
దెఱగొప్పగా బెండ్లిదినములు నాల్గు ♦ నెఱయ ని తెఱగున నిండియున్నటయ

అన్నిశోభనములు నన్నితేజముల ♦ కన్నులపండువుగాఁ జూచిప్రీతి
ధరణీవంశాధీశు దశరథాధీశు ♦ శరధిసన్నిభశీలు జనకభూపాలు
నెఱనొప్పదీవించి వేడ్క వారనుప ♦ నరిగెఁ గౌశికుఁడు హిమాచలంబునకు
నప్పుడుమిథిలేశుఁడానందకేళి ♦ నుప్పొంగి నిజవిభవోన్నతిమెఱసి
ధరణీశులకుజాల దద్రాజయుగము ♦ వరభూషణంబులు వస్త్రంబులొసఁగ
దమదేశములకును దగజనిరంత ♦ క్రమమునన ర్థార్థి గణములకెల్ల
నపరిమితద్రవ్యమట యిచ్చిపనిచె ♦ నృపయుగ్మమొప్పను నెనరొప్పగాను
గరమొప్పబుద్ధులు గఱపికూఁతులకు ♦ వరరత్నభూషణావళులువిచిత్ర
చిత్రాంబరములు దాసీజనంబులును ♦ నేత్రోత్సవంబుగా నెమ్మితోనొసగి
కరిరథహయభట గణభూషణాదు ♦ లరణంబుగా దనయల్లుండ్రకిచ్చి
యావసిష్ఠాది సంయములకు దశర ♦ థావనీశునకు నసంఖ్యమాణిక్య
భూషణంబులొసంగి పూజించినయ ♦ భాషణంబులయుక్తపద్ధతిననుపఁ
గొడుకులగోడండ్ర గొమరొప్పగొనుచు ♦ గడఁకతో దశరథక్ష్మాపతిగదలి
యడరియయోధ్యకునరుగుచోద్రోవ ♦ వడిబెర్చిప్రతికూలవాయువుల్వీచె
దడయకదుర్నిమిత్తము లనేకముల ♦ పొడచూపనప్పుడు భూపతికలఁగి
యేలొకో మునినాథ యిబ్బంగిగడగి ♦ పొలసి శకునములొప్పెడచూపదొడఁగె
ననవుడుదశరథు ననుకంపఁజూచి ♦ యనియెవసిష్ఠ సంయమినిచ్చియించి
యూర్వీశ మింక నొక మహాభయము ♦ పర్వియాలోన నేపాయునొడకుము
యనుచుండ వాయువులందందనిసరె ♦ గనుకనుపెన్ధూళిగప్పెగప్పటయు
గరులుజోదులు దురంగములు రావుతులు ♦

విరథులైరథులు నివ్వెఱపాటుంపడరి
సేనలునల్లెసల్చికాకువడియె ♦ భానుమండలమున బ్రభమాసెనంత
నిరువదియొక్క మారెచిరాజులను ♦ దరమిడిచంపిన ధన్యవిక్రముడు
క్రమ్మినజడలలో గాపున్నగంగ ♦ చిమ్మనానటను జెమటుబ్బుచుండ
ఘోరమైయుండెడు నుదుటికవిమముఁ ♦ గ్రూరదైత్యాలమీఁదగోపించియుమిసి
పరమేశ్వరుఁడు నాఁటఫాలనేత్రమున ♦ బెరిగిమండుచునున్న పెనుమంటబుచ్చి
తనరెండుకన్నులఁ దగబాచిపెట్టు ♦ కొనివచ్చుపగిదిఁ గన్నొనలగెంపెసఁగ
దెగిలోనము జెడు తీవ్రకోపాగ్ని ♦ యెగసిమైనుడిగొన్న యెటమంటలనగ
నెలసికెంజాయల వెదజల్లుబడలు ♦ బలిసిజూటంబున భాసిల్లుచుండ
దమకించిభుజలక్ష్మి తాఁబట్టియాడు ♦ విమలనాళముతోడి విరిదమ్మియనగ
బరశువుమాపున ధరియించివచ్చు ♦ పరశురాముని జూచిభయమునఁ నలఁగి
రయమునదశరథరాజన్యసుతులు ♦ భయనివారణమంత్రపరతంత్రులగుచు

—:* పరశురాముఁడు శ్రీరామునెదుర్కొని భంగపడుట *:—

ననఘులై యెదురుగా నర్ఘ్యపాద్యములు ♦
గొనిపోవవానిఁ గైకొనక రౌద్రమున
దశరథభూపాలు దర్పించిచూచి ♦ దశరథరాము ముందఱవచ్చినిలిచె
నిలిచినభార్గవుఁ నిజమూర్తిఁజూచి ♦ త యాచిమెచ్చి సద్భక్తితోఁ మ్రొక్కి
చక్కఁగట్టెదుటహస్తములొప్ప మొగిచి ♦ యొక్కిన్తభయమునను న్నవీక్షించి
నీవెంత మ్రొక్కిన నిన్నుమన్నించి ♦ పోవనాతోఁ బోరు భూపాలయనుడు
భూసురోత్తమకశ్యపుడు మొదలయిన ♦ భూసురోత్తములకు భువినెల్లనిచ్చి
యతిజితేంద్రియవృత్తి నడవులనుండ ♦ నతులతపోరాశి వగఁటనుజేసి
యొనరనీకెఱుగుట యుచితంబుగాన ♦ మునినాథ యేనీకు మ్రొక్కితిగాన
వెఱచి మ్రొక్కుటగాదు వెంవరినన్ను ♦ నుఱవకబోనాడుట యుచితమేనీకు
ననవుడు దాపసుండని నన్నుఁబలికి ♦ తనలోసహస్ర బాహార్జునుదొట్టి
యిరువదియొక్క మాఱేచిరాజులను ♦ తరిమిడిచంపితి ధరణిపై దొల్లి
నెరిదిలోదకములు నెత్తుటనొసగ ♦ తెఱగొప్పఋపితృ దేవతలెల్ల
భూపాలశవముల బొందెఁ దదివికి ♦ సోపానములుచేసి సారిదిమైచనిరి
అట్టిభార్గవరాము ననఘుననెఱుగ ♦ కిట్టిలరాముఁడై యిలబుట్టితీవు
రాజన్న బోరిగొందు రామనామములను ♦ రాజులసైతునే రణభూమినేను
రాజకులుండవౌ రామునినిన్ను ♦ నాజిమన్నింతునే యదియునుగాక
కరమొప్పవిలువిద్య గడిమిమైనేను ♦ హరునితోద్రొల్లి యభ్యాసంబు సేయ
నాడుకుమారుండు నాతోడదొడరి ♦ పోమిచెడియోడి పోయినజూచి
నాపెంపుమెచ్చిన నాగకంకణుని ♦ చాప బువిరిచిన సైఁతునేమరియు
అనిననారఘురాముఁడామజూచి ♦ యనియెనిశ్చలవృత్తినితిసమ్మదమున
నేనువినోదమై నెక్కిడితివియఁ ♦ గానదివిరిగెను గాక దానట్ల
నా తెగ కేల పినాకివిల్మిలుచు ♦ నాతతభుజసత్త్వ మట్టిదెనాకు
నెసగ యుద్ధము ందు నిక్ష్వాకుకులులు ♦
పసుల బ్రాహ్మణులజంప దలంపరెందు
నీవెన్ని పలికిన నీకవిచెల్లె ♦ నీవు బ్రాహ్మణుఁడవు నినుఁజంపనొల్ల
నిదెనాదుకంధర మిదెనీదుపరశు ♦ వదరక యుచిత కృత్యము సేయుమింక
ననవుడు రఘురాము నలుక దీపింపఁ ♦ గనుఁగొనిపలికె భార్గవరాముఁడదరి
భావింపనాకు నీపలుకులఁజూడ ♦ నీవుక్షత్రియుఁడవుఁ నేను బ్రాహ్మణుఁడ
ననుగర్వమున్నది యటుచూడవలదు ♦ వినుతవిక్రమశక్తి వేడిజూపెదను
వఱలునజ్జనక భూవరునింటనీవు ♦ విరిచినవిల్లు నీవిల్లునుద్రొల్లి

యర్మిలినిండార నమరులువిశ్వ ♦ కర్మచేనొక్కట గావించిరెలమిఁ
బురములునిర్మింపఁ బోయెడునాఁడు ♦ హరునకుఁదగనిచ్చిరందులోనొకటి
నావింటత్రిపురంబు లణచిరుద్రుండు ♦ దావీరగర్వ ముద్రారతుఁ డగుచు
నసహాయమున నేను నసురత్రయంబు ♦ వసుధపై గూల్చి తెవ్వరునాకునీడు
ననిపల్కచక్రి బుద్ధాకృతిఁబూని ♦ తునిమించెగాక రుద్రునికిశక్యంబె
యునియాడ కాడకునమరులుమునులుసనకాదిహరిపార్శ్వచరులునుబలుక
వినిరుద్రగణములు వినుపింపశివుఁడు ♦ వినిరోషమునబోర విష్ణునిబిలువ
సురగరుడోరగ వరులెల్లఁగూడి ♦ సరసిజాసనుఁ బేరఁ జనివిచారించి
హరిహరసత్త్వంబులరయుదమనుచు ♦ మురవైరికపుడు కార్ముకరాజమిచ్చి
యిరువురకెంతయు నెరుఃసేయుటయు ♦

హరియురుద్రుఁడుఁబోరి రరుదుగానపుడు
నారాయణునితీవ్ర నారాచఘోర ♦ ధారచేశివుని కోదండంబుసగము
విరిగిపెట్లిన వీక్షించిరపుడు ♦ హరిశక్తిఘనమని యమరులందఱును
ఇరువురమాన్పినా యీశుఁడవ్వేళ ♦ సురలచిత్తస్థితిఁ జూచియావిల్లు
రయముననాదేవ రాతునకిచ్చె ♦ జయధన్యుఁడాతండు జనకునకిచ్చె
వనజలోచనుఁడును వలనొప్పనిచ్చెఁ ♦ దనచేతిచాప ముత్తరిరుచికునకు
జమదగ్నికిచ్చె నిశ్చలమతినతఁడు ♦ జమదగ్నినాకిచ్చె సదయుఁడై దీని
బెనఁకువనదితొల్లి పెట్టియుంటఁ ♦ గనినీవువిఱిచితి గాకభూనాథ
ఆవిఁటితోడిదె నరయనాచేతి ♦ యీవిల్లునిదెచూడు మినవంశతిలక
నెలకొనియీవిల్లు నీవెక్కుపెట్టి ♦ తలకొనిబాణ సంధానంబుసేసి
కడిమిచూపకనిన్నుఁ గదలనీననిన ♦ దడయకరోషించి దశరథాత్మజుడు
కన్నులఘునవహ్ని కణములుదొరుగ ♦ వన్నరుంగనిజామ దగ్నితోననియె
నిరుపమనిజశక్తి నీకుఁగల్గుటయుఁ ♦ దరమిడిరాజులఁ దరిమిచంపుటయు
నెఱుఁగుదునన్ను నీవితరునిమాడ్కి ♦ వెరవకఁబలికెదు బీరంబుమెఱసి
వీవెఱుంగవునాదు నిజబాహుబలము ♦ నీవెంతవాఁడవు నీచాపమెంత
తెమ్మనివిలుదీసి తెగువమోపెట్టి ♦ క్రమ్మఱనత్యుగ్ర కాండంబుదొడిఁగి
నీకాళ్లుదెగవేసి నీగర్వముడిపి ♦ నీకోపమడఁచెద నేఁడన్నఁదలఁకి [పలికె
యురుసత్వగర్వంబు నుబ్బునుదూలి ♦ పరశురాముఁడురాముఁ బ్రార్థించి
నేనుగశ్యపునకు నిలనిచ్చినాఁడఁ ♦ గానరాత్రులు నిల్వగానేరనిచట
ననుదినంబును మహేంద్రాచలంబునకు ♦

జనవలెనటుచేసి చరణముల్వలయు
నాకాళ్ళునేయక గాపాలిపుణ్య ♦ లోకమార్గంబు లోకింపనేయు

నన్నురక్షింపుము నరనాథచంద్ర ♦ మన్నింపవే రామ మనుజలోకేశ
యనవుడు రఘురాముఁ డాజామదగ్ని ♦ ఘనపుణ్యలోకమార్గము నేసెనంత
జదురీతినిలుచున్న జమదగ్ని రాముఁ ♦ గడునుగ్రుఁడై యున్న కాకుత్స్థరాము
జూచుచునుండిరి సురసిద్ధసాధ్య ♦ ఖేచరులద్భుత క్రీడలఁదగిలి
వలనొప్పఁగాఁబుష్ప వర్షముల్గురిసె ♦ నలినగర్భాదులు నానందమంది
పొగడిరి రామునిఁ బొందుగా సురలు ♦ మిగులు తేజంబున మిన్నుననుండి
యంత భార్గవరాముఁ డారాముఁ జూచి ♦ యంతరంగంబున నతని భావించి
యనఘ నీసత్త్వమే నాత్మలోఁ జూచి ♦ నినువివేకించితి నీవు విష్ణుఁడవు
కాకుత్స్థకుఁటుగాన గదనంబునందు ♦ నీకు నోడుట నాకు నింతగా దెందు
నాబలంబును నీవె నాయాత్మ నీవె ♦ నాబంధువులు నీవె నారామచంద్ర
నామాటలన్నియు నాత్మనుంపకయ ♦ రామ రక్షింపవే రఘుకులాధీశ [ను
యనుచుఁ బ్రస్తుతి సేసి యానందమంది ♦ మనమున రఘురాముమహిమ లెన్నుచు
వరుస శ్రీరాముని వలగొని భక్తిఁ ♦ గరములు ముకుళించి కరముసంప్రీతి
వినయవిధేయుఁడై విభునటుచూచి ♦ మనమున గృపపుట్ట మఱియిట్టులనియె
సెలవిమ్ము రాఘవ శ్రీజానకీశ ♦ సెలవిమ్ము పోయెద సెలవిమ్ము నాకు
నాతప్పులెన్నక నన్ను మన్నించి ♦ సీతఱిరక్షించి యింపుగాఁ బనుపు [ము
మనసునేమము చేసి మదివెల్గఁగనుచుఁ ♦ గనుమూసి నినుఁ గూర్చి కదలక తప
లొనరఁగఁ జేసిన నొయ్యనమునులఁ ♦ మనములనానందమగ్నులై యుందు
రనుచుఁ బ్రస్తుతిఁ జేసి యభినుతుల్ చేసి ♦ యనుపమప్రీతితో నప్పుడే కదలి
నిరుపమతరశక్తి నీశక్తి యనుచు ♦ నరిగె రాముఁడు మహేంద్రాచలంబునకు
బరశురాముని విల్లు ప్రార్థింపనొసఁగె ♦ వరుణు చేతికి రఘువర్యుఁ డాక్షణమె
యప్పుడు వాయువు లనుకూలగతుల ♦ నొప్పనుత్సాహంబు లొదవె సేనలకు
నరుదరుదని సుర లభినుతి సేయ ♦ వరజయశ్రీ గూడి వచ్చి రాఘవుఁడు
ఠివ తండ్రిదశరథ ధరణిపాలునకు ♦ ననఘ వసిష్ఠున కతిభక్తి మ్రొక్క
మ్రొక్కినదీవించి మొగిఁ గౌఁగిలించి ♦ యక్కున నందంద నొదలఁ జేర్చి
పరమసమ్మదమునఁ బార్థివేశ్వరుఁడు ♦ సరసోక్తిఁ బునర్జాతుండనైతి
గొమరొప్పనీవంటి కొడుకునుగనుట ♦ నమరేంద్రబోలితి నవనిలో నిపుడు
పరమపావనుఁడైన పరశురాముండు ♦ పరమేశుపగిదిని బరఁగనిచ్చుటకి
వచ్చుటనేఁ గాంచి వడవడ లెల్ల వడఁక ♦ యిచ్చలోభయమంది యిఁక వేదిత్రోవ
యనుచు భయంబున నాతనితోడ ♦ మనవిగాఁ జెప్పిన మఱి వినకున్న
బరవశత్వంబొంది పలుకనేరకయు ♦ పరమమైత్రికి నేను బాల్పడియుంటి
నతని గెల్చుటయె నాకాశ్చర్యమయ్యె ♦ నతులితవైభవం బందితి నేను

బాసెనుభయమెల్లఁ బ్రాఘినిచేత ♦ వాసికెక్కి లినిల వైభవంబబ్బె
ననుచు రామునిఁ జాల నభినుతి చేసి ♦ మునివసిష్ఠాదుల ముదమునఁ గూడి
పరమసమ్మదమునఁ బలములు దాను ♦ నరిగెన యోధ్యకు నవనివల్లభుఁడు

—:* దశరథుఁడు పుత్రులం దోడ్కొని అయోధ్య కేగుట *:—

పుణ్యాచిహ్నములతో బుణ్యులతోడ ♦
బుణ్యమంగళ తూర్యములు మ్రోయనరిగి
తానును గొడుకులు దశరథాధీశుఁ ♦ డానందమున నయోధ్యాపురిఁ జొచ్చి
రాజితాలంకార రమణఁ జేపట్టు ♦ రాజమార్గంబున రారాజముఖులు [చు
సఖులు దారును గేళిసౌధంబు లెక్కి ♦ సుఖితరాకృతుల రాసుతుల గన్గొను
సేసలు చల్ల నాశీర్వాదమెల్ల ♦ భూసురులొసఁగ విస్ఫురణఁ బెంపెసఁగ
నగణితశృంగార మైయొప్పు దనరు ♦ నగరు బ్రవేశించె నరనాథుఁ డంతఁ
గౌసల్య కేకయ క్ష్మాపాలపుత్రి ♦ యాసుమిత్రా దేవి యాదిగాఁ గలుగు
నంతఃపురాంగన లందఱు నప్పు ♦ డెంతయుఁ బ్రీతితో నెదురుగా వచ్చి
చేరి వారలమీఁద సేసలు చల్లి ♦ నీరాజనంబులు నెఱి నిచ్చి రంతఁ
గొడుకు లందఱు మ్రొక్క గోడండ్రు మ్రొక్క ♦ గడు బ్రీతి దీవించి కౌగిటఁ జేర్చి
సీతాదికాంతల చెలువంపుబుద్ధి ♦ చాతురి కన్నుల చల్లగాఁ జూచి
తనరారుచుండిరి దశరథుం డపుడు ♦ తనయులు నలుగురు తను భజియింప
నాల్గు చేతుల నొప్పు నలినాక్షుఁ డనఁగ ♦ నాల్గు కొమ్ములు గల నాకేభమనఁగ
సకలజనానంద చతురుఁడై రాజ్య ♦ మకలంకరక్షకుఁడై యేలుచుండి
యొకనాఁడు దశరథుం డుచితమెఱింగి ♦ ప్రకటితశుభరతు భరతు వీక్షించి
ఘనుఁడు మీమామ కేకయరాజు దోడు ♦ కొనిపోదు నిన్న నికోరియున్నాఁడు
గాన శత్రుఘ్నుతోఁ గదలి మీమామ ♦ తో నేగియత సంతోషంబు నెఱపు
తాతకు నవ్వాఁ దగ మేనమామ ♦ కాతత భక్తితో ననిశంబు మ్రొక్క
సురల గాదలఁచి భూసురులకు వత్స ♦ పరమప్రియంబునఁ బరిచర్య సేయు
వారల చేత న వారణాశ్వాంద ♦ నారోహణములు శస్త్రాస్త్రవిద్యలును
వెఱి వేదశాస్త్రములీతిశాస్త్రములు ♦ సుకుశలవిద్యలు నొగి నభ్యసింపు
మేకక్షణంబును నెడపక నియతిఁ ♦ జేకొని నీ మేలు చెప్పి పుత్తెమ్ము
అనవుడుఁ దల్లుల కవనిపాలునకు ♦ వినతుఁడై రఘురామ విభునకు మ్రొక్కి
తాను శత్రుఘ్నుండు దన మేనమామ తో నయిమ్ములభరతుడు పుణ్యారతుడు
రాజగృహంబున రమణీయమైన ♦ రాజధానికి నేగి రఘుకుమారకులు
తాతకుఁ దమరాక దగ నెఱిఁగింప ♦ బ్రీతిమైఁ బుచ్చు నాపృథ్వీవరుండు
పట్టణంబున వీధు వడ తోరణములు ♦ గట్టించి బహుపతాకలు కల్వాడములు

కలయంగ నెత్తించి గంధోదకములు ♦
పొలుపొందఁ జల్లించి పుష్పధూపములు
కరమొప్ప రాజమార్గమున వాసింప ♦ బరిచారకులఁ బంచి బలయుతులగుచు
వనితలు నిజమంత్రి వర్గంబుతోడ ♦ జనుదేర నెంతయు సంభ్రమం జెసఁగ
వరుస నానాగీత వాద్యనృత్యములు ♦ పరమశుభాచార భంగుల నడుపఁ
బ్రీతి నెదుర్కొని ప్రియమొప్ప వంది ♦ సూతమాగధజనస్తుతులోలిఁ జెలఁగ
మనమల నొక్కొని మహిమతో వచ్చె బనిగొన్న భక్తితో భరతుండు నంతఁ
దమ తాత మొదలుగా దగిన పెద్దలకు ♦ గ్రమము దప్పక నమస్కారముల్చేసి
పొలుపొంద వారిచే బూజితుండగుచు ♦ దళుకొత్త వేడుక దాతతో ననియె
నార్యక నాకు విద్యాభ్యాసమింకఁ ♦ గార్యమాచార్యులై ఘనులైనవారి
కప్పగింపుడు నన్ను ననిన నా రాజు ♦ చెప్పినవారిచే శిక్షితుండగుచు
నమరవిద్యాభ్యాస మంతయు జేసి ♦ విమలైకమతి నొక విప్రుని చేతఁ
దమతండ్రి యగుచున్న దశరథేశునకు ♦ సముచితస్థితి మేము సకలవిద్యలును
జెలువంబుగా నభ్యసించితి మింక ♦ దలపుప్పుట్టెను మాకు దము జూడవలయు
నని చెప్పుమన నయోధ్యా పురంబునకుఁ ♦
జనుదెంచి యతఁడు నా జననాయకునకు
రాజపత్నులకు నారామలక్ష్మణుల ♦ కోజ నెంతయుఁ జెప్ప నుల్లంబు లలర
నంత శ్రీరాముండు యౌవరాజ్యమున ♦ నెంతయు జతురుడై యెల్లవారలకు
బ్రాకటంబుగ నొండు బాధ లేకుండ ♦ నేకప్రబుద్ధిగా నిటవండ్రిఁ గొలిచి
ధారుణీప్రజలకు దయయొప్పఁ జేసి ♦ వీరువారనకతి విశ్రుతకీర్తి
సముచితుండై ధర్మచరితంబు బూని ♦ యమరేంద్రవిభవుడై యారామవిభుడు
సీతయుఁ దానును జెలువొప్పఁ గూడి ♦ నూతనరతిసుఖార్ణోరాశిఁ దేలి
చంద్రశాలల గేళి సౌధవీధికలఁ ♦ జంద్రకాంతాతి విశాలవేదికల
గాజుటోవరుల బ గరుపడకండ్ల ♦ జాజిపూఁబాన్పుల జంపకక్రముక
నారికేళరసాల నారంగరంగ ♦ నారామములఁ గృతకాద్రిసానువులఁ
గొలఁకులకెలఁకులఁ గుంజపుంజములఁ ♦ జలువచప్పరముల సైకతస్థలులఁ
జాతురి మెలఁగుచు సకలభోగముల ♦ నాతతసౌఖ్యంబు లందుచునుండె
ఆనియాంధ్రభాషభాషాధీశవిభుడు ♦ వినుతవాక్యాగమవిమలమానసుడు
పాలితాచారుడ పారధీశరధి ♦ భూలోకనిధిగోన బుద్ధిభూవిభుఁడు
దమతండ్రి విఠ్ఠల ధరణీశుపేర ♦ గమనీయగుణధైర్య కనకాద్రిపేర
నలఘునిశ్చలవమాయతబుద్ధిపేర ♦ లలితనిర్మలగుణాలంకారుపేర
నాచంద్రతారార్కమై యొప్పమిగిలి ♦ భూచక్రమున నతిపూజ్యమై యొప్ప

పవమానలలితశబ్దార్థసంగతుల ♦ రసికమై చెలువొందు రామాయణంబు
పరఁగనల కారక భావనల్నిండ ♦ గరమర్థినీబాల కాండంబుఁజెప్పె
నారూఢినాశ్లేయమై యాదికావ్య ♦ మైరసికానందమై యల్లనాఁడు
నివ్వసుమతినొప్పు నీపుణ్యచరిత ♦ మెవ్వరుచదివిన నెవ్వరువినిన
సామాదిబహువేద చయధామరామ ♦నామచింతామణిసవ్యభోగములు
పరహితాచారముల్ ప్రభుచారములుపరిపూర్ణశక్తులుప్రకటరాజ్యములు
నిర్మలకీర్తులు నిత్యసౌఖ్యములు ♦ ధర్మైకనిష్ఠలు దానాభిరతులు [మఁలు
నాయురారోగ్యంబు లైశ్వర్యములును ♦ బాయనిశుభములు పాపక్షయ
వరపుత్రలబ్ధియు వైరినాశనము ♦సరినొప్పుధనధాన్య చయసమృద్ధియును
నేవిఘ్నములుఁ లేక యుద్ధలోనధిక ♦లావణ్యమతులై నలలనఁ పొందు [యు
కొడుకులతో నెపుడు గూడియుండుటయు ♦ నెడగాగ నాపదలెల్ల బాయుట
సమ్మదంబున బంధు జనులఁగూడుటయు ♦
నిమ్ములగామ్యంబు లెడపకుండుటయు
సతతంబు దేవతా సంతర్పణంబు ♦ పితృగణతృప్తియు బెంపారుచుండు
వ్రాసినవారికి వరశుభోన్నతులు ♦ వాసవభోగాది వాసుఁజేయు
నెందాఁకకులగిరు లెందాఁకజలధి ♦యెందాఁకరవిచంద్రు లెందాఁకదిశలు
ఎందాఁక వేదంబు లెందాఁకధరణి ♦ యెందాఁకభువనంబు లేపుదీపించు
నందాఁకయీకథ యతులితానంద ♦ సందోహదోహళాచారమైపరఁగు.

బాలకాండము సమాప్తము

———



# శ్రీ రంగనాథ రామాయణము

## అయోధ్యాకాండ ప్రారంభము

—:( * ):—

శ్రీలీలఁ దశరథోర్వీశ లుఁడవనిఁ ♦ బాలించుచుండి చొప్పడనొక్కనాఁడు
సుతులునలువురలోనశుభతరమూర్తి♦ యతులయశోనిధియగుచున్నవాని
ననుదినంబును పేదలగువారినెల్ల ♦ మనమునమోదమంద మన్నించువాని

హితబుద్ధియగువాని నెల్లభూతముల ♦ హితమునఁగరుణ నన్వేషించువాని
బోలఁజతుర్విధ పురుషార్థగతుల ♦ నోలిచిత్తంబున నూహించువాని
ననిశంబుసంతుష్టుఁడైయుండువాని ♦ గొనియాడఁదగిన సద్గుణములవాని
దప్పనికోపంబు దగుప్రసాదంబు ♦ నొప్పగుప్రభుశక్తి నొనరెడువాని
గజహయారోహణ క్షముఁడగువాని ♦ విజయలక్ష్మీ సమన్వితుఁడగువాని
వెరవరియగువాని విహితకార్యంబు ♦ నరయన నాలస్యుఁడై చేయువాని
మాననిరోషంబు మదిలేనివాని ♦ మానుగాభృత్యుల మన్నించువాని
నతిరథుఁడగువాని నవసూయవృత్తి ♦ ప్రతిదినంబునబుద్ధి వాటించువానిఁ
గరుణాసముద్రుఁడై కడుమించువాని ♦ బరులగుణంబులు పాటించువాని
బుద్ధిబృహస్పతిఁ బురణించువాని ♦ నిద్ధతేజంబున నినుఁబోలువాని
నమితప్రజానంద మలరించువాని ♦

కుముదబాంధవుభంగిఁ గొమరొందువాని
వెలయుధనుర్వేద వేదశాస్త్రములు ♦ వలయువిద్యలయందువలనొప్పువాని
న్యాయమార్గంబున నర్థార్జనంబు ♦ పాయకసేయ నేర్పరియగువాని
సైరణధరతోడ సరివచ్చువాని ♦ భూరిగుణంబులఁ బొలుపొందువాని
శ్రీరాము పట్టాభిషేకంబు చేసి ♦ ధారణిఁ బాలింపఁ దలపోసియంతఁ
దలకొన్నకడకతోదశరథేశ్వరుడు ♦ కొలువుకూటమునకు గొమరొప్పవచ్చి

**{ దశరథుడు వసిష్ఠాదులతో రామునకుఁ బట్టముఁగట్ట నాలోచించుట }**

యందువసిష్ఠాదులగుమహామునులు ♦ నన్దుసుమంత్రాదులగుమంత్రివరులు
చేరువనృపతులుచెలులుఁజుట్టములు ♦ పౌరవర్యులుజానపదులు నాశ్రితులు
సారవివేకులు సామంతనృపులు ♦ ధీరులురాజనీతిజ్ఞులుమొదలు
వారలరావించి వారిదనినద ♦ చారుగంభీర సుస్వరమునబలికె
మాపెద్దలిక్ష్వాకు మనుజేశముఖ్యు ♦ లీపృథివీశుల మేలిరింపెసఁగ
వారలరీతిన వారితనీతి ♦ నీరాజ్యమంతయు నేనోపినట్లు
నిజకులాగతధర్మ నిరతుండనగుచు ♦ ప్రజలనేలితిని మీప్రాపుగఁ జేసి
యిదియంతయునుమీర లెఱిఁగినయదియ ♦

విదితంబుగానింక వినుఁడొక్కమాట
నఱువదివేలేఁడు లవనిఁ బాలించి ♦ నెఱసితఛత్రంబు నీడనేయుండి
ముదిసితిభూభార మునకంటెఘనత ♦ బొదలుజరాభార మునఁ దాల్చెతన
నామేనువికసిత నలినషండంబు ♦ కౌముదితోఁబోరి గర్వంబుదక్కఁ
గావునరాము గల్యాణరాము ♦ దేవతాహితకాము ధీగుణస్తోము

నిందీవరశ్యాము నినకోటిధాము ♦ సౌందర్యజితకాము జగదభిరాముఁ
బ్రజలఁ బాలింపఁగ బట్ట బుగట్టి ♦ సుజనులు గొనియాడ సుఖకరంబైన
యూరటగోరుచు నన్నాఁడమీకు ♦ నీరీతిసమ్మతి యే యంచుఁ బలుక
ఘనగర్జితంబులా కర్ణించియలరు ♦ వనమయూరములన వారుత్సహించి
మొగిగలకలశబ్దముఖరితస్వాన్తులగుచు భూసురముఖ్యులగు భూమిప్రజలు
దమలోన దాము నంతన మాడికూడి ♦ కమలాప్తకులునకు మ్రొక్కితననిరి
మీరానతిచ్చిన మేలిమిమాట ♦ వారువీరనకెల్ల వారికిహితము
హృదయరంజకము నభీష్టదంబయ్యె ♦ నదిగాక సకల జనానందకరము
రాజనీతిజ్ఞునిర్మల ధర్మనిపుణుఁ ♦ దేజోజగద్బంధు దీనైకసింధు
సత్యసంపన్ను బ్రశాంతిసంపన్ను ♦ నిత్యవిప్రార్చనా నిరతుసచ్చరితు
నీతియు బ్రీతియు నేర్పునునోర్పు ♦ ఖ్యాతియుభూతియు గాంతియుదాంతి
శాంతియుమొదలగు సద్గుణావళుల ♦ నెంతయునీకన్న నెక్కుడైయున్న
రామునిలోకాభి రామునినీవు ♦ భూమికిరాజుగా బూన్చుటతగదె
త్రైలోక్యమైనాతండేలంజాలు ♦ నీలోకమేలుట యెంతమాత్రంబు
నీసుతాగ్రణిరాజ్యనిరతుడౌనేని ♦ భూపతిచేసిన పుణ్యంబుగాదె
కావునఁబట్టంబు గట్టుమీవతని ♦ కేవేళ మేమును నిదియెకోరుదుము
అనుచుబద్ధాంజలులై విన్నవింప ♦ నితనమదిలోన వేడ్కరెట్టింప
భూమీశుడప్పు డుప్పొంగివసిష్ఠ ♦ వాసుదేవులఁజూచి వానొప్పఁబలికె
నీమధుమాస మభీష్టదంబగుట ♦ రామునిసకల సామ్రాజ్యలక్ష్మికిని
రాజుఁజేయుదము తద్ద్రవ్యవస్తువులు ♦ యోచించి తెప్పింపుడుచితవైఖరిని
ననిపల్కవారునయ్యభిషేకయోగ్య ♦ ఘనవస్తువులుగూర్పఁగాఁ బంచిరంత
ఆమ్మవల్లభుండు సుమంత్రాదిమంత్రి ♦ కోవిదులనుబంధు కోటివేర్వేఱ
రావించిచెప్ప వారలుసమ్మతించి ♦ వేవేగరఘురామ విభునిరప్పించి
తనచూపులనుసుధాధారలుదొరుగ ♦ జననాథుడారామచంద్రుతోననియె
బెనుపొందకడిమిమై బెద్దకాలంబు ♦ జనులెల్లబొగడ రాజ్యముచేసి యేను
దానముల్ ధర్మముల్ తనరుయాగములు ♦ నూనిననిష్ఠతోనొగిబెక్కు చేసి
కడపటనీయట్టి కల్యాణశీలుఁ ♦ గొడుకుగాఁబడసితిఁ గోర్కె రెట్టింప
నేనింకభూభార మిటమోయఁజాల ♦ గాననిఁబట్టంబు గట్టెదబ్రీతి
చెలువార పట్టాభిషేకంబు సేయ ♦ లలితపుణ్యోదయ లగ్నమెల్లుండి
రయువరసీతయునీవు నుపవాసముండు ♦ డనసినభక్తితో నెల్లనప్రీతి [యె
ననిపల్కుటయురాముడవనీశుజూచి ♦ వినయంబుధైర్యంబు వెలయనిట్లని
జననాథనాకు నీచరణపద్మములు ♦ గొనకొన్నభక్తితో గొలుచుటకంటె

గడచినరాజ్యంబు గలదెలోకముల ♦
నుడుగుమీపలుకుల యోగ్యంబులనుడు
ననఘచారిత్రుండ నతిసత్త్వధనుఁడ ♦ వినకులరత్నంబ వీవుఁడవింకఁ
దగువారలెవ్వరు ధరణిపాలనము ♦ దగిలికావింపుము త్రైలోక్యవీర
యనిపల్కుటయురాము డల్లైకాకనుచు ♦ దననగరికిబోయె దదనంతరంబ
పౌరులరాజుల బంధులనెల్ల ♦ వారలవీడ్కొని వనజాప్తకులుఁడు
అంతఃపురంబున కరిగిశ్రీరాము ♦ చెంతనున్న సుమంతు చేబిలిపించి
తనసమీపముననాతనయుగూర్చుండ ♦ బనిచియానంద బాష్పములుప్పతిల్ల
మనమలరగజూడమహిపునకష్టు ♦ మనమునదిగులొత్తమతియశుభములు
కనుపట్టెనంతట గడుభయమంది ♦ తత్పుత్రకునిజూచి తద్దయుబలికె
నాపాలిభాగ్యంబ నానిధానంబ ♦ నాపుణ్యసారంబ నాతపఃఫలమ
నాపుత్రరత్నంబ నాకలలందు ♦ దీపించెనశుభవర్ధితనిమిత్తములు [ద్దె
ఘనదుర్గ్రహములునుల్కాపాతములును ♦ గనుగొంటిమనసువైకల్యంబునో
గావునబుష్యయోగము నీకులెస్స ♦ నీవుపట్టముబూన నిందునాకోర్కి
యాలస్యమేలని యభ్యుదయమున ♦ కీలోకమంతయు నెపుడుగాంక్షించు
ననవినిదశరథునానతియియ్య ♦ కొనిమ్రొక్కితండ్రివీడ్కొని రామవిభుఁడు
తనతల్లికిని సుమిత్రకునట్టివార్త ♦ జనకనందనకు లక్ష్మణునకుజెప్పి
వారలసంతోష వార్ధి దేలించి ♦ యారామవిభుఁడు శీతాంశుసన్నిభుఁడు
తననగరికివచ్చి దానుసీతయును ♦ ఘనమైనహృదయ వికాసంబు నొంద
నంతవసిష్ఠుతోననియెభూవిభుఁడు ♦ సంతోషమెసగంగజనిరామవిభుని [న
మునినాథ యుపవాసమునకుసంకల్ప ♦ మొనరింపజేయుముయుక్తమార్గము
ననపుడుబ్రహ్మరథారూఢుఁడగుచు ♦ జనివసిష్ఠుఁడు రామచంద్రునికడకు
దనశిష్యునొక్కని తడయకపనిపి ♦ తనరాకమున్నుగా దగనెఱిగించి
యమ్మూడువాకిండ్ల యందాకబోవ ♦ నిమ్ములరాఘవుం డెదురేగుదెంచి
యవతీర్ణరథునికి నతిభక్తిమ్రొక్కి ♦ సవినయంబుగ సంతసంబుననపుడు
లోనికిదెచ్చియా లోకవంద్యునకు ♦ మానుగసత్కృతుల్ మనసారజేయ
పుణ్యాహవాచనంబులునుపవాస ♦ పుణ్యసంకల్పంబు పొసగజేయించి
వెలయరాముఁడు పదివేలదేనువుల ♦ నెలమిదక్షిణగాగ నిచ్చినగొనుచు
వచ్చివసిష్ఠుఁడు వసుమతీపతికి ♦ నచ్చుగాఁజెప్పి గృహంబునకరుగ
నంతఃపురంబున కరిగెభూవిభుఁడు ♦ నంతనక్కడరాముఁ డానందమంద
జానకితోఁగృత స్నానుఁడైవిష్ణు ♦ మానుగాగూర్చి హోమంబుగావించి
మాహవిశ్శేషంబునమరబ్రాసించి ♦ యూహావిష్ణుధ్యానమొనరజేయుచును

విశదనిశ్చయబుద్ధి విష్ణుగేహమున ♦ కుశశయ్యపైఁ బొల్చి కులగురుండైన
యావసిష్ఠుఁడు చెప్పి నట్టిచందమున ♦ ధీవరిష్ఠుఁడు రామదేవుండు నిష్ఠ
నుపవాసముండె నయోధ్యలోనంత ♦ విపులసమ్మదమున విలసిల్లువారు
కోలఁదిముత్యముల ముగ్గులు వెట్టువారు ♦
చెలువార గృహములఁ జిత్రించువారు
కలయఁగస్తూరి రేఖలుదీర్చువారు ♦ నలిమీఱి మణితోరణము లెత్తువారు
విరులచప్పరములు విరచించువారు ♦ పురవీథిఁ గేతనంబుల నిల్పువారు
కలవడంబులు మేలుగాఁగట్టువారు ♦ కలిమినొండొరులర్థి గైసేయువారు
పభిషేకసుముహూర్తమలరించువారు ♦ విభుఁడైనదశరథువినుతించువారు
నిలువేల్పులకుబూజ లిచ్చెడువారు ♦ కలకొద్దిదానముల్ గావించువారు
పురరాజవీథి గుంపులుగూడువారు ♦ సరసకథాగోష్ఠి సలిపెడువారు
రాముడేరాజుగా బ్రార్థించువారు ♦ రామునిగొలువ సంభ్రమపడువారు
రామకీర్తనముల రాజిల్లువారు ♦ నైమహోత్సవకోటు లటుచేయుచుండ
నప్పుడుమందర యనుకైకదాసి ♦ తప్పక దనమేడఁ దానెక్కిచూచి
యిదియేమి చందమో యీపురలక్ష్మి ♦
పొదలుచున్నది మహాద్భుతవైభవముఁ

—*: మందర కైకకు దురోక్తులు బోధించుట :*—

పౌరులందఱును నపారశృంగార ♦ చారుశరీరులై సంతసించెదరు
కొసల్యనగరిలోఁ గలకాంతలెల్లఁ ♦ గైసేసియున్నారు కడువేడ్కతోడ
నేలొకో కౌసల్య యెదనుబ్బియుబ్బి ♦ వేలసంఖ్యాధనంబు వెచ్చపెట్టెడిని
ననుచు బ్రమోదాదియగు రాముదాది ♦ కనుఁగొని యడిగియక్కామినివలన
రాముఁబట్టముగట్టి రాజుగావించు ♦ నామహోత్సవకోటులని నిశ్చయించి
పనివడి రాముఁడు బాల్యంబునందు ♦ దనకాలువిఱిచిన తప్పుసాధింప
నిదినాకుతఱియని యిచ్ఛఁజింతించి ♦ యదివచ్చి కైకతో నంతయుఁ జెప్ప
వచ్చితత్కేళీనివాసంబుఁజొచ్చి ♦ మచ్చికనుయ్యాల మంచంబుమీఁదఁ
బ్రవిమలమృదులతల్పంబుపై వేడ్కఁ ♦ బవళించియున్నయప్పద్మాక్షిఁజూచి
లెమ్ము లెమ్మో నృభామలీలాభిరామ ♦ ఇమ్మెఱుంగవు కార్యమేమియుననుచు
గొనరెట్టఁబట్టి గ్రక్కన లేవనెత్తి ♦ తననేర్పుమాటలఁ దరుణికిట్లనియె
వసుధాధిపతినాకువలచు నాభాగ్య ♦ మసమానమని చెప్పుటదిబొంకులయ్యె
నదియెట్టులనుపెద్ద యాలికివెఱచి ♦ మదిరాక్షినినువేడ మఱిమోసపుచ్చి
భరతునినొకవంకఁ బరభూమిఁబంచి ♦ పరికింపరఘురాముఁ బట్టంబుగట్ట
దలఁచుచున్నాఁడు దశరథేశ్వరుఁడు ♦ నెలఁతయిట్టిదియైన నీకేటిబ్రతుకు

రాజులమది నమ్మరాదు నీకేల ♦ వేజాడలను విడ్డి వీగదో బాల
యిట్టి మోహావిదూరు నిట్టివంచకుని ♦ నిట్టిబూమెలవాని నెందు నేగాన
మగఁడె యూతఁడు మైత్రి మానినయట్టి ♦ పగవాఁడుగాక యీ పట్టులనీకు
సవతికుమారుని జగతియంతటికి ♦ ధవునిగాఁ జేసిన ధవళాయతాక్షి
నీకుమారునకును నీకును నాకు ♦ శోకమబ్బుట గాక సుఖమేల కలుగు
నీకరణంబుగా నీతండ్రియునుపఁ ♦ జేకొన్న ప్రేమ వచ్చినదాన నేను
నీ లెస్స నా లెస్స నీకైన లేమి ♦ నా లేమి గాన నానావిధంబులను
హితవుఁ జెప్పితి నీకు నిందునిభాస్య ♦ మతి నీదుపుత్రుండు మనుటవలంపు
మనుట వేడుకఁ బూని యాకైకదాని ♦ వినుతించి కౌఁగిట వేగంబ చేర్చి
శ్రీరాముపట్టాభిషేకోత్సవంబు ♦ చేరి నాకెఱిఁగించి చెవులకు విందు
చేసితి వేమందుఁ జెలువ నీపొందు ♦ వాసిగా ఫలియించె వక్రోక్తులుడుగు
భరతునకంటెనా భరతాగ్రజుండు ♦ తిరమైన భక్తి విధేయుండు నాకు
నీమేలు వార్తకు నేను మెచ్చితిని ♦ భామరో యనుచు నేర్పడఁ గొంతసొమ్ము
ఘనతరనవరత్న ఖచితమై యొప్పు ♦ తన చేతికడియంబు దానికి వేగ
కొమ్ము కొమ్మని యొసగుటయు నా సొమ్ము ♦ లమ్మాయలాడి యల్లట్లు పాఱవైచి
పాపంబు హృదయతాపంబు కోపంబు ♦ దీపింపఁ బలికె నత్తెఱవతో మఱియు
నిది మేలుగా నుబ్బితిచ్చలో నిపుడు ♦ యిది యేమి మెచ్చుగా నిచ్చితి నాకు
నిది యేమి కైక యీహితవు గైకొనక ♦ పదరి పల్కితి నీతి భావింప లేక
వలనొప్ప నేమనవచ్చు నీగుణము ♦ కలకాలమీ తీరుగాఁ జనఁదోడఁగాఁ
దన్నుమాలినయట్టి ధర్మంబుగలదె ♦ కన్నుఁబోయెడునట్టి కాటుకగలదె
జగతిలో నెందైన సవతినందనుల ♦ కగపడు శుభముల కాత్మఁ గోరుదురె
సవతికుమారుండు సామ్రాజ్యమునకు ♦
ధనుఁడైన సకల భూధవులు బాంధవులు [బగను
ప్రజలు మంత్రులు రాముపంపు సేయుదురు ♦ గజహయాదిబలంబు కైవశం
దశరథునకు స్వతంత్రము లేదు పిదప ♦ శశిముఖియైన కౌసల్యసంపదల
విఱ్ఱవీఁగఁగ సరి వెలందియైయుండి ♦ వెఱ్ఱిదానవె యెట్లు వేగించెదీవు
నదియిది యేలనీ వావధూమణికి ♦ నొదుఁగుచు దాసివై యుండగవలయు
భరతుండు నా రఘుపతికి భీతిలుచు ♦ వెఱపున భృత్యుఁడై విహరింపవలయు
రాజదేవియటంచు రమణి సీతకును ♦ నీ చిన్నకోడలె న్నిజఁ గొల్వవలయు
నెలత యిట్టిద యేని నీకేటిబ్రతుకు ♦ కలదుపాయంబిది కార్యంబునకును
వనదుర్గములరాము వసియింపఁబనుపు ♦ పనివడి భరతునిఁ బట్టంబుగట్టు
మనవుడు కైకేయి యక్కటా నాకు ♦ జననాథుఁ డింతటి చనువిచ్చె నేని

ఆరాజునేమని యడుగఁదుదీని ♦ నీరెండుదశరథుఁ డేలనాకిచ్చు
నెక్కడిమాట నీవేమిచెప్పినను ♦ నికార్యఘటన నాకేరీతిఁబొసఁగు
శ్రీరామునడవులఁ జేరఁబొమ్మనుచు ♦ నేరీతిఁజెప్పుదు నెలనాఁగ నేను
ననుచున్నకైకతో నాయుపాయంబు తనకీడుమెఱయమంథర చెప్పదొడఁగె
బతుకకతొల్లి శంబరుఁడునింద్రుండు ♦ దొడరిపోరాడ నింద్రునకునై ప్రీతి
నినుఁదోడుకొని సైన్యనివహంబుదాను ♦ జనిరాత్రిమార్కొన్న శంబరుతోడ
బోరాడదశరథభూపాలుమీద ♦ నారాక్షసుఁడుమాయలలుకఁబన్నుటయు
ధవళాంగుడనుమునిదయనీవుగన్న ♦ నవిరళంబగుమాయనామాయఁడచి
నీవిభునాదైత్యు నిశితాస్త్రనిహతి ♦ జావకుండఁగగాచి సంప్రీతుఁజేసి
వసుధేశుచే రెండు వరములునాఁడు ♦ మసలకబడసితి మఱచితే వాని
ఈవెనాకీకథ లెఱిఁగించిమఱియు ♦ నీవాత్మమఱచిన నేనేలమఱతుఁ
బట్టంబునెడబాసి పదునాలుగేండ్లు ♦ గట్టిగామునివృత్తి గౌసల్యకొడుకు
దారుణకాంతార ధరణియేలుటకు ♦ ధారుణీతలము నీతనయుఁడేలుటకు
నారెండువరములు నవనీశునడిగి ♦ యీరెండుతెఱగులనిటుసేయబనుపు
మడుగుచోనతఁడెంత ప్రార్థించెనేని ♦ జడమతితోఁగాక సత్యంబుమోపి
వినుమకనీకార్య విధముసాధింపు ♦ తొడిగినకార్యంబు దొఱకునెల్లెడలఁ
బతిఁజింక వెఱచు నీపై నెయ్యమెక్కు ♦ డతకరింపదుసేయుమని నరాగిల్లి
నీవంటిప్రియురాలి నీవంటిసఖిని ♦ నీవంటినయగుణ నిధినెందుఁగాన
నీపునాచేవిన్న యీవరద్వయము ♦ గావరంబునఁ జేయఁ గావరాఁగోహ
ఈవెంచినటువలె నీభూమికెల్ల ♦ నావరతనయుండు నాయకుండైన
బాగుగానపరంజి బంగారుచేత ♦ నీగూనుపొదిగించి నీముఖేందువునఁ
దిలకంబుకస్తూరి దిద్దినీమేను ♦ వలనొప్పభూషణావళులు గైసేసి
నటియించు మరునియందపుగొమ్మయనఁగ ♦

గుటిలకుంతలనీవు గ్రుమ్మరుచుండ

సఖులెల్లనీమాట జవదాటకుండ ♦ సఖియనిన్నలరింతు సతతమేననుచు
గైకమంథరకు సత్కారముల్ జేసి ♦ యేకాంతమున దనయింటికిఁబోయి
పెట్టినసొమ్ములు పెట్టెలోఁబెట్టి ♦ దట్టమౌకస్తూరి తలఁపట్టుపెట్టి
మలినవస్త్రముగట్టి మదినల్కదొట్టి ♦ చలముచేపట్టి భూస్థలిబడెనంత
దనలోననూహించి తనుగొల్చివచ్చి ♦ మనమారనున్న యామంథరఁజూచి
జననాయకుఁడు రామచంద్రునిబిలిచి ♦ వనమునమునివృత్తి వర్తింపఁబనిచి
భరతునిదగురాజ్య పదమునకెల్ల ♦ గరమర్థిబట్టంబు గట్టినగాని
యన్నపానములొల్ల నాభరణమ్ము ♦ లెన్నియిచ్చిననొల్ల నేమియునొల్ల

నిటలేచి రానింక నేనంచు నలుక ♦ నటుపూవి మదిలోన నలయుచున్నంత

—*: దశరథుఁడు కైకయింటికి పోవుట :*—

కైకేయితోడ రాఘవునిపట్టాభి ♦ షేకోత్సవంబెల్లన జెప్పెదననుచు
నారాత్రిదశరథు డచటికే తెంచి ♦ చారుమాణిక్య కాంచనధగద్ధగిత
కనకరత్నకవాట కక్ష్యాంతరముల ♦ ఘనసారచందన కర్పూరగంధ
కలితనానారత్న కాంతిశోభితముఁ ♦ దులకించుసౌధ వేదులవేగకడచి
కేళీగృహంబున గేకయపుత్రి ♦ బోలంగబరికించి పొడగానకపుడు
దౌవారికునిచూచి దశరథుడడుగ ♦ గావాడువగచుచు కరములుమొగిచి
దేవయాకోప మందిరములోపలికి ♦ దేవివిచ్చేసెనే తెరగగొకోయెరుగ
ననివాడుబల్కిన నామాటలకును ♦ ధనురుగ్రటంకార దారుణంబగుచు
వీనులబడిమోము వెలవెలబారి ♦ మానవాధీశుండు మానసంబునను
ప్రేమానుబంధంబు ప్రీతిరెట్టింప ♦ నామందిరంబున కల్లనవచ్చి
యనిమిషపురినుండి యచ్చరలేమ ♦ చనుదెంచిపడియున్న చందంబుదోప
నూరకేధరణిపై నున్నయావికచ ♦ నీరజాసనజూచి నివ్వెరగంది
వెరవెరపాటున వేదనబొంది ♦ తెలివదగ్గిరజేరి దీనుడైమీరి ద్రాణగ
యాయెఁతియొడలెల్ల నంటిచూచుచును ♦ కాయజవివశుడై కడువేగ
ఇందీవరాక్షి పూర్ణేందునిభాస్య ♦ ఇందిందిరాలక యేలనీయలుక
బవళింపనేల నేబవలేందుఫాల ♦ యవిరళమృదుల పర్యంకంబులుండ
కోమల మృదుల దుకూలంబులుండ ♦ నీమైలచీర నీవేలగట్టితివి
పసిడిశలాకతో బ్రతిమైన మేన ♦ బొసగభూషణముల బూనవేమిటికి
జలపట్టివెన్నెల చందమానుదుట ♦ దలపట్టుయాలనీ తలపెట్టుపుట్టె
నీలాలకంబుల నిగ్గులుదేర ♦ నేలపాపటదీర్ప విన్నాళ్లరీతి
గెమ్మోవికినుమడి కెంపుసంధిల్ల ♦ గమ్మతమ్ములమేల కైకోవుబాల
జిలుగువెన్నెలతేటచిఱునవ్వుమొలక ♦ మొలపింపవేటికముఖచంద్రునందు
నిదియేమికైక నీవిటుచిన్నవోయి ♦ మదిదూలినీకింత మరుగనేమిటికి
నెవ్వరునీదెస నెగ్గులువలికి ♦ రెవ్వరుమాటాడి రెదిరినీతోడ
వారినెరింగింపు వారిజనయన ♦ వారివారింతు నెవ్వారలనైన
ననిపల్కికన్నుల నందంద్రగమ్ము ♦ ఘనభాష్పపూరముల్ కరములదుడిచి
లేమనీవొకదిక్కు లేనిచందమున ♦ భూమిపైనిటధూళి బొరలనేమిటికి
గాముసోకెనోయొందు ఘనమైనరోగ ♦ మేమిపాటిల్లెనో యెఱిగింపునాకు
వెజ్జులువచ్చిన వేగమాన్పెదరు ♦ లజ్జింపనేటికి లలితాంగినీకు
నటుగానసీతలంపైన నొండరయ ♦ నిటుసేయుమనిపల్కు మేనుజేసెదను

వనితనీకొఱకు నవధ్యులుగాని ♦ యనఘచరిత్రుల నైన జంపెదను
జంపందగిన దుర్జనకోటినైన ♦ గంపించినీమాట గాచిపుచ్చెదను
నీకుఁబ్రియుండైన నిదుపేదనైన ♦ జేకొనిరాజుగా జేసెదనెలమి
భామినీనీదయ బాసినయట్టి ♦ శ్రీమంతునైన దరిద్రుజేసెదను
నేనునావారు నీహితబుద్ధినడువ ♦ గానీకునిట్లుండ గారణమేమి
లేమనామాట లాలించినీవిపుడు ♦ మోమెత్తినామది ముచ్చటదీర
నడిగిననాప్రాణమైన నీకిత్తు ♦ నడుగుమునీవన్న నానందమంది
యువ్వాతివిభుని నెయ్యంబు నెఱింగి ♦ సన్నపుటెలుగున జననాథుకనియె
దేవనీచెప్పిన తెఱగుననీవు ♦ గావింతునని బాస గావింతువేని
మఱియెఱింగింతు నమ్మాటనీకనిన ♦ చెలువతోదశరథాధిపుడిట్టులనియె
వీరుడెవ్వాడు మేటి విలుకాండ్రలోన ♦ సారమెవ్వాడు ధర్మసమితిలోనెల్ల
నెవ్వనిజూడక నేనుండజాల ♦ నెవ్వడునను భక్తి నెప్రొద్దుగొలుచు
నట్టిరాఘవునితో డతివనీకోర్కె ♦ నెట్టనగావింతు నేనన్ననలరి
మరుదగ్నిశశినభోమణిముఖ్యులైన ♦ సురలవేర్వేర సాక్షులుగానొనర్చి
ధరణీశుమదిలోని తమకంబుదెలసి ♦ కరుణకునెడబాసి కైకయిపలికె
నొలసిదేవాసుర యుద్ధంబునందు ♦ వలనొప్పనిచ్చితి వరములురెండు
భూవరమరచితే బుద్ధిచింతింపు ♦ మావరద్వయము నిన్నడిగెదనిపుడు
నాదిత్యకులజుండ వగుమహారాజు ♦ వాదిరాజులకంటె నధికపుణ్యుడవు

—:* కైక తనకిచ్చిన వరముల నడుగుట *:—

తప్పాడవాడిన దప్పవునాకు ♦ తప్పకవరములు దయనిచ్చితేని
ధరణికంతటికిని దగరాజుగాగ ♦ భరతుపట్టముగట్ట బనుపుమొక్కటికి
పరగదాపసవృత్తిపదునాలుగేండ్లు దురుదుర్గములరామునునుపుమొక్కటికి
యనిపల్క నిర్ఘాతమైవచ్చిచెవుల ♦ గొనకడమూర్ఛిలి కుంభినిద్రెల్లి
పెలుకురిభూపతి పెద్దప్రొద్దునకు ♦ తెలివొందికైకేయి దెసజూచిపలికె
కోమలికేకయ కులమునబుట్టి ♦ మీమాటలాడ నోరెట్లాడెనీకు
నడవులకాలుగమ్మని రాముద్రోవ ♦ నెడపకతొల్లినీకెగ్గేమిజేసె
కౌసల్యకంటెనిక ఘనతగాజూచు ♦ నీసేవలొనరించు నీపంపుసేయు
నలువంటి సుగుణాఢ్యుడైన శ్రీరాము ♦ నెలనలెబొమ్మంటి వేదయమాలి
అడవులకతని నీవంపుమటన్న ♦ నెడజూచిచూచి నేనెట్లుజొమ్మందు
నామహాత్ముని రామునడవులకనిచి ♦ ఈమేనప్రాణంబు లెట్లునిల్పుదును
నృపపుత్రివని నిన్నునెమ్మిగైకొంటి ♦ చపలలోచన కాలసర్పంబవైతి
నారాజ్యమైన ప్రాణములైననిత్తు ♦ నారాముఁవిడిచి పొమ్మనిపల్కజాల

ననువృద్ధుఁడీనన నాథుదుర్బలుని ♦ మనికతప్పకుండ మగువరక్షింపు
చక్కఁగా నీపాద జలజంబునకును ♦ మ్రొక్కెద నేను రాముని నదాటమునఁ
జెలువయీపాపంబు సేయఁ జింతింప ♦ వలదన్న కోపించి వామాక్షి బలికె
రాజేంద్ర సత్యపరాక్రమస్ఫూర్తి ♦ బూజితకీర్తివై బొంకంగఁదగునె
ఇట్టిదేవతలంద రెఱుఁగంగ నొట్టు ♦ పెట్టితప్పదవెట్టి పృథివిపాలుఁడవు
ఒకగువ్వకై తన యొడలిమాంసంబు ♦ నొకఁడేగకును శిబియొసఁగఁడె మున్న
క్షోణిదేవున కలర్కుండను రాజు ♦ ప్రాణతో నొసఁగఁడె తనలోచనములు
చెలరేఁగి జలధియు జెలియలికట్ట ♦ బలిమిదాటక లోను బడియుండ లేదె
యదియటులుండె నీయన్వయభవులు ♦ మదిలోననవ్వుల మాటలకైన
కలలోనఁ బొంక రిక్ష్వాకుఁడవయ్యు ♦ వెలయ కౌసల్యకు వెఱచి బొంకెదవు
బొంకెడువాఁడొక్క పురుషుఁడే యనుచు ♦ బొంకితి ననుఁ బొంద బుద్ధిగాదిఁక
విచ్చలవిడి నేను విషమైన మ్రింగి ♦ చచ్చెదనట మీఁద జంపింపు భరతు
పావనుఁడగు రాము బట్టంబు గట్టు ♦ నీవు కౌసల్యయు నెమ్మది నుండు
మనిపల్కుటయు శోకమాత్మ రెట్టింప ♦ జననాథుఁడెంతయు సంతాపమంది
వెలవెలఁబోయి వివేకహీనతను ♦ గలిగి యాకైకతో గ్రమ్మఱఁ బలికె
ఓలకైకేయి నీకిట్టిపాపంబు ♦ బాలిశత్వంబున బ్రాపించె మదిని
నన్నయుండఁగఁ దమ్ముఁడవినీతితోడ ♦ నిన్నేల నేలునే యిన్నియుఁగేల
నీకుమారుఁడు ధర్మనిరతుండు భరతు ♦ డీకలుషోక్తికి నెట్లొడిగట్టు
మాకులాగతమైన మర్యాద దలఁపు ♦ శోకార్తుననుఁ దెగఁ జూడక మనుపు
యెప్పుడుఁ యిల్లాలు హితవుభక్తియును ♦ దప్పక సఖరీతిఁ దల్లిచందమున
దాసివై ఖరిసహోదరి తెఱంగునను ♦ నా సేవలొనరించు నానావిధమున
నట్టి కౌసల్య మోహాపు బట్టిఁ బాసి ♦ పట్టినధృతి నెట్లు ప్రాణము ల్పట్టు
సౌదామినీలతా సంకాశదేహ ♦ వైదేహి యేరీతి వగల వేగించు
నా సుమిత్రాపుత్రుఁ డతనితల్లియును ♦ ఈసావిని శోకమెట్లణంచెదరు
శ్రీరాము పట్టాభిషేకంబుఁ గోరి ♦ పౌరులందరు వేడ్కఁ బడియుండు చోట
నారామునడవుల కనిచితి నేని ♦ ధీరాత్మకులు నన్ను దిట్టకుండుదురె
కావున నెల్లలోకములకు గీడు ♦ గావించియే సౌఖ్యగతులుండెదీవు
ఇది యేలకో కయిక యిఁకొకమాట ♦

ముదిత చెప్పెద నిక్కముగ నీవు వినుము
కలువ రేకుల బోలు కన్నులవాని ♦ మొలకనవ్వుల మోము మురిపెంపువాని
బలువైనయాజాను బాహులవాని ♦ వలరాజు గేరు చెల్వము గలవాని
నలరుకల్వల కాంతి నగుమేనువాని ♦ జల్లచూపుల వెదజల్లెడువాని

సుధలొల్కు తియ్యని సుద్దులవాని ♦ బుధులకుహితవాక్య బూనెడువాని
వలచినాకెపుడు సేవలుసేయువాని ♦ నిలుకొల్ల ధర్మమై నెగడెడువాని
రామునిజితభృగు రామునిగాంతి ♦ సోమునిసద్గుణ స్తోమునికీర్తి
కాముని సౌందర్య కాముని శాంత ♦ ధాముని రవి సమధాముని బాసి
నిమిషమాత్రంబైన నేనోర్వ జాల ♦ కమలాక్షి నీ వెరుంగ వెయిట్టివాని
నాయుత్తమోత్తము నడవులకనుప ♦ పోయె ప్రాణంబులు పోవు నాకుణమె
యెంత పాపిష్ఠివే యెంత కట్టడివె ♦ యెంత మూఢాత్మవె యెంత రాకసివె
కఠినాత్మురాల యీకల్మషంబేల ♦ శఠమతి గోరెదు సాధ్వివై యుండి
యాలవై ప్రాణాపహారంబు సేయు ♦ కాళరాత్రివిగాక కాంతవా నీవు
నడచి రాముడు కాననమున కెట్లరుగు ♦ నడవుల నెట్లుండు నందఱ డోఁ గి
మెత్తని పాన్పున మేనెత్తు భోగి ♦ నెత్తఱుఁగున నుండు నిలఁదృణశయ్యఁ
బత్తెనిష్టాన్నముల్ బంధులుదాను ♦ నెంతయు నియతితో నిటనారగించు
గడుపున్యదేహిక గంధమాలములు ♦ నడపక భుజియింప నెటుసమ్మతించు
నతివ నీకతిథ క్షుద్రైన రామునకు ♦ నతిగీడుదలపకు మన్నింపుమనుచు
నడరుశోకంబున నడుగులమీఁద ♦ బడిన ప్రమొక్కొల్లక పాదముల్ దిగువ
భూకాంతుడిలబడి పొరలగ్గ కొనక ♦ కైకేయి దశరథు గని యిట్టులనియె
చాలు చాలీవట్టి జగ్గోలిమాట ♦ చాలింపుమీపట్టి జాడ లేమిటికి
ధర్మంబుమాని సత్యము వీటఁబుచ్చి ♦ నిర్మలయశమెల్ల నీటిలో గలపి
యీవరద్వయము నాకీ లేదటంచు ♦ భూవర భాంకి నీపుత్రుండు నీదు
దేవులు నీవు వర్ధిల్లుము నేను ♦ నావరసుతుడు ప్రాణములు బాసెదము
అనునంత మారాడకను వేగివిభుడు ♦ తనమది శోకించి తలవాంచియుండె
నంత వేగుటయు దూర్యంబులు ప్రమోయ ♦ నంతఁ తవంది జనావళిపొగడ
కలగొని కర్పూర గంధముల్ చల్లి ♦ జలములఁ జలకంబు చదరొప్పనాడి
పరగ దివ్యాంబరాభరణముల్ పూని ♦ చిరకీర్తి రాముఁడు సీతతోగూడి
తెరగొప్ప శచితోడ దేవేంద్రుడొప్పు ♦ తెరగున సంపూర్ణ తేజుడై యొప్పె
మరియుఁ దనభిషేక మంటపంబునకు ♦ నెరవసిష్ఠాదులు నిండ నేతెంచి
యాఋరుంధతి మొదలగు పుణ్యసతులు ♦

నాయతమతులగు నామంత్రివరులు
తగనొప్పమకుట వర్ధనచక్రవర్తు ♦ లగుమహారాజుల నందురప్పించి
పంచపల్లవములు పంచవల్కములు ♦ పంచామృతంబులు పట్టపేనుంగు
నెనమండ్రు కన్యలు హేమకుంభంబు ♦ నొనర నౌదుంబర యోగ్యపీఠంబు
గంగాదితీర్థోదకము లాదిగాగ ♦ మంగళవస్తు సామగ్రిదెప్పించి

వరరత్నభూషణావళులు దెప్పించి ♦ తరమిడి వేదోక్త దానముల్ సేయ

—:* కైకయింటికి దశరథుని బిల్వ సుమంతుడు పోవుట *:—

నొకలక్షకన్యల నొకలక్షగోవు ♦ లొకలక్షయుష్ట్రంబు లొప్ప దెప్పించి
జపములు సేయించి శాంతి సేయించి ♦ విపులహోమంబులు వేట్కఁ సేయించి
యనుపమంబగు లగ్న మాసన్నమైన ♦ మనుజేశు బిల్వ సుమంతు నంపుటయు
కైకేయినగరికి గడకతో బోయి ♦ వాకిట నిలుచుండి వలనొప్ప బలికె
దేవ సూర్యుడు పొడ తెంచుచున్నాడు ♦ వేవేగ మీరటు వేంచేయవలయు
శ్రీరాము పట్టాభిషేకంబు సేయ ♦ నారూఢమగు లగ్న మాసన్నమయ్యె
మనుజేశ యభిషేకమంటపంబునకు మునులు రాజులు మహాత్ములు వచ్చినారు
పౌరులు బుధులును బంధులు గూడి ♦ మీరాక గోరి యిమ్మెయి నున్నవారు
అనవిని దశరథుడావార్త లెల్ల ♦ తనకు కేవల మనస్తాపంబు సేయ
వనట నీవును నొంప వచ్చితే యనుచు ♦ విని యనిద్రించిన విధమున నుండె
నాసమయంబున ననియె కైకేయి ♦ యోసుమంతుడ వేగ నుర్వీశుకడకు
రాముని దోడ్తెమ్ము రాజపంపనుడు ♦ నామాటవిని యతడప్పుడే పోయి
సీతకుటీరంబు సిక్తాంగణంబు ♦ కేతనాన్వితము నికేతనాంచితము
చందనాగరుధూప సౌరభాన్వితము ♦ మందానిలాలోల మాలికాయుతము
ప్రతిగృహద్వార రంభాస్తంభవర్గ ♦ మతులితరమణితోరణాభిరామంబు
పౌరజనాది సంభ్రమదుర్గమంబు ♦ నౌరాజమార్గంబు నడుపు గన్గొనుచు
నింద్రుగేహము హసియించుయాకిన్న ♦ రేంద్రుమందిరము లోసిరి జోడాడి
సాంద్రవైభవ రమాసహితమా రామ ♦ చంద్రునినగరికి జనుదెంచి లోన
చనువరులై యున్న జనులచే వేగ ♦ తనరాక యెరుగించి తదనుజ్ఞ వడసి
చిత్రాఖ్యతారతో సిరులుల్లసిల్ల ♦ మైత్రియొప్పెడు చందమామ చందమున
సీతాసమేతుడై చెలువొందు రామ ♦ భూతలనాథుని బొడగాంచి మ్రొక్క
రా దేవ మిము దశరథ చక్రవర్తి ♦ యాదేవి కైకగృహంబున నుండి
యాదట బిలిచి తెమ్మని పంచెననుడు ♦ మోదించి చిరునవ్వు మొలకలు నిగుడ
ధరణిజ నటయుంచి తానులక్ష్మణుడ ♦ కరమర్థి రథమెక్కి కడకతో గదలి
చతురంగబలముల సంఖ్యలు గొలువ ♦

నతులవాద్యముల మిన్నందిమ్రోయంగ
వందిబృందములు కైవారముల్సేయ ♦ జెందిపుణ్యాంగనల్ సేసలు జల్ల
పురజనులానందమున జయవెట్ట ♦ నరనాథునగరి కున్నతగతి వచ్చి

—:* శ్రీరాములు కైకయింటిలోనున్న దశరథుని బొడగాంచుట *:—

యురదంబుడిగి రాముడపుడు కైకేయి ♦ వరమందిరము జొచ్చి వలనొప్ప వచ్చి

వదనంబు వాంచి వైవర్ణ్యమందించి ♦ పెదవులు దడవుచు బెంపెల్ల నుడిగి
యుడుగక కన్నీరు లొలుక శోకాగ్ని ♦ బడి కాలు దశరథపతి చేరబోయి
కరము భీతిల్లి మ్రొక్కి కైకకు మ్రొక్కి ♦ కరములు ముకుళించి కడు విస్మయంబు
వెరవెర పాటును విహ్వలత్వంబు ♦ వెరపును మఱపును వీడి జోడాడ
పరిపరివిధముల బలుమారు నెమకి ♦ పరమపుణ్యుడు రామభద్రుండు పలికె
నో దేవి యిది యేమి యుర్వీశ్వరుండు ♦ నా దెస జూడడు నా తప్పు లేమి
యీ విన్నదనమును నిట్టిదుఃఖంబు ♦ నీవిచారము రాజుకేమిట గలిగె
ననవుడు నీ కైక యధిపు చందంబు ♦ వినిపింతు నీవు గావించెద వేని
ననిపల్క రఘురాముడది యేమి తెఱగు ♦ వినిపింపు మోయమ్మ విశదంబుగాగ
దండ్రివాక్యములకై దారుణశిఖల ♦ వేగ్రదమానగ్నిలో విషధిలోనైన
బడియెద విషమైన భక్షించువాడ ♦ జడియక వినుపింపు సత్యమీమాట
ననవుడు కైకేయి యా రాము జూచి ♦ మనమున గృపమాలి మరి జెప్పదొడగె
గరుణ దేవాసుర కదనంబునందు ♦ వరములు రెండు భూవరుడు నాకొసగె
నవనీశు నా రెండు నడిగి మా భరతు ♦ నవనికి బతి జేయుమ టిన్నొక్కటికి
నెడపక పదునాలుగేండ్లు నిన్నిప్పు ♦ డడవుల కాపుండ మంటి నొక్కటికి
ననుటయు నాగాక యని యిచ్చె నీకు ♦ వినుపింపమీ తండ్రి వెఱచియున్నాడు
కావున జడలు వల్కలములు గట్టి ♦ నీవింక తపసివై నృపవేషముడిగి
చను దెమ్ము దశరథ జనపతి బొంక ♦ దనిపింపవలదేని యడవులనుండు
పొమ్మన్న విని మొగంబున జిరునవ్వు ♦ గ్రమ్మ మాటల నొండు కసటు లేకుండ
గరుణయు దెగువయు గరిమంబు దోప పరమపుణ్యుడు రామభద్రుండు బలికె
నిటు సేయుమన్న వాడీ వసులాధీశు ♦ డటనా సహోదరుండగు రాజ్యకర్త
యటమీద నీ కోర్కి యడపడ నేల ♦ కటకటా కయికేయి కడు ముగ్ధవైతి
వింత మాత్రమునకై యినవంశజుండు ♦ చింతింపనేటికి చిత్తంబులోన
తన జనకుని మాట దాటినవాడు ♦ తనయుడే తలపోయ దాయాదిగాక
యేనేమి నా తమ్ముడేమి యీ భూమి ♦ బూనుటకును బాహ్య పురుషుడై యున్న
భరతుని దెసనాకు బ్రాణంబులైన ♦ సరకుగావని యీ రాజ్యము నాకు సరికె
యనవుడు ముదమందియా కైక బలికె ♦

మనుజేంద్రతనయ యా మాట కేనిపుడు
భరతునితో ద్వేర బనిచెదనింక ♦ నరుగుము వనముల కరుగునందాక [యు
కుడువడు పలుకడు కూర్చుండడిట్లు ♦ పడియుండు నృపుడంచు పల్కబల్కుట
కటకటా తగునె యీ కఠినోక్తులనుచు ♦ నటు మూర్ఛతో నేలబడియె నా రాజు
నయ్యెడ నా రాము డవనీశచంద్రు ♦ నొయ్యన బట్టి శైత్యోపచారముల

తెలిపియెంతయునుబోధించుచుమరియు ♦ బలికెకైకనుజూచిపరమహర్షమున
వింతయేటికిజింత యిదియెంతనాకు ♦ నంతరంగంబున ననుమానపడకు
పరికించిధర్మంబు పాటింతుగాని ♦ కరమర్థివ్యర్థంబు గావింపనేను
వేయేలవిభునాజ్ఞ వినబడకున్న ♦ నీయాజ్ఞగడవను నిక్కువంబరయ
జాతులశీఘ్రసంచారులఘోట ♦ కాయాధులుగఁజేసి యనిచివేవేగ
కరమర్థినీఁగన్న ఘడియలయందె ♦ భరతునిబిలుపించి పట్టంబుగట్టి
మీదెయరణ్యములకు నేగెదననుచు ♦ వదనాబ్జములరంగ వలగొనివచ్చి
తనతల్లికినిసుమిత్రా వధూమణికి ♦ జనకనందనకునీ చందమంతయును
వినుపించివారల వెసనూరడించి ♦ చనుదెంతునోయమ్మ సందియపడకు
మునిరాజునకుమ్రొక్కి యాకైకకెరఁగి ♦ తనుగొల్చుసౌమిత్రిదగిలిరాఁగదలి
చెలువారఁబట్టాభిషేకంబుకొఱకు ♦ లలినమర్చిన మంగళద్రవ్యములకు
నుచితప్రదక్షిణ మొనరించిచిత్త ♦ మచలమైయవికారమై వికసింప
రాజ్యపట్టముమాని రాముండులోక ♦ పూజ్యుండుకానన భూమికేఁగెడిని
అనుమహాకలకలం బంతఃపురమున ♦ వినబడదశరథు వెలదులుగలఁగి
యేభక్తిఁగౌసల్య యెడనుగావించు ♦ నాభక్తిమనయందు నట్లగావించు
నాగుణాలంకారు నామహోదారు ♦ నాగరివరధైర్యు నాశౌర్యధుర్యు
నాపుత్రరత్నంబు నకటకానలకు ♦ భూపాలుఁడేమని పొమ్మనవేర్చె
వీరడియైరాము విపినవాసమున ♦ కారడిఁబుచ్చంగ నౌనమ్మయనుచు
మీరినవగలతో మేదినీనాథు ♦ దూరుచుశోకింప దొడగిర దరును
ఆసమయంబున నారామవిభుఁడు ♦ కౌసల్యయింటికి కడకతోవచ్చి
యటమున్నదొడగిన యభిషేకమునకు ♦ బటువిఘ్నమొరులుసంపాదింపకుండ
జపములుశాంతులు చారుహోమములు ♦ విప్రులైకనిష్ఠ గావింపుముప్రేమ
గరమర్థినేమి ముఖ్యాగ్నికొనిభక్తి ♦ పరతజనార్దను బ్రార్థింపుచున్న
కౌసల్యరాము రాకకుసంతసిల్లి ♦ భాసిల్లువరపుణ్యభామలుదాను
నెలమిసేసఁగొంచు నెదురుగావచ్చి ♦ వెలయశుభాచార విధులాచరింప
నంతనాకౌసల్య యనుకులకాంత ♦ సంతోషమున రామచంద్రుని నెత్తి
ఆలింగనముసేసి యాయువుయశము ♦ భూలాభమునుబొందు పుత్రనీవనుచు
దీవించుతమతల్లి దెలగొప్పరామ ♦ దేవుఁడువీక్షించి దీనుఁడైపలికె
ఏకార్యమునుమీర లెరుగరుతల్లి ♦ మీకొసుమిత్రకు మిథిలేంద్రసుతకు
గడుభీతిఁబుట్టించు కార్యంబుబుట్టె ♦ విడువకధృతిబూని వినుముచెప్పెదను
వసుధేశుచేరెండు వరములుతొల్లి ♦ యసమానగతికైక యాజిలోబడసె
గొడుకుపట్టముగట్టఁ గోరెనొక్కటికి ♦ అడవికినన్నుబంప నడిగెనొక్కటికి

—.* కౌసల్య ప్రలాపించుట *:—

నడిగినదశరథు డధికశోకమున ♦ బడుటయు మాతండ్రి పలుకు రక్షింప
నడవులబడు నాలుగబ్దంబులుంత ♦ కడగి వచ్చితినన గౌసల్య మదిని
గలగి నివ్వెరగంది కడు చిన్నబోయి ♦ వలుకనేరక భ్రమానుపడియుస్సురనుచు
ముడిగొన్నవగలతో మొదలంటద్రవ్వ ♦
పడియున్న లతబోలె బడి మూర్ఛబోయె
సడలుచు రఘురాము డప్పుడా తల్లి ♦ నెడపతి భక్తితో నెత్తి నెమ్మేన
గమియునంటిన ధూళి కరమున దుడిచి ♦ కొమరారు గద్దియ గూర్చుండ నునిచి
శ్రమముదీరంగ లక్ష్మణుడును దాను ♦ సముచితగతి నుపచారముల్ సేయ
నొందవినవగలతో నొయ్యన దెలసి ♦ పెదవులు దడపుచు బి. బోప్పి పలికె
అనఘ రాఘవ నిన్ను నడవుల నుండు ♦ మనుపల్కవిన నెందు నరుదు వీనులకు
పిలుచ నొక్కట నిన్ను బిలిపించి యిట్లు పలుక నెమ్మెయి జాలె బార్థివేశ్వరుడు
ధరణికంతటికిని తగు రాజుగాగ ♦ భరతు పట్టము గట్టి పతి సేయుగాక
కడు గృపాశూన్యుడై కానస్థలులకు ♦ డడకి కి నిన్ను బొమ్మనుకున్న నేమి
యవివేకిగానొండె యధముడుగాడు ♦ సవతిమాటలు విన జననయ్యతనకు
నిది ధర్మమిది కార్యమిది లెస్సయనుచు ♦
మదికెక్కహితులై నమరిమంత్రులైన
కులగురుడైన లోకులు మెచ్చరతని ♦ దెలుపలేరైరి సీ దెసమైత్రిగూడి
యింత నేరము జేసె నెన్నడు నాథు ♦ డితపాపము జేసె నెన్నడు కైక
యడవులనుండు పొమ్మని నిన్ను జూచి ♦ నుడువగ గైకకు నోరెట్లులాడె
ననవున జేరి ప్రాణములైన నడుగు ♦ జననాథునకు దాను చనవురాలైన
గైకకు బుట్టి లోకము లేలకీవు ♦ నాకేల పుట్టితి నా రామచంద్ర
నీవు నా కడుపున నిట పుట్టియున్న ♦ నీ విషాదము నాకు నే పాటిల్లు
కొడుకులు లేనియా గొడ్రాలికంటె ♦ గడలేని శోకంబు గలిగె నాకకట
పెద్దకాలము నాకు బిడ్డలు లేక ♦ తద్దయు బ్రీతిని దనయుగా గాంచి
యూరడియుండు చో నుండలేవయ్య ♦ నారడి చెడిపోయె నకట నా తపము
నరనాథనందన నన్ డించి నీవు ♦ కరము తెంపున ఘోర కాంతారములకు
నరిగినప్పుడె నాకు నారసి చూడ ♦ మరణంబు దప్పించి మఱియొండు లేదు
నన్నిట్లు విడిచి కావలకేగెదింక ♦ నన్ను నే నేమిట నడలార్చుకొందు
నెలమి మైమియుపది యేడవత్సరము ♦ లలరి పెంచితి నిన్ను నఖిలంబు నెఱుగ
నట్టి నన్నిటు డించి యెట్లు పోయెదవు ♦ పట్టి నీకొఱకునై ప్రాపించినట్టి
వివిధవ్రతంబులు వివిధదానములు ♦ చవుటవిత్తనములు చల్లినట్లయ్యె

భరతుండు రాజైన పరివారజనులు ♦ కరుణమాలినయట్టి కైకకు వెఱచి
ననుగొల్వవత్తురే నరనాథునంచు ♦ చనలేవుకుండెడు చందంబుజూచి
వాసియువన్నెయు వైభవంబెడలి ♦ యీసవతులలోన నెట్లువర్తింతు
కైరాజననునే కరణిసహింతు ♦ నీకార్యమిట్లౌట నెఱగలేనైతి
వీనులనీవార్త వినుటకుమున్నె ♦ యేనేలచావనైతినవంశతిలక
కడగియీరాజ్యంబు గైకొనికైక ♦ కొడుకుపట్టముగట్టికొని యేలుగాక
భూరిదుర్గములకు బోవనేమిటికి ♦ యూరకినావద్ద నుండవేతండ్రి
యావసిష్ఠాదిసంయములు బాల్యమున ♦ భావించిచూచినీపాదపద్మములు
జలజాతహలకులిశధ్వజకలశ ♦ ములుమొదలగు చిహ్నములువిలోకించి
యీవిశ్వమంతయు నితడేలుననిరి ♦ యీవార్తకైక నేడనృతంబు జేసె
నని పెక్కుతెఱగుల నడలుకౌసల్య ♦ గనిలక్ష్మణుండు శోకముకోపమెసగ
ముడివడుబొమలతో మొగలుకెంపెక్కగ ♦

నుడుగకదోషాగ్ని లోగిమండుచుండ
రామునుమాతనుజూచి రామునిజూచి ♦ సౌమిత్రియడిదంబు ఝళిపించి పలికె
మగటిమిదిగనాడి మానంబువిడిచి ♦ తగునుత్తమక్షత్ర ధర్మంబువదలి
వాలినతేజంబు వమ్ముగా జేసి ♦ యేలయోడెదో కష్టలిట్లాడనీకు
యక్కటా వీతజ్ఞుడగుతండ్రిపనుపు ♦ స్రుక్కగ ధిక్కరించుటకాదుకాక
కామాతురుండు పాపకర్ముండువృద్ధుం ♦ డేమిటికీరాజు నింతపాటింప
కైకేయికిచ్చి బొంకగనేరననుచు ♦ నీకిచ్చియోడక నేండెట్టుబొంకె
నడరివసిష్ఠాదు లందరువినగ ♦ కడగినీకిబట్టంబు గట్టెదనన్న
పలుకుసత్యంబుగా పాటింపవలదె ♦ తలపంగయదియసత్యముగాదె తొలుత
నెక్కడిదశరథుం డెక్కడివరము ♦ లెక్కడిభరతుండు నెక్కడికైక
వినుమేమువిజముగావిల్లెక్కబెట్టి ♦ కొనియున్న నన్ను మార్కొననెవ్వడోపు
భరతునిమొదలుగా బగవారిజంపి ♦ నెరసియీపుడమెల్ల నీరుగావింతు
హరిహరబ్రహ్మాదు లడ్డమైరేని ♦ తరమిడితొలియుద్ధము సేయువాడ
గమనీయకేయూర కంకణాలంకృ ♦ తములుమనోజ్ఞ చందనచర్చితములు
నగునాభుజములన్నభిషిక్తుజేసి ♦ పగతురజంపుదు పాల్పడియిపుడ
పాటింపనావంటి బంటుగల్గియును ♦ నేటికిసాంమ్రాజ్య మెల్లవర్జింప
నడవులకేగెద ననునట్టిబుద్ధి ♦ విడిచికౌసల్యకు వేడ్కలుప్పొంగ
నెట్టనకడిమిమై నిజశక్తిమెరసి ♦ పట్టంబుగట్టుక ప్రజలపాలింపు
మనినకౌసల్యయు నారామూజూచి ♦ వినుమునీతమ్మునివిమలవాక్యములు
శౌర్యంబుచేపట్టు జనులెల్లపొగడ ♦ నార్యసమ్మతముగా నవనిపాలింపు

సవతిమాటలకు రాజ్యముమానియడవి ♦ నివసింపబోవుట నీకుధర్మంబె
నాయింటనుండుము నాదు శ్రీరామ ♦ సేయుమింతటికంటెక్షితిధర్మ మెద్ది
జనకు వాక్యము సేయజాలిననీకు ♦ జననివాక్యంబెన్న సన్నమే యన్న
యనిపెక్కువిధముల నడలుచునున్న ♦ తనతల్లినూరార్చి తలపెల్లదెలిసి
ఏమిటికీమాట లింతశోకింప ♦ నేమిటికనిరాము డేర్పడబలికె
బలువిడితమతండ్రి పసుపునదొల్లి ♦ చలమున దమతల్లిజంపె భార్గవుడు
తరగనికినుకమై దమతండ్రిపనుప ♦ సరగుననొకగోవుజంపెగుండీశు
తన మనోహారమయిన తారుణ్యమొసగి ♦

తనతండ్రిముదిమియు దాల్చెంబూరుండు
తమతండ్రిపనుపునద్రవ్వరేతొల్లి ♦ తమకించిసగర నందనులంబునిధిని
గడగితండ్రియు పనుపుగైకొనినాకు ♦ నడవులకుండుట నదియెంతపెద్ద
నీవల్లభునిమాట నీకునునాకు ♦ భావించి సేయుట పరమధర్మంబు
ఈలక్ష్మణుడు బాలుడేమియునెరుగ ♦ జాలడువీరవిచారంబెకాని
యనినవ్వుచును రాముడనుజన్ముజూచి ♦

తనలోనశాంత మాతయుదోఁపఁబలికె
నీవిక్రమంబును నీభుజాబలము ♦ నీవిలువిద్యయు నీదుబుద్ధియును
నీమగతనమును నేటికియకట ♦ సౌమిత్రనాయెడ సద్భక్తికిదియె
యెంతసాహసము నీవిపుడుగోరితివి ♦ యెంతటిబుద్ధి నాకవుజెప్పితివి

—:* శ్రీరాములు కౌసల్యకు నీతిదెల్పుట :*—

గొనికొనియిటువేడు కొన్నదితల్లి ♦ యనుకంపలేక పొమ్మన్నాడు తండ్రి
యిలయెల్లజేకొని యీరాజ్యపదము ♦ నలినేలువాఁడెక నాసహోదరుకు
బలువిడియెవ్వరి పైనగ్గలీవు ♦ బలగర్వములుచూప బాడియేనీకు
నర్మిలితండ్రివాక్యము సేయుకంటె ♦ ధర్మ మొకగలదెయీతండ్రి వాక్యంబు
ద్రోయుటకంటె దుష్కృతమునుగలదె ♦ వేయువిధంబులవెతికిచూచినను
జనకునిపనుపవశ్యము నీకునాకు ♦ జనులకును జేయ సహజధర్మంబు
గానయాతని పంపుగైకొనినేను ♦ కానలకేగుట కాదనవలదు
పరమపావనులైన భానువంశజుల ♦ చరితంబునీకు విచారింపవలదె
కావలసినపనుల్ గాకేలమాను ♦ దైవయత్నములివి దాటంగదరమె
యనినలక్ష్మణు డప్పుడాటోపముడిగి ♦ తనముందరఘురాముగలపెల్ల నెరిగి
జననియూరకయుండె సాధ్వికౌసల్య ♦

కొడుకుతెంపునకు మిక్కుటమైనవగల [యు
తూగులుచుగళలచేపున్నమచంద్రు ♦ డగడురామునిమోముదృష్టించి మరి

నాకులభూషణ నాముద్దులయ్య ♦ నా కూర్మికొమరుండ ననుఁగన్నతండ్రి
క్రేపు బాసినయావు క్రియ నిన్ను బాసి ♦ యీపదునాలుగేండ్లిందుండఁజాల
నినుఁగూడి చనుదెంతు నిష్ఠురాటవుల ♦ కని ప్రలాపించు నయ్యంబ ననూరార్చి
యనునయాలాపదీనాస్యుఁడై రాముఁ ♦ డనియెనో యమ్మ యిట్లాడఁగఁదగునె
పతియె ప్రాణపదంబు పతియె చుట్టంబు ♦ పతియె దైవతమాత్మఁ బరికింపనట్టి
పతి బాసి నా వెంట పరతెంతుననుట ♦ మతిదలంపగ ధర్మ మా తల్లి నీకు
వసుధేశు వానతి వసుమతిభార ♦ మెసఁగ నా భరతున కిచ్చుట తప్పె
యవనీశుఁడిచ్చిన సన్నవరంబు ♦ లవి రెండు కైకేయి యడుగుట తప్పె
యనృతంబునకునోడి యకట రాజేంద్రుఁ ♦ డొనరంగ వరము నిట్లొసఁగుట తప్పె
మా తండ్రి యానతి మదినిర్వహించి ♦ యే తెరంగున బూనుటిది నాకుఁ దప్పె
చేకొని పతి పంపు చెల్లింపకున్న ♦ నీకైవ తప్పదు నిక్కంబరయ
బోని కానలకేను పోయిన మిగుల ♦ దీనులై పొగలు పార్థివుని నీ వెపుడు
ననునయింపుచు సపర్యలు నొనర్చుచును ♦

మనసునుమ్మలికంబు మాన్పంగవలదె

దురితదూరుండు బంధురనీతిరతుఁడు ♦ భరతుండు నాకన్న భక్తి నిన్నరయు
నీవు శోకింపకు నీకలనైన ♦ భావి పదశరథ పతియొప్పదసకు
కైకేయి యిదువరకలసి వర్తింపు ♦ నాకు సేమముగోరు ననువీడుకొలుపు
మని పల్కి మ్రొక్కిన నా రామచంద్రు ♦ గనుఁగొని కౌసల్య కౌగిటఁ జేర్చి
గ్రమ్మెడు శోకాశ్రుకణములందంద ♦ వెమ్ముచు రఘురాము వీపున రాల
నడవికిఁ బోయెదే యకట నీవనుచు ♦ గొడుకుమైనివిరిడ గుత్తిక బెట్టి
రొక్కింతధృతిబూని యుల్లంబులోన ♦ జెక్కుఁగన్నీరు చేతఁబోదుడిచి
పావనజలముల బ్రక్షాళితాస్య ♦ యైవచ్చి పుణ్యాహమపుడు సేయించి
సురలును ఖేచరుల్ శ్రుతులును యతులు తరులును గిరులును దాంతియు శాంతి
నదులును నిధులు నర్ణవము నాకసము ♦ నుదకంబు మారుతంబుర్వియు నగ్ని
దిక్పాలకులు దశదిశలు చంద్రార్క ♦ వాక్పతి ప్రముఖులు వలనొప్ప నీకు
స్వస్తియెల్లప్పుడొసంగుదురనుచు ♦ బ్రస్తుతిజేసి యా భామాలలామ
పాలుపొంద వేల్పుల బూజించి రాము ♦ వలచేత నొకరక్ష వలనొప్పఁగట్టి
యలిగి వృత్రాసురు ననిజంపబోవు ♦ బలభేదియకు వజ్రపాణికిఁదొల్లి
యేమంగళములిచ్చి రెల్లదేవతలు ♦ నామంగళములు నీకగు రామచంద్ర
యరుదుగా దివినున్న యమృతంబు దేర ♦ గర మొప్పనరిగెడు గరుడున కర్థి
నేమంగళములిచ్చె హితమతి వినత ♦ యామంగళములు నీకగు రామచంద్ర
యని రాముదీవించి యక్కునజేర్చు ♦ కొని మస్తకంబు మూర్కొని నిండుమదిని

అనిపినదమతల్లి యడుగులకెఱఁగి ♦ యనుజన్మసహితుఁడై యచ్చోటు వెడలి
యభిషేకవిఘ్న వృత్తాంతంబు దెలసి ♦ సభికులు రాజులు సచివులుసకల
పౌరులుశోకింప పాదచారమున ♦ చారుచామరసితచ్ఛత్రముల్ మాని
యనురాగమందుచు నంతరాఘవుఁడు ♦ తననగరికి వచ్చి తగవొప్ప మెరసి
యంతఃపురంబున కరుగుచో సీత ♦ యింతులుదానును నెదురేఁగుదెంచి
తనుజూచిమది విన్నదనముగైకొన్న ♦ ఘనుని రాఘవుజూచి కడుచిన్నవోయి
యిదియేమి నాప్రాణ హృదయేశ నీకు ♦ వదనాంబుజము కడువాడు బారినది
గట్టిగా బుష్యయోగము దప్పకుండ ♦ బట్టంబుగట్టెనే పార్థివేశ్వరుడు
సోమమండలముతో జోడగుగొడుగు ♦ నీమోముదమ్మికి నీడుగాదేల
చామరద్వయము పార్శ్వంబులదనరి ♦ యేమొకో మనపట్టపేనుంగు రాదు
శ్రీరామనీమ్రోల సేనశ్రేణులెవ్వి ♦ పౌరులునినుగొల్వ బలసిరారేల
దుందుభిపటహాదితూర్యఘోషములు ♦ వందిమాగధులకైవారంబులెవ్వి
యభిషేకదినమునే డధిపనీయందు ♦ శుభరాజచిహ్నముల్ చూడగలేవు
సౌమిత్రిమోమున జాలదుల్లాస ♦ మేమిచందమొ నాకు నెఱుగింపుఁడిపుడు
డనిపల్కు సీత ముగ్ధాలాపములకు ♦ మనమున గుంది యామానినిజూచి
మునులకునృపచిహ్నముల గొడనేల ♦ వినుమది యెట్లన్న వివరింతునీకు
కైకమాతండ్రి సత్కరించితొల్లి ♦ గైకొన్నవరములు గాంక్షించినేఁడు
కొడుకుబట్టముగట్టుకొని రాజ్యమేల ♦ నడవులనన్నుండ నడిగెగావునను
ధరణిపాలింప నాతమ్మునిభరతు ♦ కరమొప్పబట్టంబు గట్టెదననియె
పనివసియడవుల పదునాలుగేండ్లు ♦ జనకుశాసనమేను జరియింపవలసె
తల్లితండ్రులమాట తప్పకసేయు ♦ జల్లిదునకునా సంపదయునుకీర్తి

—* సీతతో రాజ్యాభిషేకభంగమెఱింగించుట :*—

నాకలోకాది నానావిధపుణ్య ♦ లోకంబులరచేతిలోనుండుగాన
గావునబతియాజ్ఞ కానలసలిపి ♦ యేవచ్చునందాక యిందీవరాక్షి
గురువులవగలచే గుందకయుండ ♦ బరిచర్యనొనరించి భక్తితోఁగొలువు
చిత్తంబులోన నాసేమంబుగోరు ♦ నుత్తమశీలవై యుచిత ధర్మములు
వనితయమ్మలమ్రోలవర్తింపుమనిన ♦ జనకజయా రామచంద్రునిజూచి
కదలినమతిభీతి గాలిచేగదలు ♦ కదళిచందంబున గడగడవణకి
బెదరిడగుత్తిక బెట్టిపెన్వగల ♦ జెదరియంతంతకు జెలువేదిపలికె
ఇదియెనిశ్చయమైన నేనుమీవెంట ♦ వదలకపయనమై వత్తునేగాన నో
నినుబాసియేనిల్వనేర బ్రాణములు ♦ ననుబట్టనేరవు నాప్రాణనాథ
యడవులకేనును నక్షితోవత్తు ♦ తోడుకపొమ్మన దూలిరాఘవుఁడు

కమలాక్షి యడవుల గందమూలములు ♦ నమలి రా నేలల నడచుచు నీవు
నారచీరలు గట్టి నడచుచు వగల ♦ గూరుచు బేరెండకును గాలికోర్చి
నేలఁ బవళించి నిచ్చలు పర్ణ ♦ శాలలలో నుండ జాలుదే యకట
కోమల దేహంపు గోలవు బేల ♦ వేమియు నేపాటు నెఱుఁగవు నీవు
తలనసక్కజమైన దంతులు పులులు ♦ నెలుగులు తోడేళ్లు నిఱ్ఱులు కరులు
పాములు గాములు పైఁ బ్రాకు నెట్టి ♦ చీమలు గిరిగుహా సీమల దరుల
ఝురుల నిమ్నులల తాశ్చర్యమార్గముల ♦ వికసకంటకలతావృత మార్గముల
దలపన క్కజమైన దారుణాటవుల ♦ మెలఁగుట యక్కటా మేదినీతనయ
కావున గౌసల్య కడ నుండు మీవు ♦ సేవింపు మా సాధ్వి చిత్తంబు వడసి [గు
గృహదేవతల గొల్వు కీర్తింపు వన్న నహరహంబును మామ యగు కులకేతు
భరతుండు నిను మాతృభావంబు గొలుచు ♦ బరుసంబు లాతని బలుకకు మబల
యిదె పోయి పదునాలుగేండ్లు నిండించి ♦

ముద మొప్ప జనుదెంతు ముగుద చింతిలకు

మనవుఁడు బ్రణయ శోకార్తయై రాము ♦ గనుఁగొని సీత నిక్కము విన్నవించె
పతులు గావించిన భాగ్యంబులైన ♦ సతుల నురక్షించు సమ్మదం బెసఁగ
నా పాలి విభుడన్న నా దైవమన్న ♦ నా పుణ్యగతియన్న నరనాథ నీవె
ఘనతపస్స్వర్గ భోగము లనేకంబు ♦ లనుభవించుటకంటె నతిభక్తితోడ
నిశ్చలు మనమార నీ పదాంబుజము ♦ లచ్చుగా గొలుచుట యది నాకు సుఖము
నృపవర్య నీవున్న నిష్ఠురాటవుల ♦ యుపవనంబులు నాకు నూహించి చూడ
జగతీశ విను విష్ణు సముఁడైన నీవు ♦ జగదేకవిక్రమ శాలివై పరఁగ
గర మొప్ప నీ రక్ష గలిగిన నన్ను ♦ సురరాజు తలయెత్తి చూడంగ వెఱచు
నారచీరలు గట్టి నడచి నీతోడ ♦ నా రంగ జనుదెంచు నట నీవు జూప
నమరంగ జూచెద నద్రులు నదులు ♦ కమలాకరంబులు కడ వేడ్కతోడ
పాయని యందును పరగ నూరైన ♦ వేయైన గానిమ్ము విపినంబులందు
నన్ను దోడ్కొనిపొమ్ము నరనాథ యనిన ♦ నన్నాతి గనుగొని యతఁ డిట్టులనియె
అనిశంబు నతి దురంతాయాసమైన ♦ వనవాస మేటికి వనజాక్షి నీకు
నీయందు జిత్తంబు నిలిపి నిన్నునిచి ♦ పోయి కావించెద భూపాలు పనుపు
వన మేడ నీ వేడ వనిత నిన్నేడ ♦ గొనిపోయి దుర్గమ కుటిల మార్గముల
నా రామ వనకేళి కర్హుండు గాని ♦ ఘోరాటవులయందు గ్రుమ్మరఁదగునె
పెల్లు క్రూరవృకాళి పృథుపుండరీక ♦ భల్లూకసింహాది బహుమృగావళులు
ఘూకకాకానేక ఘోరహుంకార ♦ కాకోరి ఝిల్లి కాకర్కశధ్వనులు
మానక వర్తించు మరి భయ మొందవ ♦ నీ నీడ నీ కళ్కు నీ వెంచు వలదు

నావుడువినిసీత నరనాథుఁజూచి ♦ నీవుండగానాకు నిర్భయంబధిప
వనభూమికేగుదు వరుసతోఁగూడ ♦ దనినాకుజెప్పినారా వేదవిదులు
కానయీవిధమున కాంతారమునకు ♦ భానుకులేశ నీపాదముల్ గొలిచి
వచ్చెదనన్ను రావలదనవలదు ♦ వచ్చెనమదిని నాభక్తియుజూడు
మనిపాదములుబట్టి యడలంగవగచి ♦

యనుతింపమిజూచి యతిదీనయగుచు
యరిగినేచేసితి నేమున్నుతప్పు ♦ మరచిచేసితినేను మన్నింపునన్ను
పటుశిలాకటిలక ప్రచురదేశములు ♦ నటనిన్నుగొలిచి రానలతయులేదు
కరుణమైనీవిచ్చు కందమూలములు♦నరుదారనమృతంబు లవియునునాకు
భావించిచూచిన ప్రాణబంధుడవు ♦ నీవెకాపునవత్తు నీతోడబ్రీతి
జనకునిచింతింప జననిచింతింప ♦ చనుయిష్టులగుబంధు జనులచింతింప
జననాథనహాధర్మ చారిణియంచు ♦ జనకునిచేనగ్ని సాక్షిగైకొంటి
జనలోకనుతుడవు సత్యసంధుడవు ♦ నీనుడించినీకు గానలకేగదగున
యెన్ని దుఃఖములైన నెన్నికగాదు♦నెన్నియుసౌఖ్యంబులగును నీదయను
ఈవాడలీమేడ లీబంధుబృంద ♦ మీవస్తుసంపద లీజీవనంబు
నీవులేకున్నచో నిస్సారమరయ ♦ కావుననిచటనే కరణివేగింతు
సావిత్రియనుపుణ్య సతితనపతిని ♦ సేవించినట్టియా చెలువుననేను
వెంటనుచనుదెంతు నీనీడేబోలే ♦ నావంటిసాధ్వికి నదియెధర్మంబు
నినుబాసియిచ్చట నిమిష మేనోర్వ ♦ వనములనినుగూడి వర్తింపనేర్తు
బదునాలుగేండ్లేల బాసెదనిన్ను ♦ కదసివెయ్యేండ్లైన గడువేడ్కగొలుతు
నతులకుబతులకు జనులెంచదగిన ♦మతముప్రతిష్ఠింపు మఱివేయునేల
నీవరణ్యములకు నిటనన్నువిడిచి ♦ పోవుటనిజమైన బోవుప్రాణములు
నలుకమైగాదేని నగ్నిచేనైన ♦ జలముచేనైన విషంబుచేనైన
యేచినవగలతో నిటచత్తునేను ♦ నాచూవుడించక ననువిడిచిపోకు
మన్నిప్రలాపించుచు నడుగులమీద ♦ జనకజబడియున్న చందంబుజూచి
కరుణతోనల్లన కరపల్లవముల ♦ ధరణీశతనయుడా తనుమధ్యనెత్తి

—:* సీతవచ్చుటకు శ్రీరాములు సమ్మతించుట *:—

యలివేణినినుబాసి యావనంబులను ♦ నలువందవిహరింప నాకిచ్ఛలేదు
నినుతోడుకొనిపోదు నీవునావెంట ♦ చనుదేరకుశలంబు సకలంబునాకు
నిక్కములనీచిత్త మెరుగంగదఁచి ♦ యిమ్మాటలాడితి యేతెంతుగాని
ననుచునారఘురాము డతికృపామూర్తి♦జనకజరాకకు సమ్మతించుటయు
నలయుదానంబులు నతుసగావింపు ♦ చెలతనీవనవుడు నెమ్మనంబలర

కాంచనరత్నాదికంబులైనట్టి ♦ యంచితదానంబు లమ్మహీసుతయు
వరుసప్రియంబగు వారలకెల్ల ♦ కరమర్థి నందంద గావించెనంత
ధరణీశుడును సుమిత్రాపుత్రుజూచి ♦ చేరరమ్మని రామచంద్రుడిట్లనియె
నాతోడనీవు కానకువచ్చెదేని ♦ నాతోడనినుబాసి నానావిధముల
మిడుకుకౌసల్యకు మిత్రులెవ్వార ♦ లుడుకార్చిపోషింతు రెవ్వరుభక్తి
మనమిద్దఱముఁజన్న మనతండ్రిభక్తి ♦ ననుదినంబును నెవ్వరరయువారిచట
మొదలనసవతిపై మ్రొగ్గుఁగైకేయి ♦

మదిలోన నీరాజ్య మదమింక నొదవుఁ
బేర్మిఁజూపుచు దుఃఖపెట్టునో కైక ♦ ధర్మంబుతలపోసి తగ వేలనడుపు
నటుఁగాన నేవచ్చు నందాక నీవు ♦ నిటనుండదగు నన్న నంతయుగనలి
యావేళలక్ష్మణుడన్న నిశ్చయము ♦ భావించితన పాణి పద్మముల్ మొగిచి
యప్పుడు నన్నరా నానతియిచ్చి ♦ యిప్పుడువలదను టేమి కారణము
కౌసల్యకృపరక్ష గాకనారక్ష ♦ యాసుమిత్రకు నేటికా తేదఱరయ
బదివేవురకుమన్ని పట్టునీ వెలుగు ♦ నిదియాలచింతింప నిటరామచంద్ర
భరతుండునీదెస భయమునఁ జేసి ♦ తిరముగా కౌసల్యదేవికిభక్తి
కరముసుమిత్రకు గావించునటుల ♦ నిరవొందనటుగాన నేనిందునిలువ
బాణబాణాసన పాణినై వెనుక ♦ దూణీరములుబూని దుర్గమాటవుల
బోఁడుగామిమ్మునిమ్ములఁగొల్వవలయు ♦ గంధమూలాదులుకడక దేవలయు
నటతృణపర్ణాదు లరసిమీరుండు ♦ కుటజయుసజ్జగా గూర్పంగవలయు
బదునాలుగేండ్లును బగలునురేయి ♦ నిదురబోవకసేవ నెఱిసేయవలయు
వచ్చెదనేనన్న వసుధేశుడతని ♦ నిచ్చమైగైకొని యింపుదళ్కొత్త
వలయుబంధులనెల్ల వరుసవీడ్కొనుము –

వఁనొప్పగామున్న వరుణదేవుండు
మనతండ్రికిచ్చిన మహితచాపమును ♦ ఘనశరశ్రేణులు గలకవదొనలు
కరమభేద్యంబగు కవచంబుపసిడి ♦ పరుజులచెన్నొందు పటుకృపాణములు
కొనిరమ్మనానేగి కొమరారబంధు ♦ జనులవీడ్కొని శస్త్రశాలకుసరిగి
యాయుధంబులుగొంచు సరుగుదెంచుటయు ♦

నాయతాత్ముడు రాముడనుజన్ముజూచి
తమ్ముడవినుమెల్ల ధరములనేను ♦ నెమ్మినిచ్చెద ధరణీసురపరుల
మహితపురస్థుల మనకంపులైన ♦ సహజభృత్యులనర్థి జనులరావింపు
మావేళనర్హుడు సఖిలజ్ఞుడైన ♦ యావసిష్ఠునిపుత్రు డయినసుయజ్ఞు
మొదలైనపుత్రులముదముచిత్తమున ♦ బొదలఁగనతిభక్తిపూజింపవలయు

మరియుదక్కినవారి మన్నింతమెల్ల ♦ తెలుఁగులనక్కర తీరనర్థులకు
ననవుడులక్ష్మణుండౌ గాకయనుచు ♦ మునిపుత్రునింటికిముదముతో నరిగి
రామువాక్యముజెప్పి రమ్మన్నయతఁడు ♦ నేమంబులన్నియు నిష్ఠతోఁదీర్చి
సౌమిత్రిసహితుఁడై చనుదేరఁగాంచి ♦ రాముఁడువినయాభిరాముఁడై తాను
నెలమిమైసీతతో నెదురుగావచ్చి ♦ యలఘుతేజోమూర్తియైనమునీంద్రు
గొనివచ్చిగద్దియఁ గొమరారనునిచి ♦
వినుతార్ఘ్యపాద్యముల్ వేడ్కతో నిచ్చి
హారకుండల వలయాంగదకటక ♦ చారుకోటీరాదిసకలభూషణము [యిన
మాతులుండొసగిసమదగజేంద్రంబు ♦ ఖ్యాతిశత్రుంజయాఖ్యము మొదల
కరిసహస్రంబును కమనీయ్యరత్న ♦ సురుచిరదివ్య వస్తువులెల్లనొసగి
బహుభూషణములిచ్చిపై పయితోనమహనీయరత్నముల్ మానుగానిచ్చి
పసిడియేర్పడబుచ్చి పదికోటులొసగి ♦ యసమానవస్తువు లన్నియునొసగి
యిచ్చినగైకొని హృదయంబులోన ♦ నచ్చెరువడరంగనధిక మోదమున
నా రాజమిథునంబు నతఁడుదీవించె ♦ నారంగరఘురాము డప్పుడు మరియు
నెడపకభండార మెల్లదెప్పించి ♦ తోడరిదీనులకు నర్థులకు బేదలకు
చెలిమినగస్త్య కౌశికుఁనువారి ♦ కిలరత్నరాసు లనేకంబులొసగి
మొగివసిష్ఠాది సన్మునిజనంబులకు ♦ దగుతపస్వులకు నర్థములొప్పనిచ్చి
వందిమాగధులకుపరదానశక్తు ♦ లెందునుబొగడఁగ నిలుచూరనిచ్చి
పేదసాదలకును పృథ్వీదేవతలు ♦ కాదటబంధు మిత్రాశ్రితావళికి
బన్నుగానిబ్భంగి బహుదానతతులు ♦ సన్నుతమతినిచ్చి సౌమిత్రిజూచి
నీవునుదానంబు నెమ్మిగావిపు ♦ నావుడునారాజ నందనుండలరి
ఘటజన్మగౌశిక గార్గ్యశాండిల్యు ♦ నటకురప్పించి పెక్కర్థంబులిచ్చి
వీరువారనకెల్ల విధములవారు ♦ నారంగ నెవ్వరేమడిగిననిచ్చె
ధరణీశుయానతి దనబుద్ధియలర ♦ గరమొప్పనతిమహా కల్యాణియైన
యీయరుంధతికి సుయజ్ఞునిసతికి ♦ నాయతంబగుభక్తి నప్పుడుసీత
తనభూషణములిచ్చి తనయర్థమిచ్చి ♦ తనయింటగలవస్తుతతులెల్లనిచ్చె
నప్పుడరుంధతి నకటయిత్వోకు ♦ లిప్పాటుబడుచుండ నిటజూడదగునె

—*: శ్రీరాములు త్రిజటాఖ్యునకు గోవు నిచ్చుట :*—

యనివసిష్ఠునినడుగ నమ్మహామౌని ♦ తనబుద్ధినెంతయు దలపోసిచూచి
యేరూపమునబోవ దిదిదైవయోగ ♦
మూరకుండుము చూచుచుండుదమనియె
ఆవేళ త్రిజటాఖ్యుడను విప్రుడడరి ♦ జీవనస్థితికినై చేనుదున్నుచును

ఘోరంపులేమిచే గుందుటజేసి ♦ పేరాసదత్సతి బిడ్డలగొంచు
నతిసంభ్రమంబున నచ్చోటికరిగి ♦ తతిగొనబని సేయుతద్భర్తజూచి
యేలయీనాగేలు హృదయంబుచివుర ♦ నేలయీగుద్దలి యటపారవైచి
రమ్ముచెప్పెదనేడు రామచంద్రుండు ♦ సమ్మదంబునసర్థి జనులకునెల్ల
ద్రవ్యతండంబులు దయతోడదనము ♦ నెవ్వరేమడిగిన నిచ్చుచున్నాడు
నీకుటుంబము చెప్పి నీ పేరుజెప్పి ♦ కాకుస్థపతిచేత గామితార్థంబు
వేవేగచనినీవు వేడుకొమ్మనిన ♦ నావిప్రుఁడోర్కులు నఁదందనిగుడ
చనుదెంచి యారామచంద్రునీక్షించి ♦ తనరంగదీవించి తానిట్టులనియె
పేదవాడనుసుతుల్ పెక్కండ్రుగలరు ♦ లేదుద్రవ్యంబును లేశమాత్రమును
ననునీవురక్షింప నరనాథవలయు ♦ ననిననారఘురాము డావిప్రుజూచి
యావులమంద లయ్యాయున్నవిపుడు ♦ నీవునీచేముష్టి నిజశక్తిమెరసి
యందాక వేసితి వీలోనిపశుల ♦ మందనీకెయటన్న మదిసంతసిల్లి
యరచిధోవతి మొలనంటబిగిచి ♦ కుఱుచైనశిఖముడి గొనియాడుగఱచి
నరములబ్రాణముల్ నరినంటబట్టి ♦ కరమున బాషాణకలితుఁడై యపుడు
శ్రీరమాధవునెంచి శ్రీరామునెంచి ♦ బిరబిరతనముష్టి జెట్టుగాత్రిప్పి
యురమునజందెము నుబ్బూతలూఁగ ♦ సరయువుదాక విచ్చలవిడినేసె
బ్రతుకుజీవనమని బ్రాహ్మణుండట్టి ♦ మొదవులగొన్న రాముడుచోద్యమంది
మఱివేయుగోవుల మహితవస్త్రము ♦ నఱలేకనిచ్చెద నడుగుమీయనిన
జన్నంబునకునీవు చాలినయర్థ ♦ మెన్ననెక్కుడుగాను నిమ్మంచునడుగ
దనియంగనిచ్చిన దద్దయునలరి ♦ తనపత్నితోగూడ ధనములుగొనుచు
సంతోషమున నటజనెద్విజుండు ♦ నతటరఘురాముడనురాగ మెసగ
కృతకృత్యుడై వచ్చిగృహదేవతలకుచతురుడై మునులకుసద్భక్తి మ్రొక్కి
యీరీతిరఘురాము డెల్లవస్తువులు ♦ కోరినవారికి కోరినట్లొసగి
మనుజనకుని యజ్ఞమునవరుణుండు ♦ తనకొసంగిన తనుత్రాణకోదండ
ఘనతరతూణీర ఖడ్గాయుధములు ♦ తనకులగురునింట దాచుటజేసి
యనుజుచేదెప్పించి యవిధరియించి ♦ జనకజలక్ష్మణ సహితుడై వెడలి
రాజునొద్దకునేగ రాజచిహ్నంబు ♦ లోజగానకపౌరు లుల్లంబులలర
రాజవీథులనుండి రచ్చలనుండి ♦ రాజితోన్నత సౌధరాజిపైనుండి
పుట్టినశోకాగ్ని పొగలుచుగొంద ♦ రిట్టిదుర్దశకర్హుడే రాముడనుచు
మెందురాముడుబోయె నింకనందఱము ♦

నందెపోదముగాక యనికొందరరుగ

కొందఱురాజన్యకుంజరువెనక ♦ మందిరంబులుడించి మనమల్లడవగ

నేపారసాంపెల్ల నడలిపాడైన ♦ యీపట్టణము కైకసీలనిమ్మనుచు
బరికించికొందఱు ప్రజలీపురంబు ♦ పారిపారి నెలుగులు పులులుసింగములు
నక్కలువరళులు నలిపిశాచములు ♦ పెక్కుభూతంబులు ప్రేతసంఘములు
పాయనియడవిలోపతిరాముడున్న యాయరణ్యముపురంబగునంచుబలుక
క్రందయ్యెబహువిధాక్రందనరవము ♦ నందందవినుపింప నధికధైర్యమున

—:* శ్రీరాములు సీతాలక్ష్మణ సమేతుడై దశరథునివద్దికివచ్చుట *:—

జగతీశునగరికి జనుదెంచెమరియు ♦ దగసుమంతునిగాంచిధరణీశసుతుడు
వినుపింపమారాక విభునితోననిన ♦ జనశోకమునజాల సంతాపమందు
రాజేంద్రుగనుగొని రామలక్ష్మణులు ♦ పూజితచరితయాభూతనూభవయు
వచ్చినారని చెప్ప పడిమూర్ఛబోయి ♦ చచ్చెరదెలివొంది జెందినవగల
నల్లనగద్దియనాసీనుడగుచు ♦ నుల్లంబులోధైర్య మొక్కింతనిలిపి
వత్తురుగాక నా వనితలునింక ♦ వత్తురుగాక నీ వరపుత్రుజూడ
ననుచుడగ్గుత్తిక నల్లనబలుక ♦ వినియాసుమంతుండు వినయంబుతోడ
నంతఃపురంబుల కరిగియారాజు ♦ నింతులమున్నాట ఏబంద్రదెచ్చ
మఱిపోయియారామమహనీయతేజు ♦ తెఱగొప్పదోడ్కొని దేర సీక్షించి
యాలింగనముసేయ నర్థితోలేచి ♦ యాలోనరాలేక నవనిపైబడియె
నంతనాశ్రీరాము డారాజుబట్టి ♦ యెంతయుబ్రేమచే నెసగంగదిగిచి
తొడలపైనిడికొని దుఃఖింపగొంత ♦ వడికిచైతన్యంబు వచ్చికూర్చుండి
తనుజూచుచున్నయాతండ్రినీక్షించి ♦ జనసుతుండగురామచంద్రుడుబలికె
అనఘాత్మనీదు సత్యమునిల్పనేను ♦ వనభూములకుబోవు వాడనైయెఱిగి
యీసాధ్విజనక మహీపాలతనయ ♦ యీసుమిత్రాపుత్రు డిద్దరుమిగుల
వలదనియేనెంత వారింపవినక ♦ నలరితామును బయనమైయున్నవారు
గానవీరలునేను కానలకేగ ♦ నానతిమ్మనుటయు నానరేశ్వరుడు
మదిదూలికైకేయి మాటకునిన్ను ♦ నదయతబొమ్మంటి నకటకానలకు
జేకొనినామాట సేయంగనేల ♦ నీకెట్లువందన నీవువేయుంత
చెన్నొందరాజ్యంబుసేయుదుగాక ♦ యన్నామాటకుహస్తముల్మొగిచి
తలపోయగురుడవు ధారుణీపతివి ♦ యిలమిమ్మురక్షింప యిలబాంధవుడవు
నటుగాననీవాక్య మర్థితోజేయ ♦ నిటనాకునానతి యిచ్చిననుపు
సత్యసంధుడవైన జనలోకనాథ ♦ నిత్యంబుగానేలు నిఖలలోకములు
ననినదీర్ఘాయువు నత్యంతశుభము ♦ వినుతయశంబును విమలవిక్రమము
నకళంకధర్మంబు నమరంగబొందు మొకబాధయునులేకయుండుమోపుత్ర
యూరంగనన్నును నరయమీతల్లి ♦ నీరాత్రిజూచి నీవెల్లిపొమ్మనిన

నేడేమి యెల్లేమి నిలువంగదగదు ♦ నేడుపోయెదమన్న నెమ్మిపిట్టులుపు
నరనాథనాయోగి నాతమ్ముఁడైన ♦ భరతుండువసుమతి పాలింపనిమ్ము
వగపునీకిటమీఁకు వలదన్న రాము ♦ తెగువకు దశరథాధిపుడుశోకించి
నీవంటిసత్పుత్రు నిష్ఠురాటవుల ♦ కీవెంటబొమ్మన నెట్లునోరాడు
కైకేయిమాటల కడుమోసపోతి ♦ కటకటాయని కరుణదానేడ్వ
నంతఃపురాంగన లందరునడల ♦ నంతగౌసల్యయు నాసుమిత్రయును
నంతలఁబ్రాలుచు వగలదూలుచును ♦ నింతగావిభుజేరి విలపింపుచుండ
అపుడుసుమంతుడయ్యతివలయేడ్పు నృపుశోకమునుజూచినిట్టూర్పుబుచ్చి
ఘనతరశోక సంకలితుఁడై కైక ♦ గనుఁగొనిపలికె నుత్కటకోపుఁడగుచు
నీయత్నమునఁగదా నృపులకుమాఁకు ♦ నీయవస్థలువచ్చె నేమనఁగలను
పతిహితంబేమియు బరికింపవెట్టి ♦ సతివైతివకట రాక్షసివినీవరయ
నీతల్లియట్లనే నీవుప్రాణేశు ♦ ఘాతిసీవదియెట్టి గతియన్నవినుము
సకలభావములునీదు జనకుఁడెఱుంగు ♦ మొకనాఁడుమీతల్లియును దానుశయ్య
నొంటుపుగాశయనించియొకకీటవార్త ♦ యెరిగియాతడునవ్వనదిసంశయించి
యిదియేలనవ్వితి వెరిగింపుమనిన ♦ నదిచెప్పినను బ్రాణహానియౌనిపుడు
ననవుడునీప్రాణ హానిచేవెఱవ ♦ వినుపింపుమని వివేకించునతని
నదియెతప్పనివేళ నడచెమీతల్లి ♦ యదిగాన నాఁజెండికాత్మజవైన
నీకేలగలుగుమానితపతిహితము ♦ యోకైకయనిన నాయువిదయెంతయును
తలవాంచికొంకొక తడవుచింతించి ♦ పలికెనాదశరథ పతిజూచియపుడు
మున్నుమీకులమున ముఖ్యుడై సగరు ♦ డున్నతకీర్తియై యుర్వియేలుచును
నసమంజసుండను నగ్రనందనుని ♦ గొనరకపురివెళ్ళ గొట్టగాలేదె
రామచంద్రుని నీవరణ్యభూములకు ♦ దామసింపకబంప దప్పేమిదీన
ననవినిదశరథుం డధికశోకాబ్ధి ♦ మునిగిప్రత్యుత్తరంబున కోపకున్న
నపుడుసిద్ధార్థకుండను మంత్రివరుడు ♦ కపటాత్మురాలైన కైకకిట్లనియె
అసమంజసుండు దర్పాతిరేకమున ♦ నెసగిపట్టణములో నెల్లబాలకుల
సరిబట్టికట్టయా సరయువులోన ♦ పరువడివైవంగ బౌరులందరును
సగరునితోజెప్ప జనహితంబునకు ♦ దగవుచింతించియా తనయుబోనడచె
నీరామునందొక్క యెగ్గైనగలదె ♦ చారువర్తనగణ్య సౌజన్యుడితడు
నావుడుసత్యంబు నాతోడబలికె ♦ గావున దండ్రివాక్యముసేసెసుకృతి
యగుగాకరఘురాము డనవుడుకైక ♦ తెగువకు దశరథాధిపుడుశోకించి
చాలసంతాపించి జడిగొన్నవగల ♦ దూలుచునా సుమంతునిజూచిపలికె
ధనములమణుల గోధనములబంధు ♦ జనముల నవరోధ జనములహితుల

విజయచిహ్నంబుల విలసిల్లుచున్న ♦ గజములరథముల ఘనతురంగముల
నిజముగా వేటకు వేర్చుధీవరుల ♦ ప్రజలమంత్రుల రామభద్రునివెనుక
వెడలింపుమీరాత్రి వీడుకైకేయి ♦ కొడుకుఁబట్టము గట్టుకొని యేలుగాక
యనియిల్లుదశరథుండాడు వాక్యములు ♦

విని కైకగోపించి విభుదూరిపలికె

రాజపుంగవనీవు రామచంద్రునకు ♦ రాజిల్లునీసర్వరాజ్యసంపదలు
నిచ్చిపాడైయున్న యీపురంబేల ♦ యిచ్చెదుభరతునకీపల్కులేల
సౌమిత్రియునుదాను జనకనందనయు ♦ రాముడు నారచీరలుగప్రీతి
నేచూచుచునుండ నెల్లభోగములు ♦ మానిదుర్గముల గ్రమ్మరబోవకున్న
బాసగదునీయావి బొంకనీపలుకు ♦ వసుధేశనీవిచ్చు వరము నేనొల్ల
దప్పితివీవన్న దశరథాధీశు ♦ డప్పుడుమూర్ఛిల్లి యవనిపైద్రెళ్లె
ధరణిపైనట్లున్న తండ్రినిజూచి ♦ పరితాపమందుచు బలికెరాఘవుడు
ఏలమ్మకైకేయి యిమ్మహారాజు ♦ తూలబోబలుమారు దూరనాడెదవు
గురుడునురాజు నాకూరిమితండ్రి ♦ పరమదైవంబిట్టి పతినిన్నుబనుప
విషమైనమ్రింగుదు విపులాగ్నినైన ♦ నుదధియైనను జొత్తు వేట్కతోనేను
వనమునమునులతో వర్తింపుమన్న ♦ ననుమతించుటనాకు నదియంతపెద్ద
యనవినిదశరథుఁడావాక్యములకు ♦ మనమునఁగడుదూలి మరికైకఁజూచి
వినుమేనురాజ్యంబువిడిచియీరాము ♦ వెనకఁబోయెదను నీవిభవంబుతోడ
భరతునయోధ్యకు బట్టంబుగట్టి ♦ ధరణియేలుదుగాక తగవేలయనఁగ
నామాటలకు రాముఁడధిపుతోననియె ♦ భూమీశనిర్జన భూమియైపఱఁగు
నవ్వనంబునునాకు సర్వమైయుండు ♦ నెవ్వరునాతోడ నేటికేతెర
నారచీరలుదెచ్చి నాకిందుదాని ♦ నారంగధరియించి యడవులలోన
పదునాలుగేండ్లును బరఁగనీయాజ్ఞ ♦ వదలకవర్తించు వాఁడను నేను
దేనారచీరలు దేవినాకనిన ♦ నానాతినిర్లజ్జయైతానెయపుడు
ముదమందిమదిలోన మొగమాటలేక ♦ మదిజలింపక సభ మధ్యంబునందు
నారచీరలుదెచ్చి నరనాథపుత్ర ♦ గారవంబుననీవు కట్టుకొమ్మనుచు
చీరలుంగునబల్క ప్రియముతోరాము ♦ డారాజసభయును నారాజునడల
నాతల్లిచేనున్న యవిబుచ్చుకొనుచు ♦ బాతిగామున్నున్న పటములువిడిచి
నారచీరలుగట్టెనయ్యతోనపుడు ♦ నారంగధరియించె నాలక్ష్మణుండు
సీతకునానార చీరెలురెండు ♦ చేతనిచ్చినగొని చిత్తంబులోన
కలగిరామునిజూచి కాంతారవాసు ♦ లెల్లమిమైనీచీర లెట్లుగట్టుదురో
మునులంచునొక్కటి మూపుపైవైచి ♦ దనరారనొక్కటి తనకేలదాల్చి

కట్టనేరకమది గలఁగ నారాముఁ ♦ డట్టిచందముఁ గాంచి యాపువ్వుబోణి
ఘనవితంబమున బొంకము మీఱఁగట్టఁ ♦
గని రాజసతులు రాఘవుని వీక్షించి
నారచీరలు గట్టి నరనాథపుత్రి ♦ యీరాజవరపుత్రి నీసీత నెటు
దారుణగతి నిట్లు తాపసిఁబోలి ♦ ఘోరాటవికి నీవు గొనిపోవఁదగున

—*: వసిష్ఠుఁడు కైకతో కఠినోక్తు లాడుట :*—

మామాటమన్నించి మాయొద్దనునిచి ♦
సౌమిత్రియును నీవుఁ జనుఁడు కానలకు
ననఁగ వసిష్ఠుండు నలుకతోఁ గైకఁ ♦ గనుగొని కులనాశకారిణి నీవు
భూపాలకుని మోసపుచ్చితిగాన ♦ నీపాపమరయంగ నెందును గలదె
రాజపత్నులయొద్ద రఘురామునాజ్ఞ ♦ నీజనకజనుండ నిమ్మట్లు కాఁగ
వలదన నేలయీ వైదేహి చనఁగఁ ♦ గేయబౌరులతోడఁ గాననంబునకు
నేమునుజనువార మింతియే కాదు ♦ రామచంద్రునిఁ గొల్వ రమణీయలీల
భరతశత్రుఘ్నులు బలసివచ్చెదరు ♦ పరికింప నీవు నీ పాడూఱనుండు
పోవంగ రాముఁడు పుణ్యశీలుండు ♦ లీలనున్నదియూఱు లేనిది పాడు
పతినిట్లు వంచించి పాపంబుదలఁచి ♦ యతిలోభమున రాము నడవుఁ గనిచి
భరతుని యోధ్యకుఁ బట్టంబుగట్టిఁ ♦ చిరలీల రాజ్యంబు సేయఁ జూచెదవు
పతియాజ్ఞదప్పఁడు భరతుండు తండ్రి ♦ ప్రతినిధి నా రామభద్రునిఁ జూచు
నీమాటవిని ధర్మ నిష్ఠఁబోవిడిచి ♦ రాము నడంచి యీరాజ్యంబుఁ గొన్న
దలపోసి జూడఁగ దశరథేంద్రునకు ♦ పొలుపారనతఁడు తాఁబుట్టనే మైన
నీతప్పు నీమీఁద నెరగిన మీఁద ♦ మాతగాఁ దలఁచునే మదిలోన నిన్నుఁ
గరమర్థి రాముఁడా కాననవర్తింప ♦ భరతుఁడీ సామ్రాజ్య భారమెట్లోపు
నెఱుఁగవు భరతుని హృదయ మేమియును ♦
మఱియీ తెఱఁగు విన్న మందు నీమీఁద
నెవ్వరికైనీకు నీనిష్ఠురంబు ♦ నివ్వొంట భరతుని కియ్యకోలగునె
కావున నిది మేలుగా నెన్నవలదు ♦ నీవదియును గాక నిష్ఠురవృత్తి
శ్రీరామునకు మఱి సీతకు నార ♦ చీరలిచ్చుటకు నీ చేతులెట్లాడె
నారచీరలు మాని నవరత్నఖచిత ♦ చారుభూషణములు సరసంబులైన
చీనాంబరంబులు చెలువారఁ బూని ♦ జానకిఁ దన పరిచారకుల్ గొలువఁ
జనుఁగాక యనుచు నా సంయమీశ్వరుఁడు ♦
వినుత భూషాంతర వితతులిచ్చుటయు [నతిని
వనయంబు మదిలోన హర్షము పొంగ ♦ గొనియవి ధరియించె గురుని యా

సీతయప్పుడు నారచీరలుమాని ♦ నాతతప్రీతితో నట్లున్నఁజూచి
కైకనందఱుదిట్టఁగా రాజువినుచు ♦
నాకాంతదెసఁజూచి యలుకతోఁబలికె
తక్కకపాపంబు తలఁచిరామునకు ♦ నక్కటా వనవాస మడిగితిగాక
మేదినీసుతయు సౌమిత్రియునార ♦ లాదరంబునఁగట్ట నడిగితేనన్న
నీమానవపతిసీత యింతకుఁదగునె ♦ యేమిచేసితినీకు నీతెంపుసేయ
రామునివినయాభిరాముఁ గాంతార ♦ భూమికిఁదపసియై పొమ్మనుకంటె
మఱియొండుపాపంబు మదిలోనఁగలదె ♦ తరమఁజేసియునేల తండార్చవైతి
పాపజాతికినీకుఁ బతినైననాకుఁ ♦ బాపంబుగడమాన పరికింపననఁగ
నామాటవినిరాముఁడధిపుతోననియె ♦ భూమీశనను బాసిపోదలుశోకమున
మాతల్లికౌసల్య మదిఁగుదకుండ ♦ భాతిగాఁగృపమీరు పరఁగరక్షింపుఁ
డనుడునాదశరథుఁడావాక్యములకుఁ దనరారుశోకాగ్నిఁ దనచిత్తమెరియ
నెట్టిపాపము తొల్లి యేఁజేసినాఁడఁ ♦ బట్టినాకనుభవింపక పోదునేఁడు
తల్లులబిడ్డల దయమాలిపాప ♦ నల్లంబులోపల నోర్వంగఁగలనె
కైకమాటకునిన్నుఁగాంతారభూమిఁ ♦ బైకొనియదయతఁ బడనేఁగుమంటి
హాపుత్ర హా రామ యనుచుమూర్ఛిల్లి ♦ భూపాలుఁడప్పుడు బోధింపఁదెలిసి
వారకపదునాల్గు వత్సరంబులకు ♦ నారఁకఁపరిపూర్ణ మగునట్లుగాఁగ
మెచ్చినతొడవులు మేలువస్త్రములు ♦ నచ్చుగాజానకి కవనీవిభుండు
వలనొప్పఁగాఁదెచ్చి వరుసనిప్పించె ♦ వలువలుగట్టి యావరభూషణములు

—:* కౌసల్య సీతకు పతిధర్మము దెల్పుట *:—

దనరంగజానకి ధరియించెనంత ♦ జనకజఁజూచి కౌసల్యశోకించి
యడరంగనితఁడు మహాచక్రవర్తి ♦ కొడుకనిమీతండ్రి కోరినిన్నిచ్చెఁ
గడుకొనిదైవయోగంబునఁ జేసి ♦ కడపటమఱియిట్టి గతియయ్యెనేఁడు
తాపసవృత్తిమైఁ దగిలికానలకు ♦ నీపతితోఁగూడి నీకేగవలసె
దీనికివగవకు తివిరిరాఘవుఁడు ♦ ఈనిఖిలోర్వియు నేలెడిమగుడి
పతిపేదవాఁడైనఁ బాయంగరాదు ♦ సతులకునిదియు విచారించినప్పుడు
చేకొనిపతిపంపుసేయుపత్నులకుఁ ♦ గైకొనునుభయలోకములందుశుభము
ననఁగను కౌసల్య నాసీతఁజూచి ♦ వినుతంబుగాఁబల్కె వినయంబుతోడ
అనుకూలనైపతి నతిభక్తిఁగొలిచి ♦ తనరవర్తించెద ధర్మమార్గమున
మానుగాఁబతిలేని మగువచక్రంబు ♦ లేనితేరునుతంత్రి లేనివీణయును
బోలెఁబుత్రులుగల పుణ్యురాలైనఁ ♦ జాలంగశోభగాకఁ జనునట్లుగానఁ
బతికిఁబ్రియంబును బ్రాణంబులైన ♦ హితబుద్ధివంచింప కిత్తునేననిన

నాదేవివై దేహ నలరారఁజూచి ♦ భూదేవిపుత్రివై పుట్టిననీవు
నీగుణంబులుతగునెలమిలక్ష్మణుని ♦ నీగుణోజ్జ్వలు రాముహితునిమన్నింపు
మనినసీతాదేవియౌఁగాకయనుచుఁ ♦ దనకుమ్రొక్కిన నెత్తితగఁ గౌఁగిలించి
దీవించెనప్పుడు తెఱఁగొప్ప రాము ♦ దేవునితోడ నాదేవియిట్లనియెఁ
పృథులాటవులయందుఁ బృథివీశపుత్ర ♦ మిథిలేంద్రసుతను సౌమిత్రి నేమరకు
మనినమీయానతి నడిపెడిజనని ♦ యొనరనాదక్షిణ భుజములక్ష్మణుఁడు
నానడజానకి నాకునెబ్బంగి ♦ మానసంబునవీరి మఱువంగనగునె
యేనువిల్లందిన నెందునేభయము ♦ గానేలవచ్చు ముక్కంటిపైఁబడిన
నదిగానసివింక నడలకుమాకు ♦ వదలనుధర్మంబు వగవంగనీకు [డుఁ
భూనాథునకుగరాంబుజములుమొగిచి ♦ తామసీతయుసుమిత్రానందనుం
అమ్మలదీవింపుఁ డండఱునను చు ♦ నిమ్ములమున్నాట యేఁబంద్రులకును
సరిప్రదక్షిణముగాఁ జనుదెంచిమనసు ♦ లెరియంగనాతల్లు లెల్లశోకింప
వినుచుసుమిత్రకు వినతులై రంత ♦ కనుఁగొనియద్దేవి కౌఁగిటఁ జేర్చి
శ్రీరాముదీవించి సీతదీవించి ♦ ధారుణిపతిసేఁత తలపోసివగచి
మొనపొందనపుడు సుమిత్రలక్ష్మణుని ♦ బిలిచియింపార గంభీరోక్తిఁబలికె
రాముని దశరథ రాజుగాఁజూడు ♦ భూమిజనన్నుఁగా బుద్ధిఁజింతింపు
మడవినయోధ్యగా నాత్మలోఁదలఁపు ♦

కడుభక్తియుక్తి రాఘవుగొల్చియుండు
మాయితజయసిద్ధి నభివృద్ధిఁబొందు ♦ పోయిరమ్మనిప్రీతిఁ బుత్రుదీవించె
రామచంద్రునిజూచి రఘువీరనీకు ♦ సేమంబుదలఁచి నీచిత్తంబులోన
పరలేనిసఖుఁడన్న ననుజన్ముఁడన్న ♦ నెరయసీతఁడె కాక నిక్కవంబరయ
నటుగానలక్ష్మణు నరసిరక్షింపు ♦ మడవులలోనన్న నేఁగాకయనుచు
రాముఁడాదశరథ రాజునీక్షించి ♦ యామహితాత్ముతో నచలుఁడై పలికెఁ
బదునాలుగేండ్లును బ్రకటమార్గములఁ ♦ బదునాల్గు దినములపగిదివర్తించి
ధరణీశవత్తు సంతాపింపవలదు ♦ భరతుండునాకంటె భక్తుండుమీకు
నతనిఁబట్టముగట్టుఁ డాత్మఁగైకేయి ♦ నికృతకంబులకునింకఁ గింకిరిపడకు
మాతల్లినీకు నెమ్మది సేవసేయు ♦ నాతన్విమీరు నన్నరయుఁడుప్రేమ
నని ప్రదక్షిణముగా ననుజుండుఁగాను ♦ జనకజయునుగడు సద్భక్తిమ్రొక్క
రప్పుడురఘురాముఁ డడవికిఁబోని ♦ దప్పక వెడలె నాదశరథాధిపుడు
మతిలోనఁదలఁచి సుమంత్రునిఁజూచి ♦

యదె రాముఁడడవుల కరుగుచున్నాఁడు [క్క
గొనిపొమ్ము రథమన్న గువలయాధిపుని ♦ పనుపునగొనిపోయిభక్తితోత్రొ

రథమీఁదెపుత్తెంచ రాజమీఁకర్థి ♦ రథమెక్కి వేంచేయ రఘురామచంద్ర
యనపుడుదశరథునాజ్ఞకువెఱచి ♦ మానుసీతనెక్కించి మొగినాయుధములు
తనరుజోడునుబెట్టి తానులక్ష్మణుఁడు ఘనమైనరథమెక్కి కదలెరాఘవుఁడు
అంతబౌరులువృద్ధులాప్తులుమంత్రు ♦ లింతులుపౌరులుహితులునాశ్రితులు
నంతబ్రాహ్మణరాజవైశ్యశూద్రులును ♦ అంతంతనలుగడనడలుచువెడలి
ముందటనిరుపార్శ్వములపిఱుందటను ♦ సందడింపుచుమదిజడిగొన్నవగల
నరనాథపుత్రుఁడెన్నఁడుగానరాఁడు ♦ సురుచిరస్థితిపుడు చూతమింపార
జంద్రుతేజము నవ్వజాలునీరామ ♦ చంద్రుమోమునుజూడజనుదెంచువారు
కడగి యిక్ష్వాకుల గౌరవంబెల్ల ♦ నడచెనేమంధర యనీతిట్టువారు
తగవేదిరఘురాము దపసిగాఁజేయ ♦ దగునమ్మకైకేయి కనిదూఱువారు
దాలిమివిగనాడి దశరథాధీశు ♦ డాలికివెఱచునే యనిరోయువారు
జనువెల్లజెడిరామ సౌమిత్రులంత ♦ నవదలై పోదురెయని వేగువారు
బనిగొనితమతండ్రి పనుపునగాని ♦ పౌనఃపడియిల్లల పోదురన్వారు
ఈపదునాలుగేండ్లెట్లువీరడవి ♦ నాపదవేగింతు దనిపొక్కువారు
ఈనోముఁనోచెనో యిమ్మహిపుత్రి ♦ తానంచుమదిలోన దలపోయువారు
సతివృదుగాత్రియీయాతివభూపుత్రి ♦ పతిబాయలేదని ప్రణుతించువారు
ఈసుతుబాయుంగ నెట్లోర్చెనట్టి ♦ కౌసల్యమదియెంత గట్టెనువారు
నై రామునరదంబు నందందగదిసి ♦ భూరిశోకాగ్నుల బొగలుచుబోవ
నంతగౌసల్యయు నాసుమిత్రయును ♦ చింతాపరంపర జిక్కిశోకించి
వారితరంబులు వలనొప్పనూది ♦ వారిపై వ్రాలుచు వగలదూలుచును
గలయనంతఃపుర కాంతలందన్ను ♦ గొలిచిరాదశరథ క్షోణిపాలకుడు
భూరిశోకముబాష్పపూరముల్దొరుగ హారామహారామయనిపలుమారు
నెలుగెత్తియేడ్చుచు నేచినవగల ♦ నలిదూలిపొగలుచు నగరంబువెడలె
అప్పుడురవిదీప్తుఁ గానగనద్రైసల ♦ నుప్పొంగెతమమువన్నాలుమండవయ్యో
ధరణిబీటులుబారెతారలురాలె ♦ విరసించిగ్రహములు వినువీధిబారె
నెలమిమైమదధారలింకెదంతులకు ♦ గలయనశ్వములకు గన్నీరుదొరిగె
నావులుచన్నియ్య వయ్యెగ్రేపులకు ♦ నావీఁకకడుశూన్యమైతోచె బ్రజకు
వారువీరనకెల్ల వారుపెల్లైడల ♦ బౌరులయేడ్పులం బరమొల్లనిండె
సురవరకామినీ శోకారవములు ♦ పొరిపొరివినవచ్చె పురజనంబులకు
నప్పుడుదశరథుఁడా రామురథము ♦ చొప్పుబాష్పములచే చూడజొప్పడక
చంద్రబింబముతోను సరియైనరాముఁ ♦

చంద్రునిమొగ మొకసారి చూచెదను

—:* దశరథుఁడు రథమునిల్పుమని సుమంతుని బిలుచుట *:—

ఓసుమంతుడ రథము నాఁపవేయనుచు ♦ నాసుమంతుడు విననట్లు జీరుచును
వెనుకొని పురిదాటి వెననేగుదేర ♦ మనుజేశుఁజూచి సుమంతుఁడొకనియె
నిదె వచ్చుచున్నాఁడు యినకులేశ్వరుడు ♦ పోదపోదపోనిమ్ము పోనిమ్ము రథము
అనియనిరఘురాముఁడందందదరమ ♦ మొనసియాతఁడురయంబున దేరుబరపె
నంతవసిష్ఠుఁడ య్యవనీశుఁజూచి ♦ యంతరంగంబున నడలుచుబలికె
అనఘ శోకింపుచు ననుపరాగాదు ♦ మనుజేశ నీవింక మరలుమిచ్చోట
ననవుడు దశరథుఁ డటుపోకనిలిచి ♦ తనసూనురథమటు తప్పకచూచి
యదియుగానక ధూళి నటుచూచిచూచి ♦

యదియుగానక బయలటుచూచిచూచి

హాయనియెలుగెత్తి హా రామ రామ ♦ హాయనిమూర్ఛిల్లి యవనిపై ద్రెళ్ళి
బొరలుచు గంధధూళి బ్రుంగికంపింప ♦ గరముగ్రమగు ద్రిష్టికై కెయిజూచి
నీపాపమెరుగక నిన్నుమన్నించి ♦ నాపుణ్యపుత్రరత్నముఁగోలుపోతి
నిన్నుఁ బెండ్లాడి నే నీచుఁడనైతి ♦ నన్నిటమేటినై యల్పుండనైతి
నడకుని ందెలకెల్ల నాధారమైతి ♦ కడపట జెఱిచితి గాకుత్స్థకులము
నినుజూడఁగారాదు నినుముట్టరాదు ♦ చెనటి నీతోన భాషించినఁగాదు
అనిదశరథుఁడాడ నాపౌరజనులు ♦ కనుఁగొని తనుదిట్టఁ గైకేయి విచుచు
దలవంచుకొనియుండె దశరథుఁడంత ♦ నలయుచునపుడయోధ్యాపురిఁజొచ్చి
పాడువారినయట్టి పట్టణవీధి ♦ నాడాడ నిలుచు నడలు కౌసల్య
నగరంతఁజొచ్చి యానన ధూళితోడ ♦ పొగలుచు సజ్జపైఁ బొరలుచు మిగుల
నలయుచు సొలయుచు నసురుసురనుచు ♦

నలుదెసల్ చూచుచు నాలుకయెండ

హా రామ హా రామయనుచు దైవంబుదూఱుచు దను దానె దూషించుకొనుచు
నాపాటు నేమఃఖ మెఱుగనియట్టి ♦ నాపుత్రరత్నంబు నాదుకోడలును
ఎంతదవ్వరిగిరో యెందున్నవారో ♦ యెంతలోగుంది వారెల్ల వేగెదరో
కందమూలములు శాకములనేరీతి ♦ దిందురో యెట్లువర్తింతురోయడవి
ననియుః వారల యాయాసములకు ♦ దనమదినడలుచు దపోయుచుండె
కౌసల్యయును నంత కంటెశోకింప ♦ నాసుమిత్రాదేవి యడలార్చుచుండె
అంతరాముఁడు పౌరుల దరుగోలువ ♦ గొంతదవ్వేగి పేర్కొని వారిబలికె
ననఘాత్ములార మీరందరుఁ గడిచనుఁడయోధ్యకు నాకుఁ జయముఁగోరుండు
భరతునియాజ్ఞలోపల నువర్తించి ♦ పౌరయుక్తసౌఖ్యముల్ బొందుమీవిన
వారలందరు నేక వాక్యులై పలికి ♦ శ్రీరామయిట్టాడ నుచిత మే నీకు

భరతుజేటికి మాకు బట్టణంబేల ♦ వరమందిరములేల వాహనములేల
యుప్పరిగలు నేల యువిదలు నేల ♦ చప్పరములు నేల సౌధంబులేల
మేడలు మాకేల మేలిమైనట్టి ♦ వాడలు మాకేల వలదు నీవరుగ
వత్తుము నీవెంట వలదంటివేని ♦ చత్తుము దీనికై సందేహమేల
అనియనిపలుకుచు నఖిలభూప్రజలు ♦ తమగొల్చి రా రఘూత్తముడు నాఁడేగి
తమసానదీ తటస్థలమున విడిచి ♦ తమసలో సాంధ్యకృత్యములెల్ల దీర్చి
తగుసౌధమున మృదుతల్పంబునందు ♦ మొగిబవ్వళించు నా మోహనమూర్తి
తరుమూలమున బర్ణతల్పంబునందు ♦ ధరణీసుతయు దాను తగవిశ్రమించె
దన చుట్టుపౌరులు తమయిండ్లు మరచి ♦ తనయుల భార్యల దగులుబోవిడచి
వనములదమవెంట వచ్చువారనుచు ♦ నినుపారదప్పితో నిద్రి పజూచి
వారల మగుడించు వలనొండు లేక ♦ నా రాత్రిమధ్యంబు నందు సుమంతు
దేరాయితముసేసి తెమ్మని పలికె ♦ పౌరుల వంచించు భావ మాతనికి
దెలిపి యయోధ్యకయి తెరువు బోనిచ్చి ♦ తలకొని మగుడించి తమ దాటించి
తృణశిలావృతభూమి తెరువు దోలించి ♦ కణుతి పరాని వేగమున బోవుచును
తమరాకయును మహీధవుని సేతయును ♦ దమకించి మదిలోన తాపంబునొంది
తెరవుపల్లెలవారు ధృతిధూలియేన్వ ♦
పరుసంబులెలుగులు పలుమారు వినుచు
వనతరుల్సీతకు వరుసజూపుచును ♦ ఇనకులమణియైన యిక్ష్వాకునకును
మనువుమున్నొసగిన మహిమగన్గొనుచు ♦ జని వేగవతి దాటి సరయువు దాటి
నరనాథుడమ్మరునాడు మాపటికి ♦ గరము వేగమున గంగానది జేరి
తడయక హింగుదీతరు సమీపమున ♦ విడిసి యచ్చట బ్రీతి విశ్రాంతినొంది
ఆకయుదమసలో నటనిద్రబోయి ♦ పౌరులందరును బ్రభాతంబునందు
కరమర్థితో మేలుకని నాల్గుదెసల ♦ పరికించినీవెవ్వర పడిశోకమునను
రాముని గానక రథము చొప్పరసి ♦ రాముడయోధ్యాపురమున కీరాత్రి
యవనినాథుడు బిల్వ నంపిన మరల ♦ భువనభారము బూనబోనోపుననుచు
ననియ యయోధ్యకువచ్చి యచ్చోట రాము ♦ గనుగొనజాలక ఘనశోకవహ్ని
దనయంబు బొగలుచు నకట రాఘవుడు ♦
మనల వంచించి క్రమ్మర బోయెననుచు
నా రామకృపయు సత్యంబు ధర్మంబు ♦ చారువర్తనము నిచ్చలు నుతింపుచును
యితరవస్తువులపై నిచ్చలు మాని ♦ యతసిదలంపుచు నతని బాయుటకు

— * : శ్రీరాములు గుహునిజూచుట : * —

నంతరంగంబున నలయుచునుండ ♦ నంత నక్కడ గుహుండను చెంచురాజు

శృంగిబేరం బేలు చిరపుణ్యశాలి ♦ గంగాతటమున రాఘవుడుండు టెఱిగి
చనుదెంచి రామ లక్ష్మణులకు మ్రొక్కి ♦
వనమూలఫలములుపలయువస్తువులు
కనకాంబరాదులు కానుకలిచ్చి ♦ వినయవిధేయుడై వినుతులొనర్చి
యచ్చెరువుగ రాము నాకృతిజూచి ♦ యిచ్చలో వెరగంది యదియేమి దేవ
నీవరణ్యములకు నిఖిలంబువిడిచి ♦ యీవిధివిచ్చేయు టేమికారణము
నలినాప్తకులనాథ నాయట్టిబంటు ♦ కలుగ నీవేషంబు గలిగెనే మీకు
చనటిమైమిమ్ము నెట్లు చేసెన నీచు ♦ ననిపట్టిచంపెద ననిన రాఘవుడు
నతనిసద్భక్తికి నతనిశక్తికిని ♦ నతనిధీరోక్తుల కానందమంది
యతనిగౌగిట జేర్చి యాదరంబెసగ ♦ నతనితో దనదు వృత్తాంతంబు దెలుప
నంతయువిని గుహుండాత్మలో బెద్ద ♦ చింతించి కైకేయి సేతకువగచి
దశరథునేరమి తలపోసిపోసి ♦ దశరథాత్మజుల దుర్దశకు శోకించు
రాముడప్పుడు కృపారసమగ్నుడగుచు ♦ సౌమిత్రియును దానుసముచితఫణితి
గుహుశోకముడుప నర్కుడు గ్రుంగుటయును ♦
విహితసంధ్యాకాల విధులొప్పదీర్చి
గంగోదకముల నాకలిదీర్చిసూత ♦ శృంగిబేరాధిపుల్ చేరి సేవింప
ధరణీతనూజయు దానులక్ష్మణుడు ♦ ధరణిపై దృణశయ్యతగవిశ్రమించె
శరచాపహస్తుడై సౌమిత్రియంత ♦ గరమొప్పదమయన్న గాతునన్బుద్ధి
బదునాలుగేండ్లును పగలును రేలు ♦ నిదురబోవక యుండ నియమంబు చేసి
తమయన్న సజ్జకు దవ్వులనిలిచి ♦ యమలమానసుడప్పుడటుగొల్చియుండ
నారాత్రినిద్ర మాయారూపుదాల్చి ♦ ధీరుడా లక్ష్మణ దేవుని జేరి
యేనునిద్రాదేవి యేర్పడ దెల్పు ♦ మానకునింకెట్లు మానాథ్యయంత
విధివిధించినవెంట వెంటవర్తింప ♦ నిదినాకునియమమిది దెటుబల్కెదీవు
అనినసూర్మిళయందు నహరంబులును ♦
జనియుండుమంత నీసమయంబుదీర్చి
వచ్చినగైకొందు వరుసనిన్ననిన ♦ విచ్చనౌగాకంచు నెరినేగెనంత
నలరుచునీదేవ తానుగ్రహంబు ♦ కలిగెనాకనుచు లక్ష్మణదేవుడుండె
సుకుమారతారుణ్య శోభనాకృతులు ♦ ప్రకటితదైన్యసంపన్నులై యున్న
యారామసీత లత్యంతదుఃఖముల ♦ గూరెడు తెరగెల్ల గుహునకు జెప్పి
వడరి కౌసల్యయు నాసుమిత్రయును ♦ బడియెడిశోకంబు పలుమారుజెప్పి
సారిదినిద్దరుగూడి శోకింపుచుండ ♦ నరుణోదయంబయ్యె నంతరాఘవుడు
నేమంబులన్నియు నిష్టతోదీర్చి ♦ సేమమేర్పడ గుహుచే మఱ్ఱిపాలు

దెప్పించికోమల దీర్ఘ కేశములు ♦ విప్పియూవై దేహి వివశ యైతూల
ఆమఱ్ఱిపాలచే నందంపదడపి ♦ సౌమిత్రియును దాను జటలొప్పఁదాల్చి
ఘనుఁడురాఘవుడు వైఖానసవృత్తి ♦ ననుజుండుదానుపా యని నిష్ఠబూని
అనఘసుమంతు రమ్మని చేరఁబిలచి ♦ తనరారరథ మెక్కఁ దగ దీ మాకింక
వరదంబు గొనియ యోధ్యకు నీవు వేగ ♦ మరలిపొమ్మధిపు నెమ్మదిగొల్చియున్న
పార్థివేశ్వరునకుఁ బరఁగఁ దల్లులకు ♦ నర్థితో మ్రొక్కితి మని జెప్పుమనఁచు
యేమిటికీమాట లిటమీఁదననుచు ♦ సౌమిత్రి యధిక రోషమునని ట్లనియె
భూమీశుఁడాలిపంపునసీతిమాలి ♦ యేమియుఁబరికింప కిటు చేసెమమ్ము
తనయాలు దానును దనకూర్మికొడుకు ♦ ఘనరాజ్య భోగములగైకొను గాక
యని యేను బల్కితి నని చెప్పుమీవు ♦ చను మనవిని రామచంద్రుండు గినిసి
మాను సౌమిత్రి సుమంతనీవి క ♦ భూనాథుతో నీవు పుట్టింపవలదు
అవ్వుడిదివిన్న నధిక దీనాయ ♦ మానమానసుఁ డున్నమతిఁబొక్కుచున్న
యనిన సుమంతుఁ డత్యంత శోకమున ♦ ముని గిభీల్లి రామునిఁజూచి పలికెఁ
గానలమిము ద్రోచి కడుదీనవృత్తి ♦ నేన యోధ్యాపురం బేమని చొత్తు
నేమని చెప్పుదు నీవూర్తఁబజకు ♦ నేమనికొనిపోదు నీశూన్యరథము
నేమనికౌసల్య నేనూఱడింతు ♦ నేఁనికైకమా మేనువీక్షింతు
వనముల కేనును వత్తునుగాక ♦ యనిన రాముఁడునవ్వి యాతనిఁజూచి
కడఁకతో నేము గంగానదిదాఁటి ♦ యడవులఁజొచ్చితి మనువార్తకైక
నీవు చెప్పినఁగాని నిజముగాఁగొనదు ♦ నీవుశోకింపక నెమ్మదిఁబొమ్ము
నామాటుగా నీవునయవాక్యసరణి ♦ వేమాఱుదెల్పి భూవిభుఁగొల్చియుండు

## — * సుమంతుఁడు అయోధ్యకు రథము దెచ్చుట * —

మనవుడు రథమెక్కి యతిదీనుఁడగుచు ♦ జనియెసుమంతుండు సాకేతపురికి
అంత రాఘవుఁ డయోధ్యాపురికపుడు ♦ వంతరంగంబుననతిభక్తిమ్రొక్కి
గుహుఁడు పెట్టిన యోడ గొమరొప్ప నెక్కి ♦

యహిమాంశుకులు నంత నాగంగ దాఁటి [గిచి
నడుమజానకిగంగ నటుచూచిమ్రొక్కి ♦ కడు వేడ్కఁ బ్రార్థించికరములు మొ
దశరథేశ్వరు హాజ్ఞ ధరణిపర్జించి ♦ దశ చెడిరాముఁడు దండకాటవిని
బదునాలుగేఁడులు భవ్యవృత్తులను ♦ విదితంబుగా నేను వీనితోఁగూడ
సంచరించియు రాము సౌమిత్రులంత ♦ సంచితశుభముచే నలరు వేడుకల
వచ్చిన నీకును వలనొప్పఁగాను ♦ నిచ్చెదగోవు లనేకముల్ వస్త్ర
దానమృష్టాన్నాది దానంబులమర ♦ గాను భూసురులకు గానుక నిత్తు [చి
సురఘటల్ వేయింటిశుద్ధాన్నమాంస ♦ మరయఁబెట్టెదనమ్మయనిభక్తిగొలి

భవభంగధవళాంగ భవమౌళిసంగ ♦ నవనిజయాగంగ నర్థిఁ బ్రార్థించి [illegible]
గుహునిసంభావించి గుహునివీడుకొలిపి ♦ గుహుఁడు మార్గజ్ఞుల గొందఱఁ గూ
ముందరఁ గూర్చితమ్ముఁడు వెన్కఁ దాను ♦ సుంతరినడుచక్కఁ జూపట్టెఁ గదలి
వనచరమృగముల వరుసజానకికిఁ ♦ గనుపట్టఁ జూపుచు ఘనుఁడు రాఘవుఁడు
అనఘుఁ డా రాఘవుఁ డనియె గ్రమ్మరుచు ♦
మునినాథ సెలవిమ్ము ముదముతో ననిన
రఘుకులోత్తంసయీరమణీయమైన ♦ యఘునాశమైన యీ యాశ్రమభూమి
నిలుతురుగాక యని రఘూత్తముఁడు ♦ పలికెఁ గ్రమ్మఱ మునిపతి కిట్టులనుచు
నిక్కడ మాకుండ నేలపోయెదము ♦ అక్కట మునినాథ యదియును గాక
మాతల్లిదండ్రులు మాపురవాసు ♦ లేతెంచి మముఁ జూడ నిటవత్తురన్న
నామాటకలరి యిట్లనియెనమ్మౌని ♦ యీమాటనిశ్చయంబే రామ యిపుడు
పదమని సెలవిచ్చి పరమపావనుఁడు ♦ వదలనిముదమున వారలకనియె
జననాథ మూఁడుయోజనములు నడువ ♦
ననువొందఁ జిత్రకూటాఖ్యఁ జెన్నొందు
ననవుకు రాఘవుఁ డౌఁగాక యనుచు ♦ జనకజాసౌమిత్రిసహితుఁడై యప్డు
చనిచని మూఁడుయోజనములు గడచి ♦ చనిసుధర్మదయనుసరసినాఁడుండి
యారాత్రి భూపుత్రి యతిమృదుగాత్రి ♦ కారడవి యొంటిగా శయనించి
యున్నచందంబు తా నున్నచందంబు ♦ కన్నతల్లులకైన కష్టశోకంబు
లైకేయికోర్కులు కడముట్టుటయును ♦ భూకాంతసత్యంబు భూ[illegible]వగయు
గన్నీరు దొరుగ రాఘవు కులక్ష్మణుని ♦ కన్నియు జెప్పగానటవేగెఁ బ్రొద్దు [డచి
మనువంశతిలకులామఱునాడు కదలి ♦ మునుమిడి యోజనంబులు మూఁడుగ
అనఘు గంగాయమునలు గూడి యునికి ♦
గనుఁగొని యటఁ బ్రయాగకుఁ బోయి యందు
మునిలోకసుతుఁడైన మునిభరద్వాజుఁ ♦ గని నమస్కారముల్ గావించి తనదు
వృత్తాంత మంతయు విన్నవించుటయు ♦ నత్తపోధనముఖ్యుఁ డా రాఘవులను
దీవించి రఘురామ దేవువర్తనము భావించి యచ్చెర్వు వడితత్త్వ[illegible]గి
కందమూల ఫలాధికంబులవారిఁ ♦ బొందుగా సంతుష్టి పొందించి ప్రేమ
నమ్మునిపూజింప నారాత్రియందు ♦ నెమ్మది దీపింపఁగ నిల్చి మార్నాఁడు
ఘనవిధిసంధ్యాదికర్మముల్ దీర్చి ♦ మునులయాశీర్వాదములు చాలఁబడసి
యరుదైన చిత్రకూటాద్రికిఁ దెరువు ♦ వరపుణ్యుఁడగు భరద్వాజు చే నెరిగి
యరుగుచో రాముడయ్యడవులనడుమ ♦ నురుచాపవరమునకరుగుచుఁ జాలు
మృగములఁ జూపుచు మేదినీసుతకు ♦ నగవు పుట్టించుచు నడతెంచునెడల

వలసిడస్సిన చోట నవనీరుహాముల♦నిలిచినచోటనునిలిచిదోఁక్కొనుచుఁ
కఠమర్థిఁబెక్కు దుర్గంబులుగడచి♦వరపుణ్యఁట సిద్ధవటమునీక్షించి
సీతయప్పుడు కార్య సిద్ధులుగోరి ♦ యాతరువరమున కంజలిచేసి
ప్రార్థింపనప్పుడా పార్థివతనయు ♦ లర్థితోయమున మహానదిదాఁటి
యారాత్రియందుండి యమ్మఱునాఁడు ♦
ఘోరాటవులుచొచ్చి కళలమార్గమున
నలనొప్పజనిమాల్యవతిచుట్టుఁబాఁటి♦యలఘుసంయములకునాటపట్టగుచు
నలలితతరులతాసానుకూటములు♦చెలువువాటించినచిత్రకూటాద్రి [డసి
గనియెక్కియందున్నఘనతపోధనుల ♦గనిమ్రొక్కిమిగులసత్కారముల్వ
యమ్మునీంద్రులచేత ననుమతివడసి♦తమ్ముఁడుదాను నత్తఱిమహీజముల
కొమ్మలుఖండించి కొంతవింతగను ♦ సమ్మోదంబునఁ బర్ణశాలఁగావించి [సి
కృష్ణసారముఁజంపి గృహశాంతిహోమ♦ముష్టాంశుకులుడుశాస్త్రోక్తమైజే
యందుఁబ్రవేశించి యాపర్ణశాల♦చందంబుమెచ్చుచు సాధ్వియుఁదాను
మునులసేవించుచుమును లెల్లఁబొగడ మునిచరిత్రంబులమోదించుచుండె
తనతోడనొకనాఁడుతలయంపిగాఁగ♦నునిచిరాముఁడుగూర్కనుర్వీతనూజ
యొుగిగందమూలాదులుపహారము లొసఁ ♦ దగనాయితముసేయుతఱిభీతిలేక
కడఁకతోనొకదుష్టకాకంబువంటి♦నొడియుచుగాసిసేయుచునున్నఁజూచి
సీతయాకాకంబుఁ జెచ్చెరఁజోప ♦ నేతెఱంగుననఁబోవ కీడాడఁజూచి
చనుఁగవనడుచక్కఁ జంచునఁబొడువ ♦ ఘనశోణితంబొల్కఁగానిద్రదేరి
కడునల్గిరాముఁడా కాకంబుఁజూచి♦వడినిషీకముఁబుచ్చివైచెవైచుటయు
విడువకయదిదానివెనువెంటఁదగులఁ ♦ దడయకయదిజగత్త్రయమెల్లఁదిరిగి
కావుకావనుచు దిక్పాలురబ్రహ్మ ♦ దేవుఁనమ్మహాదేవుఁబ్రార్థింప
వారలుతమచేతవారింపఁబడునె♦శ్రీరామశరమన్న శీఘ్రంబుమగుడఁ [చి
జను దెంచిమరితన్నుశరణుఁజొచ్చుటయుఘనమైనకృపతోడఁగాకంబుజూ
నాయస్త్రమెందునెన్నఁడురిత్తవోదు ♦ సెయుంగ మొకటిదానికినిచ్చిపొమ్మ
యనవుకుదననేత్రమయ్యస్త్రమునకు♦ఘనభక్తితోనిచ్చికాకంబుచనియె
జెలఁగిరాఘవుఁడంత సీతచేనున్న ♦ ఫలములు దేవతార్పణములుచేసి
యాయున్నఫలముల నలవడఁదృప్తు♦లై యుండిరిమ్ముల నంతనక్కడను
రాముననర్తముగారయమూఁడునాళ్లు♦నేమించిగుహచెంతనిలిచిమర్నాఁడు
ములగనివగలసుమంతుండుచాల♦నలయుచుజని యయోధ్యాపురిఁజొచ్చి
నహజపైభవములు సర్వంబుఁఘండిగి♦రహిచెడియున్నయారాజమార్గమున
నరుగుచోఁబురజను లారథధ్వనులు♦పరికించియిదె రామభద్రుండువచ్చె

వనిసుమంతునిఁ జేరనరుదెంచిరథము ♦ కనుఁగొనిరఘురాముఁగానకవగచి
క్రూరకర్ముఁడురాముఁగొని రాకడించి ♦ యీరిత్తరథ మేలనిట దెచ్చెననుచు
గుంపులుగుంపులు గొనితన్నుదూఱ ♦ సాంపేదిరాముని సుద్దిచెప్పుచును
రాజగేహముఁ జేరి రథమంతడిగ్గి ♦ రాజున్నయంతఃపురంబున కేగి
ధూళిగప్పినమేనితో బాష్పపూర ♦ లోలనేత్రములతో లోలోనఁబొదలు
కడలేనివగలతోఁ గౌసల్యయింటఁ బడిప్రలాపించుభూపతిఁగాంచి మ్రొక్కి
భూమీశమీపుణ్య పుత్రరత్నంబు ♦ రాముఁడు సత్యపరాక్రమశాలి
సౌమిత్రియునుదాను జడలొప్పదాల్చి ♦ తామసింపక గంగ దాఁటి కాల్నడల
వనఘుఁడై చిత్రకూటాద్రికిబోయె ♦ పనవుచుదశరథుఁ డాత్మశోకించి
యనఘసుమంత రమ్మని చేరఁబిల్చి ♦ తనయునిచరితమంతయుఁ దప్పకడిగి
గౌరవమతినీవు గల్గితి కాన ♦ మారామభద్రు సేమము లెల్లవింటేఁ
గన్నులకఱవు శోకంబునుదీర ♦ చెన్నారనతనిఁ జూచినఁగానియకట
తనువునఁబ్రాణము ల్ధరియింపఁజాల
గొనిపోయిరఘురాముఁ గూర్పవేయనిన
వినవయ్య శ్రీరామ వెంట నేఁబోవఁ ♦ గనిప్రజశోకించుఁగైకదూషించు
నిదివిచార్యంబుగా దిదిబుద్ధిగాదు ♦ మదినింతవగవకు మనుజేంద్రనీవు
ధైర్యంబుపరికింపుధర్మంబుబూనుమార్యులుగొనియాడననఘుండవగుము
అఱలేక నడవుల నఖిలభోగములు ♦ మఱచినీసుతులు నెమ్మదినున్నవారు
అనిపల్కెలక్ష్మణుం డన్నవాక్యములు ♦
వినిపించుటయును భూవిభుఁడు శోకించి
సౌమిత్రిమాట నిజంబౌనెయట్టి ♦ రామాంధుఁడను గ్రూరకర్ముఁడఖిలుఁడ
వనిసుమంతుని వేగ యఱుపీడఁ గొలిపి ♦ తనమదిశోకించు ధరణీశుఁజూచి
హా రామ హా రామ హా రామయనుచు ♦ శ్రీరాముపలుమాఱుఁజింతింపనేల
ఏలనటించెద వేలయీశోక ♦ మేలతాల్చెదవంత యెఱుఁగనే నేను
నీవులోకములలో నిందకువెఱచి ♦ ఆవలకైకేయి కన్నియఁగఱపి
రాముఁబట్టముగట్టి రాజుఁగావించి ♦ భూమి యేలింపదేఁ బొగడొందననుచు
నడవిద్రోపించి తెతాల్మిచేఁబనిచి ♦ కడఁగ గష్టుఁడవునీకుఁ గలవెధర్మములు
తిట్టుపాటునకోడి తివిరినాకొడుకు ♦ పట్టంబుమాన్పెఁ బఁబనిచెఁగాక తెప
సాంపేదిరాముని గ్రుక్కకక్కైక ♦ చంపుమన్నను బట్టి చంపవే నీవు
పెద్దకాలమునాకు బిడ్డలు లేక ♦ పెద్దయుశోకించి పెక్కలునోచి
కడపట నొక్కని గని యేనుగొంత ♦ యుడుకారియున్నచో నుండనీవైతి
ననిదూఱికౌసల్య నధిపతిచూచి ♦ తనపూర్వకథయెల్లఁ దాఁ జెప్పఁదలఁ

నీవు చెప్పిన వెల్ల నిజముఁ గాఁ గలదు ♦ భావింప నేనట్టి పాపకర్ముఁడను
ఒడల బ్రాణములింక నుండవు నాకుఁ ♦ గడుబెట్టిదములాడి కాఱింపవలదు
కౌసల్య నాతొంటి కర్మభోగంబు ♦ లొనరించినవి యవి యూరకే పోవు
దైవంబులకునైనఁ దమకర్మఫలము ♦ భావించి కడువక పాయరాదెందు
వదియెట్టిదనిన నదిచెప్పఁ జోద్య♦మది తెల్లముగ వినుమని చెప్పఁదొడఁగె

—*: దశరథుఁడు కౌసల్యకు తనశాపము దెల్పుట *:—

నాఁడెల్ల నేలెడు నాఁడు నా పిన్న ♦ నాఁడొక్క నాఁడేను నడురేయిఁ బోయి
యరుదైన వేఁటల నాసక్తిఁ దొంది ♦ శరచాపములు పూని సరయువు చెంత
రేసి చూడఁగరాని రేవు చక్కటికి ♦ డాసి నపొదలో డాఁగియే యుండ
మఱిమఱి మృగకోటు లయ్యేటి నీరు ♦ పఱతెంచి క్రోలు శబ్దములు నచ్చటికి
వీనుల వీక్షించి వెసశబ్దవేదు ♦ లైన బాణము లేసి యందందఁ జంపి
తనియక కాపున్న తఱి యజ్ఞదత్తుఁ ♦ డను నొక్క మునిపుత్రుఁ డమ్మహానదికి
తిరమైన విధి తన్నుఁ దెచ్చిన వచ్చి ♦ కరమర్థి నచ్చట కలశంబు ముంప
గుదియక యట ప్రమోయ గుటగుటధ్వనులు ♦
అది మత్తగజమని యడరి వేయుటయు
నా తీవ్రశరమప్పు డదరంట దాఁక ♦ హా తాత హా మాత యను నార్తరవము
పొరిఁ బొరి నా మర్మములు గాడి పాఱ ♦ వరమునిసుతుఁ డుర్వి వ్రాలి యిట్టని యె
క్రమమొప్ప నడవుల గందమూలములు నమలుచు దపసినై నను గన్న గురుల
గొలిచి యేరికిఁ గీడు గోరని నాకు ♦ గలిగె నే నేఁడిట్టి కష్టంపుఁ జావు
ఎట్టి పాపాత్ములు నీరాత్రులందు ♦ నెట్టన చంపరు నెఱసి జంతువులఁ
బగళుల రతికేళిఁ బాయక మెలఁగు ♦ మృగములఁ జంపరు మెయినోటు లేక
యెవ్వఁడొకో నన్ను నీనడురేయి ♦ క్రొవ్వాఁడి శరమునఁ గూల్చినవాఁడు
వాఁడేమి గతిఁ బోవు వాఁడొకో యింక ♦ వాఁడేమి సేయును వఱలు నా మృతికి
నక్కటా వృద్ధులై యంధులై తమకు ♦ దిక్కెవ్వరును లేక దీనులై యున్న
తల్లిదండ్రులు నేఁడు తమకైన వగల ♦ వెల్లియు నెబ్భంగి వెడలనీదెదరో
కడుఁ బ్రొద్దుపోయె నొక్కఁడుఁ బోయి తడసె ♦
కొడుకని మది నెంత గుందునో తల్లి
ననుగన్న తల్లికి నా రామి జెప్పి ♦ యనుమానపడి యెంత యడలునో తండ్రి
యాటల మరిగి రాడని చూతురొక్కొ ♦ నీటికంపువ లేమి నిలిచినాఁడొక్కొ
యేమని వగతురో యీచావు విన్న ♦ నేమిగాఁ గలవారొ యిటమీఁద వారు
ఎవ్వరు నుదకంబు నిచ్చెదరింక ♦ నెవ్వరు ప్రోచెద రిటమీఁద వారి
గడగి యీ బాణ మొక్కటనె మువ్వురము ♦ బడితి నిం కేమని పలవింతు విధికి

ననివిలాపించుచో నావిలాపములు ♦ వినయెప్పుడెప్పుడు విరియునో తమము
ఎప్పుడుచూతునో యిమ్మహాపురుషు ♦ నిప్పాటుపాటిల్లె నేనేడు నాకు
ననుచుండనుదయించె నంతచంద్రుడు ♦ వనధిలో నాశోకవనధియుప్పొంగ
చందురుడుదయింప సరయువుదాటి ♦ యందున తీరంబు నందును వెదక
తనచేతికలశంబు ధరణిపై వైచి ♦ తనచెక్కు కలశమస్తకమున జేర్చి
యురమునవీపున నొండొండ వెడలు ♦ మరురక్తధారలు నొడలెల్లదోగి
వీడినజడలతో విశిఖవేదనల ♦ నాడినమోముతో వసుధపై వ్రాలి
శరముపదేశమై చనజొచ్చిలోన ♦ బరికించి దేహసంబంధంబులణచి
యేకర్మములయందు నీడాడనీక ♦ గైకొని యింద్రియగతులడ్డగించి
గడపటియోగంబు గనితన్నుమఱచి ♦ పడియున్న యోగికైవడియూరకున్న

—:* దశరథుడు యజ్ఞదత్తునిజూచి చింతించుట *:—

మునికుమారుని జగన్మోహనాకారు ♦ గనుగొని బాణంబు గనియేను బెదరి
యన్నదీజలములు నప్పుడు తెచ్చి ♦ కన్నులుదుడిచి యంగములెల్లదుడిచి
యక్కటమునినాథ యడరినాశరము ♦ డెక్కరిదాకి వధించె నేనిన్ను
నీనదీజలముల కేలవిచ్చేసి ♦ తేనింక నీపాప మేమిటగడతు
ననుచుండదన కన్నులల్లనవిచ్చి ♦ ననుజూచి తనుచూచి నాభీతిజూచి
నీవేమిసేయుదు నీకేలవగవ ♦ నీనవ్వడవు నాకు నిష్కృతిగావింప
దైవయోగంబున ధరణీశనాకు ♦ నీవిధియయ్యె నీకేల శోకింప
నేనుగయనుబుద్ధి నేసితిగాని ♦ పూని నాదెసగోపమున వేయ నీవు
ఏను బ్రాహ్మణుడగా నెలమివైశ్యునకు ♦ భూనాథ శూద్రికి బుట్టినవాడ
నటుగాననిది బ్రహ్మహత్యయుగాదు ♦ పటుదోషఫలము నిన్బాధింపలేదు
నరనాథతిలకకు నాచావుజూచి ♦ యరిగినా గురులున్న యచటికిబోయి
నాచావుజెప్పకున్నను యోగద్రిష్టి ♦ జూచి భావించి యచ్చుగ గాంచిరేని
కోపించినన్గన్న గురులు నిన్బట్టి ♦ శాపింప రఘుకుల క్షయముగాగలదు
భూపాలయీకొండ పొంతపశ్చిమపు ♦ కోపున నొకమ్రికొమరొందుచుండు
నావటవృక్ష కోటరమందు రేయి ♦ కావడిఘటియించి కడుసంతసమున
గురుతుగానేను నాగురులనందునిచి ♦ యరసిపోషణసేయుచుందున్నవారు
కరమొప్పగురువుల గ్రక్కునవడించి ♦ పరితాపమొందక భయపడకీవు
కావునవారికి కలశోదకములు ♦ వేవేగగొనిపోయి వినుపింపుమీవు
మనుజేశనీయస్త్ర మరణంబునాకు ♦ ననుచిత మీబాణ మల్లనబెఱుకు
మీశరవేదన కేనోర్వజాల ♦ నాశరీరమున బ్రాణములుండవింక
ననవుడు నేనప్పు డల్లనజేరి ♦ ఘనమైనశోకాగ్ని గ్రాలుచువగచి

యమ్మ్ఱెఱుకగఁబూని యటుముట్టవెఱచి♦క్రమ్మర తెగువమైఁగలఁగికంపించి
పనిగొనివగలతో బాణంబు వెఱక♦మునికిమారుఁడు ప్రాణములు బాసెనంత
కలఁగుచు నేను నాకలశంబుతోడి ♦ జలములుగొని తదాశ్రమభూమికరిగి
యతివృద్ధులై యంధులై తారనన్య♦గతికులై నిజసుతా గమనముల్లముల
నెడపకగోరుచు నెఱకలువిరిగి ♦ పడియున్న పక్షులపగిదినట్లున్న
ఘనపుణ్యులగువారి కన్గొని చేర ♦ జనుదేర నాకాలి చప్పుడాలించి
యోపుత్రయిటు తడవుండుదువయ్య♦మాపట్టిరాకేల మసలెనో యనుచు
దలకుచుండితిమి మాతల్లియు మేము♦నిలుతువె యొకచోట నీవింత ప్రొద్దు
తనయనీ వెక్కడ తడసితివయ్య ♦ కనుగొనగామాకు కన్నులునీవ
అతివృద్ధులకుమాకు నాధారమీవ ♦ గతిలేనిమాకు సద్గతియునునీవ
యిదియేలపలుకవు యేమంటినిన్ను♦నుదకముల్ దెమ్మంటినో కుమారకుడ
యనిపల్కమునిపల్క లంతరంగమున♦బెనగొన్నశోకంబు భీతియుబెనుప
చెట్టెక్క కావిడి శీఘ్రంబడించి ♦ యట్టిట్టువడకుచు నతిదీనవృత్తి
జెప్పెదననివచ్చి చెప్పరాకుండి ♦ చెప్పకపోదని చెప్పనూహించి
చెలియించిగద్గద స్వరముతో వెడలు ♦ పలుకులదడబాటు పడుచునిట్లంటి
దాపసోత్తమయేను దశరథుండ ♦ నీపాలకుడగాని నీపట్టగాను
నీచకర్మలువిన్న నిందించునట్టి ♦ నీచకర్మమునాకు నేడుసిద్ధించె
నేయుగంబులయందు నెవ్వరునిట్లు ♦ సేయనిపాపంబు జేసిమీకడకు
వచ్చితినేమని వాక్రువ్వనేర్తు ♦ దెచ్చెదైవంబిట్టి తెరిపుసేయుటకు
సరయూపుపాంత నిశావేళవేట ♦ దిరుగుచుమృగము లేతెంచు చక్కటికి
వీనులందృష్టించి వెసశబ్దవేధ ♦ నైనబాణము లేసి యందందజంప
నీరుకందువనుండి నీకుమారుండు ♦ నీరునింపగకుంభ నినదమాలించి
యేనుగుకలపున నేసితిగాన ♦ నానతినాకేమి యనఘమీతనయు
ప్రాణముల్ గొనియె నాపటుబాణమనిన ♦

ప్రాణముల్ ఝల్లని పడిమూర్ఛబోయె
నామునిపత్నియు హాపుత్రయనుచు ♦ భూమిపైబడరిత్త బొందునట్లున్న
నప్పుడేవడలుచు నల్లనదెలుప ♦ దెప్పిరివారు నాదెసమోములెత్తి
యేలయ్యదశరథ యేముశోకాగ్ని ♦ గ్రాలమాతనయు నెక్కడదాచితీవు
అడవులదపసులైయ దులైయున్న ♦ బడుగులజంపి పాపముగట్టుకొంటి
యడరిసీదగుబాణ మెదరంటగొన్న ♦ బడునప్పుడేమని పలికెనోకొడుకు
పాయనివేదన ప్రాణముల్ విడిచి ♦ పోయెనోవిడువక పొదలుచున్నాడో
మృతికైనెనొందు నిమిత్తంబు లేదె♦యతిసుతుడట బాణమటచావునిధియు

బుడమి వానప్రస్థు బొలియించనేని ♦ చెడునింద్రుడైనను జెడదె భూవిభుడ
నవనీశ మా పుత్రు నజ్ఞానబుద్ధి ♦ తవిలి యేసితిగాన దగదు నిన్నలుగ
మాకష్టజూడక మముగొనిశ్రాలు ♦ శోకాగ్నులారవు చూపవే వాని
ననియని శోకించు నాతపోధనుల ♦ గొనిపోయి వీడె మీకొడుకనుటయును
నేడిపయోధార విమలమానసుడు ♦ నేడితపోధన విపులపుణ్యుండు
నేడిసుధీజనవితత వర్ధనుడు ♦ నేడినితంతర వేదతత్పరుడు
ననుచు జేతులుజాచి యందందవెదకి ♦ తనయునిపైబడి తల్లి శోకించి
తొడలపైనునిచి నెత్తుటదోగియున్న ♦ జడలలోదఁజేర్చి సంతాపమంది
యోవిమలాత్మక యోయజ్ఞదత్త ♦ యోవిప్రసుతాచార యోధర్మనిపుణ
యెందు నాతోడ నీవిటుజెప్పకాని ♦ యెందునుబోవు నేడిదియేమి నేడు
నాకలోకమునకు న్నతిబోవుచుండి ♦ నాకేలజెప్పవు నావంశతిలక
కడవజేసెదు పాపకర్ములమైతి ♦ నడురేయి నిన్ను నేటికనిబొమ్మంటి
ఏచినగురుభక్తి నెల్లలోకముల ♦ గాచినకొడుకు నిక్కడజంపుకొంటి
నాకేటితపమింక నాకునీతోడి ♦ లోకంబెగాకింక లోకైకవినుత
యెక్కడినీప్రాణ మెక్కడిబాణ ♦ మెక్కడిదశరథుం డెక్కడనీవు
ఇన్నియునొడగూర్ప నిటునేడుగలిగి ♦ నిన్నుద్రెక్కొనియెనా నీకర్మఫలము
అనితల్లిశోకింప నమ్మునీశ్వరుడు ♦ తనయునిపైపడి తద్దయువగచి
నీవునాకడకతి నిష్ఠతోవచ్చి ♦ కావింతు ప్రీతి సత్కారముల్ తొల్లి
యేనునీకడకిప్పు డేతెంచియున్న ♦ నేనెయ్యములుసేయ విటునీకదగునె
కొడుకనీనిర్మలగుణకలాపములు ♦ నెడలెనేయీబాణ విపరంబువందు
నెవ్వనిజదివింతు నింక వేదములు ♦ నెవ్వనిజదివింతు నింక శాస్త్రములు
నెవ్వనివినుపింతు నింకధర్మువులు ♦ ఎవ్వనికెరుగింతు నింక కార్యములు
ఫలములుజలమును వరికించిమాకు ♦ నలయకుండగనెవ్వ రరసిపెట్టెదరు
దీర్ఘాయువనినిన్ను దీవింతుగాని ♦ నిర్ఘాతపటుబాణ నిహతిబల్కితిన
జమునైనబుత్రభిక్షమువేడుకొనెద ♦ కొమరారనచటికి గొనిపోగదయ్య
పనివడియెందును బరలోకవిధులు ♦ తనయులుసేతురు తల్లిదండ్రులకు
పరిపాటిదప్పించి పరలోకవిధులు ♦ మరలించివిధినీకు మముజేయబనికె
నీకలదినములు నిష్ఠబెంపొంద ♦ చేకొనిమమ్ము రక్షించితివీవు
నీయట్టికొడుకను నిజముగాబూని ♦ ఏయుగంబులగందు ననఘనేనింక
దురితదూరుడవుబంధురతపోవిధివి ♦ గురుభక్తుడవునీవు గురుభక్తియుతుల
బరలోకపరులార్య పరులుధర్మైక ♦ పరులెందునిజ శౌర్యపరులార్తిహరులు
అన్నదానాదిమహాదానపరులు ♦ గన్నలోకంబులు గనుమునీవనుచు

కరమొప్పనగ్ని సంస్కారాదివిధులు ♦ తరమిడి చేసిరి తమతనూజునకు
నమరుడై యతఁ డంత నాకాశవీధి ♦ నమరవిమానంబు నందుండి పలికె
ఓగురులార యే నుత్తమలోక ♦ భోగభాగ్యుఁడనైతి పుణ్యుండనైతి
కరమర్థి మిముఁ గొల్చు కతమున నాదు ♦ మరణంబునకు మీరు మలఁగకుఁడింక
నేకాలమేత్రోవ నేదిగావలయు ♦ నాకాలమాత్రోవ నదిగాకపోదు
అయ్యెడు కార్యంబు లగుఁగాన మాన ♦ వయ్య మీరితనిపై నలుగకుఁడనుచు
ననిమిషపురి కేఁగ నతఁడంత వారు ♦ తనయునిపైఁ గూర్మి ధరియింపలేక
పోయెద మేమిదె పుత్రశోకమున ♦ మాయట్ల నీవును మరణంబునొందు
మని ఘోరమగు శాప మలిగి నాకిచ్చి ♦ తనువులు విడిచి రత్తపసు లచ్చోట
నగ్నిసమానుల నాపుణ్యధనుల ♦ కగ్నిసంస్కారాదు లట యేనుచేసి
చేకొన్న వగల వచ్చితి పురంబునకు ♦ నాకర్మఫలమిదె యాసన్నమయ్యె
ధీరత చెడిబుద్ధి తిరుగుచున్నదియు ♦ నోరెండఁ జొచ్చె కన్నులుగానవయ్యె
పలుకులు వినరావు ప్రాణంబులింక ♦ నిలువనివియొడలిలో నిలుపంగలేను
నాపాలికల్పద్రుఁడు నాధీసముద్రుఁడు ♦ నాపరాక్రమరుద్రుఁడు నాగుణోన్నిద్రుఁడు
నాభాగ్యవరభద్రుఁడు నారామభద్రుఁడు ♦ శోభనగుణముద్రుఁడు జూడలేనైతి

—:* దశరథుఁడు ప్రాణముల విడుచుట *:—

సీతాత్రితోఁ గూడ యేడునాళ్ళయ్యె ♦ శ్రీరామ బాసినా జీవమెట్లుండు
నని ప్రలాపింపుచు హా రామరామ ♦ యనుచునంతనె మృతుండయ్యె నారాజు
వనటలఁ గుంది భూవరుఁడు నిద్రించె ♦ ననితాను నిద్రించె నంతకౌసల్య
పరికించియుంత ప్రభాతమౌటయును ♦ గరమర్థి వంది మాగధులు నుతింప
దొరకొని మంగతూర్యముల్ మ్రోయ ♦ బురినుండువారెల్ల గిరికొని వచ్చి
ధరణీశుదర్శనోత్కంఠులై యుండ ♦ నిరవొప్ప నేడేల యినాళ్ళరీతి
దొర మేలుకొనఁడంచు దొరకొన్న చింత ♦ బరిచారకులు వచ్చి పతికజ్జడాసి
ధరణీశుఁడున్న చందము బోలననుచు ♦ నురుభయంబును బొంది నూరుపులరసి
యడుగులు చేతులు నంటంటి చూచి ♦ యొడలఁ బ్రాణములు లేకునికి భావించి
యందరు బెలుచ మహారోదనంబు ♦ లందంద సేయ దిగ్గున మేలుకాంచి
యదరి కౌసల్యయు నాసుమిత్రయును ♦ బెదరి యందఱఁ జూచి పృథివీశుఁ జూచి
హాయని యెలుగెత్తి హా ప్రాణనాథ ♦ పోయితే దశరథ భూనాథ యనుచు
విలపింపఁ గైకేయి విని రాఁగఁ జూచి ♦ పలుమారుఁ గైకేయిపై మోదుకొనుచు
కైక నీకోర్కులు కడముట్టెనేఁడు ♦ కైకేయి కలచితె కాకుత్స్థకులము
నడవుల పాలఁగమ్మని రాముఁ ద్రోచి ♦ నడికోర్చి దశరథేశ్వరుఁ జంపుకొంటి
నెలకొని యిటమీఁద నీవు నీసుతుఁడు ♦ నిలయెల్లఁ గైకొని యిపుడు భోగింపు

డనుచునా కౌసల్యయాదిగాసతులు♦తను జేరుకొని యేడ్వదలవంచుకొనుచు
నలిఁదూలిచనుదెంచి నాథుపై వ్రాలి ♦
పలుదెఱంగులఁగ్రైక పలవింపుచుండె
నాసమయంబున నడలుదీపింపఁ ♦ గౌసల్యదశరథుఁ గనువిచ్చిచూచి
ధరణీశనీయట్టి ధర్మస్వరూప ♦ చరితునకీచావు సమకూరఁదగున
మోసపోయితినిన్ను మదలింపలేక ♦ నీసత్యసంపద నిన్నింతచేసెఁ
గడుకష్టమతియైన కైకేయిఁజూచి ♦ యడవికి రాముఁబొనడచిననగపు
పరికించినీ కేను బరిచర్యజేసి ♦ ధరియింపలేనైతిఁ బార్థివోత్తంస
నీయిచ్ఛలోనుండ నీపంపుఁజేసి ♦ పోయిసత్కీర్తులు పొందెరాఘవుఁడు
నెలకొన్నసత్యంబు నీవుపాటించి ♦ బలిసినిలింపసంపదలుగైకొంటి
ధరణీశనాకు నుత్తముఁడైననిన్నుఁ♦బరుసంబులాడినఁ బావంబుదక్కె
ననిచాలపలవింప నాసుమిత్రాది ♦ వనితలుగొంతెత్తి వాపోవుచుండ
నంతటనీవార్త లందంద మ్రోసెఁ♦గాఁతలయేక్క లాకసమెల్లనిండె
నంతసూర్యోదయంబయ్యె నాటయును ♦
ఎంతభయముతో హితులుశాస్త్రవులు
చేరువన్నృపులు వసిష్ఠాదిమునులు ♦ ధారుణీసురులు ప్రధానులువచ్చి
భూరిశోకంబునఁ బొగులువసిష్ఠుఁ ♦ డారూఢమతిమంతు దమమతిఁబడసి
తడయకదశరథ ధరణీశుమేను ♦ గడఁకతోఁ దైలపక్వంబు సేయించి [ట్టి
చెలువైనమణిమయసింహాసనమునఁ♦గొలువున్న తెఱఁగునఁగూర్చుండబె
మంత్రులుసకల సామంతులురాజ ♦ తంత్రజ్ఞులనుగూర్చి తగవునఁబలికె
నీరాజసామ్రాజ్య మెల్లఁబాలించి ♦ స్వారాజునగరికిఁ జనియెనేఁడకట
ఇతనిపూనికెదీర్ప నింతయుఁదాను ♦ హితమతియైరాముఁ డేగెఁగాననలకు
భరతుండుతమమామపట్టణంబునకు♦నరిగెశత్రుఘ్నసహాయుఁడై మున్న
మనమురామునిఁబిల్వమరలిరాఁడతడు ♦తనపూనికిదీర్పకధర్మవర్ధనుఁడు
కావునభరతు వేగమెపిలుపింప గావలయును రాజ్యకార్యముల్దీర్ప
రాజులేకున్న బురంబురాష్ట్రంబు ♦ రాజిల్లదెల్ల వర్ణంబులుగలయ
దండనీతిక్రియలు దానధర్మములు ♦ మొండడిసెడిపోవు నింతులురిపులు
జారులుచోరులు సందడింపుదురు ♦ కోరినాఁతురు సాధుకోటిదుర్జనులు
దొరలుసామంతులు దుర్గాధిపతులు♦సరిదికప్పములియ్య రనినిశ్చయించి
అలఘుమానసుడు జయంతుండుమొదలు ♦
నలుగురుమంత్రులు నయబుద్ధిబిలిచి
పలువన్నెచీరలా భరణముల్గొనుచు ♦ బొలుచుగిరివ్రజ పురమునకేగి

ఈవార్తలాతని కెఱుకఁ దెలుప ♦ నావసిష్ఠుండు రమ్మనె మిమ్మటంచు
గడువేగ భరతుఁ డక్కడనుండ నీక ♦ తోడుకొని రమ్మన్నఁ దోరంపుఁ గడఁక
వారలు హరులు దువాళిగా నెక్కి ♦ సారె నానాపుర జనపదంబులను
నదములు నదులు కాననములు గిరులు ♦ పొదలు పెక్కులు దాటి పొదలిన దాఁటి
కరము చెన్నొందఁ గేకయరాజపురికి ♦ నరుగ వారంత నేడవనాఁటిరాత్రి
బలమేది గోమయ పంకమధ్యమునఁ ♦ దలవిరియఁగఁ బోసి తండ్రి గూలుటయు
జలనిధి శూన్యమై సంపూర్ణచంద్రుఁ ♦ డిలఁ గూలుటయు పట్టపేనుంగు కొమ్ము
విఱుగుట మొదలైన విషమంపుఁ గలలు ♦ తఱుచుగాఁ గని లేచి తద్దయు భీతి
తన యిష్టసఖులతోఁ దత్ప్రకారంబు ♦ వినిపించి వగలమై వెనుబడుచున్న
భరతునిసన్నిధి కేగి ప్రణమిల్లి పిలిచి ♦ కరమర్థితను చేతి కానుక లిచ్చి
యావసిష్ఠుఁడు కార్యమప్పుడ గలిగి ♦ దేవ మిమ్మిటతోడి తెమ్మన్న వాడు
విచ్చేయుమనవుడు వెసదూత చేష్ట ♦ లిచ్చ గాఁగనుఁగొని యతిభీతిఁ బొంది
తన మామకడ కేగి తత్ప్రకారంబు ♦ క్రమమొప్పఁ దెలిపి సత్కారముల్వడసి

—:* భరతుఁ డయోధ్యకు వచ్చుట *:—

యతఁ డంపఁగదలి రథారూఢుఁడగుచుఁ ♦ జతురంగబలములు సచివులే తేర
నతులిత చింత నేడవనాఁటికి వచ్చి ♦ యతిరయంబున నయోధ్యాపురిఁ జొచ్చి
పతి లేనిసతి నిశాపతి లేని రాత్రి ♦ గతినెంతయును భోగకళలకుఁ బాసి
కన్నులకాపురి కడు వాడుపాటై ♦ యున్న చందముఁ జూచి యుల్లంబు గగి
యిది యేమివిధమొకో యీపట్టణంబు ♦
తుదముట్ట శూన్యమై తోఁచుచున్నదియుఁ [యెదురు
పౌరులనుఁ జూచి బష్పముల్దొరుగఁ ♦ దూఱు చుదవ్వులఁ దొలఁగిపో
అంగళ్ల సకలసామగ్రి వసువులు ♦ పొంగార వేటికి పురములోపల ను
నగరివాకిట సమున్నతరథంబుడిగి ♦ మొగిచెడి తానుదమ్ముఁడు శూన్యమైన
యంతఃపురంబు నకరుగఁ గైకేయి ♦ యెంతయుబ్రియముతో నెదురుగావచ్చి
కౌఁగిలించుటయును గరిమర్థిఁ గైక ♦ కవినళభక్తితో నప్పుడు మ్రొక్కి
యిచ్చమైఁ దమమామ యిచ్చినతొడవు ♦ లిచ్చి వారల సేమ మేర్పడఁ జెప్పి
యెంతయు శూన్యమై యిది యేమి నగరు ♦ వితథమై యున్నది విధవ బుదలిగి
రామలక్ష్మణులకు రాజవర్యునకు ♦ సేమమే యనవుడు చింతించి కైక
భరతునిఁ జూచి సంభ్రమము రెట్టింప ♦ దరహాసవదనయై తగవేది పలికెఁ
దలఁకోక తొల్లి మీతండ్రి నా కర్థి ♦ వలనఁ మీఁదఁగ రెండు వరములిచ్చుటయు
నొకటికి భరతుని నుర్వి నేలింప ♦ నొకటికి రఘురాము ననుపదుర్గముల
కనిపేఁడుటయుఁ దండ్రి యానతిఁ బూని ♦ జనకజాలక్ష్మణసహితుడై మునుల

యనువున రఘురాముఁ డడవికిఁ బోయెఁ ♦ దనయుని నెడఁబాసి ధరణీశుఁ డీల్గె
నీసున నీకుఁగా నీయుపాయంబు ♦ చేసితి రాజ్యంబు చేకొనుమింకఁ
బ్రజలఁ బాలింపు సంపదలఁ దేలింపు ♦ భుజశక్తి నేలుము బుద్ధినొండనక
ననవుడు మూర్ఛిల్లి యవనిపైఁ ద్రెళ్ళి ♦ ఘనరోషదృష్టిమైఁ గైకేయిఁ జూచి
కైక నాతల్లివై కరుణకుఁ బాసి ♦ యీకష్టవర్తన మేలకైకొంటి
మునివేషమున వనంబున రామునుండు ♦ మనిపల్క నెట్లు నోరాడెనే తల్లి
యరయ నిర్మలధర్ములైన రాఘవుల ♦ చరితంబు నీకు విచారింపఁదగదె
యేనింక మాతండ్రి కేమనివగతు ♦ నేను రాముని మొగం బెటువలెఁ జూతు
నెంతలోఁ గుందెనో యిచ్చలో రాముఁ ♦ డెంత కోపించెనో యేచిలక్ష్మణుడు
యెంత దూఱెనొ కాన కేగుచో సీత ♦ యింత కేమయ్యెనో యింతి కౌసల్య
యంతఃపురాంగన లా సుమిత్రయును ♦ వంత చేనేమని వగచుచున్నారో
వీరలకడ కేగి విలపింపనాకు ♦ నోరెద్ది యెట్లు మనోవ్యథఁ దీర్తు
నింక నీపురమేల యీభోగమేల ♦ శంకింపకడవియే శరణంబు నాకు
ఘనతాపరతిఁ జేసి కడఁగి మీతల్లి ♦ వినునొక్కరక్కసునికిఁ గననొప్పుఁ
గాని కేకయరాజుఁ గన్నకూఁతురవు ♦ గానేర వేమందు కైకసీతోడ
ననుమాటలన్నియు నల్లనఁ బొంచి ♦ వినుచున్న మంథర వెసఁ జూచి ప్రజలు
ఇన్ని పాపంబులు నిదియ చేయించె ♦ నన్న శత్రుఘ్నుఁడు నా వృద్ధవనిత
గూనుదొంతులు దీర గ్రొమ్ముడి జాఱ ♦ మేసొమ్ములు వీడ మెఱుఁగులు చూడ
కడకాలుఁ బట్టి యాకసమునఁ ద్రిప్పి ♦ పుడమిపై వ్రేసె నప్పుడు చాల నలిగి
కైకేయి సుతులెల్ల కనుకని చెదరఁ ♦ గైకొని వధియింపఁ గడఁగిన నంత
భరతుండు చూచి యీ పాపాత్మురాలిఁ ♦ గరిగొని పాపంబుఁ బొందనేమిటికి
పెనుపేది తల్లి జంపిన నీమలనుచు ♦ మనలఁ జూడఁగ రోయు మది రామవిభుడు
అటుగా నవలదని యతని వారించి ♦ యటుపోయి కౌసల్య యడుగులకెఱఁగి

—*: భరతుడు కౌసల్యయొద్దకుఁ బోవుట :*—

తానుదమ్ముఁడు నేకదండవ్యామాన ♦ మానసులై పలుమాఱలుఁ గత్తి
పలవింప నప్పుడా భరతునిఁ జూచి ♦ యలిగి కౌసల్య యిట్లని దూఱఁ బలికె
పతిఁ బాసి సుతుఁ బాసి బహుళదుఃఖముల ♦ మతిమాఱి శోకింపమఱిఁ దగుఁగాక
నీకేల శోకింప నెలకొని యింత ♦ నీకోరినట్లెల్ల నీతల్లి చేసె
నన్న నీవింక రాజ్యము సేయుచుండు ♦ మనఁ జేతులు మోడ్చి యతఁడు భీతిల్లి
వెఱ వెక్కి దిగియున్న వేఁది కౌసల్యఁ ♦ గనుఁగొని వాక్కాయకర్మచిత్తముల
శ్రీరామునకుఁ గీడుఁ జేసితినేని ♦ ధారుణి నేనేల దలఁచితినేని
నేనుగైకతలంపు నెఱిఁగితినేని ♦ నేనొకకీడైన నాఁటిగితినేని

వినుమీమద్యంబు ద్రావినవానిగతికి ♦ పెనుపేదవిప్రుఁ జంపినవాని గతికిఁ
దెగి గురుపత్నిఁ బొందినవానిగతికి ♦ జగతిపైఁ దానోడి చనువానిగతికి
చెనఁటియై పసిఁడి ముచ్చిలువానిగతికి ♦ వెసఁ బసిగోహత్య చేసినవానిగతికి
న్యాయంబు దప్పిన నరనాథుగతికి ♦ నేయెడఁ గొండెగాఁ డేగెడుగతికి
శరణార్థుఁ బ్రోవని దురితాత్ముగతికి ♦ వరధర్మవిక్రయ వాంఛితుగతికి
గురువులఁ దిట్టిన కుటిలాత్ముగతికి ♦ నరయ స్వామిద్రోహి యగువానిగతికిఁ
దల్లిదండ్రుల దిట్టు తనయునిగతికి ♦ కల్లలాడెడు పాపకర్మునిగతికి
పరధనంబుల కాసపడువానిగతికి ♦ పరసతిఁ గలసిన పాపాత్ముగతికి
జనువాఁ డనిందుకు సాక్షి దేవతలు ♦ ఈపాపకర్మురాలిటు చేసెఁ గాక
యేచు రాముని కేల యెగ్గు గావించు ♦ నీనీచకర్మంబు లేదనే నేడ
వని యేడ్చు భరతు శోకాగ్నుల పొపుఁ ♦ గనుఁగొని కౌసల్య కడు భీతిఁ బొంది
యిటువంటి పుణ్యాత్ము నేఁ దూఱితిని ♦ అటుటాయసి పొక్కి కౌఁగిటఁ జేర్చి
భరతశత్రుఘ్నుల పై వ్రాలి తూలి ♦ పరితాపమొందుచుఁ బలవించుచుండె
నంత వసిష్ఠ సంయమి వారిఁ గొనుచు ♦ నంతఃపురంబున కడలుచుఁ బోవఁ
గనుఁగొనఁగా రాదు కైకేయి గన్న ♦ తనయుండు వీఁడని తనమీఁద నలిగి
పైనుపాఁ దయా ణిక్య పీఠిపై నొరిగి ♦ తనఁ జూడ నొల్లని తలఁపున నోసి ద్రి
కనుఁగవ మూసి వగితినున్న తండ్రిఁ ♦ గనుఁగొని భరతుండు కడుమూర్ఛఁ బొం
తెలిసి క్రమ్మఱఁ జూచి తీవ్ర పువగల ♦ వెలువరింపఁగ రాక విలపింపఁ దొడఁగె
వసుధేశ కేకయావనిపాలు చేత ♦ నసమాన మణి భూషణావళి నీకుఁ
గొనివచ్చినాఁడఁ గైకొనవొల్ల వేమి ♦ ననుఁ జూడ వది యేమి నా తప్పు లేము
కడుఁ బాపమతియైన కైకేయి గన్న ♦ కొడుకని ననుఁ జూడఁ గూడదో కాక
ధరణీశ యా సుమిత్రా పుత్రుఁ జూడు ♦
పురపురఁ బొక్కుచుఁ బొరలుచున్నాఁడు
కడఁగి నీహస్తపంకజములఁ బట్టి ♦ తుడవవే యిటకి శత్రుఘ్ను పై ధూళి
నితని కటాక్షపు మిన్నితోఁ బల్కు ♦ మిశఁపి గాఁ గిటఁ జేర్చు మితఁ డేమి చేసె
నీమంచితనమును నీదయారసము ♦ నీమొగమోటము నేఁ డెందుఁ బోయెఁ
గైకేయి నీబుద్ధిఁ గఁచెనే తండ్రి ♦ నీకిట్టి మరణంబు నేర్చునే కలుగఁ
జావ రేసృపులెందుఁ జత్తురుగాక ♦ లేవుగా కిట్టి యన్యాయంబు లెందుఁ
బడఁతులు బొప్పించి ప్రాణవల్లభుల ♦ నడుకరెయీయావుల దుగరు కాక
యీకష్టవర్తనం బేమిటఁ గడతుఁ ♦ జేకూరెసిఁక నేమి సేయుదు ననుచుఁ
బలుమాఱు విలపించు భరతునిఁ జూచి ♦ తెలిసి వసిష్ఠుండు తెఱఁగొప్ప బలికె
అనఘాత్మ మీతండ్రి యవని నంతయును ♦ వినుతింపఁ బదివేలేండ్లు నేలె

మనుమార్గనియతిధర్మములెల్ల జేసె ♦ గొనకొని మీయట్టి కొడుకులఁ గనియెఁ
గావున నీవు శోకము మానుమింకఁ ♦ గావింపు మగ్నిసంస్కారాదివిధుల
ననవుడు నౌఁగాక యనుచు మర్నాఁడు మునులరాజుల మహాత్ములఁ బిలుపించి
వలనొప్ప దశరథేశ్వరుకళేబరము ♦ కలఁగొని తీర్థోదకములార్చి తెచ్చి
వరవస్త్రభూషణావళులఁ గైసేసి ♦ తరమిడి వేదోక్తదానముల్ సేసి
వరఁగ విమానంబుపైఁ దెచ్చి పెట్టి ♦ యరుదైన మంత్రపూతాగ్నిఁ జేపట్టి
తనతమ్ముఁడును దాను దగ వసిష్ఠాది ♦ మునులతో భరతుఁడు ముందఱ నడువ
నావిమానమునకు నందందఁ గదిసి ♦ వావిరి యేడ్చుచు వగలఁ దూలుచును
ముసుకొని కౌసల్య మొదలుగాఁ గలుగు ♦ వనితలందఱుఁ గూడి పరుసనే తేర
సరయువు చేరువ శవభూమియందుఁ ♦ దిరముగా సొదఁ జేర్చి త్రేతాగ్నులునిచి
యొలసిన భక్తి వేదోక్తమార్గమున ♦ నెలకొని దశరథనృపతి దహించి
తగురీతి మఱి తిలోదకములు వోసి ♦ తగవుతోఁ బిండప్రదానముల్ చేసి
నగరికి వచ్చి యున్నతి భూసురులకుఁ ♦ దగఁ బితృప్రీతిగా దానముల్ చేసి
తెఱఁగొప్ప బండ్రెండు దినములు వలయు ♦ తెఱఁగుల నడిపి వర్తించుచో నంత
గొనకొని యిక్ష్వాకుకులగురుండైన ♦ మునివసిష్ఠుఁడు కార్యములు విచారించి
తానురాజన్యులు తగుమంత్రివరులు ♦ భానుసన్నిభతేజు భరతునిఁ జూచి
వరతేజ మీతండ్రి పరలోకమునకు ♦ నరిగె శ్రీరాముఁడు నరిగెఁ గానలకు
నుర్వికి రాజు లేకున్న కార్యములు ♦ నిర్వహింపఁగ రాదు నల్వురుప్రజలు
ధారుణి చలియించు ధర్మంబులణఁగు ♦ వైరులు మింతురు వర్ణముల్ గలయు
నరనియరాజకమై యుండఁ దగదు ♦ ప్రవిమలమతి నీవు పట్టంబుఁ బూను
మని బుద్ధి చెప్పిన నమ్మునినాథుఁ ♦ గనుఁగొని భరతుండు కరములు మొగిచి
యిదియేమి మునినాథ యింత మూఢుఁడనె ♦

మదినింత నెఱుఁగనె మాకులక్రమము
నన్నుఁ గానలఁ ద్రోచి యక్కటా నన్ను ♦ గన్నదండ్రిని జంపెఁ గడఁగి మాతల్లి
యింత చాలదె నాకు నింక రాజ్యంబు ♦ చింతింతునే యేను జెప్పకుమింకఁ
గైకేయి కొడుకని కడఁగి పల్కెదవు ♦ గాక యీతలఁపులు గలవె నాయందు
నిట్లున్న రూపున నేను మారాచు ♦ పట్టంబు గట్టెదఁ బ్రార్థించి తెచ్చి
కాకున్న మాయన్న కైకొన్న నియతిఁ గైకొందుఁ గాకొండు గలుగునే మాకు [యను

—:* భరతుఁడు రాముని వద్దకు బోవుట *:—

ననినిశ్చయము చేసి యపుడు మంత్రులను ♦ గనుఁగొని మాయన్న గానఁ బోవల
తెరువులు చక్కఁగా దిద్దింపుఁడఖిల ♦ పురజనులకు నేఁగ బాసఁగినరీతి
నెడనెడ విడుదు లనేకవస్తువులు ♦ కడుసముగ్రములుగాఁ గావింపుఁడనిన

ననుకూలమతి వార లట్లచేయించి ♦ ననుపమోత్సాహులై యమ్మఱునాఁడు
వందిమాగధులను వరమంత్రివరులు ♦ సుందరీజన రత్నసుకుమారవరులు
నవసహస్రములు దంతావళఘటలు ♦ జవనాశ్వకోటిలక్షయ శతాంగములు
నఱువదిలక్షలు నమితపదాతి ♦ తఱుచుగా నడువఁ నత్తఱిఁ బౌరజనుల
జనపదస్థుల నెల్ల జాతులవారి ♦ ధనరత్నరాసులు తగ వసిష్ఠాది [ఋషి
మునుల రాజుల మంత్రిముఖ్యులఁ గొనుచు ♦ తన తమ్ముఁడును దాను దల్లు లంద
ననువుగాఁ జతురంతయానంబు లెక్కి ♦ వెనుకరాఁ ♦ రశుఁ డవ్విధమున గదలి
పోయి గంగాతీరమున దండు విడియ ♦ నాయతభుజశీలుఁ డగు గుహుం డెరిఁగి
కడఁగి రామునిమీఁద గైకేయికొడుకు నడచుచున్నాఁడు సేనలతోడ ననుచు
నలవుమైఁ గోపించి నావ లాఁగించి ♦ బలములతో వచ్చి భరతుని కనియె
భరతు రాముఁడు రాజ్యపదము నీకిచ్చి ♦ యరుదుగా మునివృత్తి నడవుల నుండ
నీవు సేనలఁ గూడి నిజశక్తి మెఱసి ♦ పోవుచున్నాఁడవు పోలు నే నీకు
నేను రామునిబంట నే సంపనిన్నుఁ ♦ బోనీను నీ బలంబుల సంహరింతు
నడరి నీతోడఁ బోరాడి ప్రాణములు ♦ విడిచిన మరి రామవిభునిపైఁ బొమ్ము [కె
అని రోషమున గుహుఁ డాడు వాక్యములు ♦ విని భరతుఁడు నవ్వి విమలుఁడై కలి
బరమాత్ముఁడగు రాముఁ బ్రార్థించి తెచ్చి ♦

పరఁగ నయోధ్యకుఁ బట్టంబు గట్టఁ

బోవుచున్నాఁడ నా బుద్ధిలో నొండు ♦ భావించి నీ విట్లు పలుకంగవలదు
అనియు వనాతని కక్కునఁ జేర్చి ♦ తనమది పొంగుల నాతని చిత్త మెఱిఁగి
యనురక్తి భరతేశు నడుగుల కెఱఁగి యనుపమ వన్యంబులైన వస్తువులు
కనిదనియన బెక్కు కానుకలిచ్చి ♦ కొనిపోయి గుహుఁడు ను కాకుత్స్థుండు తొల్లి
విడిచిన చోటున విడిచి సంప్రీతి ♦ జడలు గట్టిన చోటు చని చని చూప
జనులును మునులును సచివులు దాను ♦ గనుఁగొని భరతుండు కడుశోకమంది
సీతరాముండును జేరి పరుండ ♦ నాతతతృణశయ్యలందుఁ గన్పడెడు
తఱుచైన కనకవస్త్రముల చిహ్నములు ♦ పొరిగనుఁగొని మదిఁ బురపురఁ బ్రాకి
ఘన శోకమును బొంది కడు దీనుఁడగుచు ♦

మును రాఘవుఁడు జటల్ మొనసి ధరించె

నెక్కడ నని భరతేశ్వరుం డప్పు ♦ డక్కడ కేమును ననువుగా జటలు
పసుపు చుమటిమఱ్ఱిపాలు దెప్పించి ♦ తన తమ్ముఁడును దాను ధరియించె జడలు
భరతుండు మఱునాడు బ్రాహ్మకకర్మ ♦ పరుడునై గుహుఁడు రాఁ బన్నించినట్టి
యేనూఱుబలునావ లెక్కి వేవేఁగ ♦ దానుదల్లులు మునుల్ తగ మంత్రివరులు
సకలసేనలు గూడ జాహ్నవి దాటి ♦ యకళంకుఁ డగు గుహునప్పుడు దోడ్కొనుచు

నతఁడుచూపినత్రోవ నటఁబోయిపోయి ♦
క్రతుహోమ తతధూమ కబళితవ్యోమ
కృతకాంబుదస్తోమ కేవలముదిత ♦ కృతలాస్యశిఖిపిన బర్హిణబర్హజాల
రచితాంతరాంతరరత్నవిచిత్ర ♦ ఖచితోరణపదక్రమమునై యొప్పు
నాభరద్వాజసంయమి యాశ్రమమున ♦
నాభరతుఁడుపోయి యనతిదూరమునఁ
జతురంగబలములఁజతురతనిలిపి ♦ యతులపుణ్యాత్మకుండగుభరద్వాజుఁ

—:* భరతుఁడు భరద్వాజాశ్రమంబుఁ జేరుట *:—

గనిభక్తితో నమస్కారముల్సేయఁ ♦ గనియమ్మహాముని కడునల్గిపలికె
భరతయీచతురంగబలములఁగొనుచు ♦ భరితపన్నాహసంభ్రముడవైనీవు
కడుశాంతవృత్తిరాఘవుఁడరణ్యములఁ ♦ బడియుండ నాతనిపైఁబోవనేల
ననుచున్నమునికోపమంతయునెఱిగి ♦ వినతుఁడైభరతుండు వెఱచుచుబలికె
జానకీవల్లభ సకలరాజ్యంబు ♦ పూనుము నీవని పోయెదఁగాని
యొండుభావమున బోనోమునినాథ ♦ కొండుగాదలపకు ముల్లంబులోన
ననినసంతోషించి యమ్మునిబలికె ♦ ననఘాత్మనీవు నీయఖిలసైన్యములు
మనమార నాయాశ్రమమునను నేడుండి ♦
వినుతి మేకొనరించు విందారగింపు
మనివిశ్వకర్మను నటకురప్పించి ♦ ఘనచిత్రపురియొండు గల్పించియందు
వారువీరనకెల్ల వారికిదగిన ♦ మేరలనిండ్లు నిర్మింపుమీవనిన
నైదుయోజనములనతఁడొక్కపురము ♦ భూదేవిచరణనూపురమునిర్మించె
నందుగాంచన మయఁబౌనొక్కరాజ ♦ మందిరంబమరెతన్మందిరంబునను
శ్వేతాతపత్రోరు సింహాసనమున ♦ జాతురినొకసభాసదన మింపొందె
నప్పుడుమునియాజ్ఞ నవభరతుండు ♦ విప్రైవగృహముప్రవేశించియందు
సింహాసనముగాంచి శ్రీరామనృపతి ♦ సింహాసనంబంచు జేతులుమొగిచి
యాసమీపంబున నపుడొక్కబీఠి ♦ నాసీనుఁడై మిత్రులందఱుగొలువ
నున్నచోమునియాజ్ఞ నొక్కటవచ్చి ♦ కిన్నరగంధర్వ ఖేచరాంగనలు
నచ్చటనచ్చర లాటలుపాట ♦ లచ్చెరువుగజూపి రతనిసన్నిధిని
నీరీతిసకలజనా వళియుండ ♦ నారూఢిపెలసె నాట్యప్రసంగములు
నిలమీఁదదివిమీఁద నేయేవిశేష ♦ ములుకలవన్నియు మునియాజ్ఞవచ్చె
జానపదులొప్పారజనముల దరుసు ♦ స్నానముల్ కావించి చలువలుగట్టి
మందారపుష్ప దామంబులుబూని ♦ చందనంబలరి భూషణములుబెట్టి
వేవేలతెఱగుల వింతగావేల్పు ♦ టావుచతుర్విధా హారంబులొసగ

బరితృప్తులై దివ్య భామలుదమకు ♦ సురతవిశేషముల్ సొక్కుచు దెలుప
జన్మసాఫల్యంబు సమకూరెననుచు ♦ దన్మయావస్థలఁ దగిలి క్రీడింప
నమ్మునియాశ్రమం బటుచూడనొప్పె ♦ నిమ్ములనాస్వర్గ మేవగింపుచును
గరితభరతేశుఁ డెల్ల సైన్యములు ♦ నాఋషిబాగడుచు నారాత్రి దీర్చి
మరునాడుపురము లిన్మందిరావళులు ♦

తెలిగంటిచెలులు సదృశ్యమాటయును

భరతుడత్యాశ్చర్య భరతుఁడై యుండి ♦ వరతపోనిధి భరద్వాజుని జేరి
ప్రణమిల్లి మీతపోబలమహాత్మ్యములు ♦ ప్రణుతింపతరమె మాయాపర మేష్ఠికైన
నేనికరఘురాము నినకోటిధాము ♦ గానబోయెదనంచు గన్నదల్లులను
సవ్వేళ మ్రొక్కింప నతఁడు వీరెవ్వ ♦ రెవ్వరు వేర్వేర నెరిగింపుమనుడు
ధీరాత్మ నృపు పెద్ద దేవులై యెల్ల ♦ వారిలో వాసియు వన్నెయుగాంచి
కడుపుచల్లఁగ రాముగాంచియువగల నుడుకుచున్నదితద్వియోగాగ్ని శిఖల
బరిచితజన్మ సాఫల్య కౌసల్య ♦ పరికింపుమిదె మని పతిసార్వభౌమ
కౌసల్యపతి రామ కరమంటఁ బట్టి ♦ కైసేతలుడిపోయి గతపుష్పకర్ణి
కారశాఖయుబోలికై వ్రాలియున్న ♦ యీరాము శ్రీరాము నెడబాయలేని
యీలక్ష్మణుని గన్న యట్టిపుణ్యాత్మ ♦ రాలు సుమిత్ర పరాకుమునీంద్ర
యీతల్లికై కాన కేగె మాయన్న ♦ యేతల్లికతముని నీల్గెమాతండ్రి
యేతల్లికోర్కె నన్నింతకుదెచ్చె ♦ యీతల్లి మాతల్లి హితపుణ్యపాక
కైక గన్గొనుమంచు గద్గదకంఠు ♦ డై కడపటశోక మగ్గలంబైన
నూరక యున్నచో నూరార్చి యతని ♦ నాఋషి భావికార్యము జూచిపలికె
యీకైక లోకైక హితముగావించె ♦ మీకెల్ల తెల్లమా నటమీదననుచు
మరిరాముడున్నట్టి మార్గంబు దెలిపి ♦ తెరగొప్పనమ్ముని దీవింప వెడలె
సింధురబృంహిత సేనానులాప ♦ సైంధవహేషిత స్యందననేమి
రవములకళికి యరణ్యమృగాళి ♦ తివిరినభీతి నల్దెసలకు బార
బలరణోద్ధూత పాంసుసంఘాత ♦ మలినీకృతాదిత్య మండలుండగుచు
నాచిత్రకూటాద్రి కర్థితో భరతు ♦ డేచి సేనలుదాను నేగుచో నంత
నటచిత్రకూటాద్రి యందు రాఘవుడు ♦ కుటిలకుంతలిసీత గూడి మోదమున
గనుగొంటివే యున్నగంబు బింబోష్ఠి ♦ కనుదమ్మిదల విందుగావించెమనకు
నిన్నగమహిమ మదా నెన్నగవశమె ♦ పన్నగపతికైన భామాలలామ
గురుతైన సెలయేర్ల ఘుమఘుమధ్వనులు ♦ ఉరుముటంచు బెల్లుబ్బినీకురులు
పురడింపదనగొప్ప పురివిచ్చి నెమలి ♦ పారిపారియాడెడు బూబోణిచూడు
కాంతరో చెంచు కాంతలగంటె ♦ దంతికుంభంబులు దమచన్నుగవకు

నెనవచ్చునిట్లని యిభకుంభదళన ♦ మొనరించితన్మణులొప్పద్యాల్పెదరు
దివ్యులసంకేద దేశంబుగాన ♦ దివ్యవాసనలు సంధించనీకోవ
పదతలలత్తుక భాసుర బైన ♦ పొగజూడగంధర్వ భోగ గేహంబు
కిన్నరకంఠి యీగిరి గహ్వరంబు ♦ కిన్నరకిన్నరీ గీతసద్గోష్ఠి
కలకంఠరవ సహకారపల్లవము ♦ కలకంఠియీ సహకారంబు
పరిపరివిధమ తోబరువంపువిరుల ♦ పరిమళంబులు కదంబముగ
మలయానిలుండు కోమలయావలీల ♦ మలయుచున్నాఁడిదె మన
యల్లదెచూచితె హల్లకనికర ♦ ఫుల్లకైరవకుంజ పుంజరంజితము
సాలతమాల రసాలతక్కోల ♦ తాళహింతాల కుద్దాలకూలయును
అమలినపులిన మధ్యాసనాసీన ♦ సముచితమునిబృంద సందీప్తమైన
మందాకినీనది మణికన్నులలరె ♦ మందయానవిలాస మధితమ
యనియనిపలుకుచు నవనీరుహాముల ♦ గనుపట్టుపాదరిండ్ల ఘనకం
శైలశృంగంబుల సానుదేశముల ♦ నోలివినోదింపు చున్నచోఁగదగి
బలువిడిచనుదెంచు భరతసైన్యముల ♦ కలకలస్వనము లాకర్ణించిబెట్టు
కలగినల్లడబారు కరివరాహాది ♦ బలుమృగంబులజూచి బలధూళిజూచి
యిటధూళిదిని బర్వనేమికారణము ♦ యటబోయియరసి రమ్మనిలక్ష్మణుడు
వేవేగనొకమహా వృక్షాగ్రమెక్కి ♦ భావించియుత్తర భాగంబునందు
బలములుఁపొడగాంచి భానువంశజుల ♦ బలుబిరుదులతోడ పడగలుగాంచి
యిచ్చలోభరతేశు డిటరామమీఁద ♦ వచ్చుచున్నాఁడని వడినిశ్చయించి
పటువజ్రముద్రిపై బనుభంగిదోప ♦ జటులసత్వమున వృక్షము డిగ్గనురికి
దారకరోష దుర్వారుడై వచ్చి ♦ యారామవిభుజూచి యనియెలక్ష్మణుడు
అడవికినిన్నుబో నడచినీరాజ్య ♦ మడరియంతయుగొని యంతటబోక
ఘనశక్తినీమీద కైకేయికొడుకు ♦ చనుదెంచుచున్నాడు సబలుడైనేడు
యదెజూడుకోవిదా రాదిధ్వజ బు ♦ నదెచూడుభటుల వీరాలాపములును
శరచాపకవచముల్ సరిబూనినీవు ♦ భరతునికెదురుగా బలువిడినడువు
నిలువుముకాదేని నీవుసీతయును ♦ దొలగుమునీశాంతి తుదినింతజేసె
యేనింకసైరింప నిటవచ్చెనేని ♦ వీనిజంపెదనన్న వినిరాముడనియె
నాకుదమ్ముడవయ్యు నాతోడబుట్టి ♦ నీకిట్టియవినీతి నీకేలపుట్టె
భ్రాతృవత్సలబూర్ణి పరమపావనుడు ♦ నీతికోవిదుడు మానితధర్మపరుడు
భరతుండునీకంటె భక్తుండునాకు ♦ భరతునిదెసనొక్క పాపంబులేదు
సురలనయోధ్యకు మగుడ బ్రార్థించ ♦

చనుదెంచుచున్నాడు సందేహముడుగు

కడవకుమనుడు రాఘవునాజ్ఞ పెంపు ♦ కడవభీతల్లి లక్ష్మణుడూరకుండె
భరతేశుడంతట బౌరులహితుల ♦ దొరలసమస్త యోధులనొక్కచోట
విడియించితల్లులు వెనకతోఁ దేర ♦ గడకవసిష్ఠుని గట్టడచేసి
గురుభక్తిసూతుండుగుహుడుతోడుగను ♦ నరిగితమ్ముఁడుదానునగ్గిరియెక్కి
వరుసనయ్యడవి త్రోవలు తెలియుటకును ♦ గరమర్థి సౌమిత్రి గట్టినచుట్టి
గురుతులుగొన్ని కన్గొనుచునల్లడల ♦ నెఱిపరికింపుచు శిఖలాస్త్రశస్త్ర
జాలపాలితనూత్న శాలాంగణముల ♦ జాలచెన్నగుపర్ణశాలకేతెంచి
మునివేషమునజాలముదమందు రాము ♦ కనుగొని మాత్మలోఁగడగిశోకించె

—:* భరతుడు మునివేషధారులైన రామలక్ష్మణుల పొడగాంచుట *:—

పొలుచుకాంచన గృహంబులనుండువాడు ♦
లలిదూలి పర్ణశాలల నున్నవాడు
పొగడొందు పూలపాన్పుననుండువాడు ♦ జగతిపై భూరి సజ్జనునున్నవాడు
నెరసికిరీటంబు నెఱిదాల్చువాడు ♦ తరుచైన జడలర్థి దాల్చియున్నాడు
వోలిరాజులుగొల్వ నుండెడివాడు ♦ లోలతమృగముల లోనున్నవాడు
మేలిచందనమును మెయిబూయువాడు ♦
ధూళిధూసరితుడై తూలియున్నాడు [డు
మొనసిదివ్యాంబరంబులుబూనువాడు ♦ మునివృత్తివల్కలంబులుగట్టినా
రసరసాన్నమువిూర భుజియించువాడు ♦
కసరుగాయల బ్రొద్దుకడపుచున్నాడు
చూచితే శత్రుఘ్న శుభమూర్తిరాము ♦ డీచందమున దుఃఖమీదుచున్నాడు
కైకేయిపాపంపు గడుపునబుట్టి ♦ యీకష్టదుర్దశ నేజూడగలిగె
ననుచుదమ్ముఁడు దానా రామవిభుని ♦ గని మ్రొక్కుటయు వారిగౌగిటఁజేర్చి
కన్నులహర్షాశ్రు కణములుదొరుగ ♦ వెన్నులు నివిరి భావించిదీవించె
అహిమాంశుకులునకు నాసుమంతుండు ♦
గుహుడు మ్రొక్కిరి భక్తి గొనసాగ నపుడు
ధరణిజకును సుమిత్రాతనూజునకు ♦ భరతశత్రుఘ్నులు ప్రణమిల్లి కొలువ
గుశలోక్తముల నెల్ల గోరి రాఘవుఁడు ♦ దశరథుసేమంబు తల్లులశుభము
పలుమారునడుపుచు భరత యేవేల ♦ యిలయేలకింత దవ్వేగుదెంచితివి
భూతలాధీశు పంపునరాజవగుచు ♦ నీతితోఁ జేయుదే నీవు రాజ్యంబు
దశరథేశునకు సత్యప్రకాశునకు ♦ విశదపుణ్యునకు గావింతువే పూజ
తల్లుల నెల్ల నాదరముల్లసిల్ల ♦ నుల్లంబు చల్లగా నూరడింపుదువె
కోవిదముత్కుల గురుతపోనిష్ఠు ♦ నావసిష్ఠుగరిష్ఠు నర్చించి నీవు

అగ్నిహోత్రముల సంధ్యాకాలనియతి ♦ భగ్నంబుగాకుండ బాలింతె నీవు
సుజనులామంత్రుల చొప్పెల్ల దెలిసి ♦
విజయుంబు నామంత్ర విధియెఱుంగుదువె
యపరరాత్రులలేచి యర్థచింతనము ♦ నిపుణతఁ జేయుదె నీవునిత్యంబు
నరసియుత్తమ మధ్యమాధమజనుల ♦ వెరపుతో బనిగొంతువే తగినట్లు
తనవారియెడనైన దగవునదండ ♦ మనురక్తిజేయుదె యపరాధమెరిగి
మతిమంతుసకలసమ్మతుస్వామిహితుని ♦ వితతవిక్రముసైన్యవిభుఁ జేసినావె
కొలిచినవారికిఁ గోరిజీతములు ♦ నిలువఁగాకుండ నిచ్చలునొసంగుదువె
చారులవలనరాష్ట్రములవర్తనము ♦ వైరుల తెఱఁగుసర్వము నెఱుంగుదువె
జాలిఁదూలెడి పేదసాదల మొదలఁ ♦ వాలాయముగ విందువా గర్వముడిగి
యర్మిలివర్ణాశ్రమాచారవిహిత ♦ ధర్మంబులరయుదె తడఁబడకుండఁ
జోరులజారుల సుడియంగనీక ♦ వారలదండింతె వదలకపట్టి
చతురంగబలముల సన్నాహపటిమ ♦ నతియుక్తిఁజూతువె యప్పటప్పటికి
ధనధాన్యవస్తుసద్భటసమేతముగ ♦ మునుపుగాఁ గడిదుర్గములనుంచినావె
యన్యాయమును సేసియర్థముల్గొనక ♦ మాన్యతఁ బ్రోతువె మఱికాపుజనుల
నర్థలోభమున విప్రాగ్రహారముల ♦ నర్థమెత్తవుగదా యరవీసమైన
నెపుడుగోబ్రాహ్మణ హితముఁగోరుచును ♦ నిపుణుండవై ధర్మనిష్ఠనుండుదువె
శక్తిత్రయంబును షడ్గుణంబులును ♦ శక్తిపంచాంగముల్ చతురుపాయములు
పదునాల్గురాజ పాపంబులు దెలిసి ♦ సదయుఁడై మనుధర్మశాస్త్రసంగతిని
దేవతాపితృమహీ దేవతాపూజ-గావించిస్వర్గంబుఁ గాంచుభూవిభుఁడు
నీవునునారీతి నీతిరాజ్యంబు ♦ గావింతువేయుంచు కాకుత్స్థుఁడడుగఁ
గరములుమొగిచిగద్గదకంఠుఁడగుచు ♦ భరతుండురామభూపతి కిట్లనియె
నీధర్మసరణి నాకేదియుఁ దెలియ ♦ దోధర్మనిపుణ యింకొకవార్తవినుము
నృపకులాధీశ్వర నిన్నుఁగానలకుఁ ♦ గృపమాలిపిలిచి కైకేయిపొమ్మనిన
దడయకమీరిటు తాపసవృత్తి ♦ నడవికివిచ్చేయ నలియాదిగాఁగ

—*: దశరథునిమృతి రామలక్ష్మణు లెఱుంగుట :*— [దు

వలతలఁదూలియేడవ నాఁడుమిమ్ము ♦ దలచుచుమృతుఁడయ్యె దశరథేశ్వరు
ఏనునుపితృమేధ మెల్లనుజేసి ♦ కానలమీరుండఁ గానవచ్చితిని
అనుపల్కునిర్ఘాత మైనవచ్చిరామ ♦ జననతిమూర్ఛిల్లి జగతిపైవ్రాలె
మేదినీసుతయు సౌమిత్రియుఁదూలి ♦ మేదినిఁవ్రాలిరి మృతులైనపగిది
నొలసినధృతిరాముఁడొక్కింత దెలిసి ♦ పలుమాఱువిలపింప భరతుడిట్లనియె
గృతిమతివయ్యుప్రాకృతునిచందమున ♦ నతిశోకమును బొందనగునయ్య నీకు

దేవలతర్పణుఁడు వై దేహియుమీరు ♦ వేవేగదశరథోర్వీనాథమణికిఁ
బరలోకవిధులెల్ల భక్తితోఁ జేయుఁ♦డరయంగనది యుక్తమనిన రాఘవుడు
మందాకినికివచ్చి మదినిష్ఠ వెలయ♦నందుఁగృతస్నానుఁడై తండ్రికపుడు
మొనసితిలోదకములు వోసి వగలు ♦ పెనఁగొనమరిగార పిండిచేఁబుణ్యా
ధనులర్థిఁ బిండప్రదానము ల్చేసి ♦ ఘనతరశోకసంకలితుఁడై మగుడి
సన్నుతిగతిఁ బర్ణశాలకే తెంచి ♦ యున్నచో రఘురాముఁ డున్నసన్నిధికిఁ
బౌరవర్గముతోడ బంధులతోడఁ ♦ జారువర్తనులైన సచివులతోడ [ను
ఘనుఁడు వసిష్ఠుండు కౌసల్య మొదలు♦జనులఁదోడ్కొనిచను దెంచుటయు
నూనినశోకాగ్ని లోలుక రాఘవుఁడు♦తానుసీతయుసుమిత్రాతనూజుండు
వారియంఘ్రులమీఁద వ్రాలిశోకింప ♦ వారునుశోకింప వారించెనంత
నావసిష్ఠమునీంద్రుఁ డమలవాక్యముల♦నావేళ కౌసల్య యువనినందనను
వనవాసకలిత విపర్ణాంగిఁ జూచి ♦ తనమదివిధిఁ దూరి తద్దయుఁ బొగుల
గిరిమీఁదవర్తించు కిన్నరయతు ♦ గరుడోరగామర కాంతలు వచ్చి
రామునిసతి దశరథరాజుకోడ♦లిమ్మగ జనమహీప లుపుత్రి [ధికిఁ
వివిధసంకటములవేఁగుచున్నదియు♦భూజోద్యములుగా వెపోఁతియావి
ననసీతఁ బేర్కొని యారామచంద్రుఁ♦డనఘుడై వసిష్ఠు నడుగుల కెరఁగి
జననులచుట్టాల సచివులహితుల♦మును నుగుశపీఠములనుండఁ బనిచి
తనతమ్ముఁడును దానుదర్భాసనముల♦జనలోచనోత్పలచంద్రుఁడై యుండ
నావేళ భరతుని యాకృతిఁ జూచి ♦ యోనత్సజడలునునురువల్కలము లు
నేలతాల్చెదు నృపునాజ్ఞఁ బూని ♦ వేవేగ జనమహీ విభుఁడవై యుం డు
మనిపల్కుటయు రాము నాననాంబుజముఁ ♦

గనుఁగొని భరతుండు కరములు మొగిచి
దేవరాఘవకైక ధృతిదూలిమిమ్ము♦భావింప నేరక పాపంబుచేసి
యడవులనుండుపొమ్మన్న మాటలకుఁ♦దడయక జనుదేరఁదగునయ్యమీకు
మిముఁ బాసిదశరథ మేదినీపతియు ♦ నమరలోకంబున కరిగెనీఘోర
పాపంబుమాతల్లి ప్రచరించెనరక ♦ కూపకోటులనింకఁ గూలకయున్న
దేనుమీఁదగు రాజ్య మిమ్ముల బూన ♦ గానేర నా చేతఁ గాదు భూనాథ
నీవయోధ్యకునింక నేఁడవిచ్చేసి ♦ పావనమతితోడ బట్టంబుఁబూను
వల్లభు నెడఁ బాసి వగలఁ బెల్లడలు ♦ తల్లులనూరార్చి తక్కినహితుల
సచివులఁ జుట్టాల సకలపౌరులను ♦ సుచరిత్రకృపతోడఁ జూచిపాలింపు
నన్నునీబంటు మన్నన జేసినాడు ♦ విన్నపంబాలింపవే దయామూర్తి
యనిపాదములవ్రాలియటు లేవకున్న ♦ తనదుతమ్ముని నెత్తికౌఁగిలించి

భరతనీవిది యేమి పాలుండవైతి ♦ కరుణఁ బల్కెడు ధర్మగతిఁదప్పనాడి
యీ కైకనేలపో నాడెమతండ్రి ♦ శోకకుసీ వేలఁ బొగిలెదీవేళ
ఘాకతోఁ నదిని గాష్ఠంబు కాష్ఠఁబు ♦ జోకమ్మైఁబాసిన చొప్పుదీపింపఁ
బుత్త్రమిత్త్రకళత్త్రములువాయడాయు ♦ మైత్త్రిఋణానుసంబంధరూపములు
నవనిపైఁ బుట్టిన యప్పుడెచావు ♦ ధ్రువముజీవునకని రూపింపవరుఁడు
తనకులోచితమైనధర్మమార్గమునమనినవాఁడిహపరమాన్యుఁడై యుండు
గావునమనతండ్రి కమనీయసత్య ♦ భావుఁడై నీతితోఁ బ్రజలఁ బాలించి
ఘనయాగదాన సత్కారముల్ పెక్కు ♦లొనరించిరాజ్య సౌఖ్యోన్నతిమించి
మనవంటితనయుల మనమారఁగాంచి ♦
జనలెల్లగొనియాడ స్వర్గమండయ్యె
నతనికై వగచుట యనుచితంబింక ♦ నతనివాక్యము మనమటుచేయదగదు
పితృవాక్యకరణంబు ప్రియధర్మమందు ♦
సుతునకునటుసేయ సుతుఁడువిశ్రుతుఁడు
వనములఁబదునాల్గు వర్షముల్ నన్ను ♦ మనరాజ్యభోగముల్ గైకొనినిన్ను
నుండఁగట్టడ చేసె నుర్వీశుఁడట్లు ♦ యందుదమిందుకు నొండాడవలదు
అని తెల్పుచోనంత నర్కుండుగ్రుంకె ♦ ననుపమప్రీతిమై నారాత్రిఁదీర్చి
మఱునాఁడుసంధ్యా సమాధులొనర్చి ♦ మఱివసిష్ఠాదులు మంత్రివర్గములు
విశదంబుగాఁ బరివేష్టించికొలువఁ ♦ గుశపీఠమున రఘుకుంజరుఁడుండె
నాసభామధ్యంబునందుండి భరతుఁ ♦ డాసమయంబున హస్తముల్మోగిచి
దేవమీయాజ్ఞతి తెలియఁగుననీతి ♦ భావించి పితృవాక్యపద్ధతిఁబుడమిఁ
గైకొంటినాభూమి కడపటయేను ♦ మీకిత్తునందు కేమియునవవలదు
సర్వసర్వంసహా చక్రభారంబు ♦ పర్వితాల్పఁగ ఫణిపతియోపుఁగాక
యసలడింపక జలవ్యాళిమెట్లోపు ♦ వసుధేశ యేనట్టివాఁడ బాలుఁడను
ఈధారుణీభార మేడనేనేడ ♦ సాధురక్షణమేడ చర్చించిచూడ [యట్లు
బాలార్కుచేనొప్పు ప్రథమాద్రియందు ♦ బోలింపమిణుగురు పురుగున్న
శ్రీనిధినీయందు సింహాసనమున ♦ నేనుండఁగనునట్టు నేభూమిప్రజకుఁ
గావునమాని లక్షణములుమాని ♦ నీవయోధ్యవచ్చి నీతివహించి
యెల్లవారలకోర్కు లీడేరరాజ్య ♦ మెల్లఁబాలింపు మీకేమియువనక
[illegible]నరునీవిటుచేయ నొల్లవైతేని ♦ విను మేసునీయొద్ద విడుతుఁ బ్రాణములు
కావునసౌమిత్త్రిగతి నిన్నుఁగొలిచి ♦ కాకుత్స్థతిలక యిక్కడనుండువాఁడ
ననిదర్భశయనుఁడై యవనిపైనున్న ♦
యనుజన్ముసెత్తి యిట్లనియెరాఘవుఁడు

ఇదియేమిభరత నీవిట్లాడఁదగునె ♦ మదిఁదలపోయవో మనతండ్రి యాజ్ఞ
దశరథేశునకు మీతల్లినిమున్ను ♦ విశదంబుగా నిచ్చువేళ మీతాత
నాకూఁతునకుఁగల్గు నందను నఖిల♦భూకాంతుగానీవుపూన్పుమీయనుచు
నమ్మికవడసి వెన్కనుబెండ్లిచేసె ♦ నమ్మాటపట్టున నసురదైతేయ
యుద్ధంబులోవిభుం డొసఁగినవరము ♦ బుద్ధిఁదప్పక కైక భూమీశు నడిగె
ధారణీశుఁ గాంతారంబునాకుఁ ♦ గోరినదశరథ క్షోణిపాలకుఁడు
సత్యంబుదప్పక జాడగావించె ♦ నిత్యకీర్తులు గాంచి నెగడెనిందందు
మనమునమనుజేంద్రు మాటపాటించి ♦
ఘనకీర్తిసుకృతముల్ గైకొందమెలమి
నరుఁగఁడేగయకొక్కఁడైనకన్యకనుబరఁగ దానముచేసివఱలఁడేయొకఁడు
విడువఁడేయొకఁడైన వృషభమటంచుఁ♦గొడుకులఁగాంచుటకోరిపితాళ్ళ
ధాత్రిఁబున్నరకసంత్రాతయౌకతన♦బుత్త్రుఁడైయొప్పునీపుణ్యంబులెఱిఁగి
యిరవందఁదండ్రి పల్కిటుసేయకున్న ♦
నరయఁదండ్రులమాట లవియెల్లసాగు
ధర 'యథా రాజాతథా ప్రజా' యనెడు♦నరుదార సామెతనరుఁడు దానరుగు
వరబుద్ధిగైకొన్న వ్రతమునిండించి♦యురుదెంచెదేను నీవాగ్రహంబుడుగు
నామాటలాలింపు నాపంపుమీఁద ♦ భూమికిఁబతిగమ్ముపురికింకఁబొమ్ము
అనినరావణుండింక నాజిలోఁ గూలుననినిశ్చయముఁ జేసిరందున్నమునులు
సురలుదిగ్వరులు భాసురధర్మనిరత♦భరతరామునిమాటపాటింపుమనిరి

—*: జాబాలియను ముని శ్రీరామునకు నీతిఁదెల్పుట :*—

యప్పుడుజాబాలి యనుమౌని రాముఁ ♦ దప్పకఁగనుఁగొని తగవేదిపలికె
రామయిదేమి నిరర్థకబుద్ధి ♦ నేమించిమునిపోలె నృపవేషముడిగి
రాజోపభోగిమా రాజ్యంబువిడిచి ♦ యీజాడనుండుట కేమికారణము
యెక్కడితలిదండ్రు లెక్కడిసత్య ♦ మెక్కడిసుతధర్మ మిదియెల్లకల్ల
తలిదండ్రులొంకొరుల్ తమసౌఖ్యమునకు ♦
కలయుచో శుక్లరక్తము లైక్యమొంది
యోజబిండాకృతినుదయించెనరుఁడు♦బీజమాత్రముతండ్రి పెక్కులైయింక
నిమురుకనారిపోయిన దీపమునకుఁ ♦ జముగవోసినయట్టు చచ్చిన యట్టి
వారికిఁబరలోక వైదికకర్మ ♦ మూరకజనులు సేయుటయువ్యర్థంబు
గావునన్నామాట గైకొనిరామ ♦ నీవయోధ్యకువచ్చినృపుఁడవై యుండు
మనియిట్లుజాబాలి యాడువాక్యములు♦వినికోపమున రఘువీరుఁడిట్లనియె
నిట్టినాస్తికబుద్ధి యెవ్వరికైనఁ ♦ బట్టిబోధింపు జాబాలిమునీంద్ర

మాకునూఁ బెద్దలే మర్యాదనడచి ♦ రాకై వడిమెలంగ నదియెసమ్మతము
సత్యమూలంబులు సకలధర్మములు ♦ సత్యంబుకంటె నెంచఁగధర్మమెద్ది
యట్టిసత్యముదప్పకనఘమాతండ్రి ♦ పట్టినధృతినన్నుఁ బనిచెఁగాఁనలకుఁ
గాననాతనియాజ్ఞ గడచినఁబుణ్య ♦ హీనుండ నాకన్న నితరుండుగలఁడె
సత్యంబుధర్మంబు శమముదమము ♦ నిత్యభూతదయయు నీతివిక్రమము
ప్రియవాక్యమును దేవపితృప్రపూజనము ♦
రయమొప్ప స్వర్గమార్గము లండ్రుబుధులు
ఇవియెల్ల గల్లగా నీవుబోధించి ♦ తవునవునీవెట్టి యగ్రజన్ముఁడవు
నిన్ననఁబనియేమి నిన్నునాస్తికుని ♦ మన్ననవరసిన మాతండ్రిననట
యనిరామవిభుఁడాడు నట్టివాక్యములు ♦ విని బ్రీతిజాబాలి వెండియునని యె
నన్నునాస్తికనిగా నరనాథచంద్ర ♦ మెన్నితయోధ్య కేగ్లేనివిచ్చేసి
భూమియేలుదువను బుద్ధినిట్లంటి ♦ రామయోర్వుమటంచుఁ బ్రార్థనచేసె
నంతవసిష్ఠసంయమి సూర్యవంశ ♦ మంతియునిక్ష్వాకుఁడాదిగా నెన్ని
యనఘమిహీతలమున నగ్రజులుండ ♦ ననుజుండురాజౌట నరసినలేదు
కావునఁబెద్ద క్రమమునకునీవు ♦ భూవలయంబెల్లఁ బూనుట లెస్స
యెంతైనఁబితృవాక్య మీదాఁటననుచు ♦ నింతగానిశ్చయం బిట్టిదయేని
యాదటనినుఁగొల్చి నట్లనీదైన ♦ పాదుకాయుగళంబు భరతుండకొలిచి
నెమ్మదినుండెదు నీపాదుకంబు ♦ లిమ్మన్నదల్లులు హితులు నాశ్రితులు
పౌరులుమంత్రులు బాంధవులప్పు ♦ డారామయిటుసేయుటుచితమటంచు
బలుకంగ వేవేగ భరతుండు హేమ ♦ విలసితపాదుకాద్వితయంబు రాము
ముందరనిడిన సంఫుల్లారుణార ♦ విందపల్లవగర్భ విధవభేదములు
యతివధూతికల శాపనోదములు ♦ శ్రుతిశిరోభవన విశ్రుతవినోదములు
తనదుపాదములు సంతతసనకాది ♦
మునివివాదములు రాములుమోపి మెసఁగ
జేకొనియవిరెండు శిరమునఁదాల్చి ♦ కైకేయికొడుకుఁ రాఘవునకిట్లనయె
నీవేషమున నేను నృపవేషముడిగి ♦ తావకపాదుకాద్వంద్వంబునందు
బదిలంబుగారాజ్య భారంబుమోపి ♦ పదునాల్గువర్షముల్ పాలించువాడ
నామీఁదమీఁర యోధ్యకురాక యున్న ♦ స్వామిపాదములానవహ్ని యేజొత్తు
ననిపల్కియన్నకు నతిభక్తి మ్రొక్కి ♦ వనజునిదీవించి యక్కున జేర్చి
తల్లులనూరార్చి ధన్యులౌమాని ♦ వల్లభులనుమంత్రి వరులబాంధవుల
నెల్లవారలప్రియంబెలగవీట్కొలుప ♦ నుల్లంబులోశోకముప్పొంగు చుండ
భరతుడప్పుడు రాముపాదుకంబులకు ♦ సరిప్రదక్షిణ నమస్కారముల్ జేసి

పట్టంపుటేనుంగు పైనొప్పదెచ్చి ♦ పెట్టలోకములెల్ల ప్రీతిగీర్తింప
ఛత్రచామరములు సరిదాల్చిపాలిచి♦శత్రుఘ్నుడును దానుసద్భక్తిగొలిచి
చలఁగినల్దిక్కుల సేనలుగొలువ ♦ గులపవిత్రుడు చిత్రకూటంబుడిగ్గి
యిబ్బంగిభరతేశు డింపారనరిగి ♦ యబ్బరద్వాజుని యడుగులకెఱగి
యతనితోనట్టి వృత్తాంతంబుదెలిపి♦యతడంతబనుప సైన్యంబులుదాను
నటపోయిగంగా మహానదిదాటి ♦ యట్రిశృంగిబేరంబునందు నాగుహుని
పటుయశోధనునిసంభావించినిలిపి యటపోయిమరియయోధ్యాపురిజొచ్చి
తడయకనగరిలో తల్లులనునిచి ♦ కడుమూలబలముల గాపుగాబెట్టి
మణిలేని పెట్టియమాడ్కి నాకాశ ♦ మణిలేనిపగలింటిమాడ్కి చూడ్కికిని
చతురపుణ్యుడు రామచంద్రుడులేని ♦

యతిశూన్యమగు నయోధ్యాపురిజూచి
యాయతశుభశీలు డందుండరోసి ♦ పోయినందిగ్రామ పురినివసించి
పనిపడిరఘురాము పాదుకాయుగళి♦ మునరాజ్యభారమిమ్ములనావహించి
శ్రీరామునకుబోలె సేవసేయుచును ♦ నారచీరలుజడల్ నవయుచుదాల్చి
యారాఘవుని పునరాగమనంబు ♦ గోరుచునతని సద్గుణములెన్నుచును
సరససజ్జనమంత్రి సమ్మతితోడ♦భరతుండుమహియెల్ల పాలింపుచుండె [క
యిదియయోధ్యాకాండమెల్లలోకములవిదితమైబుధలోకవినుతమహాగా
అనియాంధ్రభాష భాషాధీశవిభుడు♦వినుతకావ్యాగమ విమలమానసుడు
పాలితాచారుడ పారధీశరధి ♦ భూలోకనిధిగోన బుద్ధభూవిభుడు
తమతండ్రివిట్ఠల ధరణీశుపేర ♦ గమనియ్యగుణధైర్య కనకాద్రిపేర
బనిబూనియురిగండ భైరవుపేర♦ఘనుపేర మీసరగండనిపేర
నాచంద్రతారార్కమైయొప్పమిగిలి♦భూచక్రముననతిపూజ్యమైవెలయు
నసమానలలిత శబ్దార్థసంగతుల ♦ రసికమైచెలువొందు రామాయణంబు
పరగనలంకార భావనల్నిండ ♦ కరమర్దినయోధ్య కాండంబుజెప్పె
నారూఢినాష్కేయుమై యాదికావ్య ♦ మైరసికానందమై యలనాఁడు
నివ్వసుమతినొప్పు నీపుణ్యచరిత ♦ మెవ్వారుచదివిన లెవ్వారువినిన
సామాదిబహువేద చతురాననామ♦నామచింతామణి నవ్యభోగములు
పరహితాచారముల్ ప్రభువిచారములు ♦

పరిపూర్ణశక్తులు ప్రకటరాజ్యములు
నిర్మలకీర్తులు నిత్యసౌఖ్యములు ♦ ధిరైక్యనిష్ఠలు దానాభిరతులు
ఆయురారోగ్యంబులైశ్వర్యములును♦బాయనిశుభమును బాపక్షయంబు
వరపుత్రలబ్ధియు వైరినాశనము♦సరినొప్పుధనధాన్య చయసమృద్ధియును

యేవిఘ్నములు లేక యిండ్లలోనధిక ♦ లావణ్యమతులైన లలనలఁబొందు
కొడుకులతో నెపుడు గూడియుండుటయు ♦
నెడగాఁగనాపద లెల్ల బాయుటయు [టయు
సమ్మదంబున బంధుజనుల గూడుటయు—నిమ్ముల సౌఖ్యంబు లెపుడు గూడు
సతతంబు దేవతా సంతర్పణంబు ♦ పితృగణతృప్తియు బెంపారుచుండు
నిది మోక్షసాధనం బిది పాపహరము ♦ ఇది దివ్యమిది భవ్యమిది శ్రీకరంబు
వ్రాసినవారికి వరశుభోన్నతులు ♦ వాసవభోగాధి వాసులఁజేయు
నెందాఁక కులగిరు లెందాఁక తార ♦ లెందాఁక రవిచంద్రు లెందాఁక శిఖలు
యెందాఁక వేదంబు లెందాఁక ధరణి ♦ యందాఁక భువనంబు లేపుదీపించు
నందాఁక యీకథ యక్షరానంద ♦ సందోహదోహళా చారమైబరగు

అయోధ్యాకాండము - సంపూర్ణము

———

శ్రీరస్తు

# శ్రీ రంగనాథ రామాయణము

## ఆరణ్యకాండ ప్రారంభము

—: * :—

శ్రీచిత్రకూటమా చిత్రకూటమున ♦ వాచంయమశ్రేణి వర్ణింపనుండి
యంత రాముడు భరతాగమనంబు ♦ చింతించి యచట వసింపరాదనుచు
నిచ్చట నేనున్న నెల్లపౌరులును ♦ ముచ్చటబడి దినంబును వత్తురనియు
దంతిరథాశ్వపదాతి వర్గముల ♦ నెంతయుఁ గాసిల్లె నీవనంబనియు
ఖరదూషణాదిరాక్షసకోటి బాధ ♦ పరిహరింపుమటంచు బరమసంయములు
చెంతలఁ జేరి సూచించి నారనియు ♦ జింతించి యరుగనాఁడు చిత్రకూటాద్రి
మునులపీట్కొని యత్రిముని యాశ్రమమున ♦
కనురాగమున నేగ నమ్మహామౌని
తనశిష్యులును దాను దగ నెదురేగి ♦ కొనిపోయి పలుతెఱంగుల బూజఁజేసి
నమ్మునిపత్నియు ననసూయ ప్రీతి ♦ యమ్మహీతనయకు నాతిథ్యమొసగి
తెఱఁగొప్పఁగొన్ని పతివ్రతాగుణము ♦ లెఱిఁగించి రఘురాము నెడబాయలేక
తనబంధుజనుల నందఱ నెడబాసి ♦ వనముల కా సీత వచ్చుటబాగడి

పిమ్మటననసూయ ప్రీతితోడాను ♦ నమ్మహితనయకు నంగరాగములు
వాడనిపువ్వులు వకుసదోడ్తోడ♦కూడమాయనిమణులంగులు తానొసంగి
రమణినిన్ను స్వయంవరమున రాఘవుఁడు ♦
క్రమమొప్పగైకొన్న కథ జెప్పుమనిన
జిలిబిలిసిగ్గును చిరునవ్వుదొలుక ♦ బలికెజానకి తనపతినివీక్షించి
వివమ్మమిథిలకు విభుడై నయట్టి ♦ జనకుతొక్కడె యాగశాలదున్నింప
గలిగితినేనది కారణంబునను ♦ కలితసీతానామకమున నొప్పితిని
అనపత్యుడౌట నయ్యవనిపాలకుడు♦దయమీరనన్ను మోదంబునబెనిచె
నంతయవ్వనవతి యగునన్నుజూచి ♦ చింతించితనయింటి శివునిచాపంబు
యెక్కుబెట్టినవాని కెలమిబెండ్లిక్కి♦నిక్కన్యకామణి నిత్తునేననుచు
వరబుద్ధితో స్వయంవరముచాటింప ♦ ధరణినాయకులెల్ల మిథిలకువచ్చి
శైలజారమణుని చాపమెత్తంగ ♦ చాలమోపెట్టంగ జాలకచనిరి
యంతరాఘవుడు విశ్వామిత్రుకొలిచి ♦ కొంతకాలంబునకును నటవచ్చి
కరియిక్షు కాండంబు ఖండించినట్లు ♦ హరువిల్లువిఱచి చయ్యనవరియించె
ననితనపెండ్లి వృత్తాంతమంతయును ♦వినుపింపననసూయవిని ముదమందె
అప్పుడురవి పశ్చిమాంబుధిమునుగ ♦ దప్పకసాంధ్యకృత్యము లెల్లదీర్చి
శ్రీరాముడత్రి పూజింపసగ్గోష్ఠి ♦ నారాత్రిగడపి సంధ్యాక్రియల్‌దీర్చి

—— * : శ్రీరాముడు దండకారణ్యమునకు బోవుట : * ——

ముదమొప్ప నయ్యత్రిముని వీడుకొలుప ♦
కదలియమ్మరునాడు కమలాప్తకులుడు
సరళతాళతమాల సాలహింతాల ♦ కురువకాగరువటకుట జగణ్యంబు
చండాంశునిభవకాని జనశరణ్యంబు ♦ గండకహర్యక్ష గవయవేదండ
గండభేరుండాది ఖగమృగోదగ్ర ♦ దండకారణ్యంబు దరియంగజొచ్చి
వేదనాదములచే విస్తారమహిమ ♦ వేదులచేత బవిత్రంబులైన
పర్ణశాలలచేత పవనాంబుజీర్ణ ♦ పర్ణాశులగుచు దపంబుగావించు
మునులచేమిగుల సమున్నతినొప్పు ♦ జననుత తాపసాశ్రమములుపెక్కు
కనుగొంచువారలు గావించుపూజ ♦ లనురక్తిగైకొంచుననుజుండుదాను
నరుగుచొ నాదండ కారణ్యవీథి ♦ నురుపర్వతాకారు దుగ్రలోచనుడు
ఘనవక్త్రినాసుండు కఠినవిక్రముడు ♦
ఘనుడువిరాధుడనగడిందిరాక్షసుఁడు
అట్టహాసముచేసి యాకసంబొదువ ♦ బెట్టుగావనమెల్ల భేదిల్లవచ్చి
గరుడుండుబాలనాగము బట్టినొడిసి♦యిరవొప్పనద్దివి కెగయుచందమున

బటుశూలముఖ చంచు బాహుఁడై సీత ♦ కుటిలకుంతలి నెత్తుకొని మింటికెగసి
జనకజ దెసఁజూచి చాలచింతించు ♦ ఘనుల శ్రీరామ లక్ష్మణుల వీక్షించి
యోరి వీరులవలె నోడక వచ్చి ♦ యీరసంబున జొచ్చి యేనున్నయడవి
శరచాపహస్తులై చరియింపనెంత ♦ బిరుదులై భుజశక్తి బేర్కొన్న నెంత
తల్లి శతహ్రద తండ్రి జయుండు ♦ తొల్లి యాయుధముల ద్రుంగకయుండ
బ్రహ్మచే వరములు బడసినవాడ ♦ బ్రాహ్మణాశనుడ విరాధుడ న్వాడ
నేనల్గి చూచిన నింద్రాదిసురల ♦ నైన నుమ్రింగుదు నట మర్త్యులెంత
యీయింతి నొప్పించి యీకాఁక విడిచి ♦

పోయి మీ మీ ప్రాణములు గాచికొనుడు
కాదేని నా చేతి ఘనశూలహతికి ♦ నాదట నరుదురండని పేర్చిపలుక
సౌమిత్రి యప్పుడు జనకజభయము ♦ నా మహారాక్షసు నదటును జూచి
యోరి రాముని దేవి యరుపుణ్యసాధ్వి ♦ ధారుణీనందన దగ దోరి నీకు
కొనిపోవ నెక్కుడ గొనిపోయెదిక ♦ నినుబట్టి వధియింతు నేడు నా కడిమి
నని బాణసంధాన మలుకమై జేసి ♦ ఘన బాణతతుల నక్కుముగాడ నేయ
నరుదుగా వాఁడట్టహాసంబు జేసి ♦ కెరలుచు శూల మంకించి వ్రేయుటయు
ఘనఘనాఘనము సంగడి బాసి పిడుగు ♦ చనుదెంచు కరణి రాజానకీవిభుడు
నదిరెండు శరముల నలవుమై త్రుంప ♦ బదరి వాఁడట సీత బడవైచె నడమి
నా రాక్షసుని బాసి యాకాశవీధి ♦ ధారుణీసుత సీత తల్లడింపుచును
జలదంబు నెడబాసి చనుదెంచు మెఱుము ♦ చెలువున జనుదేర జెచ్చెర జూచి
గరుడాస్త్రము నడించె గడగి రాఘవుడు ♦

వర బాణములు పెక్కు వాఁడేయుటయును
సవిలెక్క సేయక నట్టహాసంబు ♦ భువనభయంకరంబుగ బిట్టొనర్చి
కరముల రామలక్ష్మణుల నిద్దరును ♦ కరమర్థిబట్టి రక్కసుడుక్కుమీరి
మూపున నిడి రయంబున త్రోవ బట్టి ♦ పోవగా సీతయు వెను వెంటవిలి
నాపోవ నటకొంత వడి పోయి పోయి ♦ ప్రాపితకోపులయి రామలక్ష్మణులు
మెఱుగుతీగల రీతి మెరయు ఖడ్గంబు ♦

లొంపులాడ్చి వాని బాహులు రెండు దునుమ
గిరివజ్రహత సాలు క్రియ దిక్కులదర ♦ నురువడి నొరలు మన్నర్వి పై గూలి [ద్ద
యసువులు విడువ నయ్యసురయుండుటయు నసమానపదముష్టిహతుల నంద
ముద్దగా జేసి సముద్ధతి జపి ♦ రద్దిరాయని మును లాశ్చర్యపడగ
నతడంత గంధర్వుడై రాముజూగడి ♦ యతుల విమానంబునందుండి పలికె
నేను గంధర్వుడ నేను తుంబురుడ ♦ భూనాథ మును రంభ బొందికొల్పనకు

రానిగర్వమెఱింగి రాక్షసాకృతిగ ♦ నేనుగు బేరుచే నిటు శాపమంది
నేఁడు మీభుజశక్తి నీశాపముక్తి ♦ పొడఁగాంచితిఁ బోయెదనింక [చు
నిరవొప్పనాదేహ మిటఁబాసి చనుడు ♦ శరభంగమౌనియాశ్రమమునకను
బోయె మ్రొక్కుచు వాఁడు పొలుపొంద వాని ♦

కాయంబు ధరఁ బూడ్చి కడుభయంబందు
ధరణితనూభవఁ దగఁ గౌఁగిలించి ♦ పరమసమ్మదమున భయమెల్ల మాన్పి
తలకొన్నప్రేమతోఁ దమ్మునిఁ జూచి ♦ యిలమీఁదఁ గల్గునె యిట్టిదుర్గములు
కావున వేగ మీగహనంబు దాఁటి పోవలె మనము భూపుత్రిఁ దోడ్కొనుచు
ననియంత శరభంగుఁడను మునిచంద్రు ♦ గనుఁగొను తలపున గాకుత్స్థకులుఁడు

—*: శ్రీరాముఁడు శరభంగాశ్రమంబుఁ జేరుట :*— [వీధి

చనుచోట నుదయార్కసంకాశమగుచు ♦ నొనరను మునియాశ్రమోపాంత
హరితహయాకీర్ణమై సితచ్ఛత్ర ♦ పరివృతంబై దేవభరితంబు నగుచు
నకళంకమణిరోచు లందంద బర్వ ♦ నొక విమానము గాంచె నుడువీధి నంత
గని విమానములోని కమనీయశీలు గనుఁగొను తలపున గదియ వచ్చుటయు
నది యదృశ్యం బయ్యె నంత రాఘవుఁడు ♦

ముదమంద శరభంగముని గాంచి మ్రొక్కి
ముని చేత దివ్యాస్త్రములు చాలఁబడసి యనురాగమును బొంది యతని కిట్లనియె
నే మునిన్నటఁ జూచి నేతెంచుచోట ♦ నోమునీశ్వరచంద్ర యొకవిమానంబు
చదలెల్ల వెలుఁగ నిచ్చట నుండి పోయె నది యెందులకు వచ్చె నది యెందుఁబోయె
నావిమానములోని యతఁ డెవ్వఁ డనిన ♦ భూవరునకు మునిపుంగవుఁ డనియె
దేవేంద్రుఁ డాతఁడు దేవేంద్రవంద్య ♦ దేవ నాకడకును దివినుండి బ్రీతి
ననిమిషులును దాను నర్థిదీపింప ♦ నను బ్రహ్మలోకంబునకు బిల్వవచ్చె
వచ్చిన నోమహీవరచంద్ర నీవు ♦ విచ్చేయుటిచ్చ భావించి నేనిపుడు
నెరసిన కడిమిమై నిన్ను బూజించి ♦ మరిపోవువాఁడనై మదినిశ్చయించి
యంతకు రానని యతని బొమ్మంటి ♦ చింతించి వజ్రియు శ్రీరాము నిన్ను
కాంతారమున నిక్కడఁ జూడఁగలిగె ♦ నింతలో విచ్చేసి తినకులాధీశ
ధరణీశ నీప్రసాదంబున దపము ♦ నరుదార నొకవిఘ్నమైనను లేక
సలిపితి నిష్ఠలు సఫలంబు లయ్యె ♦ నెలకొని శ్రీరామ నినుఁ జూడఁగంటి
ననఘ సుతీక్ష్ణసంయమి నింక నీవు ♦ కనుఁగొని యతని చెంగట నుండు మేను
బనివిని యెదవింక బ్రహ్మలోకమున ♦ కని చెప్పి రాము సమక్షమంబునను
ననలముఖంబున నమ్మునీశ్వరుఁడు ♦ తన మేను మంత్రపూతము జేసి వేల్చి
యెడపక యింద్రాదు లెల్లను గొలువ ♦ కడు నొప్పు బ్రహ్మలోకమునకుఁ బోయె

నాయాశ్రమావాసులైన సంయములు ◆
వాయుభక్షకులును వైఖానసులును
వాలఖిల్యులు మౌనవంతులుపర్ణ ◆ శాలవిహీనులు స్థండిలశయులు
మననశీలురుదాత్తమౌనులేకాంతు◆లనశనవ్రతులుపంచాగ్నిమధ్యగులు
మొదలైనతాపసుల్ మూఁకలుగట్టి ◆ సదయాత్ముడగు రామచంద్రుని జేరి
పితృవాక్యపాలన ప్రియుడవుసత్య ◆ రతుడవునీవు నిర్మలయశోధామ
రామనీయంతటి రాజుగల్గియును ◆ యేము రాక్షసబాధ నిటకుందదగునె
వ్రతమురక్షించిన రాజుకుగల్గు ◆ నతనిపుణ్యములోన నాలవపాలు
యీతటిదైత్యుల నెల్లఖండించి ◆ మాతపోవ్రతములు మైత్రినిండించు
సారిదినీశరణంబు జొచ్చితిమనిన ◆ శరణాగతత్రాణ సదయుఁడుగాన
నాయాశ్రమంబుల యందుండుమునుల ◆
కాయతమతిరాము డభయంబులిచ్చి
మీయనుగ్రహమున మేటిరక్కసుల ◆ దాయలఖండింతు దలకకుడనుచు
వారికీడ్కొనిఘోర వనసీమకరిగి ◆ యారూఢమతి సుతీక్ష్ణాశ్రమంబునకు
వచ్చియామునిచంద్రువలనొసపేరు ◆ గృచ్ఛిసద్భక్తిపైకొనిమ్రొక్కుటయును
వారలకెదురుగావచ్చి సుతీక్ష్ణు ◆ డారాముదీవించి యర్ఘ్యబూజించి
ఘనమహాత్మ చిత్రకూటాద్రికినీవు ◆ మునివృత్తివల్కలంబులు గట్టివచ్చు
యునికి యాకర్ణించియుల్లంబులందు ◆ గొనకొనిమీరాకగోరుచుండుదుము
నీవువిచ్చేసితి నిను జూడగంటి ◆ మేవిధంబులనింక నేముధన్యులము
ఆయతభుజసత్వులైన రాక్షసులు ◆ మాయాశ్రమములకు మత్తులై వచ్చి
హోమవేదులగాల్చియూపముల్గూల్చి ◆ సోమపానముగ్రోలిసురలపోదోలి
తపములుచెరచి పాదమ్ములువిరిచి ◆ జపమాలికలుద్రెంచి శాటికల్ జించి
ఫలములుడుల్చి పుష్పములెల్లరాల్చి ◆ కొలకులుగలచి పెక్కులుగాసిచేసి
పెక్కండ్రమునులజంపిరి దురాత్మకులు ◆ దిక్కులేదీపాటు దీర్పనేత్రోవ
యేచినదనుజుల యేముగోపించి ◆ చూచిననీరుగా చూడనోపుదుము
నెలకొనిమహిమీద నీయట్టిరాజు ◆ గలుగుటజేసి యెక్కడనల్లమేము
కావునదుష్టరాక్షసుల మర్దించి ◆ నీవుమాతపములు నిష్ఠపాలింపు
మనివరాముడు రాక్షసాధీశవరుల ◆ ననిలోనజంపెద ననియూరడించి
శరభంగునాశ్రమ స్థలమునమునుల ◆ కిరవొప్పనభయంబునిచ్చుట దెలిసి
రక్కసులనుజంప ప్రతినలుబలికి ◆ యక్కడసుఖగోష్ఠినారాత్రినిలిచి ప్రలువ
మకునాడుపెక్కండ్రు మౌనులువచ్చి ◆ మరియునుతమయాశ్రమములకుబి
దిననాథకులుడుసుతీక్ష్ణునీడ్కొనుచు ◆ మునులపుణ్యాశ్రమంబులుజూడగోరి

చనుచో రఘురాము జానకిజూచి ♦ యనఘ రాజ్యముమాని యడవికివచ్చి
పను చిత్తవృత్తిమై జడలును వల్క ♦ లములు ధరించి మెలంగుచును ఱక
యసురుల దెసమీకు నలుగ నేమిటికి ♦ పొసగ వీమాటలు బుద్ధిచింతింప
మునులతో రాక్షసముఖ్యుల ద్రుంతు ♦ ననియారడించిన నంతనుండియును
కలుగుచున్నది మది కాకుత్థ్సతిలక ♦ వలవదీ తెఱగులు వర్జింపవయ్య
ప్రాణులజంప బాపము రాదె తల్లి ♦ ప్రాణేశ యొక ముని బహుతపోనిష్ఠ
నుండు చో భటరూపయుక్తుడై వజ్రి ♦ యొండు ఖడ్గము వానియొద్ద దాపుచును
ఇదె పోయివచ్చెదనే నని చనియె ♦ తదనంతరమున నాతడు ఖడ్గమంది
యూరకుండక తీవ లోకట వృక్షముల ♦

సారె ద్రుంపుచును హింసారతుండగుచు
జడమతియై తపశ్చర్యకు బాసి ♦ కడపట నతడు దుర్గతిగూలెగాన
తప మేడ మరి రాజధర్మంబు లేడ ♦ విపులాయుధము లేడ విడువవే దేవ
యనవుడు విని నవ్వి యధిపతి సీత ♦ గనుగొని విప్రమార్గంబు నీపలుకు క్ష
త్రమార్గము గాదు సాధ్వి నావలని ♦ మైత్రి బల్కెదవు నామతమెఱింగియు
తరుణి యుత్తమ రాజధర్మైకపరులు ♦ శరచాపములు దాల్చి చరియించుటెల్ల
శరణాగతులగావ జర్చింపగాదె ♦ పరికింపవయ్యేల పరమధర్మములు
నమ్మహామునులతో నాడిన ప్రతిన ♦ యిమ్మాయిగావింతు నిదియె నిశ్చయము
విడుతు ప్రాణములైన విడుతు నిన్నైన ♦ విడుతు దమ్మునినైన విడువ నే బ్రతిన
ననిన నూరక యుండె యవనిజ యపుడు ♦ విని లక్ష్మణుడు చాల విస్మయంబందె
నటమీద నొక్కొక యాశ్రమంబునను ♦ బటుధర్మవిధి రామభద్రుండు ప్రీతి
మూడేసి నెలలు నిమ్మల నాల్గు నెలలు ♦ పోడిగా నిలుచుచు బుణ్యాశ్రమముల
ధీయుక్తి జూచుచు దెరువున యోజ ♦ నాయతంబైన మహాతటాకంబు
గనిగీతవాద్య మంగళ నినాదములు ♦

దనరనయ్యుదక మధ్యమున నించుటయును
గడు జోద్యపడి తటాకము చేరి దాని గడు ధర్మరతుండు తా గని మ్రొక్కి పలికె
నిదియేమి మునినాథ యీతటాకంబు ♦

నుదకంబులో ఘోష ముబ్బుచున్నదియు
గడు జిత్రమనుడు రాఘవు జూచి పలికె ♦ నడరెడు వేడుక నా ధర్మరతుడు
కదలక మనుమంద కర్ణియన్మౌని ♦ యుదకమధ్యంబున మరునిష్ఠ నిలచి
యనసినమహిమ మనేకవర్షములు ♦ తనియక యత్యుగ్ర తపమాచరింప
నాతపంబునకు నింద్రాది దేవతలు ♦ భీతిల్లి మునిపతి బెంపెల్లగలగ
నమ్మునికడకేవు రప్సరస్త్రీల ♦ నిమ్ములబుత్తేర నేతెంచివార

లతసికి భార్యలై యంబుమధ్యమున ♦ నతడునిర్మించిన హైమసౌధముల
మునినాథుముందర ముదమొప్పనిలచి ♦ యనురక్తివారిప్పుడాడుచున్నారు
నదిగానగొలనుపంచాప్సరంబయ్యెఁ దివారిబహువాద్యహృద్యశబ్దములు
యనవుడువిని రాము డతిభక్తితోడ ♦ ఘనపుణ్యుఁడగు మందకర్ణికిమ్రొక్కి
మరియుమహాటవి మార్గంబునందు ♦ నెఱసినకడిమిమై నెరిసేగునపుడు
మునులకుమ్రొక్కుచు మునులున్నపుణ్య ♦ వనులకుజొక్కుచు వనజకల్హార
సరసులుదేలుచు సత్కథాలాప ♦ సరసులనేలుచుఁ జల్లనిగాలి
రాకలబాగడుచు రణితఝల్లికల ♦ జోకలదెగడుచు శుకమయూరాది
ఖగములబట్టుచు గరివరాహాది ♦ మృగములగొట్టుచు మేఘాస్త్రమేసి
తపములునడుపుచు దముజాచువారి ♦ ధవములునడపుచు పరువంపులతల
పువ్వులుజిదుముచు బొరలుతుమ్మెదల ♦ నవ్వులగదుముచు నభమంటదాకు
శైలంబులెక్కుచు జానకియలయ ♦ మేలంబుదక్కుచు మృదురీతిగుహాబ
మెల్లనెదార్చుచు మోగలకునెక్క ♦ డల్లననేర్పుచు నచటిచంచతల
బీరముల్ మెచ్చుచు భేదింపరాని ♦ యీరముల్ జొచ్చుచు నివరశ్మిలేని
కోనలగానల గ్రుమ్మరుచట్లు ♦ జానకితాను లక్ష్మణుడుకొన్నేండ్లు
పుణ్యతీర్థంబులు పుణ్యవాహినులు ♦ పుణ్యతపోవన భూములగలయ
దిరుగుచు బదియేండ్లు దీరినపిదప ♦ మరలిసుతీక్ష్ణాశ్రమమునకు మరియు

— * : అగస్త్యుల గాంచుట * : —

వచ్చియమ్మునిచంద్రు పద్దగొన్నాళ్లు ♦ మచ్చికనుండి రామక్షితీశ్వరుడు
నాకనాథుఘన నగస్త్యునిజూడగోరి ♦ యకళంకభక్తి సంయమికినిట్లనియె
నెందునగస్త్య మునీశ్వరుడుండు ♦ నందునెందొక్క తదాశ్రమభూమి
తెలుపవేయనిన సుతీక్ష్ణుండుగురుతు ♦ లలవడతన్మార్గ మంతయుదెలిపి
దీవించియనుపగాదిలి తమ్ముతోడ ♦ దేవితోదక్షిణదిక్కుకై నడచి
చనిచనినాల్గు యోజనములుదాటి ♦ వనములఘనశైల వాహినుల్ పెక్కు
గనుగొంచునరిగి యగస్త్యానుజన్ము ♦ ననఘాశ్రమంబున కరిగిసంప్రీతి
నాయతీశ్వరచంద్రు నడుగులకెఱగి ♦ యాయాశ్రమంబున నాత్రినిలిచి
మునితోడసుఖగోష్ఠి మొగిజేయుచుండి ♦ యినకులాధీశ్వరుం డిట్లనిపలికె
నయ్యగస్త్యమహామునీశ్వరుతొల్లి ♦ యియ్యెడవాహితాపినబ్భంగిజంపె
ననినవమ్మునిచంద్రుడారామచంద్రు ♦ గనగొనియాపుణ్యకథ జెప్పదొణగె
నురుతాపివాతాపి యనునిల్వలుండు ♦ ధరణిపైనిరువురుద్దండరాక్షసులు
గలరందువాతాపి ఘనమేషమూర్తి ♦
యిల్వలుండును నొక్కఋషియునై నిలిచి

యిచ్చుటపెనుఁద్రోవ కేఁడు రేఁగిమిగుల ♦ దచ్చనతమయింటతద్దినంబనుచు
మునులనునియమించిముదమొప్ప దెచ్చి ♦ యొనయంగ మేషంబు నేర్పడఁజంపి
ప్రీతికూరలుజేసి పెట్టిభుజింప ♦ వాతాపిరమ్మని వడిచేరఁజీర
తడయకయపుడు వాతాపియమ్మునుల ♦ కడుపులుప్రచ్చి యగ్గలికతో వెడల
యీవిధిమునుల ననేకులఁజంపి ♦ రావిక్రుతాకారు లడరియుండఁడ
గానకానియొకనాఁడు కుంభసంభవుఁడు ♦ చనుదేరఁ గపటభోజన మొప్పఁబెట్ట
వాతాపిబిల్వఁ బిల్వలు చూచినగుచు ♦ వాతాపియెందుండి వచ్చుజీర్ణించె
ననియగస్త్యుఁడుపల్కె నాయిల్వలుండు ♦

కనలిరక్కసుఁడయి కదియవచ్చుటయు
గలశసంభవుఁడుహుంకారమాత్రమున ♦ బలియునిల్వలుజూచిభస్మీకరించి
మునులకునెల్ల ప్రమోదంబు జేసె ♦ వినుమదియునుగాక వింధ్యంబణంచె
సరిగాగదక్షిణా శాస్థలినిలచె ♦ నరుదుగానంబుధి నాపోశనించె [జూడు
పెనుశాముగాగ శపించెనానహుషు ♦ మునిమాత్రుఁడే పుణ్యమూర్తికుంభ
మునివేషముననున్నముక్కంటిగాక ♦ యనివినిరఘురాముఁ డానందమంది
మరునాఁడుమునిపతి మార్గంబుజూపు ♦ తెఱగొప్పపూజించి దీవింపవెడలి
చనిచనియొక్క యోజనముత్తరించి ♦ పనసదాడిమశమీ బదరికాశ్వత్థ
సాలప్రియాళుక సాలతమాల ♦ మాలూరఖర్జూర మందారతరుల
తరుఁగ్రిక్కిరిసిన తావిక్రొవ్విరుల ♦ విరుతేనియలాని వెలయుతుమ్మెదల
మొదలునింపగునట్టి మేటిపూపొదల పొదలలోపగ లేకపొదలుమృగములను
కలకంఠకలకు హుంకారనాదముల ♦ కలసిల్లుబహుశాస్త్ర వేదనాదముల
జెలఁగుచు కిన్నర సిద్ధగానముల ♦ కలిమిదీపించు నగస్త్యనాశ్రమము

—*: సుతీక్ష్ణాశ్రమంబునకు వచ్చుట :*—

గనుగవవిందుగా గాంచి యందొక్క ♦ మునిచేతతమరాక మునికెరుగించి
చని-చొచ్చియమ్ముని చరణపద్మముల ♦ కనురాగమున మ్రొక్కనక్కునజేర్చి
దీవించి వేవేలు తెఱగులభక్తి ♦ భావించిన తుష్టి పరులగావించి
యోరామశుభనామ యుత్పలశ్యామ ♦ క్రూరదానవభీమ గుణధామనీవు
మునులభాగ్యంబున మునివృత్తిమోచి ♦ వనమునదపసివై వర్తింపవచ్చి
అరుదార చిత్రకూటాద్రికే తెంచి ♦ వరమతినొక్క సంవత్సరంబుండి
శరభంగమౌని యాశ్రమముకే తెంచి ♦ శరణుజొచ్చిన మునీశ్వరులనుగాచి
దనుజులజంపెద దలకకుడింక ♦ నని ప్రీతిమునులకు నభయంబులిచ్చి
కరుణించితని వినిగాకుత్స్థతిలక ♦ పరమసంతోష సంపన్నుండనైతి
ననియర్ఘ్యబూజించి యతులదివ్యాస్త్ర ♦ ఘనశస్త్రకోదండ కవచాదులిచ్చి

నిచ్చినఁ గైకొని యినకులాధీశుఁ ♦ డచ్చటసుఖగోష్ఠి నారాత్రినిలచె
ఘటసంభవుఁడు భావికార్యమూహించి ♦ పటుతరవాక్యుఁడై పలికెనిట్లనుచు
శ్రీరామ గోదావరీ సరిత్పుణ్య ♦ వారిశీతలగంధ వాహకుమార
ఘటితవర్త నవనాంగణలతాతటికి ♦ జటికృతపూజ ధూర్జటికినాపంచ
వటికఁబొమ్మన రఘువంశుఁడచ్చటికి ♦ ఘటసూతివీడ్కొని గదలిపోవుచును
నడుత్రోవనొకపక్షి నాథుని రెక్క ♦ లుడివోని కులగిరులో యనిచాల
గఁ దైత్యుఁడనుబుద్ధి గదసినీవెవ్వఁ ♦ డనుటయు మదమందియాపక్షి బలికె
గురుడాగ్రజాతుఁ డుకశ్యపతనయుఁ ♦ డరుణసారథియైనయరుణుంకు ఘనుఁడు
మాతండ్రిమరియు సంపాతిమాయన్న ♦
మీతండ్రిసఖుఁడ సుమీయేను రామ
యితరుండఁగాను మీహితకార్యపరుఁడ ♦ నతులసాహసుఁడ జటాయువన్వాఁడ
నీవనంబును నసురేంద్రుసేవితము ♦ గావునవైదేహిఁ గావుఁడేమరక
ననవుఁడు శ్రీరాముఁ డట్లుగానతని ♦ మనమున యోచించి మైత్రిబూజించి
యటపంచవటి కేగియందున్నమునుల ♦ పటుతపోధనుల సంభావించిమ్రొక్కి
కరమర్థివారు సత్కారముల్ సేయ ♦ ధరణీతనయజూచి తమ్మునిజూచి
పొలుపొందనందును బుణ్యాశ్రమములు ♦
గలయఁ బెక్కులు పొడగందుముకాక
యీగౌతమీగంగ యీసరోవరము ♦ లీగిరులీతరు లీయాశ్రమములు
యెందునుపొడగంటి మేయిటక్రింద ♦ నిందుండుదము మనకిం పొందుననుచు
నానందమునఁబొంది యందున్నమునుల ♦ యానతిగైకొని యాప్రొద్దెకదలి
తానులక్ష్మణుఁడును దగుపర్ణశాల ♦ యూనినక్రమముతో నొప్పారఁగట్టి
తమ్ముఁడు దానును దానిబూజించి ♦ యమ్మహీసుతగూడి యనురాగమునఁగ
నాపర్ణశాలలో యందారునెలలు ♦ దీపించిపేర్మి వర్తింపుచునుండ
నంతనీహారధరాక్రాంతదశది ♦ శాంతమైహేమంత మవనిబర్వుటయు
వేకువనొకనాఁడు వెలదియుఁదాను ♦ తేకువ గౌతమి దీర్థమాడంగ
చనుచురాముఁడు మైత్రి సౌమిత్రిజూచి ♦ కనుగొంటివే సీతకాలంబు మహిమ
దిశలెల్లజలికి భీతిలివెలిపట్టు ♦ ముసుకుబెట్టినయట్లు ముంచెహిమంబు
హేమంతమనుమేఘు మెల్లడనిండి ♦ వామిగావసగండ్లు వర్షించెననఁగ
గురిసినపెనుమంచు కుంభినియెల్ల ♦ నెరసియొప్పారె ఘనీభవించుచును
యుర్విపై నామంచు యొక్కొక్కచోట ♦
దూర్వాంకురంబుల తుదలజూచితివె
పచ్చమున్నసలాక పొజుపై వేట్క ♦ గ్రుచ్చినముత్యాల గ్రోవయైయొప్పె

గాముసంమోహన కాండంబులనగ ♦ హైమయుగ్వాయువు లలితమైనశోక
కలుపునవణకెడు విరహిణులవగ ♦ తెలిగొప్పుదలు పూదీగవిత్తింపు
మంచునజారు తామరలకన్నీరు ♦ ముంచినవిరహుల మోములగేరు
పొదిగొన్నయకరువుల్ పొట్టుగామీఁదఁగదలు తేటులపోగల్ గాచలికొన్న
కొలను దేవతలకు కుంపట్లబోలె ♦ విలసిల్లుకెందమ్మి విరులుజూచితిన
యడవియేనుగులు నీరానసీనదికి ♦ దుడిదుడివచ్చి తత్తోయంబుదొడరి
నదరిగిట్టుచు దుండములువేవేగ ♦ ముడిచిపారెడివి తమ్ముఁడవిలోకింపు
ఇట్టికాలంబున నేనున్నయట్ల ♦ పట్టంబునామీఁది భక్తిమైమాని
నారచీరలుజడల్ నవతమైదాల్చి ♦ నారాకగోరుచు నమ్మహాఘనుడు
పరమపావనుడు సౌభ్రాత్రుభావనుడు ♦ వరపితృవాక్యమద్వాక్యతత్పరుడు
చిరకీర్తినిరతుడా శ్రితలాభరతుడు ♦ భరతుడుషఃకాల పరిచితినెల్లు
స్నానంబునేయునోసరయువులోన ♦ మానితుడైయెట్లొకో మహిపవ్వళించు
నాతండ్రిసత్యంబు నాపూన్కియతని ♦ చేతనింతయు బ్రకాశించెలోకముల
నేతల్లిపసుపున నెల్ల సంయముల ♦ చేతదీవనలు గాంచితినేడనేను
నట్టికైకనునొవ్వ నాడునోతెలియ ♦ దట్టులకావించు ననఘాత్ముఁడతఁడు
పట్టంబుదొలగి తాపసినైతినేను ♦ బట్టంబుగలిగి తాపసియయ్యెనతడు
అన్నదమ్ములపాడి యాపుణ్యుజూచి ♦ యెన్ననెవ్వరికైన నికనేర్పవలయు
నట్టియాభరతుని యనుగుతల్లులను ♦ చుట్టాలనెన్నడు జూతుమోమానవు
యనిపొరుదలపుచు ననివారితముగ ♦ దనివారనిష్ఠ గౌతమివారిగ్రుంకి
యనునకునర్ఘ్యంబు లెత్తిగాయత్రి ♦ పనుపునజపియించి బ్రహ్మయజ్ఞంబు
తమ్ముడుదానుసీతయు బర్ణశాల ♦ కిమ్మైయిజనుదెంచి హితగోష్ఠిమండ
నొకనాడులక్ష్మణుం డుదయకాలమున ♦ నకళంకచిత్తుడై యన్నకు మ్రొక్కి
కందమూల ఫలాదికములు దెచ్చుటకు ♦ నందందవనముల నరయుచునరిగ
యున్నతంబగుచున్న నొకగిరిగాంచి ♦ మిన్నకనచ్చోట మెలగుచున్నంత
మహియెల్ల దేదీప్యమానమైవెలుగ ♦

నహిమాంశుక కల్పితంబగుఖడ్గమొకటి

భీషణజలద గంభీరఘోషముల ♦ ఘోషించుచునువచ్చి కోయసిపలికె
నందుకొమ్మింక దైత్యాధీశతనయ ♦ పొందుగా నీతపంబునకునువచ్చి
ధానుండుబనిచె నీపగిదిగనన్ను ♦ మానసకొనుమన్న మరివాడుపలికె
నుల్లనేతావచ్చి మెచ్చినాకీక ♦ యెల్లజోకలుచేసె నొల్లబోనిన్ను
నలఘుతపంబెల్ల నవనిపైగలసె ♦ నలసినకడకేగు వనజాప్తుహేతి
యనిపల్కితొల్లిటి యచలసమాధి ♦ దనరంగనుండె నంతటలక్ష్మణుండు

— * : సౌమిత్రి ఖడ్గముఁ గొనుట : * —

విపులాద్భుతంబంది వెసఁ దానిఁ జూచి ♦ యుపమతో డగ్గరి యొడిసి చేపట్టి
నిపుణుఁడై పరికించి నృపకుమారుండు ♦ తపసుల కెల్ల నాధారమైనట్టి [ చట
ఫలవృక్షములు ద్రుంపఁ బాడిగాదనుచుఁ ♦ గలయఁ గ్రుమ్మరుచు నగ్గలికమైన
భావించి భావించి బాగొప్పఁ జూచి ♦ భావంబునందును బ్రమదంబుఁ గొనుచు
నీఖడ్గమిందుండ నేమి కారణమొ ♦ యీఖడ్గమిచ్చటి కేల వచ్చినదొ
యనియసిఖడ్గంబు నాదృతిఁ జూచి ♦ పనిగొని దానిఁ జేపట్టుచు మఱియు
విలసిల్లనొక గొప్ప వెదురుజొంపంబు ♦ మలసి ఖండింపఁ దన్మధ్యభాగమునఁ
దగి యొకమాను మేదిని గూలుట యును ♦ నిగిడెను మూర్ఛ మునింగి సౌమిత్రి
యటఁ గొంతసేపున కల్లనఁ దెలిసి ♦ కటకటా సకలలోకములు నిందింప
బ్రాహ్మణుఁ జంపితిఁ బరికింపలేక ♦ బ్రహ్మహత్యాదోష భరితుండనైతి
నే నేల వచ్చితి నింతదవ్వుకు ♦ నే నేల యీఖడ్గ మిట్లు గైకొంటి
ననుపమ ధర్మాత్ముఁడగు రామచంద్రు ♦ ననుజుండనగు నాకు నధిక పాపంబు
సమకూరె నీమునీశ్వరుఁ డెవ్వఁడొక్కొ ♦ సమయఁ జేసితి నింక జానకీవిభుఁడు
విని నన్ను నేమని విడనాడునొక్కొ ♦ పెనుపేది మునులు శపింతురో పట్టి
చెప్పకుండఁగరాదు చెప్పక పోదు ♦ తప్పె కార్యము త్రోవ దైవమాయనుచు
నడలుచు నల్లన నడుగులు వణఁక ♦ సుడివడి బ్రమయుచుఁ జొప్పుఁ దప్పుచును
నడతెంచి దశరధునకు గురుభక్తుఁ ♦ బడ నేసి చంపిన పాపంబు వచ్చెఁ
దండ్రికి వలెనె నందనునకు వచ్చె ♦ నంద్రుభూపతు లెల్లనని తల్లడిలుచుఁ
దమయన్నఁ జేరి గద్గదకంఠుఁడగుచు ♦

గ్రమమేది వగచుచుఁ గడగి మ్రొక్కుటయు
ననుజుని నెత్తి యొయ్యన గారవించి ♦ కనుఁగవకన్నీరు గ్రక్కునఁ దుడిచి
యనుకంప మదిఁ బర్వ నని యె రాఘవుఁడు ♦ అనఘ యేఁగలుగ నీకడలు నేమిటికి
ధర్మవర్తనుఁడవు దానశూరుఁడవు ♦ నిర్మలాత్మకుఁడవు నీతిమంతుఁడవు
దశరథక్ష్మాపాల తనయమాన్యుఁడవు ♦ పశుపతివిక్రమ ప్రకటశౌర్యుఁడవు
అన్న నీముఖమేల యటు చిన్నవోయె ♦ నున్నది యేర్పడ [illegible]గిఁ జెప్పుమనిన
జయశాలియైన లక్ష్మణుఁ డిట్టు లనియె ♦ భ యనివారణసీదు పంపునఁ బోయి
వనమూలఫలములు వలయునన్నియును ♦

గొని యేను మెలఁగుచోఁ గ్రూరఖడ్గంబు
నొక్కటి మింటిరా నొడిసి చేపట్టి ♦ వెక్కసంబగు నొక్క వెదురుజొంపంబు
నఱికితి దానను న్నతుఁడొక్కమాని ♦

యొఱలుచు ధరఁ గూలె నుగ్రుఁడో యనఁగ

నానేరమికిఁ గుంది నరనాథచంద్ర ♦ రానేరకుండియు రానేరవలసె [డె
ననవుడు రఘురాముఁ డాశ్చర్యమంది యొకరకార్యమును దినూహించుచుం
డంతనక్కడి మునులందఱుఁ గూడి ♦ యెంతయు నత్తెఱం గెఱిఁగింతమనుచు
జనుదెంచి రఘురామచంద్రు దీవించి ♦ ఘనతరమృదువాక్యగరిమ నిట్లనిరి
అఖిలేశ వినుము నీయనుజన్ముఁ డిప్పు ♦ డఖిలలోకద్రోహియైన రావణుని
చెలియలికొడుకగు జృంభుని నేఁడు ♦ తులువను నిర్జించ దోషంబు లేదు [కు
మునులెల్ల సంతసంబును గాం దిరధిస ♦ అనవుడు రఘురాముఁ డని యె మహానుల
నేవేల్పుఁ గూర్చి వాఁ డిట్టి తపంబు ♦ గావించె ఖడ్గ మెక్కడనుండి వచ్చె
చీటికిమాటికిఁ జెకుదు రేబుధులు ♦ నాటికి హాతుఁడు గా నజుఁ డేల వ్రాసె
నెంతకాలము చేసె నీయుగ్రతపము ♦ సంతుష్టుఁడయ్యెనే సరసిజాక్షుండు
అంతయు నెఱిఁగింపు మనిన నాభూమి ♦ కాంతునితో మునిగ్రామణులనిరి
తొల్లి దశాస్యుండు దోర్బలశక్తి ♦ నెల్లదిక్కులు గెల్వ నెచ్చోట మదిని
పొరి దిమ్ముఁ గలేక సోదరి మగని ♦ నురుపరాక్రముని విద్యుజ్జిహ్వుఁ బిలిచి
మన్నించి లంక యేమఱక మీయనుచు ♦ సున్నతి గావించి చనియె నంతటను
వను మాయలు నేర్చి యే దశకంఠు ♦ రానీను లంకాపురంబు గైకొందు
ననుచు విద్యుజ్జిహ్వుఁ డపుడు పాతాళ ♦ మునకేగి రాక్షసముఖ్యుల దండ
పాయక వారిచే బహుళంబులైన ♦ మాయలు నేర్చుచు మదవృత్తినుండి
అచ్చట రావణుం డఖిలదిక్పతుల ♦ విచ్చలవిడి గెల్చి వెస లంకఁ జొచ్చి
ఘనత విద్యుజ్జిహ్వు కథ లెల్లఁ దెలిసి ♦ కనుఁగవలను నిప్పుకణములు రాల
నాయాజ్ఞ నుండక నలిరేగి వీఁడు ♦ పోయి మాయలు నేర్వఁ బోలుఁ గాకేమి
మాయలన్నియు నేఁడు మాయమై పోవఁ ♦

జేయుదు ననుచున జేయుఁడై యరిగి

అస్మయనగరవాసాసురుల్ బెగడ ♦ విస్మయకోపుఁడై వెస హేతిఁ బెఱికి
మఱఁది నా చెలియలి మగఁ డీతఁ డనక ♦ తరిమి విద్యుజ్జిహ్వు తలఁ ద్రెళ్ళనేసి
క్రమ్మఱ వేగ లంకకు నేగుదెంచి ♦ రమ్మని చెలియ శూర్పణఖను రార్చి
యనియె నీవిచ్ఛావిహారిణివగుచు ♦ మనమున నీకు సమ్మతమైన పురుషుఁ
బొందుము వెఱవక పూని లోకముల ♦ యందుఁ జరింపు పొమ్మనిన నార్నెలల

—:* మునులు జంబుని తపఃప్రభావంబు దెల్పుట *:—

గర్భిణియైయున్నకతనఁ బై నెలలు ♦ నిర్భరగతినుండి నెలఁతుక గాంచెఁ
జటులోగ్రబలుఁడైన జంబుకుమారు ♦ నటవాఁడు పెద్దయై యాతల్లి చేత
దనజనకుని చావు తప్పక దెలిసి ♦ వినితంద్రి పగదీర్ప వెరవు చింతించి
బ్రహ్మను గూర్చి తపంబు జేసినను ♦ బ్రహ్మ వరంబీడు భవుని గోరినను

అతఁడుభక్తుఁడుగాన నటుగఁడాతనికి ♦ నతులితగతివిష్ణు నర్థింతునేని
చాలనాతఁడుమెచ్చి చనుదెంచివరము పాలించు నెపుడు నాపగదీరు నెపుడు
అరయ ద్రిమూర్తులా హరిహరబ్రహ్మ ♦
లరవింద హితరూపమై యొందునంద్రు
కావునరవికూర్చి కడునిష్ఠతపము ♦ గావించి మెప్పించి కదనరంగమున
దనుజనాయకుఁడై నదశకంఠుద్రుంతు ♦ నని యెంచితపముసేయఁగ దాఁ గెవంత
వనరహాప్తుడు మెచ్చివరఖడ్గమొకటి ♦ పనిచె దానవునకు బగదీరుటకును
దానిగైకొనడయ్యె దర్పాంధుఁడగుట ♦ నానిమిత్తమున నీయమజనకజ్బై
నాహేతిజుటుగాక యసురచేబడిన ♦ సాహసంబున నేచు జగములన్నియును
దైవకృతంబున దైత్యుండుమడిసె ♦ నీవిచారం బేల యినవంశతిలక
కలనరావణుగెల్చె కార్తవీర్యుండు ♦ చలమొప్ప నాతనిచంపె భార్గవుడు
నట్టిభార్గవరాము ననిలోనబట్టి ♦ కొట్టితివీరంబు క్రొవ్వునణగ
నట్టినీచేరావణాది రాక్షసులు ♦ గట్టిగాదురమున గడతేరగలరు
అనవుడు రఘురాముడాశ్చర్యమంది ♦ వినతుఁడై మానుల వేట్కతో ననిచె
నంతశూర్పణఖ నిత్యము దెచ్చినట్లు ♦ వింతగా నన్నంబు వివిధభక్ష్యములు
పొసగవించినబోన పుటికచేబూని ♦ వెసవచ్చితునిసిన వెదురుజొంపంబు
నశుముఖండంబులై నకిబడియున్న ♦ కొడుకుగనుంగొని కుంభిణిబ్రాలి
తెలిసియాతునుకలుదృఢముగాగూర్చి ♦ పలవించిపలవించిపణతియిట్లనియె
నోకుమారకచంద్ర యుచితమేనన్ను ♦ గైకొనవది యేమి కన్నులుదెరచి
తగుమామయనక ప్రతాపలంకేంద్రు ♦ డగురావణునిజంప నాత్మగోరినను
నీకొనగూడనే నేరమైతకట ♦ యాకార్తవీర్యుచే నణగెనే నతడు
యనరణ్యుశాపాగ్ని నణగెనేయతడు ♦ వనజసంభవుశాప వహ్నిచే దగెన
నలకూబరునిచేత నడగెనేయతడు ♦ అలనందికోపాన లార్చులబడెనె
శాండిల్యమానిరోషంబున జెడెనె ♦ యొండేలధననాథు డుండెనేలంక
పగవలదన్న నాపల్కుగైకొనక ♦ తెగితిరావణుడేల దెగనునీచేత
ధర్మదేవత మాతల్లిమాటంద్రు ♦ నిర్మలాత్మకవిన నేరమైతికట
తపముపండె ననంగదగనీకుబుద్ధి ♦ గపటించె దైవంబు కతలేలనింక
ననియనిశోకించి యక్కుమారకుని ♦ గనుగొనియగ్ని సంస్కారంబుచేసి
యనతిదూరంబున నచలసమాధి ♦ దనరుచునున్న పెద్దలచేరబోయి
తూరికన్నులుమూసి యుడుగకనిష్ఠ ♦ ఘోరతపంబుగైకొని సేయురీతి
దలనుపోపెడుజడల్ ధరియించిబూది ♦ యులదిజన్నంబు దండుగూడి
తొలగకమేకపోతుల మెడల్ విఱిచి ♦ పాలుపారనుడికించి పొట్టలనిండ

నెట్టనవమలిమొండిన కళాసములు ♦ గట్టియేమియు నెరుంగనియట్ల నుండి
క్రొవ్విననాశిశువును గుమతులై పట్టి ♦ యొవ్వధిజంపితి రెరుగింపకున్న
దాపసాధములార తాపంబుదీర ♦ వేబట్టిమి గుదు విడువక మిమ్ము
ననినయహాహా రావమడరడగ్గరిన ♦ మును లెల్లభీతిల్ల ముదితకిట్లనిరి
వినుశూర్పణఖముని శేషుడొక్కరుడు ♦ చనుదెంచినీపుత్రు సమయంగ జేసి
ఫలములుగొనియెల్ల పర్ణశాలకును ♦ జలియింప కేగి యచ్చటనున్న వాడు
ముక్కమెూ మేర్పడ మునికార్యమునకు ♦
దిక్కగల్గితిగాన తెలుపయ దరుగు
మనిచూపిచెప్పిన నాదుష్టబుద్ధి ♦ కనలుచు నపుడు లక్ష్మణుండుచన్నట్టి
యడుగులచొప్పున నరుగనమ్మునులు ♦ పొడమినభీతిచే బులినాకవిడచె
దప్పక దీనికి దగినట్టిబుద్ధి ♦ చెప్పింపుదురింక చెంగి రాఘవులు
నాదటసకల దైత్యతతులయంబునకు ♦ నాదికారమిదియని ముదమంద
నత్తతివరిలేచి యసురేంద్రు చెలియ ♦ లత్తుంగనాసియు నుగ్రభావంబు
గురువిలోచనములు కోఱదాడలును ♦ పఱపైనకడుపును బల్లవెండ్రుకలు
తెఱనోరుకరిమేనుదీర్ఘజిహ్వాయును ♦ విరివైనరూపును విషమదృష్టియును
నరుదారిధంయించి యాదురూపమున ♦
గరముగ్రముగవచ్చు గరళమోయనగ [గ
నొడిసిలోకము లెల్లనొగ్గిమింగజాలి ♦ పొడమిననొక మహాభూత మోయన
దటిలేచిదైత్యసంతతినాశకాల ♦ మెఱిగి భూస్థలి దోచుమృత్యువోయనగ
నడచుచువెస శూర్పణఖయనునాతి ♦ కడకతో రాముడగ్గరజేరబోయి

—*: శూర్పణఖ రాముని జూచి మోహించుట :*—

యిందీవరశ్యాము నినకోటిధాము ♦ సౌందర్యజితకాము జగదభిరాము
రాముదై తెజువిరాము వీక్షించి ♦ కామభూతముసోకగనుంగొనరాక
తామరగుణమేచి తన్నులోకాభి ♦ రాముగాదలచి యారక్కసికక్క
తనపెద్దమొగము నాతనిముద్దుమొగము ♦
తనమహోదరము నాతనితనూదరము
తనతప్పుగన్ను లాతనిగొప్పకన్ను ♦ లెనయించుచుదనకితడే తగునంచు
మొగచాటుతగా మునిమునినగవు ♦ లిగురి పరఘురామ వీక్షించిపలికె
శరచాపములుపూని చరియింపనేల ♦ యరుదైనయడవుల నతివయునీవు
నీవేషమునకుంకు నేమికారణము ♦ నీవెవ్వడవుమఱి నీకుజేరేమి
యనవుడు రఘురాముడల్లననవ్వి ♦ దనుజకామినితోడ దగనిట్టులనియె
రామాభిరామయో రామనాపేరు ♦ రాముడు దశరథ రాజపుత్రుండ

యాపర్ణశాలవాఁ డతఁడునాతమ్ముఁ ♦ డీపద్మలోచన యిల్లాలునాకు
నేనుదండ్రియుఁబంప నీయరణ్యములఁ ♦ బూనిచరింతుఁ దపోవృత్తినిపుడు
నీనెవ్వతెవుమరి నీకుఁబేరేమి ♦ నీవేలవచ్చితి నేఁడుమాకడకు
నీవిలాసంబును నీవయోరూప ♦ లావణ్యమును నింతులకు నెందుఁగలదు
నావుడునాశూర్పణఖ రాముఁజూచి ♦ వావిరిఁబల్కె దుర్వారమైనిలిచి
యావిశ్రవసుకొడుకఖిలకంటకుఁడు ♦ రావణుఁడుగ్రవిక్రమయశోధనుఁడు
నాపటుసత్త్వనకనుఁగుఁజెల్లెలను ♦ నాపేరువినుశూర్పణఖయండ్రు తెలియ
నీరూపురేఖలన్నియు సరిచూచి ♦ కూరిమినీకునాకును దగునంచు
కామించివచ్చితిఁ గడునొప్పురూపుఁ ♦ గామించినప్పుడె కైకొననేర్తు
నెందైనఁజననేర్తు నేవస్తువైనఁ ♦ బొందుగాఁ దేనేర్తు భోగింపనేర్తు
నున్నదియేలనా యొప్పుభావించి ♦ నన్నుప్రాణిగ్రహణంబుగావింపు
మిదికులగుణహీన యదివికృతాంగి ♦ యదినీకుమరితగునే యటుగాన
నీమెలఁతుకఁబట్టి యిప్పుడేమ్రింగి ♦ రామనీకోరిన రతిసల్పుదాన
ననవుడుతనుఁజేర నాసీతఁదిగిచి ♦ కొనిరాఘవుఁడుదానికోర్కికినవ్వి
కొంతహాస్యముఁజేయఁగోరియాదనుజ ♦ కాంతవికారంబుఁ గనుఁగొనిపలికె
నేనింతిగలవాఁడ నిదినన్నునమ్మి ♦ పూనినతోవసంబునకు నేతెంచెఁ
దలిగినీకొప్పింపఁ దగదింతాఁగిఁ ♦ బక్కఁగొనిసవతితోఁ బడఁజాలవీవు
ఈనాతిలేకున్న నింతకుమున్నె ♦ యేనినుఁగైకొందు నిప్పుడేమాయె
వాఁడెనాతమ్ముఁడు వరతపోధనుఁడు ♦ వాఁడునాకంటెను వరరూపధరుఁడు
తనకొక్కచక్కని తరలాయతాక్షి ♦ ననుకూలపతిని నిత్యముఁగోరుగాన
నినుఁబాఁదనాతఁడునేర్చునందరుగు ♦ మనవుఁడుగాబోలునని డాయఁబోయి
నెలకొనిలక్ష్మణనిన్నుఁగామించి ♦ కలయవచ్చితినిన్నుఁగైకొనుమనుడు
నారామునుద్యోగమతఁడని తెలిసి ♦ ధీరుఁడై దానితోఁ దెలఁగొప్పఁబలికె
మెఁతమారాయన్నఁగామించితితొలుత ♦ దలపువనటుగానదగదునీకుఁబొంద
సీతనీకుఁబోలదు చెలువంబునందు ♦ సీతరిదీటును నీమురిపెంబు
భాతినింకొకసారి పరికించనేని ♦ నీకునొల్లకనిన్నుఁ జెందురాఘవుఁడు
రామునిసన్నిధికినో రమణిపొమ్మనిన ♦ సౌమిత్రిమాటలు సత్యంబులనుచు
దామసితసరోత తలచకమరియు ♦ రామునికడకేగి రతికిఁబ్రార్థించె
వలపదాతనిపొందు వనితనీవనివ ♦ జలజాక్షిమరియు లక్ష్మణునిఁబ్రార్థించె
దమ్ముఁడన్నను నన్నతమ్మునిఁజూప ♦ ద్రిష్టురితనకోర్కి తీదీపులాడ [రాస
మరిమన్మథునిసూత్ర మహిమచేదిరుగు ♦ తెఱబొమ్మయోయన దిరిగెఁబే
విరసవర్తనముల వెలదియిబ్బంగి ♦ నిరువురసన్నిధి కెసదాకి తాకి

వేసరియన్యోన్యవివశవర్తనల ♦ గాసిల్లి యొంతయు గడునల్గిపలికె
నోరిమానవులార యొకపేదరాలి ♦ గారించు తెఱగున గారింపదగునె
యేను కోపించిన నింద్రాదిసురలు ♦ నైన నను మ్రిఁగుదు నటమర్త్యులెంత
పొదివి యీయింతితో భువనంబులెల్ల ♦
జదిమి మ్రిఁగుదునని సంరంభమెసఁగ
నదిమృత్యువునుబోలి యట్టహాసంబు ♦ పొదలిడగ్గరవచ్చు పూనికెజూచి
జానకిదలకెడి సౌమిత్రియింక ♦ దీని మేలము చాల దీనిశిక్షింపు
మనిరాఘవుడు బల్కనాలక్ష్మణుండు ♦ వినిపర్ణశాలకు వెలపలనిలిచి
బడతిసీకింత కోపంబేరమ్మ ♦ కడముట్టనీకోర్కె గావింతునిపుడె
అనిలక్ష్మణుడు బల్కనాశూర్పణఖయు ♦ దనమదినుప్పొంగి దగ్గర జేర
ఘనవిషజ్వాలోరగము పుట్టవెడలు ♦ ననువున నారజాపి యదరులుచెదర
దనఖడ్గమంకించి దానవురాలి ♦ ఘనవాసికము చెవుల్గరమునబట్టి
యేసీమసరసమోయిదియనన తఁడు ♦ మాసీమసరసమోమగఁడవరోయనుచు
చేయెడ్డివలచి వచ్చిన చెవుల్ముక్కు ♦ పోయెనఁగా సామెత పుడమిబుట్టించి
ముక్కును చెవులును మొదలంటగోయ ♦
వెక్కుచువేసారి వివశాత్మయగుచు
శృంగంబుబగిలిన జేరువుగొండ ♦ ధంగి రక్తము లొల్కభయమందిపారి
చనిచతుర్దశ సహస్రనిశాచరేంద్ర ♦ జనవిరాజిత స్థానంబునైన
ఖరునియాస్థానంబు కడకువచ్చుటయు ♦ ఖరుడునుదాని యాకారంబుజూచి
వెఱగందియిదియేమి వెలదినీరూపు ♦ వెఱవక నెవ్వడు వికృతంబు జేసె
నెవ్వడు కాలాహి నెరిగియుద్రొక్కె ♦ నెవ్వడు మృత్యువు నిత్తరిజెనకె
వాని నెరింగింపు వానిరక్తములు ♦ వానిమాంసంబులు వడిసీకునిత్తు
నని పేర్చిఖరుడు తన్నడిగినజూచి ♦ వినుటకువ్రేగైన వికృతస్వరమున
ముకుకొన్నసిగ్గున మోమరవాంచి ♦ విలపింపదొణఁగనవ్వెలదియేడ్చుచును
వినుమరణ్యమునందు విపులసాహసులు ♦
మునివేషధారులు మోహనాకృతులు
రామలక్ష్మణులను రాజనందనులు ♦ కామించియేను దగ్గరుటయుజూచి
పటుశక్తినన్నంట బట్టినావేష ♦ మిటుజేసివిడిచిరి యేనుదుఃఖించి
నినుగానవచ్చితి నీవింకబోయి ♦ యెనసినకడకనైపొ నిద్దఱజంపి
వారిమాంసంబులు వడినాకునిచ్చి ♦ వారకనాలోని వగలార్పుమనుడు

—*: ఖరుడు సేనల బంపుట :*—

సంశమాత్రమునకై యేలవారి ♦ పంతమందెంత నాపంపుగైకొమ్ము

అనిపదునలువుర నంతకోపముల ♦ ననలోగ్రతేజుల నప్పుడుబిలిచి
యాశూర్పణఖవెంట నేగియానరుల♦నాశంబునొందించి సాహసోద్ధతికి
వారిశోణితము ద్రావగజేయుడనిన ♦ వారునుదార్వార వారివాహములు
గాలితోవచ్చిన కరణిగూడెంత ♦ తోలోలశూలకాంతులు మెరుపులట్ల
జనుదెంచి రామలక్ష్మణసూర్యచంద్రుల♦లకుగప్పిగర్జితాలాపముల్నూప
దినకరకులుడంత దేదీప్యమాన ♦ ధనురాదిసాధనోద్దాముడై యెదిరి
వారునుతనమీఁద వైచినయశని ♦ దారుణశూలముల్ ధారుణిగూల్చి
వారినందరిభూరి వజ్రానుకారి ♦ నారాచముల కంఠనాళముల్ జిదుమ
పరిపక్వఫ శిరోభాగముల్వ్రాసి ♦ నిరుపమాశుగహతి నిట్టరాళ్ళనగ
బుడమిపై గెడసి రప్పుడుసుప్పనాతి ♦ మడెమెత్తుపరుపున మరియునుపారి
ఖరునకులోక భీకరునకువారి ♦ మరణ బురఘురాము మహితరణంబు
నుగ్గడించుటయు నాహుతివర్గళముగ ♦ భగ్గుభగ్గునమండు పావకుడనగ
కోపించియపుడు మిక్కుటమైనకడిమి♦దీపించిదూషణ త్రిశిరులుమొదలు
వీరుఁ పదినాల్గు వేలరాక్షసులు ♦ ఘోరసత్వులుగొల్వ కొమరుదీపించి
తెరలినసురలతో దివితల్లడిల్ల ♦ బొరలినగిరులతో భువిపెల్లగిల్ల
రణభేరివేయించి రత్నశైలాభ♦గణనీయ్యాశ్వబలాశ్వ కలితమైదూర్వ
మణికూబరసువర్ణ మయచక్రదశక ♦ రణజయప్రద ధనుర్బాణాసిపూర్ణ
రణితకింకిణిమైన రథమెక్కి వెడలె ♦ రణబలోదగ్రుడై రఘురాము మీఁద
త్రిశిరుండు కంకపత్రశరుండువిలస♦దశనికల్పుడుదిక్కులదరనార్చుచును
వాసవవారణోజ్వల భాసమైన ♦ భాసురరాసభ ప్రకరసంభరిత
హాటకస్థగిత శతాంగంబునెక్కి ♦ మేటికయ్యమునకు మేనుబ్బివెడలె
బర్హిణవర్ణని బర్హాణపవన ♦ గర్హాణ చణకాంతి ఘనవేగతురగ
సందోహసంభృతస్యందనోత్తమము♦ముందుగాదోలించిముదము గీలించి
సేనాముఖంబున చెగిదూషణుడు♦నానాముఖంబుల నలువొప్పడించె
ప్రేమతోమరి పృథుగ్రీవుండుసైన్య♦గామియునవ్విహంగముడును మేఘ
మాలియునగు మహామాలియుమరియు♦న లోకభీకరుండగుమహాసర్ప
ముఖుడునుకాలకార్ముకుడుదుర్జయుడు ♦
మఖశాత్రవుండును మణిపురుషుండు
కారుణ్యదూరుడా కరవీరనేత్రు ♦ డారుధిరాశనుం డసనొప్పువాడు
ద్వాదశదైత్యులత్తరిఖరుగొలిచి ♦ ద్వాదశాదిత్య ప్రతాపులై చనిరి
త్రిశిరుండుమరి ప్రమాథియురణోదగ్ర♦యశమునజేర్చు మహాకపాలుండు
స్థూలాక్షుడును రణోద్యోగులైసేన ♦ నాలుగుముఖముల నడచిరేమరక

భీషణకరిఘటా బృంహితతురగ ♦ హేషారథస్వనా నేకపదాతి
పటుతరహుంకార పటహధాంకార ♦ పటుకేతుపటపట స్ఫారనాదముల
గృంగభూతముల దిక్కులు వ్రక్కలయ్యె
పా. గబయోధులు భూతముల్ వణకె
బలముల కెంధూళి భానుమండలములు ♦ కలదు లేదనగప్పె గగనంబు నిండ
ఖరుని కేతనముపై గ్రద్దలు వ్రాలె ♦ తురగముల్ ప్రమ్రగ్గె నెత్తురువానగురిసె
నక్కలు వాపోయె నభము భేదించ ♦ జక్కలుడుల్లె పక్షులు చుట్టునరచె
హరియును త్పాతము ల్మహి నాకసమున ♦ తరుచుగాదోప నింతయు భీతిలేక
ఖరుడీ తెరంగున గడకతో నడచి ♦ యురుదైనయా దండకాటవిజొచ్చి
ననుపమాకృతిరాము డక్కలకలము ♦ విని పర్ణశాలకు వెలుపల నిలిచి
ధృవనిపై దివముపై నవశకునములు ♦ వివిధము లనుగొంచు వెసవమ్ము బిలచి
సౌమిత్రి సమర సూచకనిమిత్తములు ♦ భూమిపై బెక్కులు పుట్టుచున్నవియు
రట్టడి ముక్కడి రక్కసిమరియు ♦ దిట్టయై బలముల దెచ్చెగావలయు
నదె సైన్యఘోషంబు లట్లకానొపు ♦ నదె మహాబలధూళి యఖిలంబుగప్పె
నవశ్యమైనరణమబ్బె నాకటుగాన ♦ నవహితమతిబూని యాలస్యముడిగి
జనకజ నిక్కడ జనదుంపనింక ♦ గొనిపోయి యగ్గిరి గుహనుండుమీ నిన
నినవంశవల్లభ యేనెట్లు బోదు ♦ నినుడించియటుగాన నీవు సీతయును
బర్వతగుహ జేరి పరికింపు మేను ♦ దుర్వారదనుజుల ద్రుంతు మీ కృపను
అనఘ నీవిరితో నాలంబు సేయ ♦ ననసె వేడుక నాకు నీవుండవలదు
జనకజతల కెదుం జనుమన్న సీత ♦ గొనిపోయి పర్వత గుహజొచ్చియుండె
అంత రాముడు ప్రళయాంతకుపగిది ♦ యెంతయు గోపించి యేపుదీపించి
యమితముని త్రాణమగు కృపాణంబు ♦ క్రమమొప్పగా వ్రజకవచంబు బూని
శరశరాసనములు చతురుడై తాల్చి ♦ యురుతరతూణీర యుగళంబు బిగిచి
కొండపొల్లుగ వచ్చు కుండలీకుండ ♦ లుండ నవిల్లు పెల్లుగ నెక్క బెట్టి
యగణితధ్వనుల మిన్నంతయు పగుల ♦ తగిలి చాపముగుణధ్వని జేయుచుండ
నింద్రుండు మొదలుగా నెల్ల దేవతలు ♦
సాంద్రరత్నవిమాన సహితులై యపుడు
చదలెల్ల నిండియె చగ రాముడొకడు ♦ పదునాల్గువేల నప్రతిమవిక్రముల
ఖరదూషణాది రాక్షసుల నేరీతి ♦ బొరిగొనునో చోద్యముగ జూతమనుచు
గనుగొనుచుండిరి కపటదానవుల ♦ ఘనుడు రాముడు ద్రుంచుగాకంచు సారె
దేవర్షిగణములు దివినుండి తాము ♦ దీవించుచుండిరి దివిరిపల్మారు
పదివేలకోటుల భాను తేజములు ♦ పొదిగొను లోకము ల్పొదివినయట్లు

రాముని తేజ మరణ్యభూజములు ♦ భూమి యునభమునబులు గప్పటయును
జడమతులై సర్వాంగసంభ్రమంబుడిగి ♦ మిడుకుచు కన్నులు మిరుమిట్లుగొనగ
కడునంధులైన రాక్షసులను జూచి ♦ కడకతో బల్కె నా ఖరుడు దూషణుని
ఇది యేమి దూషణ యీసేన నడవ ♦ బెదిరెనో పరసేన యేరడ్డపడెనో
యనిన దూషణుడేగి యటజూచి వచ్చి ♦ దనుజేశ రాము నుద్ధండ తేజంబు

—*: ఖరుని సేనలు రాము నెదుర్కొనుట :*—

కలయ బర్వుటయును గతిదప్పె ననుడు ♦
నలుకమై ఖరుడు సైన్యముల దిట్టుచును
పరదమత్యుగ్రత పటవోలుకొనుచు ♦ నరుగుచో రాక్షసు లందఱు గూడి
భుజబలాటోప విస్ఫురితప్రతాప ♦ గజరథభట వాజి కలితులై యకట
మందుకార్చిచ్చుపై మలయుచుమిడుత
తండంబులొక్కట దార్కొన్న కరణి
కడునుగ్రవేగులై కాకుత్స్థరాము ♦ వడిచుట్టుముట్టి దుర్వారులై కదిసి
శరచాపపట్ట సశక్తిత్రిశూల ♦ కరవాలకుంత ముద్గరభిండివాల
పరశుతోమరగదా ప్రాసఖడ్గములు ♦ గురిసియార్చిరి తేవకోటిభీతిల్ల
నప్పుడు రఘురాముడ బుదపత్తి ♦ గప్పిన చండాంశు గతిగాన బడక
కొంతసేపునకు రక్షోగణముక్త ♦ కుంతాదిబహుశస్త్ర కటిలాస్త్ర తతులు
సన్నియుమాయిచె నైంద్రజాలమున ♦ కెన్నన దనుసుర శ్రేణికీర్తింప
మఱియు దోడ్తో దైత్య మండలిగురియు ♦
దరుచుగానస్త్ర శస్త్రముల ద్రుంపుచును
ముందట నిరుపార్శ్వముల పిఱుందటను ♦ సందడించిన దైత్యసైన్యంబుమీద
కరలాఘవము మీఱ గవదొనలోన ♦ శరములన్నియు నొక్కసారె సంధించి
పదియును నూరును వేయును పదివేలు లక్ష ♦ పదిలక్ష పదికోట్లు పదినూరుకోట్లు
మండితపరివేష మధ్యందినార్క ♦ మండలపరివేష మహితానుకారి
కుండలీకృత చండ కోదండదండ ♦ భండనాత్యుత్సాహ బాహుడై వ్రేయ
దునియ గంభీర వేదులును జోదులును దునుకలైపడెను వీరులును రాతులును
ద్రుంగెడు బహుపదాతులును హేతులును ♦
ముంగలపడు శరంబులు శిరంబులును [వర్మములు
ప్రొగ్గెను మోహాంగములు రథాంగములు ♦ వ్రగ్గెను గుణ ధర్మములు
తూలెను రథికజాతులును సూతులును కూలెడి వెలిగొడుగులును బడగలును
నలిమైన మాంసఖండములు మొండెములు ♦
గలిగి లోకైక భీకరమయ్యె రణము

సంతభానునిదీప్తి కందకారంబు ♦ పంతమంతయు బటాపంచలైనట్లు
అతులవిక్రమధాముడగురామునకును ♦ హతశేషమగుసైన్యమంతయు విరిగి
ఖరునకుశరణన్న ఖరుడునువారి ♦ పురికొల్పిదూషణు బోరికై పనుప
వాడును హతశేష వాహినుల్ దాను ♦ వేడిమిసూపుచు వేవేగబొదివి
తాలసాలశిలా వితాననానాస్త్ర ♦ జాలవర్షము రామచంద్రుపై గురిసె
కురిసినతినమేన గ్రొన్నెత్తురొలుక ♦ నరుణారవిందాక్షుడై రాముడలుక
గాంధర్వశరము రాక్షసులపై నేయ ♦ సైంధవసింధురస్యందనసుభట
వీరులకమ్మహా విశిఖరాజంబు ♦ తేరిచూడగరాక దేదీప్యమాన
ధారాకరాళమై దనుజవర్గముల ♦ గారించినొంచి చీకాకుగావించి
దండించిఖండించి తలలుత్తరించి ♦ చెండాడుచోరణ క్షితియెల్లనిండి
యెందుజూచిన తురంగేభఖండములు ♦

యెందుజూచిననింగి కెగయుమొండెములు
నెందుజూచిన బ్రేవు సెలిచియుమెదడు ♦ నెందుజూచి నెత్తురేర్లునై యుండ
శాకినిభూత పిశాచభేతాళ ♦ ఢాకినులంత తండంబులై యపుడు [ముగ
నేనుంగుతలకాయ లెసగగుండలుగ ♦ బూనియుదలి ముత్యములుదండుల
దండిరామునిరణ ధర్మసత్రమున ♦ వండినారిదెరండు వరుసభుజింప
సనివేట్క పైకొన్న యధికారముద్ర ♦ గానిరొదగాకుండ గూర్చుండబెట్టి
రక్తచందనమును రక్తాక్షతములు ♦ రక్తసంకల్ప పూరంబునుదాల్చి
శిరవహ్నిపక్వమాంసంపుటన్నములు పొరలినమెదడుపప్పునుకొవ్వులందు
వరదలై యాజ్యప్రవాహముల్ కండ ♦ లెరిగికాంజము లనేక శాఖముల
పాలప్రేవులు శాపపాశముల్ మేలి ♦ వాలుగుండెలు పిండివంటలుమరియు
నెత్తురుతియ్యని నీరుగాదలచి ♦ యత్తరివిప్ర యోగ్యాహారమగుచు
నానందతృప్తులై యధికసమ్మతము ♦ చేనూనిపథగూడి శ్రీరామచంద్ర
"నీవిజయోఽస్తు"ని దీవించికొన్ని ♦ యావలగొన్ని "తథాఽస్తు"నిపల్క
నిలిలోమరికొన్ని యేనుంగుజీవ ♦ దంతఘుల్లేలను దాళముల్ బూని
పెలుసుబొమ్మలు సంకుపూసలపేర్లు ♦ కళుకు కామాక్షులుగా ధరియించి

—*: శ్రీరామునితో ఖరదూషణులు పోరుట :*—

కరఘుంటికాతాళ గతులకుబ్బుచును ♦ పరిజేరి కాపు లత్తరిజూపెకొన్ని
అంతదూషణుడు మత్తారిభీషణుడు ♦ పంతనొందుచు దనవద్ది యోధులను
విజయశీలురనైదువేల బంపుటయు ♦ త్రిజగముల్వొణక నెదిర్చి వారపుడు
చాపవిద్యాప్రౌఢి సకలంబుజూప ♦ జూపులగోపంబు చూపుచున్నపుడు
నొక్కొక్కశరమున నొక్కొక్కదనుజు ♦ వక్కకద్రుంచివిచారించివిభుడు

కొందఱు నందంద గుదులుగాఁ గ్రుచ్చి ♦ యందఱ దెగటార్చి యార్చినఁ జూచి
దూషణుఁ డప్పు డత్యుగ్రత బరుష ♦ భాషణుండై రాముపై దేర బఱపి
దశదిగంతంబులు దట్టంబు గాఁగ ♦ నశనికాలాహి తుల్యంబులై యొప్పు
నమ్ములు నిగుడింప నవ్విద్రుంచినాఁడు ♦ నమ్ములరథమును హయముల ద్రుంచి
వెరవొప్ప నాశకోల విలు ద్రుంచుటయును ♦
దుఱమున విరథుఁడై దూషణుం డలుక
దారుణపాణియై దారుణ విజయ ♦ కారణాంతక గదా కల్పమై యొప్పు [ము
పరిఘంబు ద్రిప్పుచు బరతేర రాము ♦ దురశరద్వయమున నురుబాహుయుగ
నరుసుగా దెగ నేసి యామ్యబాణమున ♦
నురమేయుటయు దైత్యుఁ డొరలుచుఁ గూలె
దంతముల్విరిగిన దారుణభద్ర ♦ దంతావళేంద్రంబు ధరఁ గూలినట్లు
కూలినఁ జూచి మూఁగ్గురు దండనాథు ♦ లాలోఁ బ్రమాథి మహాకపాలుండు
స్థూలాక్షుఁడును బరశువు త్రిశూలంబు ♦ కేలఁ బట్టసము లంకించి వైచుట యు
వారి శస్త్రంబులు వారి మస్తకము ♦ శ్రీరాముఁ డొక్కఁడే చండిచండాడె
నప్పుడు ఖరుఁడు సేనాధినాయకుల ♦ ముప్పురిఁగొను రోషమున బుఱికొల్పి
వారి పన్నిద్దర వార్యశౌర్యమున ♦ వీరరాఘవుఁ దాకి వేర్వేర బోర
కులిశధారాకార ఘోరబాణముల గలిమి జూపుచు సైన్యగాముఁ డొక్కఁడది
కాలకార్ముకు ద్రుంచి కరవీరనేత్రు ♦ దూలించి సర్పాస్యు త్రుళ్లడంగించి
యావిహంగము నొంచి యజ్ఞశాత్రవుని ♦ చేవయడంచి శిక్షించి దుర్జయుని
కేలి మహామాలి గెడపి యామేఘ ♦ మాలి నివధియించి వర్ధించి పరుష
బృథుకంఠుకంఠంబు పృథివిపై గూల్చి ♦ రుధిరాశను నిజంపి రోషంబు మిగుల
దిక్కడిఖరుఁడును త్రిశిరుండు దక్క ♦ తక్కిన వారినందఱ నేలఁ గూల్చె
యీలీల రాముచే నెల్లసైన్యములు ♦ గాలిచేఁ గూలిన కారాకులనఁగ
గూలి కోపంబు గొని కాలత్రిశిరు ♦ డాలోన రాముపై నరదంబు బరపి
సింహనాదము జేసి సి ధురోత్తమము ♦ సింహంబు నెదిరిన చెలువు నెదిరి
ఘుణనాదమెసఁగ రక్షోవీరుఁ డకట ♦ గణనాపరంపరల్ గడవ నందంద
నతులబాణము లేయ నలిగి రాఘవుఁడు ♦ ప్రతిబాణతతులచే బలువిడి ద్రుంచె
నాఁడును మరి పేరు వాడివాడిమిని ♦ మూఁడు బాణముల రాముని ఫాలమేసె
నావాడి బాణంబు లలికంబు దాఁక ♦ నవ్వుచు గినకమై నళినాప్తకులుఁడు
త్రిశిరుని నేసి వంద్రిశిరముల్ ఖసు సు ♦ దశ దాల్చె నిఁక చతుర్దశభువనములు
దూరి నని నుఁబట్టి తునుమాడు ట్టి ♦ దారుణతర చతుర్దశసాయకములు [లు
నే నేయ వాఁడ సహింపుమీ యనుచుఁ ♦ దా నేసె బదునాల్గు దారుణాస్త్రము

అవిలోమ్ముఁగొనిగాడి యవ్వలవెడల ♦ నవనీస్థలముగాఁడె నంతరాఘవుడు
అరదంబు మఱినాలుగమ్ములవిఱిచి ♦ యురువడిపదియింటనురమేయుటయును
సురవైరికిఁ బించిశూలంబు వైవ ♦ నరనాథుడది ద్రుంచెనాలుగస్త్రముల[ లె
ద్రుంచి మూఁడమ్ములదుదమూఁడు తలల ♦ ద్రుంచిన త్రిశిరుఁ డుదురమునఁ గూ
మూఁడుకొమ్మలతోడ మొదలంటఁ ద్రవ్వి ♦ పోడిమి చెడికూలుభూజంబు పోలె
త్రిశిరుండు గూలఁగ దృష్టించి ఖరుఁడు ♦ దశరథరాముచేఁతకుఁ జోద్యమంది
మఱిచాలఁ గోపించి మహనీయరథము ♦ కఱిమియుగ్రాస్త్రసంతతులేసి బాఁచి
శరలాఘవము మెచ్చి జానకీవిభుఁడు ♦ ఖరునిపై బ్రతిసాయకములు వేయుటయు
ఖరునిబాణములు రాఘవునిబాణములు ధరణీతలము వియత్తలమును బొదివె
నప్పుడర్కునిదీప్తులన్నియు మాసె ♦ గప్పెను బిడాంధకారంబు దిశల [చు
ఖరుని రాఘవుడు రాఘవుని నాఖరుఁడు ♦ పరకుగాఁగొని రాజిజయకాములగు
గాసరయుగళంబు కలభద్వయంబు ♦ కేసరియుగళంబు కెరలి యొండొండ
బోరెడుగతిఁ దోఁప భుజబలాటోప ♦ భూరిప్రతాపులై పోరాడుచోట
ఖరుఁడప్పుడలిగి రాఘవుచేతివిల్లు ♦ విరిద్రుంగ వెసనర్ధచంద్రబాణమున
ద్రుంచి జోదును ద్రుంచ దోడ్తోడ మఱియు ♦

ముంచె రాముని దేహమున నంపవెల్లి
నాయంపతండంబు నాతఁడు గరకు ♦ సేయక తను సురశ్రేణికీర్తింప
సుష్టాంశుకులుఁ డగస్త్యునిచేతఁ గొన్న ♦ వైష్ణవచాపంబు వడి నెక్కువెట్టి
శింజిని మ్రోయించి శరసాయకముల ♦ భంజించె రాక్షసప్రవరు కేతనము
మఱివాడు రాముమర్మములు చ్చిపార ♦ కఱుకుటమ్ములు నాల్గుఁ గ్రుద్దించి యేయ
రక్తసిక్తాంగుడై రాఘవుడంత ♦ నక్తంచరుని నొంచ నారాచనిహతి
బటుబాణమొకట చాపము ద్రుంచి వైచె ♦

యటనాలుగిట వాని హయముల జంపి
సారథిబడనేసి సాయకవహ్ని ♦ కారథంబపుడు పూర్ణాహుతి జేసె
విలుఁగోలుపడి యిట్లు విరథుడై ఖరుడు ♦ ప్రళయకాలాంతకప్రతిముడై కేల
జలమున గదగొంచు జనుదెంచుటయును ♦

జలియించెగిరులతో జగతియంతయును
నప్పుడు రఘురాముఁ డాదుష్టదైత్యు ♦ దప్పక కనుగొని దర్పించి పలికె
నోరిరాక్షస వినఁ గోరినాచేత ♦ శూరత నీకెల చొప్పడు నింక
నీబలంబులు జచ్చె నీవారు తెగిరి ♦ నీబాణసంపద నిర్మూలమయ్యె
వటుడుగానీదండకాటవి దొల్లి ♦ పెఱిగి సన్మునుల జంపిన పాపఫలము
కుడువగాలము వచ్చె గుడుతుగాకింక ♦ నదరి ఖండింతు ఘోరాజిలో నిన్ను

నవవృషుఖరుడప్పు డారాముజూచి ♦ కనలుచుబలికె దోర్గర్వంబుమెఱసి
మేలరాఘవనీకు నింతగర్వింప ♦ నాలంబులోఁగొందరల్పులఁజంపి
కేలయుచునినునీకె కీర్తించికొనకు ♦
కులజుండు తనుదానె కొనియాడ కొనునె
ఇదెగదాధరుడనై యేతెంచినాఁడ ♦ కదిసిపోరాడు నాకడిమియుజూడు
దేవతలకునైన తీరదుగెలువ ♦ నీవునామ్రందర నిలువసూకుడవె
రయుండొఁడగడగనీయొడలిమాంసములు ♦ చెండాడి నేడునా చెలియకిలిత్తు
ననిమహాగదద్రిప్పి యడరిపైచుటయు ♦ ననిలునివేగంబు నర్కుతేజంబు
ననలునివేడిమి యశనిబెట్టిదము ♦ ఘనగదారూపమై కదసినయట్లు
చనుదేరనుద్దండ చండకాండముల ♦ గనలకారాముడా గదద్రుంగనేసె

— *: ఖరుడు శ్రీరాముల నెదుర్చుట : * —

మూరి నీగర్వోక్తులుబ్బుచుమదము ♦ దీరెనె బింకముల్ దీరెనె యనుడు
గద్దింపుచనువాడు కడుఁడితోడ ♦ నద్దనుజుండు మహాకోపమునను
గ్రక్కునవృక్షమొక్కటి పెల్లగించి ♦ చిక్కినభుజశక్తి జిరజిరద్రిప్పి
చావుమటంచును జయ్యనవైవ ♦ నావృక్షముచుద్రుంచి యపుడురాఘవుడు
ఖరునిపై ఖరకర కరసహస్రాభ ♦ శరసహస్రము లేసి చాలనొప్పింప
నొచ్చియువాడు తనూరక్తధార ♦ పిచ్చిలతెచ్చు కోల్బిరంబుమీర
నెదురుగాజనుదేర నీక్షించిరాము ♦ డదయుడై భువనంబులన్నియువణక
నురువడినైంద్రాస్త్ర మొకటి సంధించి ♦
యురమేయుటయు దైత్యుఁ డుబ్బెల్లబొలిసి
పిడుగడచినకొండ పృథివిపై గూలు ♦ వడువునఖరుడంత వసుధపై గూలె
అనిముహూర్తము ముహూర్తార్ధంబులోన ♦
దను నెదిర్చిన చతుర్దశ సహస్రముల
ఖరదూషణాది రాక్షసులనీరీతి ♦ బొరిగొనుటయు రాముబొగడిసురలు
మునులుదీవించిరి మొగిబుష్పవృష్టి ♦ యనిమిషుల్గురియించి రారామువీఁద
ఘనశైలగుహనుండి కడకతోనంత ♦ జనకజగొనివచ్చి సౌమిత్రిమ్రొక్కి
యభినుతులొనరించి యప్పుడారామ ♦ విభునిచేకోల్భిల్లి విల్లందుకొనియె
నూనినసంతోషముల్లంబునిండ ♦ జానకీపతిపర్ణశాలకేతెంచి
గలహించి తెగినరాక్షసులభూమిజకు ♦ దెలియజెప్పుచు వినోదింపుచునుండె
అప్పుడాకంపను డఖిలకంపనుడు ♦ విపులార్తిలంక వేగంబెపోయి
యారావణునిగాంచి యసురాధినాథ ♦ వీరులుపదునాల్గువేల రాక్షసులు
ఖరదూషణాదులు కాకుత్స్థరాము ♦ శరవహ్నినీరైరి సత్యంబటన్న

అక్కజంబునుబొంది యాయకంపనుని ♦
ఉక్కుచిక్కనిరోష ద్రష్టిజూచుచును
నేడేమియిదివింత నెట్లురా మారి♦ రాముడెవ్వడురాజ రాజోస్వారాజో
యమరాజోవారైన యామహాఖరుని♦సమరానద్రిశిర దూషణులనుగెల్వ
జాలరట్టిప్రతాపశాలురనొక్క♦డేవిలగెల్చెమాకెరుగింపు తెలియ
నిదెయభయంబు నీకిచ్చితిననిన♦బదరకమరియకంపనుడు రాఘవుని
చరితంబుధైర్యంబుశౌర్యంబునతడు♦ఖరదూషణాదులఖండించుటయును
సౌమిత్రియందంబు జానకియంద♦మామూలముగజెప్ప నతడురోషించి
యుద్ధంబుసేయ నుద్యోగింపనతడు ♦ బద్ధమైత్రినియకంపనుడిట్టులనియె
రాక్షసేశ్వరవిను రఘురాముగెలువ♦పక్షివాహనశూల పాణులవశమె
మాటమాత్రంబునమహిజాయునకసము ♦ మీటనునూటనంమేటియేనేర్చు
గార్చిచ్చునైనను గరువలినైన♦నార్చనుగూర్చను నాతడేనేర్చు
భువనంబులన్నియు బూదిగావింప ♦ నవిబ్రోదిగావింప నాతడేనేర్చు
బాల్పడిబ్రహ్మాండ భాండంబునైన♦నిబ్బగుల్ప నానిపుణుండెనేర్చు
నదిగాననొకయుపాయంబునుగలదు♦కదనంబువలవదా కాకుత్స్థకులుని
దేవిలావణ్యవార్ధిని దెచ్చితేని♦యావియోగాగ్నిచే హతుడగునతడు
నావినిరాక్షసనాయకుండదియు♦భావించియాతనిబదినోళ్ళ బొగడి
హాటకరథమెక్కి యాయబ్ధిదాటి♦తాటకేయునిమంత్రి ధారేయుజేరి
యతనితోఖరదూషణాది రాక్షసులు ♦
హతులౌటయునుదాను నారాముదేవి
సీతదెచ్చుటకునాసించి వచ్చుటయు♦ప్రీతిజెప్పుటయు మారీచుడిట్లనియె
యిదియేమిరావణయెల్లభోగములు♦కొదలే సుఖమున గుడిచికూర్చుండి
యిట్టిదుర్బుద్ధి నీకెట్లొకోబుట్టె♦నెట్టిదుర్మతియు నీకీబుద్ధిచెప్పె
వానినీవటు పగవానిగానెరుగు♦మేనీకుబోరాని హితమతికాని
యితరుండగాడు నీకీబుద్ధిగాదు♦తక్షీబతివ్రతల కాశించుటతగదు
ఆశించితేని నీయన్వయంబెల్ల ♦ నాశమౌగానదానవ నాథనీవు
చనుములంకకు సుప్రసన్నుడవగుము♦గనుముసౌఖ్యము నీదుకాంతలవలన
ననినమారీచు వాక్యంబులప్పటికి♦విలంకకేతెంచె వింశతిభుజుడు
అంతనాఖరదూషణాది రాక్షసులు♦పంతంబుచెడి రాముబాణాగ్నిబడుట
యంతయునటుచూచి యాచుప్పనాతి ♦ సంతోషమెడలినజనిలంకజొచ్చి
యాసుధర్మాస్థానమందు జంతామ♦ణిసింహాసీనుండెడు యింద్రుడనగ
మానితంబగు సభామంటపవేది♦బూనిసింహాసనంబున నున్నవాని

గరుడోరగామర గంధర్వయువతు ♦ లురుమతిగొల్వ గొల్వున్న రావణుని
ఐరావతోగ్రదంతాగ్ర సంఘట్ట ♦ తోరస్థలస్థగి తోరుభూషణుని
సకలలోకైకభీషణుని సంగ్రామ ♦ కటకభీషణుని విద్వేషదూషణుని
గని [illegible] రోదుచుఁ గరములు మొగిచి ♦
తనలోని ఘనవిషాదము దోఁపఁబలికె
అసురేంద్ర లోకంబు లన్నిటియందు ♦ నసమానసత్వుండ వనఁ గొందు వీవు
కడిమి మై మూఁడు లోకంబు లరిపుల ♦ గడగి చంపితి నని గర్వితు వీవు
కడక నా రాజ్యము కంటకం బనుచు ♦ నాడివి పెల్లిచ్చి వినోదింతు వీవు
నీ విక్రమంబును నీ భుజాబలము ♦ నీ విభవంబు లన్నియును మున్నె గాక
యింక జెల్లునె యిది యెట్లనిన వేని ♦ గోఁక కవినుత ధానుకుల పావనుం
[illegible] దశరథ ధరణీవల్లభుఁడు ♦ తను బంప రాముఁడు తాపసవృత్తి
తనకుఁ గాదిలి సహోదరుఁడు లక్ష్మణుఁడు ♦ తన దేవి సీతయు దానును నేతెంచి
మును దండకా వనంబునకును వచ్చి ♦ యనుకంప మునులకు నభయం బొసంగి
వచ్చి యిమ్ముల బంచవటి యున్నచోట ♦ నిచ్చలో గామించి యేను దగ్గఱ
గరమర్థి నన్నిట్లు గాసి సేయుటయు ♦ ఖరునితోఁ జెప్పిన ఖరుఁడు బిట్టలిగి
రోషించి లయకాలరుద్రుండువోలె ♦ దూషణత్రిశిరులతో దండు వెడలి
నరభోజనులు పదునాలుగువేలు ♦ వరవీరభటులతో వడి నేగుదెంచి
బలువిడి రఘురాము బాణాగ్నిశిఖల ♦ బలములు దానును భస్మమై యుండె
రటుగాన నాథంగ మంతయు నీకు ♦ నిటనీవె గాక దిక్కెవ్వరు గలరు
ఇదె నాదు ముఖభంగ మీక్షింపు వాఁడు ♦ గొదుకక నీకొదువగాఁ గోకొల్పి వింపు
మునివనచ్చరు పందిరయాత్మ భావించి ♦ దనుజాధినాథుఁడా దానవతిమిర
జ్ఞాతివధంబు నీ చనన విధంబు ♦ ఖ్యాతి వింటివిగంటి విధియటులుండె
నో రామయా భామ నురుసత్వమెంత ♦ యో రూపమే ప్రాయ మెంత టివాఁడు
నలినితమ్ము నిరూప మది యెట్టిదతని ♦ సతి యైనసీత యే చందంబు నాఁకు
చెప్పుమా చూచి నీవున లెంకగల్ల ♦ దప్పి దీరుదు రక్తధారల నీకు

—*: శూర్పణఖ శ్రీరాముల రూపాతిశయము దెల్పుట :*—

నావిని యాశూర్పణఖ యిచ్చపోఁగి ♦ రావణుతోడ నేర్పడ నిట్టులనియె
యున్నతోన్నతవక్షుఁ డుత్పలశ్యాము ♦ డిన్ని లోకములకు నొక్కఁడు వాఁడు
నింగులబిక్కనివాఁడు మిహిరమండలము ♦ దెగడు తేజము వాఁడు ధీరుఁడు వాఁడు
ఆజానుబాహుఁ డుదగ్రవిక్రముఁడు ♦ రాజీవనేత్రుండు రామచంద్రుండు
నతపాపోపహత దూషణాది రాక్షసుల ♦ గృతమతి నొంటిగాఁ గెలిచినవాఁడు
హేమవర్ణుఁడు గాని యొన్ని చందముల ♦ సౌమిత్రి రఘురాముచందమే వాఁడు

జూడవో నాకీ యువ స్తగావించి ♦ నాడెరకసీత సౌందర్యంబువినుము
తెలిగొల్పఁజూచితి దేవగామినుల ♦ తతిఁగొనిజూచితి దనుజకన్యకల
చెలిమిమైఁజూచితి గిన్నరాంగనల ♦ బోలించిచూచితి భోగికామినుల
కలయంగఁజూచితి గంధర్వసతుల ♦ నలవడఁజూచితి యక్షకామినుల
జూచితి పార్వతి చూచితిరతిని ♦ జూచితిభారతి జూచితిలక్ష్మి
చూచితిరంభను జూచితిశచిని ♦ జూచితిభూలోక సుందరులెల్ల
ముసుకొనిజూచితి మునికన్యకలను ♦ బనివడిజూచితి బ్రాహ్మణస్త్రీల
నాచన్నులాకన్ను లాముద్దుపల్కు ♦ లాచెక్కులాముక్కు లాకోయుగంబు
లాతరునాకారు లావాలుచూపు ♦ లాతొడలాయొడ లాయొయ్యారంబు
లామందహాసంబు లావిలాసంబు ♦ లామృదుగమనంబు లాసుమసంబు
నేమందుఁబొగడగా నేయింతులందు ♦ భూమిజనేమని భూషింతుఁజెపుమ
నగడలోకము లేలు నీయట్టిపతికి ♦ గాఁగాక యాయింతి తగునెయ్యములకు
నాయిందుబింబాస్య యాచకోరాక్షి ♦ యాయలజవ్వని యాకుందరదన
యామత్తగజయాన యాలతాతన్వ ♦ యామానినీమణి యాపద్మగంధి
యాయింతినీయింతి వైయుండఁజేసి ♦ నీమానదనుజేశ నీరాజ్యమొప్పు
ననినరావణుడు కామాతురబుద్ధి ♦ మునుపకంపనుమాట ముద్దియమాట
వినవాక్క తెలిగించువిస్మయంబంది ♦ గొనకొన్నప్రేమమైగొలువుచాలించి
తనపాలివిధితన్ను దగిలిప్రేరేప ♦ జనియేకతంబున సారథిబిలిచి
యరదంబుదెమ్మన్న నతడట్లసేయ ♦ ఖరకరసదృశంబు కామచారంబు
ననుపమాయుధపూర్ణ మగురథంబెక్కి ♦ దినకరకోటి రదీప్తుఁడై మెరసి
గగనమార్గమున సాగరమధ్యవీథి ♦ దగినవస్తువిశేష తతులుచూచుచును
దమకించివడి సముద్రము దాటిపోయి ♦ క్రముకమరీచికా గరుహారికేళ
సాలతక్కోల రసాలవిశాల ♦ వేలావనంబులు వేడ్కఁగన్గొనుచు
గరుడుండు మునుసుధాకలశంబుదేర ♦ గరమర్దిబోవుచో గజకచ్ఛపముల
భక్షించకొఱకునై బడవాఁడినట్టి ♦ వృక్షంబుపక్షీంద్ర వృక్షలక్షణంబు
శతయోజనాయుతశాఖంబుమాని ♦ వ్రతముసుభద్రాఖ్య వెలయువటంబు
సుముఖుడై కనుగొంచు సురుచిరమహిమ ♦

నమరినయాసుచంద్రాశ్రమభూమి
గ్రమమొప్పజడలువల్కలములుదాల్చి ♦ సముదత్తుఁడై కడుసౌమ్యభావమున
ధ్యానిలవోనిష్ఠ దాలుపారుచున్న ♦ మారీచుజేరి సన్మానంబువడసి
యతిదీనవదనుడై యాపత్తికంతు ♦ డతనితోదనదు కార్యముజెప్పదొణగె
మారీచుఁడీవార్త మంత్రివిగాన ♦ నారకమరియును వచ్చినీకుము

తరణివంశుడు రామ ధరణివల్లభుడు ♦ ధరణియేలగనీక తండ్రిపొమ్మనిన
ననుజన్ముడును దాను నతివయు గూడి ♦ వనమునదపసులై వర్తింపవచ్చి
తనసత్వమున బేర్చి దండకారణ ♦ మునులకు నభయ మిమ్ముగలనిచ్చివచ్చి
నడుకంగ మనశూర్పణఖ ముక్కుచెవులు ♦
కడునల్కగోసి నక్కటయు కారణము
ఖరదూషణాది రాక్షసులఖండించె♦దరమిడిమటి చతుర్దశసహస్రముల
దెగినబంధులకు బ్రీతిప కారమేను ♦ నెగడిసేయకయున్న నెజిలిపోదు
నీవుమంగఅపిన నీతినట్లున్న ♦ నావలనభిమాన హానిగాకున్న
తగనటుగాన నాతని దేవిమాయ♦పొందగొని తేర బోవుచునుండి
యలవడనొక యుపాయముగంటినేను♦దలకొన్నయదినాకు దగిలిసిద్ధించు
నడరెదుకడకతో నాపర్ణశాల ♦ కడకేగిమాయా మృగంబవై నీవు
చెలగుచువర్తింప సీతనిన్జూచి ♦ మెలుపొందరామ సౌమిత్రులబిలచి
నినుబట్టితెమ్మన్న నీవునువారి♦గొనిపోయిమృగవృత్తిగుశలతమెఱసి [ము
పోయిదుర్గాంతరంబులగాడుపఅచి♦మాయమైనీ సూశ్రమమువచ్చి చోరు
ఏనునుజానకి నిబలంకలోని ♦ కూనినవేట్కమై నొగిదెచ్చుకొందు
నారాముడును విరహాగ్ని చేగుందు♦కోరియేనునుకోర్కి కొనసాగియుందు
నిదియిట్లగావింపు మేనునారాజ్య♦పదవిలో సగబాలు పంచిసేకిత్తు

—*: మారీచుడు రాముని ప్రభావము దెల్పుట :*—

ననవుడుమారీచు డానీచుజూచి ♦ ఘనభీతి నెంచికోక సముద్రవీచి
మునిగిమూర్ఛిల్లి లేచి మోమాటద్రోచి♦దను జేశమరియునీతల పెట్టుబుట్టి
గూడు నేయిటుబల్క గోరియాత్రోవ♦యోడక నీకెవ్వ డుప దేశమిచ్చె
సుఖసుఖంబుననుండి సుతసోదరాప్త♦నకలబాంధవులతో జావగోరెదవు
కటాకటాయవ్వనిగా జూచినావు♦కుటిలరాక్షసలోక కులభీమురాము
నేను బాల్యంబున నెఱుగుదుగొంతి ♦ యానిత్యకల్యాణుడసమసాహసుడు
యడరివిశ్వామిత్రు యాగంబుగావ♦కడిగియాతడువచ్చి కాపున్నచోట
బలిమిమైనేను సుబాహుండుపోర♦నలుకసుబాహు నొక్కమ్మునద్రుంచె
నొకకోలబుచ్చి పయోధిమధ్యమున ♦ ప్రకటితగతినన్నుబడవై చెనఱక
నకృతాస్త్రుడై బాలుడై పిన్ననాడె♦యకలంకుడిట్టి శౌర్యముజూపినాడు
నేడస్త్రబలశౌర్య నిధిరామచంద్రు ♦ వాడిమిజెనకి యవ్వరునిల్చువారు
ఇప్పటిశౌర్యంబు యెరుగుదుకొంత ♦ తప్పకవినుముగ్ర దానవాగ్రణుల
యిరువురతోగూడి యేపూర్వరోష♦
భరమునవ్యాఘ్రరూపముదాల్చియేను

దపమునఁగృశుఁగాఁగ దలఁపుచుఁబోవ ♦ నపుడేమి జెప్ప మూఁడంబకంబులను
ముగ్గురినేసిన మ్రొగ్గిరిద్దరును ♦ మ్రగ్గిరాయుశ్శేష మహిమయెట్టిదియొ
ఏనొక్కవిధమున నిక్కడఁగూలి ♦ ప్రాణంబులుండుట బట్టిచూచుకొని
యంతనుండి ఘురాము నతులవిక్రమము ♦ చింతించి నాలోని చేవఁబోవిడిచి
రవమన్న రథమన్న రమణియ్యమన్న ♦ రవియన్న రతియన్న రత్నంబులన్న
మరియు రేఫాది నామము లెవ్విన్న ♦ దరుచైనభీతి నాతనిఁగ నెన్నుచును
ఈవిధిఁ దపసినై యిట్లున్నవాఁడ ♦ రావణ యెఱుఁగవు రాముపౌరుషము
తలఁపకతనరోత తనుజూడదింత ♦ నలిమీరి మనశూర్పణఖయుతాఁబోయి
యనుపమగుణధాము నభిరాము రాము ♦ గనుఁగొని యారీతి కామింపదగునె
తనకునీవేషంబు తానెకావించి ♦ కొనియెనిందుకుమది గ్రోధించిపోయి
పరుషతరఘురాము బాణాగ్నిశిఖల ♦ ఖరదూషణాది రాక్షసులు నీరైరి
నీరికై నీవేల విపరీతబుద్ధి ♦ శ్రీరాముఁబగఁగొని చెడదలంచెదవు
ఇదివిచారముగాదు ఇదిబుద్ధిగాదు ♦ ఇదినీతిగాదింక నీతలంపుడుగు
నీవులంకకుఁబోయి నెమ్మదినుండు ♦ పోవ రామునిచేతఁ బోవుఁబ్రాణములు
ఏమునీకపకార మెన్నఁడుజేయు ♦ నేనేమిజెప్పిన హితముగాఁగొనుము
ఒచ్చెమెంచక కార్యమొనరించితేని ♦ యిచ్చదనగ రాజ్యమీవంటియిపుడు
చచ్చెరఘురాము జెనకయేబ్రతికి ♦ వచ్చుటకిందు కెవ్వఁడుపూట చెపుము
యని యిట్లుమారీచుఁడాడు వాక్యములు ♦ విని రావణుఁడు క్రోధవివశుఁడై పలికె
లోకైకభర్త త్రిలోకభీకరుఁడు ♦ నాకెక్కుడనియొక్క నరుని జెప్పెదవు
కడుఁబ్రాణభయమున గారులాడెదవు ♦ విడువక నాకొక్క వెఱపు జెప్పెదవు
నన్నురాజనుచు మనంబునఁగొనవు ♦ చిన్నబుచ్చెదవేను జెప్పినపనులు
నీవేమిటికిదోడు నినుదోడు వేఁడ ♦ నీవిధి వచ్చెనే యిప్పుడు నీకు
నని చంపఁదొణగిన నతనిరోషంబు ♦ కనుఁగొని మదిలోనఁ గడువిచారించి
మారీచుఁడీనీచ మరణంబుకంటె ♦ నారాముచే జచ్చుటది యొప్పుననుచు
దనుజాధిపతిఁ జూచి తగునీతి నీకు ♦ గొనకొని చెప్పినఁ గోపమేమిటికి
మరిబుద్ధిజెప్పిన మంత్రులఁబట్టి ♦ నరకఁదలంచు భూనాయకుల్గలరె
నీవేమిచెప్పిన నీచెప్పినట్లు ♦ గావింపఁగలవాఁడఁ గడముట్టననఁగ
ననురాగమునఁబొంది యతని మన్నించి ♦ తనరథంబెక్కించి తద్దయుఁబ్రీతి
నసమానవేగుఁడై యతఁడును దాను ♦ నసురాధిపతి వచ్చె నటపంచవటికి
అట్టిదకాదె కామాతురబుద్ధి ♦ యెట్టును జెడుఁద్రోవ యేటికిఁదోయు
నాయెడ మారీచు డరదంబుడిగ్గి ♦ యాయసురాధిపుఁ డపుడు ప్రార్థింప
మాయావిగాననమానుషమహిమ ♦ మాయామృగాకృతి మదివిచారించి

మేలైనకనకంబు మేనునుగుచిర ♦ నీలనీలాయత నేత్రయుగ్మంబు
పవడంపుబొమలును ఫా స్లిల్లువజ్ర♦నివహాకర్ణంబులు నీలవాలములు
పొలుచుపచ్చని శృంగములు ముత్తియంబు ♦
తొలుకులరత్న బిందువులైన పొడలు
రాజిల్లునవపద్మ రాగోదరంబు ♦ రాజితఖురములు రమణమైయమర
జగతిపైరోహణాచలమొప్పుమిగిలిమృగరూపమైవచ్చి మెలగుచున్నదియొ
గాదేని రాక్షస తేయముగాపింప♦నాదటచింతించి యబ్జసంభవుడు
మెఱుగులెల్లనుగూర్చి మృగముగాజేసి♦కంటిపైమెపుత్తెర గావచ్చినదియొ
జానకినెరివేణి శక్రనీలముల ♦ నానాతిదంతంబు లాణిముత్యముల
భామినికెమ్మోవి పవడంపులతల ♦ గామినిచెక్కులు కడిమివజ్రముల
వైదేహితనుకాంతి వైడూర్యమణుల♦నాదేవినూగారు హరితరత్నముల
భామపాణిద్యుతుల్ పద్మరాగముల ♦ గోమలిముఖకాంతి గోమేధికముల
బటుతేజమునచాల బ్రహసించుటయును ♦
నటులగీప్పడివచ్చి యఖిలరత్నములు
రత్నగర్భాత్మజా రత్నంబునలప ♦ యత్నంబుతో మృగంబై వచ్చినదియొ
సీతకై తనవిల్లు చేకొనివిరిచె ♦ నీతరిరఘురాము నెలయింతుననుచు
హరుడుబుత్తేరగా నాతనిచేతి ♦ హరిణమిచ్చోటికై యరుదెంచినదియొ

—:* మారీచుడు మాయామృగ రూపధారియై వచ్చుట *:—

సీతమామునకోటి సీత్రభమింప♦శీతాంశుడనుప వచ్చినమాయ లేడో
యనిచిత్రవర్ణంబులైనదీధితుల ♦ బెనగొనియందంద బేర్చిశోభిల్ల
గపటసారంగమై కదియనేతెంచి ♦ యుపమింపనరుదైనయొప్పులనొప్పి
నెమకుచుబులుమేయు నిజవాలరుచుల ♦
రమణమైవన మయూరములనాడించు
దళమిసియొకమాటు తనపార్శ్వరుచుల♦బలుపైనవనమెల్ల పసిడిగావించు
గడియకనొక మాటుకుప్పించిదాటి♦త్రిదశేంద్రచాపంబు తెఱగుగావించు
నొకమాటుచెంగున నుప్పరంబెగసి♦ప్రకటించునతుల శంపాలతారుచుల
తరిగొనియొకమాటుతనపార్శ్వరుచుల నెరిచంద్రకాంతముల్నీరుగావించు
మృగయూథములగూడి మెలగుచుమేయు ♦
మృగముల బెదరించు మెల్లనెడాగు
నంతంతబొడజూపు నటచేరవచ్చు ♦ నంతలోబెదరి చుట్టదరికుప్పించు
దరులనీడలకుల్కు దగబర్ణశాల ♦ బారబారునంతన స్రుక్కుక్రేళ్లుఱుకు
వసుధమూర్కొనిచూచు వాలమల్లార్చు♦దెసలకుచెవిచేర్చు దెలియనాలించు

కంచుమించైపాకు గ్రమ్మర జేరు ♦ కుంచితాకృతిచెవి కొనగదలించు
బచ్చికపట్లపై బవళించిలేచు ♦ మచ్చికనచ్చోట మానుల జేరు
ఖురముల జెవిగోకు గొమ్ములతుదల ♦ విరులతీగెగదల్చి విరులెల్ల రాల్చు
నందందనందమై యాపర్ణశాల ♦ ముందరమృగమిటు మోదించుచుండె
నావేళసీతయు నలరులు చిదుము ♦ లావణ్యశీల యల్లనపర్ణశాల
మంజుళసింజాను మంజీరరవము ♦ రంజిల్ల వెడలి సౌరభములపొదల
పొదలడాయుచు విరుల్ప్రోవగగోయుచును ♦
మదికివిస్మయమంది మాయంపులేడి
గనుగొనినదై దేహ కడుసౌఖ్యమంది ♦యినకులాధిపుజూచి యిట్లనిపలికె
చూపులకింపార సొంపుగల్పింప♦నేపారియున్నది యేమిసోద్యంబు [యు
నీపాంతవింతయైయుదియొక్కమృగము♦భూపాలచూచితెపొదలు చున్నది
యెన్నడుపొడగాన మిన్నిచందముల ♦ వన్నెలమృగములవనభూములందు
జగతీశయీమృగ చర్మంబునందు ♦ తగిలిసుఖింప నెంతయువేడ్క బుట్టె
దిననాధకులనాధ దీనివెన్దగిలి ♦ చనివేసి వెసదీని చర్మంబుదెమ్ము
అదియేలనీ యుపాయంబునదీని ♦ చెవరకపట్టి తెచ్చెదవేనిమిగుల
మంచిది ప్రాణేశ మనవనవాస ♦ మెంచగనదితీరె నీపైడిమృగము
బుకికివేడుకగొని పోయిరుత్తలకు♦భరతాదులకు వేడ్క బఱపంగవచ్చు
ననిసీత ప్రీతిమై నాడువాక్యములు ♦ వినిలక్ష్మణుండు రామవిభుజూచిపలికె
మృగరాజుకునిట్టి మేనులేదుర్వి ♦ మృగమాత్రమున కిట్టి మేనెందుగలదు
మాయామృగముదీనిమరినమ్మదగదు♦మాయావులసురలమాయగానోపు
నదిగాకనిచటి సంయములుమారీచు ♦
డదయుడై మాయావియై యిందుమెలగు
ననిబల్కవినమెయామాయసురగాబోలు♦మనలభ్రమింపనీమాట్కి నేతెంచె
చిత్తంబుదీనిపై జేరిచిమీర ♦ లుత్తలపడిపట్ట నూహింపవలదు
అరయవై దేహ యతిముగ్ధయైన♦మీరలు ముగ్ధలే మేదినీనాధ
యనినరాముడు సీత యాననాంబుజము♦కనుగొనినవ్వుచు లక్ష్మణుజూచిపలికె
జలియింపనేటికి సౌమిత్రియింత♦యిలరాక్షసులమాయ లెదురునేనన్న
మృగమేనిగొనివత్తు మేటిరక్కసుల♦దెగనేనుపారివుత్తు దెలిసియీరెండు
తెంపుమైలక్ష్మణ దీనివెన్దగిలి♦చంపిచర్మముదెచ్చి జానకికిత్తు
నివ్వాళ్ళకును సెంకికోర్కెవేడె♦చిన్నిబుత్తునె సీత చెప్పినమాట
హితమతివై పూని యాపర్ణశాల ♦ నతివనేమఱకుమీ వనియొప్పగించి
బిట్లనరఘురాముండనుజుచేనున్న♦విల్లందియోపెట్టి వెరవొప్పగద్దలి

యాగమృగంబుమున్నర్థి వెన్కొనిన యాగజాసురవైరియనఁ జెన్నుమిగిలి
కొంకుచుఁ బొదమఱుంగునఁ బొంచిపొంచి ♦
క్రుంకుచు నంతతఁ గూడదాఁటుచును
మగిడిచూచుటయును మఱుఁగుననిలిచి తగులునబట్టంగదమకమందుచును
విల్లునమ్మునుఁ వెన్కఁద్రేలిచిపట్టి♦యల్లనచరణంబు లవనిపైనిడుచుఁ
జప్పుడుగాకుండఁజనుచుఁబట్టుటకు♦ జొప్పడునొప్పను జూచిడాయుచును
నదె చేరిపట్టెద నదె చేరెననుచు♦నదియెలోఁపడియెనాకని చెలఁగుచును
నివ్విధంబునబోవ నేచియామృగము♦దవ్వులఁబొడచూపుఁదనుఁజేరవచ్చు
బట్టఁబోయిన మిట్టిపడిపాఱిపోవుఁ♦ గట్టల్క రామునిఁ గన్నంతవిలుచుఁ
బలుదెసలకుఁబాఱుఁబాళితోఁగూడి ♦ సెలవులపులురాల్చుఁ జేష్టలుమాను
నెసఁగివీక్షింపఁబైకెగసి క్రేళ్లుఱుకు ♦ బసమించిమిన్నులపైఁబాఱుచుందు
గుప్పించిదాఁటుఁజెంగునఁదీగమఱుఁగు♦ ద్రిప్పినగతిజిహ్వత్రిప్పునఁదండ
కొఱవిద్రిప్పినరీతిఁగుమ్మరిసారె ♦ తెఱఁగునబ్రమసి దిర్దిరఁదిరుగుచును
బడలినగతిద్రొమ్మొగ్గుఁ బజ్జకేతేర ♦ వడిసాళువంబుకైవడి మింటికెగయు
నలసి రాముఁడు వెఱఁగంది నిల్చుటయుఁ ♦

గెఱఁకులఁ బొడచూపుఁగికురించి మొలఁగుఁ

దెగియేయదలపనదృశ్యమై పోవు♦మగిడిరాఁదలఁచిన మఱిమ్రోలనిలుచు
గలగొనియీభంగిగాకుత్స్థముఖ్యు ♦ నలయించియలయించియవలకునవల
గొనిపోయిపోయియాఘోరదుర్గములఁ ♦
గనుఁబ్రామియటఁబోవ ♦ గడిగినఁజూచి
మాయామృగంబనిమరిరాముఁడెఱిఁగి ♦ దాయనీవెక్కడదప్పిపోయెదవు

—:* మాయామృగము రామునిచేఁ గూలుట *:—

అగపడితంచు బ్రహ్మాస్త్రంబుదొడుగ నగములువడఁకెఁబన్నగభర్తదలఁకె
జగములుబెదరెదిక్చక్రంబులదరె ♦ దెగఁగొనిదృష్టిసంధించియేయుటయు
నాలోననొఱలుచు నారూపముడిగి ♦ హాలక్ష్మణాయను నార్తరావమున
దెసలద్రువంగ మహాదీర్ఘదేహమున♦నసువులు పెడబాసియసురయైపుడమి
గూలెరాక్షసలక్ష్మి గూలెరావణుఁడు♦గూలెలంకాపురి గూలెనన్నట్లు
అంతమాయామృగమవని ద్రెళ్ళుటయు♦సంతోషమునదానిజానకీవిభుడు
గనుఁగొనిమారీచుఁగానిశ్చయించి తనతమ్ముమాటలుదలఁచి మెచ్చుచును
సౌమిత్రిసీత నీచపలరాక్షసుని ♦ యీమహారవమున కెంత వేగెదరో
యనితలంకుచునుండ నాయార్తరవము♦విని సీత భీతిల్లి వెసనుర్విఁద్రెళ్ళి
తెలిసిదిక్కులుచూచిధృతిదీరడించి ♦ లలిఁదూలియెలుఁగెత్తిలక్ష్మణుజూచి

సౌమిత్రి యిది యేమి చందమో నేఁడు ♦ రాముఁడు నిన్నార్తరవమునఁ జీఱె
వనఘు నీవా పలుకాలింపలేదు ♦ వినవొల్లవో కాక వినరాదొ నీకు
నులుకవు భీతిల్ల నొకకొంత గలఁగ ♦ వఁయఁవు శోకింప వది యేమి నీవు
నానావిధంబుల నాయంతరంగ ♦ మూనిన వగలఁ బెల్లుడుకుచున్నదియు
నడవుల గొంటివై నటు పోయినాఁడు ♦ తడవాయె రాఁడు యుద్ధంబున నేఁడు
కడిఁది రక్కసుల కెక్కడఁ జిక్కినాఁడొ ♦ తడయక పోవన్న ధరణీశు వెదుక
నని యశ్రుపూరంబు లందందఁ దొరుగు ♦
జనకనందనకు లక్ష్మణుఁ డిట్టులనియె
దల్లి నీ వేటికిఁ దలఁకెదు రామ ♦ వల్లభునకుఁ గీడు వచ్చుట లేదు [నె
ఎఱుఁగ వే నీకూర్మిహృదయేశు మహిమ ♦ లెఱిఁగి యీ వెడమాటలిట్లాడదగు
నివ్వటిల్లెడి నగ నిన్నింత గలఁప ♦ నెవ్వఁడో రాక్షసుం డిటు చీఱెఁ గాక
యినకులాధిపుఁ డేడ నీ దైన్యమేడ ♦ జనకజ నీ వేల చంచలించెదవు
దలమీఱి రఘురామధరణీశుఁ డొడరి ♦ పొలియక నిలుతురే పోర రాక్షసులు
మిడుతలు కార్చిచ్చు మీఁద గవ్వించి ♦ పడికల్వ నేర్చునె భస్మంబు గాక
కావున రామాజ్ఞఁ గడఁచి నిన్ డించి ♦ పోవఁ జూచుట నాకు బుద్ధిగాదింక
నీ కానలోపల నేఁడించి పోవ ♦ నేకీడు వచ్చునో యేఁబోక వెఱతు
నలయక నా మాట లాత్మలో నమ్ము ♦ తలఁకకు మనవుడు ధాత్రీతనూజ
రోసిన కోపాగ్ని లోఁగి మండుచుండ ♦ వలయుచు సౌమిత్రి నటు చూచి పలికె
నీవు రాముని దెస నెఱయ భక్తుఁడవు ♦ ఈ వేళ నేఁడింత నీచుండవైతి
శ్రీరాముఁ డిటు నిన్నుఁ జీరుట వినియు ♦ దారుణమతిఁ బగదాయ చందమున
నెమ్మది నున్నావు నీ కిది దగునె ♦ తమ్ముఁడు ప్రాజ్ఞుఁ డుత్తముఁ డీతఁ డనుచు
భూపతి నిను నమ్మి పోయిన చోట ♦ నీ పాపవర్తన మేల కైకొంటి
వగు నెరింగితి రాముఁ డసురుల చేతఁ ♦ దెగుట నిక్కముగాఁగఁ దెలిసి నీవర్థి
ననుచిత మతిఁ బూని యాస్వాము డిగి ♦ ననుఁ బొందదలచెదో నా నన్నో విడిచి
కాదేసఁ గొనిపోయి కైకేయి సుతుని ♦ కాదట నొప్పింతు ననితలంచెదవొ
ఏను నా దగు జీవ మీ శరీరమునఁ ♦ బూనఁ దలంచుట బుద్ధిగాదింకఁ
దడయక పోయి గోదావరిలోనఁ ♦ బడి ప్రాణములు విడ్తుఁ బలుకులింకేల
యని బెసిద పుమాట లవనిజ వలుక ♦ విని లక్ష్మణుఁడు చాల వేసనఁ బొంది
రాముఁ బేర్కొని కర్ణరంధ్రముల్ మూసి ♦ దీమసంబున నాల్గు దిక్కులు చూచి
పలుమఱు పాపముల్ పలుకుచున్నదియు ♦ తెలియ వింటిరె వనదేవతలార
మీ రిందఱును సాక్షి మేదినీతనయ ♦ ఘోర భాషల నన్ను గ్రూరత బలికె
నని బాష్పలోచనుండై లక్ష్మణుండు ♦ తన మది నిక నిల్వఁ దగవు గాదనుచు

దల్లి యేఁ గెడవోయి తడయక నీకు♦ వల్లభు గొనివత్తు వగవకు మనుచు
జగతీతనూజకు సద్భక్తి మ్రొక్కి♦ పొగలుచు రాముచొప్పున బోయె నంత
దీపింపఁ ఘనదివ్యతేజంబు వెలుఁగ♦ నాపడతియు నుండె నట్ల చింతిలుచు
అత్తరి రావణుం డారూపముడిగి ♦ యుత్తలంబున చిత్తములంచుచు నూఁద

—*: రావణుడు భిక్షుక వేషధారియై సీతవద్దికేతెంచుట :*—

గరమున దండంబు ఘనకమండలము♦ సురులలాటంబున నూర్ధ్వపుండ్రంబు
కొలఁదులై వ్రేళ్లను గుశపవిత్రములు♦ పొలుపొందఁ బేరురంబున జన్నిదములు
వరుదుగా వలచేత నక్షమాలికయు♦ సరిబూనియున్నట్టి కాయవస్త్రములు
తులసిపూసల పేర్ల తోడము దరికి♦ వలనొప్ప నొక్కింత వ్రాలిన మెడయు
బడుగు దేహంబును బావాలుచింపి గొడుగును వెడముడి గొనియున్న శిఖయు
నలవడగ పట సన్యాసి వేషంబు♦ విలసిల్ల వెడ వెడ వ్రేళ్ళెన్ని కొనుచు [చు
గొన్ని మంత్రంబులు గొణగుచు మునులు♦ తన్నరింగెదరంచు దత్తరించుచు
దలగొన్న ముదిమి చేదలవడం కంగ♦ నలయుచు కొలయుచు నసురుసురనుచు
నంతంత నిలుచుచు హరిహరియనుచు♦ శాంతి బొందుచు బర్ణశాలకేతెంచు
దనుజాధివను దేవతలు జగద్ద్రోహి♦ చనుదెంచె వీడని సభయులై యొదుఁగ
నిక్కపు మునిబోలి నిలిచిన జూచి♦ గ్రక్కున వైదేహి కడుభక్తి లేచి
యక్కపటాత్మ్ము సన్యాసి గాదలచి♦ మ్రొక్కి హస్తాంబుజంబులు ముకుళించి
పొలతి యర్ఘ్యాగత పూజగావించి♦ కలగుచు నట్లున్న కల్యాణి జూచి
వోభామ నీకిట్టి యుగ్ర దుర్గముల♦ నెబ్బంగి చరియించె డెట్లొంటి నిలిచి
రతివో శ్రీసతివో భారతివో గాకున్న♦ క్షితిమర్త్యసతులకీ చెలువంబు గలదె
నీమోము పండువెన్నెల పిండు దెగడు♦ నీ మోవి కెంపరా నిగ్గుల దెగడు
నీ మేను సౌదామిని లత గేరు ♦ నీమాటసుధ తేట సీటులదేరు
నీవేణి జలదవేణి కలబోదరుము♦ నీవిలాసంబు వర్ణింపనాతరమె
తరుణి నీ కౌగిట దవిలి సుఖించు♦ పురుషుఁడే తలపోయ బురుషోత్తముండు
కామివి నీపొందు గలవాడు పూర్ణ♦ కాముడాతడు నిత్యకళ్యాణుడరయ
నిచ్చట నీయున్కి కెంత యూవగవు♦ నచ్చెరువయ్యెద నబ్జాక్షి మాను
నెలత నీవెవ్వరు నీవేలయింత ♦ నలిగెద విక్కానన ములలో నిలిచి
యెంతయు నెఱిఁగింపు మనవుడు సీత♦ యెంతయు భక్తితో నిట్లని పలికె
ననఘాత్మ రఘురాము నతివ మాతండ్రి ♦
జనకుడు దశరథేశ్వరుడు మామామ
నా పేరు సీత యున్నతకీర్తిరామ♦ భూపతి తమతండ్రి బొమ్మన్న వెడలి
గానసంబులనుండ గడగివచ్చుటయు♦ నేను లక్ష్మణుఁడును నేగుదెంచితిమి

ఈయాశ్రమంబున నేముమువ్వురము ♦ పాయనినియతి తాపసులమైయుండ
కొలసియామందర నొక పైడిమృగము ♦
పొలయుటయును జూచి భూనాథుఁజూచి
దానినేగతినైన నదనకు దెమ్మనిన ♦ బూసి రాముఁడుపోయె బోయిఁ పిదప
హాలక్ష్మణాయను నార్తరావంబు ♦ శూలమైనా చెవిఁజొచ్చినాటుటయు
బాగడిలక్ష్మణుఁడిట్టిపొమ్మన్న పోయెమగుడిరాఁడిది యేమిమార్గమో యెఱుఁగ
నని చెప్పిమునిఁజూచి యనఘునీపేరు ♦ వినుపి పుడిందేల విచ్చేసితనిన
కొంకకతరధైవ కుహకత్వముడిగి ♦ లంకాధినాథుఁడా లలనకిట్లనియె
వనజాక్షివినునేను వనధిమధ్యమున ♦ నెనయులంకాపురం బేలెడువాఁడ
రాక్షసాధిపుఁడవిశ్రవసునందనుఁడ ♦ యక్షేశునను జుండ నఖిలదిగ్జయుఁడ
రావణుఁడనువాఁడ రణములోనదిరి ♦ దేవాసురులనైన దెగటార్చువాఁడ
వనితనీరూపలావణ్య సంపదలు ♦ వినిజూడవచ్చితి వేట్కలుబూని
నవయుచు బేదమానవునితోఁగూడి ♦ యువిదనీకడవుల నుండ నేమిటికి
నా రాజ్యమంతయు నళినాయతాక్షి ♦ కోరి యేలుచునీవు కొమరుదీపింప
బాగడొందఁ బెంపొందు పుష్పకంబాది ♦
యగువిమానములందు హర్మ్యంబులందు
సురగరుడోరగా సురసిద్ధసాధ్య ♦ వరకన్యకలుగొల్వ వర్తింతుగాక
రమ్మునాలంకాపురమ్మునకనిన ♦ నమ్మాటవిని సీతయతిభీతయగుచు
ధీరగాపునవాని దృణముగాఁజూచి ♦ తీరుఁదనచేతి తృణముజూచుచును
నారపతివ్రతా చారగాయనక ♦ యోరినన్నిట్లాడ నుచితమే నీకు
ననిమిష యోగ్య పూర్ణాహుతిశునక ♦ మునకుదుర్లభమైన పోల్కి భావింప
శ్రీరామచంద్రుని జెందిననన్ను ♦ గోరి కామింపనీకును నెన్నిగుండెలు
పొమ్ముగుటువనీవు పురవరంబునకు ♦ నెమ్మదిబోక దుర్నీతియేమైన
దలచితివేనినాథవుడు రాఘవుఁడు ♦ విలసితశస్త్రాస్త్ర విదితరాఘవుఁడు
హరచండకోదండ హరణవినోది ♦ ఖరదూషణాది రాక్షసశిరచ్ఛేది
నిన్నునీవంశంబు నీఱుగావించు ♦ నెన్నంగనీకు నా యినకులాగ్రణికి
నక్కకుసింహంబునకును దోమకును ♦ దిక్కరికిని పయోధికిని కాలువకు
వాయసంబునకును వైనతేయునకు ♦ నేయంతరము పెద్ద లేర్పరింపుదురు
నాయంతరముగల్గు నటుగాననీవు ♦ ధీయుక్తిఁ గొంకక తిరిగిపొమ్మంక
ననవుడురావణుండాగ్రహోదగ్ర ♦ జనితోగ్రదృష్టిచే జానకిజూచి
యనుపమాటోపుడై యారూపముడిగి ♦ తనతనునోవిధికందర్పుడు వెలుఁగ
మదియువస్థలదోచి భాసిల్లుపగిది ♦ పదితలల్ మణిజూట పంక్తులనొప్ప

నాయవస్థఁ గోర్కెలవియున్నడింపఁ ♦ బాయనిగతినొప్పు బాహులిర్వాదియు
గొనలిన్నడించె గోర్కెలుపల్లవించె ♦ ననపద్మరుచులైన హస్తంబులొప్ప
«లితోఁచిగోర్కె పల్లవములుపుష్ప ♦
ములుబోలెనాయుధంబులు పొల్పుమిగుల
బరగదివ్యాంబరాభరణైక కాంతు ♦ లరుదారమదనాగ్నులై మండుచుండ
నతిభీకరాకారుడై నిల్చుటయును ♦ ధృతిదూలిసీత భీతిల్లి మూర్ఛిల్లి
వడిగాలిబడియున్న వనలతవోలె ♦ బడియున్నగన్గొని పఙ్క్తికంధరుడు
గ్రమ్మియశ్రువులొల్కఁ గాదిగలొల్క ♦ గ్రొమ్మిడిబిగిపీడ గుచములల్లాడ
నందంపుదెగిరాల హారరత్నములు ♦ పొందినభయశోకముల మేనువడక
నచ్చారులోచన యదయుడై యెత్తి ♦ తెచ్చిరథంబుపై దెఱగొప్పబెట్టి
దైవంబు ప్రేరేప దనిపాలిమృత్యు ♦ దేవతగొనిపోవు తెఱగుదీపి ప
నమరారిగొనిపోవ నాకాశవీధి ♦ గమలలోచన దేవి కనువిచ్చిచూచి
పెదవులుదడపుచు బిగిచన్నదోయి ♦ బ్రిదిలినపయ్యెద బిగియజేర్చుచును
వేడ్కజకోముర ల్వెన్నెలగ్రోల్క ♦ మాటిదమ్ములజారు మకరందమనగ

—:* జానకి శోకించుట *:—

నాననశశిదోచు నమృతబిందువుల ♦ పూనికెకన్నీరు పొటపొటదొరుగ
నెలుగెత్తికొదమ కోయిలగూసినట్లు ♦ పలుమాఱు విధిదూఱి ప్రాణేశుజీఱి
యలతయుగోపంబు నతివిషాదంబు ♦ వెలవెఁ బాటునై విలపింపదొడగె
నోరాఘువేశ్వర యోరామచంద్ర ♦ నీరజహితవంశ నీదేవినన్ను
ననదజ దంబున నక్కటాయిపుడు ♦ గొనిపోవుచున్నాడు కుటిలరాక్షసుడు
వేవేగ చనుదెంచి వీనినిర్జించి ♦ కావవే నా లజ్జ కావవే నన్ను
నేలరా రాక్షస యీనిందనీకు ♦ నీలంకయేలరా నీవెకాల్చెదవు
తగదు రానీకు నీదారుణక్రమము ♦ తెంటార్చురానిన్ను దివిరిరాఘవుడు
కనకమృగంబేల గనుగొంటినేను ♦ నినవంశవల్లభు నేలపొమ్మంటి
గాదన్నపలుకేల గైకొననైతి ♦ మేదినీవిభుడేల మృగముదేబోయె
జగతీశులావేళ చర్చింపనైతి ♦ బగిలి లక్ష్మణునేల పొమ్మంటిదిట్టి
నాపాలివిధియేల ననుబోవనిచ్చు ♦ నీపల్కు లేటికి నిటుసేయకున్న
నన్నలక్ష్మణునిన్ను నభిమానధన్యు ♦ గన్నతల్లిగనన్ను గరమర్థినెన్ను
నున్నతగుణమాన్యు నుదితసౌజన్యు ♦ నన్ని తెఱంగుల నాడినఫలము
గుడిచితివేవేగ కోపంబుదక్క ♦ కడువేగమునవచ్చి కావవేనన్ను
నక్కటాకైక నీవడిగినవరము ♦ లిక్కడజేకూరెనే యిటమీద
నీకుమారుండును నీవునుగూడి ♦ యేకాతపత్రత నేలుడీవసుధ

నని రామవిభుజేరి యసురేశుదూరి ♦ తన శాంతి బొగడి యా దైవంబు దెగడి
కాకుత్స్థతిలకు లక్ష్మణుగొనియాడి ♦ కైకబోనాడి శోకంబున మఱియు
మిథిలేశుకూతుర మేదినిబంక్తి ♦ రఘునకు గోడల రాముని దేవి
వంతురై కావ నెవ్వరులేనిచోట ♦ బాలదిండిచెఱగొని పోవుచున్నాడు
తరులార నా సహోదరులార మీరు ♦ ధరణీశ్వరునితోడ దగ జెప్పరయ్య
సురలార మీరైన సురవైరిదాకి ♦ వెరవొప్ప నా చెఱ విడిపించరయ్య
నిండినభక్తితో నిన్నాశ్రయించి ♦ యుండితినను గావ నుచితమీవేళ
దగిలినీవైన గోదావరీదేవి ♦ జగతీశ్వరునితోడ జని తెల్పవమ్మ
ప్రల్లదుచే జెఱబడి చిక్కువడితి ♦ తల్లివై నను దయగావవలదె
భూదేవి రఘురామ భూపాలమణికి ♦ నీదురవస్థపెం పెరుగింపవమ్మ
వీకువారవక నీపథమునజేర ♦ నోరెండెధృతిదూలి నెచ్చె ప్రాణములు
ననుగావరయ్య కిన్నరులార పుణ్య ♦ ...రులార ఘనులార తాపసులార
కృతులార హితులార ఖేచరులార ♦ వ్రతులార హితులార వనపక్షులార
కరులార హరులార గంధర్వులార ♦ నరులార సురలార నాగేంద్రులార
యని పెక్కుభంగుల నమ్మహీతనయ ♦ పొనుపడిశోకింప భూదేవివడకె
గౌతమివారక గ్రక్కునిలిచె ♦ నాతరిసకలభూతాక్రోశ మెసగె
నన్యాయమన్యాయమని మమల్కపట ♦ సన్యాసిరావణు చందంబు దెలిసి
పొగిలిరిశోకాశ్రు పూరముల్ దొరుగ ♦

మృగములువినుచుండ మేతలుమఱచె
పక్షులువాపోయె బవనంబులడగె వృక్షముల్ వాడెన విలమయ్యెనభము
దిక్కులుపగిలె నాదిసమణినొగిలె ♦ దిక్కెడియనిధర్మ దేవతపొగిలె
వనదేవతలుచాల వగచిరిసాధు ♦ జనులెల్ల నేడ్చిరి జానకిజూచి
అత్తఱివిహగేంద్రు డరుణతనూజ ♦ డుత్తమసాహసుండొక కొండనుండి
యొక్క లుండగు జటాయువులిట్టువినియె ♦

నక్కటారఘురామ యనువార్తరవము
వినిసంభ్రమించినివ్వెఱగందిదిశలు ♦ గనుగొని మొగమెత్తిగగనంబుజూచి
యజయుడై రావణుడా రాముదేవి ♦ పొదివియిమ్మల గొనిపోవుచున్నాడు
నాడీవనంబున ననుగన్న మొదలు ♦ పోడిమిఘనమైత్రి బ్రోచురాఘవుడు
తగదిక వర్జింప దైత్యునిర్జించి ♦ తెగువమ్మైవై దేహి దెత్తునాండేని
యినకులాధిపునకు నింక ప్రాణముల ♦ నని మొనసొప్పింతు నని నిశ్చయించి
కులిశంబుధార తాకునకు నెబ్బంగి ♦ నలవిగాకెగయు మహాద్రిచందమున
నురుశక్తిమైబెంచి యుంకించియెగసి ♦ బుడిపొరిగిరిశృంగములు నుగ్గుగాగ

మరలించి పుక్కిటమాంసఖండములు ♦ ధరణిపై యుమిసియుదగ్ర భావమున
కరనఖంబులనున్న కరిసింహశరభ ♦ శిరములంతంతక చ్చెరువుగాదొరుగ
బటుతుండరోచులు పక్షదీధితులు ♦ చటులకోపోగ్ర లోచనములువనర
బక్షానిలంబుల బర్వతాగ్రముల ♦ వృక్షముల్విరిగి దిగ్వివరముల్ నిండ
బఱగు రావణుతమః పటలంబు నడప ♦ నరుదెంచు మధ్యందినాదిత్యుకరణి
నాసన్నబలరావణాదిత్యుగ్రమింగ ♦ రాసియుగ్రతవచ్చు రాహుచందమున
వడి చేర్చికదియు రావణరాహుగ్రమింగ ♦ దడయక చనుదెంచు తార్క్ష్యునిభజ్గి
నిలునిలునిలుపోకు నిలుపోకుపోకు ♦ నిలునిలురఘురాము నృపచంద్రు దేవి
కుటిలరాక్షసయెంకు గొనిపోయెదింక ♦

నెటుపోయెదెటుపోయె దెదుబోయెదవు
పోయిన బోనీను బోనీకునిన్ను ♦ వ్రేయుదు ఖండింతు విదళింతు ద్రుంతు
దండింతు దండింతు దలలుత్తరింతు ♦ డెందు బెందుగనంచు సీతనీక్షించి
యోడకోడకు దేవి యుగ్రరాక్షసుని ♦ నీడాడి నీ చెఱ నేవిడుపింతు
ననిన నాపల్కు మహానిదాఘమున ♦ పనమయూరికి ఘనధ్వనియును బోలె
వేడుక గొంత గావింపగానలరి ♦ వాడిన మోముతో వగలగుందుచును
నా సీత బల్కె జటాయువ నన్ను ♦ నీసురకంటకుం డెత్తియుద్వృత్తి
మాయచే రామలక్ష్మణులవంచించి యోయన్న గొనియెగుచున్నవాడదిగో
యనిపల్కవినియంత నరుణనందనుడు ♦ ఘనమైనకోపంబు కడిమియుదోప
నలుకమై రథమున కడ్డంబువచ్చి ♦ ప్రళయాభ్రనిర్ఘోష పటుభాషణముల
బలుమారు దశకంఠు ధర్షించుకొనుచు నిలిచియిట్లనె యనూనిన దైర్యమెసగ
బరమపావనుడైన బ్రహ్మమునకుడవు ♦ వరపుణ్యనిధివిశ్రవసుతనూజుడవు
ధనదానుజుండవు దానవాగ్రణికి ♦ వినుమిట్టి కృత్యంబు విహితమే నీకు
జగదేకపతి రాము జననాథుదేవి ♦ తగదోరి కొనిపోవ దగదోరినీకు
ముదముతో రాముని ముందు దేలేర ♦ సుదతినిబ్బంగి తెచ్చుటబటుతనము
నీలంకయును నిన్ను నీబంధుజనుల ♦ గాలుచుగోరి రాఘవుకోపవహ్ని
యొగి ముక్షమటులేల గ్రోలెదవు ♦ నెరిగొని పెను బాము నేలత్రొక్కెదవు
యిరువదివేలేండ్ల నతివృద్ధునన్ను ♦ నెరుగుదో యెరుగవో యేజటాయువును

—:* రావణునితో జటాయువు పోరాట *:—

ఈ పుణ్యసాధ్వి నీవిప్పుడొప్పించి ♦ పోపొమ్ము పోకున్న బొరిపుత్తునిన్ను
దుండాగ్రముననిల్లు తునుకలుజేసి ♦ మండిసెవర్వ మర్మములుభేదించి
యుదరిపోదైన ప్రాణాభిమానములు ♦ విడిపించిజానకి విడిపింతుననిన
నతడంబునిల్పియు దగ్రుడై దైత్య ♦ వరుడల్గి నిలుగుణ ధ్వనిజేసియార్చి

ఘోరబాణములేయు గోపించివిహగ ♦ వీరుడుదద్బాణ వితతులువిరిచి
యురుపక్షయుగమున సురముఖఘట్టించి♦పోరిఫాలములుజీరి భుజములుదన్ని
తరమిడికరనఖ తతుల నొప్పించి♦కరముకోపించి రాక్షసకులేశ్వరుడు
ఖగరాజు లెక్కలుగాడనుగ్రంబు♦లగుబాణములుపదియడరియే యుటయు
దుండాగ్రమునవిల్లు తునుకలుజేసి ♦ ఖండించివడి బలాకలు నేలగలిపి
దనుజేశుమకుటము ధ్ధరగొల్లనేసి ♦ పెనచిసారధిబట్టి ప్రేవులజేరి [యు
తలమీరిదనుజరథ్యములజండాడి ♦చలమొప్పనరదంబు చదియుమోదుట
విరథుడైదైతేయ విభుడుకంపించి ♦ ధరణిపైబడిలేచి ధరణిజగొనుచు
మాయాబలంబున మరిమింటికెగసి♦పోయెబోయినజూచి బోనీక పేర్చి
యడ్డగించిజటాయు వాకాశవీధి ♦ నొడ్డినగతిదాకి యోరిపాపాత్మ
జూనకియేలోకంబు జొచ్చిననైన♦తృణముగాబట్టి వధింతునిన్ననిన
తిరిగిరోషమున దైతేయవల్లభుడు♦కరముగ్రమైన ముద్గరమువైచుటయు
వదితుండమున ద్రుంచి యతనిమస్తకము ♦
జదియంగనడచి కేశములు ద్రుంచుటయు
సురవైరికోపించి స్రుక్కక కదిసి ♦ యురువడిబక్షీంద్రు నొడిసిరాదిగిచి
మొగిబట్టియుందంద ముష్టిఘాతముల ♦ దగిలినొప్పించె నద్ధతశక్తిమెరసి
దనుజేంద్ర విహగేంద్ర దారుణయుద్ధ ♦
మనిమిషాదులుచూచి యచ్చెరుపడగ
నరుదైనగడిమిచే నంతరావణుడు ♦ కరముగ్రమైనట్టి ఖడ్గముంకించి
రెక్కలుపదములునెఱసిత్రుంచుటయు ♦ నరిదూలిఖగపతినేలపై వ్రాలె
వ్రాసినవై దేహి వగనొక్కవృక్ష♦మూలంబుబొదివిరామునిపేరుకొనుచు
హాహోవుచుండ రావణుడంకసీమ ♦ నాపరమ పతివ్రతాంగన జేర్చినేడు
యంతసంతోషించి యాకాశవీధి ♦ నెంతయురయమున నేగెరావణుడు
అప్పుడుబ్రహ్మమునులు సురల్మునులు♦తప్పదురాముచే దశకంఠుడీల్లు
మనమనోరథములు మనకసిద్ధించు♦నని చెప్పికొని యుబ్బిరందరు బ్రీతి
ననిమిషపదమున కంతరావణుడు ♦ చనరయంబునసీత చరణనూపురము
సురవైరికత్పాత సూచకంబనగ♦నురువడిచనుదెంచి యుల్కయైబడియె
జగతిపై జాహ్నవి జలధారలొలుకు ♦ పగిదియైయాకాశ పథమునసుండి
చెలువకుచంబుల జెందుహారములు ♦ దెలియకండద మేదిని దెగిపడియె
నాలోకసీత హాహారవంబెసగ ♦ లోలోనగడు నడలుచుబోయిపోయి
యటఋశ్యమూకంబునందు వానరులు ♦ బటుసత్త్వలేవురుబరికించికాంచి
తనవస్త్రమునగొంత దగజించిపుచ్చి ♦ తనభూషణంబులుతానెబంధించి

వీరైనరామభూ విభునకీవార్త ♦ లారయ తెలుపరె యనుబుద్ధి నపుడు
తడయక రాముచే దశకంఠుడింక ♦ చెడునంచు మాఁడియ వైచిన బాగుదోఁప
వారిమధ్యంబున వైచియుఁబోవ ♦ వారును దాఁచిరి వడిబుచ్చి దాని
దనుజాధిపతియంత దశరథాత్మజులు ♦ తనవెంటవత్తురఁ తల్లడంబొదవ
వెలవెలబారుచు వెన్కఁజూచుచును ♦ తలకుచు వడి సముద్రము దాటిపోయి
జడిగొన్న మరణసూచకనిమిత్తములు పొడసూపఁగ నిరయంబునలజ్జజొచ్చి
యనుపమవివిధ భోగాస్పదంబైన ♦ తననగరికివచ్చి తగురాజసమున
జనకపుత్రికదన సకలసంపదలుఁ ♦ మునికొని యెంతయు ముదమొప్పఁజూపి
యివెనా నివాసంబు లివి నా ధనంబు ♦ లివె నా తురంగంబు లివె నాగజంబు
లివి యేను దివిజుల నెల్లభంజించి ♦ తివుటమై దెచ్చిన దివ్యరత్నములు
నీవకుబేరుని గెల్చి యేనుగైకొన్న ♦ మదికింపుగావించు మణిపుష్పకంబు
వీరె నా కుడిగముల్ వేర్వేర జేయు ♦ చారణామరసిద్ధ సాధ్యకామినులు
వారె నా మాట గర్వమున గైకొనక ♦ కారాగృహంబుల గాసిల్లు సతులు
అవె నాట్యశాలలల్లవె కేళివనము ♦ లివె చంద్రశాలలో యిందీవరాక్షి
కరమర్థి నింతకుం గర్తవై నీవు ♦ గురుదార భోగింపు మఖిలవస్తువులు
ననవుడు తృణఖండమతివ చేపట్టి ♦ కొనిపల్కె వానిగైకొనక యెంతయును
ఓరి నీకీపాప మూరక పోదు ♦ ఘోరాగ్నియైనిన్ను గొంగొల్చుగాని
నిడివిగా బ్రతుకరు నీవు నీవారు ♦ చెడిపోవఁగ వారు సిద్ధ మీమీద
రామబాణానల రాశిలో మునిగి ♦ నీమేను పడి కాలి నీరు కాకున్న
ఘనమైనయీపాతకము లొంటదీర ♦ దనిబల్కెవైదేహి యందంద పొగిలి
యిట్టిదుర్వాక్యంబు లీవు నా చెవుల ♦ బెట్టితి నేడు నా పెంపెల్ల బోలిసె
నామానమిటు చేసె నన్నింత పఱచె ♦ నేమని విలపింతు నింక నావిధికి

—*: జనకజను అశోకవనమునందుంచుట :*—

ననిమహారోదన మందంద జేయ ♦ దనమది గోపించి దనుజవల్లభుడు
తెరగొప్పనప్పుడు త్రిజటాదులయిన ♦ తెఱవలఁ బిల్చి ధాత్రీపుత్రిజూపి
యొందు నేమఱక మీరందరుఁగాచి ♦ పొందుగా ననుబొందఁ బోధింపుఁడనుచు
ననసి నకడక నీయింతి నశోక ♦ వనములో నిడికొని వర్తింపుడనుచు
బనిచి కాపుడు బెట్టి పఙ్క్తికంధరుఁడు ♦ తనమది మదనాగ్ని దరిగొనఁనుండె
మాయామృగంబైన మారీచుఁ జంపి ♦ యా యెడ రాముఁ డన్యమృగంబొకటి
చంపి తన్మాంసంబు చర్మంబు గొనుచు ♦ నింపొందమరలి తానే తెంచుచోట
బ్రహ్మాయుజంబు కరవంబునకు గుందుచును ♦
ఆర్యాసమొందుచు వటవచ్చివచ్చి

రామభూపాలు డరణ్యమధ్యమున ♦ సౌమిత్రిబొడగని చారభీతిల్లి
యకటలక్ష్మణుడ నాయాజ్ఞగైకొనక ♦ వికలధైర్యమున వివేకివై యుండి
యత్తన్విసీత నా యడవిలోవిడిచి ♦ వత్తురెయిక్లేల వచ్చితివీవు
జగతిలోగల్గు రాక్షసులెల్ల మనకు ♦ బగయాటయెరుగవే పరికించిచూడ
కులహానిగుణహాని గురుధర్మహాని ♦ తలపోయవలదొకో తమ్ముడానీవు
అనినలక్ష్మణుడప్పు డతిభీతినొంది ♦ యనయంబుగంపించి హస్తముల్మోగిచి
జగతీశనాకిటు చనుదేరతగదు ♦ తగకున్కియెరుగుదు త్రైలోక్యనాథ
మాయామృగాకృతి మళిమిమ్ముద్రిప్పి ♦ పాయ మీదివ్యబాణాగ్నిశిఖల
గూలుచున్న యాకుటిలరాక్షసుడు ♦ హాలక్ష్మణా యనునార్తరవంబు
సీతామహాదేవి చెవిసోకనపుడు ♦ భీతిల్లిమీదైన పెంపెల్లమఱచి
యన్నమీయన్న చొప్పరయబొమ్మన్న ♦ నెన్నడునెలుగింప డీదీనవృత్తి
సౌమిత్రియనవుడు జానకిజూచి ♦ రామునికే చారము లేదు వినుము
పవిపడిమనయందు భయముబుట్టింప ♦ ననిరాక్షసుడు క్రూరుడై జీరెగాని
యినకులాధిపుడేడ నీదైన్యమేడ ♦ జనకజనీవేల చంచలించెదవు
అనవుడుగోపించి యద్దేవినన్ను ♦ వినరానిపల్కులు వెసదూరిపల్క
నేనునామదిలోన నెంతయువగచి ♦ దానికివనదేవతల సాక్షిబెట్టి
యిటవేనువచ్చితి నిక్ష్వాకుతిలక ♦ యటుగానదప్పుగా నవధరింపకుము
యనిబాష్పలోచనుండై మ్రొక్కియున్న ♦ యనుజునికరముల నల్లనెత్తి
కనుగవదొరిగెడు కన్నీరుదుడిచి ♦ యనఘుండు వగచి యిట్లనియెరాఘవుడు
ఆజన్మశుద్ధుడై యఖిలజ్ఞుడైన ♦ యాజనకునిపుత్రియై వార్తకెక్క
నాపుణ్యవతియు నిట్లాడుటయెల్ల ♦ నాపదలకుమూలమని విచారించి
నిలువకవత్తురె నీయంతవాని ♦ కలుగంగదగునయ్య యతివమాటలకు
ననుచుసౌమిత్రినూరార్చియంతటను ♦ జననాధుడటనిజాశ్రమభూమి జొచ్చి
యిదియేమిలక్ష్మణ యీయాశ్రమంబు ♦
తుదిముట్టశూన్యమై తోచుచున్నదియు
వనదేవతానంద వచనఘోషములు ♦ వినరావువినరావు విహగనాదములు
ఏలకోమునివరు లిటుసంచరింప ♦ రేలకోసీత నాకెదురుగారాదు
కడుదీనమైబుద్ధి గలగెడునాకు ♦ ఎడమకన్నదిరెడు నేమకోనేడు
ఇక్కానలోపల నేనునునీవు ♦ నక్కటాయేదుఃఖ మనుభవించెదము
అనిపర్ణశాలకు నటుచేరవచ్చి ♦ దినకరురుచిలేని దినలక్ష్మిబోలి
రేరాజుకళలేని రేయునుబోలి ♦ శారికలేని పంజరమునుబోలి
నెనయుకోయిలలేని యెలమావిబోలి ♦ గనుగొనవిన్ననై కడువాడుబారి

యున్న చందముజూచి యుల్లంబుగలగి♦విన్ననై ధృతిదూలి వెలవెలబారి
పన్నిశోకరసంబు ప్రవహించెననగ♦గన్నులబాష్పంబుకణములుదొరగ
పెదవులుదడపుచు భీతిప్రాణములు♦చెదరతమ్మునిజూచి శ్రీరాముడనియె
బోలజూచితి నేను భూమిజపర్ణ♦శాలలోపలనున్న చందంబు లేదు
పొదలపువ్వులుకోయబోయనో లేక♦వెదుకనోంశోక త్రోవవెడలెనోగాక
సరసులక్రీడింప జనియనోగాక♦కడునుగ్రముగ భీతి గ్రాగెనోగాక
డాసినపులులకై డాగెనోగాక♦యీనునిగొనియొక్క డేగెనోగాక
యేచందమోనాకు నింతయుదెలియ♦దేచందమునసీత యిందులో లేదు
అనివితర్కించుచు నాపర్ణశాల♦చనజొచ్చిలోపల సకలంబు వెదకి
జానకినాపర్ణశాలలోపలను♦గానక ప్రాణముల్ల గిలంపి చి
మనసెల్ల చెడిమేను ప్రమాన్పడిబోధ♦మనురవిశోకాబ్ధి నస్తమించుటయు
భ్రాంతియన్నికటి ప్రబలమైపర్వ♦ నంతరంగముగప్పి యత్నులుదప్పి
మఱలెడుధృతిదప్పి మానంబుదప్పి♦నెఱసినవికలుడై నేలకువ్రాలి
వదలకసీతకై వగచెడినన్ను♦బ్రిదిలిపోనీక నొప్పించెనీవగలు
నీవలనాకిప్పు డేత్రోవవచ్చె♦నేవె టధరియింతు నింకనీవగలు
నేమయివచ్చితి నిక్కాననముః♦కేమాటలాడెద నితనితోనింక
నేనన్నయితనికి నితడునాతమ్ము♦డేనునితడుగూడి యెట్లువ్రేగెదము
అనువిచారముబుద్ధి నణుమాత్రమైన♦నునుప నేఱక రాము డుల్లంబు గలగి
మదనవేదనలనున్మత్తు చందమున♦బెదరిచూచుచువన పెంపెల్లదూలి

—*: శ్రీరాముడు ప్రలాపించుట *—

తనుమధ్యనీవింత తడవెందుబోతి♦వనుచూచునిందురమ్మని చేరబిలుచు
ప్రియుమొప్పబై బకు బెనచిరాదిగుచు♦
బయలుకౌగిటజేర్చు బలుమారువగచు
నాయ్యానమూరార్చునాకకొ తవడికి♦నాయ్యెనదనలోననాకకొంత దెలియ
యక్కటాసౌమిత్రియవసీతనూజ♦యెక్కడబోయెనో యేమైనయదియొ
వెలదినడుగులచొప్పు వెదకియుగాక♦జలజాక్షియీపర్ణశాలలో లేదు
ఏదెసబోయెనో యిందీవరాక్షి♦కాదొకో యిది దండకావనభూమి
యీదెసకాదొకో యీపర్ణశాల♦కాదకో రాముడగానొకో యేను
ఐననాప్రాణంబు లకటయీబొంది♦లోననెట్లున్నవి లోలాక్షిబాసి
పూనియీయెడ ప్రాణములతగుల్రోసి♦తానైనదివికేగ దలచితివేని
వ్రతమునిండింపక వచ్చెవిడెట్టి♦సుతుడంచుననుగణించున దశరథుండు
కా దేనివ్రతము సాంగంబుగాదీర్చి♦మేదినిఁబాలింప మిన్నకపురికి

జనినచో మిథిలుడచ్చటికిరా నతని♦గనుగొనగా సిగ్గుగాదొకో నాకు
నట్లుగానన్ను నీవడవిలో విడిచి♦పటుబుద్ధిపురికేగి భరతునిగాంచి
తనయనుమతిసర్వ ధరణిపాలింపు ♦ మనిచెప్పి కైకకు నాసుమిత్రకును
కౌసల్యకును జనకజచన్న తెఱగు ♦ నాసుద్దియును దెల్పు నను మదినిల్పు
మనిరాఘవుడు రెప్ప లల్లనవార్చి ♦ జనకజ మునుపర్ణశాలలోనుండి
పోయినగతిప్రాణములు దన మేన♦బోయినగతిగాగ బుద్ధిఁ చింతింప
నప్పుడులక్ష్మణుండన్న చందంబు♦తప్పకచూచి యెంతయుశోకమంది
యేతల్లి పనిసేతు నేతల్లిగొలుతు ♦ నేతల్లిఁదల్లిగా నిటమీఁదదలఁతు
నినకులాధిపుశోక మేత్రోవమాన్తు ♦ దనకుదల్లులకును దనసోదరులకు
నెనయసీతనితోడి దేలోకమగును♦మనువంశమంతయుమడిసెబొమ్మనుచు
వందందవిలపింప నంతలోరాము♦డొందినమూర్ఛతా నొయ్యనదెలసి
తలకొన్నవగలతో దండకావనము ♦ కలయనాలోకించి కన్నీరునించి
వనజాక్షిఁజింతించి వగలురెట్టించి♦తనమదిశోకించి ధైర్యంబుడించి
పోయి తేసీతనా పొందెడబాసి ♦ పోయితో నను బ్రాణములతోడడించి
పొరిసురాసుర పూజార్హమవక ♦ హరువిల్లువిఱచితి నతివనీకొఱకు
బరునిగాదలపోసి బ్రాహ్మణుడనక ♦ పరశురాముని భంగపఱచితిగడగి
నీరజలోచన నీకునై పూని ♦ యీరెండునిందలు నేగట్టుకొంటి
గడపటను బాపె కష్టదైవంబు ♦ పడతినిందల బడపాలైతినేను
నీవేడుకలుచూచి నీకెనుప్రియము ♦ గావింతుననిపోయి కనకమృగంబు
చంపి తెచ్చితిదాని చర్మంబుయిదియె ♦ యింపార నెవ్వరికిత్తునేనింక
మదినెల్లసుఖములు మఱచికానలకు ♦ వదలకనినునమ్మి వచ్చినచోట
ననుగానలేనైతి సీచన్నత్రోవ ♦ గనిరయంబునవచ్చి కావలేనైతి
బరువడిజగమెల్ల బాలింపజాలు ♦ వరశక్తిగలిగిన బానిచందమున
మునుకొనిశరచాపములు దాల్చిఘోర♦వనదుర్గభూముల వర్తింపవచ్చి
పెకమతిమావారి పెంపెల్లఁ జెరచి ♦ పడతుకనిన్ను గోల్పడితిదేయిచట
యేణాక్షినినుబాసి యీశరీరమున ♦ బ్రాణంబులెబ్భంగి పట్టుదునింక
మదినీతనయునీ మునితోబాసి ♦ యేదెసభరియింతు నీదేహమింక
నెలతయీవిరహాగ్ని నీదులావణ్య♦జలరాశిమునుఁగక చల్లార్పరాదు
తగిలియీశోకాబ్ధి తరుణినీమేను♦తగుతెప్పగాకేటు తరియింపవచ్చు
మగువనీపాలిండ్లు మరుగుగాకున్న ♦ నొగికాముశరముల నోర్వరాదింక
నన్నట్లుగొనిబోయి నలినాక్షిపిదప♦నిన్నిటుగొనిబోయె నేడింకమనల
నిరువురబాపిన యీదైవమునకు♦నరుదెందుగల దసాధ్యములెందుగలవు

కోమలి నిన్నెత్తుకొనిబోవునప్పు♦డేమని పలవించి తేమంటివన్న
నేదేశములకేగి తెందున్నదాన ♦ వేదుఃఖములఁ వ్రేగ దేమి జేసెదవో
యెవ్వరుగొనిబోయి రేత్రోవఁబోయి ♦ లివ్విధి పాటిల్లె నే నేడు మనకు
నీయట్టిచతురాలు నీయట్టిముగ్ధ♦నీయట్టిలావణ్య నిధి యెందుఁ గలదు
కలదకో యొకనాడు కరమర్థి నిన్ను♦గలసి వినోదింపఁ గమలాక్షి నాకు
జలజాక్షి నినుఁగూడి సాకేతపురము♦కలవాడఁనికాని కాననొండొకటి
యిది మహారణ్యమై యిప్పుడుఁ దోఁచె♦నిది పర్ణశాలయై యిప్పుడుఁ దోఁచె
నిది నాకు దుఃఖమై యిప్పుడుఁ దోఁచె♦నిది శోకదపమునై యిప్పుడుఁ దోఁచె
నేల మహీపుత్రి యేల మృగాక్షి♦యేల సరోజాస్య యేల లతాంగి
యేల వధూమణి యిన్ని చందముల ♦ గ్రాలుచున్నాఁడ నకటకటా యనవు
అలసయానముల బాగంచలకిచ్చి♦లలితాంఘ్రి రుచి ప్రవాళములకు నిచ్చి
వరకుచోన్నతి చక్రవాకులకిచ్చి ♦ కరముల కెంపు పంకజములకిచ్చి[నిచ్చి
మెఱుచాయ క్రొక్కారు మెఱుగులకిచ్చి♦నయన వైభవము మీనములకు
చల్లని ముఖకాంతి చంద్రునకిచ్చి ♦ తెల్లని నగవు చంద్రికలకు నిచ్చి
చెలువంపు పలుకులు చిలుకలకిచ్చి ♦ యలకల ననుకాంతి యళులకు నిచ్చి
సన్నంపు నడుము మాకసంబునకిచ్చి ♦ నిన్ను దైవము మ్రింగె నే నేడు సీత
హా వామలోచన హా పద్మగంధి ♦ హా వారిజానన హా సీత యనుచు
వివశుఁడై రామభూవిభుఁ డుపల్వగల♦దవిలి దీనతఁ బొంది తమ్ముని జూచి
యేదెసఁ బోయెనో యిందీవరాక్షి ♦ పోదమా లక్ష్మణ భూమిజ వెదుక
రొలసి యాపొదలలో నున్నదో పోయి ♦ పిలుతమా లక్ష్మణ పృథ్వీతనూజ
యేతరుజాడల కేగెనో యింతి ♦ చూతమా లక్ష్మణ శుకమంజువాణి
నెత్తమ్మికొలకుల కేగెనో యరసి ♦ వత్తమా లక్ష్మణ వనజాక్షి ననుచు
ధరియింపరాని వేదనలతో రామ♦ధరణీవల్లభుఁడు గౌతమిఁ జేరఁబోయి
వోలోకపావని వోలోకమాత ♦ యీలోకపావని యెరుగవే సీత
వోలోకబాంధవ యోధర్మసాక్షి ♦ యేలీలనైన నీ వెరుగవే సీత
యోసర్వసంచార యోజగత్ప్రాణ♦యాసీత నెరుగవే యనఘు నీవైన
నెలఁతీగ కానవే యలినీలవేణి♦జలజంబ కానవే జలజాతగంధి
హరిరాజ కానవే హరిరాజమధ్య♦కరిరాజ కానవే కరిరాజగమన
హరిణంబ కానవె హరిణాయతాక్షి♦పరభృత కానవే పరభృతవాణి
యళినాథ కానవే యళినీలవేణి♦దిలకంబ కానవే తిలకాంచితాస్య
ననుచు విభ్రాంతిసనట్లయందంద ♦ జనిచని యడుగుచు జాలిదూలుచును
మొదపక నిబ్బంగి నెందు వైదేహి♦నడవిఁ గానక జనస్థానంబు వెడలి

—:* లక్ష్మణుడు రాముని శాంతిపరచుట *:—

విన్ననై విరహాగ్ని వివశుడై యున్న ♦ యన్ననువీక్షించియనియె లక్ష్మణుడు
అన్న నీవఖిల లోకారాధ్యపరుడ ♦ వున్నతచిత్తుండ వురుబలాఢ్యుడవు
ఇంతికై వెనుబడి యిన్ని చందముల ♦ నింతశోకింతురె యినకులాధీశ
యీమోహశోకంబులేటునీకుగలవె ♦ తామసమోహనార్థముగాదెజగతి
నరుదారనీవు కల్లందితివేని ♦ సురలైననీదిక్కు చూడనోపుదురె
యనమానసత్వుండ వఖిలేశనీవు ♦ వసుధీశనాయంత వాడునీబంటు
నక్కటానీకసాధ్యము లెందుగలవు ♦ తక్కకనీపేర్మి తలపవుగాక
యనినరాముడు శోకమంతయునుడిగి ♦ తనమదిదెలివొంది తమ్మునిజూచి
యేనింకనిటమీద నెన్ని చందముల ♦ జానకినెడబాసి సైరింపజాల
వారకనాడు దుర్వారబాణముల ♦ ధారుణీతలము విచారించిచించి
పాతాళవాసుల బట్టిసాధించి ♦ సీతాంశుముఖయైన సీతసాధింతు
కాదేని సప్తసాగరములుగలచి ♦ మేదినిధరములు మెటిచినుగ్గాడి
యీవసంబున దిగ్గజేంద్రకుంభములు ♦ దారించిమేది సీతనయసాధింతు
కాదేనియష్టదిక్పాల మర్మములు ♦ భేదించియాదిత్య బింబంబుద్రుంచి
పారిపారినక్షత్రములు డుల్లవేసి ♦ ధరణిచీకటిచేసి తరుణిసాధింతు
కాదేని సకలరాక్షసులభస్మంబు ♦ గాదివ్యశరములు కడకమైసేసి
యవనియరాక్షసమైయుండజేసి ♦ తివుటమైనేడు వైదేహిసాధింతు
గాదేని బ్రహ్మలోకంబెల్లగలచి ♦ యాదిమబ్రహ్మసంహారంబుజేసి
బలసిజీవులకెల్ల భయముబుట్టించి ♦ నెలకొన్నకడిమిమై నెలతసాధింతు
నీరీతిభుజశక్తియే జూపకున్న ♦ జేరిమిన్నకసురల్ సీతజూపుదురె
అదెచూచునాడు బాణావళిశిఖలు ♦ పొదలుచునున్నవి భువనంబులదర
నదెచూడువైదేహినే విజృంభించి ♦ త్రిదశులుమెచ్చ సాధింతునేననుచు
నొదవిలోకములకు నుత్పాతహేతు ♦ వుటయించెననుబాములురకనిక్కించి
బలసిజీవులతోడ బ్రహ్మాండమెల్ల ♦ నలిజేయుసంకర్షణ స్వరూపంబు
రూపించిలయకాల రుద్రుండువోలె ♦ కోపించివిల్లందు కొన్నమాత్రమున
దలకెభూతములు భూతలమెల్లవణకె ♦ గలగెలోకంబులు గగనమల్లాడె
బ్రహ్మాండభాండముల్ పగిలినట్లయ్యె ♦
బ్రహ్మమంత్రముదప్పె రవిదప్పనడచె
నక్షత్రములుడుల్లె నభవుండువెఱచె ♦ యక్షదేవాసుర లాత్మబేల్పడరి
యత్తరిసౌమిత్రి యారాముజూచి ♦ చిత్తంబుభయమంద చేతులుమొగిచి
కాకుత్స్థనీవతి కారుణ్యనిధివి ♦ లోకరక్షణకళా లోలచిత్తుడవు

జనకజకై పూని సకలలోకములు♦మునుమిడినిర్మూలముగ సేయదగునె
నొండొండవనములునొగిసముద్రములు♦నిండినపురములునిఖిల దేశములు
అలయక వై దేహి నరసిలేకున్న ♦ జలము పెంపునమరి సాధింతుగాక
యని లక్ష్మణుడుబల్క నతనివాక్యములు♦వినికోపముడిగి తా విల్లెక్కుడించి
యఖిలేశుడగురాముడటదక్షిణాభి♦ముఖుడునై తానుతమ్ముడుబోవుచుండ
నాతరి తెరువున నందందనలిగి♦సీతకొప్పుననుండి చిందినవిరులు
నాతనివక్షోజ హారరత్నములు♦నాతతమణిమయంబైనయానాతి [ర
పదనూపురములుర్విబడియున్న జూచి ముదముశోకంబునుమూర్ఛయుగదు
నప్పుడురఘురాము డాత్మచింతించి♦తప్పకెవ్వడొక్రూర దానవు డొకడు
కుటిలకుంతలినెత్తికొనిపోయినాడు♦కటకటాయనిత్రోవకనుగొంచుబోవ
నంతనా తెరువున కనతిదూరమున♦నంతంతరాక్షసు నడుగులచొప్పు
నఱయుచునఱయుచు నందందబోవ♦గరమర్థిజూచిరా కమలాప్తకులులు
రాలినమెరకలు రక్తపంకమున♦గూలినసూతుపై గూలినరథము
తేరిక్రిందటబడి తెగినయశ్వములు♦ధారుణిబడిన పతాకఖండములు
విరిగిముద్దరనున్నవింటితునకలును♦అరిముఱిబడియున్నయస్త్రశస్త్రములు

—*: జటాయువుకు యగ్ని సంస్కారము సేయుట :*—

గనిలక్ష్మణుడుచూపగడుచోద్యమంది ఘనులెవ్వరోయింతకదనసౌఖ్యంబు
లనుభవించినవార లనియిర్వ్యథంబు♦గనుంగొలుతలపున గాకుత్స్థకులుడు
తెరువంతకంతశోధించుచుముంద♦ఱరుగుచో రఘురాముడాసమీపమున
నెలమి నెంతయుదూలి యెఱకలుపెఱిగి♦కలయనెత్తుటదోగి కాళ్ళుముదునిసి
పవిచేతగూలన భర్మాద్రియనగ ♦ వివశుడై పడియున్నవిహగేంద్రుజూచి
సౌమిత్రిచూచితె చపలరాక్షసుడు♦భూమిజమ్రింగిదా పొడచూపవెఱచి
చలియించి పక్షివేషముననున్నాడు ♦ బెలుకుఱతీవీని జంపెదనంచుకడగి
ఘనచాపహస్తుడై కదిసినరాము♦గనిపక్షివిభుడు గద్గదకంఠుడగుచు
నెత్తురుగ్రక్కుచు నిట్టూర్పులెసగ ♦ కుత్తుకబ్రాణముల్ గుదిగొనబలికె
ధరణీశ యేను మీతండ్రికిసఖుడ♦బరగంగ గశ్యప బ్రహ్మపౌత్రుడను
అరుణాత్మజుండ జటాయువన్వాడ ♦ జరియింతునడవుల శైలశృంగముల
వసినాదువృత్తాంత మంతయునీకు ♦ వినుపింపనేమున్న విశదంబుగాగ
నట్టివానికినిట్టి యాపదయెట్టు ♦ పుట్టెనటన్న యో పుణ్యాత్మవినుము
వలనొప్పనేడు రావణుడునీదేవి ♦ యెలమిమ్రుచ్చిలికొని యేగుచోనేను
పోనీకనడ్డమై భూరిసత్త్వమున ♦ వానితోబోరాడి వసుధగూలితిని
ఇదెవానికేతు సూతాశ్వసమేత♦విదితరథంబాది విరిగెనాచేత

జలమున నుడువీధి జపలరాక్షసుడు ♦ నెలతుకఁ గొనిపోయె నీవు రావైతి
నేను నీకీవార్త యెఱిగింపఁ గంటి ♦ పూని నీశుభమూర్తి పొడగానఁ గంటి
నతిపుణ్యకృతి నైతి ననివిన్నవింప ♦ మతిలోనఁ శోక మిన్నడిగ రాఘవుడు
విల్లటఁ బడవైచె విననుడై ధరణిఁ ♦ దెల్పి సౌమిత్రి బోధింపగా దెలిసి
యయ్యో మహాత్మ జటాయువా నీకు ♦ నీయవస్థలు వచ్చె నేమదర్థముగ
ననిజటాయువు దేహ మందంద దడవి ♦ తనురక్తమంతయు దానెపొదుడిచి
తమ్మునిఁ జూచి యీతడు మనకొఱకు ♦ నిమ్మట్టి రావణు నెదిరిపోరాడ
యిటువంటి పుణ్యాత్ము డెందైన గలడె ♦ యటుగాన దివికీత డరుగకమున్న
రావణు డేలెడి రాజధానికిని ♦ త్రోవయు వాని బంధురపరాక్రమము
అన్నియు నడుగుమీ వన్న లక్ష్మణుడు ♦ క్రన్నన రఘురాము కార్యసహాయు
నా జటాయువు నిర్జరాదివిధేయు ♦ నోజ తద్వ్యథ మెల్ల నుచితోక్తినడుగ
గొన్ని మాటలు పేరుకొనగ గుత్తికకు ♦ గ్రొన్నెత్తురొల్క బల్కులకెడు లేక
నతులపుణ్యోదయుం డగు రాముజూచి ♦ మతిలోన నాతని స్మరణ యేమఱక
మోక్షపదానందమున బులకించి ♦ పక్షివల్లభుడంత ప్రాణముల్విడిచె
ధరణీశసుతులంత దశరథాధీశు ♦ మరణంబుకంటెను మదిజాలవగచి
విహగవల్లభునకు వేదోక్తవిధుల ♦ దహనాదికృత్యముల్దగ నాచరించి
యంత వేవేగ క్రౌంచారణ్యమునకు ♦ నంతయుగడకతో నేగియచ్చోట
నానాలతావృత నగమృగోదగ్ర ♦ మైనట్టి యొకకోన నందేగుచోట
నెఱసిన కురులును నిడుదకోఱలును ♦ పఱపైన కడుపును బడబాకినోరు
మిడిగ్రుడ్డ కన్నులు మీగాళ్ళదాక ♦ విడిపడ్డ చన్నులు వెఱ్ఱిచిన్నెలును
నలరన యోముఖి యనుదైత్యవనిత ♦ కలిమిసౌందర్యలక్ష్మణు నిలక్ష్మణుని
గనుగొని కామించి కరమంటబట్టి ♦ తనుబొందరమ్మని తఱితీపుసేయు
జుప్పనాతికినట్టి సుఖమిచ్చెదాని ♦ కప్పాటునసిధార ననువార నొసగి
దుందుభిపటహాది తూర్యనాదముల ♦ గ్రందునకంటె వెగ్గలముగా బాదివి
ముందర నొక మ్రోత మ్రోయంగ వాని ♦

చందంబు గనుగొని చనుచు రాఘవులు
యోజనాయతబాహు డొగిబారసాచి ♦ యేజంతువులనైన నేపుమైనొడిసి
యటమటి మ్రింగుచు నావలించుచును ♦ జుఱబుచ్చి మస్తకశూన్యుడై నిలిచి
యుదరంబు నోరుగా నున్న కబంధు ♦ విదళితబహుజీవ వివిధకబంధు
త్రిదశనిర్బంధుసందీప్తమదాంధు ♦ గదిసి రాముడు సూచి కడుచోద్యమందె
వాడును దనకరద్వయమున వారి ♦ వేడిమి చెడబట్టి వేవేగదిగువ
నన్నరు జూచి యిట్లనియె లక్ష్మణుడు ♦ నన్ను వీనికి భక్షణము జేసి మీరు

సీతనన్వేషించి చేకొనిసకల ♦ భూతలంబేలంగ పొమ్మన్న నతఁడు
చింతించుచును వాని చేతుల వెంట ♦ గొంతదూరము వచ్చి కూర్మితమ్ముఁడును
తానును బుద్ధి నెంతయు విచారించి ♦ పూనికె మీఱ గొబ్బున నౌఱల్పెరికి
కడువాఁడిఖడ్గముల్ గైకొని వాని ♦ కడిదిచేతులు రెండు ఖండించుటయును
నుబ్బెల్ల చెడి దైత్యుఁ డొరలుచు గూలి ♦ గొబ్బున తెలివి గైకొని వానిఁ జూచి
మీరెవ్వరనుడు సౌమిత్రి సర్వంబు ♦ శ్రీరాము చరితంబు జెప్పిన రాఁడు
వినుటఁ జేగొంత విజ్ఞాన మొదవి ♦ తన దుర్వృత్తాంత మంతయు చెప్పఁ దొణఁగె
దనువను దివ్యుండ ధరణీశ యేను ♦ ఘనమైన ముని శాప గతి నిట్టులైతి
గనకగర్భుని చేత గామరూపత్వ ♦ మును చిరంజీవిత్వ మును గాంచి క్రొవ్వి
యిట్టిరూపము దాల్చి యెల్ల సంయముల ♦ బట్టి బాధింపుచో బరమకోపనుఁడు
స్థూలశిరుం డను శోభిల్లుమునికి ♦ నీలోకమున దొల్లి యెగ్గు గావించి
నతఁడు విరూపుండవై యుండుమనిన ♦ నతని బ్రార్థించిన నతఁడు మీవలన
నతులశాపవిముక్తి యగు నంచు బలికె ♦ మతిలోన నది యెల్ల మఱువక పిదప
నదియాదిగా నిట్టి యాకృతిఁ బూని ♦ త్రిదశేంద్రు నాజికే తెమ్మన నతఁడు
కంఠంబు తలతోడ గడుపులోఁ బోవ ♦ కుంఠితంబుగ వ్రేసె గులిశపాతమున
ననిన రాఘవుఁడు దశాననుచేఁ ద ♦ మనఘ నీ వెఱుఁగుదే యనిన వాఁ డనియె
నెనుఁగుదు వాని మహేంద్రుశాపమున ♦ నెఱుక చాలదు నాకు నీశరీరమున
ననల బుదరికొల్పుఁడా మీఁద మీఁకు ♦ వినుపింతు దెలియ నవ్విధ మన్నవారు
దనువు శరీరంబు దగ సంస్కరింప ♦ ననలున కాదేహ మాహుతి యయ్యె
నతఁ డంత దివ్యుఁడై యాకాశవీథి ♦ నతుల విమానంబు నందుండి పలికె
నో రఘురామ యాయోధనోద్దామ ♦ కారుణ్య తారుణ్య గాంభీర్య ధుర్య
కాకుత్స్థతిలక నీకారుణ్యదృష్టి ♦ పైకొన నాతొంటి పదముఁ దగంటి
ననినుతియించి యో నరనాథచంద్ర ♦ విను మింక రావణు విధ మెల్ల నతఁడు
ధనదానుజుఁడు పులస్త్యబ్రహ్మకూర్మి ♦ మనుమఁడు తన తపోమహిమ మెప్పించి
నలువ చే వరము లున్నతి గాంచినాఁడు ♦ చెలఁగి దిగ్విజయంబు చేకొన్నవాఁడు
తొలి వేలుపుల కెల్ల దొరయైనవాఁడు ♦ కలవేల్పుల కెల్ల గండైనవాఁడు
బలుతలల్ పదియును బాహులిర్వదియు ♦ గలవాఁడు లవణ సాగర ఖేయమైన
లంకాపురంబు పాలన సేయువాఁడు ♦ బింకాన రజతాద్రి బెకిలినవాఁడు
యని చెప్పి రావణుఁడా సీతఁ గొనుచుఁ ♦ జనినమార్గము జెప్పి చనుచునాఁ డనువు
మఱి త్రోవ గురుతులు మార్గంబునందు ♦ తరుచైనవస్తువుల్ తప్పక తెలిపి
మీ రింక పంపా సమీపంబునందు ♦ నారూఢిమతి మతంగాశ్రమంబొప్పు
నమ్ముని శిష్యురాలైనట్టి శబరి ♦ మిమ్ము పూజించు నమ్మెలతయున్నెడకు

మీరుబొందిటమీతు మిహిరసూనునకు ♦ గూరిమిజెల్మిగల్గును దానివలన
జానకిపొందును సామ్రాజ్యపదవి ♦ పూనికాంతురటంచు బోయెనద్దివికి
దనువిల్లుదివ్య పదంబునకరుగ ♦ మనువంశతిలకులు మరునాడుకదలి
పంపాసరోవర పశ్చిమస్థలిని ♦ సంపూర్ణతరులతా సంపదబొదలి

—:* రామలక్ష్మణులు శబరిని గాంచుట *:—

ప్రబలపుణ్యములకు పట్టైనయట్టి ♦ శబరియాశ్రమ వనస్థలికిబోవుటయు
నెదురేగిసద్భక్తి నితియూరాము ♦ పదములకునుసాగిబడి మ్రొక్కినిలచి
దశరథవరపుత్ర తాటకాజైత్ర ♦ కుసికసంభవయాగ కుశలప్రయోగ
చిరమునిధ్యేయ శిక్షితతాటకేయ ♦ పరమగంగాతీర పాదసంచార
పదరజోనైర్మల్య పాలితాహల్య ♦ విదళితహరచండ విపులకోదండ
భీమమార్గవరామ బిరుదాభిరామ ♦ కామితపితృవాక్య కరణాసుశ్లోక
ప్రకటవిరోధ విరాధనిరోధ ♦ సకలమునిత్రాణ సత్యప్రవీణ
ఖరదూషణాది రాక్షసశిరచ్ఛేది ♦ మరణార్థిమారీచ మర్దనారాచ
శీతావియోగ సూచితమోహరా ♦ ఖ్యాతఖగాన్వయ కల్పితమోక్ష
యలఘువిక్రమధామయతిపుణ్యనామ ♦ నెలకొనిరఘురామనినుజూడగంటి
పరికింపనాతపఃఫలమెల్లగంటి ♦ నరుదైనపుణ్యంబు లన్నియుగంటి
గాకుత్థ్సతెరువున గడుడస్సితెందు ♦ పోకమాయాశ్రమంబున నేడునిలువు
మనఘాత్మనాగురుండైన మతంగ ♦ మునిచేతమీకథల్మదివినియుందు
నీవాద్యుడవుసర్వనిగమవేద్యుడవు ♦ కావుననీనుతుల్గావింపదరమె
యిదియే మతంగమునీంద్రునాశ్రమము ♦ విదితతపశ్చర్య విశ్రాంతికరము
ననియామహత్వంబు లన్నియుదెల్పి ♦ వనమూలఫలములువలనొప్పదెచ్చి
యిచ్చినభుజియించి యెలమితోరాము ♦ డచ్చటప్రీతిమై నారాత్రినిలచి
ఘనజటాబంధైక శబరినాశబరి ♦ గనుగొనిమరునాడు కాకుత్థ్సుడనియె
తరమిడిమికల సీతాదేవియోగాగ్ని ♦ దరికొనియెంతయు దలకుచున్నాడ
నొకచోటనిలువలేకులుకుచున్నాడ ♦ వికచాబ్జముఖిసీత వెదకబోవలయు
పనివినియెదనన్న బరమసంతోష ♦ మునుబొందిశబరి రామునిజూచిపలికె
దనువురఘునుకు ముందరజేయదగిన ♦ పనులెల్లదెల్పె నేర్పడమున్నె నీకు
నైననుమరియు నేనదియెదెల్పెదను ♦ మానవనాథ నీమదికెక్కునట్లు
రావణుజంపెదు రామనీకూర్మి ♦ దేవిగూడెదవు సందేహంబువలదు
ఐననునేశాకులై పోవవలదు ♦ భానుకులాధీశ పరగబైనిపుడు
ఇనకులాధిపవిను మిటుబుష్యమూక ♦ మనునర్వాతమునకు నరుగుమునీవు

సునిసితమతిసూర్య సుతుడు సుగ్రీవు♦డనువానరాధీశు డాకొండనుండు
తనవధూరత్నంబు తనరాజ్యపదము♦తనయన్నవాలిచే దాగోలుబోయి
యతడుశోకాతురుడై యున్నవాడు ♦ యతనికిగపిసేనల ప్రమాణములు
అతనికివిశ్వాస మాత్మబుట్టించి ♦ యతనికినుపకార మావడజేసి
యతడునీవును గూడి యటప్రీతినరిగి ♦ యతిసత్వురావణు నని లోనజంపి
బలవిక్రమంబుల బ్రస్తుతికెక్కు♦చెలువొప్పనీదేవి సీతగైకొనుము
అనియొప్ప శబరి కార్యములెల్లజెప్ప♦తనగురువాక్యముల్దలచియాక్షణము
యనలంబుదరికొల్పియాయగ్నిలోన♦దనశరీరము వేల్వదా సమకట్టె
ఆసమయంబున నంతరిక్షమున ♦ వాసవప్రముఖ గీర్వాణులందఱును
మణిఘృణిదేదీప్యమానవిమాన♦గణసమారూఢులై కనుగొనుచుండ
నారదసనకసనందనప్రముఖ ♦ సాకరమునీంద్రులు సంతోషమంద
బరముపరంధాముబరమకల్యాణు ♦ బరిపూర్ణుపరమాత్ముబరమేష్ఠివినుతు
నవ్యయునవికారు నఖిలాంతరాత్ము♦నవ్యక్తునఖిలేశు నాద్యంతరహితు
భవముఖామరవేద్యు భవరోగ్యవైద్యు ♦
రవికులాంబుధిచంద్రు రఘురామచంద్రు
దనమనిల్పి యత్తఱివలగొనుచు♦వినుతించి శబరియా విభునిసన్నిధిని
యనలునియందు రామార్పణంబుగను♦దనశరీరము వేల్చెదైవతానీక
మానిత దివ్యవిమానంబునెక్క♦నానావిధముల వర్ణనసేయుసురలు
దేవలోకమున కెంతయువేడ్కజనియె దేవదుందుభులుధిధిమ్మనిమ్రోయ
ననలముఖంబున నారీతిశబరి ♦ యనిమిషసౌఖ్యంబు లందినయంత
రమణీయమూర్తులు రామలక్ష్మణులు ♦ నమితబలోదగ్రులచ్చోటుగదలి
యనవరతాలోక మతిగుణానేక ♦ మునిలోకమగుఋశ్యమూకంబుగనిరి
త్రైలోక్యవిభుడైనతమరాకజూచి♦యాలోలమతిబొంది యానందమంది

—:* రాముడు ఋశ్యమూకమునుజూచి హర్షించుట *:—

యనయంబునుబ్బెను నశ్రుపూరంబు ♦ లనుసెలయేరుల నమరెనుదాని
ఇలమేరుమందర హిమశైలపతుల♦నలిమీరినగియెడి నగవులోయనగ
సాంద్రంబులై యుండిచరుఁదీపింతు-చంద్రకాంతోపలచ్ఛాయలదాని
సరసిజాసనుడు భూచక్రంబుమీంద♦బరగబర్వతరాజు బట్టంబుగట్టి
శిరసునబెట్టిన సేసప్రాలనగ ♦ సురుశృంగమునజుక్క లొప్పెడుదాని
సురుచిరమతిసూర్య సుతుడుసుగ్రీవు ♦ పరిభవించిన వాలిపై మండుచున్న
గతిసూర్యకాంతముల్గలయువెలుంగు♦నతులప్రతాపోగ్రమై యున్నదాని
ఘనగులుగొమ్ములై మెరయనేతెంచి♦నెఱయసానువులపై నీలమేఘములు

పొలుపొన్దమదగజంబులుగాఁగదలఁచి♦మలయసామజముల మూఁనైనదాని
కంగజహరుమాళి నమరునాకాళి ♦ గంగయైయొప్పుల కరమొప్పుచున్న
యాయొడఁగ్రీడించు హంసమాలికలు ♦ మాయనివిధిశిరి మాలికల్గాఁగ
బహుశృంగభూరుహ పల్లవచయము♦విహితజటాజూట విభవమైయొప్ప
నాసన్నులై సిద్ధులర్థిసేవింప ♦ నాసదాశివమూర్తి యననొప్పుదాని
బలభేది మొదలుగాఁ బఱఁగు దేవతలు♦కలయనంబుధిఁద్రచ్చి కన్నవస్తువులు
ఘనివడితమలోనఁ బొలుపొందున్న♦తనిచిరోరయమృతపానోన్మత్తులగుచు
ఘుఱచిరోయె తయు మంచితావగుట♦తెలుగొప్పడాచిరో దీనిపైనవగ
కల్పవృక్షంబులు కామధేనువుః ♦ వేల్పుకన్నియలును వివిధౌషధములు
చింతామణులనఁదు జెడనిపెన్నిధులు ♦ సంతానతరువుల సరినొప్పుదాని
గనిదానిమహిమకు గడుసోద్యమంది♦ యినవంశవల్లభుండెంతయు బొగడి
యుఱలేనిభక్తితో ననజుండుఁగొల్వ♦మెఱయునాశైల సమీపంబునందు
దరుచైనతోఁగలు నత్తమ్ములతోడ ♦ తఱలుపంపాసరో వరముఁనకరిగి
చందుననియతితో నాసరోవరము ♦ నందుగృతస్నానుడై రామవిభుడు
పొలుపొందదనకుదమ్ముఁడు తెచ్చియొసగు ♦ఫలములజలము బరితృప్తిబొన్ది
తనరారుతత్తీర తరువులనీడ ♦ ననుజన్ముఁడనుదాను నర్థిదీపింప
సంతలోరఘురాముఁడా వనంబెల్ల♦నెంతయుగనుఁగొనియుటఁజోద్యమంది
విలసిల్లునొకచూతవృక్షంబునీడ ♦ వలయుచుశైత్యమై నర్థితోనుండి
సీతంచిరఘురాముఁ డేపుదీపించి♦వృక్షంబుపరికించి వెలయనిట్లనియె [లు
వనవాసమిది మొదల్ వచ్చినతుదయు ♦ ఘనమైనయద్రులుఘనపుణ్యనదు
తరమిడికంటిమి ధారుణినిట్టి♦తరులెందు నెరుగమీ తరునకుసవతు
సురపతిమొదలుగా సురలెల్లగూడి ♦ కరమర్థిసీతరు గావించిరొక్క-
యఁజుడునీతరువున కాయువుపోసి ♦ నిజముగానిక్కడ నిల్పినాడొక్క-
రవిసుతుతపమున రాగిల్లిబ్రహ్మ ♦ భువిమీఁదతరువుగా బుట్టించినాఁడొ
సేవించియమృతంబు సోలిరిసురలు ♦ భావించిరవిసుతు పక్షంబుగలిగి
యరయంగమేలైనయమృతంబుతోడ♦బురణింపదరువుగాబుట్టించినారొ
యినునితోనిష్టంబు నింపొందజేయ♦జనురలోకము నగశాఖలున్నతము
నష్టదిక్కులకు నున్నతశక్తిగారి ♦ యిష్టమైనఫలంబులీ గోరినట్లు
పరమశాఖలురుచిప్రభనొప్పుమీరి ♦ తెరచిపర్ణంబుల తేజంబులొప్ప
రవిద్రిష్టిదూరదు రాత్రితక్షేర్మి ♦ దవిలియాశశిదీప్తి తనుగానసీదు
ఫలములాయమృతంబుఫలములకంటె♦ గలశతగుణములగడునొప్పుమీరి
తరురాజపట్టమీ ధాత్రిపైవేగ ♦ గరమర్థిదివిజులు గట్టిరోప్రీతి

వనితమ్మునికిఁ జెప్పనాగాక యనుచు ♦ వినయోక్తి నారాము విభుచిత్త మెఱిఁగి
యాలోన సౌమిత్రి యన్నకు భక్తి ♦ శాలియై మృదుపర్ణశాలగావింప
సముచితస్థితి మృదుశయ్య రాఘవుడు ♦ విమలచిత్తమ్మున వేడ్కఁ శయినింప
సౌమిత్రి రఘురాము చరణంబులొత్త ♦ శ్రీమీర నిద్దుర చిత్తంబులందు
నలరగా ర్యాలోచనములు సేయుచును ♦ విలసిల్లుచుండిరి వేడ్కతో నంత
ఆరణ్యకాండము పారనిబ్బంగి ♦ నారవితార్కమగు నుర్విమీద
అనియాంధ్రభాషభాషాధీశవిభుడు ♦ వినుతకావ్యాగమవిమలమానసుడు
పాలితాచారుడ పారధీశరధి ♦ భూలోకనిధిగోన బుద్ధభూవిభుడు
తమతండ్రి విట్ఠలధరణీశుపేర ♦ కమనీయగుణధైర్యకనకాద్రిపేర
బలిబూనియరిగండ భైరవుపేర ♦ ఘుమపేర మీసరగండనిపేర
నాచంద్రతారార్కమైయొప్పఁగిలి ♦ భూచక్రమున నతిపూజ్యమై వెలయు
నసమానలలిత శబ్దార్థసంగతులఁ ♦ రసికమై చెలువొందు రామాయణంబు
పరగ నలంకార భావనల్ నిండ ♦ కరమర్థి నారణ్యకాండంబు జెప్పె
నారూఢి నాశ్లేషమై యాదికావ్య ♦ మైరసికానందమై యెల్లనాడు
నివ్వసుమతి నొప్పు నీపుణ్యచరిత ♦ మెవ్వరు చదివిన నెవ్వరు వినిన
సామాదిబహువేద చయధామ రామ ♦ నామచింతామణి నవ్యభోగములు
పుహితచారముల్ప్రభువిచారములు ♦ పరిపూర్ణశక్తులుప్రకటరాజ్యములు
నిర్మలకీర్తులు నిత్యసౌఖ్యములు ♦ ధర్మైకనిష్ఠలు దానాభిరతులు
ఆయురారోగ్యంబులైశ్వర్యములును ♦ బాయనిశుభములు పాపక్షయంబు
వరపుత్రలబ్ధియు వైరినాశనము ♦ సరినొప్పు ధనధాన్యాళియ సమృద్ధియును
యేవిఘ్నములు లేక యిండ్లలో నధిక ♦ లావణ్యవతులైన లలనలపొందు
కొడుకులతో నెపుడు కూడియుండుటయు ♦ [యు
నెడగాక నాపద లెల్ల బాయుటయు
సమ్మదంబున బంధుజనులగూడుటయు ♦ నిమ్ముల కామ్యంబులెడపకుండుట
సతతంబు దేవతా సంతర్పణంబు ♦ పితృగణతృప్తియు బెంపారుచుండు
ఇది మోక్షసాధనం బిది పాపహరము ♦ యిదిదివ్యమిది భవ్యమిది శ్రీకరంబు
వ్రాసిన వారికి వరశుభోన్నతులఁ ♦ వాసవలోకాధివాసులఁ జేయు
నెందాక కులగిరు లెందాక తార ♦ లెందాక రవిచంద్రు లెందాక దిశలు
యెందాక వేదంబు లెందాక ధరణి ♦ యెందాక భువనంబు లేపుదీపించు
నందాక యీకథ యక్షరానంద ♦ సందోహమంగళాచారమై బరగు

ఆరణ్యకాండము - సంపూర్ణము

---

శ్రీ ర స్తు

# శ్రీ రంగనాథ రామాయణము

## కిష్కింధాకాండ ప్రారంభము

—: * :—

శ్రీరాముఁ డయ్యెడ శీతలవారి♦వారిజోత్పల కైరవంబుల నొప్పు
పంపయు మధుమాస ఫలితతత్తీర♦చంపక సహకార చారుకాంతార
సంపదయును జూచి జానకీవిభుఁడు♦కంపితుఁడగుచు లక్ష్మణున కిట్లనియె
సౌమిత్రి యీపంప సరసి నిలింప♦కామినుల్ జలకేళి కరము గావింప
నొప్పు నీసరసితో నుపమానమరసి♦ చెప్పంగ శక్యమె శేషాహికైన
ననుకూలమలయానిలాహతి దీన♦జనియించు బోలిందు సరములెన్నైన
దీనిమహాత్వంబు తెలసినచోట♦మానసంబును నణుమాత్రంబె కాదె
పావన జీవనాస్పదమైన దీని♦కావేల్పువాహిని యైనసమంబె
ఇన్నాళికస్ఫురితోరుకర్ణికల♦దిన్నగా విరిసిన తెల్లనెత్తమ్మి
మరకతస్తంభనిర్మల హేమకంధ♦ధరితాతపత్రమై పార్శ్వద్వయమున
దేటి రెక్కలు గ్రమ్మ తెమ్మరవలన♦నూటాడు తిరగల నుయ్యాలలూగు
విప్పైన రెక్కల వెలయు రాయంచ♦లొప్పారగా వైచు నుభయచామరము
లింపా దిదీపంప సీతింపనొప్పె శ్రీ♦పూర్ణపట్టాభిషిక్తుని కరణి
కామినిజవ్వనం బలరిన రుచులు♦ జేమించుచున్నవి చిగురుమాణికపు
సొమ్ములు దాల్చుచు చుట్టును గ్రమ్మి ♦ కొమ్మల నిడుపుల కొలకు దట్టముల
నిక్కనీడలు చూచి నిజవిలాసముల♦కొక్కెతయావల లూచుచందమున
కొండొకగాలి సోకులతుదల్గదలి♦నొండొరుల్ బొగడుచునున్న చందమున
కీరశారికలర్థి గెలియనిచోట♦తీరవనీవాటి దీప్తించినపుడె
తాపంబు మరుని ప్రతాపంబుకరణి♦దీపించు నామీన ధృతినటుగాన
సౌమిత్రి యిది వనస్థలిసీమ గాదు♦ కాముని యాయుధాగారంబు గాని
చింతింప నివి మావి చిగురులు గావు♦కంతుని క్రొవ్వాడి కత్తులు గాని
ఈ వింపనివి పువ్వుబంతులు గావు♦ భావజాతుని పుష్పబాణముల్గాని
ఏయెడ భృంగఝంకృతులివి గావు♦డాయు నాతని చాపటంకృతుల్గాని
వరింపనివి పిక ధ్వనులు గావతని♦కర్ణకఠోర హుంకారంబు గాని
యటుగాన నావంటి యంగనారహితు♦నెటువలె వేగింతు నీకాననమున [ము
గటకంటకులకు హూంకారనిస్వనము♦చెలియించువనముగర్జిలు ఘనాఘన

కులుకుపుప్పొడిమిన్నుఁగ్రొక్కారుమించు తలిరుగొమ్మలశక్రధనువులయనువు
వసుధరాలెడు విరుల్వర్షోపలములు ♦ ముసురు తేనియసోన ముంచినవాన
గానొప్పుచే వసంతకాలంబుచూడ ♦ వానకాలముఁబోలి వసుధనొప్పియును
జిగురాకుశిఖలతో జిట్టాడు తేఁటి ♦ పొగఁతో బొగడు పుప్పొడిబూదితోడ
బూరుగపువ్వు నిప్పులతోను నెగడి ♦ యారయ విరహుల కగ్నియైనిగుడ
గంతుప్రతాపాగ్ని కంటెను నెగడి ♦ యెంతేని నాచిత్త మెరియి పదౌడగ
నేమిసేయుదునింక నెట్లు వేగింతు ♦ గామినీమణిసీత గాంతునెన్నటికి
సంపాసగోవర ప్రాంత కాసార ♦ సంపదతోడ వసంతంబుకూడ
గలుగు నేనాకు నొకానొకనాడు ♦ కలకంఠిసీతతో గలసియుండగను
ఈ పంపలో దమ్మిలే చూచినట్లు ♦ భూపుత్రివదన మెప్పుడు చూతునొక్కొ
యిందుమీనవిహార మీక్షించినట్లు ♦ ఇందువదనచూపు లెప్పుడు చూతు
జ్ఞపతుకక్కడ జతగూడినట్లు ♦ జలజాక్షి నెన్నడు జతగూడువాడ
దేటియిచ్చటి తమ్మితేనెగ్రోల్కరణి ♦ బోటికె మోవి నెప్పుడు గ్రోలువాడ
నెక్కడితలపోత లెక్కడిసీత ♦ యెక్కడిదీసేత లివియెట్లపోసగు
దమ్మ్రడనీవ యోధ్యకు జనుమింక ♦ నెమ్మనప్రాణంబు లికనిల్పజాల
ననియునాథునిక్రియ నందందవగవ ♦ వినిలక్ష్మణుడు రామవిభునిబోధించి
యిది యేమిరఘురామ యెల్లలోకముల ♦
ముదలింపబురుషోత్తముడవైననీవు
ఈ మోహశోకంబు లేలదాల్చెదవు ♦ కామినివంచన గైకొనిచనిన
రావణుజంప సంరంభంబు సేయు ♦ మీవని దెలుపుచో నెంతయుప్రీతి
గనుపెట్టుయెలుగిచ్చె గబ్బల్లుబలికె ♦ గనుగొనితచ్ఛలి కలయంగరొప్ప
చేకొనిచిఱుతదా జేరంబెట్టె ♦ గైకొందుజెలినని కలయంగరొప్ప
నెల్లెడశుభములు నిత్తుమీకనుచు ♦ బల్లిదీపంబుగా బలికెబోచెవికి
భానుపై వామాక్షి పరుపనియెలుగు ♦ యానియించుక చెవియొంతయురొప్ప
దనయ్యాగడు మెచ్చి తమ్ముని జూచి ♦ యినవంశవల్లభ డిట్లనిపలికె
వచనరాధీశుండు వడినేగుదెంచి ♦ ఘనభక్తిమనలను గలయంగగలడు
గూలురావణుడాజి గూడునసీత ♦ నెలుదులోకంబు లెలమిధరింప
ని విరామసౌమిత్రులధికసంతోష ♦ మున నున్నిసుఖగోష్ఠి ముదమందుచుండ
నాలోనసుగ్రీవుడట ఋశ్యమూక ♦ శైలసానువులందు జరియింపుచుండి
యాపంపచేరువ నందున్న రామ ♦ భూపాలులక్ష్మణు బొడగాంచి వెఱచి
యచలంబుపై కేగు డనక నెట్టనక ♦ కిచకిచధ్వనులతో గిచకొట్టుకొనుచు
నెగప్రాకియొక్కచో నేకాంతముండి ♦ యగచరులకు జూరినటిగూపి చూపి

విలుకాండ్రు ఇద్దఱు వివిధశస్త్రాస్త్ర ♦ కలితులై యటబంప కడనున్నవారు
వినుఁడిందుఁ బ్రచ్ఛన్న వేషులై వాలి ♦ పనుపున మనలఁ జంపఁగ వచ్చినారొ
కాదేని మునులకు ఖడ్గతూణీర ♦ కోదండశరముల గొడవలేమిటికి
వినుతసాహసులైన వీరి వేషములు ♦ కనుఁగొని నాబుద్ధి కలఁగుచున్నదియు
నెక్కడికైనను నేఁగుట కార్య ♦ మిక్కడ నుండుట యదిబుద్ధిగాదు
అని మంత్రివరులతో నాడు వాక్యములు ♦ విని హనుమంతుండు వివశుఁడై పలికె
పూని వీరలఁ జూడఁ బుణ్యమానసులు ♦ గాని గానేరరు కపటమానసులు
ఆరవిచంద్రులో యన నొప్పు వీరు ♦ కారణపురుషులో కడు విచారింప
దీరూపమున వచ్చి యిందున్నవారొ ♦ వీరి పెంపెఱుఁగక వెఱవ నేమిటికి
అనిన సుగ్రీవుండు హనుమంతుఁ జూచి ♦ విను వాలి పనుపున వీరలిచ్చటికి
చనుదెంచిరనుశంక జనియించె నాకు ♦ గినిసి యేవేళ యేకీడంచు నొక్క-
తనపగతుని నమ్మఁదగదటుగాన ♦ జని నీవు వీరల జతురత మెరసి

—: * శ్రీరాములవద్దికి హనుమంతుఁడు వచ్చుట : * —

వీరేల వచ్చిరో వీరిలో తెఱఁగి ♦ వీరితో భాషించి వేవేగ వచ్చి
పవనజ నాలోని భయమెల్లఁ బాపు ♦ మవిరళగతి నేఁగుమని వీడుకొలిపి
యెలమి నిర్భీతిమైనందుండ వెఱచి ♦ మలయాద్రికటు బోయె మంత్రులుఁ దాను
అత్తఱి హనుమంతుఁ డతిశౌర్యవంతుఁ ♦
డుత్తమగుణవంతుఁ డురుబాహుబలుఁడు
అమరలోకంబున కావాలి ననుప ♦ రమణ సుగ్రీవుని రాజుగా ననుప
హావిరి నసురల వంశంబు కెరుప ♦ రావణుజయులకు రాముననుప
నవనిజ ఘనశోక మలపడమాన్ప ♦ నవనీశు రఘురాము నప్పుడుగాన
వచ్చిన తెఱఁగున వనచరాధీశు ♦ డచ్చుగా నా కొండ యల్లన డిగ్గి
వటువేషధారియై పవననందనుఁడు ♦ నటపంపకడకు దానర్థితో బోయి
యనుపమంబగు శూన్యహస్తంబుతోడ ♦ జనిమహాత్ముఁ గానజనదటుగాన
నలర రామునకిచ్చ నర్హమైనట్టి ♦ ఫల మొక్కటపుడు చేపట్టి వేడుకను
అరుదెంచునని లజునపుడు తాఁ జూచి ♦ ధరణీశుడిట్లనియె తమ్మునితోడ
గనకపు వన్నియ కర మొప్పు మూఁజి ♦ ఘనరత్నకుండల కలితకర్ణములు
సురుతరహారంబు లొండటి జన్నిదము ♦ కర మొప్పు గోఁచియు గరకంకణములు
నుపమింపనరుదైన యొప్పులనొప్పు ♦ కపిరూపమజుఁడు దాఁగైకొనెనొక్క-
యీరూపు రేఖయు నిలఁగోరి రుద్రు ♦ డారూఢిగాని తడై పుట్టినాడొ [గు
గాక యీ వసుధపై కపిమాత్రమునకు ♦ బ్రాకటంబుగ శుభప్రధ మేలగలుఁ
పని యిట్లు కొనియాడు యవనీశుఁ జూచి ♦ తను మేను పులకించి తడయక వచ్చి

యురుమతిసీత శిరోరత్నమెలమి♦గురుతుగా దెచ్చి గ్రక్కునయిత్తునన్న
కరణినా ఫలము రాఘవమహీపతికి♦గరిమెతో కానుకగా సమర్పించి
సరిలేనిభక్తితో సాగిలి మ్రొక్కి ♦ కరములు ముకుళించి కరమర్థిబలికె
నవనిమీరింద్రులో నర్థినశ్వినులో ♦ రవిచంద్రులను రూపరమ్యతతోడ
నెగుభుజబుతోడనిందుబింబబు♦ నగుమొగంబులతోడనళినపత్రముల
దెగడుకన్నులతోడ దివిజులుమెచ్చ ♦ వొగడువిక్రమకళా భుకశక్తితోడ
నరుదైన రాజచిహ్నములతో మీరు♦శరచాపహస్తులై చనుదెంచినారు
భూరితపోవేషములు మీకునేల ♦ మీరెవ్వరిచటికి మీరురానేల
యనిసుధామధుర వాక్యంబులనధిపు♦వినయవిధేయుడై విన్నవించుటయు
నతనివాచాశుద్ధి కతనిబుద్ధికిని ♦ నతనిచమత్కృతీ కతనియాకృతికి
నతనిమనఃప్రీతి కతనినీతికిని ♦ మదిసంతసిల్లి రామక్షితీశ్వరుడు
తమ్మునిజూచి యీతనియట్లుబలక ♦ దమ్మిచూలికిని యాతనివధూమణికి
తగుగాక యొరులకుదరమె వాక్యరణ♦నిగమశాస్త్రంబులన్నియు నేర్చెబోలు
నతనిసల్లాపంబు నతనిలక్షణము ♦ నతులలక్షణ లక్షితాను రూపంబు
ఇటువంటిదూత నాకిపుడబ్బెనేని ♦ ఘటియింపకున్న మత్కార్యంబులెల్ల
గావునమత్కార్య గతులీతనికిని ♦ కోవిదాత్మకపూస గూర్చినయట్లు
చెప్పుమెర్పడనన్న శ్రీరాముతమ్ము♦డప్పుడుప్రియమంది హనుమంతుజూచి
యేమన్నదమ్ముల మిక్ష్వాకుకులుల♦మీమహాత్ముడు రాముడేనులక్ష్మణుడ
దశరథరాజనందనుల మిద్దరము♦ దశరథుపనుపున దపసులై వచ్చి
దండకావనమున దగిలివర్తింపు♦ చుండ రాముని దేవినుర్వీతనూజ
మముడాగురించి దుర్మదుడు రావణుడు ♦

క్రమమేదిగొనిపోయె గపటమార్గమున
కానిపోయినజాడ వదలక వెదక ♦ కానలనడుమ నొక్కటవచ్చివచ్చి
శబరిసుగ్రీవుని చరితంబు జెప్ప♦ప్రబలుడాతడు మాకు సఖుడుగాగోరి
వచ్చితిమిచటి కెవ్వడవు నీవింక ♦ నచ్చుగానెరిగింపు మనఘునీ తెఱగు

—:* హనుమంతుడు తనజన్మప్రకార మెరిగించుట *:—

ననవుడుహనుమంతు డారఘుకులుల♦కనుగొని మ్రొక్కి తక్కవివిన్నవించె
నెలమిమాతల్లికి నేనుజన్మించి ♦ వలనొప్పనొకకొన్ని వర్షములుపగ
నొక కారణమునకై నొకబ్రహ్మగూర్చి♦ప్రకటితమతి నేలపంబు సేయగను
పరికించిసరసిజ భవుడేగుదెంచి♦వరము వేడుమటన్న వలగొని మ్రొక్కి
వేవేలువిధముల వినుతులు జేసి ♦ యోవిమలాత్మ యీయూర్విపై నాకు
గతిమోక్ష కామ్యార్థ కారణంబులకు♦బతియెవ్వడతని నేప్రార్థించి కొలుతు

ననివిన్నవించిన నబ్జసంభవుఁడు ♦ తనమనోవీథిని దలపోసిచూచి [యు
యొనరంగనీ మేనియురుభూషణములు ♦ కనుఁగొన్న యాతఁడేగదియనుబతి
ధాతయుమనకిష్టదైవంబుసక ♦ భూతజాలములకు భువికెల్లకర్త
వతఁడెవ్వఁడనినవాఁడతఁడె విష్ణుండు ♦ అతఁడెనీగతియని యదియాత్మఁదెలియు
మనిబ్రహ్మచనియెనేనదియునుగాక ♦ ఘనబుద్ధిఁజరియింతుఁగలయలోకముల
భూపాలతిలక నాభూషణావళులు ♦ దీపించగానరు దివిజుల దరుసు
నీవశరణ్య మీదృష్టినర్కసోకె ♦ నైనవి యా భూషణావళులింక
నేనుగృతార్థుండ యేనుధన్యుండ ♦ నేనుమీభృత్యుండ నెలమితోడుతను
వనిపల్కహనుమంతుఁడను పేరివాఁడ ♦ వినతనూజునిమంత్రి నేవాయుసుతుఁడ
నాంజనేయుఁడ భిక్షుకాకృతినిపుడు ♦ నంజకమీచెంద మరయవచ్చితివి
వినుఁడుసుగ్రీవుఁడు విశ్రుతకీర్తి ♦ వనచరులకురాజు వరబలాధికుఁడు
భానుసూనుఁడుబృహద్భానుతేజుండు ♦ మానభూషణుఁడసమానవిక్రముఁడు
అన్నయౌవాలిచే నపహృతరాజ్యుఁ ♦ ఖిన్నుఁడైయిప్పుడిగ్గిరి నున్నవాఁడు
ఆర్తుఁడుమీసఖుఁడై యుండఁజేయు ♦ నేర్తునావుఁడురామ నృపుచిత్తమెరిగి
మఱియును సౌమిత్రి మారుతిఁజూచి ♦ తెఱఁగొప్పనతనితో ధీరుఁడై పలికె
వినురాఘవుఁడు లోకవిఖ్యాతసత్త్వుఁ ♦ డనుపమదివ్యాస్త్రుఁ డసమసాహసుఁడు
కరుణాపయోనిధి కారణసుకృతి ♦ శరణాగతత్రాణ సద్ధర్మపరుఁడు
జగదేకనాథుండు సాధుశరణ్యుఁ ♦ డగణితగుణగణ్యుఁ డధికాధికుండు
[illegible]లోకవిక్రముఁ డతిసత్యవాది ♦ హితుఁడనై బంటనై యేనువర్తింతు
కావునరాఘవక్ష్మాపాలమణికి ♦ లేవసాధ్యంబులు లెక్కింపనెందు
కుటిలరాక్షసుఁడున్నగురుతుమున్నెఱిఁగి యటసీతసాధింపనేమెచాలుదుము
అలమైనెకాకులై పోవఁదగదు ♦ తలఁపోయనిది రాజధర్మంబుగాదు
గానసుగ్రీవుని గైకొనుతలఁపు ♦ మానవాధీశ్వరు మదిలోనఁగలదు
ఇటమీఁదనీకార్యమేమెంటనైన ♦ ఘటియింపుమనవుఁడు కరువలిసుతుఁడు
నెఱయసంతసమందినిజమూర్తిఁజూచి ♦ మఱితన్ను రామలక్ష్మణులు మన్నింప
తనుకృతకృత్యుఁగా దపనవందనుని ♦ వనచరరాజుగా వరుసనెన్నుచును
గనఁగవహర్షాశ్రుకణములుదొరఁగ ♦ గొనియాడికొనియాడికోర్కెదీపింప
ప్రమదమింపొంద నాపార్థివేంద్రులకు ♦

గ్రమమొప్పమ్రొక్కి యాకపికులోత్తముఁడు
అరిగిరాఘవుల వృత్తాంతమంతయును ♦ దొరకొనిసుగ్రీవుతో జెప్పఁదొణఁగె
రమణీయమూర్తుల రామలక్ష్మణుల ♦ కమనీయగుణములు కడుఁగీర్తించి
జగతిపైనతి శోకసాగరమగ్నుఁ ♦ డగునీకురఘురాముఁడను తెప్పగలిగె

బ్రతికితిసుగ్రీవ నవియెల్ల నణగె ♦ దుదముట్టగలిగె సంతోషంబునీకు
నాదశరథపుత్రుఁడా సుచరిత్రు ♦ డాదయాకరమూర్తి యాసత్యవాది
యాపుణ్యనిధిరాము డటనీకుకర్త ♦ నీపుణ్యమేమన నేర్తుసుగ్రీవ
యామహాత్ముఁడు తండ్రియానతిదండ ♦ కామధ్యమున నుండగాదశాననుఁడు
తనదేవిమ్రుచ్చిలి తనమున నెత్తి ♦ కొనిపోవ వానిమార్కొని ద్రుంచివైత
చింతించినీతోడ చెలిమిపాటింప ♦ నెంతయుదలపోసి యేతెంచిరిటకు
ననినసుగ్రీవుఁడు హర్షించియపుడు ♦ ననిలనందనుఁజూచి యర్థితోబలికె
బవనజనాలోని భయమెల్లనణగె ♦ దవిలినాచేసిన తపమెల్లబండె
నలవడనాకునీయట్టి యంజనము ♦ గలుగుటఁగంటి రాఘవనిధానంబు
కలగఁగనీవంటి కర్ణధారకుఁడు ♦ గలుగనీశోకాబ్ధి కడతేరఁగంటి
గడకతో ఋశ్యమూకమునకువారి ♦ తోడ్తెచ్చి నాలోని దుఃఖంబుబాపు
పొమ్మనవుడువాయుపుత్రుండువోయి ♦ నెమ్మితోరఘురామనృపతికిమ్రొక్కి
దేవసుగ్రీవుండు దేవరసఖుఁడు ♦ దేవరఁదర్శింప దివురుచున్నాఁడు
విచ్చేయుమని విన్నవించినరాము ♦ డిచ్చలోహర్షించి యింపుసొంపొంది
హనుమంతుఁగొనియాడి యతిపుణ్యలగ్న ♦
మునహనుమంతుని మూపులమీఁద [ఁడు
దనలక్ష్మణుఁడును దానుదగఋశ్యమూక ♦ మునకేగియానందమునఁబొందె విభు
హనుమంతుఁడంత నేకాంతంబునందు ♦ మనుజేశుఁడటనుంచి మలయాద్రికేగి
శ్రీరాముఁదర్శింపు సుగ్రీవనీవు ♦ చేరినీకోర్కులు చేకూరెనింక
రాదేవవచ్చిరి రామలక్ష్మణులు ♦ నాదట ఋశ్యమూకాద్రికిననుఁడు
నినతనూజుఁడుబ్రీతి నిచ్చలోనుబ్బి ♦ మనుజవేషముదాల్చి మకుటకేయూర
ఘనతరశృంగారకలితుఁడై యపుడు తనమంత్రులునుదానుతడయకేతెంచి
తక్కనభక్తితో డాసిరామునకు ♦ జక్కజాగిలిమ్రొక్కి సంప్రీతినొంది
ముకుళితహస్తుఁడై ముందరనున్న ♦ యకలంకు సుగ్రీవునధిపతిచూచి
యాలింగనముజేసి యతనికిట్లనియె ♦ నాలోనదరహాస మమృతమైపొదలుఁగ
నీవాయుపుత్రుచే నినపుత్రయేను ♦ నీవిక్రమంబును నీభుజాబలము
విని ప్రీతిఁబొందితి వెఱవకుమింక ♦ నెనసినపగవాని నేనెచంపెదను
నాకాప్తబంధుండు నమ్మినసఖుఁడు ♦ నీకంటెనొకఁడు గణింపఁగలఁడె
మనియూరడించిన నర్కనందనుఁడు ♦ నిచినబంటుగా నన్నుగైకొంటి
దేవనీకారుణ్యదృష్టిపర్వసోకె ♦ నేవిధంబున ధన్యుఁడేనేపోనింక
నలినాప్తకులనాథ నాయట్టిబంటు ♦ గలిగెనీకిటుగాన గడిమనేనింక
దివిరిరావణుని వధించితిగడగి ♦ యవనిజగైకొంటినని నిశ్చయింపు

మునిరామసుగ్రీవు లన్యోన్యభాష♦ణలుసన్నిధి జేసి యకలంకులైరి
అట్టివంగకుండును అంచితాంగదుండు♦ఇట్టప్రాయముగాగ నప్పుడావనుల
గిరులను వెసవచ్చి క్రీయనాడుచుండి ♦ ఆరామసుగ్రీవు లన్యోన్యము గను
నెమ్మగాననలు సన్నిధిబలుక్కపల్కు ♦ లన్నియువినివచ్చి యాకారతోడ
విన్నవించినమది వేగుచునుండె ♦ కొన్నిదుశ్శంకల గుందుచునుండె.
అపుడర్కసుతునకు నారాఘువునకు♦విపులభూరుహశాఖవిరిచి వాయుజుడు
నాసనంబులువైవ నందుగూర్చుండె ♦ యాసక్తిపరిణామమరయుచునుండ

—:* సుగ్రీవుడు జనకజ తొడవులిచ్చుట *:—

నహిమాంశునందనుండంత రాఘువుల ♦ గుహాలోపలికిదోడుకొనిపోయిప్రీతి
భూమిజమునువైచి పోయినతొడవు♦లామెయిగొనివచ్చి యప్పుడిట్లనియె
దనుజుడుగొనిపోవు ధరణీతనూజ ♦ వనసీమలోపల వచ్చినమిమ్ము
గన్నుబాముగగన మార్గంబున నెత్తు♦కొనిపోవపోవనీ కొండపై మమ్ము
గనుగొనిమిముబెక్కు గతులజీరుచును ♦
జనుదుపయ్యెద కొంగుచించిబంధించి
తనతొడవులువైచి తరలాక్షిబోయె♦నని చెప్పిచూపిన నదిపతిజూచి
మున్నుగావగలను మున్నీటమునిగి♦కన్నీటనాసామ్ము కసటెల్లగడిగి
వందందయురమున నాభూషణములు ♦ పొందించిపొందించి భూమిజదలచి
పెలుకురిలక్ష్మణు బేర్కొనిపిలచి ♦ పలికెబలుకుల తొట్రుపాటురెట్టింప
గంటిలక్ష్మణసీత గైసేతలెల్ల ♦ మంటిపాలయ్యె సీమాటికేమందు
సీతొడవులువైవ నేమికారణమొ ♦ యీతొడవులతోడ నేమైనయదియొ
యదిలోకపావనియైన యాసీత ♦ కుమురునిండిన గబ్బిగుబ్బలయందు
?యునియాజ్ఞ పయ్యెదకొంగు ♦ కీలువష్టలువచ్చె నేమనవచ్చు
బన్నిటునాపాద పద్మముల్ గడిగి ♦ యున్నతిదడిదొత్తు నొప్పుగదీన
స్తుతటిగావించి భాసురలీలదీన ♦ భరతశ్రమాంబువు ల్పలుచగాజేయు
వెఱపునునొఱపును వీడ్కొడదీన ♦ మఱియుడుగులకును మడుగులుబఱచు
యనినిశోకించి యశ్రులునించి♦యనయంబుమూర్ఛిలి యంతలోదెలసి
ప్రియభక్తినమిత గ్రీవుసుగ్రీవు ♦ నయుననాథుడగు రఘునాథుడీక్షించి
నాజీవిగొనిచన్న నాకైశవైరి ♦ యేదేశముననుండు నెద్దిపురంబు
తెప్పుమాసుగ్రీవ సీతసాధింతు ♦ నిప్పుడెవనిదైత్యునేపణగింతు
స్రావిన్నియూరవి నందనుండనియె ♦ దేవయాద్రోహి మందిర మేనెఱుంగ
నెఱుగనుండిన నేమి నిటమీదవాని ♦ వెరుగుతెరుంగెల్ల నేఱుగావింతు
వీవుశోకమ్ముమాని నిశ్చలధైర్య ♦ భావపౌరుష గుణాస్పదుడవుగమ్ము

అతిపరాక్రమశాలి యగు వాలిచేత♦హృతకళత్రుఁడనయ్యు నేనింతపగవ
నాపదయుగువార్ధి కాత్మధైర్యంబు♦తెప్పసేయునరుండు తెలివిమైనుండె
మీవంటిప్రాకృత మనుజులయట్లు♦నీవుఁ శోకింప నీతియే దేవ
అనియిట్లుసుగ్రీవుఁడాడు వాక్యములు♦వినిధీరుఁడై రఘువీరుఁడెంతయును
ఇంతిబోయినజాడ నెఱిఁగినపిదప♦నంతరంగంబున నడలుచునునికి
మగపాడిగాదని మదినిశ్చయించి♦జగతీశుఁడంతట సంతాపముడిగి
సరసిజాసనబూని సాధించుపనికి ♦ పరికించిమునుపీని పగదీర్తుననుచు
మీనాక్షితోడవు సౌమిత్రిచేనుంచి♦భూనాథుఁడా యర్కపుత్రునిజూచి
యాపదకునుసఖుండై నట్టిచుట్ట♦మాపాటిగా నేరఁడారసిచూడ
గుణవంతుఁడైనను గుణహీనుఁడైన♦గణుతింపసఖుఁడె సద్గతియంద్రుబుధులు
కావుననీపేర్మిగల నాకుసౌఖ్య♦మే వెంటగాదవలే దిదినిశ్చయంబు
నీపత్నిగైకొని నిమజంపగోరు♦పాపాత్ముఁడగువాని బరిమార్తునిపుడె
సన్నదమ్ములమైత్రి నలరుటకన్న♦నున్న దేసౌఖ్యమా యొరిమకుమాని
యగచరాధీశ మీయన్నకునీకు♦బగయైనవిధము తప్పక జెప్పుమనిన
నోరామవాలికి నాఁగినాకునైన♦వైరానుకథనంబు వర్ణింతువినుము
కడగిమంధరగిరి కవ్వంబు జేసి ♦ తడయక వాసుకి దరిత్రాడు చేసి
మమ్ముదేవతలెల్ల మన్ననసేయ ♦ గ్రమ్మిన తెలివిమై ఘనభుజాబలిమి
వాలియునేనును వడినొక్కవంక ♦ వాలితిమొకవంక వాలినవారు
నురగరుడోరగా సురసిద్ధసాధ్య ♦ వరులందరును క్షీరవారధితరువ
గరళంబుపుట్టి లోకములెల్లగాల్ప♦హరుఁడదియును మ్రింగెనద్భుతంబెసగ
నలరంగ జ్యేష్ఠయు నందెదయింప♦గలిరాజుదానిని గైకొనెబ్రీతి
బ్రస్తుతికెక్కుచు బహుళంబులైన ♦ వస్తుచయంబు లవ్వారిధిబుట్టె
దమితమకోర్కెకుం దగినవస్తువులు ♦ అమరంగగైకొని రందరుబ్రీతి
నలిబుట్టినైరావతము మేషమహిష ములుమకరకరేణువులుహయవృషభ
ము విజనియింపయింద్రాదిదిక్పతులు వివిధయానములుగా వేడ్కగైకొనిరి
మహనీయసౌభాగ్యమహిమలుతనరఁ♦సహజంబులై లక్ష్మిజనియింపజూచి
ఆమహాలక్ష్మి నారాయణుండపుడు♦కామించితనదేవి గాగగైకొనియె
జంద్రుడుదేవతా సతులుదయింప ♦ నందరిలోదారయను నాతిమాకు
దేవతలిచ్చిన దివిగిగైకొంటి ♦ మావిధంబునమరి యందరుదరువ [ము
జనియించెనమృతంబుసకలదేవతలు♦ ననురాగమునుబొంది యాసుధారస
కామధేనువు కల్పకములాదిగాక ♦ సోమునిగొనితమ చోటికిజనుచు
నమరులుమమ్మంప నర్థితోవచ్చి♦కమనియ్యపదమున గాంతతోగూడి

కలసియుంటిమి కొంతకాలంబుదనుక ♦ అలరుసుషేణునియనుగు కూతురుని
జెలువొప్పబెండ్లియై జెలగు వేడుకల ♦ వలనొప్పరునుగూడి వర్తింపుచుండ
మాతండ్రితరువాత మంత్రులు పెద్ద ♦ యాతడంచునువాన రేంద్రుపట్టంబు
వాలికిగట్టిరా వాలియునన్ను ♦ చాలమన్నన చేసి సంప్రీతినపుడు
నతనికిబంటనై యహరహంబేను ♦ పితృసమానునిగాగ పేర్మి సేవింతు
నీరీతినన్యోన్య హితవులు మెరయ ♦ శ్రీరామ యొకనాఁడు చిరవేటబూని
తొడరినకడతో దుందుభిగన్న ♦ కొడుకుమాయావియన ఘోరరాక్షసుడు
నడురేయికిష్కింధ నగరంబుబెదర ♦ వడినార్చిగర్వ దుర్వారుడై పేర్చి
యనిసేయబిలచిన నలుకదీపించి ♦ యనుపమజయశాలి యగువాలివెడలి

—:* వాలి మాయావితో యుద్ధముచేయుట *:—

ననుగూడియుద్ధ సన్నద్ధుడై పేర్చి ♦ తనమీదనడుప నిద్దరజూచివాడు
ననిసేయమరి భీతుడై పారిపోయి ♦ తనగుహచొచ్చిన దర్పించివాలి
యధికగర్వోన్నతుండగునట్టివాని ♦ వధియించివత్తునే వచ్చునందాక
నిచ్చోటనేమర కీవువేరొకడు ♦ చొచ్చిరాకుంట నిచ్చోనుండుమనుచు
గుహవాత నన్నుంచి గుహలోనచొచ్చి ♦
గుహలోన నొకయేడు ఘోరయుద్ధంబు
కడుకొనిసేయ రక్తమువెల్లివిరిసి ♦ నుడుగక గుహవాత నుబ్బరక్తంబు
కనుగొననార్పు రాక్షసునిబొబ్బలును ♦ విని వాలి రాక్షస విభునిచేజచ్చె
నిచ్చోటనేనుండ కెరిగిన వెడలి ♦ వచ్చుదైత్యుడు బట్టి వధియించునన్ను
ననినిశ్చయముచేసియప్పుడేపోయి ♦ కొనివచ్చియొకకొండ గుహవాతనునిచి
నచ్చోటవాలికి నటతిలోదకము ♦ లిచ్చికిష్కింధకు నేనువచ్చుటయు
వాలిపోయిన తరవాతనీరాజ్య ♦ పాలనంబునకీవె ప్రాప్తుడవనుచు
వదలక మంత్రులు వానరరాజ్య ♦ పదముననను దెచ్చి పట్టంబుగట్ట
వానరకులచక్రవర్తినై యేను ♦ నూనిరాజ్యము సేయుచుంటిమూన్నాళ్లు
మనుజేశ యావాలి మాయావిజంపి ♦ ననుజేరియంతట నన్నుదూషించి
నేనువైచినకొండ నీరుగాదన్ని ♦ పూనిన్గానకప్పుడు నుగ్రుడగుచు
జనుదెంచిననుజూచి చాలకోపించి ♦ తనకేను జేయు వందనముగైకొనక
వోరితమ్ముడవని యూరడినమ్మి ♦ పోరాడబగరంపై బోయినచోట
ననుడించిచనుదెంచి నారాజ్యపదము ♦ గొనిప్రీతినేలుట కూడునే నీవు
కడుబాపబుద్ధివి గావుననిన్ను ♦ దొడరిచంపిననాకు దోషంబులేదు
అనవుడునేవాలి యడుగుల వ్రాలి ♦ వినయంబుభయమును వెలయనిట్లంటి
నొకయేడుమాయావియును నీవుబోరి ♦ ప్రకటింపరక్త పూరముగుహవాత

వెడలిన భయమంది విపరీతబుద్ధి ♦ వడిబారియిచటికి వచ్చినజాడ
రట్టడిమంత్రులీ రాజ్యంబునాకు ♦ గట్టిరింతియెకాని కపటమేనెఱుగ
నాకునీ యూగమనంబె శోభనము ♦ నీకపిరాజ్యంబు నీవుగైకొమ్ము
వాలితమ్ముడగాని వాలినికేను ♦ సేవకుండసుతుండ చెప్పనేమిటికి
గరుణార్థ్యనాయెడ గల్లగల్గినను ♦ గరుణింపుమని పెక్కుగతులఁ బ్రార్థింప
నంతకంతకుమండి యనుజునిపట్ల ♦ నింతేలయని మంత్రు లెంత జెప్పినను
యనయునాపత్ని యయగురుమబుచ్చి ♦

కొనియటరాజ్యంబు కొనిచంపఁగడగె
వెనక నేకాకినై వెసబారిపోవ ♦ వెనుకొనినను జంప వేవిధంబులను
నినుమడించినయీరనిలువకతరమ ♦ యనయ బుభూలోకమంత యుదిరిగి
యేపారపఱతెంచి యిందున్నవాఁడ ♦ నీపర్వతము వాలి కెక్కరాకునికి
ననినరాముడు వెరగంది యీగొండ ♦ యినతనూభవ వాలి కెట్లెక్కరాదు
వినుపింపుమనవుడు వినతుడై నిలచి ♦ యినతనూజుము బ్రీతినిట్లనిపలికె
దొల్లిదుందుభియను దుష్టరాక్షసుడు ♦ బల్లిదుడై వర బలిమిరంజిల్ల
ముల్లోకములుతన మొనకుభీతిల్ల ♦ మల్లడిమైయెకారు మహిమమైపోయి
తరమిసముద్రుని తనతోడననికి ♦ నరమింపిల్పుటయు నయ్యంబుధిగెఁగి
ఘనరత్నకోటులు కానుకలిచ్చి ♦ తునియబల్మి నీతోనుబోరాడ
ఘనుడైనవింధ్యాద్రి గాని యేబూని ♦ యని సేయజాల బొమ్మవివనే తెంచి
జంభారిదోస్తంభ సంభావితోగ్ర ♦ దంభోళినై శిత్య దర్పభంగముల
నతులశృంగముల వింధ్యాద్రిబోరాడ ♦ నతిభీతుడై పర్వతాధీశుడనియె
నీసరివాడనే నిల్పనీతోడ ♦ నోసరింపగపోర నోర్తునేయేను
నిలోకమునసీన్ను నదిరిపోరాడ ♦ వాలినభుజశక్తి వాలికిగలదు
బలియుడై కిష్కింధ పాలించునతడు ♦ కలహంబుపై వాంఛ గలకేనినీకు
నలఘువిక్రమయింక నందేగుమనిన ♦ జెలగిరాక్షసుడు కిష్కింధకేతెంచి

—:* వాలిదుందుభుల యుద్ధము *:—

నిలయుకాలాభీల వేళఘుర్జిల్లు ♦ జలదంబుగతినార్చి సరిదనతోడ
నాలంబు సేయ రమ్మనితనుబిల్వ ♦ వాలికోపించి వెవ్వడివచ్చియార్చి
దుందుభిగతి ద్రోయ దుందుభిదాగి ♦ యెందుబోవగవచ్చు నింకనీకనుచు
శిలలు పాదపదములు దెచ్చిరవ్వి ♦ తలముష్టిహతులఁ గొండఁ మందజేయు
వాడును వానరేశ్వరునివతుంబు ♦ వాడికొమ్ములగుమ్మ వాలికోపించి
అతియుగ్రుఁడై పేర్చి యచలంనావైవ ♦ గతదప్పనురికి రక్షసుడునువైవ
గండశైలముబుచ్చి కపిరాజువైవ ♦ నొండొండగొమ్ములనో హాటింపుచును

అరిఁగ్రమ్మికొనివాలి నదరంటఁద్రేయ ♦ తరమివృష్ఠంబున దరువరుండదవ
మాటుననసుర క్రమ్మరవచ్చి తాఁక ♦ మోటతానెత్తుక మోదెనావాలి
కదిసికొమ్ములఁజిమ్మి కపిరాజునిలిచి ♦ కదలనిముష్టి వక్త్రంబునఁబొడువ
రక్కసుఁడొడువ మర్కటరాజుఁబొడువ ♦ దక్కక యిరువురు దర్పించి పేర్చి
కొనకొని నూఱేండ్లు ఘోరయుద్ధంబు ♦ మనువంశవల్లభ మరి చేసి వాలి
క్రొల్లురికదనదు పిడికిటఁదోకఁబట్టి ♦ యెల్లెడఁగుదియించి యెడవకఁద్రిప్పి
వడిదూలియసురయు వాపోవఁబోవ ♦ గడగిమర్మముగాంచి కడువడిఁబొడిచి
బలిమిఁగొమ్ములుబట్టి పడవైచిచంపి ♦ తలకొన్నలావుమైఁదన్నితన్నుటయు
ముక్కున చెవుల మోమున నెత్తురొలుక ♦ నక్కులిశాహతి నద్రియుఁబోలె
నాయుగ్రదైత్యు మహాకళేబరము ♦
పోయి యోజనమాత్రమున దూలిపడియె
గైరికనిర్ఝరాకారంబులగుచు ♦ నారక్తకణములయ్యద్రిపై బడిన
నారసియిచట నిత్యముతపంబున్న ♦ దారుణశక్తి మతంగుఁడుగినిసి
యీపర్వతము వాలి కెక్కరాకుండ ♦ శాపంబుగావించె జగదేకనాథ
గానయీ ఋశ్యమూకమునందు వెఱవ ♦ కేనుగాపుండుదు నెల్లకాలంబు
కడగియీదుందుభికాయంబుబుచ్చి ♦ పుడమిపై యోజనంబుదుబాఱవైవ
వలనైనభుజశక్తి వాఁడికిఁగాని ♦ తలపోయనొరులకు దరముగాదధిప
కైకొనినీవంత కంటెదూరముగ ♦ నీకళేబరమిప్పు డిటుమీటకున్న
ననసినమీసత్వ మిచ్చనేనమ్మ ♦ ననవుడురఘురాముఁ డల్లననవ్వి
యాదుందుభి శరీర మవలీలమీటి ♦ నీదుసందేహంబు నేఁడువాపెదను
ఇవతనూభవదాని నేర్పడఁజూపు ♦ మనవుడుసుగ్రీవుఁ డర్థితోఁజూప
ఘనమేరుమందరాకారమైయున్న ♦ గనికళేబరము డగ్గరికినేతెంచి
కొనకొనిదాని కైకొనకనంగుష్ఠ ♦ మునఁబది యోజనంబులు మీటివైచె
వైచినరఘురాము వరశక్తిపేర్మి ♦ జూచియునమ్మక సుగ్రీవుఁడనియె
నెలమిమైనిదివాలి మీటెడునాఁడు ♦ దళమైన రక్తమాంసములతోనుండు
మనుజేశనేఁడస్థి మాత్రమైయుండు ♦ గనినీవుమీటితిగాక యొక్కింత
వడిచేర్పనీలావు వాలిలావునకు ♦ గడునెక్కుడ నమ్మగారాదు దేవ
యతఁడిదియునుగాక యలవొప్పమీటు ♦ క్షితిధరంబెలుపుట్ట చెండులమాట్చి
చతురంబునిధులందు సంధ్యలువార్చి ♦ శితికంఠపదముల శిరమరిఁజేర్చు
వాయువుకన్నజవంబు హెచ్చగను ♦ తోయధులన్ని దాట్లోదాటివచ్చు
వాలికినిర్జరేశ్వర దంతిహేమ ♦ మాలికవ్వరుసాటి మరియొండువినుము
ధరణీశయియ్యేడు తాళునుదొల్లి ♦ వరశక్తియుక్తిమై వాలిబిట్టగసి

కరములనొక్కట గాగూడబట్టి♦తరమిడి వాటి పత్రము లెల్లద్రుంచు
యడరి తాళంబుల నందొక్కటైన♦వడిగదల్పగ లేరు వాసవాదులును
దలకొని యొకకోల తాళంబు లేడు♦నిలువక గాడి పోనేసితి వేని
వసుధీశ నీలావు వాలిలావునకు ♦ నసమానగతి నెక్కుడని నమ్మవచ్చు
ధరణీశ యీసప్తతాళంబులొక్క♦శరమున దెగ వ్రేయు శౌర్యంబు గలుగు
బురుషుని చే వాలి బొలియునటంచు♦నరయ నాకు మరుత్తుడను ముని జెప్పె
ననవిని రఘురాముడల్లన నవ్వి ♦ వనచరాధిప తాళ్ళు వదలక చూపు
మనవుడు సుగ్రీవు డా రాము వేగ ♦ గొనిపోయి యా తాళ్ళు గురుతెరుగింప
నశనిశంకాశమై యసదృశంబైన♦నశితాస్త్ర మరిబోసి నిపుణుడై నృపుడు
ముంచి యొక్కటపత్త్రి ముఖునాళ్ళ తాళ్ళు♦
ద్రెంచి వగతి తాళ్ళు తెగనేయుటయును
నవని పై వక్రంబులై యున్న తాళ్ళు♦నవిశంబుగ పడినవిగాడి పారి
చేరువ గిరిదాటి చెచ్చర మీరి♦దారుణి దూరి పాతాళంబు జేరి
యలయక తీవ్రత నమ్మహాశరము♦శోలగ రఘురాము దొనవచ్చి చొచ్చె
నతులితంబగు రవమాకాశవీధి♦నతులవిమానంబు నందుండి పలికె
పరమాత్మ యే నమరపతి కడనుందు♦కరుణావతని యెడు కన్నిక తొల్లి
నిరతంబు దుర్వాసు నిందించుటయును♦కరమల్గి శాపంబు గావించె నిట్టి
రూపమై ధరణీశ యాఘనికతన♦శాపమోచనమయ్యె జని యెదనింక
నని చెప్పి కరుణావత మరేంద్రుపురికి♦ జనుటయు రఘురాము శరము తా దూణి
జొచ్చిన గనుగొని సుగ్రీవుడప్పు♦డచ్చెరువును బొంది యానందమంది
సప్తపాతాళసంప్రాప్త మూలములు♦సప్తాశ్వమండలాచ్ఛాది పత్రములు
నగు సప్తతాళంబు లస్త్ర మొక్కటనె♦ తెగ నేసె నాదు సందేహంబు బాయ
వాలి రాఘవుని చే వడి జచ్చు నింక ♦ నేలితి లోకంబు లేలితి తార
నేలితి గపిరాజ్య మేనని పొంగి♦యాలోన గపివీరు లానందమంద
గమలాప్తకులనాథు గాకుత్స్థు జూచి♦కమలాప్తసుతుడంత గరములు మొగిచి
దేవదేవర మూర్తి ద్రిష్టించిలావు♦భావింప లేనైతి బహుబుద్ధినైతి
నినజుండ నేను నీ వినవంశభవుడ ♦ వనిసమబుద్ధినై నపరాధినైతి
ఈలోకమునకెల్ల నేలికవీవు♦పాలింపు నన్ను నీబంటుగా నేలు
నాశత్రు దెగటార్చి నా రాజ్యమిచ్చి♦నాశోకముడుపవే నరనాథచంద్ర
యనవుడు సుగ్రీవు నతికృపాద్రిష్టి ♦ గనుగొని మన్నించి కాకుత్స్థుడనియె
చెచ్చర నీవు కిష్కింధకు బోయి♦నచ్చట వాలితో ననిసేయుచుండు
మవలీల నొకకోల నా వాలి జంపి ప్రవిమల కపిరాజ్య పదము నీకిత్తు

వెరవకసుగ్రీవ వేగబొమ్మనిన♦నరలేనికడఁకతో నప్పుడుపొంగి
నలుడునీలుడు నంజనాతనూభవుడు♦బలియుఁడౌతారుండు బలసిలోనడువ
నాజికిసన్నద్ధుడై బల్మిమెరసి♦రాజిల్లువెనక నారామలక్ష్మణులు
వచ్చికిష్కింధకవ్వల నున్నవనము♦చొచ్చిగూఢముగనచ్చోదన్నుబనుప
వడిబోయికిష్కింధ వాకిటనిలచి♦నడరిసుగ్రీవుడు దగ్రుడై యార్చి

—:* వాలిసుగ్రీవులు పోరుట *:—

తడయకతనతోడ తగిలిపోరాడ ♦ వడినేగుదెమ్మని వాలిబిల్చుటయు
గరిబృంహితంబు లాకర్ణించి పెలుచ♦గరివైరికోపించు కరణిగోపించి
శితికంఠుచరణ రాజీవాళివాలి♦కృతబంధ రావణ గ్రీవాళియైన
వాలిసుగ్రీవుని వడివచ్చితాకె♦వాలిసుగ్రీవుల వక్రవిక్రముల
చెలరేగిపూర్వపశ్చిమ సముద్రములు ♦ బలువిడిబోరాడు భంగిబోరాడ
సమరూపసమకోప సమజవాటోప♦సమసుప్రతాపులై జానుజంఘోరు
జత్రువక్షోనాభి జఘనదేశములు♦చిత్రవైఖరిగాంచి చించిచెండాడ
నాయెడధృతిరాము డమ్ముసంధించి♦యేయనుద్యోగించి యిరువురజూచి
వదనముల్రదనము ల్వాలముల్బాహు ♦
లుదరంబులదరంబు లూరులుఁబరులు
కటములువటము ల్కాళ్ళుచుప్రేళ్లు♦వీక్షులుశిఖలు వేషభాషలును
జెక్కులుముక్కులుశిరములంసములు♦పక్కలుపిక్కలుపాదయుగ్మములు
కర్ణముల్వర్ణముల్కరములంగములు♦నిర్ణయింపగనొక్కనైరియైనజూచి
నేతెలుగునజూడ నిరువురయందు♦నీతడుసుగ్రీవు డీతడువాలి
యనియేర్పరింపంగ నలవిగాకున్న ♦ దనలోనవెఱగంది దశరథాత్మజుడు
ఎడపకయేసిన యీయమ్ముచేత♦తొడిబడినెవ్వడు ద్రుంగునోయనుచు
నమ్మువిడువకయుండె నంతసుగ్రీవు♦డిమ్మెయిఁగడునొచ్చి యేపెల్లబొలిసి
వలతియైపోరాడి వాలికినోడి♦బలమేదియాతని బలుముష్టిహతుల
సోలసి నల్లడల చూలుచుపారిపోయి♦గుల్లలతిత్తియై కట్టూర్పులెసగ
నేనేలశ్రీరాము నమ్మివచ్చితిని ♦ నేనేలవాలిని నెదిరించితిపుడు
వచ్చితిబదివేలు వచ్చెఁజాల్నాకు♦వచ్చినత్రోవ బోవగవలెననుచు
మొలకువచెడితోఁక మెడమీఁదవైచి♦సోలసికెలంకుల జూచుచుబారి
తనఋశ్యమూకంబు తడయకనెక్కె ♦ తనమదిశోకించు తరిరాముడరుగ
నలఘువిక్రమధాముడగు రాముతోడ ♦
దలవాంచికొయర్క తనయుడిట్లనియె
వసుధీశనిన్నునమ్మివాలితోగదిసి♦ఘనసమానబలయూఢి నడరిపోరాడ

నన్నుపేక్షించితి ననుగావవైతి♦మిన్నకచూచితి మేకొనవైతి
జగతిపై సూర్యవంశంబునబుట్టి♦తగునయ్య నీకిట్లు ధర్మంబు సేయ
దేవసత్యంబు నీ తేజంబు నమ్మి♦యేవాలితోఁదొడరితి నింత యేకాని
యతఁడెడ నేనెడ యాహవంబెడ♦బ్రతికివచ్చుట యేడ క్షమించిచూడ
నేమిభాగ్యమువనో యెప్పటియట్ల♦రామ యీపర్వతాగ్రము చేరఁగలిగె
బగతునిచే భంగపాటుయీరీతి♦నగుపాటునొదవె నినమ్మి సకలవ
దగవుఁగృపయును ధైర్యంబు శక్తి♦సగుబాత్రివని నిన్ను నాత్మనమ్మితిని
అనవుడు సుగ్రీవు యాత్మలో నింత♦యనుమానపడ నేల యకటనావలన
దప్పు లేశము లేదు దాయకు నిన్ను♦నొప్పగింతు నవినుమొక మాట తెలియ
విశ్వమోహనరూప విఖ్యాతులైన♦యశ్వినితనయుల యట్ల యేపట్ల
సరియూప రేఖలు వాలికి నీకు♦బెరసి సములై బేదింపరాక
నేనేయ వెఱచితి నిటన మోఘంబు♦గాన నీవిదికీడుగా జూడవలదు
కర మొప్ప నింక నీగజపుష్పమాల♦ధరియించిపోయి యుద్ధము సేయుచుండు
బెదరక వాలిజంపెద నిశ్చయింపు♦కదలుము కిష్కింధ కడకు నీవనుచు
గాదిలితమ్ముచే గజపుష్పమాల♦యాదట తెప్పించి యతనికంఠమున
జొక్కంబుగా జేర్ప సుగ్రీవుడొప్పె♦జుక్కలు బెనగొన్న సోముడో యనగ
సరిబరాకాకతోడి సంధ్యాభ్రమనగ♦మెరసి యంతయు గడుమీరి యేతేర
నంత గాకుత్స్థుండు ననుజుండు దాను♦సంతసంబున యుద్ధసన్నద్ధులగుచు
నలనీలతారాంగ వాతసూభువులు♦కెలకులఁగొల్వ సుగ్రీవుదోట్కాడుచు
పదులును పొదలు పున్నాగ నారంగ♦కదళీ కాసహకార కాంతారములును
భాసుర కైరవ పద్మ కల్హార♦వాసిత బహుసరోవర విశేషములు
కాసర కేసరి కరవరాహములు♦నాసక్తిగనుఁగొంచు నటపోయిపోయి
దీప్తవైశ్వానర తేజులై యొప్పు♦సప్తజినాహ్వయ సంయమీశ్వరుల
యాశ్రమము వీక్షించి యెతయు దెలసి♦సుశ్రీమహత్వంబు సుగ్రీవుచేత
బలశాలియనువాలి పాలించుసిరు♦నెలసిల్లు కిష్కింధ వీక్షించి నృపుడు
తొల్లింటిచందాన దురమొనరిపు♦బల్లిదుడగు వాలి బరిమార్తుననుచు
గృతమతినంత సుగ్రీవునున్నించి♦యతనిబొమ్మనిపంచి యాసమీపమున
ననుజుడు సౌమిత్రియటు జేరియుండి♦మనుజేశుడొకమానిమాటున నుండె
నహిమాంశనందనుం డంతగిష్కింధ♦గుహలెల్ల భేదిల్ల ఘోషించి చిరార్చి
తనతోడ ఘోరయుద్ధమునకు నింద్ర♦తనయు బిల్చుటయు నెంతయుబిట్టుగినిసి
మానక పీడొక్క మగవాడు పోలె♦బూనిన భుజశక్తి బొంగుచున్నాడు
వీనిపైరింతుట వెఱవుగాదింక♦వీనిజంపెదనని వెసనిశ్చయించి

—:* తార సుగ్రీవునితోఁ బోరవద్దని వాలి నడ్డగించుట *:—

యతిసత్త్వజయశాలి యగువాలి వెడల ♦ బతిఁజూచి వెసనడ్డపడి తారపలికె
దేవేంద్రనందన దినపజుమీఁద ♦ నేవిచారము లేక యేలపోయెదవు
నతఁడు నీతో నిప్పు డని చేసి నొచ్చి ♦ మతిచెడిపారి క్రమ్మరవచ్చు టెల్ల
నగడిన కడిమిమై నీకంటె నెక్కు ♦ డగుసహాయము లేక యతఁ డిందు రాఁడు
అనిమిషేశ్వరపుత్ర యదియునుగాక ♦ యొనర నంగదుచేత నొకమాటవింటి
బనినడి తమతండ్రి పనుపున జేసి ♦ వనవాసమున నుండ వచ్చినచోట
దశరథరాముఁడు తనధర్మపత్ని ♦ దశకంధరునిచేత దాఁగోలుపోయి
తనతమ్ముఁడును దాను తడయక వెదక ♦ ననివారు ఋశ్యమూకాద్రికివచ్చి
పనిగొని సుగ్రీవు బంటుగానేలి ♦ యనినిన్ను జంపెద ననివచ్చినాఁడు
ఆరాఘవుఁడు విష్ణుఁ డంబుజోదరుఁడు ♦ వైరంబుగొని గెల్వ వశముగాదతని
యినసుతునకు ప్రీతి నీరాజ్యమిచ్చి ♦ చనినీవు రఘురాము సంధిగావింపు
వినుమది గాదేని వీర్యంబువిడిచి ♦ మునివృత్తిఁజని ప్రాణములుగాచికొనుము
యనితారపలికిన నావాలిగినిసి ♦ విని నాదుపత్నివై వెఱపేలయింత
బలశాలినైనట్టి బలియునినైన ♦ గలనజయంబు చేకైకొందుగాని
బరులకు నేనోడ బగవాఁడువచ్చి ♦ పెరిగియుద్ధమునకు బిలిచినచోట
ధీరత దాఁగి సంధికిని చేకొనుట ♦ వీరధర్మము గాదు వెండినాకిక
నలినలోచన విను నాయంతవాని ♦ బలియు జేపట్టక పట్టెసుగ్రీవు
గాన రాముఁడు నీతి గలవాఁడుగాఁడు ♦ గాన రాముని పొందు గావింపఁదగదు
తెరలిసుగ్రీవుండు దిక్కు లేకున్న ♦ నరిగి రామునకు బంటై చేరెఁగాక
నాకేల రాముఁడు నాకేల సంధి ♦ నాకేమిటికి వేఁడ నలిదూఱెదొకని
ఆమహితాత్మకుం డతిధర్మపరుఁడు ♦ రాముఁడు నన్ను నూరక యేలచంపు
పోలవీమాటలు పోయిసుగ్రీవు ♦ వాలాయముగ క్రూర వజ్రప్రహార
మూలమైయొప్పు నాముష్టిఘట్టనల ♦ నేలగూలిచి నత్తు నెమ్మదినుండు
మని తార మఱలి పొమ్మని వీడుకొలిపి ♦ యనిమిషేశ్వరపుత్రుఁడగువాలి వెడలె
కలగొన చుట్టిన కర్మపాశములు ♦ నెలకొని దిగిచిన నిలువరాకున్న
వెకలుచందంబున వెఱపుచులావు ♦ కడిమియుదెంపు నుత్కటముగ వెడలి
శరధులుగలఁగ భూచక్రంబు వడఁక ♦ గిరులొడ్డగిల్ల కిష్కింధ ఘూర్ణిల్ల
గర్జించి చనుదెంచి కదిసిసుగ్రీవు ♦ తర్జించిచూచి యుదగ్రుఁడై పలికె
నాతోడఁ బోరాడి నాఁడోడిపారి ♦ యేతెంచితివి యిప్పు డిట్టులజ్జమాని
యేతెంచితే నేమి యిప్పుడే జముని ♦ వాతికిఁ జనుమ్రుట వడియంబొనర్తు
బెదరక చెదరక బెట్టుబీరములు ♦ వదరక నొక్కింత వడినిల్వుచాలు

సాలంబులోముష్టి హతినిన్ననేల ♦ గూలిచి ప్రాణముల్గొందు నేననుచు
నురుమనిపిడుగుతో నల్లసంబాడు ♦ కఱకైన తనముష్టి గట్టిగాబట్టి
పఱతెంచిపొడిచిన భానుతనూజు ♦ డొఱగినెత్తురుగ్రక్కి యొయ్యన దెలిసి
ధీరుడై నిలిచి గద్దించియింద్రజుని ♦ కేరడంబాడి సుగ్రీవుడిట్లనియె
నన్నవు నాకు బూజార్హుండవనుచు ♦ నిన్నాళ్లు సైచితి నింతియే కాని
విగ్రహంబున కేను వెఱతునే తొంటి ♦ సుగ్రీవుఁడను గాను జూచి పోరాడు
వాలి నిన్నిప్పు డవశ్యంబు చంపి ♦ పాలింతు గపిరాజ్య పదము నేననుచు
గడునల్గి సాల వృక్షము వేగ దెచ్చి ♦ వడివర్చి వైచిన వాలి కంపించి
పుడమిపై బడి మూర్ఛ బొందియొక్కింత ♦ పడి తేరి గర్వదుర్వారుడై మిగుల
ధీరుడై శూరుడై దివిజులు పొంగ ♦ నారవిజుని వైచె నదరి శైలమున
నదరక సుగ్రీవుఁ డడఁచె వాలమున ♦ పదములు నొప్పించె బలియుడై వాలి
కరనఖంబుల వ్రచ్చె గడఁగి సుగ్రీవు ♦ డురుముష్టి నొప్పించె నుగ్రుడై వాలి
యంతటదనియక నార్పులు నిగుడ ♦ నంతకంతకు లావు లడరి యిద్దఱును
ఘనపదాపదికచాకచి నఖానఖిని ♦ చెనసి ముష్టాముష్టి చెలగి పోరుచును
హుమ్మని వ్రేయుచు ఘూర్పులొండొండ ♦
గ్రమ్మ నంగముల రక్తంబులు జొబ్బచును
వాలముల్బాహులు వరుసనొండొండ ♦ గీలించి పెనగుచు గినిసి తాకుచును
బాయుచు డాయుచు బలిమి నొండొరుల ♦
వ్రేయుచు ద్రోయుచు విపులసత్త్వముల
దూటుచు దాటుచు దోర్ద్రాసబగలు ♦ చాటుచు మీటుచు సాంద్రమర్మముల
నినుపుఱుకడిమిమై నిబ్భంగిఁ బోర ♦ సురలోకనాయక సుతునకు లోగి
తరణితనూజు డత్తఱి చాలనొచ్చి ♦ గరువంబుదక్కి సంగరభూమి జిక్కి
పెదవులు దడపుచు బెంపెల్ల బాలిసి ♦ కుదిసి భీతిల్లి దిక్కులు చూచుచుండె
సగ్రహానుగ్రహనిధి రాముడంత ♦ సుగ్రీవుడలవడ స్రుక్కుటఁ జూచి

—:* అమోఘాస్త్రముచే వాలి గూలుట *:—

యీలోననే వాలి నేనేయకున్న ♦ వాలి సుగ్రీవుని వధియించు ననుచు
జలనిధులేడును జగములీరేడు ♦ కలఁగి భూతలమెల్ల గణగి కంపింప
గుణనాదమొనరించి ఘోరిమై బెంచి ♦ తృణముగా ద్రిప్పించి తెగతీసిపోసి
వెసనమోఘాస్త్రంబు పింటసంధించి ♦ దుస్సమానబలశాలియగు వాలి నేసె
నేయుడు నబ్బాణ మినవహ్నిరుచుల ♦ మూయించి వడి నభోమండలి నిండి
యురుతరానలకీల లొలుకనొండొండ ♦ గరుడోరగామర గంధర్వులదర
దనపుత్రు రక్షింప దాయ శిక్షింప ♦ నినుడిట్టియస్త్రమై యేతెంచెననగ

దపనపుత్రుఁడుగాన దండధరుండు♦కృపతమ్ముఁడైన సుగ్రీవునిఁబోవ
దన కేలదండము ద్ధతివాలిమీఁద♦బనిచెనో యనమహా పవనవేగమున
నురువడిచనుదెంచి యురమున నాట♦దరుచరపతిఁగూలె దర్పంబుదూలి
కెరలిదిక్కరులతో గిరులతోఁ బెలుచ♦దరులతోనందంద ధరణిగంపింప
శరముగాఁడినబాణ మురువడి వెడలి♦ధరఁగాఁడెనత్తరి దరుచరేశ్వరుఁడు
నవిరళరక్త సిక్తాంగుఁడై వాలి♦యవనిఁ ద్రెళ్ళిన బుష్పితాశోకమనగ
బ్రళయకాలంబునఁ బ్రభలెల్లమాని♦యిలమీఁదఁ ద్రాలినయినుని చందమున
నవశుఁడై యవనిపై నమ్మూర్ఛనుండ♦నవనీశుఁడగు రాముఁ డటఁ జేరవచ్చె
వచ్చినరఘురాము వాలివీక్షించి♦యిచ్చలోపలికోప మెసఁగ నిట్లనియె
నోరాఘువేశ్వర యోరామచంద్ర♦ధారుణిపై నిన్ను ధర్మాత్ముఁడండ్రు
దమమును శమమును దయయు సత్యంబు♦సమబుద్ధినీతియు సౌమనస్యంబు
మొదలయిన షడ్గుణంబుల రాశియగుచు♦పొదవిన నీపెంపు పొల్లుగాఁ జేసి
యెవసి సుగ్రీవుతో నేనుఁ బోరాడ♦నను సేయనగు నయ్య నడుఁ జొచ్చి నీవు
ఏను నీకపకార మెన్నఁడుఁ జేయ♦నేను నీకును దోష మిచ్చఁ జింతింప
నీకు శత్రుఁడఁ గాను నీశత్రుఁ గూడ♦నీకు శత్రులు లేరు నిక్కంబు లేనరుగ
నెరిగియుపేక్షింప నిటు సేయుఁ దగునె♦నెరిగియు నెఱుఁగవై తినవంశతిలక
శరభకంఠీరవ శార్దూలకోటి♦కరిహరిణాదుల ఖండింపఁ గోరి
వసుధరాజులు వేట వత్తురుగాక♦యెసఁగ గోతులఁబట్టి యెందుఁ జంపుదురు
అర్కసూనుఁడు మేము నన్నదమ్ములము♦కర్కశమతమూని గారవంబెడలి
యడర మేమల్లిన నైతిమికాక♦కడఁగి నీకిలు చంప గారణంబేమి
కుందేలునుడుమును గూర్మంబు నేదు♦బందిపాలు వయును భక్ష్యము ల్గాని
నంచవజంపియీ ప్లవగంబు దినరు♦పొంచినన్నిట్లేసి పొలియించి తెల
మను జేశ యింక నా మాంసరక్తంబు♦ననుభవింపుము నీవు ననుజుండుఁ గూడి
దశదిక్కీర్తులఁ జగ ద్విఖ్యాతుఁడైన♦దశరథుఁ డనుపున ధర్మంబుఁ బూని
వనములఁ దపసివై వర్తింపవచ్చి♦జననాథ జీవహింసకుఁ డోయవైతి
ధరణిపై మేమొక తప్పు జేసినను♦భరతుండు తగుగాక పట్టి శిక్షింప
నీకు గారణమేమి నీవు భూపతివె♦చేకొని యిట్లేల చేసితి నన్ను
నీదేవిఁ గొనిచన్న నీచరావణుని♦నాదటసాధింతు నని నేఁగుదెంచి
నను డించి నీవర్క నందనుఁ బట్టి♦తనయ బునీతి బేలైతి లోకముల
నీవార్తనీవుగా కెరిగించితేని♦దేవ నీదేవి సాధింపఁ జేయుదును
నాతతబలశాలి నైయేఁగుదెంచి♦సీతామహాదేవి చెఱఁ గొనిచనిన
వానినిముమ్మ నావాలగోమమున♦బూనిబంధించి యంబుధులెల్ల ముంచి

కరుణించివిడిన ఘనబాహుశక్తి♦సారిదిలోకము లెరుగు సుగ్రీవుడెరుగు
బెలుకుఅనన్ను జంపెడివాడవకట♦బలిమిమైనాద్రిష్టి పథముననిల్చి
నను జేరఁగొనిపిల్చి ననుమ దలిచి♦జననాథకడిమిమై జంపలేవైతి
చలముగై కొని డాగి చంపితివన్ను♦దలపోయనిది రాచ ధర్మంబె యనిన
వాలిమాటలువిని వసుధేశుడనియె♦వాలియీమాటలు వలవదునీకు
గపివంశమునబుట్టి కపు తోఁ బెరిగి♦చపలుడవై ధర్మ శాస్త్రంబు తెఱఁగు
తెలియకనీవు నాదెసదప్పు మోపి♦పలికెదవిది ధర్మ పద్ధతిగాదు
నీవన్నపలుకులన్నిటికి యుక్తముగ♦నావాక్యములు కొన్ని నయబుద్ధివినుము
అనుజునిదనుజన్మ నల్లగ్రజుండు♦మనుపంగవలెనంద్రు మహిధర్మవిదులు
ఆమేరదప్పినీ వపరాధహీను♦డామరసాత్తనం దనుబురివెడల
నడచివానినిగోడలై యొప్పునతని♦బడతినిరతిబట్టి బల్మిభోగించు
కామాంధుడైన గలదెనీవంటి♦పాముకునొకడుదప్ప జగత్రయమున
నదియుంటులుండ నిమ్మతడును నేను♦కదిసిసఖ్యము సేయ కతమున నీవు
జగతిపై నామిత్ర శత్రుండవగుట♦దెగ నాకునిన్ను వధించుటదగవు
అకిలంకులై వేట లాడెడువారు♦నొకటిదీమమునొడ్డి నొకటినేయుదురు
ఉనుశక్తిమాటునను డి వేయుదురు♦పరికింపదీన పాపము లేదునాకు
గావునశాఖా మృగంబగునిన్ను♦నేధిజంపిన నెగ్గేలకలుగు
చతుర బాహశక్తి జగతియుంతటికి♦బతియైనభరతుని పంపునవచ్చి
దుష్టమృగంబుల దుష్టరాక్షసుల♦సృష్టిపై మేము శిక్షింపుచుండుదుము
సీతమ్ముడగువాని నెలతగైకొన్న♦పాతకుడవుగాన బట్టిచంపితిని
రాజదండితుడు నారకబాధబొంద డు♦దోషమైగాన నాయుగ్రాస్త్రనిహతి
మదికితపడక నిర్మలుడవై యింక-ననిమిష రాజ్య సౌఖ్యముబొందుమీవు
అనియొప్పరఘురాముడాడువాక్యములు♦వినివాలికనుమూసి వివశుడైయుండి
కొంతసేపునకు బేర్కొనిరామచంద్రు♦నంతయుగనుగొని యిట్లనిపలికె
ఓరామగుణధామ యుగ్రాంశుధామ♦తారాధిపానన తారనాదేవి
దేవరశౌర్యంబు దెలిపినడనికి♦బోదవందన్న దుర్బుద్ధిపాటించి
విధివిహితంబున వినకనేవెడలి♦యధికకయ్యమున నిట్లవనిపై బడితి
బడిఁ గోపమున దుర్భాషలుగొన్ని♦జడిమిబల్కితినింక సైరింపవయ్య
తివపాటుచింతింప దాగకవగవ♦దనయునంగదునకై తలకెదనధిప
యింతకేమగుదురో యింతియు సుతుడు♦నింటెటిదురవస్థ యేవచ్చునెఱుగ
ననిశోక మోహంబు లనుపరు రాసి♦

నిగిమూర్ఛిలియుండె మూగచందమున

అంతఃపురంబున కావార్తబోవ ♦ నంతలో తారాదులైన కామినులు
వాలిగూలినమాట వజ్రమైతమదు ♦ వాలుగుండెలునాటవసుధపై గూలి
యంతలో దెలియుచు హాయనివారు ♦ నంతలో దారుచు నచటసోలుచును
హాయంగనా నేడు నావాలిదివికి ♦ పోయెగదాయంచు బోగలంగ్రుంగ
నంగదుడోట్కొని యతులశోకమున ♦
బొంగియుబొంగి యేడ్పులునింగిముట్ట
వేవేగకిష్కింధ వెడలి రానడుమ ♦ ద్రోవవారల నెదుర్కొనిగపులనిరి
వాలిరాఘవుచేత వసుధపై గూలె ♦ నేలపోయెదరు పోయినప్రమాదంబు
రాకమానదుసుమీ రామసుగ్రీవు ♦ లేకమైయుంట మీరెఱుగరే మొదల
నీయంగదుని బట్టి యేమిసేయుదురో ♦ దాయలమదినమ్మ దగదటుగాన

—: * తార ప్రలాపించుట * :—

నీతనిచే కపిరాజ్య మేలింతమిక ♦ మతిమంతులగుకపుల్మనకునున్నారు
బోవలుదన్న నప్పుడు తారతగవు ♦ భావించి వెసవారి పలుమారుదూరి
యేటికంగదుడు మీ కేటికిరాజ్య ♦ మేటికినాకు ప్రాణేశ్వరుడైన
వాలిజూడకి నంచు వారివారించి ♦ యాలోనదార తారాధిపవదన
తనమదిలో వాలి దలపోసిపోసి ♦ ఘనశోకమున జనుగవచూచిచూచి
ఘనమరేంద్రసుతుకాళ యల్లంతజూచి ♦ సమకట్టిడాయుచు సత్క్రీడగోరి
కాసిగనాసుర రాజేంద్రసుతుని ♦ బాసితిరింక నీఫలముచేజేత [కొనుచు
కుడువుడింతటనుండి కీచములారన్నుచు ♦ గడునక్కవెసనుగ్రగతిమోదు
బుడమిగంపింప నద్భుతశోకమడర ♦ నెడపక నిబ్బంగి నేతేర తార
హారము ద్రెగిశాల నళివేణిదూల ♦ ధరంపుచనుగవ పయ్యెదజార
నీరజంబునను దేన్నియగారినట్లు ♦ ఘోరమైకన్నీరు దొరుగనందంద
బలివిధినేతెంచి పవనవేగమున ♦ లలిదూలిపడ పుష్పలతికయుబోలె
నావాలిపై బడి యందరుబొగుల ♦ లావేదితార ప్రలాపింపదొణగె
గపికులాధీశ్వర కపిరాజచంద్ర ♦ కపిరాజశేఖర కపిసార్వభౌమ
సకలసురాసుర సంఘంబులందు ♦ నకలంకసత్వండ వధినాదనీవు
ఉరిమురివింధ్యాద్రు లగుమహాగిరులు ♦ పెరికివేటాడిన బిరుదవునీవు
బలియుడై త్రిభువనపాలుడై వెలయు ♦ కులశైలభేదికి గొడుకవునీవు
కోఅంబసుని పేరి గ్రామగంధర్వు ♦ నేలగూల్చినరణ నిపుణుండవీవ
నీవుమానవునిచే నీచతబొంది ♦ యీవిధిబడితింక నేమనగలను
నినతమ్ముడునిన్ను నెదురలావేది ♦ యనిలోననిను గెల్తు ననిరాముదెచ్చి
రామునినవి గెల్వ రాదనియంటి ♦ నామాటవినవైతి వామన్నిగొంటి

వామహాత్ముడువిష్ణు వటుపోకమంటి ♦ భీమశౌర్యుడతండు బిరుదేలయుంటి
నినుజంపవచ్చిన నీపాలిమృత్యు ♦ వనకరాముని చేత నాఁడిబడితి
వొలసిదేవాసుర లొగివర్చిచర్చి ♦ బలమరియటఁబాయ బడియున్నఁజూచి
యడరివాసుకి మందరాద్రికిఁజుట్టి ♦ వడిసముద్రముదీర్పు వరశక్తిపేర్మి
ద్రిజగంబులందును దీపించునట్టి ♦ భుజములపెంధూళి బ్రుంగెనేనేఁడు
అతిసత్త్వుఁడవు రాక్షసాధీశుఁబట్టి ♦ ధృతివిలపింప నీద్రుఢముష్టిఁగట్టి
మునుకొని వార్థుల మంచిముంచెత్తు ♦ ఘనవాలమిటధూళి గలసెనేనేఁడు
కరకంతుశ్రీపాద కమలంబుమీఁద ♦ తెఱఁగొప్పనీమాళి తేటియైవ్రాలి
నట్టినీమస్తకం బకటయిచ్చోటఁ ♦ బట్టినేలనుగూల వలసెనేమందు
హృదయేశనినుఁబాసి యేనిల్వఁజాల ♦ కలసినీవున్న లోకమునకువత్తు
వేదననిటమీఁద వేగఁబాలైతి ♦ నాదిక్కు లేమికి నాకేమివగవ
గోత్రారిన దన కోరినీకన్న ♦ పుత్రునంగదుఁజూచి పొక్కెదగాని
దూలితోఁ బారినీ తొడలపై బొరలు ♦ బాలునంగదు నేలి పాలింపవయ్య
యురముపై దొడలపై నుంచిమన్నించి ♦
శిరము మూర్కొని ముద్దు చెక్కులుపునికి
శిరముముద్దాడు నీగారాపుపట్టి ♦ వరుసనంగదు నేల వారింపవధిప
ననిప్రలాపింపుచు నతివసుగ్రీవు ♦ గనుగొనిపల్కె శోకము వెల్లివిరియ
దలకొని వాలి ముందరనిల్వలేక ♦ పలుమారు దెసచెడి పందవై పారి
గతిమాలిపోయి రాఘవుతోడి తెచ్చి ♦ కృతకజయంబున కిష్కింధఁగొంటి
నీకోరినట్లయ్యె నీపగదీరె ♦ నైకొనిభోగింపు కపిరాజ్యపదవి
యెడమాటలాడ నాయినవంశుతోడ ♦ గడకహనుమంతుండు గలిగెనేనీకు
బలుమారుబుద్ధులు పరికించిచెప్ప ♦ నలనీలతారు లున్నారు లేనీకు
ననిపల్కి రఘురాము నజ్ఞాత్మఁజూచి ♦ జననాథ యీవాలి జంపనేమిటికి
మెఱసినిన్నిటుసేయ మీతండ్రితోడ ♦ గఱపెనే రఘురామ గణుంపవాలి
వెఱవొప్పనీరాజ్య విభవంబుఁగొన్న ♦ భరతుఁడే రఘురామ పరికింపవాలి
చనటయినీదేవి చెఱగొనిచన్న ♦ దనుజుఁడే రఘురామ తలపోయవాలి
వాలిన కారణ వైరంబుఁబూని ♦ యేలయ్య తెగటార్చి తిబ్బంగిగడఁగి
నీయట్టిసుకృతికి నీయట్టిపతికి ♦ నీయట్టి కారుణ్య నిధికిట్లువగున
జనకబలోఁగూడ చనియెనోయెఱుక ♦ ఘనమైనవిరహాగ్ని గ్రాగెనోయెఱుక
భూమీశ నేఁడు నాపుణ్యమిట్లుండె ♦ నేమిసేయుదునింక నేమందువిధికి
నీవాలినడఁబాసి యేనుండఁజాల ♦ దేవనన్నునుబట్టి తెగటార్పవయ్య [పింప
యనీయురంబును మోము నందందమోది ♦ కొనుచు వాలిని పేరుకొని ప్రలా

నా వేళ హనుమంతు డట తారఁ గదిసి ♦ నీ వెఱుంగని ధర్మ నియతులు గలవె
యాజివీరస్వర్గ మందిన వాలిఁ ♦ గీ జాడ శోకింప నే యీపనులు
దైవయత్నములంచు దాపలుమారు ♦ ధీవిచక్షణుఁ డిట్లు తెలుపుచునుండ

—*: వాలి సుగ్రీవునకు హేమదామ మిచ్చుట *:—

నంతలోఁ గనువిచ్చి యమరేంద్రతనయుఁ ♦ డింతింత యనిరాని యింతి శోకింప
నంతకంటెను మించె నంగదు వగపు ♦ నంతయు నటు చూచి యర్కజుఁ జూచి
పూని రాముని చేత భువనంబు లెఱుఁగ ♦ భానుజ నేఁడు నీ పగ సాధ్యమయ్యె
క్షితిమీఁద రాజుల కృప నమ్మఁ దగదు ♦ మతి నుబ్బి చెడక యేమఱక వర్తింపు
నడర రామునితోడ నాడిన ప్రతిన ♦ యెడపక కావింపు మిట మీఁద నీవు
పాయక నాతోడ బలిమిఁ బోరాడి ♦ మాయాంకికడిమికై మడిసిన మెచ్చి
పూనిన వేడ్కతో బురుహూతుఁ డిచ్చె ♦ మానైన యీ హేమమాలిక తొల్లి
యిది నీవు ధరియింపు మింక నీ రాజ్య ♦ పదమున కది నీకు బఱగు దిస్వాంబు
లీ యంగదుని శోక మింక వారింపు ♦ నా యట్ల గొనియాడు నన్మరపింపు
మా సుషేణుని పుత్రి మైన యీ తార ♦ ధీసార దీని బుద్ధిని ప్రవర్తిలుము
ఏను సేసిన తప్పు లెల్లను మఱవు ♦ పూని నా మెయి ప్రాణములు నిల్వవింక
గైకొను మీ మాలికా రత్నమనుచు ♦ శోకానత గ్రీవు సుగ్రీవు బిలువ
నతడును రఘురాము నానతి వడసి ♦ యతిభక్తి దాల్చె నా హేమదామంబు
అనువొప్ప మఱి వాలి యంగదుఁ జూచి ♦ తనమదిలోనున్న దయతోడ బలికె
నో కుమారక శోక ముడుగుము నీవు ♦ శోకింప నేటికి సుగ్రీవుఁ డుండ
నలినాప్తసూనుండు నాకంటె నిన్ను ♦ లిబెంపుతోను పలాలింపఁ గలఁడు
సుగ్రీవుఁ డెక్కడ శూరతఁ జూపె ♦ వగ్రణివై యుండు మన్న నీవచట
చిరతర కీర్తులు సిద్ధించి నీకు ♦ సురుచిర సౌఖ్యంబు లొగి బొందు నీకు
సరగఁ గిష్కింధకుఁ బట్టంబు గట్టి ♦ యరయుచునుండ బుణ్యము సేయనైతి
ననిమిషపురమునఁ గరిగెదనింక ♦ ననిచెప్పి రఘురాము నర్థితోఁ జూచి
యో రామ యేనిట్లు లోదవి సుగ్రీవు ♦ తోరాసి పోరాడ దుదిమధ్యమయ్యె
నారంగ నంగదుం డబల యేమైన ♦ నేరము ల్జేసిన నేర్పుగాఁ గొనుము
యినసుతు దర్వాత నితని రాజుఁగను ♦ మనువంశతిలకుండ మహి నిల్పవలయు
వేదశాస్త్రంబుల వెదకి నిన్ గాన ♦ రాదిమధ్యాంతంబు లవి లేవు నీకు
జనుదెంచి ప్రాణావసాన కాలమున ♦ నొవర నాకిదె తోఁచుచున్నాఁడవీవు
అటువోయి కనియెడి యా మూర్తికంటె ♦ నటుగాన యేను గృతార్థుండ నైతి
బంకజహితవంశ పరమకల్యాణ ♦ యింక ప్రాణములుండ వీ యెమ్మె బెరుకు
మనిన రాముని యాజ్ఞ నా దివ్య శరము ♦ పానుపొన్ద నీలుండు పెఱికివైచుటయు

గర మొప్పఁగ బాహ్యాగతులు బంధించి ♦ మరలిన పవనుతో మనసు సంధించి
యామె ఋబరమమై యింపారు రాము ♦
శ్రీమూర్తి మనములో జెలువొప్పఁ జేర్చి
బ్రహ్మపదానంద పరుఁడైన వాలి ♦ బ్రహ్మరంధ్రంబున బ్రాణముల్విడిచె
నా వేళ దారాదులైన కామినులు ♦ నా వాలిపైఁ బడి యందందవగవ
నంగదసుగ్రీవు లచ్చటిప్లవగ ♦ పుంగవుల్ హా వాలి పోయితే యనుచు
విలపించుచుండ నా వేళ సౌమిత్రి ♦ నలివాత్తసుతుని నందరి విచారించి
హనుమంత నీవింక నంబరమాల్య ♦ ఘనగంధసారాదికములు దెప్పింపు
శిబిక దెప్పింపుము శీఘ్రుం బెతార ♦ ఏబిడహారకరత్న నిర్మితంబుగను
అనిషంపవారును నట్లకావింప ♦ వనచరులందరు వచ్చి రచ్చటికి
మదితార మొదలైన మగువలయుడలు ♦ తెరగొప్పవారించె దిననాథసుతుఁడు
నాలో నరఘురాము ననుమతివడసి ♦ వాలికి బరలోక వైదిక క్రియలు
జేసి యాదశరాత్రి శేషకృత్యములు ♦ భాసురగతి దీర్చి పరిశుద్ధిఁ బొంది రటయు
యంగదుడును దానుహనుమదాదులును ♦ సంగతి నా రామచంద్రుఁ గాంచు
విపులసంతోషంబు విలసిల్లునంత ♦ గపినాయకులకు రాఘవుఁడిట్టులనియె
మీరింక నా పంపు మెయికొని పోయి ♦ శ్రీరమ్యముగను గిష్కింధ గైసేసి
స్థిరమైన కపిరాజ్య సింహాసనమున ♦ బరగ సుగ్రీవునిఁ బట్టంబు గట్టి
యొందంగ నంగదు యువరాజ్యపదము ♦ నందు బట్టము గట్టుఁడని యొప్ప బలుక
దడయక వానర దండనాయకులు ♦ కడుకూడి కిష్కింధ కప్పుడే తెంచి
నూత్నశృంగార మనోహరాగార ♦ రత్నవితర్దికా రమణీయహార
రంగవల్లీహార రంజితద్వార ♦ రంగధ్వజోదార రమ్యపటీర
నీరపూరితమార్గ నిరుపమాకార ♦ పౌరసంచార సంభరితంబుగాఁగ
దలగి యాపురము గైసేయించి నగరు ♦ కొలువుకూటంబు మిక్కుటమైన సిరికి
గారణంబుగ నలంకారంబొనర్చి ♦ వారధి నరనదీ వారియు మరియుఁ జుండ
దగుమంగళద్రవ్యతతులు దెప్పించి ♦ మొగినిండ శుభతూర్యములు మ్రోయ
బుణ్యాంగనామణుల్ప్పలుపాదజాల ♦ బుణ్యాహవాచనపూర్వకంబుగను
సింహచర్మంబున జిన్హితంబైన ♦ సింహపీఠంబుగ సింహంబునునిచి
సురపతిబోలె భాసురలీల ప్లవగ ♦ వరు సభిషేకపూర్వంబుగా గదిసి
లలితపుణ్యోదయ లగ్నంబునందు ♦ బలియుసుగ్రీవుని బట్టంబు గట్టి
యుకసుత్వనంగదు యువరాజ్యమునకు ♦ గర మొప్ప బట్టంబు గట్టిరి ప్రీతి
నంగదు యువరాజ్య మందును నిలువ ♦ భోంగు వేడుకలంతి పురవరంబునను
నలనీలతారాంగ నాతనూభవులు ♦ కలబంధువులు పొదగ నిరో[illegible]

నిఖిలవానరనాథు లెల్ల గేల్మోగిచి ♦ నతిమోదమున గొనియాడిరి ప్రీతి
అంత సుగ్రీవు డుదాత్తసంపదల ♦ నెంతయుఁ బెంపొంది యింపుసొంపొంది
వనచరబలములతో వడి నేగుదెంచి ♦ ఘనరత్నకోటులు కానుక లిచ్చి
యాదటఁ బెంపొంది యారామచంద్రు ♦ పాదపద్మములకు భక్తితో మ్రొక్కి
కరములు మొగుడించి కడు బ్రేమ నిలిచి ♦ పరమసమ్మదమున భానునందనుఁడు
ఇచ్చోట నేటికి నింక నా పురికి ♦ విచ్చేయుదురుగాక విశ్వలోకేశ
యనవుడు సుగ్రీవు నాననాంబుజము ♦ కనుఁగొని ప్రీతి రాఘవుఁ డిట్టు లనియె
దపసులు పురమున దగదు వర్తింప ♦ దపనజ కిష్కింధ తగదు మా కింక
మహిమీఁద నాషాఢమాసంబు వచ్చె ♦ విహితులపై బోవ ననువు గాదింక
వానకాలము మాల్యవంతంబునందు ♦ నేనుండగలవాడ నెబ్భంగినైన
ఇనతనూభవ నీవు నీ వానకాల ♦ మొనరి కిష్కింధలో నుండుము పోయి
తలకొని మరి శరత్కాలంబునందు ♦ బాలుపొందఁ బగరపై బోదము కడంగి
యని చెప్పి మన్నించి యతని వీడ్కొల్పి ♦
యనుజన్ముఁడును దాను నచ్చోటు బాసి

—: * శ్రీరాములు మాల్యవంతము జేరుట * :—

వసుధేశుఁ డమ్మాల్యవంతంబునందు ♦ గుసుమకోమలి సీత గుణములు ప్రాయంబు
ననమానరూప విలాసము మెచ్చుచును ♦ అసమానశోకార్తుఁడై యుండె నంత
ధరణిజ నెడబాసి తలఁకెడు రాము ♦ బోరిపోరి దుఃఖము ల్పొదవు చందమున
నతిముఖోదివినుండి యంబుదమ్రోత ♦ మెఱయ నీకందంద మేఘము ల్పొడమె
రావణు రాజ్యంబు రఘురాము చేత ♦ నీవిధ చలియించు నింక నన్నగిది ద్రోడగ
నొసిరొండొండ విద్యున్నికాయములు ♦ జలదంబులందుండి జలియింప
గైకొని యింక నిక్ష్వాకువల్లభుఁడు ♦ నాకారిపై దండు నడుచుచున్నాఁడు
అని సురలకుఁ జెప్ప నరిగెనో ధాత్రి ♦ యన వాయువుల దోడ నట ధూళి మొగసె
నాలంబు దైత్యు నణఁగింపు మనుచు ♦ గాలుఁడు తన చేతి కాలదండంబు
బానర రామునికిచ్చి పుత్తెంచెననగ ♦ దనరార దివి నింద్రధను వొప్పఁ జూడ
వనరులు రామునకై దండు వెడల ♦ గొమరారు భేరులు ఘోషించు పగిది
మన్నితధ్వనులతో నొండొండ బర్వె ♦ మిన్నెల్ల భేదిల్ల మేఘంబు లురిమె
కలరు ప్రావృట్కాల మనుపురుషుండు ♦ లతిమీర నాకాశ లక్ష్మితో గదియ
నొగి పరుల్లెగిరాలుచున్న ముత్యముల ♦ పగిది దొల్చినకులు బడియె నందంద
యుగపడి చెఱవో యెకని కూతుదలఁచి ♦ వగచి నిట్టూర్పులు వడిఁ బుచ్చు కరణి
వెరవున లావులు వెడలె నందంద ♦ ధరణి నల్లైనలను దగ్గంబులగుచు
జను దెంచి రామలక్ష్మణపదమోదముల ♦ గనుగొని సురజాతక మఁలుబ్బు పగిది

గనుఁగొనఁబర్వెడుఘనపయోదముల ♦ గనుఁగొనిదివిచాతకములుబ్బ దొడఁగె
ధిమిధిమియనుచుమద్దెలమ్రోయుపాట ♦ లమరనదీమణులాడుచందమున
ఘుమఘుమమనుచు మేఘుండుఘర్జింప ♦ నమరఁగేకాస్ఫూర్తినాడెనెమళ్లు
రాక్షసాంగములపై రాముబాణములు ♦ లక్షింపబడునిట్టి లాగునన్నట్లు
పర్వతాగ్రములపై బయదఘోషములు ♦ పర్వినిర్ఘాతములవ్వడి యొనందంద
ప్రకటంబుగాదైత్య పతి మేనిమాంస ♦ శకలంబులిటు రణస్థలినిండుననిన
పరుసునసింద్ర గోపములంతకంత ♦ నరుణారుణంబులై యవనిపై బడియె
రావణుజంపుచో రఘురాముమీఁద ♦ దేవతల్ జూచి దివ్యపుష్పములు
నెడనెడవర్షింతు రీక్రియననిన ♦ వడువునమహిరాలె వర్షోపలములు
రావణుకీర్తింప రంపరలణఁగి ♦ పోవునింకిట రామభూపాలుచేత
ననినచందమున రాయ చలపిందు ♦ చనిక్రౌంచగిరిమీఁద చయ్యననడచె
ననిమొనదనపుత్రుడై నసుగ్రీవు ♦ డనిమిషాధిపసూను నకటజంపించె
నలుగునాపై నింద్రు డవిసూర్యుడున్న ♦ బలితంపుకోటసొ బరివేషమొనరె
కుదియనికడకతో గోరియాకాశ ♦ నదినాడబోయిన నాగకన్యకలు
చనిచసిమగుడ రసాతలంబునకు ♦ చనుదెంచు గతివర్షజలధారలమరె
వాసిగాదమకు జీవనములవ్వారి ♦ గాసమర్పించిన ఘనునివెయినోళ్ళఁ
బొగడుచందమున నద్భుతవృత్తిభేద ♦ మనుచుమండూకంబులర చెనందంద
వెలయమేఘములుప్రావృడ్వధూమణికి ♦ గలయమైబూసినకస్తూరియనఁగ
ధరణినెల్లెడలను దనువుసొంపెక్క ♦ పరగనీలచ్ఛాయ పంకమువ్వారు
వారాశినొడగూడి వలనేదిరాము ♦ ఘోరబాణాగ్ని గ్రాగుటవిచారించి
చఱచిపోవెఱచిన చాట్పునవరద ♦ లఱిముఱిజెరువుల నందందనిలచె
లోకకంటకదైత్యులోబెట్టుకొంటి ♦ గాకుత్స్థునిడిదెనిన్ను ఖండించుననుచు
సుడిబడి మొఱవెట్టుచును భానుకరణి ♦
వడిమ్రోయుచును జొచ్చెవారిపెన్నదులు
నంతవానలువెల్వె నవనిపైనపుడు ♦ సంతతదివినున్న యభ్రముల్వీరిసె
దెలివొందికిరణము ల్దిశలెల్లనిండె ♦ చెలువొందరవి ప్రకాశించె లోకముల
ధరణినిష్పంకమైతనరెనెంతయును ♦ గరమొప్పగొలకులగమలంబులమరె
గూలముల్మదకరు ల్గుప్పిచ్చిగోరాడె ♦ దేలునక్షత్ర చంద్రికలు పెంపారె
వచ్చెనంచలుసరోవనికిగాపురము ♦ మెచ్చెదామరతూండ్లు మెతలుల్లమున
చెరుకురాజనమును చేనులపంట ♦ తరుచయ్యెవృషభయూథమురంకెవేసె
గనుపట్టె వింధ్యాద్రి గగనమార్గమున ♦
గలకనంతయుబాపి కనుపట్టెజలము ♦ ఇలదెరువరులకు నిచ్చెసౌఖ్యంబు

చదలనిర్మలములై జలదంబులొప్పె◆నదులెల్లనింకి కాల్నడలయ్యెనంత
అటమున్న హనుమంతు డర్కజుగదిసి◆ యిటశారదాగమం బేతెంచెనింక
శ్రీరాముకార్యంబు సేయంగవలయు◆వారువీరనకెల్ల వానరాధిపుల
రప్పింపుమనవుడు రవిసూనుడలరి◆యప్పుడేపడవాలు డగునీలుబిలచి
వివిధపర్వతసరిద్ద్వీపాధిపతుల◆ప్లవగగోలాంగూల భల్లూకపతుల
రావింపుమొకడైన రాకున్ననాజ్ఞ◆కావింపుమనియన్చె గడకమైనిచట
తమ్ముఁడు చెయ్యూఁత తనతాల్మిగొసఁగ◆క్రమ్మినవగ వానకాలంబుగడపి
రామభూవరుడు శరత్కాలమైన◆గోమలిచింతించి కోర్కులుమొదలి
మదనాతురుండునై మదిచాలభ్రమసి◆
యుదయాద్రిపైనున్న యుడురాజుజూచి [డిచె
యిదియేమియుత్పాతమిది యేమిచంద◆మిది యేమియీరాత్రియిను డేలపొ
నామేనితాపమి న్మడగాగఁజొచ్చె◆సౌమిత్రిడనుతరుచ్ఛాయలజేర్పు [దు
మనిన చంద్రుడుగాని యర్కుండుగాడు◆జననాథహరిణలాంఛనము దెచూ
మనిలక్ష్మణుడుబల్క హరిణాక్షిపోయె◆ననిసీతబేర్కొని యతిమూర్ఛబోవ
దశరథాత్మజునకు దమ్ముఁడాలోన◆శిశిరోపచారముల్చేసి తేర్చుటయు
మరివివేకముబూని మనుజవల్లభుడు◆తరిలంకపైనింక దండెత్తవలయు
సౌమిత్రిజూచితె జలజాప్తసూను◆డేమనిభాషించె నేమనిపోయె
వానకాలముబుచ్చి వచ్చెదనఁడె◆వానకాలముబోయె వచ్చుటలేదు
ఒదవినాచేసిన యుపకారమెల్ల◆మదిలోనమఱచి యున్మత్తుఁడై వాడు
తారతోరతికేళి దగిలియున్నాడొ◆యీరాజ్యమునమత్తుడై యున్నవాడొ
కాకున్నమత్కార్యగతులు భావింప-డీకృతఘ్నతకోర్చి యేటికిదడయ
మతినుపకారంబు మఱచినవాడు◆ప్రతినదప్పినవాడు పాడిమాలినదు
చలికాని కార్యంబు సేయనివాడు◆తలపోయమానవాధముడంద్రు బుధులు

—:* లక్ష్మణుఁడు కిష్కింధకు బోవుట *:—

అలవుమైనటబోయి యర్కజుబిలువు◆బిలచినరానని బిరుదాడెనేని
యనివాలిజంపిన యమ్మొందుబోయె◆ననిరమ్మపొమ్మన్న నన్నకుమ్రొక్కి
కనుగవప్రళయాగ్ని కణములుదొరుగ◆ఘనశరచాపముల్గైకొని వెడలె
నేలయల్లలనాడ నిడుజంగలిడుచు◆గాలివేగమున వృక్షములెల్లగూల
గృతమతినటబోయి కిష్కింధజేరి◆యతిభీతులై కపులందందబరగ
నాపురద్వారస్థులగుకపులప్పు◆డేపరతెంచి వీడెవ్వఁడోయనుచు
గోటవాకిళ్ళు గ్రక్కునవ్రేసిప్లవగ◆కోటిగావలిపెట్టి కోరియుత్తెరగు
వడిరాజుకెఱిగింప వలెనంచువారు◆కడుభీతులైపారి కరములుమొగిచి

వడిఁ దారపరిచార వనితలతోడ ♦ దడయక చంద మంతయుఁ దెల్పవారు
ఇది వేళగాదన్న నెలమినంగదుని ♦ గదిసి సాగిలి మ్రొక్కి కరములు మొగిచి
వినవయ్య యువరాజ విఖ్యాత తేజ ♦ మనవీటివాకిట మౌనివేషంబు
గనుపడ జడలు వల్కలములు దాల్చి ♦ తన కేలఁ బ ణ కోదండముల్బూని
యొకఁ డంతకునిఁ బోలి యున్నాఁడు వచ్చి యకలంకసత్వుఁడై యనిన నంగదుఁడు
నా రాముననుజన్ముఁ డని నిశ్చయించి ♦ తారాతనూజుండు తడయక వచ్చి
సౌమిత్రిఁ బొడగన్నఁ జ డకోపమున ♦ దామరసాప్త నందనునకంగదుఁడు
నారాక చెపుమన్న నతఁడునుఁ బోయి ♦ మారవికారాబ్ధి మగ్నుఁడై మిగుల
గారవంబున చేరి కరపల్లవముల ♦ నారుమసతియంఘ్రు లల్లన బిసుక
తారాముదూరులు తలగడగాఁగ ♦ నూరకసుఖియించు చున్న సుగ్రీవు
గనుఁగొని వాఁడె లక్ష్మణుఁ డున్నవాఁడు ♦ మనవీటివాకిట మండుచు ననిన
మదిసంశయింపుచు మంత్రులఁ బిలిచి ♦ యిది యేమి సౌమిత్రి హితమైత్రి దప్పి
యీరీతి వచ్చుట కేమి కారణము ♦ నేరము నావల నెమకిన లేదు
అని వితర్కింపగా నాంజనేయుండు ♦ దిననాథసుతుతోడఁ దెలియ నిట్లనియె
ఆమహేంద్రకుమారు ననిఁ గూల్చి నీకు ♦ నీమాటకై కపిరాజ్య మిచ్చినయట్టి
రాముని కార్య మారడిఁ బుచ్చి యిట్లు ♦ కామోపభోగ సౌఖ్యంబులఁ బొదలి
యిందు రేయిందుకై యుగ్రభావమున ♦ సందేహమేటికి సౌమిత్రి యిటకు
వచ్చినాఁడమ్మేటి వాకిటనుండ ♦ వచ్చునె లోకైక వంద్యుఁ డాఘనుఁడు
రావింపు సేయింపు రాముకార్యంబు ♦ గావింపు భావింపు కడగి నీప్రతిన
నా విని యారవి నందనుం డట్ల ♦ రావింపఁ బంచిన రామానుజుండు
భర్మగోపుర హర్మ్య పటలంబు విశ్వ ♦ కర్మనిర్మితచిత్ర కరకౌశలంబు
కైలాసశైల సంకాశ సౌధంబు ♦ కేళీసరోవరాంకిత వనాంతరము
దేవగంధర్వావతీర్ణ ప్లవంగ ♦ సేవితాగ్రంబు కిష్కింధపురంబు
చొచ్చి యచ్చోటనిస్తులవస్తుమహిమ కచ్చెరువందుచు నటఁ బోయి పోయి
ఇంద్రుగేహముతోడ నెనయైన వాన ♦ రేంద్రు గేహము సొచ్చి హెచ్చిన కినుక
నచ్చరకొమరల నందచందములు ♦ మెచ్చని మెలఁతల మిసిమిపాటలను
హారివీణావేణు వాద్యమృదంగ ♦ భూరిభూషణరవ స్ఫూర్తియు వినుచు
సంతకాకారుఁడై యతికోపుఁ డగుచు ♦ నంతఃపురద్వార మటు చేరి నిలువ
నారాక విని యొంటిఁ దారాక యపుడు ♦ తారాసమేతుఁడై తడయక వచ్చి
యతనికోపంబును నతనిరూపంబు ♦ నతిభీతిఁ గనుఁగొంచు నర్కనందనుఁడు
అలరెడు భక్తిమై నడుగుల కెరగి ♦ వలయు నర్చనము లీవచ్చినఁ జూచి
యోరి రామద్రోహి యోరి కృతఘ్న ♦ యోరి నీయర్చన లుచితమె నాకు

జానకీపతితోడ సత్యాత్ముతోడ♦వానకాలముఁబుచ్చి వచ్చెదనంటి
రావైతివిప్పటి రఘురామునాజ్ఞ♦భావింపలేవైతి పశుబుద్ధివైతి
వాలిఁజంపినరామవసుధేశుశరముకాలాగ్నికణములుగ్రక్కుచున్నదియు
వినునీటు సేయక నిలుచునేయింక♦వనచరాధమ వెఱ్ఱివాఁడవై చెడితి
వనితతారాదేవి యతిభీతిఁబొందె♦యనఘుమీ వాసుఁడీయర్క నందనుఁడు
ఈరాజ్యసంపద లీభోగకోటు♦లారయమీ రిచ్చినవివియె యీతనికి
మీరుపెట్టినచెట్టుమహిరనందనుఁడు♦వైరంబునకునెంతవాఁడుమీకతఁడు
రణవిశారదుఁడైనరామునియాజ్ఞ♦గణుతింపకున్నాఁడుగాయర్కసుతుఁడు
పొలుపొందఁగా రికపున్నమనాఁటి♦కిలమీఁదఁగపిసేన నెల్లనుగూర్పఁ
బడవాలునీలునిఁబ చితాఁబోదు♦నడరెడుప్రేమతో ననియున్నఁవాఁడు
గాఁడురామద్రోహి గాఁడసత్యుండు♦గాఁడుకృతఘ్నుండు గానమీరితనిఁ

—:* లక్ష్మణుఁడు సుగ్రీవుని మన్నించుట *:—

కరుణింపుమనవుఁడు కలుషంబుదక్కి ♦
నరనాథసుతుఁ డర్చనములుగైకొనియె
గైకొన్నపిమ్మటఁ గనకపీఠమున♦రాకొమారునినుంచి రవితనూభవుఁడు
తదనుజ్ఞగైకొని తానుగూర్చుండి♦మృదుమధురోక్తులమదమొప్పఁబలికె
సౌమిత్రిరాఘవ స్వామికార్యంబు♦నేమఱతునెయిపు డెల్లవానరులఁ
దెచ్చెదవైదేహి దిక్కుఁ వెదకఁ♦బుచ్చెదవచ్చెదఁ బొందుమీవెనుక
నేశరంబునవాలి యిలమీఁదఁగ్రాలె♦నేశరంబునఁగూలె నేడుతాళములు
నాశరంబేచాలు నఖిలదానవుల♦నాశంబునొందింప నాతిసాధింప
నైననురఘురాము నతిభక్తిఁగొలిచి♦యేనుకీర్తులకెల్ల నెక్కుడైపొలుతు
ననిపల్కహనుమంతు నతినీతిమంతుఁ♦గనుఁగొనిమనవీటఁ గలకపికోటి
చాటించివెడలి పుసమకట్టికపులఁ♦బాటించియెనసేయఁ బాడిగాదింక
మనమిప్పుడారామ మనుజేశుఁగాన♦జనవలెననిపల్క సంభ్రమం బెసఁగ
ధరణినందనుఁడంత తారాదిసతుల♦వెరవొప్పనప్పుడు వీడ్కొనివచ్చి
కలయదిక్కులనున్న కపిముఖ్యపతుల♦బలముఁ బిలుపించి పయనంబుచేసి
మేదినీభాగంబు మిన్నునుదిశలు♦భేదిల్లఁ బ్రస్థానభేరి వేయించి
ప్రబలకాంచనరత్నరమ్యమౌనొక్క♦శిబికపై లక్ష్మణుఁ జెలిమినెక్కించి
చామరద్వయసితచ్ఛత్రచిహ్నములు♦నామహాత్మునిమ్రోలనరుగనేమించి
సబలుఁడైతానును సౌమిత్రివెనుక♦శిబికయొక్కటియెక్కి చిత్రవైఖరుని
ముందుగా శుభతూర్యములుభోరుకలుగ ♦
గ్రందుగా వందిమాగధనుతుల్చెలఁగ

నెడనెడఁ గపినాథు లెలెంచితన్నుఁ ♦ బొడఁగననుడు గణుప్పురి తేందుపగిది
సకలవానరవీర సైన్యసన్నాహ ♦ మకలంక మైయొప్ప నప్పుడేకదలి
యరుదైన పేర్మితో నవనిఁ గంపింపఁ గరముసొంపెక్కి యత్త్మణుఁ గొల్చినడచె
అటమాల్యవంతంబునందున్న రాముఁ ♦ డట మ్రోయు కలకంబప్పుడాలించి
యవె వచ్చెఁ గపిసేన లనికోపముడిగి ♦ రవితనూజునిమీఁద రాఁగిల్లుచుండె
అందమైమణికాంచ నాంచితంబైన ♦ యాందోళికాద్వయం బల్లంతడిగ్గి
తామరసాప్తనందనుఁడు సంప్రీతి ♦ సౌమిత్రియును దానుఁ జనుదెంచి మ్రొక్క
యవిరళంబగు భక్తిహస్తముల్ మోగిచి యవనివల్లభునకిట్లని యొనర్కజూడు
దేవ సేనలఁ బిల్వ దెసలకుఁ బంపి ♦ వావిరిని విగూడి వచ్చునందాఁక
దండెత్తియిటకు రాఁ దడసితిఁగాని ♦ యొండొక వెంటమై యున్నాఁడగాను
అనిన నర్కజు రాముఁ డతికృపాదృష్టిఁ ♦ గనుఁగొని మన్నించె కడఁకతో నంత
కైలాసగిరియందుఁ గనకాద్రియందు నీలాచలమునందు నిషధాద్రియందు
ద్రోణాచలమునందుఁ దుహినాద్రియందు ♦ శోణాచలమునందు సోమాద్రి
వృషభాచలమునందు వింధ్యాద్రియందుఁ [యందు
ఋషభాచలమునందు ఋక్షాద్రియందుఁ [దు
పారియాత్రమునందుఁ బ్రాగ్గిరియందుఁ ♦ ఆరత్నగిరియందు నస్తాద్రియం
మలయాచలమునందు మందాద్రియందుఁ ♦
గలగొని వర్తించు ఘనబాహుబలులు [డు
పవమానసూనుండు పనసుఁడంగదుఁడు ♦ గవయుండు నీలుండు గంధమాదను
పావకాత్ముఁడు కాలపాశుఁడు గ్రథనుఁ ♦ డావేగదర్శియు నగ్గవాతుండు
నలుఁడు మైందుఁడు మహానాథుండు ధూమ్రుఁ ♦ డలఘుండు జంఘాలియగ్గిరిభేది
సుముఖుండు కేసరి జ్యోతిర్ముఖుండు ♦
విముఖుండు తారుండు వినతుండు గజుడు
జాంబవంతుండును సంపాతిరంభు ♦ డంబురాశితనూజుఁడగు సుషేణుండు
శతబలిహరుడును సన్నాథులనఁగ నతివీరవరులు వీరాతిగాకపులు [మైందాది
తమసుతుల్ తమహితుల్ తమసహోదరులు ♦ తమచుట్టములు తాముదట్టి
యిపదులివినూఱులివి వేలులక్ష ♦ లివికోటులర్వాల నివిశతకోటు
లనరాకపద్మ మహాపద్మఖర్వ ♦ మనగబద్వానసంఖ్య లన్నియుఁ గడచి
మొలమిసొంపున నేల యీనినయట్లు ♦ చెలఁగి యేదిక్కు చూచిన వెల్లివిరిసి
యీమొయిఁ గోలదిగా కేపుదప్పించి ♦ భూమియునాకసంబును నిండఁగప్పి
కరముగ్రగతిగ్రాలు కాలదండముల ♦ పరుసను దీపించు బాహుదండములు
కడజేర్చుబడబాగ్ని కీలలుబోలి ♦ వడిబర్వి దివిరాయు వాలపాశములు

పొరిపొరిగాలాభ్రములకాంతులనఁగ ♦ నురువడిమైగ్రాలునుగ్రదంష్ట్రికులు
అలరెడుప్రళయకాలాదిత్యబింబ ♦ ములఁ బోలిమండెడు ముఖగహ్వరములు
లోలాబ్ధివిపులకల్లోల ఘోషముల ♦ పోలిఘోషించు నార్పులు వెల్లివిరియ
బలములతోఁగూడ ప్లవగవల్లభులు ♦ కలఁగొనవచ్చు నగ్గలికలు చూచి
యిచ్చలోపలనప్పు డిక్ష్వాకుకులుఁడు ♦ నచ్చెరువడి చూచి హర్షింపుచుండె
ఆవేళసుగ్రీవు డధిపతిఁజూచి ♦ దేవ నా సేన లేతెంచుచందంబు
లవధరించితిరె వీరందొక్కరొకరు ♦ తివిరి మీపనుఁబు సాధింపనోపుదురు
అని చెప్పి వారల యలవులపేర్లు ♦ జననముల్ జాతులు సత్వసంపదలు
తనువులువర్ణము ల్తగుభోజనంబు ♦ లునుకల దేశంబు లోలివర్ణించి
బడబాగ్నిముఖమునబడియున్ననైన కడువేగజని సుగ్రగతియొప్ప మింగిలి
వడిఁదెచ్చియార్పుదుర్వారులై కదిసి ♦ పుడమియు నభమున ఘుబుచొచ్చియైన
నటమృత్యువక్త్రంబు నందున్ననైన ♦ నెటనందు బోరానియెందున్ననైన
నావానరాధీశు లందొక్కరొకరు ♦ దేవ నీ దేవి వైదేహి దెచ్చెదరు
అనతియిమ్మన్న నర్కజు దిగిచి ♦ భూనాథుఁడాదరంబున గౌగిలించి
బలసంపదలయందు భానుజ నీకు ♦ దలపోయమఱియసాధ్యము లెందుగలవు
పూని నీపౌరుషంబులు చూచికాక ♦ యేనేలగైకొందు నిట్రగింద నిన్ను
అనిపల్కి వైదేహి నరసి రాఁబనుపు ♦ మనవుడు హర్షించి యర్కనందనుఁడు

—:* వానరవీరులు సీతను వెదకఁబంపుట *:—

ఒనరనుత్తమమైన యొకలగ్నమందు ♦ వినుతుఁడ వ్వానర వీరునిబి చి
యేవంక నెచ్చోట నెందు నేమరక ♦ నీవు సేనలఁగూడి నెఱిదూర్పువడచి [యి
యామహీతనయ నయ్యామునలో వెదకి ♦ యామినీగిరిచూచి యటమీఁద బో
సురనదిలోఁజూచి శోణనందంబు ♦ కరమర్థి నరసియా కౌశికి వెదకి
యలసరస్వతిఁజూచి యటసింధువరసి పొలుచుపౌండ్రవిదేహభూములు వెదకి
మాళవకోసల మాగధబ్రహ్మ ♦ మాలాఖ్యశైలంబు మైథిలి నరసి
జలధితీరముఁజూచి చనిమందరాద్రి ♦ నిలయకిరాతుల నిలయము ల్వెదకి
తివురుటమైనటన వద్వీపంబుగడచి ♦ యవలజ బూద్వీప వటమీఁద దాటి
చెచ్చెరనటపోయి శిరాద్రి వెదకి ♦ యచ్చోటగాకోల మనుమడుగరసి
తనరులోహిత సముద్రము దాటిపోయి ♦ చనికూటశాల్మలిచ్ఛాయలనరసి
మరిపోయి గరుడాశ్రమంబున వెదకి ♦ వఱలుగోశ్రుంగ పర్వతము శోధించి
అందలిశృంగంబు లరయవర్తించు ♦ మదయుక్తరాక్షస మండలినరసి
యటశుద్ధసాగర మవలీలగడచి ♦ యటసుదర్శనమను నద్రిలో వెదకి
వలనొప్పశుద్ధార్ణవము దాటిపోయి ♦ బలువైన జాతరూప శిలాద్రి వెదకి

యుందు వెయిదలలతో నాసీనుఁడైన ♦ యిందువర్ణు ననంతు నీక్షించి క్రొక్క-
రొగిబదునాల్గు వెయ్యోజనంబులకు ♦ మిగిలి యవ్వలనున్న మేరువు వెదకి
యా మేరుగిరిచుట్టు యక్కడి కేఁగి ♦ యా మెయి వాలఖిల్యాదుల కెఱిఁగి
యావలనుదయాద్రి యందు శోధించి ♦ రావణునిలయు మారసి వార్త దెండు
రవిలేనియ ధకారము క్రమ్మకతన ♦ భువిలోన నవ్వలి భూము లేనరుగ
నిపుడనీవట వోయి నెలలోన రమ్ము ♦ నవమతి రాతన్న నాజ్ఞగా వింటు
నావుడులతు వానరులతోఁగూడ ♦ వేవేగ వినతుండు వెడలె దూర్పునకు
వినతనూభవుఁడంత హితశీలు నీలు ♦ హనుమంతు నంగదు నటజాంబవంతు
గజుగంధమాధను గవయు గవాక్షు ♦ విజయుని మైందుని ద్వివిదుని తారు
దగఁ బిల్చి మీరింక దక్షిణంబునకు ♦ దగు వానరులఁ గొండు దడయక వోయి
యర్మిలి విధ్యాద్రి యాదిగాఁ దొడరు ♦ నర్మదయుఁ దశార్ణ నగరంబు వెదకి
దండకారణ్యంబు తప్పక వెదకి ♦ దండిగా ననల గోదావరి నరసి
వలనొప్పనట వేత్రవతిలోన వెదకి ♦ నెలకొని కాళింగ నిషధ దేశముల
నారసి కర్నాట కాంధ్ర చోళేంద్ర ♦ చేర కేరళ పాండ్య సీమల నెల్ల
నరసి యమ్మలయాద్రి నరసి కావేరి ♦ నరసి యగస్త్యుని యాశ్రమంబరసి
యమ్మహాత్ముని గాంచి యతని యనుజ్ఞ ♦ నెమ్మితో దామ్ర పర్ణీనది దాటి
జలధి వేలావన స్థలముల వెదకి ♦ పొలుపొందు నా హేమపురములో వెదకి
యెదిరిన డక్కడ మహేంద్రాదియందు ♦ వెదకి యవ్వలనున్న వృషభాద్రి జూచి
యావల పుష్పాద్రియందు శోధించి ♦ క్రేవ గుంజరమను గిరి పరీక్షించి
యచటి యగస్త్య గేహము విశ్వకర్మ ♦ రచితమైకగునందు రమణి శోధించి
యంజనానది దాటి యవ్వల మణుల ♦ రంజిల్లు ఫణులచే రక్షింపబడిన
వదలక యాభోగవతిలోన వెదకి ♦ వెదకి యవ్వలనున్న విషయాబ్ధిఁ గరిగి
యందుపై గంధర్వు లప్సరల్సురలు ♦ నుందు రా చోటుల నోడక వెదకి
తలఁగక నరిగి వైతరణి లంఘించి ♦ పొలుచు వైవస్వతు పురమున కరిగి
యందు నాసమవర్తి యనుమతి వడసి ♦ పొందుగా పితృలోకమును గలయంగ
వెదకి సీతాదేవి వృత్తాంత మరసి ♦ పదిలులై నెలలోన ప్రతివార్త దెండు
ఆవల నంధకారావృతం బగుట ♦ దేవతలకునైన తీరదం దరుగ
ననిన నా కపినాథు లందరుఁ గూడి ♦ యనుమోద రసవార్ధి యందునోలాడి
దిననాథ తేజుఁడై దీపించు రామ ♦ జననాథుతో తమ సత్వము ల్మెరసి
జానకి నెబ్భంగి సాధించి కాని ♦ మానవేశ్వర రిత్త మగుడి రాలేము
యనిపల్క రాముఁడా హనుమంతుఁ జూచి ♦
యనువుగా భావికార్యము నిశ్చయించి

—:* శ్రీరాములు హనుమంతునిచేత తనముద్రికనిచ్చుట *:—

తనదయాదృష్టి యాతనిమీఁదనుంచి ♦ యలనిజయిందు రమ్మనిచేరఁబిలచి
జనకజగనుఁగొన జాలుదువీవె ♦ అనఘునీచేత గార్యమునిర్వహించు
నీవంతవాఁడవు నీబాహుబలము ♦ భావింపఁబట్టిదె పవమానతనయ
యిదెనాదుముద్రిక యిదిసీతకిచ్చి ♦ సుదతిచిత్తములోని శోకంబుమాన్పి
సీతకుమేమున్న సేమంబుచెప్పి ♦ సీతసేమముగొంచు శీఘ్రంబెరమ్మ
అనిముద్రికిచ్చిన ననిలనందనుడు ♦ తనమస్తకంబున ధరియించిమించె
తనరారనుదయాద్రి తనశృంగమున ♦ దినమణిదాల్చి యంతేనొప్పుకరణి
నంతనాహనుమంతు డానందమంది ♦ గంతులువేయుచుగరములుమొగిచి
యినకులాధీశ్వర యెలతదవ్వైనఁ జనిసీతయున్నెడ సాధించివత్తు
సోమసూర్యులఁబట్టి శోధించియైన ♦ భూమియునభము నబ్ధులఁజొచ్చియైన
నామహీసుతనింక నారసివత్తు ♦ నీమహిలోపల నెచ్చటనున్న

పవమానమగుసత్త్వ మభినుతికెక్క ♦ వసుధేశరావణు వాసంబుఁజొత్తు
నరిగెదననిమ్రొక్కి యటదక్షిణమున ♦ కరిగెవాయుజుఁడంగదాదులతోడ
మఱిసుషేణునిఁబిల్చి మర్కటేశ్వరుఁడు ♦ వలలనీవొకలక్ష వానరుల్గొలువ
సౌరాష్ట్రదేశంబు చనిచొచ్చివెదకి ♦ ధీరులైబాహ్లీక దేశంబునరసి
శ్రీకరమైయొప్పు సింధుసౌవీర ♦ కేకయదేశము లక్కృతమతివెదకి
వలనొప్పఁబున్నాగ వనములోనరసి ♦ తెలిసిపశ్చిమవార్ధి దృష్టించిచూచి
నలినారికేళ వనంబుశోధించి ♦ యలయకపోయి వజ్రాద్రిశోధించి
పారియాత్రనగంబు పరికించియచట ♦ గూరిమిగంధర్వ కోటులఁదెలిసి
బలియుహయగ్రీవు పంచజనాఖ్యుఁ ♦ గలనఖండించి శంఖంబుచక్రంబు
చక్రియచోఁదాలి జతఁగాంచినట్టి ♦ చక్రవంతాద్రిని జెచ్చెరవెదకి
తరణియెచ్చోటనస్తముగాంచునట్టి ♦ చరమాద్రిసీక్షించి సావర్ణినరసి
వెలయంగ నెనబదివేలసంయములు ♦ గంకాంచనాద్రులఁగలయవీక్షించి
చరితార్థుఁడగుమేరు సావర్ణిమౌనిఁ ♦ బరికించినెలలోనఁ బ్రతివార్తదెద్దు
అర్కహీనమున మర్యాదంబుగానఁ ♦ బేర్కొననవ్వలి పృథివియేనెఱుఁగ
ననిసుషేణాదు లగుమహాకపులు ♦ పనిఁబూనిపోయిరి పడమటిదిశకు
బలజాప్తసుతుఁడంత శతబలిఁబిలిచి ♦ నలినీవు లక్షవానరులతోఁగూడ
మొదటఁబులింద భూములుసొచ్చిపోయి ♦ చెదకయాసార సేనంబువెదకి
భరతభూములనెల్ల పరికించియవన ♦ ధరణీశుదేశంబు తడయకవెదకి
కడగికాంభోజ కొంకణ భూములరసి ♦

తొడపక యటఁబోయి హిమవంతమరసి

సోమాశ్రమంబున జొచ్చి శోధించి ♦ శ్రీమించు కాళాఖ్య శిఖరి వీక్షించి
యామైను సుదర్శన మను నద్రి వెదకి ♦ కామించి యటఁబోయి కనకాద్రి వెదకి
కైలాసగిరియును గౌబేరవనము ♦ నాలోలనయన మీరలయక వెదకి
ధనదుని పురము నాతని సరోవరము ♦ నను మోదభరము పాయక విలోకించి
యందుఁ గుబేరుని నడిగి క్రౌంచాద్రి ♦ యందు మీరందఱు నవనిజ వెదకి
దనియట మైనాక శైలంబుఁ గడచి ♦ యనఘు వైఖానసం బను కొలనరసి
తనరు శైలోదాఖ్య తటినిల ఘించి ♦ గొనకొని యుత్తర కురుభూములరసి
యచ్చట గంధర్వు లప్సరల్ సురలు ♦ నిచ్చలును దూరా నెలవులు వెదకి
నిలుతకు త్తర పయోనిధి దాటిపోయి ♦ సోలయక యట మీద సోమాద్రి వెదకి
యచట బ్రహ్మయు శివుఁ డర్థి వర్తింతు ♦ రచలితగతి మీర లందుండి మరలి
యొగి నెలలోపల నర్కోశుకడకుఁ ♦ బ్రకట బుగామీరు ప్రతివార్త దెండు
అనవుడు శతబలి యవనిశు వీడు ♦ కొని యుత్తరంబు దిక్కున కేగెనంత
అప్పుడు రఘురాముఁ డర్కజుఁ జూచి ♦ యెప్పుడు చూచినా వీభూము లెల్ల
నావినివాలికి నాఁడేను వెఱచి ♦ వేవేగ యతఁడు నా వెను వెంటదగుల
గలగొనగ నుతులుగా మహి యెల్ల ♦ నలుదిక్కులను చూచినాఁడ నేనని మె
ననినవచ్చెరువంది యటఁ గొంత కాల ♦

మినజానుజులు గొల్వ నినకులుఁడుండెఁ
దగపూర్వపశ్చిమోత్తరములు చూడ ♦ జగతీశు పనుపునఁ జనిన వానరులు
నినరశ్మిలెందాఁక నిఁ మీఁదఁ బర్వ ♦ ననుపమసత్త్వులై యందాక దిరిగి
నలినాక్షి నెందుఁగానక వచ్చి పతికిఁ ♦ జెలు వేది ప్రతివార్త చెప్పిరఁటఁను
అట రాముసుగ్రీవు లంగదముఖ్యు ♦ లిటమీఁదఁ బ్రతివార్త లేమి చెప్పెదరో
యుది యేమి చద్ద మోయని వారి రాక ♦ కెదురు చూచుచునుండి రెంతయు వగచి
అంత నంగదముఖ్యులగు మహాకపులు ♦ పంతంబులాడుచు బరమహర్షమున
సంతతజవసత్త్వ సంపద ల్మెఱసి ♦ మంతు కెక్కిన హనుమంతుండు దాము
చెదరక రవిజుండు చెప్పినయట్లు ♦ మొదల వింధ్యాచలంబున కేగుదెంచి
యందలి గుహల మహాగహనముల ♦ నందఁదవై దేహి నరయుచుఁ గదలి
తుదియాదిగా దక్షిణంబున కరిగి ♦ పాదపంబూ పాదలందు భూజంబులందు
నదులందు గిరులందు నగరంబులందు ♦ వెదకి జానకిఁగాన వెరవు లేకున్కి
చిన్నాసమాత్రాన్తచిత్తులై పోయి ♦ యంతంత గుమురులై యటపోయి పోయి

—: * అంగదాదులు కణ్వాశ్రమముఁ జేరుట * :—

పదియోండ్ల తనకూర్మి పట్టి యచ్చోటఁ ♦ గదలి జలములఁ బడి కాలుని పురికిఁ
బోయినఁ బొగులుచుఁ బుత్రశోకాగ్నిఁ ♦ బాయక పడి కాలి పలవించుచున్న

కణ్వమహాముని ఘనశాపవహ్ని ♦ మండిసర్వాగము నిర్మానుష్యముగుచు
నుండసీదయుఁ ద్రావ నుదకంబు లేక ♦ పండక బహుశూన్య పథమైనయడవి
చొచ్చియెంతేనియు సొలసిలోదారి ♦ నచ్చోటనుదకంబు నరయుచున్నంత
నకదొక్కరక్కసుం డగచరాధిపుల ♦ ముందఱవీలా భ్రమోయననిలిచి
రోరివానరులార యుర్విపై నేమ ♦ మారీచతనయుండ మహితవిక్రముఁడ
దేవగంధర్వులు తివిరి యేనున్న ♦ యీవనిదృష్టింప నెవ్వరు వెఱతు
రిం దేలవచ్చితి రిందఱుఁ గూడి ♦ యెం దుఁబోవఁగవచ్చు నింక నాచేతఁ
జావక మీరంచు సంరంభ మెసఁగ ♦ గోయనియార్చినఁ గుపితుఁడై యపుడు
అంగదుండా దైత్యు నదరంట వేయ ♦ పొంగిరక్తమువాత బొడబొడ వెడలి
వసుధపై బడెనంత వానరులెల్లఁ ♦ బొసఁగంగనొక మహా భూజంబునీడ
నలసి కూర్చుండి తోయంబు లెచ్చోట ♦ గలవొకో యని దప్పిగదురనున్నంత
దరిమిసి కొక బిలద్వారంబు వెడలి ♦ యురువడి జలపక్షులొండొండ నెగయఁ
గనుఁగొని యుదక మిక్కడ నుండఁబోలు ♦ నని వచ్చి బిలములోనందఱుఁజొగఁగ
గలగొని విపులాంధకారమై తెరువు ♦ తెలియకొండరులను ధృతిఁ జీరికొనుచు
ననుపమసత్త్వులై యటఁబోవఁబోవ ♦ గనుఁగొని యయ్యంధకారంబు విడిసి
యరుదుగా జగదద్భుతాకారమైనపుర మొక్కడచ్చోటఁ బొడగాంచి వచ్చి
పసిఁడిగోపురములు పసిఁడి మేడలును ♦ పసిఁడియట్టళ్ళును పసిఁడికోటలును
పసిఁడివృక్షంబులు పసిఁడిపూఁబొదలు ♦ పసిఁడిపర్వతములు పసిఁడి తామరలు
నై చూడ నాపురం బతిరమ్యమైనఁ ♦ జూచి యెంతేనియుఁ జోద్యంబు నొంది
ప్రకటసంపదలచేఁ బరఁగుచుండియును ♦ నకట నిర్మానుష్యమైనది పురము
ఏలొకో యీపురం బిట్లయ్యె ననుచు ♦ నేలీల వెడలుచో ప్పెఱుఁగంగ లేక
చాలఁ జింతిలుచు నచ్చటఁ గొన్నినాళ్ళు ♦ పోలఁ జరింపుచు పురమధ్యవీధి
మిన్నులతో రాయు మేదినియందు ♦ నున్నతంబగుచున్న యొక మేడఁ గాంచి
కని డాని మీఁదికిఁ గపులెల్లఁ బ్రాఁకి ♦ కనిరి తపోవృత్తికర మొప్పఁగాంచి
హరిణాజినాంబరయై యొప్పుదానిఁ ♦ దరుణేందుకళఁ బోలి తనరారు దాని
నొక పుణ్యకాంత నయ్యవివరు మొక్కి ♦
యకలంకచిత్తుఁడై హనుమంతుఁ డనియె
ఓతన్వి నీవెవ్వ రొంటిమై నిచ్చట ♦ నీపతంబొనరింప నేమి కారణము
ఏమహాత్మునిపురి యీహేమనగర ♦ మేమెన్నఁడును గాన మిట్టిచిత్రములు
అనినను కోమలి హనుమంతుఁ జూచి ♦ తనపూర్వకథ లెల్ల దాఁ జెప్పఁదొడఁగె
దగఁ దొల్లి మయుఁ డను దానవేశ్వరుఁడు ♦ తగిలి బ్రహ్మను గూర్చి తప మాచరించి
[illegible] పటుశక్తి వడసి ♦ పసిఁడిగోపుర మిట్లు పరఁగ నిర్మించె

నవిరళగతి హేమ యనుదివ్యవనిత ♦ గవిసియాతఁడు పెద్ద కాలమిందుండ
నాతనివజ్రధారా హతుఁ జేసి ♦ యాతన్విఁ గొనిపోయె నమరవల్లభుఁడు
ఆతరలాక్షి నెయ్యపుఁజెలికత్తె ♦ మాతండ్రి సావర్ణి మహితమానసుడు
నా యుంచిపనుపున నతితపోనిష్ఠఁ ♦ బాయకుందుదు స్వయంప్రభ యనుదాన
నని చెప్పి కందమూలాదులందఱికి ♦ దనివిదీరనొసంగి తాపంబుదీర్చి
యనఘు మీ రెవ్వ రిందరుగుదెనేల ♦ యనిమిషులై ననిం దరుగుదేరాదు
వినుఁడిందుమీర లెవ్విధినివచ్చితిరి ♦ యనవినిహనుమంతుఁ డతివకిట్లనియె
దనతండ్రిపనుపున దండకాటవికి ♦ మునివృత్తి రాముఁడిమ్ములవచ్చియుండ
వనజాక్షి నారాము వరపత్నిఁ గొనుచు ♦ జనిన రావణు వెంటఁ జనిచని యేము
జనకజ వెదకుచు జలశూన్యమైన ♦ ఘనమైనదప్పిచేఁ గడుడస్సియొక్క
బిలములోపలఁ జొచ్చి పెద్దచీఁకటికిఁ ♦ దలఁకక యొక్కట దైవయత్నమున
నీయాశ్రమంబున కేతెంచి వెడలి ♦ పోయెడుమార్గంబు పొడగానలేక
తిరుగుచున్నార మున్నతిఁ బెక్కుదినము ♦ లురిఁబడియున్నార మొకదిక్కులేక
యనిన రాముని కార్యమై వచ్చినారు ♦ అనఘులు పుణ్యాత్ములని భక్తిఁ జేసి
మీకెద్దియిష్ట మిమ్మెయి వేఁడుఁడనిన ♦ మాకీబిలద్వార మార్గంబు వెడలఁ
జేయుము వేవేగ సీతను వెదకఁ ♦ బోయెదమనుడు నప్పొంటియామగువ
మోమీరుకన్నులు మూసికొండనుచుఁ ♦ దగఁ బుచ్చివారలఁ దనతపశ్శక్తి
నెలఁతుక యవలీల నిమిషమాత్రమున ♦

బిలముఖమునఁ దెచ్చి పెట్టితాఁబోయె
బోయినకపివీర పుంగవులెల్ల ♦ నాయింతిపొగడుచు నటఁబోయిపోయి
యాయతోన్నతబలు లందొక్కనరసి ♦ బాయక జలములు బలువిడిద్రావి
యంతనందఱు మహేంద్రాద్రికిఁ బోవ ♦ నంతనంగదుఁడు నిట్లనుచు శోకించె
ఇనజునిమితిదప్పె నినవంశు దేవి ♦ వనజాక్షిఁ బొడగన్న వారముగాము
ఆజ్ఞాధురంధరుఁ డైనసుగ్రీవుఁ ♦ డాజ్ఞ దప్పిరి వీరలంచును మనలఁ
బొడగన్నయప్పుడే భూపతిమెచ్చ ♦ నడిమికి రెండుగా నఱికించు మనలఁ
గావున మనమింకఁ గపిరాజుఁ గానఁ ♦ బోవుట తగవును బుద్ధియుఁ గాదు
వెలువడి మనమిట్లు వె వచ్చినట్టి ♦ బిలములోపలఁ జొచ్చి పేర్మినుండుదము
అదియష్టది ప్రాకారాభేద్యమార్గ ♦ మదిపక్వఫలభరితారామమరయఁ[దు
బొంముగా నచ్చో గోపురమున్న మనల ♦ నెందు నెవ్వరికైన నెఱుఁగఁ జొప్పడ
అనఁగొంద ఱగచరు లాపనికియ్య ♦ కొనిరంత మారుతి కోపించి పలికెఁ
చెడ్డబుద్ధివినీవు పినతండ్రుపనుప ♦ గద్దరివై రాము కార్యమై వచ్చి
కపులతోఁ గూడియాగంభీరబిలము ♦ చపలతఁ జొచ్చి యచ్చటనుండినపుడె

ధానుజుతో మచ్చఁ బడునదిగాన♦దాన నీలుఁడును తారుండు నలుఁడు
దీని కెవ్విధి సమ్మతింపముదక్క♦వానరోత్తమ బంధువర్గంబుఁ బాసి
నినుఁ గొల్చియుండంగ నేరరు సుమ్ము♦వినుమది యును గాక వృత్రారి తొల్లి
యర్మిలితనవజ్రహతిని బిలంబు♦నిర్మించెనటువంటి నిశితవజ్రాస్త్ర
కోటిలక్ష్మణునకుఁ గొలదిన గ్గలము♦మాటమాత్రమున నీమర్కటాధముల
నిన్ను నీబలమును నీఱుగాఁ జేయు♦నున్న యీదుర్బుద్ధు లొక్కటవిడిచి
యవనిజపొడ్డగాన మైలమటంచు♦రఘుజునికడకందఱము పోయి మ్రొక్కి
విన్నవింతము జగద్విఖ్యాతినగఁడు♦నిన్నును మమ్ము మన్నించు మోమోపి
యామీఁదమీతల్లి కనురక్షుఁడగుట♦నీమీఁద నలుగఁడు నీవు పుత్రుఁడవు
కావునఁగడు నిన్నుఁ గట్టుపట్టంబు♦గావిని యావాలి నందనుండని యోఁ
బితృసమానుని వాలి బృథ్విపైఁ గూల్చి♦

యతనిభార్యవరించి యామీఁద దనకు
నుపకారియగు రామునుద్యోగమెల్ల జపలుఁడై మఱచి లక్ష్మణుఁ డాగ్రహింప
మఱిగా దెచను దెంచె మా పినతండ్రి♦యెఱుఁగ వేయాతని హీనవర్తనము
అట్టికామాంధుని నట్టికృతఘ్ను♦నెట్లు నమ్మఁగవచ్చు నిదియది యేల
శ్రీరాము కార్యంబు సేయక పోయి♦యూరవిసూను చేనటు చచ్చుకంటె
నీమొదఁ జచ్చుట యిది లెస్సమనకుఁ♦బ్రాయోపవేశన పరులుగండనుచు
వాతూదానును వరదర్భశయను♦లై రాకవృథయని యాత్మఁ జింతించి
తెవులును ముదిమియుఁ దీవ్రవేదనయు♦నవతయు లేని ప్రాణంబులుగావ
లేచియు మఱి పవ్వళించియు దిశలు♦చూచియుఁ దమతమ చుట్టాల సతులఁ
దలఁచియు బాపురే దైవమా యిట్లు♦చలపట్టి మము వృథా చంపఁ జొచ్చెట
కమకట్టి తేయంచు సకలవానరులు♦

గుమురులుగుమురులై కూడియొండొరులు
వలినాప్తకులుఁడు కానలకు రానేల♦శాలభామను సురచేఁ గోల్పడ నేల
యొరసి దైత్యుఁడు జటాయువుఁ జంప నేల♦ధరధీశుఁ డరుణనందనుఁ గననేల
ధరణిజవార్త యాతఁడు చెప్ప నేల♦తరణివంశులు పంప దరికిరా నేల
సుగ్రీవుకడకు రాసుతులు రానేల♦సుగ్రీవుఁ డాతని సొమ్ముగానేల
వలనొప్పయిలి భూవరుఁ డేయనేల♦బలిమితోఁ దుతఁ గపిబలము రానేల
యినతనూజుఁడు మమ్ము నిటు పంప నేల♦పనివడి మనకు నీపాటు రానేల
ఊని ప్రాణంబు లురక పో నేల♦పోనేల యక్కటా భువికై కవరము
మనువంశయుతముగా మనవంశమణచెననియని శోకించియలయుచున్నంత
నామొదసంపాతి యనుపక్షినాథుఁ♦డాయతిదేహుఁ డత్యంతవృద్ధుండు

—:* అంగదాదులు సంపాతి చూచుట :*—

ప్రాయంపుఱెక్కలు బలిమియు లేమి♦ నాయద్రిగుహనుండి యల్లన వెడలి
మెల్లనఁ జేరఁ దెంచి మృతిపోరి ధరణిఁ♦ ద్రెళ్ళినవనచరాధిపుల వీక్షించి
దైవంబుకృపచేసెఁ దనకునాహార♦ మీవేళ ననిచేర నేతేరఁగపులు
చపలులై మరణనిశ్చయబుద్ధి వగవ♦ నపుడాంజనేయుతో నంగదుండనియె
నిదివక్షిగాదు మమ్మిందఱఁ జంప♦ నదయుఁడై యముఁడిట్టులరుదెంచినాడు
ఆజటాయువు నరనాథుని దేవిఁ♦ బోఁడిమి దెఱఁగొని పోవు రావణుని
దాఁకనాతని ఖడ్గధారఁ జేఁజచ్చి♦ లేకువఁ బడయఁడే దివ్యపదంబు
రామకార్యార్థమై ప్రాణముల్మనము♦ నీమహాపక్షికి నిచ్చుటలెస్స
యనుచోటనామాటలాలించి యరుణ♦ తనయుండు శోకగద్గదకంఠుఁడగుచు
నాకపివీరుల కటఁజేరఁబోయి♦ యోకపులార యెందుండి వచ్చితిరి
యీజటాయువు నాకు సర్మిలితమ్ముఁ♦ డాజటాయువు నేను నరుణపుత్రులము
నిశితోగ్రనఖుఁడు మానితమహామహుఁడు♦
దశరథుసఖుఁడు సంతతసత్యధనుఁడు
నతఁడేమిటికిఁ జచ్చె ననవుడువాలి♦ సుతుచేతనంతయుఁ జొప్పడఁ దెలిసి
యెంతయు శోకించి యిచ్చలోఁజాల♦ వంతనొందుచునున్న వనచరులెత్తి
చెంతనున్నపయోధిఁ జేర్చినవాఁడు♦ సంతాపమునఁ గృతస్నానుఁడై వచ్చి
విపులశోకముతోడ విహగవల్లభుఁడు కపులతో దనపూర్వకథ జెప్పఁదొడఁగ
ఆలోలగతుల జటాయువు నేను నేన♦ కైలాసగిరియందుఁ గవగూడియుండ
ఘనజవసత్త్వము లక్కడిమిమై మెఱసి♦ మొనసి మేమిద్దఱము మత్సరించి
యుడువీథికిద్దఱముదయకాలమున♦ గడఁకతో నెగసి సంగడిపోయిపోయి
పరువడినటపట్టనగలింటికోలఁది♦ కిరువురుదడసితి మినమండలంబు
ఉగ్రాంశుకిరణంబు లొండొంటి దాఁకి♦
యుగ్రుఁడై యా జటాయువు మండుటయును
బదిలమైవాని నాపక్షంబులందుఁ♦ బొదివిన నాపక్షములు గాలిపోయె
నెఱకలు గాలిన నేపిల్లఁబోలిసి♦ మఱివచ్చి యీయాశ్రమంబునఁ బడితి
నాపక్షినాథుఁ డెందరిగెనో యెఱుఁగ♦ నీపల్కు లీవేళ నిటవింటి నేను
వీనులమీవార్త వినియున్నవాఁడ♦ హీనబలుండనై యెఱకలు లేమి
పక్షముల్ తొల్లింటిపగిది నాకున్న♦ దక్షతనింతకుఁ దనసహోదరుని
పగదీర్చి శ్రీరామభద్రుని దేవి♦ మగఁటిమి దేనేర్తు మాటలకేమి
నావిని భల్లూకనాథుఁ డిట్లనియె♦ నా వాయుజుఁడు నంగదాదులు ప్రాంగ
నా జటాయువు తమ్ముఁడట నీకు మొదల♦ నీనగంబులలోన నెదు రెందుఁగలదు

నీవుచూడనియట్టి నెలవులు లేవు ♦ రావణుఁడప్పుడు రఘురాముదేవి
నెందుదాఁచినవాఁడొ యెఱిఁగింపుమనిన ♦ సందేహ మెడఁబాయ సంపాతి పలికె
తనతనూభవుఁడు దుర్దమపరాక్రముఁడు ♦
ఘనుఁడు సుపార్శ్వుండు కడుభక్తియుక్తి
ఱెక్కలుగాలి యాఁకటియున్న నాకు ♦ నక్కఱతోఁ దెచ్చి నాహార మొసఁగు
నతఁడొక్కనాఁడు నాకశనంబు దేక ♦ తడవివచ్చిన యాల తడసితివనిన
నో తండ్రి నీకు నే నుపహారమరయ ♦ నాతతగతి మహేంద్రాద్రిసముద్ర
తీరమార్గమున నెంతయుఁ బొంచియుండ ♦ నారవిప్రభువంటి యంగనఁ గొంచు
గాటుకకొండకైవడి నొక్కఁడు ♦ ధాటిమై చనుదెంచి తనకుఁ బ్రియంబు
జెప్పి యేదెరువియ్యవచ్చె రజనియె ♦ నప్పుడచ్చటి మౌను లందరు నను
సంతసింపుచు నేఁడు చావుకుఁ దప్పె ♦ పంక్తికంఠుఁడగు రావణాసురుం డతఁడు
చెఱగొని లంకకు శ్రీరాముదేవి ♦ నఱకగై కొనిపోవుచున్నవాఁడనిరి
అందుకై దడసితి ననివాఁడు పలికె ♦ సందేహమేటికి జనకతనూజ
బలసి రాక్షసవధూపరివృతయగుచు ♦ జలదమాలికలోని చంద్రికఁబోలి
యున్నది లంకలో నొగి శతయోజ ♦ నోన్నతి నా దృష్టి యుర్వి చరింతు
తెల్లంబుగా మనో దృష్టియు నాకు ♦ వెల్లపక్షులకంటె నెక్కుడై పరగు
ని పల్కి మఱియు నిట్లనియె సంపాతి ♦ తన పక్షయుగళంబు దగ్ధమైనపుడు
ఏన్ వచ్చి మూర్ఛిల్లి యిచ్చోట ద్రెళ్ళి ♦ చావుకుఁ దప్పి మెంచగరానిదప్పి
కట్టువార్పులెసఁగంగ కొన్నేండ్లు గడపి ♦ గట్టిగా నాభాగ్యగతి నొక్కనాఁడు
ఘననిష్ఠఁ దపమెందు గావించు సకల ♦ జనతాపహరుని సాక్షాన్నిశాకరు
యానిశాకరుని నొయ్యనఁ గాంచి మ్రొక్కి ♦ భానుదీప్తుల చాతపక్షముల్ గాలి
తనువున్న చందమంతయు విన్నవింప ♦ మునిశిఖామణియును మన్నన న్నరుగు
గావున నెంతయుఁ గరుణించి మీఁద ♦ వి చిమాత్రియః పతిపరాత్పరుఁడు
విష్ణుండు దశరథ విభునకుఁబుట్టి ♦ యుష్ణాంశకులుఁడంత నుగ్రాటవులకు
జను దేరనంతనిసతిని రావణుఁడు ♦ కొనిపోయి చెరనుంచుకొనియున్నయపుడు
అమృతాన్నమాయింద్రుకమృతాంశుఁడిడిన తెమలక యామహాతృష్ణలు బాసి
యుండునంతట రాముఁ డొయ్యన వచ్చి ♦ చండాంశుజుని గాంచి శక్రజుఁ ద్రుంచి
యాలోలగతి సీత నరయ వానరుల ♦ నాలుగుదిశలకు న్నతిబంపగలఁడు
ఆరాముని జదూతలగు వారితోడ ♦ చేరి! నీ కథ చెప్పిన నాఁడు
ఘనపక్షయుగళములుగుఁ బొమ్మనుచు ♦ మునిని శాకరుఁడను ముని చెప్పిపోయె
నతఁడానతిచ్చిన యట్లు మీతోడ ♦ హితమతి నీకథ యెఱిఁగింపఁ గంటి
ని పక్షములు వచ్చె నిదె చూడుఁడనుచు ♦ దివిరి కుప్పించి యుద్దివిక్షించి

వడిలంక చేరువ వనములో సీతఁ • బొడగాంచియదె సీతఁ బొడగంటి ననుచు
నదె శతయోజనంబైన దూరమున • నదె లంకలోపల నదిపుణ్యసాధ్వి
చాలు ప్రాయోపవేశన మింక లెండు • పౌలస్త్యపతిలంక పరికింపఁబొండు
అనిలంకకటుఁబోవనటఁ ద్రోవఁజూపి • చనియె హేమాద్రికి సంపాతియపుడు
అంతవానరవీరు లందఱుఁగూడి • సంతోషచిత్తులై జవమొప్పఁబోయి
చండవాతాఘాత జాతడిండీర • గండూషితాశావకాశనీకాశ
వీచీసమీచీన విహారమాణాది • నైచిత్రకరవాల వరవాలములను
ఘోరనక్రగ్రాహ కోటులుప్పొంగఁ • బోరాడుచున్న యంభోరాశిడాసి
అందుని శ్చేష్టితులై కొంతదడవు • గుందుడెందములతో గూర్చుండియపుడు
ఈసముద్రముఁదాట నెవ్వఁడుఁజాలు • ఈసత్వమెవరికి నిందులోఁగలదు
అనియిట్లుచింతింప నంతనంగదుఁడు • వనచరుల్ తాను నవ్వనధితీరమున
నారాత్రి వేగించి యమ్మఱునాఁడు • వీరవానరుల వేర్వేర నీక్షించి
ఈరీతిమీర త లేసివానరులఁ • పౌరుషంబులు నేలపాలుగాఁజేసి
జలరాశిలోపల శతయోజనములు • కొలఁదిదాఁటుటకిట్లు గుండెదరేని
అపకీర్తికినయిరి యగణితాంభోధిఁ • గపివర్యులార యేకరణిదాఁటుదు
మీమీజవంబులుమీఁదాఁటుకొలఁదు • లీమాత్రమనిపల్కు డెఱుఁగంగ నాకు

—: * వానరవీరులు తమతమ సత్త్వముఁ దెలుపుట * :— [ర

ఘనులార రయమొక్కఁ డొక్కఁడు చెప్పఁడనుచు • గినిసిన నందఱు గృతమతులగు
దమతమసత్త్వముల్ తగవిచారించి • అమితవతోన్నతు లందఱుఁగూడి
నలిమీఁ తెపది యోజనంబులుదాఁట • గలవాఁడ నేననిగజుఁడందుఁబలికె
ఇలమీఁదలావుమై నిరువదిదాఁటె • సాలయు నేనని గవాక్షుఁడు పేర్చిపలికె
మునసీనకడిమిమై ముప్పదిదాఁట • ఘనశక్తిఁగదని గవయుండు పలికె
నాలావు పెంపున నలువదిదాఁటఁ • జాలుదు నేనని శరభుండు పలికె
బనిగొనిజలధి యేఁబదిదాఁటువాఁడ • ననిగంధమాదనుం డలవున్మైఁ బలికె
ససమొంతడింపక నరువదిదాఁట • మరలకపోదని మైందుండు పలికెఁ
జెగఁబడ కడిమిమై డెబ్బదిదాఁట • దెగువకోపుదునని ద్వివిదుండు పలికె
సెనుబదిదాఁటుదు నేపుదీపింప • దనియక నేనని తారుండుపలికె
మోపినతమలావు లొకఁడునుదాప • కేపున్మైనందఱు నిటుపల్కుచుండ
భల్లూకనాథుండు బహుకాలవృద్ధుఁ • డల్లోకవిక్రముఁ డొకమాటపలికె
చిన్ననాటిబలంబు చెప్పవచ్చినన • గ్రన్ననహాస్యకారణ ౯ లిప్పటికి [వింప
అయిననువిఁడుమున్న మృతంబుకొఱకు • దానవుల్ సురలు యుద్ధములుగా
నమరుల కై సహాయంబుగావచ్చి • యమృతంబుద్రావితి నర్థితాకొనఁగ

ప్రవిమలకృపనిన్ను బడసెగావునను♦భువినివాయువుతోడి భూరిసత్త్వుఁడవు
వేగవిక్రమకళా విస్ఫూర్తియందు♦నాగరుడుకంటె నధికుండవీవ
వరుసబంకజగర్భు వరమునఁ జేసి ♦ మఱినీకునాయుధ మరణంబులేదు
నీసమానులు లేరు నిఖిలలోకమున♦నీసత్త్వ మెఱుఁగుదు నిజముగా నేను
జలనిధిలంఘించి జనకజఁగాంచి ♦ కలకమైయిటురామ కార్యంబుఁ జేసి
కపులప్రాణములు రాఘవుల ప్రాణములు ♦
కపినాథు ప్రాణముల్ గరుణతోఁగాంచి
తడయక యోజగత్ప్రాణనందనుఁడ♦పడయుముత్తమలోక పదములునీవు
అనవుడుహనుమంతుఁ డౌఁగాక మీరు♦పనిచినఁ జేయుదు బలికార్య మొనర
నగచరుల్బ్రోచుడు నాశక్తి నేఁడు♦జగదేకహితయుక్తి జలధిలంఘించి
పఱతెంచిసురలడ్డపడినసాధింతు♦నెరసిలోకములెల్ల నీరుగావింతు
నక్కజంబగుశక్తి నటులంకఁ జొత్తు ♦ స్రుక్కకవైదేహిఁ జూచి నేవత్తు
నాలంకమైనను నగలించి తెత్తు♦వాలాయముగ సీత వసుధేశుఁగూర్తు
గాకున్న జలధులు గలఁతునొండేని ♦ వీకతో నమరాద్రి విఱుతునొండేని
పుడమితుత్తుమురుగా బొడుతునొండేని ♦
తోడరిమృత్యువునైన ద్రుంతునొండేని
దీవులన్నియును శోధింతునొండేని♦చేవమీఱఁగ లంకఁ జేరియచ్చోట
దుష్టాసురలనెల్ల ద్రుంతునొండేని ♦ సృష్టిచీకటిచేసి చెరుతునొండేని
కానియూరకరాను కడగిమీకడకు♦నేననిపూని మహేంద్రాద్రియెక్కి
యుదధులతోఁగూడ నాఁగిసృష్టిగ్రుంగ ♦ గదిసినలయకాలకాలుఁడో యనగ
వెసద్రివిక్రముఁడైన విష్ణునిరీతి♦నసమానదేహుఁడై యందందఁబెరిగి
యంగదాదులచేత ననుమతివడసి♦యంగమంతయుఁ బొంగ నంతరంగమున
తనతండ్రిపవమాను దలచి శ్రీరామ♦జననాథుపదపంకజము లాత్మనిలిపి
యడుగులు తరముగా నద్రిపై మోపి ♦
మెడయెత్తి యెక్కింత మెయిగ్రుంగనిలిచి
బొమలెత్తికలయ సంభోరాశిఁ జూచి♦యమరారిపురిమీఁద నటదృష్టినిలిపి
వరలంగనిలమీఁద వాలమల్లార్చి♦నెరికర్ణములు రెండు నిక్కించిపొంచి
యటనద్రిశిలమీఁద హస్తంబులూఁది పటుజవంబునదాటెపవమానసుతుఁడు
అలసుధాహరణార్థమై వైనతేయు♦డిలనుండిమునుదివి కెగయుచందమున
నారభసంబున నద్రిశృంగములు♦భూరేణువులకంటెఁ బొడియునై రాలె
నారావణుండు మున్నార్జించినట్టి ♦భూరికర్తుల పెంపు పొడిమైనయట్లు
నాయురవడిమ్రాఁకు లతనితో నెగసి♦తోయధిలోఁ జొచ్చితునియలై రాలె

ఖావిసేతువునకై పవననందనుఁడు ♦ తావచ్చి శంకువు స్థాపించెననఁగ
వెసఁ బేర్చియచ్చట విషమవాయువులు ♦
దెసలకుఁ జెడిపాఱెఁ దివిరి మేఘములు
వక్రించెలంకపై వాయుజుండనుచు ♦ శక్రాదులకుఁ జెప్పఁ జనిన చందమున
నావడి నబ్ధిసీ రంతయు నెగసి ♦ యావలి పాతాళ మటుఁగా నవచ్చె
జనకజఁ దెచ్చి నాజలములోఁ దాపుఁ ♦ డని మారుతికిఁ జూపె నంభోధియనఁగ
దనపతిహితకార్యధైర్యశౌర్యములు ♦ తన వేగలాఘవో దాత్తసత్వములు
చూచి యింద్రాదులు సొరిది గీర్తింప ♦ నీ చందమున దాటి యేగుచున్నంత
నీనిత్యకృతి జగద్ధితముగా బూని ♦ పూని యెంతయు దవ్వు బోవుచున్నాడు
ఇతనికి విశ్రాంతి యిచటఁ గావించి ♦ యితని బుచ్చెదనని యిచ్చలోఁ దలచి
యప్పుడు మైనాకు నంబుధి పిలిచి ♦ యిప్పుడు హనుమంతుఁ డేతెంచెనిటకు
నొప్పార నాతిథ్య మొసగు నీవనుచు ♦ జెప్పి పొమ్మనుట యు శీఘ్రంబె యరిగి

—:* హనుమంతునకు మైనాకుఁ డాతిథ్య మొసగుట *:—

యురుతర నిజపక్ష యుగళ సంజాత ♦ మరుదుచ్చ ద్వార్ధి మధ్యంబు వెడలి
శ్రీకర కాంచన శృంగ సంకలిత ♦ నాకమై యొప్పు మైనాక పర్వతము
యెదుటదోఁచిన జూచి యిది దైత్యమాయ కదిసి నాపనికి విఘ్నము సేయగోర
దానికి నేమి నా దర్పంబు పేర్మి ♦ దీని ద్రుంచెదగాక తెగియుంచు నడరి
వరవజ్రకఠిన మా వక్షంబు చేత ♦ నురవడి హనుమంతుఁ డుదరితాకటయు
గురువలి సుడిగొన్న కారాకువోలె ♦ దిర మేదిధృతి దూలి దిర్దిర దిరిగె
మనుజుడై పొడసూపి మైనాక శిఖరి ♦ యనిలనందను జూచి యర్థితోఁ బలికె
అనిలజ నేను నీ కుపకారిగాను ♦ వనరాశి పంపున వచ్చితిగాని
యమ్మహాత్ముఁడు నీకు నాతిథ్యమొసగు ♦ పొమ్మన్న వచ్చితిఁ బూర్వకాలమున
పర్వతంబుల కెల్లి పక్షములు గలిగి ♦ గర్వించి మెలఁగ నాఖండలుం డలిగి
పవిధారనొక్కట పక్షముల్ దునుమ ♦ బవమడు మీతండ్రి పరికించి నన్ను
నవలీలనీ లవణాంబుధిలోన ♦ గవియించి పక్షముల్ గాచి రక్షించె
గాన మీ వాడను గాని యన్యుడను ♦ గాను శీతాచలాగ్రణి కుమారుండ
నేను మైనాకుండ నీవు నాయందు ♦ బూని యీ ఫలమూలముల దృప్తి బొంది
బడలికలును బాసి పవనకుమార ♦ కవులావుమీద లంకాపురంబునకు
నరుగుము నీవన్న నమ్మహాబలుడు ♦ వెఱవుగా దిప్పుడు విక్రమించుటకు
జలనిధి నడుమ నెచ్చట నిల్వననుచు ♦ జెలగి మున్ను ప్రతిజ్ఞ చేసినవాడ
నిట రాము కార్యార్థ మేగుచున్నాడ ♦ నటుగాన నిల్వ రాదద్రీశ నాకు
ననిపాణిజలమున నయ్యద్రి దడవి ♦ యనఘాత్మ నీ పూజ లన్నియు వచ్చె

వనిపల్కి పోవుచో ననిలనందనుని♦ఘనశక్తికమరులు కడుచోద్యమంది
నానావిధముల నానందింపగా♦మైనాకగిరికిఁ బ్రణమె నాకవిభుడు
కనుగొని శ్రీరాము కార్యమ్ము దీర్ప♦హనుమంతునకుఁ బ్రియంబాచరించితివి
యటుగాన నీకు నే నభయ మిచ్చితిని♦యిటు సుస్థితిని నుండు మీ నగము బలికె
నప్పుడు గంధర్వులసురులు మునులు♦తప్పక యంజనాతనయు జూచుచును
ఇతని లావెట్టిదో యెరుగ దలంతుమ♦చతురులై సురస నాఁ జను దేవదూత
బనిచిన రాక్షసభావంబు దాల్చి♦యనిలసూనునకు దానడ్డమై పలికె
నీవార్ధిలోనుండి యేనిన్ను గంటి♦దైవయత్నంబున దానింక మంటి
అనిలజ యాఁకొంటి నటు నిటు జనక♦మునుకొని నా వక్త్రమున వచ్చి చొరుము
నీవనవుడు రాము పంపు కార్యమునకు♦బోవుచున్నాడను పొలతి రారాదు
ధరణీశు కార్యమంతయు నెఱవేర్చి♦తిరిగి యేతెంచుచో దీర్తు నీ కోర్కి
పోయి వచ్చెదనంత బోనీక గాడనిన♦నాయింతి కోపించి యత్యుగ్రమ్మ బలికె
జననీవు నిను బట్టి చంపుదుగాని♦యనుచు నోరు తెఱచిన ననిలనందనుడు
తన మేను బెంచెను దశయోజనంబు♦లినుమడిగా బెంచె నింతి యాననము
ముప్పది యోజనంబులు బెంచెనంత♦నప్పుడు నలువది యదియును బెంచె
నొండొరు లిటు శతయోజనంబులుగ♦దండిమై బెంచిరి తమ వపువక్త్రములు
నంతనా హనుమంతు డసమానబుద్ధి♦
మంతుడై యంగుష్ఠమాత్ర గాత్రమున
నతిసూక్ష్ముడై వచ్చి యాయింతి వదనమునఁ జొచ్చి యువలీల వెడలె
ముడిగొన్న సంసార మోహబంధములు♦విడిపించ్చి సుజ్ఞాని వెడలిన మాడ్కి
వెడలి నీ కోర్కి గావించితినిక♦కదలెదనని పల్క గపికులోత్తముని
బుద్ధికెంతయు మెచ్చి పొగడుచుం గార్య♦సిద్ధి నీకయ్యెడు శీఘ్రంబె చనుచు
నట దివ్యవనితయై యాయింతి ప్రీతి♦బట్టు సత్త్వనిలజుం బరఁగ దీవించె
నతడంత బ్రణమిల్లి యటబోవుచుండ♦నతిరయంబున వచ్చి యాతనిఁ గదిసి
యొలసి దేహచ్ఛాయ లొడిసి రాఁ దిగిచి♦చెలఁగి జీవుల గ్రసించు సింహిక గదిసి
పదియోజనంబుల పరపున నోరు♦పదుల యోజనముల పరగెడు నిడుపు
నగు మీనవాలాతని నలమి చేబట్టి♦తిగిచి మ్రింగుచునుండ ధీరుడై యతడు
ప్రతికూలవాతూలపవనసంఘాతహతులనోడయుం బోలె యటుపోక నిలిచి
యెడదఛాయాగ్రాహి యిదియని తెలిసి♦కడవక యటమీద మకరివక్త్రంబు
చొచ్చి వత్తువటంచు సూచించినట్లు♦అచ్చెరువందె యింద్రాదులు చూడఁ
గడు సూక్ష్మరూపుడై కదలక దాని♦కడుపులోపలఁ జొచ్చి కడిమిమై వచ్చి
యాదుష్టరాక్షసి నబ్ధిలో వైచె♦నాదట సురలెల్ల నానందమంది

వినతించి వరపుష్పవృష్టులు గురియ ♦ వనధి నవలీల వడి దాఁటిపోయి
యా సమీరజుఁడ నాయాసంబు[illegible] ♦ నా[illegible]వేలాచ[illegible] బనలీల నెక్క-
ననియాంధ్రభాషాభాషాధీశ[illegible] [illegible]నమానసుఁడు
పాలితాచారుండ పారధీశరథి ♦ భూలోక[illegible]గోన బుద్ధభూ[illegible]భుఁడు
తమ తండ్రి విట్టల ధరణీశు పేర ♦ [illegible] పేర
బనిఁబూని యురిగండ భైరవు పేర ♦ ఘనుఁడు పే[illegible]ని పేర
నాచంద్రతారార్కమై యొప్పమిగిలి ♦ భూ[illegible]మై వెలయ
నసమాన లలిత శబ్దార్థసంగతుల ♦ రసికమై [illegible]యణంబు
పరఁగు నలంకార భావసల్లీలఁ ♦ గరమర్థిఁ గిష్కింధ కాండంబు చెప్పె
నారూఢి నా శ్రేయ మై[illegible] ♦ మై[illegible]నాఁడు
ఇవ్వసుమతి నొప్పు నిక్ష్వాకుచరిత ♦ మెవ్వరు చదివిన నెవ్వరు విన్న
సామాదిబహువేద[illegible] ♦ [illegible] సర్వభోగములు
పరహితాచారముల్ ప్రభువిభవములు ♦

పరిపూర్ణశక్తులు ప్రకటరాజ్యములు
నిర్మలకీర్తులు నిత్యసౌఖ్యములు ♦ ధర్మైకనిష్ఠలు దానోద్ధతులు
నాయురారోగ్యంబు లైశ్వర్యములును ♦ [illegible]యంబు
వరపుత్రలబ్ధియు వైరినాశనము ♦ [illegible]వృద్ధియును
నేవిఘ్నములు లేక యుద్ధ[illegible]ధిక ♦ లా[illegible]లపొందు
గొడుకులతో నెప్పుఁ గూడియుండుటయు ♦ నె[illegible] బాయుటయు
సమ్మదంబున బంధుజనులఁ గూడుటయు ♦

నిర్మలశౌర్యంబు [illegible]టయు
సతతంబు దేవతాసంతర్పణంబు ♦ పితృగణతృప్తి[illegible] పొరయుచుండు
వ్రాసిన వారికి వరశుభోన్నతులు ♦ వాసవభోగాది[illegible]జేయు
నెందాఁక కులగిరు లెందాఁక [illegible]దార ♦ లెందాఁక రవిచంద్రు లెందాఁక దిసలు
నెందాఁక వేదంబు లెందాఁక ధరణి ♦ యెందాఁక భువనంబు లేపు దీపించు
నందాఁక నీకథ యతి[illegible] ♦ సందోహ[illegible] చారమై పరఁగు

కిష్కింధాకాండము సంపూర్ణము

---

శ్రీరస్తు

# శ్రీరంగనాథరామాయణము

## సుందరకాండప్రారంభము

—: * :—

శ్రీరాముకార్యంబు సేయంగఁ బూని ♦ వారిధి పిల్లకాల్వయుఁ బోలె దాఁటి
చారుశృంగంబుల సానుదేశముల ♦ భూరిభూరుహలతా పుంజకుంజములఁ
గలిమిచే నొప్పు లంకాసమీపమున ♦ వెలయు సువేలాద్రి వేడ్కమై నెక్కి
యంత నా హనుమంతుఁ డా యద్రిమీఁద ♦ నెంతయుఁ గడకతో నేపుమై నిలిచి
యట దక్షిణము చూచి యప్పుడిట్లనియె ♦ నట త్రికూటాద్రిపై నమరెడు దాని
గదలక ధర్మార్థకామములు మ్రోఁడు ♦ పొదిగొన్న సిరి వోలెఁ బొలుపొందు దాని
నమరావతీపురం బబ్ధిమధ్యమునఁ ♦ గమనీయగతి నొప్పు గలిగిన దాని
నలకకుబేరుతో నలుకమైన చట ♦ నెలకొన్నకైవడి నెగడెడు దానిఁ
గలకాలమును నధోగతి నుండ లేక ♦ తెలివిమై భోగవతీనగరంబు
జలరాశి వెలువడి సరి త్రికూటమున ♦ వెలసినకైవడి విలసిల్లు దాని
నంబుధి యా వరణాంబువుల్గాఁగ ♦ బండిన ప్రభ నొప్పు బంగారుకోట
బ్రహ్మాండవిధముగాఁ బరికింప నొప్పు ♦ బ్రహ్మాద్యభేద్యమై పరఁగెడు దాని
మొనసి లోకములకు మొనయెక్కుడగుచుఁ ♦
బొలుపొంద బహుదివ్యభోగసంపదల ♦ నలిమీఱ నెక్కుడై యందంద వెలఁగ
నలినసంభవు గేహ మన నొప్పు నట్టి ♦ లలితమై యొప్పెడు లంకాపురంబు
కనిచాల వెఱగంది కనురెప్పఁ బెట్ట ♦ కనిలతనూభవుం డందందఁ జూచి
యెల్లలోకంబులు నెక్కటగెలిచి ♦ బల్లిదుఁడై పేర్చు పంక్తికంధరుఁడు
ఇట్టిసంపదలచే నెనయు నీలంకఁ ♦ బట్టాభిషిక్తుఁడై బ్రదికిపాలేది
సకలేశుఁడగు రామచంద్రుని దేవి ♦ వికలుఁడై కొనివచ్చి వీఁడేలపాలిసె
నని వానిదూషించి యాలంక చొరఁగ ♦ ననువు విచారించి యాసత్త్వధనుఁడు
తగ లంక యుత్తరద్వారంబుఁ జేరి ♦ తగవున నీతియుఁ దలఁబోసి మఱియు
యీసముద్రము కపులెట్లు దాఁటెదరు ♦ వాసి దాఁటిననైన వాసవాద్యులకు
సాధింపమిగుల నసాధ్య మీలంక ♦ సాధింపనలవియె సకలయత్నముల
భీమసాహసమునఁ బేర్చు రావణుని ♦ రాముఁ డెట్లు జయించు రణములో నెదిరి
యనిముహూర్తము తనయాత్మఁ జింతించి ♦
మనమున శ్రీరాము మహిమంబు దెలిసి [శ్వరున
యీసముద్రం బెంత యీలంక యెంత ♦ యీసురారియు నెంత యినకులే

కనితిరస్కారంబుగాఁ దలపోసి ♦ యనలేనిపొడవైన యామేనితోడఁ
బగటుననీపురిఁ బగలుసొచ్చినను ♦ బగలెఱుఁగు రాత్రిసభటులకునాకు
జానకిఁబొడగానఁ జాలనేనట్లు ♦ కానసూక్ష్మాకృతిఁ గైకొనిపోయి
యీలంకదైత్యుల నెల్లవంచించి♦వాలాయమునఁగాంతువై దేహివనుచు
మదిలోనసూర్యాస్తమయమొప్పగలఁచి ♦
పదిలుఁడై యెంతయు బరికింపుచుండె ♦
నవిరళసత్త్వుఁడై యఖిలేశుదేవి ♦ నవనీతనూభవ నరసిపోవచ్చి
నేనున్నననువుగా దీలంకచొరగ ♦ వీనికినన్నట్లు వెసఁగుంకెనినుడు
అనిలనందనునకు ననమిచ్చెదైత్య ♦ ఘనపాపమునుబూని కలగొనబర్వె
ననబర్వెగలయ ఘోరాంధకారంబు♦ఘనమైనదైత్యుల కలకలంబణగె
నంత నాకలకలం బణగుటనాత్మ ♦ నంతయుబరికించి యనిలనందనుడు
మనమునరఘురాము మఱువక నిలిపి ♦ తనతండ్రివాయువు దప్పక వేడి
మార్జాలమాత్రుడై మఱిలంకజొచ్చి ♦ కర్జమూహింపుచుఘనులరాఘవుల
దలచుచుమెలగ నత్తఱివిస్మయముగ ♦ గళితభయంకరాకారంబుతోడ
బెన్నిధిసాధింప బ్రీతిమైనరుగు ♦ చున్నసాధకునకు నొగినడ్డపడగ

—:* హనుమంతుఁడు లంకాపురి జొచ్చుట *:—

వడిమహాభూతంబు వచ్చుచందమున ♦ నడరిలంకిణివచ్చి యడ్డమైనిలిచి
యట్టహాసముచేసి యనిలనందనుని ♦ ధట్టించిపలికె క్రోధంబు రెట్టింప
నీవెవ్వడవుమఱి నీకుబేరేమి ♦ నీవీపురంబులోనికి వచ్చుటెట్లు
ఎవ్వరుబంచినా రెఱుగింపుమనిన♦నవ్వాయునందనుం డచలుఁడై పలికె
నీవెవ్వతెవు మఱినీకుబేరేమి ♦ నీవేలయడ్డమై నిలిచితినాకు
మున్ను నీవెఱుగింపుము పిదపగూ వెనక♦నున్నట్లు నాతెఱంగొప్పజెప్పెదను
ననిపల్క నేను దశాననునాజ్ఞ ♦ బనిబూనియీపురి బలిమిరక్షింతు
బేరులంకిణియండ్రు పెరవారిగన్న♦భోరనఁబోఁగొందు భోనీకయనిన [సు
హనుమంతుడయ్యింతికనియెవెండియును వనితయీపురిజూచువాడనై యే
జనుదెంచితినివేగ చనగనిమ్మనిన♦గనలుచుకోపంబు కఱుకురక్కసియు
నెక్కడబోయెద విక నాచేత ♦ చిక్కితిగాకంచు చెలగిమైబెంచి
కఱకఱినినుబట్టి కదిసినీమేను ♦ దఱిగినీరక్తము ద్రావుదుననుచు
గడుగోపమెసగ నక్కపివాధురోమ్ముఁ♦పొడిచిన పొలతిజంపుట పాపమనుచు
దడయక మారుతి దానివక్షం ♦ పిడికిటబొడిచిన బెంపెల్లబోలిసి
యిలగూలిమిక్కిలిహీనస్వరమున♦బలుమారుహనుమంతు బ్రార్థించిపలికె
గపికులోత్తమనన్నుఁగరుణింపవయ్య♦నిపుణుఁడై యీపురినిర్మించునాఁడు

వలనుగాదనుచు భావమున నెన్నుచును కలయఁ దా వెదకుచుఁ గానక ఎచట
జప్పుడుగాకుండఁ జనుచుముందఱను ♦ విప్పైనయొకరత్న వేదికమీఁదఁ
బువ్వుపాన్పుననిద్రఁ బోయెడువాని ♦ నవ్వాసవునిభోగ మణఁగించువాని
సంజకెంపులతోడ జలదంబుఁబోలె ♦ రంజితగంధాంగ రాగంబువాని
నీలైనసెలయేర్ల నీలాద్రివోలె ♦ దేటముత్యపుపేర్లు దీపించువాని
నైదుమస్తములఘోరాహులఁబోలె ♦ బ్రోదినంగుళిరమ్యభుజములవాని
జిలుఁగువెన్నెలతోడి చీఁకటివోలెఁ ♦ జలువదుప్పటిమేన జతనొప్పువాని
వెడఁదతొమ్ములనొప్పువేల్పుటేనుంగు ♦ కడిదికొమ్ములనపోటుకైపులవాని
కర్పూరమణిదీప కళికలిర్వంక ♦ నేర్పుమైఁగదలించు నిట్టూర్పువాని
మకుటకుండలదీప్తినుదయమూర్తివాని ♦ సకలారిగర్వనిస్రావణుండైన
రావణుఁడనువాని రాక్షసాధిపుని ♦ భావించియాతని పార్శ్వభాగముల
నడపంబుగట్టియు నాలవట్టములఁ ♦ గడువేడ్కఁబట్టియుఁ గరకంకణములు
రాయంగవింజామరములు వేసియును ♦ హాయిగాఁ బాడియు నాడియు వీణ
మీటియుమద్దెల ల్మృదుమార్గలీల ♦
సూటివాయించియు సొక్కియొ డొరులు
తమసాధనంబులు తగఁగౌఁగిలించి ♦ తమినిద్రఁబోవు గంధర్వకామినుల
దేవకామినుల దైతేయకామినుల ♦ భావించియుంత నా పరమపావనుఁడు
గగనమండలిచంద్ర కళయునుబోలె ♦
మొకులుచెంతమెఱుంగు మొలకయుఁబోలె
నారావణునిశయ్య నభినవయావ ♦ నారూఢయై దేవతాంగనకరణి
నున్నమండోదరి నొయ్యనఁగాంచి ♦ యన్నెలఁతుకసీత యనినిశ్చయించి
యవనిజనేఁగంటి నను మనానంద ♦ వివశుఁడై గంతులు వేయుచునచటి
కంభములప్రాఁకుచుఁ గలితవాలాగ్ర ♦
చుంబనంబునరింపుచును నటింపుచును
గాపేయజాతి వికారముల్గాంత ♦ సేపిటుచూచుచుఁ జిత్తంబులోన
మఱివివేకముఁబూని మనుకులేశ్వరుని ♦ తెఱవపతివ్రతాతిలకంబుపరమ
పావనిజనక భూపాలునిపుత్రి ♦ దేవదేవుని రామదేవునిఁ బాసి
రావణుఁగోరునే రాగిల్లిమధువు ♦ ద్రావునేయట్లేల తనబుద్ధిభ్రమసె
నానావిధంబుల నాకుఁజూచినను ♦ దానవిగానియీ తరళాక్షిసీత
గాదనిదెలిసి యక్కడనుండకవల ♦ మేదురపరికరాభ్రమేడితామోద
మానితాసవరక్త మధుమాసయుక్త ♦ పానశాలాపరంపరలెల్లఁజూచి
గరుడోరగామర గంధర్వసిద్ధ ♦ నరసతుల్చెఱలున్న వాడలుచూచి

—*: హనుమంతుఁడు ఉద్యానవనంబుఁ జూచుట :*—

వారిదుఃఖంబులు వారియాపదలు ♦ నారంగ వీక్షించి యాత్మలో వగచి
వెఱవకుండిట మీఁద వినురాముఁ డింక ♦ నెఱి రావణుని నాజి నిర్మించి మిమ్ము
విడిపించు నందఱు వెఱవకుఁ డింకఁ ♦ దడవు లేదని వారి దగ నూఱడించి
నీడల నందంద నిలిచి యేకాంత ♦ మాడెడువారల నటఁ జేలఁ బోయి
యిది నాకుఁ జోరఁబోలు నిది నాకుఁ బోల ♦ దిది నాకుఁ జోరదచ్చు నిది నాకు రాదు
అనక లంకాపుర మంతయు వెదకి ♦ మనుజవేషము తోడ మగువ నెబ్భంగి
నెందును బొడగాన కిచ్చలో వగలఁ ♦ బొందుచు నటఁ బోయి పురసమీపమున
బసిఁడికోటల చేత భాసిల్లుచున్న ♦ యసమానమైన యుద్యానంబుఁ గాంచి
మెల్లన నటఁ బోయి మెలఁగి వీక్షించి ♦ యల్లనల్లనఁ బ్రాకి యాకోట లెక్కి
చ దనపున్నాగ సహకారతరుల ♦ మందారఖర్జూర మాతులుంగముల
బనసపిప్పలినింబ పాటలీవకుళ ♦ ఘనసారసౌవర్ణ కర్ణి · రముల
మల్లికా మాలతీ మాధవీలతల ♦ సల్లకీకురునతి జంబీరతరుల
దాలతమాల హింతాలరసాల ♦ నాళికేళాశోక నాగవల్లరుల
నేడాకుటరటుల నేలాలవంగ ♦ దాడిమనారంజ తక్కోలతరుల
గదళికా కేతకీ క్రముక పూగముల ♦ బదనై నగోస్తనీ ఫలగుళుచ్ఛముల
బరిపక్వబహుపుష్ప పరిమళమిళిత ♦ భరితమై వాయు సంపదలనింపెక్కి
కలకంఠ శుకనీల కంఠ శారికల ♦ జెలువొందుఃళులచేఁ జెలువగ్గలించి
కమలాకరంబుల గరము శోభిల్లి ♦ కుముదషండంబులఁ గొమరు దీపించి
శశికాంతవేదుల సన్నుతికెక్కి ♦ విశదచంద్రికల చే వేట్కసొంపెక్కి
సికతాతలంబుల చే జెన్నుమీరి ♦ సకలర్తువిహరణ స్థానమై మిగుల
రమణమైనది చైత్రరథము సమించి ♦ యమరేంద్రు నందన మనచూడ నొప్పి
యలరు రావణ వినోదారామభూమి ♦ గలయంగ గనుగొని కడు సొద్యమంది
యొప్పు నావనభూమి కొయ్యన డిగ్గి ♦ చప్పుడు కాకుండ జరణంబు లిడుచు
గొలఁకులయందును గూలంబునందు ♦
బులినదేశములందు బొదరిండ్లయందు
కేళీగృహములందు గృత్రకాద్రులందు ♦ శైలశృంగములందు సానువులందు
నుర్వీరుహములందు నోలంబులందు ♦ మర్వోలె నూభవ నడుగక వెదకి
అవనమధ్యంబునందు రేబగలు ♦ కావలియుండువారాక్షసకోటి కెపుడు
దావలంబై మిన్ను తలదన్ను పొడవు ♦ చే వెలుంగుచు మేరుశిఖరాళి గేరు
పసిడికంభములచే బసమీరి వేయు ♦ పసిడికంభములచే పఱపు దీపించి
వరరత్నతోరణావళుల శోభిల్లి ♦ యురుతరంబగుచున్న యొకమేడ గాంచి

యా మేడలోపల నంతయు వెదకి ♦ భూమిజ గానక బుద్ధిలో వగచి
యినవంశవల్లభు డేకతంబునను ♦ ముకు నన్ను రమ్మని ముదమొప్ప బిలిచి
జనకజ పొడగాన జాలుదు వీవ ♦ యని చెప్పి నా చేత గానవాలిచ్చి
బనిబూని వచ్చితి బంటనై యేను ♦ గనుగొన లేనైతి గమలాక్షి నెందు
నీచు రాత్రించరు నీశు నిట దెచ్చుచోట ♦ వేవేగ ప్రాణము ల్విడిచెనో యింతి
యంబరగతిభీతి నగు దెంచుచోట ♦ నంబుధి బడియెనో యసుర చేదప్పి
యిప్పటి దనుజులు శిక్షించి రొవరి ♦ చచ్చెనో ఘోరహాగ్ని సమసెనో లేక
కమలాక్షి నొకచోట గానరాకుండ ♦ భ్రమబెట్టి మాయలు పన్నెనో వీడు
వాంఛ దేశంబుల నునిచెనో కాక ♦ దండించి చంపెనో తరలాక్షి నసుర
యేమని మగుడుదు నే మంతు భోయి ♦ యేమి సేయుదు నింక నిట మీద నేను
వామాక్షి గానక వచ్చితి ననిన ♦ రాముడప్పుడె బాయు బ్రాణవాయువుల
నన్నకై సౌమిత్రి యుడుగు నీ వార్త ♦ విన్నంత భరతుండు విడుచు బ్రాణముల
వలనికై శత్రుఘ్ను డఖిల బాంధవులు ♦ హతులై రవివంశమంతట సమయు
నది జూచి సుగ్రీవు డంగదుండు మొదలు ♦ యిన కపివంశము నాశమొందు
గాన వానప్రస్థ గతిబూనుటొప్పు ♦ నేను గాపుండుదు నిదియు గాదేని
సాంబ జేర్చుకొని యుగ్రతాపసుండగుదు ♦ యుదధి బడి చత్తును సురాసదక్కి-
యక్కట సంపాతి యడిగినమాట ♦ నిక్కంబు గామి నీ విధి నేటి
యిప్పటికో తెమ్మి యేనచ్చు మెల్ల ♦ నచ్చుగా వృథయయ్యె నౌగాక యేమి
త్రిదశులతో గూడ దెగువమై పేర్చి ♦ త్రిదశేంద్రు బట్టి బాధింతునొండేని
చెలగి కీలలతోడ శిఖి నిట ముంచి ♦ యిప్పు బ్రహ్మప్రభృతుల మాయింతునొండేని
క్రందుగా జముని కింకరులతో బట్టి ♦ దండంబు బగుల దండింతునొండేని
చలమొప్ప నిర్ఋతి రాక్షసులతో గూడ ♦ బెట్టుగ బట్టి నొప్పింతునొండేని
కరుసలి వయ్యెడు గాడ్పుల బెంచి ♦ కెరలి యుద్దండత శిక్షింతునొండేని
వలిరేగి ధనదు గిన్నరుతో బట్టి ♦ చెలువేదికూల భర్జింతునొండేని
యొనగూర బ్రహ్మాదులతో నీశాను బట్టి ♦ చెనసి యొండొండ శిక్షింతునొండేని
కుతలంబు గిరులతో గుమ్మముసాలె ♦ తిరుదప్పి పిప్పియుక్క డతునొండేని
యీ లంక దైత్యుల నిగ్రహించి ♦ లీలమై గలచి కారింతునొండేని
యేమంత చేసిన నెల్ల దేవతలు ♦ నాయంతులై వచ్చి యతివ జూపెదరు
కాకున్న రాఘవు ల్కరుణమైదామె ♦ యీకీడు పలదని యింక మాన్పెదరు
యనినిశ్చయము జేసి యా మేడశిఖర ♦ మనిల సందను డెక్కె నాసమీపమున

—:* హనుమంతుడు సీతను జూచుట *:—

వాయువు నందయు వడిజొరరాని ♦ యాయశోక వనాంతరావళిలోన

నెలమిజొంపరిగూడు హేమవర్ణమున♦విలసిల్లుశింశుపా వృక్షంబు క్రింద
వ్రతములగడుడస్సినవటులగృస్సి♦గాలిగుంభుగుంభుగు నది యాత్మలో గంది
విపులాశ్రువులదోగి విరహాగ్నిగ్రాగి♦కపటవృత్తిం జిక్కి కడుమట్టుస్రుక్కి
జీవంబుపైనాసి చెలువంబుగాసి♦యాకధిమపదూరి యలపతమీరి
చెక్కుటచెయిచేర్చి చింతలకోర్చి♦గిన్కలేమిదలంచి నృతిదూరడి చి
యినరశ్మివాడిన యలడిగెబోలె♦ఘనధూమయుతదీప కళికయుబోలె
జలదమాలికలోని శశికళవోలె♦బలుమసుంగు దివి పద్మినివోలె
చెలగిపిల్లులలోని చిలుకయుబోలె♦బులులలోనావును బోలెదుర్వార
ఘోరరాక్షసవధూ కోటిలోనున్న♦నారీశిరోమణి నలినాయతాక్షి
మలినాంగిమళివేణి మాతంగగమన♦కలితభూషణజాల గద్గదకంఠి
జనితోష్ణనిశ్వాస సతతోపవాస♦జనకతనూజాత జగదేకమాత
నిఖిలసన్నుతపూత నిర్మలఖ్యాత♦యఖిలగుణోపేత యయినయాసీత
బొడగనిసీతగా బోలుబొమ్మనుచు♦గడుభక్తిరామ లక్ష్మణులకు మొక్కి
కడువేడ్కసురలను గడిగివేడుచును♦పెరిగముదమున నా మేడడిగ్గి
మదినుబ్బియంగుష్ఠ మాత్రుడైకదిసి♦పదిలుడై యాశింశుపావృక్ష మెక్కి
బాలుడై యలవట పత్రంబునందు♦నేలన్గ్రసించు విష్ణుండుపోలె
శాఖామృగేంద్రుండు జిగిగొమ్మదాగి♦శాఖలలోదాగి చతురుడై యుండె
పావనచరితుడా పద్మాయతాక్షి♦భావించి చింతించి పలుమారుజూచి
కడకతోబుశ్యమూకమునందునున్న♦తొడవులునీయున్నతొడవులు జూడ
నేకప్రకారంబు లైయున్నవనుచు♦కాకుత్స్థుతి సీత గాబోలుననుచు
మఱియునుబరికించి మారుతాత్మజుడు♦నెఱసినబుద్ధిమై నెలతనీక్షించి
శ్రీరాముడానతిచ్చిన ప్రకారమున♦నారయచామణి యవయవశ్రీలు
కర్ణవేష్టనములు కరకంకణములు♦స్వర్ణాంబరంబును సరిబరికించి
వలపంతబడి వ్రేగువారిచిహ్నములు♦వలనొప్పగ పతివ్రతలచిహ్నములు
చదురుగల్గినమర్త్యసతులచిహ్నములు♦

చెదరకన్నియుజూచి చింతించిమఱియు
గానకానిరాము బేర్కొనిప్రలాపింప♦గనుగొనిమఱిసీతగా నిశ్చయించి
యావిన్ననగుమోము నాకృశాంగంబు♦నావిరిసినవేణియా యున్నయునికి
యాదురవస్థయు నావిలాపంబు♦నాదైన్యమునుజూచి యాత్మశోకించి
చంద్రునిబాసిన చంద్రికరీతి♦చంద్రాస్యయారామ చంద్రునిబాసి
యుండునే యీయింతి నాగిబాసిరాము♦

డుండునేయిది సోద్యమూహించిచూడ

గులశీలదాక్షిణ్య గుణవయోధర్మ♦లలితరూపములొక్కలాగొటజేసి
యారామవిభునకీ యంగనామణియు♦నీరామకారామ నృపతియుదగును
ఈకాంత కైకాదె యినకులేశ్వరుడు♦
శ్రీకంఠువిల్లుద్రుంచె జెఱకుచందమున
దొలుతబట్టినయంతద్రుంచెవిరాధు♦నలిగోసెనాశూర్పణఖముక్కు చెవులు
ఖరదూషణాది రాక్షసులఖండించె♦మరణంబునొందించె మారీచునీచు
వాలినొక్కమ్మున వధియించికపుల♦నాలుగుదిశల కున్నతశక్తిబనిచె
వారిలోపలనన్ను బలవంతుడనుచు♦నారూఢగతి నంగదాదులగూడి
ఘనపుణ్యనిధియైన కాకుత్స్థునెదుర♦బనిబూనివచ్చితి బంతంబు మెఱసి
నాపుణ్యవశమున నాకోరినట్లు♦నీపుణ్యవతిగంటి నిచ్చోటవచ్చి
దారుణాసురవధూతతి నట్టనడుమ♦గరణాకృతి జిక్కగలుగునీసతికి
నెబ్బంగిజూపుదు నింకనారూపు♦నెబ్బంగిభాషింతు నీయింతితోడ
నెబ్బంగినూరార్తు నీపుణ్యసాధ్వి♦నెబ్బంగినిబ్బంగు లెరుగింతుసతికి

—: * రావణుండు సీతాదేవివద్దికి వచ్చుట * :—

ననియిట్లుచింతింప నంతరావణుడు♦జనకజజింతించి సంతాపమంది
వేకువజామున వేగమేల్కాంచి♦తేకువమనసి జాధీనచిత్తమున
దివ్యమాల్యంబులు తెఱగొప్పముడిచి♦దివ్యగంధంబులు తెఱగొప్పబూసి
దివ్యామాల్యంబులు తెఱగొప్పగట్టి♦దివ్యభూషణములు తెఱగొప్పబెట్టి
తనకిరీట ప్రభ తతు లెందుబర్వ♦ఘనచంద్రహాస సంకలితుడై పేర్చి
కరమణికంకణ క్వణనముల్మెరయ♦సరసనచ్చరలు వింజామరలిడగ
ఘనకుచహారముల్గ్రాలగంధర్వ♦వనితాజనము లాలవట్టముల్పట్ట [వ
గొడుగులుధరియించికుచమూలరుచుల నడయాడుచున్నకిన్నరసతుల్నడు
బాహుపార్శ్వంబుల బరగంగహస్త♦వాహికలై యక్షవనితలునడువ
బరిమళోదకపాన పాత్రికల్పట్టి♦గరుడకామినులిరుగడలనేతేర
నెడనెడసందడి నెడగల్గజడసి♦కడగిముందట నాగకన్యకల్నడువ
విద్యాధరస్త్రీలు వీణాదివాద్య♦నృత్యసంగీతంబు లింపుగాబాడ
ఘనగుణోన్నతులొగి దగసిద్ధసాధ్య♦వనితలుజేరి కైవారముల్సేయ
బాగొప్పవరఖడ్గ పాణులై కదిసి♦రాగిలివెనుక నారాక్షసస్త్రీలు
కలగొనగరదీపికాసహస్రములు♦వెలుగమండోదరి వేట్కదోడ్కొనుచు
మెఱుగులవెనుకొను మేఘంబుపోలె♦మఱియునుగల సతుల్మసిత న్గొలువ
నురుపాదహతినోలి నుర్విగంపింప♦బరిహాసరవము లంబరమునుగప్ప
మంజీరమేఖలా మణిభూషణాది♦శింజితంబులువిందు సేయవీనులకు

నాయకుఁ డా రాము డెపుడు నేతెంచె ♦
వాయుసూనుఁడు దన్ను వాంఛతోఁ జూడ
నిద్రావశేషఘూర్ణిత దృష్టితోడ ♦ భద్రకేయూరాంక బాహులతోడ
వసుధపై జీరాడు వలెవాటుతోడ ♦ వసివాళ్లువాడిన వదనంబుతోడ
ఘనతరభీషణాకారంబుతోడ ♦ జనకజముందరఁ జనుదెంచి నిలచె
నిలచిన భీతిల్లి నివ్వెరగంది ♦ తలపులో రఘురాము దప్పక నిలిపి
యూరులు నుదరంబు నురుకుచద్వయము ♦ చారుహస్తంబుల జక్కఁ సవరించి
పులిగన్న లేడిని బోలె చిత్తమున ♦ గలఁగుచున్నట్లున్న కల్యాణిఁ జూచి
వనితలలోన దుర్వార గర్వమునఁ ♦ దను దైవమాడింప దగవేఁటి బలికె
నింతి నీ తనుమధ్య మిఁక దాచనేల ♦ కాంత నీ నెమ్మోముఁ గ్రైవ్రాల నేల
పొలఁతి బల్మిని బట్టి భోగించువాఁడ ♦
నెలత యీగుణముల నెఱిఁగనుంగొనుము
వనిత యీగుణముల వలెదు నన్నుఁ ♦ గొనుము నీ యనుమతి గోరియున్నాఁడు
మానక కైకొందుమగువ నిన్నింకఁ ♦ గాన నా మాటలు గైకొని వినుము
ఈరూపమున నుండ నేమి కారణము ♦ దారుణాటవి దాటి తమ్ముఁడు దాను
వనిత రాముఁడు వచ్చి వనధి బంధించి ♦ పనిచి నకడిమిమైఁ బద్దు సాధించి
గొనకొన్న వేడ్కతోఁ గొనిపోవు నిన్ను ♦ నని విచారించెద వాత్మలో నీవు
అమరేంద్రయమవరుణాదులకైన ♦ సమరంబులో నన్ను సాధింపరాదు
ఈ బేలతన మేల యిందీవరాక్షి ♦ నా బాహుశక్తికి సరులెంతవారు
అడవుల నాకులు నలములు నమలి ♦ యిడుమలు పడుచున్న హీనమానవుని
పొందేల కోరెదు పొలఁతి నన్ బొందు ♦ పొందనొల్లవె రాజ్యభోగంబులకట
యనిమిషాధిపుఁడైన నంతకుండైన ♦ వినుజలాధిపుఁడైన విత్తేశుఁడైన
ననలనైరృతివాయుహరిహరులైనఁ ♦ జనుదెంచి యీలంక సాధింపలేరు
లంక మానవులకు లక్షింపఁదరమె ♦ యంక నెక్కడి రాముఁ డిందెటు వచ్చు
వచ్చి లంకాపుర వరమెట్లు చొచ్చుఁ ♦ జొచ్చిన నెబ్భంగి స్రుక్కక యెదురు
నెదిరిన బొడఁగని యెబ్భంగిఁ గదియు ♦ గదిసి నా సత్త్వమే గతి నైపఁజాలు
జాలుట యెరిఁగదా కసముకూరఁ బోలుఁ ♦ బోల వీమాటలు పోవిడు వింతి

—:* జానకి రావణుని తిరస్కరించుట *:—

అని యిట్లు పలుమాఱు నరమి రావణుఁడు వినరాని పలుకులు వెసదూఱి పల్కఁ
గడు నల్గి గద్గద కంఠంబుతోడఁ ♦ బుడకద్రుంచి యవశ్యమును రాము చేత
జెడుదు నీవని చాటి చెప్పిన రీతిఁ ♦ బడఁతుక తృణము చేపట్టి యిట్లనియె
పాపాత్మ నీవు నా పతిఁ డాఁగురించి ♦ యేపున లంకలోనికి నన్నుఁ దెచ్చి

యిదియొక్క కడిమిగా నేఁ గర్వించె ♦ దిదియొక్క మేలుగా నేల ప్రేలెదవు
పరవధూరతిఁ గోరు పాపాత్మునకు ♦ సిరులు నాయువుఁ గీర్తి చెడునటుగాన
తగవును ధర్మంబు దలపోసి నన్ను ♦ మగుడ సీతారామునకిమ్ము మనఁ గోరితేని
కాదేని దుర్బుద్ధి గైకొంటివేని ♦ కోదండదీక్షాగురుని శ్రీరామ
జననాథు చేనీవు చచ్చుట నిజము ♦ వనవాసి కృశుఁడు కేవలదుర్బలుండు
ననదరాజ్య విహీనుఁ డసహాయుఁ డతఁడు ♦
మనుజమాత్రుఁడటంచు మది నెన్నవలదు
దండకాటవి చతుర్దశసహస్రోగ్ర ♦ చండరాక్షసకోటిఁ జంపఁడే తొల్లి
దండధరోద్దండదండంబు దీసి ♦ చండాంశుకిరణోగ్ర సంరంభ మణఁగ
గణనాపరంపరల్ గదిసి చెండాడ ♦ రణభీషణంబులైన రాము బాణములు
పరువడి నీలంకపైఁ బాఱునాఁడు ♦ తరమిడి నీ పురస్థలి గాలునాఁడు
మును కోసి నీ శిరంబులు ద్రుంచునాఁడు ♦ మును మిడిసిన రక్తంబు లుగ్రోలునాఁడు
రావణ నీలావు రఘురాము లావు ♦ నీవు చూచెదు గాని నేనేమి చెప్ప
నెండతోఁ బ్రాలేయ మెదిరించినట్లు ♦
కొండతో దగరు తాఁకినచందమున
మదహస్తితో దోమ మార్కొన్నకరణి ♦ నుదధితోఁ గాల్వ మొడ్డినపగిది
శతర్యుతో వేము శ్రీశుతో జోగి ♦ ధాత్రితో విప్రుండు ధనికుతోఁ బేర
జాతిరత్నము తోడ సరిగాజుపూస ♦ భూతలంబున సరివోల్చినయట్లు
తెగువమై రాఘవాధిపునకు నీకు ♦ మొగి ♦ టెమనుపహాసి మహదంతరంబు
మిగుల నోరులు గల్గి మిణిసి పల్కెదవు ♦ జగతి రామునితోడ సరియె రాక్షసుఁడ
ఒకలక్ష యేలుచు నుబ్బెదవీవు ♦ సకలలోకములకు స్వామి రాఘవుఁడు
అఖిలకంటకుఁడవీ వన్నిలోకముల ♦ సఖిలలోకారాధ్యుఁడా రాఘవుండు
వేదచోరుఁడవ వివేకివి నీవు ♦ వేదంబులకు నెల్ల వేద్యుండతండు
కర్మపూరితఘన కాయుండవీవు ♦ నిర్మలగుణతోయనిధి రాఘవుండు
సర్వజీవాళిభక్షకుఁడవు నీవు ♦ సర్వజీవులకును సముఁడు రాఘవుఁడు
ఉన్నతోన్నతుఁడైన యుర్వీశునకును ♦ ఎన్నిసారెల పెట్ట నెఱుఁగంగ నీవు
ఇందుసూర్యాగ్నిసురేంద్రులుఁ గారు ♦ ఇందుధరార్చితుం డినవంశజుండు
నిన్నిట మర్దించి నీ రూపమణఁచి ♦ నన్నుఁ దోడ్కొని పోవు నమ్ము మింతటికి
నాకు నీకును సాక్షి నను దెచ్చునపుడు ♦ గ్రద్దకోన యొకపక్షి కడఁగి యేతెంచి
నీలావు శక్తియు నీ పరాక్రమము ♦ నేలపాలుగఁ జేసి నెత్త్రునేసి పిలుపఁ
గపట భాషలు పల్కి ఘనపక్షినాథు ♦ నపుడు ఖండించిన యధముఁడవీవు
తరమెఱుంగక రామ ధరణీశుతోడ ♦ దొరలితే ధ్వస్తమై త్రుంగెదు గాక

యేమిటికెదురు దన్నెఱుఁగనిమాట ♦ లేమిటికీగర్వ మినకులేశ్వరుఁడు
ఈమూఁడుజగముల నెందుడాఁగినను ♦ ఈమెయునిన్నేల యిట్లుండనిచ్చు
ననినరావణుఁడు మహారోషదృష్టి ♦ జనకజమతిజూచి చలముతోననియె
బరమేష్టిదపమునఁ బరఁగమెప్పించి ♦ వరశక్తినతనిచే వరములుగాంచి
సురపతిమొదలుగా సురలనోడించి ♦ గరళకంధరుతోడఁ గైలాసమెత్తి
కడిమిమైనూర్ధ్వ లోకములుసాధించి ♦ వడిబేర్చిపాతాళ వాసులనోర్చి
సకలోన్నతుండనై సడిగన్ననన్ను ♦ వెకలియైతమతండ్రి వెసలంగద్రోవ
నతిహీనసత్త్వుడై యడవులలోన ♦ బతిమాలిఫలముల బర్ణాశనముల
వికృతాంగుడై తపోవృత్తిమైనన్ను ♦ నొకపేదమానవుఁ డోపునేచనక
ననిరామునిందింప నందందబొగిలి ♦ మనమునసొగిలి యుమ్మలికంబుమిగిలి
ఘనశోకగద్గద కంఠయైయుపుడు ♦ ఇనకులాధిపుదేవి యెలుగెత్తియేడ్చె
ధృతిదూలినలుఁగడ దేవగంధర్వ ♦ సతులెల్లనేడ్చిరి జానకిజూచి
రావణుగర్వంబు రమణిశోకంబు ♦ భావించి కోపతాపంబులునిగుడ
ననిలతనూభవుఁ డప్పుడాదుష్ట ♦ దనుజుపైలంఘింప దలపోసిచూచి
బిరుదనై వీని జంపితినేనిపతికి ♦ ధరణిజసేమంబు దగజెప్పగలను
అమరారిచేత నాయసువెల్లబొలసి ♦ సమరంబులోపల జచ్చితినేని
లంకదిక్కెఱుగక లలననెవ్వగల ♦ నింకుచునిందున్కి యెఱుకచొప్పడక
యేతుజచ్చుటయును నేర్పడవినక ♦ భానుకులాగ్రణి ప్రాణముల్విడుచు
నింతజేసినచేత లేమియుగాక ♦ నంతయుజెడిపోవు నధిపుకార్యంబు
ఎడపకనిటమీఁద నీదైత్యుతోడ ♦ కడఁగికయ్యముసేయ గలవాఁడగాను
దనుజులోఁబోరాడి దర్పించిగెలుతు ♦ ననితలంచినగెల్పు నదిగానరాదు
అనినిశ్చయముచేసియాత్మలోమున్న దనుజులోఁబోరుటతగవుగాదనుచు
నెలఁతనుదర్శించి నిష్టతోఁబిదప ♦ గలకార్యములుసేయ గలవాఁడఁగాని
అనిసేయునిది సమయముగాదునాకుఁ ♦ ననిధీరుడై యుండె నాప్రమానిమీఁద
మఱియురావణుఁడు కామంబుప్రేమంబు ♦

వెఱపురునొఱపును వెఱగునుగదుర
నాడినమాటల కన్నిటికాత్మ ♦ నోడకయతినిష్ఠురోగ్రవాక్యముల
వనితలందఱువిన వసుధాతనూజ ♦ తనదూరబల్కిన దనుజేశుఁడంతఁ
గుటిలభావమున భ్రూకుటిలసన్నిటలు ♦ చటులరక్తాస్యుఁడై జాజ్వల్యమాన
లోలకీలాభీల లోకసంహార ♦ కాలాగ్నిరీతి నాగ్రహమునసుండి
ఘోరహుంకారుఁడై క్రూరుఁడై నీతి ♦ దూరుఁడైయాసీతఁ దొడరిభర్జించి
చంద్రహాసంబెత్తి జానకినేయ ♦ నింద్రారిగమకించు నెడఁగేలుబట్టి

## —*: మండోదరి రావణునికి నీతిదెల్పుట :*—

యమలమండోదరి యడ్డమైనిలిచి ♦ కోమరొప్పఁబలికె నాకుమతియావిభుని
దండిమై నెదిరిన ధరణిపాలకుఁడె ♦ ఖండింపనీకునీ కాంతనై త్యేశ
యెన్ని చెప్పిన వినవేమిసేయుదును ♦ నిన్ననఁబనియేమి నీపురాకృతము
మ్రుచ్చిలిపరసతి మునుఁదెచ్చుటొకటి ♦ చెచ్చెఱభువినిందఁజెందుట రెండు
తెగువతోడుతబట్టి తెచ్చిన మొదలు ♦ పగగొనియుండుటేర్పరుపగా మూఁడు
ఒనరదుర్బుద్ధినా యువిదనుగూడి ♦ యనుభవించెద ననుటారయ నాల్గు
కననుత్తమస్త్రీలఁ గడఁగిపల్మాఱు ♦ వినరానిపల్కులు వెసఁబల్కుటేను
గామమణఁపగలేక కామినిజంపఁ ♦ దామది నెంచుట దనుజేశయాఱు
తగవెంచనేర కెంతయుఁ జేసితుదిని ♦ మగఁటిమివోపుల మఱియును నేఁడు
నేఁడుఁ జేటులునయ్యె నీయింతివలన ♦ నేఁజుగడపఁగ రాదు నిజముగా నెన్నఁ
బోరిపాతకంబులఁ బుట్టయీ మేను ♦ దొరఁగినసద్గతి దొరుకునే నీకు
నభిమానవతిమాన వాంగన సీత ♦ కభిలాషపడియింత నలుగంగ నేల
నీయంతిపురమున నెలఁతలలోన ♦ నీయింతి చింతింప నెవ్వారిఁ బోలు
ననుఁగూడి క్రీడింపు నాథయీ చెంత ♦ నినువంటివానికి నీతిగాదెందుఁ
బోలిసె నేనీబుద్ధి పోపొమ్మటంచుఁ ♦ బలిమిఁదోలంగించెఁ బతికేలువాలు
కడుసిగ్గుపడిచాల కలుషించిసీత ♦ కడనున్న దుష్ట రాక్షసవధూజనుల
నతిదీర్ఘతనుల భయంకరాకృతుల ♦ సతతనిష్ఠురవాక్య సమరకర్కశుల
వినతనయోముఖవికటహేమాస్య ♦ యనుదానివారిజటయను దాసిఁ ద్రిజట
ప్రఘసమహోదరిఁ బాటించి పిలిచి ♦ లఘువృత్తిఁ బలికె నిర్లజ్జుఁడై నిలిచి
ప్రియనయోక్తులచేత బెదరించియైన ♦ భయదచేష్టలనైన బాధించియైన
మాసద్వయంబున మగువనాసొమ్ము ♦ చేసితెండిటుమీరు సేయలేకున్న
నంతటిమీఁద నయ్యబ్జాక్షిఁ జంపి ♦ యింతలింతలుకడ లిందఱుగొనుండు
అనియశోకారామ మాప్రొద్దుకదలి ♦ తననగరికిఁబోయె దనుజవల్లభుఁడు
అపుడుజానకి దానవాంగనలెల్లఁ ♦ గృపమాలితమతమకృతకవాక్యముల
బోధించిరావణుఁబొందుమీవనుచు ♦ బాధించుతఱిశూలపాణియైయొక్క
రక్కసిబెదరించి రాముఁడీలంక ♦ దిక్కుచూడఁగ లేఁడు తెఱవయాయాస
విడుమంచునొకయింతి వెడనీతిఁబలుకు ♦ మిడుమలఁబడియుండ నేలనీకిట్టు
వరియించు దానవేశ్వరునిఁ గాదేని పొరిఁగొందుననియొక్క పొలఁతిభర్జించు
చెండుఖడ్గముతల తెగఁగొట్టెదీని ♦ గండలుకమ్మఁగాఁ గల్లుతోనద్ది
చవిచూతు మనియొక్క జంతమారొలయు ♦

నవునవు నటుసేయుఁ డనియొత్తుపదురు

నీరీతిఁ బెదరింప నిందీవరాక్షి♦ధారణి తనయ కొందలమందికుంది
కన్నీరు దొరుఁగ గద్గదకంఠయగుచుఁ♦ దన్ను గారించు దైత్యస్త్రీలకనియె
దలఁప మానవులకు దానవులకును ♦ గలుగునే దాంపత్య గౌరవశ్రీలు
ఇందఱు దుర్భాష లిట్లాడ నేల♦చంద్రుని బాయని చంద్రికవోలె
భానుని బాయని ప్రభయును బోలె♦ నేను శ్రీరఘురాము నెడఁ బాయఁజాల
నా నృపాలుఁడు హీనుఁడైనను రాజ్య ♦ హీనుఁడైనను నాకు నిష్టదైవంబు
జలధికన్యక రీతి శర్వాణి భాతి♦ బలుకుఁ దొయ్యలి మాడ్కిఁ బౌలోమి మాడ్కి
రోహిణీసరణి నరుంధతికరణి♦స్వాహాంగనాగతి సావిత్రిమతిని
రతిచందమునఁ బతివ్రతనిష్ఠఁ బొదలి పతియైన రఘురాము భజియించు దాన
జంపిన జంపుఁడు శాతాసిశిరము♦ తెంపిన దెంపుఁడు ధృతి రాముగాని
యితరుల నేనొల్ల నిటువంటికల్ల♦మతముల నేనొల్ల మానుఁ డింకనిన
మందుచు వారలా మాటకు మిగులఁ♦గండక్రొవ్వునఁ బెక్కు గతులఁ గారింప
ధూళిధూసరితయై తూలి లోదారి ♦ నీలాహిఁ బోలిన నెరివేణి చెదర
నేలపైఁ బడి వేఁడి నిట్టూర్పు నిగుడ♦హా లక్ష్మణా యంచు హా రామ యనుచు
హా యత్తకౌసల్య యనుచు నార్తి♦యాయాయుత్తమాంగన యార్తిమై నేడ్వ
అంతనా త్రిజటయు నవనితనూజ♦సంతాపమటుఁ జూడఁ జాలక తొలఁగి
నెలకొని యొకచోట నిద్రించి లేచి ♦ కలఁగని రాక్షస కాంతలఁ జూచి
యొకకలఁ గంటి నే నోయింతులార ♦ ప్రకటించి చెప్పెద పాటించి వినుఁడు
రాముఁ డేనుఁగు నెక్కి రాఁ జూడఁ గంటి సౌమిత్రి భృత్యుఁడై చను దేరఁ గంటి
నా మహాగజముపై నవనీతనూజ♦ కోమలి నెక్కించు కొనిపోవ గంటి
పట్టాభిషిక్తుడై బ్రహ్మాదిసురలు♦ గట్టిగా గొల్వ రాఘవుఁడుండ గంటి
గమనీయ మగు పుష్పకము మీఁదనుండి ♦

బ్రమసి రావణు డుర్విపైఁ గూలఁ గంటి
గూలిన రావణు గ్రూరాసి యొకతె♦నీలాంబరముతోడ నెరిఁ జేరఁ గంటి
చేరి రావణుతల ల్చెలు వేదికూల్చి ♦ భూరిగార్దభములఁ బూనిన రథము
నందుగ్రమున వైచి యామ్యదిక్కునకు♦ గొందలపడి యెత్తు కొనిపోవ గంటి
గురుతరోష్ట్రము నెక్కి కుంభకర్ణుండు♦ తిర మేదదక్షిణ దిశ కేఁగ గంటిఁ
దనరాదు తోరణ తతుఃతోఁ గూడ♦వనధిలోపల లంక వడి గూల గంటి
తైలధారలఁ దోఁగి దానవులెల్ల♦నేలయూరక పడి నిద్రింప గంటి
నతికాయ మకరాక్షులా యింద్రజిత్తు♦ ప్రతనవిక్రములుర్విపై గూల గంటి
గనకపీఠంబుపై గారుణ్యమూర్తి♦యొనర విభీషణుం డుండంగ గంటి
రావణుమరణంబు రఘురాము జయము♦నీవిధంబున సిద్ధ మిటమీఁదనింక

నటుగానమీరలీ యవనీతనూజ ♦ పటుదుష్టభాషల భర్జింపవలదు
తొలగిపొండనవుడు దొలఁగినిద్రించి ♦ యరసిరాక్షసభామ లందఱున్నంత
నాసమయంబున నవనీతనూజ ♦ గాసిల్లి భయశోక కంపితయగుచు
దన్నురెన్నెలలకు దయమాలిచంపు ♦ నన్నరావణుమాట లందఁదలఁచి
శోకంబుగ్రమ్మిన శోకంబుకొమ్మ ♦ యాకొమ్మయూతగా నటులేచినిలిచి

—*: రాక్షసస్త్రీల బాధలకు జానకి పలవించుట :*—

లోలతనడవుల లోనొంటిబడిన ♦ బాలికయునుబోలె బలవింపదొణఁగె
అక్కటాదైవంబ దయయతనన్ను ♦ నిక్కడఁజెఱబెట్టి యిటులేచదగునె
ఖరదైత్యుచేజావ గలవునీవనుచు ♦ నలినసూతిలిఖించి నాఁడొనానొసట
గాకున్నమరియండ కానవనంబునకు ♦ గాకుత్స్థకులుడురా గారణంబేమి
పైడిమృగంబునకై భ్రమియింపనేల ♦ పీడిటు దెఱదెచ్చి వెతబెట్టనేల
నాకేమిచింతింప నాకూర్మివిభుఁడు ♦ లోకరక్షణకళా లోలమానసుడు
రాకేందువదనుండు రామచంద్రుండు ♦
నాకుగాఘోర కాంతారమధ్యమున
సౌమిత్రియును దానుజాలిమైదూలి ♦ యేమిగాగలవాఁడొ యెట్లున్నవాఁడొ
యెన్నఁడారఘునశౌర్యుఁడిటకేతెవచ్చు ♦ నిన్నిచదైత్యుల నెన్నఁడుక్కణచు
దుదినన్నునెన్నఁడు దోడ్కొనిపోవు ♦ నదియెన్నటికిగూడునది యెట్లుపొసగు
నీదురాత్మునిచేత నిటుచచ్చుకంటె ♦ చేమ్రింగుటమేలు చేదునునాకు
వాసినదయనిచ్చు వారిందులేరు ♦ హాలక్ష్మణాగ్రజ హాధర్మనిరత
నీకైవయేక పత్నీత్వయంబునేడు ♦ చీకాకుపడిహత్యచే జత్తుననుచు
గెరలెడుతనదీర్ఘ కేశపాశముల ♦ నురిబెట్టుకొనిచావ నూహించెనంత
ఆలోననెడమ కన్నదిరె నాసతికి ♦ వాలుమీనులచేత వనజంబుఁబోలె
వలపుతెమ్మెరచేత వనలతబోలె ♦ బాలఁతికిమఱి వామభుజమును నదరె
నయ్యెడమదహస్తి హస్తంబుపోలె ♦ దొయ్యలిదాపలి తొడయును నదరె
శుభసూచనంబులీ చొప్పుననడువ ♦ నిభరాజగమన నయ్యెడ డెంపుమాని
జనకుని శ్రీరామ చంద్రునినతని ♦ యనుజులసత్తల నటఁదలంచుచును
దనుజులచేతి బాధలజాలనలసి ♦ తనదిక్కులేమికిఁ దరళాక్షిపగవ
సుదతిచిత్తముగోని శోకంబుమాన్ప ♦ నిదినాకుతరియని యిచ్ఛఁజింతించి
రవికులక్రమమును రామపౌరుషము ♦
[illegible] వివిధభంగుల వేడవినుతిసేయుచును
మాసిమీఁదనెయుండి మారుతాత్మజుడు ♦ వాసరభాషగీర్వాణభాషయును
ఈనాటి యెఱుగునో యెఱుగడోయనుచు ♦ మానవభాషల మగువకట్లనితా

ఓమహినందన యోపుణ్యసాధ్వి ♦ యీమెయిశోకింప నేటికినీకు
మగువనీవిభుడు సేమముగనున్నాఁడు ♦ జగదేకనిధిరామ జనపాలవిభుఁడు
వనధిబంధించి రావణుసంహరించి ♦ నినుదోడుకొనిపోవు నిక్కమీపలుకు
సహజన్ముఁడైన లక్ష్మణుడుతఁగొలువ ♦
మహానియ్య మహిమతో మాల్యవంతమున
నున్నాఁడుకపిసేన లొగిననేకములు ♦ తన్నర్థిఁగొల్వఁగా దశరథాత్మజుడు
అనవుడునిదియొక్క యాకాశవాణి ♦ యనిశింశుపావృక్ష మవనిజచూడ
బన్నినసీలాభ్ర పటలంబులోన ♦ గ్రొన్నెలగతి మెఱుఁగునుబోలెజాడ
సన్నమైయామ్రాని శాఖలనడుమ ♦ నున్నమర్కటరూప మొయ్యనగాంచి
కలలోనఁబ్లవగంబు గంటినేననుచుఁ ♦ గలగియాకలకీదు కాకుత్స్థజులకు
గాకుండుగాకంచు ఘనుల దేవతల ♦ నాకాంతగొనియాడియటఁదెలివొంది
కంటకాసురకోటి గారించుకతన ♦ గంటికెనిదురనే గానరేబగలు
గాననిద్దుర లేని కలయెందుఁగలదు ♦ పూనియి కొకసారి పోలంగజూతు
ననితనవనాబ్జ మల్లనెత్తి ♦ హనుమంతుమఱియును నందందజూచి
యెందుండి వచ్చెనో యీమ్రానిమీఁద ♦
కెందును గడుఁజిత్ర మిదియొక్కకోఁతి
చెలువొప్పనరుడుభాషించుచందముననలినాప్తకులమునానాథుసేమంబు
నలవడదెలుపుచు నమృతంబులొలుకఁ ♦
బలుమాఱుప్రియములు బలుకుచున్నదియు
వానరజాతికీ వార్తలుగలవె ♦ నానావిధంబుల నాకుఁజింతింప [డిగి
కడగిరాక్షసమాయగాబోలుననుచు ♦ బడతియూరకయుండెఁ బ్రతిభాషలు
అనిలనందనుడంత నవనీతనూజ ♦ మనసులోదన్ను నమ్మమిజూచియెరిగి
యాతరువటుడిగ్గి యతిభక్తియుక్తి ♦ నాతికిదండ ప్రణామముల్సేసి
కరములుమోడ్చి యోకల్యాణినన్నుఁ ♦ బరికింపు మేనునీ పతిగూర్చుబంట
జనపతినీకు విశ్వాసంబుపుట్టు ♦ ననియిచ్చిపుత్తెంచె నంగుళీయకము
అనిచూపి మ్రొక్కిన నవనీతనూజ ♦ హనుమంతుఁగనుఁగొనియతనికిట్లనియె
అడరెడుదనుజ మాయలననుకలము ♦ నుడుకలఁబడి వేగుచుండుదుఁగాన
ననఘాత్మరఘురామ నంగుళీయకము ♦ గనియువిశ్వాసంబు గలుగదునాకు
నీవెవ్వఁడవుమరి నీకుఁబేరేమి ♦ భూవరునకునీకుఁ బొందెటులయ్యె
ఇనకులాధిపువేష మెట్టిదియతని ♦ యనుజుండుసౌమిత్రి యతఁడెట్టివాఁడు
గాకుత్స్థుఁడిప్పు డెక్కడనున్నవాఁడు ♦ నీకునేమనిచెప్పి నిన్నుఁబుత్తెంచె
నేచందమునవచ్చి తీవార్ధిదాఁటి ♦ నాచిత్తమూరడ నాతోడఁజెప్పు

—:* హనుమంతుడు సీతకు దనజన్మము దెల్పుట *:—

మనియొప్పనడిగిన నవనినందనకు ♦ హనుమంతుఁ డంతయు నట జెప్పఁ దొడఁగె
వనజాక్షి వాయుదేవత వరంబునను ♦ ఘనుఁడు కేసరియను కపికులాగ్రణికి
ననుపుత్రుఁగా నంజనాదేవి గనియె ♦ హనుమంతుఁ డనుపేర నమరినవాఁడ
వనుఁ డసుగ్రీవుఁడ న్వానరేంద్రునకు ♦ నసమాన మతిమంత్రినై మెలంగుదును
ఆతని రాజ్యంబు నాతని పత్నిఁ ♦ నాతని యగ్రజుం డగు వాలి గొన్న
మద మేదినలుగురు మంత్రులు దాను నది మొదల్ ఋశ్యమూకాద్రిపై నుండ
బటుసత్వమున బేర్చి పఙ్క్తికంధరుఁడు ♦ కుటిలుఁడై నిన్నెత్తికొనిపోవునపుడు
ఒదవిన యాక్రోశ మారకె వినుచు ♦ సుదతి విద్దల లెత్తి చూచుచుండితిమి
నెలఁత యప్పుడు మము నీవును జూచి ♦ తొలఁగక నీమేని తొడవులు పుచ్చి
నీ వస్త్రమున గట్టి నేలపై జుటయు ♦ నావేళ సుగ్రీవుఁ డవి పుచ్చి దాచి
యచ్చుగా రఘురాముఁ డటనిన్ను వెదక ♦ వచ్చి పంపాసరోవర తీరభూమిం
దానుఁ దమ్ముఁడు నుండు తఱి నంతనంత ♦ సూనుండు వారల జూచి రమ్మనుడు
నేనేగి రాముని నెరిగి యేతెంచి ♦ ఇనకులరామ భూపాలు గాన్పించి
యన్నరనాథున కర్కనందనుఁడు ♦ కన్నసొమ్ములు సూపి కడుభక్తి మొక్కి
నా తొడవులు జూచి హర్షించి రాము ♦ డాతని నిజశత్రుఁ డగు వాలిఁ జంపి
యుపకారశీలుఁడై యొప్పు సుగ్రీవు ♦ గపిరాజ్యపదమునఁ గర మొప్ప నిలిపె
నతిభక్తి సుగ్రీవుఁ డంత రాఘవునిఁ ♦ బతియుగా నిజభృత్య భావంబు మోచి
అక్షీణబలధన్యులైన వానరుల ♦ లక్షల రెండేసి లక్షఁ గపుల
గర్వాంధులగు దైత్యకటకంబు లరసి ♦ యుర్వీతనూభవ యున్నచో టెరిగి
మసలక నెలలోన మరలి రండనిన ♦ నసముఁ గపులేగి రన్ని దిక్కులకుఁ
బటుశక్తి దక్షిణభాగంబు వెదక ♦ నిటు నంగదుఁడు మొదలేము గొందఱము
చనుదెంచి పెక్కు దేశంబులు వెదకి ♦ వినుగాన నేరక నిర్వేరగంది
శోకింపనరుణుని సుతుఁడు సంపాతి ♦ మాకు లంకాపురి మార్గంబుఁ జూపి
జూపుటయును నిన్నుఁ జూడ నర్దించి ♦ యేపునం బేతెంచి యేనబ్ధిదాటి
మరియంత సూర్యాస్తమయమున నితరు ♦
తెలియకుండగ వచ్చి యీలంక జొచ్చి
విలసిల్లు నా మహా వేషంబు డాచి ♦ సొలవక నిన్నెల్ల చోటుల వెదకి
యెందును బొడగాన కిటు లేగుదెంచి ♦ యిందు నిన్ దర్శింప నేర్పడఁ జూచి
రవికులోత్తముఁడైన రాముని దేవి ♦ యవునో కాదో యని విచారించి
సృష్టీశుచే విన్న చిహ్నంబు లెల్ల ♦ దృష్టించిపిదప సందేహంబు వాసి
వలనేది యిప్పుడు వచ్చి రావణుఁడు ♦ తలకక మము బల్కు తరినున్నవాఁడ

ఘనశక్తివానితోఁ గయ్యంబు చేసి ♦ యనివానిఁ జంపెద ననివిచారించి
పూనినీ దర్శించి పొందొందనీకు ♦ నీనాథు సేమంబు నిజముగా జెప్పి
దనుజుపిమ్మటఁ జంపఁ దలపోసి కానీఁ వనిత నా ప్రాణము ల్వంచించి కాదు
అని చెప్పి రఘురాము నలపు ప్రాయంబు ♦
కనుగవ చెలువంబు గళము సోయగము
నగు మోముకళయును నఖములతీరు ♦ నెగు భుజంబుల బాగు నెరి కొనులాగు
వెడదరొమ్ము బెడఁగు పీనులరంగు ♦ నడలయందంబును నాభిచందంబు
ఘనజఘనము పెంపు కరములకెంపు ♦ తనువులక్షణమును దప్పక చెప్పి
యా శౌర్యమా ధైర్య మా బ్రహ్మచర్య ♦
మా శాంతి యా దాంతి యా మహాకాంతి
యా శక్తి యాయుక్తి యా పితృభక్తి ♦ యా శీలమా లీల లన్నియు జెప్పి
రూపించి లక్ష్మణు రూపెల్ల జెప్పి ♦ యా పుణ్యుఁ డంగుళీయ్యక మప్పుడిచ్చె
యిచ్చిన గైకొని యిపుడు ప్రాణములు ♦ వచ్చెగా యనుచు నవ్వగ నూరడిల్లి
రాముజూచిన గతి రామరాగిల్లి ♦ సేమమేర్పడ భద్ర సింహాసనమున
ప్రేమతో గూర్చుండ బెట్టిన కరణి ♦ యా మణిముద్రిక నక్కున జేర్చి
యనురక్తి నర్ఘ్యపాద్యము లిచ్చినట్లు ♦ కనుగవ హర్షాశ్రుకణములు దొఱుగ
ధూపంబు దీపంబు దోఁపఁ డనొసగి ♦ యేపార సాష్టాంగ మెఱఁగిన పగిది
బులకించి తిలకించి పొలఁతిమూర్ఛల్లి ♦
తెలిసి యా హనుమంతు దెసజూచి పలికె
కపివంశవర్య రాఘవ కార్యధుర్య ♦ యుపకారనిరత లోకోన్నత చరిత
పవమానసుత నాకుఁ బ్రాణదానంబు ♦ తవిలి చేసితి నీకుఁ దగఁ జేయలేను
గాకుత్స్థని తిలకంబు కరుణనీ వింక ♦ నాకల్పము గనుండు మనుచు దీవించె
నలఘువిక్రమశీలుడగు వాయుసుతుఁడు చెలువ జానకిజూచి చేతులు మొగిచి
హరునకునైన నింద్రాదులకైన ♦ బరమేష్ఠికైనను బడఁ జొప్పడని
నీకృపవడసితి నినుఁ గాంచగంటి ♦ నాకింత చాలదె నలినాయతాక్షి

{ హనుమంతుఁడు సీతతో శ్రీరాముల క్షేమము దెల్పి శిరోరత్నము గొనుట }

అనిన సీతా దేవి యతనికి మెచ్చి యనును ♦ మను జేసు సేమంబు మఱది సేమంబు
మనమార నరుగుచు మమత రెట్టింప ననఘాత్మ రఘురాముడభిరాము బలుడు
నను నెడఁ బాసి యున్నాఁడ ధైర్యమున ♦ ననుజుండు దానును నప్పటప్పటికి
దయ నన్ను దలఁతురే [illegible] ♦ రయమున వత్తురే రణకాంక్ష ననిన
వినవమ్మ నీ ప్రాణ విభుని సేమంబు ♦ నినుఁ బాసినది మొద ల్నిత్య వేదనల

నేలపైఁ బవళించు నిద్రయెఱుంగఁ ♦ డోలి మాంసాహార మొల్లఁ డెన్నఁడును
వాసిమై వండకావనములో నిన్ను ♦ మోసపోవుట లెంచు మోమరవాంచు
నిట్టూర్పు నిగుడించు నించుఁ గన్నీరు ♦ నెట్టన మూర్ఛిల్లు నేలపైఁ ద్రెళ్ళుఁ
దెలివిమై లేచు నల్దిక్కులు చూచు ♦ గలకుని వ్వోఁ గందుఁ గళవళంబందు
హా సీత హా సీత యని ప్రలాపించు ♦ నా సుమిత్రాపుత్రుఁ డది చూచి వగచుఁ
గావున మీ రాకలిక్కడ నుండు వార్త ♦ వేవేగ నా చేసి విన్నంతఁ గదలి
నాశంబెఘనులైన నగచరాధిపుల ♦ భీకరాకృతుల నభేద్యవిక్రముల
నగశృంగతరుసంఘనఖముఖాయుధుల ♦ నగణితబలుల దేవాంశసంభవుల
సుగ్రీవనలవాలిసుతులాదియైన ♦ యుగ్రవీరులఁ గూడి యుదధి లంఘించి
యెల్లభంగుల వచ్చు నింతలో విభుఁడు ♦ తల్లి నిన్గొని యయోధ్యాపురి కేగు
రాము చేరణమున రావణుఁ డీల్గు ♦ నీ మది కోర్కులు నీకు సిద్ధించు
నైన నీ తడవేల యఖిలైకమాత ♦ యేను నా వీఁపున నిడికొని ప్రీతి
నాదవినగడఁగతో నుదధి లంఘించి ♦ యుదయవేళకుఁ బోదు సర్వేశు కడకు
విచ్చేయుము నవుడు వెలఁది వాయుజుని ♦ సచ్చరిత్రమునకు సంతోషమంది
యోసమీరాత్మజ యోపుదువీవు ♦ నీ సత్త్వ మిట్టిది నిజము చింతింప
ననఘాత్మ యేఁ బెండ్లియైనది మొదలు ♦ జనలోకనుతు రామచంద్రునిఁ గాని
పాలుపొందఁగా నన్యపురుషాంతరముల గలలోవనైన నను గసి యే నెఱుఁగ
నీసీచమతి నన్ను నిటఁ దెచ్చుచోట ♦ వీని నంటుట కేను వ్రేగుచుండుదును
వెఱవక బలిమియై వీఁడంటెఁ గాని ♦ మఱియన్యపురుషుల మదినంట నేను
నానాథునకు నీవు నమ్మినబంట ♦ వైన నను నిను నెక్కి యరుదెంచుటొల్ల
తనదేవి ముచ్చిలి దైత్యుండు చనిన ♦ నినకులుండారీతి నేతెంచెనండ్రు
ఇది విచారముగా దెయినకులేశ్వరుఁడు ♦ కొందలేక మును చిత్రకూటంబునందు
నొకనాఁడు తనతోడ నెఱిఁగి నిద్రింప ♦ ప్రకటచోగ్రముఖ మొక్క కాకంబు చేరి
చంచుపుటంబునఁ జనుఁగవ నడుమ ♦ పొంచి చించిన రక్తపూరంబు దొరుఁగ
గాకుత్స్థతిలకుఁ డొక్కఁడ నిద్రఁ దేరి ♦ కాకంబుపై నిషీకము ప్రయోగింప
నదియు బ్రహ్మాస్త్రమై యఖిలలోకైక ♦ విదితోగ్రశక్తిమై వెనువెంటనంట
నా కాకి యేకాకియై యెందుఁ దిరిగి ♦ కైకొని తనుఁ గావు కావుమటంచు
మరలి క్రమ్మఱఁ దన మరుఁగు జొచ్చుటయు ♦ శరణాగతత్రాణచరితుండు గాన
దాని నేత్రము నిజాస్త్రమునకిప్పించె ♦ నా నిమిత్తంబుగా నలినాప్తకులుఁడు
నాటి నాపై ప్రేమ నాటియస్త్రంబు ♦ నేటికి మఱచెనో యిది హెచ్చరింపు
పది వేలభంగుల బాధలకోర్చి ♦ పదినెలల్గడపితిఁ బతిఁ బాసి యేను
నా యునికిఁ జూచితి నా పాటు గంటి ♦ యేయుపాయంబుల నిందోర్వరాదు

ఈశుఁగని పగలతో నొక్కొక్కదినము గడచుట యొక్కొక వార్ధి గడచుట నాకు
వరనాథు మదిలోన నామీఁదఁ జాలఁ ♦ గరుణ పుట్టెడునట్లు గా విన్నవింపు
మాతఁ డ్రిజనకుండు మహిమీఁదఁ దన్ను ♦ నీ తెఱంగున వీరుఁ డితఁడని నమ్మి
తనకు నిచ్చినఁ దెచ్చి తగ దునన్వీడుచ ♦ నని యేను బల్కితి నని పల్కుమీవు
వి. సిల్లుకల్యాణ వేదిపైను డి ♦ వలనొప్పు నగ్ని దేవర సాక్షిగాఁగఁ
గర ముప్పు నెల్ల కాలంబు విడువ ♦ నరసి రక్షించెద నని తెచ్చి నన్ను
వరయుకు పేక్షించి యనదఁగా జేసె ♦ పరికింపుఁడని విన్నపము సేయు మనఘ
తిన యింతి నొకని చేఁ దాఁగోలుపోయి ♦ మనని చ్చఁ జేయుట మగపాడి గాదు
అటుగానఁ దనకిది యపకీర్తి గాన ♦ ఇటు విన్నవించితి నింత యే కాని
కలఁగక నా మనోగతు ప్రాణంబు ♦ లొలసితన్నెడఁ బాయకున్న దియనుము
చతురాత్మ మతి నీవు సౌమిత్రిఁ జేరి ♦ యతనితో నొక్క మాటాడుము తెలియ
ననుదల్లి గాఁ జూచు నాపాటుఁ జూడ ♦ తన కెన్ని భంగులఁ దగదని చెప్పు
వానిగిదంపకా వనములోఁ బరమ ♦ పావనుఁడగు తన్ను పలికిన ఫలము
కు చితినని చెప్పు కొదువ లేకుండ ♦ తడయక మని తెల్పు దయబుట్టఁ జెప్పు
నవసరోచితముగా నంగదుతోడ ♦ రవిజుతోఁ దక్క మర్కటకోటితోడ
వినయముల్వాలికి యెవ్విధినైన వారి ♦ వినకులులను వేగ విటకుఁ దోడ్తెమ్ము
మిక్కిలి తెలివమై మీరాక తెలిసి ♦ యొక్క మాసము చూతు నుండ లేంపల
ఈలోన రఘురాము నెబ్భంగినైన ♦ వాలాయముగఁ దెమ్ము వడి నింకఁ బొమ్ము
అతని సీకపల్కు వాక్యము లెల్లఁ దెలియ ♦ విని హనుమంతుండు విమలుఁడై పలికె
అవుఁగాక చెప్పెద నన్ని కార్యములు ♦ నువిద నీ మదిలోన నూరడు మింక
చ్చుగా రఘురాము నంటు లీయక ఎు ♦ తెచ్చి యెప్పించితి దేవి నీ కర్థి
ధరణిజ రిక్తహస్తంబులతోడ ♦ మరలుట దూతధర్మము గాదు నాకు
అతివ ముద్రావత్న మానతిమ్మువిని ♦ నతనితోఁ దెలియ నయ్యవనిజ పలికె
నీవు విచారింప నిసుమంత గాని ♦ లేవు సముద్రమే లీల దాఁటితివి
ఘోరయూధ బలవిక్రమాస్పదంబయిన ♦ నీ రూప మెట్టిదో నిజముగాఁ జూపు
మేను నీ నిజరూప మేర్పడఁ జూది ♦ కాని నాథ మానికము ఏకు నీను
అనిన నా హనుమంతుఁ డాకాశమెల్ల ♦ దన మేను నిండ నుద్దండుఁడై పెరిఁగి
మాలతీమల్లికా మాల్యమై మెడకు ♦ నాలోలతర తార హారమై కటిని
గలధౌత మయఘుంటికా దామమగుచు ♦ డలుకు చుక్కలపిండు తన మేన నలమ
నతిభీమ సాకారుఁడై నిల్చుటయును ♦ నతివ చిత్తములోన నతిభీతిఁ బొంది
యసమాన గాత్రి యోయంజనాపుత్ర ♦ విసువక నీ రూపు వెసదాఁచుమనుచు
హనుమంతుఁ గొనియాడి యతని దీవింపదన విశ్వరూపంబు తగఁ జూచి సురలు

విసుతింపనది దాఁచు వెన్నుండువోలె♦ననిలజుఁ డెంతయు నలఁతియై నిలిచి
నిలిచిన హనుమంతు నెమ్మిమైఁ జేరఁ ♦ బిలిచి కోఁగొంగున బిగియంగఁ గట్టి
యున్న శిరోరత్న మొయ్యన విడిచి♦యన్నాఁతి ప్రీతిమై నపుడొసంగుటయు
వనితశిరోమణి వలనొప్పనంది ♦ కొని మ్రొక్కి సీత వీడ్కొని వేడ్క నరిగి
సంతంబు తానింక పంక్తికంఠునకు♦నింతటఁ దనరాక నెఱిఁగింతు ననుచుఁ
దల్లి నేవాకొట్టిఁ దనరఁగ వనము♦ నెల్లెడ ఫలములు నేను గైకొందు
ననవుడు సీతయా హనుమంతుఁ జూచి ♦ యనె రాక్షసావళి యల్ల కాపుండు
గ్రమ్మి రాలిన పండ్లు గ్రమముతో నమలి ♦
పొమ్ము వేగ కటంచు బొందుగా ననుప
దనమదిఁ గొండొక తడవు చింతించి♦వనభంగ మొనరించువాఁడునై పెరిఁగి
తొడలందు బొడము వాతూఁఘుట్టనల ♦
బడుగు బేకమ్ము బోలె బడ మహీజములు

—*: హనుమంతుఁడు అశోకవనమును జెఱుచుట :*—

ఆనిత్యమతి కశోకారామభూమి♦మూనైన హర్మ్యముల్ మహిఁ గూలఁ దన్ని
యొనర కేళీగృహంబులు నుగ్గుఁ జేసి ♦ వనమహీరుహములు వడి నేలఁ దలిపి
కొమ్మలు ఖండించి కుసుమముల్ రాల్చి♦కమ్మక తేనెలు చల్లి కాలువల్ చెఱిచి
పూవుఁదీఁగెలు ద్రెంచి పొదరిండ్లు చదిపి ♦వావులుగ[illegible]చి దోర్బల కేళిఁ దేలి
కలకంఠ బక బిసకంఠికా క్రౌంచ ♦ కరహంస శుక శారికా మయూరాది
వనపక్షు లార్తరావములతోఁ బాఱ♦వనపాలకులు భీతి వడి మేలు కాంచి
హనుమంతు సేఁతకు నగ్నులై మండి♦యనుపమ కరవాల హస్తులై కదియ
దన పేరు తనరాక తన పరాక్రమము ♦వినఁ జెప్పి శ్రీరామ విభు కూర్మిబంట
నొక్కొక్క రాక్షసు నద్దండవృత్తి♦నొక్కొక్క తరువుతో నొగిఁ గూలనేసి
ప్రక్రమసంగరశిక్షా ప్రారంభుఁడగుచుఁ బృథివిపై బీనుఁగు పెంటలుగాగ
భూరిసత్వంబులఁ బొలుపొందువారి♦వీరుల నెనిమిదివేల రాక్షసులఁ
బవమానతనయుఁ డప్రతిముఁడై పేర్చి♦యవలీలఁ దెగటార్చి యార్చినఁ జూచి
యేపరిధృతిదూలి యినవంశుదేవి ♦ కాపున్న ఘోర రాక్షసభామలరిగి
రావణులోన విద్రావణుఁ గాంచి♦దేవ నేఁడొక కోఁతి తెగువమై వచ్చి
తొలితొలివై దేహితో మాటలాడి♦కలఁగొన వనమెల్లఁ గాసిలఁ బెరికి
వెనుఁదన్ని యెనిమిది వే రాక్షసుల♦వనపాలకులఁ జంపి వ్రాలుచున్నాఁడు
వాఁడు రాఘవుఁ డంప వచ్చినవాఁడు ♦ కాఁడేని యా సీత గాపుగా నున్న
తరువొక్కటియుఁ దక్క తావకవనము♦కర మల్గి పెఱుకంగఁ గారణం బేమి
వాని తెఱంగేమి వైదేహి నడుగఁ♦ నా నెఱుంగనటంచు దాఁచుచున్నదియు

నావుడునల్గి దానవలోకవిభుఁడు♦ రావణుఁ డుగ్ర నిగ్రహదృష్టిఁ జూచి
దీప్రాగ్రనిర్గత దీప్తతైలంబు♦లై పావకజ్వాల లక్షులఁ దోఁచుఁగ
దనకింకరులఁ బంచె దండిరాక్షసుల♦ నెనుబదివేవుర సిద్ధవిక్రములఁ
బనిచినఁ బనిఁబూని బలిమీఱులై వారు♦ ధనురస్త్రశూల ముద్గరభిండివాల
ఘనగదాకరవాల కలితులై పేర్చి ♦ యనికి సన్నద్ధులై యార్చుచు వెడల
నంతసూర్యోదయం బయ్యె నాటయును♦ నెంతయుఁ గడఁకతో నేపగ్గలించి
యా లంకఁ గని పర్వతాకారుఁ డగుచు మకరతోరణ మెక్కి మారుతాత్మజుఁడు
తనుఁ దాఁకి శస్త్రాస్త్రతతుల నొప్పించు ♦ దనుజవీరులఁ జూచి దర్పించి పలికె
నోరిరాక్షసులార యుర్విపై నేను♦ శూరత విలవిల్లు సుగ్రీవుబంట
రామునిదూత నా రాముసేమంబు♦ భూమిజతోఁ జెప్పఁ బోవుచున్నాఁడ [ఁడ
హనుమంతుఁడను వాఁడ నతిబలాధికుఁడ♦ వినతనూజుని మంత్రి నే వాయుసుతుఁ
పూని లంకాపురంబున నున్నమగల♦ కేనంతకుండనై యిటవచ్చినాఁడఁ
జెడఁగోరి నన్నేల చెనకెద రనుచు♦ వడిఁ బేర్చి యాభీల వాలంబునందు
బదులనూటుల వేల బలిమీఱఁ జుట్టి ♦ త్రిదశారివరుల బంధించి బాధించి
యారూఢవిక్రమాహవకేళిఁ దేలి♦ తోరణస్తంభంబుతో వ్రేసి వ్రేసి
పూఁచి యొక్కనినైన బోరిలోఁ బడకి ♦ పోనీక నిశ్శేషముగఁ జంపివైచె
నంతలోఁ ఫణిహారు లమరారికడకు♦ నెంతయు భీతులై యేతెంచి మ్రొక్కి
దనుజేశ వినుకోతి తనదువాలమున♦ నెనుబదివేవుర నేపుమై జంపి
మలయుచున్నాఁడు మకరతోరణము♦ తలదన్ని రణబలోదగ్రుఁడై యనిన
ఆపంక్తిముఖుఁడు కాలాంతకుపగిది ♦ కోపించి పింగళాక్షుని దీర్ఘజిహ్వు
వక్రనాసుని నశ్మవక్షుని వైరి చక్రభీకరుఁడైన శార్దూల♦ముఖుని
వేవేగ రప్పించి వీరులై మీర♦ లావానరుని దెగటార్చి రమ్మనుచు
బనిచిన నేవురు ప్రబలసైన్యయుతులు♦ గొని రథారూఢులై క్రూరులై వెడలి
పరువడి నార్చుచు బవనజుఁ దాకి ♦ శరవృష్టిఁ జోదివిని జలియింపఁ గాంత
డా తోరణంబుపై నార్చుచు బేర్చి♦ వాతూలసుతుఁ డేచి వాలముఁ జాఁచి
రథముల విఱిచి సారథుల నుగ్గాడి♦ రథ్యతురంగంబుల రణపీఠఁ ద్రుంచి
వారణంబులఁ గూల్చి వాజులఁ గెడపి♦ యారాక్షసులసేన నటరూపుమాపి
ధరణికి లంఘించి తనదువాలమున♦ నురుశక్తి గళముల కటగా బిగించి
యురువడిఁ గనుగ్రుడ్లు నుఱకంగఁ ద్రిప్పి♦ నురుగఁగ వక్రనాసుని వ్రేసి చంపి
జంపియుంతటఁ బోక సమయని కినుక ♦ దెంపుసొంపును బెంపు సొంపు దీపింప
బెడబెడ నార్చుచు బిడుగునకంటె♦ బెడిదమై కనుపట్టు పిడికిటఁ జేత
బుడమిపై నురురక్తములు గ్రక్కఁ గూల ♦ వడి నశ్మవక్షుని వక్షంబు పొడిచె

పొడిచి బాహాగర్వమున మాఱులేక ♦ కడకఁగనుంగొని కఱకురాక్షసుల
మొగి ద్రుంచి శార్దూలముఖులలాటంబు ♦ నగులంగ గద ద్రిప్పి పడవైచి చంపి
నటు చంపి క్రోధాగ్నులందందనిగుడ ♦ గుటిలరాక్షసకులక్షోభంబుగాఁగ
క్రూరుఁడై పింగళాక్షుని తోఁక గట్టి ♦ కారాకుసుడిగాలి గడువడి ద్రిప్పి
తీకునవాని దిర్దిరమింట ద్రిప్పి ♦ తోరణస్తంభంబుతో వ్రేసి చంపి
వానిని మ్మెడఁ జంపి పరశక్తియుక్తి ♦ పూని దానవసైన్యముల జొచ్చి కలచి
యురవడి దీర్ఘజిహ్వుని వచ్చి తాకి ♦ యురుముష్టిసంహతి నుర్విపైఁ గూల్చి
యాలోన బవనజుఁ డసమానవిజయ ♦ లోలుఁడై వాని నాలుక పీకి చంపె

## హనుమంతుని మీఁదికి రక్తరోముఁడు మొదలైన రాక్షసులను రావణుఁడు పంపుట

నంతదక్కిన దైత్యు లట బారిపోయి ♦ యంతయు జెప్పిన నద్దశాననుఁడు
పోషించి నిజమంత్రి సుతులైన రక్త ♦ రోముని శతజిహ్వు రుధిరలోచనుని
స్తనితహస్తుని శూలదంష్ట్రి దుర్ముఖుని ♦ ఘనుఁడగు నవ్యాఘ్రముకబళుని బిలిచి
యిదియొక్క వానరుఁడే చిరాక్షసుల ♦ బొదవి పెక్కండ్ర జంపుచున్నవాఁడు
ఆమర్కటుని జంపుఁడని పూని పనుప . నా మహాబలగర్వాలార్చుచు వెడలి
చతురంగబలముల సంఖ్యలు గొలువ ♦ నతులరథారూఢులై పేర్చి వచ్చి
మకరతోరణముపై మాఱు లేకట్లు ♦ నకళంకుఁడై యున్న హనుమంతు మీఁద
వరదివ్యశస్త్రాస్త్రవర్షము ల్గురియ ♦ బరమపావనుఁడైన పవమాననుతుఁడు
అప్పుడా దైత్యుల యస్త్రశస్త్రములు ♦ దప్పించుకొనుచు నుదను దాకకుండ
దననఖాగ్రంబుల దంతికుంతముల ♦ ఘనపాదకూర్పర కరఘట్టనముల
జెలరేగి పడి మహాశిలల వృక్షముల ♦ బలములనలుగడ బఱసి నుగ్గాడి
కంఠీరవంబు ఘ గజములపైకిఁ ♦ గుంతితగతిఁ దాఁకి కుప్పించుకరణిఁ
బహుమాంసమస్తిష్క వారము ల్చెదర ♦

కుటిలోగ్రనఖములఁ గుంభము ల్వ్రచ్చి
లీలఁ పైఁ బులి చౌకళించిన పగిదిఁ ♦ ద్రుళ్ళుగఁజ్జమ లఁదోడ్తోఁ రూపుమాపి
జంతుపారణసేయుజమునికైఁ బడిని బంతంబుతో గ్రాలు బలము మాయించి
కులశైలములఁ దాఁకి కులిశాయుధంబు ♦ పెళపెళధ్వనులతో భేదించినట్లు
బలువిడి రథముల పైకి లంఘించి ♦ పొలుపారఁ ధరథ్యములు నేలఁగలపి
రథులఁ జెండాడి సారథుల నుగ్గాడి ♦ పృథుశక్తియుక్తిమైఁ బెరికి వేటాడి
మున్మున్న రక్తరోముని నేలఁ గూల్చి ♦

స్తనితహస్తునిఁ ద్రుంచి శతజిహ్వు వణఁచి
రుధిరాక్షుఁ జంపి దుర్ముఖు విదారించి ♦ కదనవిక్రము వ్యాఘ్రముకబళు ఖండించి

శూలదంష్ట్రు వధించి శూరతమించి ♦ కాలపాశాభీల కరవాలుఁడగుచు
నురవడినిబ్భంగి నొక్కొక్క తెగువ ♦ తరమిడి పెలుచ నుద్దండరాక్షసుల
బలములతోఁ గూడ భస్మంబుఁ జేసి ♦ తలఁకక మారుతాత్మజుఁ డున్నఁ జూచి
పోరిలో నిలవక పోయినవారు ♦ వారిచావులు చెప్ప వడి కోపమెచ్చి
యట ప్రహస్తునిపుత్త్రుఁడు జంబుమాలి ♦ చటులప్రతాపసంచలితాంశుమాలి
కుటిలారిపర్వత క్రూరదంభోళి ♦ పటుబాహుబలశాలిఁ బనిచె రావణుఁడు
పనిచిన నా దైత్యపతికి మ్రొక్కుచును ♦ అనురక్తిరక్త మాల్యాంబరోదగ్ర
సమగ్రశస్త్రాస్త్ర సన్నద్ధుఁడగుచు ♦ సమితరథారూఢుఁడై యేగి యపుడు
శింజినీటంకార సింహనాదములఁ ♦ గంజజాండము హల్లకల్లోలముగను
హరిఁ దాఁకు నున్నత్తహస్తిచందమున నరుదైన కడిమి మై హనుమంతుఁ దాకి
కెరలి మేఘము మహాగిరిఁ బోలె దివ్య ♦ శరవృష్టిఁ గురిసినఁ జలియింపక తఁడు
పెనుశిల దైత్యుపైఁ బెటికి వైచుటయుఁ ♦ గసి దాని శరదళకంబు చేఁదునిమి
హనుమంతు వదనాబ్జ మర్ధచంద్రాస్త్ర ♦

మున నొంచి పది బాణముల బాహుయుగము
గాటించి యొకశక్తి నడునెత్తిఁ బగుల ♦ మేటియై యేసిన మిగుల రోషించి
పవమానతనయుండు బాహుదర్పమున ♦ నవలీల నొకపాల మఁగలించి వైవ
నాలుగమ్ములఁ దాని నడుమనె త్రుంచె నాలోన హనుమంతుఁడా దైత్యురథము
పగములఁ బడఁ దన్ని పట్టి దంష్ట్రములఁ ♦ గదిసి విదారించి గర్జించి వ్రేసి
పొదివి మహావాలమున నశ్వసమితిఁ ♦ జదిపిన విరథుఁడై జంబుమాలియును
బలుకయు నడిదంబు బలువిడిఁ గొనుచు నఁ వు పెంపును గూడ నార్చుచు వచ్చి
పవమానతనయుని ఫాలంబు వ్రేయ ♦ నవశుఁడై మూర్ఛిల్లి యంతలోఁ దెలిసి
పిడుగుతో సరిపోలు పిడికిటఁ బొడిచె ♦ పొడిచి భంగముఁ జేసి పోనీక కదిసి
యొడిసి కైదువఁ గొని యుగ్రుడై కదిసి ♦ తడయక యా దైత్యు తలఁ ద్రెవ్వ నేసె
ధృతిదూలి యతఁ డుర్వి ద్రెళ్ళె ద్రెళ్ళుటయు ♦

హతశేషు లతని పాటంతయుఁ దెలుపఁ
గడుఁ జోద్యమంది రాక్షసమంత్రివరులఁ ♦ దడయక పిలిపించి తగఁ గొలువిచ్చి
దనుజనాథుఁడు గొంత తడవు చింతించి ♦ యసమమహేంద్రుని నైన నాజిఁ గైకొనిన
యతులఘువిక్రము విరూపాక్షు యూపాక్షుఁ ♦

గలహదుర్ధరభావ కర్ణాఖ్యఁ బ్రఘసు
నదయుఁ బంచ సేనాగ్రయుకులఁ ♦ గదనకర్కశుల నొక్కటఁ జూచి బలికె
ఏ లోకమున నైన నిల మర్కటులకు ♦ నీలావుగలదె పీఁ డెవ్వఁడో తెలియ
రాదు మీరేవురు రణబలోదగ్రు ♦ లై దర్పమేర్పడ నాత్మ నేమఱక

యగణితసైన్య సహాయులై వారిఁ ♦ దెగువమైనిటఁబట్టి తెందుపొందనిన
వారును బహురథ వారథతురగ ♦ వీరదైత్యులతోడ వేవేగ కదలి
ప్రాగ్గిరిపైనుండు భానుండుపోలె ♦ దిగ్గగనాంతర తీర్ణ తేజమునఁ
దోరణం బెక్కి బంధురదైత్యవరులఁ ♦ దోరణంబొనరింప దొరకొను వాని
ననిలసూనుని దాకియవనియు దిశలు చినుఁగంగఁ గూయుచు సింహనాదముల
నందఱు దివ్య శస్త్రాస్త్రముల్గురియ ♦ నందులో దుర్ధరుం డను పేరువాఁడు
ఐదు బాణంబుల ననిలజునురము ♦ భేదించుటయు రోషభీషణుండగుచు
కపివీరుఁడార్చి యాకసమున కెగయ ♦ నపుడు దుర్ధరుఁడంత నతనితో నెగసి
విలునారి సారించి విలయకాలోగ్ర ♦ జలదంబు కైవడి శరవృష్టిఁ గురియ
నాయుగ్రశరవృష్టి నడచి వాయుజుఁడు ♦ నాయెడఁ బొడవుగా నటమింటికెగసి
వడివడిఁ బఱతెంచి వానిపైఁ బడిన ♦ బొడిపొడియై కూలెఁ బుడమి రక్కసుఁడు
అదిచూచి యావిరూపాక్ష యూపాక్షు ♦ లదయులై ముద్గర హస్తులై కదిసి
యాకసంబున నిల్చి యార్చి పేర్చుటయు ♦ నాకరువలిపట్టి యటఁ దాను నెగసి
వారితోఁ బోరాడ వారును నతని ♦ ఘోర ముద్గరములు గొని వ్రేయుటయును
జగతిపైఁ బడి లేచి సాఁభూరుహము ♦ నగలించి మరియును నార్చుచు నెగసి
చిక్కని భుజశక్తిఁ జిరచిరఁ ద్రిప్పి ♦ యొక్కదెబ్బనె వారి నుర్విపైఁ గూల్చె
భాసకర్ణుండును బ్రఘసుండునంత ♦ నాసమీరాత్మజు నదరంటఁ దాఁకి
పటుశూలపట్టస ప్రహతుల నొంప ♦ నటరక్తసిక్తాంగుఁడై వాయుసుతుఁడు
కోపించి మిక్కిలి కులశైలసదృశ ♦ మాపర్వతం బెత్తి యసురుల మీఁద
వ్రుక్కకవైచినఁ జూర్ణమై పడిరి ♦ కొక్కెఱ నడిగంటఁ గూలు చందమున
వాయునందనుఁ డంతవారి సైన్యముల ♦
నాయంతకుఁడు వోలె నణఁగించె నపుడు
పడి కరుల్చెడు హరుల్పరచు కాల్బలము ♦ కడతేరు తేరులు కలఁగు శూరులును
మడియు మహారథుల్ మ్రగ్గు సారథులు పొడవైన శస్త్రముల్ పొలియు నస్త్రములు
కడిఖండలైన చక్రప్రాసములును ♦ మడిసిన గుఱ్ఱముల్ మ్రగ్గు కాల్బలము
కూలెడు మావుతుల్ గ్రుంగు రావుతులు ♦ తూలెడు గొడుగులు తుంగు పడగలు
పఱచు నెత్తుటి యేర్లు బహుమాంసములును ♦
నురుగ్రము భూతంబులై రణంబొప్ప [యుండెఁ
క్షణమాత్రమున వారిజంపి హనుమంతుఁడు ♦ రణకాంక్ష మరియు దోరణ మెక్కి
బంచసేనాగ్రగుల్ పంచత్వమొందె ♦ రంచును హతశేషులయ్యెడఁ దెలుప

— * హనుమంతుని మీఁదికి అక్షకుమారుఁడు వచ్చుట *: —

రాక్షసపతియంత రణబలోదారు ♦ నిక్షుచాపాకారు నిద్ధవిచారు

నక్షీణదోస్సారు నసహాయశూరు ♦ నక్షకుమారు మహావీరుఁ జూచి
నందంబు ప్రోఁతయు హయహేషితములు ♦
కరిబృంహితములు రక్కసుల యార్పులును
దనమహాకార్ముకధ్వనియునొండొండ ♦ ఘనములై యాశావకాశముల్నిండ
ఘోరణారూఢుఁడై తొలఁగక చెలఁగు ♦ మారుతి నక్షకుమారుండు దాఁకె
త్రిజగముభీతిల్ల దిశలుఘూర్ణిల్ల ♦ భుజశక్తిపుంఖానుపుంఖంబుగాఁగ
ఘనబాణతతుల నక్కజముగాఁ బొదువ ♦
వని మొనమఱి బాలుఁడని యెంచరాదు
ఘనపరాక్రమకళాఖని వీఁడటంచు హనుమంతుఁ డచలుఁడై యాబాణతతుల
వాలముఖంబున వడిఁద్రుంచివైవ ♦ మేలని హనుమంతు మెచ్చుచు వాఁడు
బాణత్రయంబునఁ బావనిశిరము ♦ శోణితంబులుగార సూటిసేయుటయు
కీలాలధారలుకిరణముల్గాఁగ ♦ బాలభానుఁడువోలెఁ బరఁగఁ జూపట్టుటయు
యాలోనఁ బ్రళయకాలాగ్నియైమండి ♦ తాళవృక్షముసరథ్యములుద్రుంచ
నేలపదాతియై నిలిచివాఁడతని ♦ పాలంబుశరములఁ బదియింటనొంపఁ
నవశుఁడై తెప్పిరి యతఁడు వాలమునఁ ♦ దవిలించియక్షుని తనువునొప్పింప
నక్షుండుగదగొని యనిలతనూజు ♦ వక్షంబు వ్రేసిన వడిఁదూలితెలిసి
కదిసియగ్గదఁబుచ్చి కడువడి నేయ ♦ బెదరివాఁడొకవింటఁ బెట్టొనరించి
తప్పించుకొని వియత్తలమునకెగసె ♦ నప్పుడు పలుకయు నడిదంబుఁ గొనుచు
నలవుమైనంతలో నావాయుసుతుడు ♦ తొలగక నాదైత్యు తోడనెయెగసి
గద వ్రేయుటయుజూచి ఖడ్గమ కించి ♦ గద రెండుతునుకలుగా వ్రేసిడాసి
తొడలు వ్రేయుటయు వాతూలనందనుడు ♦
పుడమిపై బడి నభంబునకు బిట్టెగసి
ఖగనాథుఁడురగంబు కబళించినట్టు ♦ లొగివానిచరణంబు లొడిసిరాదిగిచి
తెగువ కుమ్మరసారె తీరునద్రిప్పి ♦ జగతిపై వ్రేసిన జనమెల్లదూలి
పొలుపరితలమున్న బొమిడికమూడి ♦ కలభూషణములుర్వి గనుకని చెదర
గుండియపగిలి ప్రేగులువాతదొట్టి ♦ కండలెల్లెడరాలి కనుగ్రుడ్లుచెదరి
యగలియద్దానవు నంగంబులెల్ల ♦ బగిలి నెత్తురుక్రక్కి ప్రాణముల్విడిచె
వానిచావటుచూచి వాసవాద్యమరు ♦ లానందభరితాత్ములై తన్నుబొగడ
నంత నాహనుమంతుడసమానవిజయ ♦ వంతుఁడై యార్చిదుర్వారుఁడై యున్న
చెదరినదనుజులచ్చెరువుగా బాణి ♦ త్రిదశారిసభజొచ్చి దీనులై నిలిచి
బలితుండావానర పతిబాహుబలము ♦ తలపవచ్చరువెందు దానవాధీశ
పోలిసిరివనపాల పుంగవుల్గింక ♦ రులుగీటణంగి రారూఢవిక్రములు

శతజిహ్వుఁడను గూలె శార్దూలముఖుఁడు ♦ గతజీవుఁడయ్యె బింగళనేత్రుఁడీల్గె
స్తనిత హస్తుఁడు వచ్చె శార్దూలకబళు ♦
డనిద్రుంగె మృత్యుఁడయ్యె నటజంబుమాలి
పోమించిన క్రనాసుఁడు ప్రమగ్గెరక్త ♦ రోముండులయమయ్యె రుధిరాక్షుఁడ ·గె
దళములతో శూలదంష్ట్రుఁడు మడిసె ♦ జెలువేదిమదిదీర్ఘజిహ్వుండు దెగియె
రూపఱిపోయె దుర్ముఖుఁడు దుర్ధరుఁడు ♦
ప్రాపించె మరణంబు ప్రఘసుండు పడియె [సె
సుఖుమయ్యె భాసకర్ణుండు యూపాక్షు ♦ డారిగెనిరూపాక్షుఁడు సురుతో బా
వక్షుండు దెంటారెహాతుఁడయ్యె నశ్మ ♦ వక్షుండు మడిసె దుర్వారసైన్యము లు
ఇంక నా వానరు నింద్రాదిసురలు ♦ శంకింపక నిమున సాధింపలేరు
ప్రళయాంతకునినైన బట్టినిర్జింప ♦ జలమెక్కియసమాన సత్త్వుఁడై నాఁడు
నావుఁడు మెఱగంది నా శారివగల ♦ భావించియక్షుని బలవింపఁదొడగె
హా కుమారక యక్ష హా వీరవర్య ♦ హా కపిచే నీవు నణగితే యనుచు
దలకుచు బలవించు తండ్రిని జూచి ♦ తొలగక యింద్రజిత్తుఁడు చేరి పలికె

—:* ఇంద్రజిత్తు తండ్రినూరార్చి హనుమంతునిపైకి బోవుట *:—

దేవనీకేటికి ధృతిదూలినగవ ♦ నావానరాధము నవలీ దాకి
వారక యటజంపి వచ్చెదనొండె ♦ ధీరత నటబట్టి తెచ్చెదనొండె
నావినితనయుగ్రనందను జూచి ♦ రావణుఁడనియె ధైర్యస్ఫూర్తి నిగుడ
చిరకాలమమరేంద్రు చెఱబెట్టినావు ♦ పరమమాయారణప్రౌఢుండవీవు
నాకంబెవిక్రమోన్నతిమించినావు ♦ నీకెదురెవ్వరు నిఖిలలోకముల
నసమునటులయ్యె నావానరేంద్రు ♦ నసదుగావదలక నాత్మనేమఱక [ము
బహుదివ్యబాణప్రభావముల్ చూపి ♦ సహజశౌర్యంబున జయముగైకొను
అనదండ్రివీడ్కొని యా మేఘనాదు ♦ డనలార్కసంకాశ మగురథంబెక్కి
యగణితనిజధనుర్జ్యాఘోషమునకు ♦ బగిలిదిగ్గజకర్ణపుటములు పగుల
జగములు బెదర దిక్చక్రబంధములు ♦ పగులనార్చుచు వచ్చి పవనజుఁదాకె
నాసమయంబున నమరులు మునులు ♦ వాసవప్రముఖదిగ్వరులు కిన్నరులు
నుప్పరంబుననుండి యొదిగివీక్షింప ♦ నప్పంక్తికంధరు నగ్రనందనుఁడు
నడరియాతని దేహమణుమాత్రమైన బొడవడకుండ నద్భుతశితాస్త్రములు
గురియ నయ్యస్త్రముల్ ఘోరవాలమున ♦ దరమిడిచదియుచు దప్పించుకొనుచు
శరవేగ లక్ష్యగోచరుఁడుగాకిట్లు ♦ దఃర మొనరించె నద్భుతపౌరుషమున
రావణినిర్జితై రావణిరయుంత ♦ బావనియసమాన బ ,వేగమునకు
నరుదంది మఱియు సివ్యాస్త్రంబు లేయఁ ♦ బరువడిఖండించి పవనజుఁడలరెఁ

దరుశైలములపైవ దర్పించియతఁడు♦శరములనాటి జర్జరితముల్చేసెఁ
జేసినఁగని యింద్రజిత్తుపై నలిగి♦యాసమీరాత్మజుం డవలీలఁ దన్ను
మొనయుచురథ రథ్యములు నుగ్గుసేయ♦
నని మొన విరథుఁడై యా యింద్రజిత్తు
హనుమంతుకడిమికి నచ్చెరువంది♦వినుతోగ్రబల వాయు వీర్యాస్త్రమేయ
వాయుపుత్రుఁడుగాన వానరాధీశుఁ♦
డాయస్త్రమునఁ దూలకచలుఁడై యున్న
నరుదైన రౌద్రాస్త్ర మతనిపై నేయ♦పెరిగియాతఁడు రుద్రబీజంబుగాన
గదలక నిలిచినఁగని యింద్రుజిత్తు♦మదిలోనఁ గోపించి మారుతిమీఁద
సురసిద్ధసాధ్యులు చూచి నిందింపఁ బరమదుర్జయమైన బ్రహ్మాస్త్రమేయ
నాయస్త్ర రాజంబు నవనియు మిన్నుఁ
రాయుచుఁ దనమీఁద రా వాయుసుతుఁడు
బ్రహ్మాస్త్రమునఁ బ్రాణభయము లేకుండ బ్రహ్మచే వరములు వడయుటఁ జేసి
బలువిడిబఱతెంచు బ్రహ్మాస్త్రమునకు♦దలకక బ్రహ్మమంత్రములుచ్చరింప
నదిచంపజాలక యతనిబంధించి♦కుదియించి సడవైచెఁ గుంభినిమీఁద
బడిన మారుతిఁ జూచి పట్టుఁడు కట్టుఁ డడవుఁ కుబోడుఁడంచు నఖిలరాక్షసులు
సుట్టుముట్టి కఠోర సూత్రజాలములఁ♦గట్టిగాఁ గట్టిరి కట్టల్క నిగుడ
నంతనా హనుమంతుఁడవశుఁడై యున్న♦ నెంతయురయమున నింద్రారిఁ జేరి
నలువబాణంబు చేనాకంబు కాక బలియుఁడై యటు పట్టువడియున్నయపుడె
యొనయనీవానరుఁ డెవ్వఁడో పీని♦నని మొనఁ జంపరాదని నిశ్చయించి
అమితసత్త్వోన్నతుఁడై పట్టి తెచ్చి♦తమతండ్రి ముందఱఁ దడయక పెట్ట
దనమంత్రివరులును దాను వేర్వేఱఁ♦దనయులావునకుఁ దద్దయుసంతసించి
కనుఁగవ బ్రళయాగ్ని కణములు దొరుగ♦
హనుమంతుఁ జూచి యిట్లనియె రావణుఁడు
ఓరివానరుఁడ నాయున్న పట్టణము♦ శూరత నొంటిమైఁ జొచ్చుట యొట్లు
నీ వెవ్వఁడవు మఱి నీకుఁ బేరేమి♦యే వెరవున వచ్చి తీవార్ధి దాఁటి
కూరుఁడుపంచినవాఁడో హరిపంచినాఁడో♦పరమేష్ఠి నిన్నిటఁ బంచిన వాఁడో
సురగరుడోరగా సురవిఖచ్చరులు♦నరసిద్ధసాధ్యులు నా పేరువిన్న
వెఱతురు నీవిట్లు వెఱవకవచ్చి♦తెఱఁగంటి దొరకైన దృష్టింపరాక
నఱలెడు నా పురి వంచనఁ జొచ్చి♦ పెఱికితివనమెల్ల బీఱంబు మెఱసి ప్రేలె
బడు గురక్కసుల దుర్బలులఁ గొందఱిని♦మడియించితివి మేటిమగవాఁడవో
నిప్పుడీనేరంబు లిన్నియుఁ గాతుఁ దప్పకనీరాక తగఁ జెప్పితేని

—:* హనుమంతుఁడు రావణునితో తనరాక యెఱింగించుట *:—

యనిననాహనుమంతుడద్దశకంఠు♦గనుగొనియె తయుగిసలియిట్లనియె
నోరిరాక్షస వినరోరి నీచాత్మ♦ దూరీకృతాచార దుష్టమానసుఁడ
విశదకీర్తులుమున్ను విశ్వంబునిండ♦దశరథేశ్వరునకుదనయుఁడై పుట్టి
యరిగివిశ్వామిత్రు యాగంబుగాచి♦హరువిల్లువిఱిచి మహాశక్తిమెఱసి
పరశురామునిబట్టి భంజించివిడిచి♦ఖరదూషణాదుల ఖండించెమఱియు
నీపెంపుగుదియించి నినుదోఁకగట్టి♦ యేపుననిన్నబ్ధి నీడ్చినవాలి
బొంచిపార నొకబాణమునగూలనేసి♦బలియుఁడై సుగ్రీవుబట్టంబుగట్టి
యక్షీణశక్తిమై నతులకోదండ ♦ దీక్షాగురుండన దేజంబు మెఱసి
తగిలిరాక్షస కులాంతకుఁడైన రామ♦జగతీశునిజదూత చతురమానసుఁడ
హనుమంతుఁడనువాఁడనర్కజమంత్రి♦ నినవంశనిధిరాముఁడిటసన్నప
ముదమొప్పబతివ్రేలి ముద్రికగొనుచు♦నోదవినకడిమిమై నుదధిలంఘించి
వచ్చినీపురిఁజొచ్చి వైదేహిసరయ♦నచ్చటబొడగాన కంతయుఁబోక
యవనిజవనములో నారసికాంచి♦యవనీశుడిచ్చిన యానవాలిచ్చి
దేవినీపురినున్కి తెఱఁగొప్పరామ♦భూవరునకు జెప్పఁబోవుచునుండి
యెనసినారాకనీ కెఱిగింపగోరి♦పెనిచినవనమెల్ల బెరికిపోవైచి
వనపాలురగు దైత్యవరులగింకరుల♦నెనుబది వేవుర నేపుమైగడగి
మడియించిమునుమిడిమంత్రినందను ♦మడియించియక్షునిమాఁడించిపిదప
దగిలినీయున్నచందము లెల్లజూచి ♦ మగిడిపోయెదనని మరిపట్టుపడితి
నారామునిజభృత్యుఁడైనసుగ్రీవు♦ భూరిసైన్యములలోఁ బోలుపుదీపింప
నలవుమైనాకంటె నతిబలాధికులు♦కొండిం బెట్టఁగరాని కోటులున్నారు
అదిమిబ్రహ్మాదులనైన సాధించు ♦ మదయుతుల్నివన్నమందుచుండుదురు
గొనకొనియావీర కోటులతోడ ♦ వనిన బంధించి వచ్చిరాఘవుఁడు
లంకపై విడిసి చలంబుపెంపెక్క♦కిన్కమైనసురుల గీటణంగించి
నీతలల్నుగ్గాడి నినుసంహరించి ♦ సీతదోడ్కొనిపోవు సిద్ధమీపలుకు
నెఱకొనినీవింక నీతిమార్గమున ♦ దొలగకబుద్ధి మంతుడవైన వినుము
సీతనొప్పించి యాశ్రితలోకపారి♦జాతంబురఘురాము శరణంబుజొరుము
వలవదువైరంబు వసుధేశుచేత ♦ బొలియకనీప్రాణములు గాచికొనుము
అనిబుద్ధిచెప్పిన హనుమంతుజూచి♦కనలుచుబెంపుమొక్కఁ మునుగదుర
ఘనఘనాఘనమేచి గర్జించినట్లు♦తనియకభర్జించి దశకంఠుఁడలిగి
వెఱవకచనుదెంచివీఁడునాయెదుట♦నత్యుగ్రమ్మిదుర్భాషలాడుచున్నాఁడు
కొనిపోయిచంపుఁడీ కోతికీటంబు♦నని ప్రహస్తునిబంప నసురేశుఁజూచి

వినయభాషణుడు వివేకభూషణుడు ♦ ననఘపోషణుడు మత్తారిభీషణుడు
నావిభీషణుడు కార్యముదీర్ఘచింత ♦ భావించిచూచి యేర్పడవిన్నవించె
మగువలబ్రాహ్మల మఱిబాలకులను ♦ దగదుదూతలజంప దనుజాధినాథ
వలనొప్పబతిపను ల్వచ్చినదూత ♦ లలవుమైనేమైన నాడుచుండుదురు
అదిదూతలకుధర్మ మాదివిచారించి ♦ మదిలోనగోపంబు మట్టుగావింపు
తుదదూతలెందు వధ్యులుగారుగాన ♦ బోదివియీకోతి జంపుటపాటిగాదు
చలముకోపము రాదు సౌమిత్రులందు ♦ వెలువరింపుమువీని విడిచిపోనిమ్ము
మగుడకకిష్క నీ మదికుండునేని ♦ దగినదండముకొంత దండించిపుచ్చు
మనినీతిచెప్పిన నతనివాక్యములు ♦ వినిరావణుడు దైత్యవీరులజూచి
కోతులకెల్లను గుఱుతువాలంబు ♦ ప్రాతిగానటుగాన బ్రజలెల్లజూడ
వీనివాలముగాల్చి వీథులద్రిప్పి ♦ పోనిందునావుడు బోదివిరక్కసులు
బలుమోకలొగిదెచ్చి పవనజుగట్టి ♦ బలిమిచేతులుకాళ్లు బంధించితెచ్చి
మనవారిపెక్కండ్రమడియించినట్టి ♦ చెనటికరీటముతెస్సచిక్కెరాయనుచు
బురవీథులందుద్రిప్పుచువంతకంత ♦ వరుసతూర్యంబులువాయించికొనుచు
నెల్లెందుమెలగనయ్యెడ వాయుసుతుడు ♦ కల్లరిదనుజులు కలయగ్రేగంట
గనుగొంచుమఱియు లంకాపురంబెల్ల ♦ గనుగొనుతలపున గాసికినోర్చి
హీనసత్త్వుడుపోలె నిటునటుదిరుగ ♦ నానావిధంబుల నగుచురేగుచును
ఆబాలగోపాల మతనివెంటదగుల ♦ నాబూమెలకుబుణ్య లాత్మలోవగవ
దలకొనియెంతయు దైతేయనరులు ♦ చలముననజీరల పంఖ్యము ల్దెచ్చి
కాలసర్పాగ్రతు ల్గాతిరుల్గాల్చి ♦ లోలతనవినూనెలో దోచితోచి
యిదియశోకారామ మెల్లఖండించె ♦ నిదిదానవేంద్రుల నెందఱిజంపె
వీనికినగుశిక్ష దేవారిపెట్టె ♦ దీనిగాల్పుడటంచు దెగువనొండొరులు
నాదవినలంకలో నుత్పాతహేతు ♦ వుదయించెనని పేర్చుచున్నవాలమున
నచ్చలంబుననజీర లన్నియుజుట్టి ♦ చిచ్చుదగిల్చి రచ్చెరువుగామండ
దనుజులుసింహనాదములు సేయుచును వెనువెంటదగులనావృత్తాంతమెల్ల
తప్పకటకజకాంతలు చూచిపోయి ♦ చెప్పినయప్పుడు సీతశోకించి
యక్కటానీశిక్ష నైనసీకిట్టి ♦ యక్కుపాటునుగల్గె నేతండ్రియనుచు
జలములుదడవి సుస్థలముననిల్చి ♦ చెలువొప్పనగ్నికి జేతులుమొగిచి
యారామవిభుడు ధర్మాత్ముడౌనేని ♦ వారిధినాకుగా వడిదాటునేని
యీరావణునిరాము డిలగూల్చునేని ♦ వారకనేపతివ్రత నౌదునేని
జనకభూపతి సర్వసముడగునేని ♦ దనరువేదములు సత్యములగునేని
పవమానమిత్ర యోపరమపవిత్ర ♦ నవకేకిశరదదోషాభోజద్వారద

వరదవైశ్వానర వానరోత్తముని♦పరమశీతలుఁడవై పాలింపవయ్య
యనిసీత ప్రార్థింప ననిలసూనునకు♦ఘనవాలమును పేరి కాలాహితలను
గనుపట్టుమాణిక్య కళికన మెఱసి♦యనలుండు కడుజల్లనై యుండె నంత
ఆవిధంబునకుఁ దా నాశ్చర్యమంది♦పావని తమతండ్రి పావకసఖుఁడు
గావున నన్నగ్ని కరుణించెనొక్కొ♦దేవతలెల్లఁ బ్రార్థించిరో రామ
దేవు విక్రమమొ యేదియుఁ గాదు సీత♦దీవెన యిదియంచుఁ దెలివిమై నుండి
ప్రపిమల సత్త్వైక పరులైన జనుల♦భవపాశములు వీడు భావనఁ దోఁప [కు
బ్రహ్మమంత్రములు తప్పక యుచ్చరింప బ్రహ్మపాశములూడె పవనసూనున
అంలనా హనుమంతుఁ డసురేశులంక♦యంతయుఁ గాల్పఁగ ననువు చింతించి
యలవడ దనకునై యగ్నిసూక్తములు♦జలములలోఁ గ్రుంకి జపియింపవలయు
ననిపోయి మునిగిన ట్లపరాంబురాశి♦నినుఁ డస్తమించిన నేచి వాయుజుఁడు
కనకమహీధరాకారమై యొప్పి♦తన మేను బెంచి బంధములెల్ల ద్రుంచి
కీడాచరించుచు గేలిసేయుచును♦వేడుకతోఁ దన వెనువెంటఁ దిరుగు

—:* హనుమంతుఁడు లంకఁ గాల్చుట *:—

దనుజుల నిర్జించి ధనుజేశుఁడున్న♦ఘనమైన మేడ కుత్కటముగా నెగసి
తనవాలవహ్ని లంతటఁ దరిగొల్పఁ♦దనివియంతంతకు దగ్రంబులగుచు
భుగులున పొగలొప్పఁ బొగలకు మున్న♦నిగిడి పెన్మంటల నిండె నాకసము
నాకసమున మంటలడరి మండుటయు పైకొని యటమున్న పర్వె నుల్కములు
అడరున య్యుల్కల కటమున్న తొలఁగి♦
వడిదిక్కులకు బాఱు వరవిమానములు [ల్చి
నప్పుడు హనుమంతుఁ డడరి యొండొండ♦గుప్పించి మఱికొల్వు కూటముల్గా
వరశస్త్రశాలలు వడసీఱు చేసి♦యిరవంద భండార పిండ్లను గాల్చి
పరువడి సౌధము ల్భస్మంబు జేసి♦సొరిది చప్పరములు చూర్ణంబు జేసి
మణిచంద్రశాలలు మసిగా నొనర్చి♦ప్రణుతశయ్యాగేహ పటలి దహించి
రమణీయగజవాజి రథశాలలోఁగి♦కమలిచిదగ్ధము ల్గా జేసె నపుడు
యెడపక యెగసిన యెఱమంటతునుక♦లుడుగక నుడువీథి నొండొండ బర్వి
ఖచరోరగామర గణవిమానములు♦ప్రచురవిభాగ్నైకపరతఁ జలిప
సొరిదిమై రావణాసురు చేటు దెల్ప♦దొరగు నుల్కలయట్లు దోఁచె బెల్లుగను
రాజన్యుడగు రఘురామభూపాలు♦డోజమై దండెత్త నుద్యుక్తుఁడగుచు
బలువిడి లంకలోపలఁ బ్రతాపాగ్ని♦యెలమి మైనిర్గమ మిదియెనో యనగ
దహనుండు నిర్భర ధ్వనుల బ్రహ్మాండ♦కుహరంబు నిండి మిక్కుటముగా బర్వె
రావణుడట ఘోర రణకళాకేళి♦కావళుడగుచు దిక్పాలుర నెల్ల

పఱచినతొల్లింటి భంగముల్మఱు ♦ పఱపకపోదను భంగిని నెగసి
బలసి విభీషణు భవనమొక్కటియ ♦ వెలిగాఁగ పురమెల్ల వ్రేల్మిడిలోన
దరికొనినుండు నత్తరి దైత్యవరులు ♦ కరముభయభ్రాంతిఁ గంపించువారు
తలలును జీరలు దరికొనిమండ ♦ దలమేదినలుగడఁ బాఱెడువారు
తమతమవారలు తమబంధుజనులు ♦ కమలఁటఁజూచి శోకమునొందువారు
హాహానినాదంబు లడరించువారు ♦ నాహనుమంతుపై నలిగెడివారు
నావిష్ణుఁడా రాముఁ డతనికి నెగ్గు ♦ గావించెనీపాపకర్ముఁ డన్వారు
అట్టికీడొనరించి నట్టిరావణుని ♦ కట్టియాపదవింతలే యనువారు
ననుచుండ నెంతయు నత్యుగ్రుఁడగుచు ♦ వనచరవీరుండు వడిఁ జెలరేగి
యొకచోటఁ దప్పక యుండ నాలంక ♦ సకలంబు గాల్పి యుత్సవకేళిఁ దేలి
యెసపకపై వ్రాలు నెఱమంటతునుక లుడుగంబ్రమోయొచు నొగిదూలితూలి
సోలిసురాపానసుఖసుప్తిమునిఁగి ♦ కాలుటయెఱుఁగక కాలెడువారు [మలి
నాయెడమృదులశయ్యలయందునిదుర ♦ పోయిపోయినయట్లు బొందులున
తెలివికి నెడమీఱ తీవ్రాగ్నిశిఖల ♦ మెలఁగిమిడుగలేక మృతిఁబొందువారు
తమతమబంధుఁ దమవధూమణులఁ ♦ దమతమబిడ్డలఁ దమప్రాణసఖులఁ
దమతమవారలఁ దగఁదోడుకొనుచు ♦ గుములుగట్టియేగుచు మ్రగ్గువారు
తెగియిండ్లసరుకులు దిగిచితేఁబోయి ♦ మగిడిరానేరక మ్రగ్గెడువారు
సతుఁ గౌఁగిటఁ జేర్చి సరితెచ్చి తెచ్చి ♦ ధృతిదూలి వాకిండ్లఁ ద్రెళ్లెడువారు
నై లంక ఘూర్ణిల్ల వంతంతఁగలయ ♦ నాలోకభయదంబులై మీఱిమీఱి
యురుసింహములఁ బోలె నుగ్రతఁబట్టి ♦ కరికుంభవిదళన గతిమండిమండి
రోజపెంపారు నాహుతులచందమున ♦ వాజులమీఁదికి వడివాఁటిదాఁటి
తగిలించువరవిటోత్తములచందమున ♦ మొగికామినీకుచంబుల బ్రాకి ప్రాకి
భావించి యన్యుల బ్రహసించువారి ♦ కైవడి నాలుకల్గఱచియుఁగఱచి
తగిలిసంతాపంబు దఁకొన్నవారు ♦ మిగిలి యుబ్బెసుగతి మిన్నందియంది
బెలుకురిపఱతెంచు భీతులపగిది ♦ తొలఁగక నిగుడి గొందులదూరిదూరి
వాయుచు నిబ్భంగి వాయునందనుని ♦ వాలాగ్నిలోలంక వడిచుట్టుగాల్చె
గాల్చిననుబ్బి దిక్పతులు దేవతలు ♦ మేల్చుట్టమితఁడని మెచ్చితన్బొగడ
హనుమంతుడంతట నంతరంగమున ♦ జనకజభీతిమై శంకించి బెదరి
యీలంకతోఁ గూడ నినవంశు దేవి ♦ గాలిచితినిగన్న గానక క్రొవ్వి
యేనింక రఘురాము నేమని కాంతు ♦ జానకిసేమమే సరణి దెల్పుదును
దప్పుగార్యమటంచుఁ దల్లడంబంది ♦ యప్పుడు తనమది నటవివేకించి
యాతల్లి దీవెన నీ ఘోరవహ్ని ♦ నాలోకరోమమైనను గాల్పవెఱచె

నట్టిసీతాదేవి కగ్నిచే భయము ♦ పుట్టునే యిది యేటి బుద్ధియటంచు
ధరణిజ మదిలోనం దాపాగ్నులార్చు ♦ వెరవున వాలాగ్ని విషధిలోనార్చి
వెసనశోకారామ వీథికిం బోయి ♦ యసుర కాంతలు భయమందివీక్షింప
దనుజకాంతల చేత దన సేమ మెల్ల ♦ వినిమున్న సంతోష వివశయై యున్న
జనకపుత్రికి మ్రొక్కి సన్నిధి నిలిచి ♦ తన పౌరుషము లెల్ల దగ విన్నవించి
యిదె పోయి తెచ్చెద నినకులేశ్వరుని ♦ మదిలోన నీకు నుమ్మలికంబు వలదు
అని యింక బనివిందు ననుచు సీతకును ♦

వినయంబుతో మ్రొక్కి వీడ్కొని కదలి
తడయక పశ్చిమద్వారంబునందు ♦ వెడలుచు పావని వెస నేపుమిగిలి
తలుపులు పడం దన్న వలుపులు విరిగి ♦ యిలగూలె రాక్షసు లెల్లబీతిల్ల
నురవడి నాలంక యొకట గంపింప ♦ పరవసంబునం బేర్చి పదిలుడై వెడలి
వరుసతో నట్టళ్లు వడిగూలదన్ని ♦ యలరిసు వేలాద్రి నవలీల నెక్కి
కలయ లంకాపురి గల దైత్యులెల్ల ♦ బెలుకురి భీతిల్ల బెల్లార్చి యార్చి
కడగి సానుపులు భగ్నంబులై యబ్ధి ♦ చెడి కూలవడి మహాశిల లెల్ల నుల్ల
సంగదమై బెంచి యద్రిశృంగములు ♦ క్రుంగి కుంభిని గ్రుంగ గుప్పించి దాటి
యటు దాటి బలువిడి యాకాశవీధి ♦ బటుసత్వ దేహ సంపద వచ్చి వచ్చి
యరుదైన పేర్మితో నబ్ధిమధ్యమున ♦ బరగు మైనాకుడన్ పర్వతాధీశు
గని యందున మేన గలదప్పి దీర్చు ♦ కాని పర్వతుని వీడ్కొని యట వచ్చి
పొలుపొందు తన జవంబున పెంపుసొంపు ♦ తిలకించి జలధి యుత్తరతీరభూమి
నతిసత్త్వసంపన్నుడై వచ్చి నిలువ ♦ నతని సంతోషచిహ్నము లెల్ల జూచి
యంగదు డాదిగా నగచరాధిపులు ♦ సంగతి నెదురుగా జని కౌగిలించి
ప్రకటించి యందంద పరిణామమరసి ♦ యొక చోట నందఱు నోలి గూర్చుండి
పోయిన కార్యంబు పొలుపొందె నడుగ ♦ నా యున్నతోన్నతుం డందఱ జూచి
కపులార యేను మీ కరుణమై జేసి ♦ యుపమి పనరుదైన యువధి లంఘించి
యగణితవైభవం బగు లంక జొచ్చి ♦ తగిలి శోధించి సీతాదేవి గాంచి
యినకులాధిపు డానతిచ్చిన త్రోవ ♦ జనకనందనతోడ సకలంబు జెప్పి
యింతికి ముద్రిక నిరవందనిచ్చి ♦ యింతిశిరోమణి యిదె పుచ్చుకొనుచు
వచ్చితి నేనన్న వనచరాధిపులు ♦ నిచ్చలో హర్షించి యింపుసొంపొంది
హనుమంతు నంబఱుపన్ని చందముల ♦ గొనియాడి కొనియాడి కోర్కులదేలి
యున్నచో నంగదుడురుపరాక్రముడు ♦ క్రన్నన నుత్సాహకలితుడై పలికె
జనకజమనమింక సాధించితోడు ♦ కొనిపోయి రఘురాము గూర్చుట లెస్స
యలుగాననిప్పుడీ యంబుధి దాటి ♦ పటుపరాక్రముడైన సత్కంధరుడు

సుతులతో హితులతో జట్టాలతోడ ♦ నతిరయ బునజంపి యవనిజగొనుచు
వత్తము లెండను వాలిసూనునకు ♦ సత్తఃబు క్షేశు డనియెభ వించి
నునలసుగ్రీవుండు మైధిలివెదుక ♦ బనిచినపగు లెల్ల బావనివలన
ననఘాత్మసఫలంబు లయ్యెనీమీఁద ♦ నినకులాధిపునితో నీవార్త జెప్పి
బోవుటత గనన్న బుద్ధినొందోరులు ♦ భావించి దాని కెర్పడపమ్మతించి
వనచరుల్నా డెల్ల వనధితీరమున ♦ ననిలనూరుడుదాము నర్థితోనుండి
బహుమూలఫలములబరితృప్తి గాంచి ♦ మహితసత్త్వాదికుల్మఱునాడుకదలి
ధరణిపై మేరుమందరములకంటె ♦ బరపైన దర్దరపర్వతంబునకు
జనుదెంచియగ్గిరి సాను దేశముల ♦ వనమూలఫలములు వడినాస్వదించి
యాయద్రిపతిమీఁద నారాత్రినిలచి ♦ యాయతభుజబలులంత వేగుటయు

—:* అంగదాదులు మధువనంబునకు వచ్చుట :*—

మనమిక సుగ్రీవు మధువనంబునకు ♦ నెనసినకడకతో నేగియందఱము
తనివోవ దేనియల్ద్రావకయున్న ♦ మనదప్పిపోదని మదివిచారించి
యినకులాధిపునను లెల్లసాధించి ♦ చనియెనమఱుగానజలజాప్తసుతుడు
మనమీఁదగోపించి మర్దింపవెఱచు ♦ ననినిశ్చయము జేసియందఱుగూడి
హనుమస్తునంగదునప్పుడుప్రార్థించి ♦ యనుకూలముగ వారియనుమతివడసి
యాతతబలులుమధ్యాహ్నంబుగోలది ♦ నేతెంచిమధువనంబేపుమైజొచ్చి
దిక్కులవెదచల్లు తేనతావులకు ♦ గ్రుక్కిళ్ళుమ్రింగుచుగునిసియాడుచును
గొనచెవుల్నిక్కించి కొక్కరింపుచును ♦
గినిసియొండొరుల దర్కింపుచు వేడ్క
నెనయంగదమతమకిష్టంబులైన ♦ వనభూములకువారి వనచరాధిపులు
ధీనిధుల్మఱి పువ్వుతేనియల్జుంటి ♦ తేనియలును బుట్టతేనెలునైన
పలు తేనెలొగిద్రావిఫలములునమలికలయబువ్వులు రాల్చికాయలుడుల్చి
తలిరుగొమ్మలుద్రుంచి తరుకోటివంచి ♦
మలయుచుగొమ్మకొమ్మకు సూటిదాటి
యొనసిపూదీగెల నుయ్యెలలూగి ♦ కొలకుల గ్రీడించి గూడివర్తింప
నాలోనదధిముఖుడనగ నావనము ♦ పాలింపుచుండెడిప్లవగుడొక్కరుడు
అనయానకోపుడై యందఱగినిసి ♦ వెసదమ్ముభర్జించి వెడలిపొమ్మనుచు
వనపాలకులచేత వరుసగ్రోయింప వనచరుల్వానబాటి వారివారించి
వడినంగదుండును వాయునందనుడు ♦ తడయకదదిముఖు ధరణిపైలీల
గెడపిపెట్టుక మోము క్రిందుగానీడ్చి ♦
పొడిచిత్రోచుటయును బొలుపూదివాఁడు

కోపించి మొఱపెట్టుకొనుచు నుబోయి ♦ యాపద్మహితసుతు నడుగుల కెఱఁగి
దేవదానవులకు దృష్టింపరాని ♦ దేవ నీవన మెల్ల దేజంబు మెఱసి
పెనఁగొని వనచరుల్ పెక్కుండ్రతోడ ♦ జనుదెంచి యసమానసత్త్వులై కూడి
యా మరుత్తనయుండు నావాలిసుతుడు ♦ నీ మధువనములోనికి నేఁగుదెంచి
తగిలి మ్రాఁకులు ప్రాకి తరుశాఖలలమి ♦ తిగిచి పండులు తిని తేనియల్గ్రోలి
యిది రాజవనమని యిచ్చ భీతిలక ♦ కుదియక యంత గైకొనక న్నఁజూచి
యెడపక జంకించి యేనుమీయాన ♦ బొడిచి త్రోచుటయును బొడిచిరి నన్ను
నని వాడు మొఱయిడ నలిగి సుగ్రీవు ♦ డెనసి మర్దింప నూహించినఁ జూచి
యంత నావృత్తాంత మంతయు నెఱిఁగి ♦ సంతతజయశాలి సౌమిత్రి పలికె
దొలఁగక యంగదాదులు మహాకపులు ♦ నెలకొని సుగ్రీవ నీ యూరకవనము
తలఁకకింతయు లేక తమ యంత జొచ్చి ♦ నలి తేనె ద్రావుచున్నారని వినుము
ఆతతబలసత్త్వులగు వారిచేత ♦ సీతాదిపతిపను ల్సిద్ధింపనోవు
గాకున్న యాజ్ఞ గడవనోపుదురె ♦ గైకొని పిలిపింపు కడకతో వారి
నని బుద్ధిసెప్పిన నర్కనందనుడు ♦ తనబుద్ధిఁ గైకొని దదిముఖుఁ జూచి
శ్రీరాము కార్యంబు చేసిరి గాన ♦ వారుచేసిన సేత వారికి జెల్లె
నూరక యీశోక ముడిగి నీవింక ♦ వారిఁ బుత్తెమ్మన వాఁడంత నరిగి
హనుమంతు నంగదు గాజాంబవంతుఁ ♦ గని మ్రొక్కి నాతప్పు గాచి మన్నించి
వనచరోత్తములార వడి నేఁగుఁడింక ♦ వనములోపల నుండ వలవదు మీరు
మిమ్ముఁ బుత్తెమ్మని మిహిరనందనుఁడు ♦ నిమ్ములనాకాన తిచ్చి పుత్తెంచె
ననువార్తఁ జెప్పిన నందఱు నుబ్బి ♦ యినసూను నాజ్ఞకై యెదకొన్న వాలి
తనయుని మూరార్చి తడయక పేర్మి ♦ వనచరాధీశులు వనభూమి వెడలి
యుప్పొంగుకడకల నుప్పరం బెగసి ♦ యప్పుడు మేఘంబులట్ల మ్రోయుచును
వారక చనుదెంచు వారిచిహ్నములు ♦ దూరంబులందు సంతోషించి చూచి
యినజుండు కపిసేన నెదురుగాఁ బంచి ♦ యనురక్తి రప్పింప నర్థితో వచ్చి
జగదీశుఁ డగు రామచంద్రునంఘ్రులకు ♦ నగచరుల్ దండప్రణామము ల్సేసి
తదనంతరంబునఁ దగ లక్ష్మణునకు ♦ బిదప నర్కజునకు బ్రీతితో మ్రొక్కి

—:* హనుమంతుఁడు సీతనుచూచిన తెఱంగెఱింగించుట *:—

యందఱుఁ గొనివచ్చి హనుమంతు నపుడు ♦ ముందఱ నిడికొని ముదము దీపింప
శ్రీరామచంద్రుని సింహాసనంబు ♦ చేరువ నోలి యాసీనులై యుండ
వలనొప్పఁ దమ పోయి వచ్చిన తెఱఁగు ♦ దలఁగొని వినఁగోరు ధరణీశు తలపు
హనుమంతుఁ డంతయు నాత్మలో నెఱిఁగి ♦ ఘనమైన భక్తితోఁ గరములు మొగిచి
కమలాప్తకులనాథ కంటి వైదేహి ♦ ప్రమదాశిరోమణిఁ బరమకల్యాణి

ధరణీశమీయాజ్ఞ దలమోచికొనుచు ♦ నరుదైన దేశంబు లన్నియు వెదకి
చిరభక్తిసంపాతిచేఁ ద్రోవ యెఱిఁగి ♦ యరిగి సముద్రమే నవలీల దాఁటి
యొనరదక్షిణదేశమున మహామహిమఁ ♦ దనరు త్రికూటాద్రి దద్దయు నొప్పి
దానవకులపాలితంబైన లంక ♦ యేనొక్కరుఁడ చొచ్చి యెల్లచో వెదకి
ధరణిజఁ గానక తద్దయు వగచి ♦ యరిగి రావణుని యుద్యానంబు గాంచి
పరికించి రాక్షసభామలు దన్ను ♦ తిరిగి చుట్టుచునుండ దేవ మీదేవి
యుపవాసములడస్సి యొకమ్రాని క్రింద ♦ విపులదుఃఖంబుల వెల్లిలో మునిగి
చెక్కుటఁ జెయ్యాది చిత్తంబు మాపు ♦ నెక్కొన్నవగలతో నీయందె చేర్చి
దనుజుండు చనుదెంచి తనఁ దెచ్చు తెఱఁగు ♦ తనదిక్కు లేమికిఁ దలపోసి చూచి
యుడుగని కన్నీరు లున్నంత ప్రొద్దు ♦ బడి యునిట్టూర్పులు వడిఁ బుచ్చి పుచ్చి
మాసి చీరతో మరియైఁ ధూళి ♦ ధూసరితాంగియై తూలి కైవ్రాలి [చి
తలయూచి తలయూచి తెఁ గొన్నవగలఁ ♦ బలుమాఱు వేగుచుఁ బలవింప జా
మీనాక్షి చిహ్నముల్ గుర్తు నాతోడ ♦ నానతిచ్చిన త్రోవ లన్నియుఁ జూచి
క్రమమున మరి సీతగా నిశ్చయించి ♦ కమలాక్షిఁ బిదపదగ్గఱఁ బోయి మ్రొక్కి
తామరసాక్షితోఁ దగు మాటలాడి ♦ లేమకు మీయంగుళీయక మిచ్చి
మగుడ శిరోమణి మఱిఁ బుచ్చుకొనుచు ♦ మగుడ యారామ మంతయుఁ బెఱికి
కమలాకరంబులఁ గలఁచి నిద్దలఁచి ♦ కమలాప్తసుతునాజ్ఞఁ గడుమది నెంచి
కరిబృందమునఁ బట్టి కలఁచు సింహంబు ♦ తరివనపాలక తతిరూపుమాపి
తరమిడితమతండ్రిశలఁ పుదీపింప ♦ సరుదెంచినట్టి యాయక్షుఁ ద్రుంచి
చెలఁగి రాక్షసవీర సేనలఁ జంపి ♦ యలయింద్రజిత్తుతో నచటఁ బోరాడి
రావణిచేఁ జిక్కి రాక్షసేశ్వరుని ♦ కావరమణఁచంగఁ గడఁగి నేవాని
వరమందిరముఁ జేరి పలయువాక్యములఁ ♦ బరువడి నేఁ దెల్ప వాఁడు నన్గనలి
వాలమగ్నిఁ దగిల్చి వడి నేగుమనినఁ ♦ గాలిచి లంకను గడువడిఁ గదలి
యగణితంబైనట్టి యంబుధి దాఁటి మఱుడని గాంచఁగ మదిఁ దలపోసి
వచ్చితి నేనని వసునాధిపతికి ♦ నచ్చుగా నతివియోగాగ్ని కీలలకు
మచ్చిదియననొప్పు మాణిక్యమిచ్చె ♦ నిచ్చినవారత్న మేర్పడఁ జూచి [యి
యనురాగమున దానినల్లనఁ బుచ్చు ♦ కొని డెందమునఁ జేర్చుకొని మార్చబో
రొలుకకొంత ప్రొద్దున కొయ్యనఁ దెలిసి ♦ ప్రకటధైర్యంబునఁ బ్రాణముల్ నిలిపి
నృపతి శాపప్పవుల నేత్రుఁడై చూచి ♦ కపినాథు ననిలజుఁ గరమర్థిఁ బలికె
భానుజనాప్రాణ పదమైనయట్టి ♦ మానినీమణిశిరోమణిఁ జూచినపుడె
నామది గరఁగుచున్నది లక్కవోలె ♦ నీమణి మామమకిచ్చె నింద్రుండు
యాగసంతృప్తుఁడై యఖిలంబు నెఱుఁగ ♦ నాగుణనిధి జనకావనీవిభుఁడు

నట్టియీ మణిసీత యాతవలనేఁ గాఁ ♦ గట్టిపెట్టి యొసర్చెఁ గరమర్థి నాకు
నన్నులతలమిన్న యైనయాసీత ♦ నన్నుఁడు నెడఁ గాయ దీమణి నేఁడు
నాతినినన్ను మన్నన గూర్పవచ్చె ♦ దూతిక యిుగ సిరు ల్గులకింపవచ్చె
ననియనియు ద దయగ్గన జేర్చి హనుమంతుమతి ముసుసట గాచిపలికె
బరమపుణ్యాత్మక పవనజనీవు ♦ మరలియే తెంచుచో మగువ యేమని యొఁ
జెప్పె మేర్పడనన్న శ్రీరాముఁ జూచి ♦
చెప్పంగఁదొణఁగె నంచిత సత్త్వధనుఁడు
ఎడపసినగలతో నేనాకథంగిఁ ♦ గడపితిఁ బదినెల ల్కాకుత్స్థుఁ బాసి
చలమూది రెండు మాసములకుఁ బిదపఁ ♦ బెలుకుర నన్ను జంపెద నన్న వాఁడు
రావణుఁ డటుగాన రామభూపతికి ♦ నేవిధంబున ప్రాణ మిటమీఁద నిల్వ
దని విన్నపము సేయు మనఘ నాతండ్రి ♦ తనుసత్యధనుఁడని తగ నిచ్చె నన్ను
విలసిల్లు కల్యాణ వేదిపై నుండి ♦ వలనొప్ప నగ్ని దేవతసాక్షిగాఁగఁ
గరమర్థి వన్నెల్ల కాలంబు వినుమ ♦ కరసిరక్షించెద నని తెచ్చినన్ను
నగయకుపేక్షించి యునదగాఁ జేసి ♦ పరికింపఁడని విన్నపము సేయుమని యొఁ
దగ్గఁ గఁ జనుదెంచి తన ధర్మపత్ని ♦ నొక్కఁ డెత్తుకపోవ నూరకయునికి
మహిలోన వీరధర్మము కాదు గాన ♦ విహితమి తయు విన్నవించితి గాని
వలనొప్ప నామనోవాక్కాయ కర్మ ♦ ములు పూసి తనయందె పొందివర్తించు
నెనయంగ నా యెడ లెంచుండ నేని ♦ యని విన్నపము సేయుమని యెమీఁ దేవి
తను చిత్రకూటాద్రి దగ నొక్క కాకి ♦ చెనకుటయును మనశ్శిలచేత మీఁరు
లీలతో మకరిక ల్లిఖయించుటయును ♦ తలించి గుఱుతుగా జెప్పినన్నియును
సీతి దప్పినలోక నియతులు దప్ప ♦ సీతి యేతోఁడవగు నిఖిలనృపులకు
నని విన్నపము సేయుమని యె నా దేవి ♦ యినవంశుతోఁ జెప్పి యిప్పుడేదండు
అనువొందవెడలింపు మని విన్నవించె ♦ ననిలజ్ఞునులితోడ నగ్గజుతోడ
జనకజపలుకులు సకలంబు జెప్ప ♦
ఘనశోకమును మానె ఘనుఁడు రాముండు
చెప్పినఁ గపివీర సింహంబులెల్ల ♦ నప్పుడు ముదములోన హర్షించిరంత
గరమొప్పు సుందరకాండంబు నతుల ♦ ధరబర్వి లోకసుందర మయ్యెగృతుల
ననియాంధ్రభాషాభాషాధీశవిభుడు ♦ వినుత కావ్యాగమ విమలమానసుడు
పాలితాచారుడ పారధీశరధి ♦ భూలోకనిధిగోన బుద్ధభూవిభుడు
తమతండ్రి విట్ఠలధరణీశు పేర ♦ గమనీయ గుణాఢ్య కనకాద్రిపేర
బనిబూనియరిగండ భైరవుపేర ♦ ఘనుపేరమీఁసర గండని పేర
నాచంద్రతారార్క మైయొప్పుమిగిలి ♦ భూచక్రమున నతిపూజ్యమై వెలయు

నసమానలలితశబ్దార్థసంగతుల♦రసికమై చెలువొందు రామాయణంబు
పరగనలంకార భావనల్నిండ♦గరమర్థి సుందరకాండంబు సెప్పె
నారూఢినాస్థేయ మైయాదికావ్య♦మైరసికానంద మైయెల్లనాడు
నివ్వసుమతినొప్పు నిపుణ్యచరిత♦మెవ్వరుచదివిన నెవ్వరువినిన
సామాదిబహువేదచయధామరామ,నామచిన్తామణినవ్యభోగములు [లు
పరహితాచారముల్ ప్రభువిచారములు పరిపూర్ణశక్తులు ప్రకటరాజ్యము
నిర్మలకీర్తులు నిత్యసౌఖ్యములు ♦ ధర్మైకనిష్ఠలు దానాభిరతులు
నాయురారోగ్యంబులైశ్వర్యములును♦పాయనిశుభములుపాపక్షయంబు
వరపుత్రలబ్ధియు వైరినాశనము♦సరినొప్పుధనధాన్యచయ సమృద్ధియును
ఏవిఘ్నములులేక యిండ్లలోనధిక♦లావణ్యవతులైన లలనలపొందు
గొడుకులఁతో నెప్డు గూడియుండుటయు♦నెడగాగనాపదలెల్ల బాయుటయు
సమ్మదంబునబంధుజనులగాచుటయు♦నిమ్ములకామ్యంబులెడపకన్దుటయు
సతతంబుదేవతాసంతర్పణంబు♦పితృగణతృప్తియు బెంపారుచుండు
వ్రాసినవారికి వరశుభోన్నతులు♦బాసవభోగాది వాసముగలుగు
నెందాకకులగిరు నెందాకదార♦లెందాకరవిచంద్రు లెందాకదిశలు
నెందాకవేదంబు లెందాకధరణి♦యెందాకభువనంబు లేపుదీపించు
నందాకనీకథ యక్షరానంద ♦ సందోహదోహళాచారమైపరగు

సుందరకాండము-సంపూర్ణము

---

శ్రీరస్తు

# శ్రీరంగనాథరామాయణము

## యుద్ధకాండప్రారంభము

—: * :—

శ్రీరామచంద్రుఁడాశ్రితహితోదయుఁడు♦వారిజబాంధవ వంశవర్ధనుఁడు
ప్రియములయందెల్లఁ బ్రియమైనయట్టి ♦
ప్రియవాక్య మంజనా ప్రియసుతు చేత
బ్రియమునవినఁగోరి ప్రియసీతయునికి♦ప్రియము రెట్టింపఁగ బ్రీతితోననియె
హనుమంతుచేసిన యంతకార్యంబు ♦ చను నెసేయంగ నిర్జరులకున్నైన

నరిదిసత్త్వమున నీహనుమంతుఁ డొండె ♦ కరువడి యొండె నగ్గరుఁ డుండు నొండె
వనధి దాఁటఁగఁ జాలు వారలు గాక ♦ మనమునఁ దలపోయ మఱి యెవ్వఁ డోపు
దేవగంధర్వ దైతేయ కిన్నరులు ♦ భావించి చొరరాదు పగలును రేయు
రాక్షసానీకపి రాజిశ జా వాలు ♦ రక్షితమా లంక రమణమైఁ జొచ్చి
ప్రాణంబుతోడనే బ్రతికి క్రమ్మఱను ♦ ఏణాంకధరుఁడైన నెట్లు రా నోపుఁ
గడు మోదమున బుద్ధికార్యంబు పతికి ♦ వడిఁ జేయు నెవ్వఁడు వాఁ డుత్తముండు
ఏలినపతి కార్యమెడరైన యెడను ♦ వాలూర నటు సేయు వాఁడు మధ్యముడు
పలుమాఱు మూల్గుచుఁ జలిపంపుపనికి ♦
దొలఁగ బాఱెడు వాఁడు దుస్సేవకుండు
ఈ మువ్వురందును నెక్కువయైన ♦ యా మేటివాఁడునై యయింత లేక
యనురాగమునఁ బెద్దయైన కార్యంబు ♦ ననుపమంబుగఁ జేసె ననిలనందనుఁడు
కావున బ్రత్యుపకార మీతనికి ♦ నేవిధంబునఁ జేయ నేనేర్చువాఁడ
నాలింగనం బెనా యర్థమంచతని ♦ నాలింగనము సేసె నప్పుడవ్విభుఁడు
ఈ భంగి మెచ్చిన నినసూతి వినఁగ ♦ నాథ వ్యూఁడనయె నాయాంజనేయునకు
ననిలతనూజనీ వంబుధి దాఁటి ♦ జనకజఁ గనిరాఁగ సంతోషమొదవె
నిటనాకుఁ బొడమిన యీ ముదంబెల్ల ♦ నిటమీఁద మరితుది యెట్టిదో కాని
యదియెట్టిదం టేని యగ్గలంబైన ♦ యుదధిలంఘింపంగ నోపెడి వెఱవు
కపిసేనకెబ్భంగిఁ గలుగునో యనుచుఁ ♦ గపినాథ నామది గలఁగంగఁ జొచ్చె
ననిపల్కి యటమీఁద నాస్యంబు వంచి ♦ మనుజేశుఁ డేమియు మఱి పల్కకున్న
శ్రీరామదేవుని చిత్తంబు కలఁక ♦ సూరవిజుఁడు మాన్తనని విచారించి
యిది యేమి దేవ నీవితరులభంగి ♦ మదిలోన శోకంబు మానవయ్యేదవు
దాఁటరాదన నేల దాఁటెదనబ్ధి ♦ దాఁటిసు వేలయు దాఁటి యాలంక
సాధించి రావణుఁ జంపి లోకముల ♦ బాధమాన్పెదవు భూపాలక చూడు
ముర్వీశ కపులెల్ల నుద్యోగయుతులు ♦ దోర్విజయాఢ్యులు దుర్జయక్రములు
వీరుండ రాఘవోర్వీనాథ నీకు ♦ వారక యిబ్భంగి వగవ నేమిటికి
నుద్యోగివగుము సముద్యోగి కెందు ♦ సద్యః ఫలంబులు సకలకార్యములు
ఉత్సాహియగువాని కులుకుదురహితు ♦ లుత్సాహరహితునకులు కరుగాని
యనియతఁ డిబ్భంగి నాడు వాక్యములు ♦ విని హనుమంతుతో విభుఁ డర్థిఁ బలికె
వేఁడెసఁ గాదేని వెడలు నాయంప ♦ వాడిమినైనను వార్ధి నింకింతు
బంధింతుఁ గాదేని పవనతనూజ ♦ కంధిదాఁటుట కెంత గగనంబు నాకు
నదియె తపనివిను మనిలతనూజ ♦ పదిశిరంబులవాని పట్టణంబునకు
నెన్నికోటలు బల మెంత వీక్షింప ♦ నన్నిటగవనులు నవియెవ్విధములు

కావలియుండు రాక్షసులెందఱుందు♦భావింపదగ్గృహపంక్తులే తెఱఁగు
చూచివచ్చితిగాన చూచిన తెఱఁగు♦నీచేతవినియెద నిక్కంబు చెప్పు

—:* హనుమంతుఁడు లంకాప్రభావము దెలుపుట *:—

మనిన నంజలిమోడ్చి యాంజనేయుండు♦
వినమోక్తులెసఁగ నవ్విభున కిట్లనియె
ఉడుగనిమదధార లొలుకుచునుండ♦కడుఁగ్రొవ్విపర్వతాకారంబు లగుచు
రౌద్రంబు మోముల రంజిల్లుచుండు♦భద్రదంతావళ ప్రతతులగ్గలము
పెక్కుయూధంబులఁ బెరికిమార్కొనఁగ♦నక్కజంబై ఘోరమైకనుపట్టు
గొడుగులబడగలగొమరారుచుండు♦నడియాలమైన టెక్కెంబులుగ్రాల
భానుబింబప్రభాపటలంబుకరణి♦మానైనమణిదీప్తి మహిమ వెలుంగు
రథములెక్కుడు దశరథరాజతనయ♦రథికసారథిమనోరథములై యుండు
ఘనవీరరసవారికరడులోయనఁగ♦దనరారియె తయువఱచుచువన్నియలు
మెఱసినచూడ్కులుమిఱుమిట్లుగొనఁగ♦వఱలినహేషారవంబులు చెలఁగ
హరిఘోటకంబులనైనవేగమున♦హరియింపనోపినహరిశక్తిగలిగి
హరులెంతయును మనోహరములై యుండు
హరిహరాదులు మెచ్చునట్టి యగ్గలము
పిడుగులతోడఁబ్రబ్బిననల్లమొగులు♦ఒడరిదానవరూపమయ్యెనోయనఁగ
నేర్చిరౌద్రంబుతో నెనసియంగంబు♦కూర్చిననల్లని కొండలోయనఁగ
గాదేని హరుఁడు మ్రింగిన నాటిగరళ♦
మీదైత్యకోటిమై మొసగెనో యనఁగ
ప్రళయకాలమునాటి పావకధూమ♦మలవడ రాక్షసులై రొకో యనఁగ
గలిగినయట్టి రాక్షసులకుసంఖ్య ♦ గలుగదు దేవ రాఘవధరాధీశ
దట్టమై యుట్టళ్ళ దనరిచూపట్టు♦నిట్టికకోటయు నిరవైనటాతి [గంచు
కోటయు బొడవునఁ గొంఱరొందునిసుప♦కోటయునటయుక్కు కోటయు
కోటయు మరివెండి కోటయు బసిడి♦కోటయు నను నేను కోటలొప్పారు
గాలునివశంబు కరణిబొల్పెక్కి♦ మీనైన గతలుపులు మఱసి యెంతయును
అక్కోటలన్నిటి యందును జూడ♦మిక్కిలిదీప్తుల మిక్కుటంబగుచు
సకలరత్నముల మేలైన వాకిళ్ళ ♦ సకలావనీనాథ యరయనాల్గేసి
వరమంత్రవిధుల దివ్యంబులైనట్టి♦శరచాపచయముల సంఖ్యలై యుండు
నాకోటచుట్టును సకలలోకేశ♦భీకరమకర సృంఖలములై పరగు
నాలుగగడ్తలు నాల్గుదిక్కులను ♦ జాలంగబాతాళ సమితినొప్పారు
దేవయానాలుగు తెరువులయందు♦గావలియుండు రాక్షసకోట్లుదఱుచు

అమితశిలాబాణ యంత్రజాలములఁ ♦ దమతమయంత నే దాయలఁ జంపు
ధాత్రీశ యింటింటఁ దప్పక యగ్ని ♦ హోత్రము లున్నవి యోంకారమొసఁగ
ననవుచు వినియతఁ డతిచోద్యమంది ♦ మనమునఁ జింతింప మారుతి యనియె
సత్యంబు ధర్మంబు శౌచంబు దయయు ♦
సత్యంత శూన్య బ యసురుల యందు
ననిపల్కుటయు సాధ్యమానిలంక ♦ కనపతి ముదమందఁ జతురుడై పలికె
నవియెల్ల నిట్టిట్టి వని యెన్న నేల ♦ యవనీతలేశ మహావైభవమున
వారక సేనతో వాహ్యాళి వెడల ♦ నా రావణుండు నిత్యముతోడు చూచు
వాలిన మదమున వడిఁ గయ్యమునకు ♦ గాలు ద్రవ్వుచునుండు గనులాప్తవంశ
యగ్గలిక యులావు నడర వైరులకు ♦ లగ్గఁ బట్టఁగ రాదు లంకభూనాథ
జలవనకృత్రిమ స్థలశైలదుర్గ ♦ ములు నాల్గునుండు సముద్రంబులోన
నవియెల్ల కాల బు నైనను గాల ♦ కదియఁ బోవఁగ రేవు కానంగరాదు
మృత్యుజిహ్వయుఁ బోలె మెఱుఁగులతోడి ♦
యత్యుగ్ర శూలంబు లనిశంబుఁ బట్టి
కడునుగ్రరాక్షసు లార్చి యుండుదురు ♦ పడమటి వాకిటఁ బదివేల సంఖ్య
లక్షదై తేయులా లంకాపురంబు ♦ దక్షిణద్వార ముద్ధతిఁ గాతు రెపుడు
నటఁ దూర్పు వాకిట నమరారి యుండుఁ ♦ బటుతర చతురంగ బలసమేతముగ
నగణితశస్త్ర సహాయులై యుండుఁ ♦ దగ నొక్కలక్ష యుత్తరపు వాకిటను
చాలరాక్షసులు లక్ష యునిర్వదేను ♦ వేలు తత్పురమధ్య వీథినుండుదురు
అలంక మీనృప నర్కకులేశ ♦ యేలీలఁ జొచ్చితి నింతఁ గైకొనక
వడిఁ జొచ్చి యట్టళ్లు వడిఁ గూలదన్ని ♦ యడరి కోటలఁ బ్రాకి యగడితల్వ్రచ్చి
యచ్చెరువుగ లంక యంతయుఁ గాల్చి ♦ వచ్చి శ్రీమీపాద వనజములంటి
నడరి యక్కడి కార్య మంతయు వింటి ♦ దడయ నేటికి యబ్ధి దాఁటుద మింక
దాఁటినయప్పుడే దశకంఠు లంక ♦ మీటిపై చెదరు వేల్మిడిలోనఁ గపులు
అనవుడు రఘురాముఁ డర్కజుఁ జూచి ♦ యినసుత యాలస్య మేటికి నింక
వెడలింపు కపిసేన విజయలగ్నమునఁ ♦ గడు లెస్స మధ్యాహ్నకాలంబు మనకు
నా యస్త్రమును దర్క నరభోజనునకు ♦ నే యుపాయము గలదెందు దాఁగెడిని
అని నీలు దెసఁ జూచి యర్కవంశజుఁడు ♦ వినుమన బుద్ధిగా వివరించె నపుడు
కడు నింపు దనరును కడు నిర్మలంబు ♦ కడు తీపు నీరును గలుగంగఁ జూచి
పరిపక్వఫలమూల భరితంబులైన ♦ తరువులు నజ్జాడ తఱుచయ్యె నేని
నడుపుము ముంగలి నడుచోర నీక ♦ వడి బరికింపు మొప్ప నిలాతివారి
ననిన నా రాముని నానతి యెల్ల ♦ విని నీలుడట్ల కావించె శీఘ్రమున

—*: సుగ్రీవుడు కపిసేనల వెడలించుట :*—

నప్పుడుసుగ్రీవు డఖిలవానరుల♦దప్పకుండగబిల్చి దండెత్తబనిచె
బనిచినదమతమ పటురథసముఖ♦ఘనగుహాలందుండి కపిసేనవెడలె
భూరిపదాఘాతముల దల్లడిల్లి♦ఘోరరావంబుల గుహలుఘూర్ణిల్ల
వీరగర్జనములు వీరహాసములు♦వీరనాదంబులు వెసనింగిముట్ట
బెల్లునగోపించి పెడబొబ్బలిడుచు♦ద్రుళ్లుచుబటుశక్తితోదాటువారు
కొండలపండిన కజములుమాపు♦లందిడినమలుచు నరిగెడివారు
రావణుతోగూడ రాక్షసప్రతతి♦నేవిధంబుననైన నేమెచంపుదుము
రామభూపాలక రణముననను చు♦రామునిముందట రాగిల్లువారు
కెరలిపైకులుకుచు గేకవైచుచును♦వెరవారదోకల విసరియాడుచును
జెచ్చెరపర్వత శిఖరంబులెక్కి♦నచ్చగొండలుబొబ్బ లిడువారునడచు
నప్పుడుకపివీరు లందఱుచెలగి♦యప్పరమేశ్వరు డుండదమొంద
నారవంబునమ్రోసె నాకాశవీథి♦నారవంబునభూమి యటునిటుపడియె
నారవంబునబెల్చ నద్రులువణకె♦నారవంబునమ్రొగ్గె నాదిగ్గజములు
నారవంబునభార మయ్యెశేషునకు♦నారవంబునకూర్మ మణచెశిరంబు
ఇటుసేననడవంగ నెగసినధూళి♦పటలంబుమిన్నంది బహువర్ణములను
ఆరవంబునభారమై యిలనెసగు♦తోరంపునిశ్వాస ధూమంబులనగ
నప్పుడుముంగలి మైనీలుతోడ♦నొప్పసైన్యంబు లత్యుగ్రతుండముగ
నిరుదిక్కులందును నేపారినడచు♦తరుచరబలము లుద్ధతపక్షములుగ
స్ఫురణమొప్పగమధ్యమున వచ్చువారు♦ధరణీశలేశుఁడు తనయాత్మగాగ
గడగసొంపారి చక్కగ వెన్కగాచి♦పడివచ్చుసైన్యంబు వాలంబుగాగ
నురగపాశంబుల నొందంగనున్న♦తరణివంశజు నవస్థలుతొలగింప
గరుడుండుభూస్థలి గైకొనినడచు♦కరణినొప్పారె మర్కటమహాసేన
సరివ్రజంఘుండు కేసరిదధిముఖుఁ♦పరువడిపండడి బాయవ్రేయగను
విదళమై శ్రీరాము వెల్లువనడువ♦పరమసంతోష సంభరితాత్ములగుచు
గవయుండుతారుండుగంధమాదనుడు పవమానసూనుడుపనసుడంగదుడు
శరభుండునలుడునుజాంబవంతుండు♦హారుడును మైందుండు నాదిగాగల్గు
వనచరపతులెల్లవడినేగుదేర♦జనుదెంచిరఘుపతి సహ్యాపర్వతము
గనియందువిడిసె లక్ష్మణసమేతముగ♦ఘనతతోనపుడునగ్గముగానందు
బెంపారువనముల బెన్నటాకముల♦నింపారునీడల నిరవైనయెడల
విడుదులుగైకొని వెలయునబ్బలము♦విడిసెసుగ్రీవుండు విడియంగబనుప
మఱునాడునప్పటిమాడ్కిలక్ష్మణుడు♦దారలుమహీపతి త్రోచియేగగను

సుకవీరరసమున నుప్పొంగిపొంగి ♦ ధరితస్వనంబున బరపొందిరొంది
తమకాంతికరడుల దనరారియారి ♦ ఘనమైనమోతనాకసమందియంది
మునుకొనివనశైలముల కొప్పియొప్పి ♦ మనువంశచంద్రుచేమానుబ్బియుబ్బి
యాపముద్రము పెంపు నడగింపనడచె ♦ భాసురంబగు కపిబలసముద్రంబు
దైర్యాఢ్యులా మహీధవులభ్రమధ్య ♦ సూర్యచంద్రులమాడ్కి శోభిల్లిరంత
నదులలో జొచ్చి వానరసేననడువ ♦ నెదురుదొట్టుచునుబ్బి యెసగియానీరు
సహ్యాద్రిమలయాద్రిసంధులనడుమ ♦ సహ్యమైకపిబల సమితితో బోడము
చిఱుగాలిచే దరుశిఖరాగ్రసమితి ♦ నొఱపైనకొమ్మలొండొంటితో రాసి
యగచరావళిమీద నలరులురాల్చె ♦ దగనట్టిదే కాదె తలపోసిచూడ
వనలక్ష్మి శ్రీరామ వల్లభుజూచి ♦ యెనయబుష్పాంజలు లీకేలమాను
నప్పుడు కపివీరు లయ్యాయియెడల ♦ నొప్పు కొలంకుల నురవడిజొచ్చి
యానిర్మలపునీరు లారంగ గ్రోలి ♦ యానందమునుబొంది యందందగదిసి
కమనీయమృదుకరకమలయుగ్మముల గమలముల్ద్రుంచుక నలజ్జబట్టిచు
కమలాకరంబులగమలాప్తకులుడు ♦ కమలారియునుబోలి కమలముల్నొం
గ్రమమొప్పగా దశకంధరువదన ♦ కమలంబులన్ని తెల్పు కరణిజెలంగి
దొగలు వెట్టెంతు ముష్టారిపతుల ♦ తొగలు జానకియింక దొలగంగవైచు
తొగలారయికమీద దొగయెట్టిదనుచు ♦

దొగలెల్ల జిదిమి వైతురు పెచ్చుపెరిగి
రుబిదులై యసురులప్రేవులు పెరుక ♦ కరణిం బెఱుకుదురుఘనమృణాళములు
ఇటువినోదింపుచు నెల్లవానరులు ♦ తటములమీది కుద్ధతక త్రాటి
గిరులెక్కి పణముల గ్రిక్కిరియంగ ♦ బెరల తేనియలాని ప్రేలరింపుచును
గడునుత్సహించి యుత్కటబలాదిపులు ♦ నడిచిరివానర నాయకోత్తములు

—: * శ్రీరాములు మహేంద్రాద్రి జేరుట : * —

ఇనవంశునపుడు మహేంద్రాద్రియెక్క ♦ యనతిదూరంబున నంబుధిగనియె
కరమకరంబులు కరిసమూహములు ♦ తరగలు గుట్టపు దళములు పెల్లు
కమఠకర్కటములు ఘనరథావళులు ♦ సమరజలార్భక సమతిభటాళి
పొలుపారఫణిఫణాంబులు కేతనములు ♦ లలిజొరమీనవాలములడిదములు
చలదురుమీనాళిచామరప్రతతి ♦ పొలుపొందుమరువునొప్పగఛత్రసమితి
పెనుపైనఘోషంబు భేరీరవంబు ♦ వినుతింపగానీరు వీరరసంబు
గానున్న జేరిన కడిదిరావణుని ♦ నేనేలచంపంద నిత్తునన్మాదిక్క
దనరిన క్రూరసత్త్వస్థితిబేర్చి ♦ తనకెదురై మహోద్ధతినున్నదాని
గనిపెద్దవెఱగంది గాంభీర్యధనుడు ♦ వనధితీరము జేరి వచ్చిరాఘవుడు

ప్రకటంబుగా సర్వబలము గూడుటకు ♦ నొక మంచి చంద్రకాంతోపలస్థలిని
జలధితీరంబున జరియించుచున్న ♦ బలితంపు రావణ పాఠీనవరుని
వసుపమంబగు తన యంపగాలమున ♦ గొని తివుచుటకునై కూర్చున్న పగిది
నాసీనుడై యున్న యర్కకులేశు ♦ డాసన్నుడై యున్న యర్కజు బలికె
వచ్చితిమిమ్మహి వారిధి జేర ♦ నెచ్చొప్పఘటియింత మిది దాటమనకు
నా యుపాయము మతి యాత్మ చింతింత ♦ మీయగచరకోటి నెందు బోనీక
యింపైన యొకవిడియింపంగ బనువు ♦ సొంపారగా దోడుచూడంగవ యు
నని రాఘవేశ్వరుఁ డర్కజు బలుక ♦ విని సుతుం డనునీలు నిటు సేయుబని చె
నీలుండునప్పుడు నిరతంబుగాఁగ ♦ వాలిన సేనల వడివిడియించె
వనచరారవము నావలననుఁగలిగి ♦ వనచరారవము నీవలననుఁగలిగి
యునికి నహితునేయో సముద్రుండ ♦ యని యప్పుడా వార్ధి నదరించు మాడ్కి
విడియు వానరసేన వెడలెడు మ్రోఁత ♦ నడచుటెల్లైన యాయంబుధి మ్రోత
నట రెండు వేలంబులై యాపరోది ♦ తటవనభూములఁ దరుచరుల్విడియ
నప్పుడు రాముఁ డేకాంతంబునందు ♦ నొప్పు సులక్ష్మణు నొయ్యనఁ బలికె
సౌమిత్రి వింటె యీజలనిధికైన ♦ నీమెయిఁ దుద నిశ్చయింపంగ వచ్చె
నివియంతయింతని యెన్నంగ రాదు ♦ తుదలేదు నామనో దుఃఖవారిధికి
నని రామవిభుఁడు శోకాంబుధిలోన ♦

మునుఁగుచుండఁగ మూఁడు మూర్తులుగలిగి

యతనితోఁడిదె లోకమనిన చందమున ♦ నతివేగమున నినుఁడపరాద్రిఁ గ్రుంకె
నినుఁడు గ్రుంకుటయును నెల్లలోకములు ♦

పెనుపొంద మణి లేని పెట్టియఁబోలె

మనసి కానలతీవ్ర మానసు రాముఁ ♦ గనుఁగొనియనువుగాఁ గప్పటకొఱకు
చెలివోయిన పరాశ చెంగావి చీర ♦ నెలమినిచ్చిన క్రియ నెరసంజ యొప్పె
నినవంశచంద్రు చేనింద్రారి మోము ♦ నవిశంబు నిటువాడు నని చందమున
దళమువలి గువెల్లఁ దప్పియు దంద ♦ లలిఁ దక్క చును గమలంబులు మొగిడె
చెలువుగా రాముని శీతలక్రియకు ♦ నలిరేఁగి యాశాంగనలు గూడవైచు
లలితమాల పల్లవరాసులనఁగ ♦ గలయఁగ బలువు చీఁకటు లగ్గలించె
దినవాధకులు దేవిఁ దెచ్చి మోఁడించు దనుజనాథుని మోము దమ్ములు సిరియు
ననినగి యెడిమాడ్కి నప్పుడందంద ♦ తనవొందఁగాఁ గుముదంబులు విరిసె
శ్రీరామదేవుని శితమార్గణముల ♦ నారత్నము లుదక్క నంబుధిఁ గ్రుంకె
నీరూపమున నుండు నిఁకననుమాడ్కి ♦ తారకావళిచేతఁ దనరారె మిన్ను
యాసితీదిని రాము సంతాపమున ♦ కై నిబిడంబుగా నమరించియున్న

సారంబు మల్లికా శయ్యనొప్పెఁ ♦ దారలప్రతిబింబితంబైనయబ్ధి
విరహంబు చేరామ విభుఁడునరిగె ♦ నరిది యే విరహుల మాట మేమనుచుఁ
దెసలకుఁ జెప్పెడి తెఱఁగునఁ బాసి ♦ వెసమరి మరి చక్రవాకములనియె
రాజనై యేను వారాశి యుబ్బింతు ♦ రాజవై నీవు వారాశి యింకింపఁ
దలఁచుట పాడియే ధరణీశవర్య ♦ విలసితసత్కళాన్వితుఁడగు నీవు
నటు చేసితేని దోషాకరత్వంబు ♦ పటువృత్తి నీయందు బ్రభవించునంచు
దూఱవచ్చినమాడ్కి దోఁచెఁ జందురుఁడు ♦ మీఱిన కరములు మిన్నులముట్టి
జనకజకై రామ జననాథతిలక ♦ ననుఁ దలఁ దాల్చి మన్నన జేసినట్టి
హరువిల్లు విరిచిన యా దోషమునను ♦ విరహివై తివి సీత వెఱపుననను చుఁ
జందురుఁ డట్టహాసము చేసెననఁగ ♦ నందందఁ జంద్రిక లతిశయమొందె
శరనిధి సురువను చందనంబర్థిఁ ♦ గరమొప్ప విచికాగణములఁ గల్చి
కరములు పుచ్చి దిక్కాంతల మేనఁ ♦ బొరిపొరి యారాజు పూసెనో యనఁగ
దలకొని మరియును దట్టమై పర్వి ♦ వెలయంగ వెచ్చని వెన్నెలయొప్పె
నప్పుడు వేడుక నా చకోరములు ♦ నొప్పు చిత్తములఁ బెంపొలయంగఁ గదిసి
పొరిఁబొరిఁ దమ చంచుపుటములు చాచి నిరతంబు గాఁగ వెన్నెల పుక్కిలించి
లలితోడ దమప్రియులకు నిచ్చియిచ్చి ♦
యెలమితో నవియుంది యీగ్రోలి గ్రోలి
మలసియాడుచుఁ బలుమఱు సోలిసోలి ♦ పొలుచు వెన్నెలరసంబుఁ దేలి తేలి
గమిబాసి యడుగులు గన తారితారి ♦
కొమరారి యింతులఁ గూడియుండుటయు
గనుఁగొని మదన మార్గణవర్గభిన్న ♦ తనుఁడైన రాముఁడా ధరణిజఁ దలఁచి
యంతకంతకు మదనాగ్ని చేఁగుంది ♦ యంతరంగంబున నడలుచునుండె
నప్పుడు లక్ష్మణుం డున్నసంతాప ♦
ముప్పొంగుటయుఁ జూచి యొగిమాన్తుసనుచు
నిదె యబ్ధిదాఁటుద మిదె దాఁటిపోయి ♦ పదిశిరంబులవాని పటుశక్తినాది
భంజించి మిథిలాధిపతికూర్మిపుత్త్రిఁ ♦ గంజాస్యయగు సీతఁ గైకొనెదధిప
వసుధేశ నీవింక వగవనేమిటికి ♦ నసమాన వీరుండ వారూఢకృతివి
యనవుడు తమ్ముని యనునయంబులకు ♦ జననాథుఁ డెంతయు సంతోషమందె
ఆదట వెన్నెలయందు వానరులు ♦ మోదంబుతోడ నిమ్మనుల నెల్లెడల
నారామదేవు గుణాంకంబు లింపు ♦ లారంగఁ బాడుచు నాడెడువారు
కూడి యా జలనిధి కూలంబులందు ♦ వేడుకతో నుబ్బి విహరించువారు
హరియవతారంబు లన్నియుఁ గథల ♦ వెరవుగా నింపుగా వినుచుండువారు

కడఁగియాయా చంద్రకాంతోపలముల ♦ వడలు సొంపారఁగా బవళించువారు
నై ప్రొద్దుగడపి ప్రియంబునుబొదల ♦ రయమున నంత బూర్వమునకింపెసఁగ
జలనిధిరాఘవేశ్వరుఁ డేయునపుడు ♦ బలుశిలీముఖములఁ బడుదునోయనుచు
కడువేగ తొలఁగి యాకంపంబునొంది ♦

బడబాగ్ని యుదయాద్రిఁ బ్రాకెనోయనఁగ
రాముబాణాగ్ని వారాశి దహించు ♦ చో మిన్నుముట్టియర్చులు పర్వెననుచు
వెఱచి తొలంగిన విధమునఁ గ్రుంకె ♦ నెఱసిన చుక్క లన్నియుఁ దోడుతోడ
నిదియేల దడసెద వీయబ్ధిఁ గట్టి ♦ వదలక చంపు రావణు రాఘవేంద్ర
యనిమనుమనికిఁ దోడ్పడై రేపకడను ♦ జనుదెంచెననఁగ భాస్కరుఁ డుదయించె
కమలాప్తకులుని రాఘవుని సద్విజయ ♦ కమలయుఁ దద్రాజ్యకమలయుఁ గీర్తి
కమలయు నని మేలుకనిన చందమున ♦ కమలంబులెల్ల నొక్కట మేలుకనియె

—:* రావణుఁడు మంత్రులతో నాలోచించుట *:—

నప్పుడు తగిన సంధ్యాదికృత్యములు ♦ నొప్పుగ సలిపి రాయుర్వీశులంత
నక్కడ రావణుఁ డఖిలమంత్రులను ♦ తక్కఁగ రావించి తగ వారికనియె
మంత్రికోవిదులార మర్కటుం డొకఁడు ♦ దంత్రఁబుఁ జూపిన చందాన వచ్చి
లంకిణిఁ ద్రుంచి యీలంక శోధించి ♦ వంకజాననసీతఁ బరికించి కాంచి
నావనంబుఁ బెఱికి నా సుతుఁ జంపి ♦ విక్రమము మీఱి నా పురిఁ గాల్చి
పెక్కువ నసురులఁ బెక్కండ్రఁ జంపి ♦ చిక్కియు మన చేతఁ జిక్కక పోయె
నదె తెచ్చి రాముని నావాసరుండు ♦ పదిలుఁడై యంబుధి ప్రాంతంబునకును
భల్లూకబలములు ప్లవగసైన్యములు ♦ వెల్లువలై వచ్చి విడిసిరి వార్ధి
స్థిరముగా నీవార్త తెఱఁగెల్లఁ దెలియఁ ♦ జరజను లెప్పిరి సకలంబు నాకు
వినకులునిడీయబ్ధి యీఁకించియైనఁ ♦ దనసేనఁ బంచి యుద్ధతిఁ గట్టియైన
దాఁటివచ్చిన మఱి తప్పుఁ గార్యంబు ♦ దాఁటకమున్నె మీర్తద్జ్ఞతి మెఱసి
యిది కార్యమని చెప్పుఁడిందఱుగూడ ♦ నది యొనేయుదము మేలగు తెఱఁగైన
ననియడిగిన రాక్షసాధీశుతోడ ♦ ననిరి మంత్రులు కడు నల్పజ్ఞులగుచు
దివ్యులకైనను దృష్టింపరాని ♦ దివ్యాస్త్రములు పెక్కు దేవరయందుఁ
గ్రక్కునవిమతులు గ్రక్కంగఁ బట్టి ♦ యుక్కడంగించితి వురగాధిపతిని
రుద్రుని సఖుఁ గుబేరుని మదంబణఁచి ♦ భద్రకంబైన పుష్పకముఁ గైకొంటి
మయుని ప్రఖ్యాతుని మర్దించియతని ♦ ప్రియసుతఁ బెండ్లియుఁ బేర్మితో నైతి
వంతకునెక్కుడై యంతకుఁ గిట్టి ♦ యంతకునకు నీవ యంతకుఁడైతి
వారనిబలుఁడైన వరుణుని యాత్మ ♦ నీఱుగావించితి నిర్జరారాతి
చక్రవర్తుల రాజ్యచక్రముల్ద్రిప్పి ♦ చక్రముల్గొంటి రాక్షసచక్రవర్తి

శూలాయుధునిఁ గిట్టి శూరత మెఱసి ♦ మూలకుఁ జొనుపవా ముక్కంటి యనక
వాసవు నన్నాక వాసులఁ గోడ ♦ వాసి దప్పింపవా వాసికి నెక్కి
వేఁడికిఁ బలుమాఱు వేఁడిమిఁ జూపి ♦ వేఁడిమిఁ బాపవా వేఁడికోనవలు
బలియునిఁ గోణాదిపతి దైత్యనాథు ♦ నలిగి మర్దింపవా యదిక శౌర్యమున
నిలిచిన చోటను నిలువంగనీక ♦ పలుమాఱుఁ దూలవా పవనుని దూత
హనుజుఁ డాతఁడు నీవు మనుజాశనుఁడవు ♦ మనుజుండు నీ చేత మను టేల కలుగు
నీశ్వరుఁ గూర్చి మహేశ్వర క్రతువు ♦ శాశ్వతకీర్తిమై సలిపె నీ సుతుఁడు
సాంద్రానుమోదియై సఫలత నొంది ♦ యింద్రుని భంజింప నింద్రజిత్తయ్యె
నా యింద్రు జెఱఁ బెట్టి నజుఁడు వేఁడుటయు ♦

నా యజునకు విడ్వ డా యింద్రజిత్తు
అతఁడు చాలఁడే యాలంబు గెలువ ♦ దైతేయకులనాథ తగదు చింతింప
అని మంత్రులాడుచో నధిక దర్పమున ♦ ఘనమైఁ లావులు గల దైత్యవరులు

—— * రాక్షసాధిపులు రావణునితో ప్రతాపము దెల్పుట *:——

ప్రళయకాలాంతకబలులైనవారు ♦ సులభ శౌర్యుఁడు ప్రహస్తుఁడు నింద్రజిత్తు
శతమాయుఁడును బలశాలి దుర్ముఖుఁడు ♦

అతికాయుఁడును మకరాక్షుండు ఖడ్గ
రోముండు వృశ్చిక రోముండు సర్ప ♦ రోముండు మఱియు విరూపాక్షకుండు
అక్షీణబలుఁడు ధూమ్రాక్షుఁ డున్నాఁడు ♦ అక్షతోన్నతుఁడు యూపాక్షుఁ డున్నాఁడు
రమణీయబలశాలి రశ్మికేతుండు ♦ అమితవిక్రమపూర్ణుఁ డగ్నివర్ణుండు
వజ్రదంష్ట్రుండును వక్రకేతుండు ♦ వజ్రదేహుఁడు బలవంతుఁడైనట్టి
సుప్తఘ్నుఁ డగు మఱి శోణితాక్షుండు ♦

ప్రాప్తశౌర్యుఁడు మహాపార్శ్వుఁ డున్నాఁడు [రుఁడు
ఒనరఁ గుంభుఁడు నికుంభుఁడు సూర్యనేత్రు ♦ డును నగ్నికోపనుఁడును మహోద
దివ్యులఁ గెలిచిన దేవాంతకుండు ♦ నవ్యవిక్రమశాలి యా నరాంతకుఁడు [యు
కడునుగ్రుఁ డగు మహాకాయుఁ డున్నాఁడు నడరి విద్యుజ్జిహ్వుఁ డనువాఁడును మఱి
గంపనుఁడును మహాఘనుఁ డకంపనుఁడు ♦ పెంపారుచున్న యభేద్యవిక్రముఁడు
నాదిగాఁ గలుగు మహాదైత్యవరులు ♦ నా దైత్యవల్లభు నగ్రభాగమునఁ
గన్నులఁ గోపంబు గడలుకొనంగ ♦ మిన్నులు ముట్టంగ మీఱి పల్కుచును
బ్రళయావసర మహాపవనిర్ఘాత ♦ కులపర్వతములన గుంభినియదర
నొండొరుఁ జూచుచు నుద్దండవృత్తి ♦ నొండొరు మెచ్చక యుగ్రత మెఱసి
యార్పులు నిగుడ నత్యుగ్రత మ్రగ్గు ♦ సర్పంబులను బోలె సరభసవృత్తి
శూలంబు లంకించి సురియలు బిగిచి ♦ వాలముల్ జళిపించి వరతనుత్రాణ

సబళంబులమరించి చక్రముల్ద్రిప్పి♦ ప్రబలంబులగుభిండివాలముల్దిగిచి
పట్టసంబెసఁగించి ప్రాసముల్ద్రిప్పి♦ కట్టివిఁడ్లనుగుణకంపముల్చేసి [గను
యుడుగక యెలుఁగులొంకొంటితోరాయ♦ విడుగురుల్మంటలుమిక్కుటంబు
బండారువిపులకేయూరంబులొరయ♦ నొండొరుమకుటంబు లుగ్రతరాల
భాసురమౌక్తిక ప్రకరముల్చెదర♦ రాసిననవహేమ రజములుదొలఁగ
సందడింపుచుమహా సంరంభమెసఁగ♦ బృందారకారితోఁ బేర్చియిట్లనిరి
దేవగంధర్వదైతేయకిన్నరులు ♦ దేవరఁ జూడ భీతిల్లుదురనిన
నరులెంతవారు వానరులెంతవారు♦ సురవైరినినుఁజూచి స్రుక్కకనిలువ
నేమునాఁడొకకొంత యేమఱియుండ♦ నామర్కటాధముఁ డల్లెగెగాక
యింకమాముందఱ కీలంకఁజొచ్చి♦ శంకింపకెవ్వరు చనఁగలవారు
వానరులనియెడి వార్త లేకుండఁ♦ బూనినిర్జించి యిమ్ముల మహీధవులఁ
జంపియేతెంతుము చయ్యనమమ్ముఁ♦ బంపుదానవనాథ పలుకులింకేల
యనిగర్వదుర్వారులై పల్కుచున్న♦ దనుజులనందఱఁ దప్పకచూచి
యురవడింపకుఁడు యోహాహా మానమానఁ ♦

డరసి కార్యముచూత మని విభీషణుఁడు
చిత్తంబులోనఁ జేర్చినయింద్రియములఁ♦ నొత్తిరడించిన యోగియుఁబోలె
బరఁగగర్జించు నుత్పాతమేఘముఁ♦ నిరుపునఁబెట్టిన యింద్రునిభంగి
ననువొందనప్పటికట్లకూర్చుండఁ♦ బనిచికార్యముముట్టఁ బలికెవారలకుఁ
బెనుపొందఁగాసామ భేదదానములఁ♦ గొనరానికార్యంబు గొనకొననేని
మఱిగదాదండంబు మాయలుఁ బెనచి♦ నెఱపుటమున్న దుర్నీతి యేమిటికి
నెనయంగశాత్రవుఁ డేమఱియుండ♦ మనకిఁక నేమఱి మనుటకుఁదోఁచు
నాతలనొకశత్రుఁ డతనిపై విడియ♦ నేతెఱంగునసేన నెత్తిపోజనును
దానిపైనతనికి దైవశక్తియును♦ హీనమైయున్ననీ యింతయుఁదగును
యెన్నఁడునేమఱ డెదురెండు లేదు♦ మున్నదైవంబు రాముఁడుగాఁడె మఱియు
హరువిల్లువిఱిచిన యట్టిసాహసుఁడు♦ పరమవివేకి దోర్బలజయాదికుఁడు
మీచేతసాధ్యుఁడే మిహిరకులేశు ♦ డేచిమీరతనిపై నెన్నియాడినను
గడలేనియీవార్ధి కాలువకరణి♦ వడిదాఁటిరాఁడె యావాయునందనుడు
వచ్చియీలంకలో వలసినమాడ్కి♦ నచ్చెరువందిమీ రందఱుఁజూడ
నేమేమిచేసెనో యెఱుఁగరామీరు ♦ రామునివంటి శూరత్వంబుచూప
నతఁడొక్కవానరుఁడా యెన్నిచూడ♦ నతనికినెక్కుడై నట్టివానరులు
నావానరులకెక్కుడైనవానరులు♦ న వివింపగా లెక్కపరగంగరాదు
మీకురాఘవుని నెమ్మియినోర్చువారు♦ వారనిశోషంబు వనలనేపారి

యెదురించిదన్నును నెఱుగక పలుకు ♦ టిది వివేకమె దానవేశ్వరులార
రామలలో నభిరామ యాసీత ♦ రాముని దేవి సరణ్యామధ్యమున
భయమున రాముని బలుమాఱు జీఁక ♦ రయమున దెచ్చె నీ రాక్షసేశ్వరుఁడు
మదిలోన దలపోయ మనకీడె కాక ♦ యితనికి జేసిన యెగ్గేమి యతఁడు
ఖరదూషణాదుల కడిఖండములుగ ♦ ధరణిపై గూల్చె గదా యని మీరు
తలచెదర తనిపై దైత్యులపోక ♦ తలపుచు వారిపై దాడిపోఁదగున
తమ నేరముల వారు ధరణిపై గూలి ♦ యమరలోకముకేగి రది చెప్పనేల
మేటి వానరులిట మీఱకమున్నె ♦ కోటలు వారిచే గూలకమున్నె
సౌమిత్రి బాణవర్షము రాకమున్నె ♦ రాముని కోపాగ్ని రాజకమున్నె
యాయగ్ని చేలంక యడఁగకమున్నె ♦ యీయసురావళి యీల్గకమున్నె
సీతఁ బుచ్చుడు వేగ శ్రీరాముకడకు ♦ సీత దెచ్చినకీడు చేఁ జేతఁ గుడుపు
ధర్మాత్ముఁడౌ రామ ధరణీశ్వరుండు ♦ ధర్మంబువలననే తగనుఁడు జయము
అని పెక్కుభంగుల నా విభీషణుఁడు ♦ దనుజవీరు బల్కె దశకంఠుఁ జూచి
తలపోయి సుఖమును ధర్మంబు తెలుప ♦

వలతియై పరగు దుర్వ్యసనంబు విడువు
సుఖము కీర్తిని జేయు సుచిరధర్మ ♦ మఖిలనీతిజ్ఞుఁడ వగుదు మైకొనుము
చలము మానుము సుప్రసన్నుండవగుము ♦ కులమెల్ల రక్షించుకొన జూచితేని
జనకజ విడువుమా జననాథుతోడ ♦ మనకేల వైరంబు మదిమదినుండి
యని విన్నవించిన నతని వాక్యములు ♦ విన బుద్ధిపుట్టక వెనుఁగొల్వు విడిచి

—:* విభీషణుఁడు రావణుని యొద్దకుఁ బోవుట *:—

రావణుఁ డంతఃపురంబున కరిగె ♦ నా విభీషణుఁడంత నా మఱునాడు
ప్రథమసంధ్యావిధు ల్పరిపాటిదీర్చి ♦ రథమెక్కి సల్లడ రాక్షసుల్ గొలువ
రమణీయచిత్రతోరణ రాజవీథి ♦ కమనీయశిల్పము ల్గనుఁగొంచు వచ్చి
పటుహేషితంబులు పటుబృంహితములు ♦

సటహశంఖాదుల బహుని నాదములు [తులు
సేవాగతాంగనా శింజితంబులును ♦ సావాసు లపరించు చండహుంకృ
సూతమాగధవంది శుభకీర్తనములు ♦ నాతతభటసంకులాలాపములును
మాతంగనిశ్వాసమారుతోద్ధూత ♦ కేతనాంశుకపటాత్కృతులోలిబెరయ
బధిరదిగ్భాగమై బహుళోర్మిజలధి ♦ విధమున మ్రోయంగ విశ్వాస మొదవ
రాక్షసవీరుల రక్ష చేనమరి ♦ నక్షత్రపరివృత నవసౌధమనఁగ
దెలుపిలే కిభములు తేరులు హరులు ♦ గిరికొన్న నగరివాకిట దేరుడిగ్గి
ఆజ్యపాత్రాదుల నర్పితులగుచు ♦ బూజ్యగుణంబుల భూసురోత్తములు

పుణ్యాహవాచన పూర్వకంబైన ♦ పుణ్యశాంతులు సేయ బోరిగన్గొనుచు
మనసింపనాస్థాన మంటపంబునకు ♦ జనుదెంచియున్నకు సద్భక్తిమ్రొక్కి
యలమినాతడుచూపసర్వపీఠమున ♦ నెలమితో గూర్చుండి యేకాంత మెఱిగి
మంత్రులసన్నిధి మహనీయమంత్ర ♦ తంత్రజ్ఞుడనియె నాదశకంఠుతోడ
అవధరింపుము దేవ యసురాదినాథ ♦ యవనిజదెచ్చిన యంతనుండియును
దుర్నిమిత్తంబులు తోచుచున్నవియు ♦ నిర్ణయింపగరాదు నిక్కంబరయ
హోమగుండంబులనున్న త్రేతాగ్ను ♦ లేమియు వెలుఁగ వీయీదివసముల
నాగుండములజొచ్చియలమిజుట్టియును ♦ సాగిపడియుండుసర్పము లెప్పుక్క
నుడుగనిమదములనో యుతుమ్మెదలు ♦ దడునొప్పనమ్మదకరులెల్లనిపుడు
కడుమేనుడిల్ల మైకంపులతోడ ♦ మెడలెత్తుకొని స్రుక్కి మెదలకున్నవియు
నున్నతస్థితిగల నత్తభాశ్వముల ♦ గన్నులనీళ్లను గాఱుచున్నవియు
గవణంబు నీరును గడ్డియునుడిగి ♦ జనసత్త్వములు దూల సడలియున్నవియు
వానితో కలయుండు వడినగ్నిశిఖలు ♦ మానుగానలుగుల మంటలు వెడలు
వరదాలపై నగ్నులెంట గాలుచుండు ♦ బొరిపోరియొల్కములుబ్భవిబడద్రోణగె
జడిగొనవీరమస్తముల వాయసము ♦ లడరుచు నురములో నాడంగద్రోణగె
ఖ్యాతిగా శిఖలతో గడగి కూపముల ♦ భాతిగా మండూక పతులుద్భవించె
దేవగేహముల భూదేవగేహముల ♦ భావింప శిథిలాది పక్షులుపుట్టె
ఇంద్రధనుస్సులు నిటరాత్రులందు ♦ జంద్రధారికినైన జయము లేదంద్రు
పూనిచూడఁగ శుభంబులుగావుమనకు ♦ పీనివిచారించి విగ్రహంబుడుగు
మటుఁగాననిన్నిటికసురాధినాథ ♦ శరమేలవిను మొక్క శాంతిచెప్పెదను
శ్రీరామునకునిమ్ము సీతఁగొంపోయి ♦ నేరమిఁబట్టడా నృపకుంజరుండు
ఎందునీతిజ్ఞుల కిది లెస్సకార్య ♦ మిది తెలుసెఱుఁగరా యిదిబుద్ధియనుట
దనుజేశ నీచిత్త ధర్మంబునూఁది ♦ వినుమని చెప్పంగ వెఱతురుగాక
నాకుఁబోరాదు దానవనాథ గాన ♦ నీకుఁజెప్పితినిట్లు నీతిమార్గంబు
అనిబుద్ధిచెప్పిన నవ్విభీషణుని ♦ వినుతవాక్యంబులు వినులఁజొరక
నెవ్వరిదిక్కున నేభయంబెఱుగ ♦ నెవ్విధంబున సీత నేనురామునకు
దుర్జయుండగునాకు దురమునో నెదిరి ♦ నిర్జరుల్తోడైన నిలుచునేయనుచు
గోపంబుదీపింపఁ గొలువెల్లవిరిసి ♦ వేపోయెదానవ విభుఁడులోపలికి
మఱునాఁడు లేచి క్రమ్మఱ రావణుండు ♦ మఱువక సంధ్యా సమాధులుదీర్చి
యనుజుని వచనంబు లాత్మ జింతించి ♦ తనప్రధానులు దాను దలపోయఁదలచి
భానుమండలసమప్రభగలయట్టి ♦ మానైనదివ్యవిమానంబు నెక్కి [అయ
కమనీయబహురత్న కలితంబులగుచుఁ ♦ గొమరారగాఁ బైడికుంభముల్ మె

వెన్నెలచూలన విరచించినట్టి♦యున్నత ఛత్రంబు లొప్పారుచుండఁ
గంకణఝణఝణత్కారముల్మెఱయ♦నంకించి చామర లతివలు వీవ
బెక్కుతూర్యంబులు పెల్లుగా మ్రోయఁ♦
బెక్కండ్రు సుభటులు పెంపారి కొల్వ
వందిమాగధులు కైవారంబు సేయ♦సందడి జడిచు నైశ్వర్యంబు మిగులఁ [కు
జనుదెంచి బహుమంత్రిసహితంబుగాఁగ♦మనుజాశనులు మున్న మంటపంబున
నర్కవంశునిశరా హతిఁ దెగిపిపప♦నర్కబింబముఁ జొత్తు నని తెల్పుకరణి
జొచ్చి సింహాసనస్థుండునై పిలువఁ♦బుచ్చె నాయకుల నప్పుడు పడవాళ్ళ
వారును దమరథావళులపై నెక్కి♦వారణంబుల నెక్కి వాజుల నెక్కి
చారుచామీకర ఛత్రంబులొప్ప♦వారక భీషణాకారంబులొప్ప
తమతమతూర్యనాదములతో నచ్చి♦క్రమమున మంటపాంగణములయందు
దమవాహములు డిగ్గి తనరు సింహములు కొమరారగా గిరిగుహఁ జొచ్చు కరణి
నామంటపము జొచ్చి యాదానవేంద్రు చేమన్ననలు గాంచి చిత్తంబు లలర
నుచితాసనంబుల నుండి పడాలు♦రుచితంబులెఱిఁగింప నుత్తమంబనుచు
దేవ నేఁడెంతయు దెలిసియున్నాఁడు♦దేవతరమ్ముఁ డుద్దీపితబలుఁడు
ఘనుఁడగు నా కుంభకర్ణుండు నాఁగ♦విని పిల్వుఁడనవుడు వేగ వారేగి
దేవారిసభకు నేతెంచి కొల్వుండి♦దేవ నిన్ బిలువఁ బుత్తెంచె నావుడును
కొడుకులు కుంభనికుంభులుఁ గొలువ♦గడు వేగమున గుంభకర్ణుఁడేతెంచి
మణిమయంబై దివ్యమహిమలు గలిగి♦గణికాసమూహంబు గానవాదముల
నెంతయు నింపార నెసఁగిన మంట♦పాంతరంబునను సింహాసనస్థలిని [వేళ
నున్న యన్నకు మ్రొక్కి యొగి గొల్వు జొచ్చి♦యున్న తాసనమున నున్న యా
నన్నతోడనె వచ్చి యా విభీషణుడు♦క్రన్నన గూర్చుండె గనకపీఠమున
నప్పుడా రావణుం డమరవల్లభుని♦యొప్పిల్లగై కొని యుండి ప్రహస్తుఁ
గనుఁగొని పలికె లంకాపురంబునకు♦బనుగొన బెట్టుము బలువైన కాపు
మతి నేమఱకు మెల్ల మార్గంబులందు♦బ్రతిదివసంబులోపను వేల్పులను
నని దానవాధీశుఁ డా కుంభకర్ణు♦గనుగొని పల్కె నుత్కంఠ దీపింప

—:* రావణుఁడు కుంభకర్ణునితో రాముని రాక యెఱిఁగించుట *:—

విను కుంభకర్ణ నీవిన నిదియొకటి♦జనపదంబున కేగి చయ్యన నేను
రాముని దేవి ధరాసుత సీతఁ♦గామించి తెచ్చితిఁ గంజదళాక్షి [సఁగి
మతిమొన్న నొక హనుమంతుఁడఁ గోతి♦పఱతెంచి సీతకు బరిణామమొ
దేవి నీపతి రామదేవుండు వచ్చు♦నా విని మదిలోన నమ్మి మోదమున
నున్నది యాసీత యుద్దండవృత్తి♦నన్నరుండును నబ్ధి కవ్వల విడిసె

వనములలోఁగల వనచరావళిని ♦ బెనుమూఁకగాఁగూడఁ బెట్టుకేతెంచె
సురనాథు సురలను స్రుక్కించినాఁడ ♦ హరుఁడున్న కైలాస మగలించినాఁడ
శంభుచేఁ జంద్రహాసముఁ గొన్నవాఁడ ♦ నంభోజభవువరం బడిగికొన్నాఁడ
దానిపై నీలావు తఱలియున్నాఁడ ♦ మానవుండే నన్ను మర్దించువాఁడు
రాముఁడెన్నఁడు గెల్చు రణభూమి నన్నుఁ ♦ గోమలి నెన్నఁడు గొనిపోవు నతఁడు
అనవుడు గోపించి యాకుంభకర్ణుఁ ♦ డనియె రావణుతోడ నందఱు వినఁగ
రామ వంచించి యారాముని దేవి ♦ నేమరియుండంగ నెత్తి యుద్వృత్తి
దెత్తురే యిటులేల తెచ్చితి కడఁగి ♦ చిత్తంబులో నీతి చింతింపవైతి
ధర్మమార్గము నీవు దలపోయవైతి ♦ వర్గిలి కులమెల్ల వడఁగఁ జేసితివి
సీతఁ దెచ్చిన యపుడె చెడియె నీ లంక ♦ నేతె అున్నైన నిదియ నిశ్చయము
ఎట్టైన నేమి యా యినకులేశ్వరుని ♦ నట్టన శరములు నెరిగాడకుండ
బ్రతికివచ్చితి నీవు భాగ్యంబు కతన ♦ నిది మేలు కీడని యెన్నంగ నేల
పోవచ్చునా యింకఁ బూనుదు గాక ♦ రావణ యింత కార్యము చక్కఁబెట్ట
నామీఁదఁ బడియె వానరుల రాఘవుల ♦ నేమియుఁ దలఁపక యింక సుఖంపు
మని పల్కుచుండ మహాపార్శ్వుఁ డనియె ♦ ఘనభుజ యెల్లలోకములకు నీవ
పతివఁట యాసీత నలువునఁ బట్టి ♦ రతిసల్ప నెరవా రాక్షసాధీశ
యనవుఁడు జిత్తంబునందు మోదించి ♦ దనుజాదినాథుఁ డాతనిఁ జూచి పలికె
వినుమహాపార్శ్వ యే వేధకొల్వునకుఁ ♦ జనుచోటఁ బుంజికస్థలయను నాతి
వలువూడిపడఁ బట్టి వడఁగు వియించి ♦ బలిమి భోగించితి పైఁబడి తొల్లి
యామేర లెల్లను నబ్జజుం డెఱిఁగి ♦ నామీఁదఁ గోపించి నయమింత లేక
యోరి రాక్షస కడు నుచితంబు దప్పి ♦ నారీజనము లేడ నయమింత లేక
బలిమి నెవ్వతెనైనఁ బట్టి భోగింపఁ ♦ దలఁతు వెప్పుడు నీదు తలలప్పుడవిసి
వారక యిలనూఱు వ్రయ్యలై రాలు ♦ పోపొరియనుచు శప్తుఁ జేసి విడిచె
నది కారణంబుగా నంగనాజనుల ♦ హృదయంబెఱిఁగియక యేనందుఁ గదియ
నా లావుగొనక వానరులతోఁ గూడి ♦ యీలంకపై రాముఁ డిటవచ్చు నెల్ల
నిద్రించు సింహంబు నిరి మేలుకొల్పు ♦ భద్రదంతావళి ప్రతతిగిధంబు
అని పల్కుటయు నవ్విభీషణుఁడు ♦ దనుజనాథునితోడఁ దగ విన్నవించె
మొనయ నిట్టూర్పులెగ్ర మోగుటగా ♦ ఘనమైన చింత యెగరళంబుగాఁగ
గోపంబు చలమును గోఱలుగాఁగ ♦ నేఁడిరియుండుఁటే యెరగొంటకాఁగ
నమరంగ జెక్కున హత్తిన చేయి ♦ కమనీయతర ఫణాకారంబుగాఁగ
నిజనఖంబులు మణినికరంబుగాఁగ ♦ భుజయుగమధ్యంబు భోగంబుగాఁగ

దారుణంబైన సీతాకాలసర్ప ♦ మేరూపముననైన నేలపోనిచ్చు
నపకీర్తియఁటపాపమఁటసుఖంబునకు ♦ విపరీతమఁట యిట్టివితమేలయుడుగు
మనియన్నతోఁబల్కి యంతటఁబోక ♦ సుశిక్షితమతి ప్రహస్తునిజూచిపలికె
నరిపిడుగులఁబోలునృపుని బాణములు ♦ గఱులానినీదువక్షముగాదునాడు
ఎరిగెదుగా నేల యిట్టట్టుపడెదు ♦ కఱకులాడెదుమాడ్కిఁగాదుమీఁదటను
ఈకుంభకర్ణుండు నీనికుంభుండు ♦ నీకుంభుఁడునుమరి నీమహోదరుఁడు
నీమహాపార్శ్వుండు నీయింద్రజిత్తు ♦ రాముని గెల్చువారా రణంబునను
నేపుచూపకయుప్పుడేఁదుబోయెదరు ♦ ప్రాపులై మీరడ్డపడెదరుగాక
కడఁగియింద్రుఁడువచ్చి కాచిననైనఁ ♦ గడునడ్డపడిసురల్ గాచిననైన
కాలాగ్నిరుద్రుండు గాచిననైనఁ ♦ గాలమృత్యువువచ్చి కాచిననైన
రావణుఁజంపకా రామభూపాలుఁ ♦ డేవిధంబుననైన నేలపోనిచ్చు
దనుజేశుపైవిల్లు ధరియించునపుడు ♦ మనచేతఁబోవునే మనుకులేశ్వరుఁడు
పిడికిటనడఁగునే పేర్చుకాలాగ్ని ♦ పుడిసిటనడఁగునే పొంగారుజలధి
పట్టంగనలవియే పాతాళతలము ♦ గట్టింపనలవియే గగనభాగంబు
త్రెంపంగవచ్చునే దిగ్వితానంబు ♦ త్రుంపంగవచ్చునే ధూర్జటివాలు
నఱచేతనడఁచిన నడఁగునేసూర్యుఁ ♦ డెఱుఁగనిమీతోడ నిట్లాడనేల
కడుమూర్ఖునాకారి కామాతురుండు ♦ మడియుడెమీయట్టిమంత్రులుగలుగ
నాబుద్ధివినునె యీనాకేశవైరి ♦ మీబుద్ధిఁజెడుఁగాక మిక్కిలిక్రొవ్వి
యనిమొగమోడకయాడప్రహస్తు ♦ డనువాడుగైకొనకావిభీషణుని [ను
నురగులతోఁబోరియోడమెన్నఁడును ♦ సురలతోఁ బోరాడిస్రుక్కమెన్నఁడు
యక్షులతోఁగిట్టి యలయమెన్నఁడును ♦ రాక్షసావళిచేతఁ గ్రాఁగమెన్నఁడును
ః రుడైనయీరామనరనాయకునకు దురములోనే మోడుదుమె విభీషణుడ
యేచందమునవారి నెఱుఁగుదో కాని ♦ నీచేతవింటిమి నేఁడింతవింత

—:* ఇంద్రజిత్తు విభీషణునికి తనలావెఱిఁగించుట *:—

దనుజుఁడిలావంత తక్కవేయునినఁ ♦ జనియెనాగ్రహమెత్తి జంభారిజిత్తు
తోరమైపేర్చిన దుర్మదగ్రంధి ♦ యూరాముతమ్ముశరాగ్నిచేఁగాలఁ
గారణంబటుమీఁదఁ గలుగఁటఁజేసి ♦ యేరూపమునసీతి నిచ్చలోనిడగ
వినువిభీషణనీవు వెఱచెదుగాక ♦ మనయందురాక్షస మహిమలూహింప
హీనుఁడైననునోపు నింతటిపనికి ♦ మానకరామలక్ష్మణులమర్దింప
మూఁడులోకములు నిమ్ములనేలువాని ♦ వాఁడివజ్రముగలవాసవుఁబట్టి
చెఱఁబెట్టినావాని సితకరిఁబట్టి ♦ విఱువనాకొమ్ములు వింతయేనీకు
ననలుగారించియయ్యంతకునొంచి ♦ దనుజువారించియాతరివానినొడిచి

గాలిఁదూలించి యక్షుపునిమర్దించి ♦ శూలినోడించి నిష్ఠురతవాటించి
యేచిననాచేత నీవరుల్బావ ♦ రాచెప్పెదుబ్బి వారలఁబెద్దచేసి
కలఁతునా సప్తసాగరములుసొచ్చి ♦ మలపుదునా మేరుమందరంబులను
దాఁటుదునాధరా తలమెల్లఁగడవ ♦ మీటుదునా నేలమిఁటితోనంటి
వంతునాజగములు వనచరకోటి ♦ మ్రుంతునాబెగడొంద మున్నీటిలోనఁ
బుడమిమోచిన నాగపు గవుఁబట్టి ♦ పిడుతునావిషమెల్లఁబిచ్చిలిపోవ
నొక్కటదుండంబు లొడిసిరాఁదిగిచి♦దిక్కరీంద్రులనీడ్చి తెత్తునాపూని
భూమిలోనిప్పుడు భుజశక్తిమెఱసి♦ప్రాయుదునా చంద్రభానుబింబముల
వనచరకోటుల వైతునాపట్టి ♦ దినకరబింబంబు దిక్కులుగడవ
నాలంబులో వానరాలిరక్తములు♦గ్రోలింతునా భూతకోటులచేతఁ
గప్పుదునాయంపగములచేమిన్ను ♦నిప్పుడమియుదిక్కు లిన్నియుఁగూడఁ
గడునొగల్కరములఁ గబళించిత్రిప్పి♦ కుడుతునా నేలతో నర్కునిరథము
పెడచేతలోచేత బృథివియుమిన్ను ♦ నడతునాపొడిపొడియై రాలిపోవ
దనుజాదినాథుని తమ్ముఁడవగుట♦ననునొండపక మన్నించితిగాక
యొరుఁడైన నసైతునే యూరకయుండు♦పెరవిడిమాటలు వేయాడనేల
ననవుడుగోపించి యావిభీషణుఁడు♦కనుగొనిపలికెను నుద్గాఢవాక్యముల
నెవ్వనిగాఁజూచి యినకులేశ్వరుని♦గ్రొవ్వులుపలికెది కెలువులోపలను
గణుతింపనింద్రుండు గాడుసికోడ ♦ రణభీషణుండగు రాముండుగాని
గనుతింపననలుండు గాడునీకోడ♦రణభీకరుండగు రాముండుగాని
గనుతింపగాలుండు గాడునీకోడ♦రణమహోగ్రుండగు రాముండుగాని
గనుతింపనైరృతి గాడునీకోడ ♦ రణవిశారదుడగు రాముండుగాని
గనుతింపవరుణుండు గాడునీకోడ♦రణజయోన్నతుడగు రాముండుగాని
గనుతింపననిలుండు గాడునీకోడ♦రణనిపుణుడగు రాముండుగాని
గనుతింపధనదుండు గాడునీకోడ♦రణకౌశలుండగు రాముండుగాని
గనుతింపబశుపతి గాడునీకోడ ♦ రణవిచక్షణుడగు రాముండుగాని
వారికోర్చినరీతి వచ్చునె యోర్వ♦నా రామవిభుశర నాదంబులోన
దలముకప్పినయట్టి తలపుఁదలంచి♦తలక్రిందువడియెదు తద్దయుఁగ్రొవ్వి
కులనాపకుండవు కొడుకవానీవు ♦ వలయురావణ పగవాడవుగాక
పావకనిభరామ బాణఘట్టనకు♦రావణుండెయోర్చు రణములోనిలిచి
యీరావణుడు తనహితులతోఁగోడ♦నారామభూపాలు నడుగులకెరగి
మనులతోవారణ మనులతోదురగ♦మనులతోమానిని మణినిచ్చుటొప్పు
ననవుడురావణుం డావిభీషణుని ♦ దనరోమహృష్టుల దప్పకచూచి

పగవానితోనైన శాయకకూడి♦మిగిలినయేపుతో మెలగంగవచ్చు
బటువిషంబొలికెడు పాముతోనైన♦జటులనిర్భరవృత్తి జరియింపవచ్చు
దనవానివలెనుండి దాయలగూడి♦మనువానితోగూడి మనరాదుగాక
వారకనీవట్టి వాడవుగాన♦వైరులనాయొద్ద వర్ణించెదుగ్రి
తమ్ముడవనిచంప దగదుకాకీవు♦తమ్ముడవాపగ దాయవుగాక
యనవుడుబ్రహ్మ శాపాతిశయంబు♦గొనకొనటమెరంగి కుంభకర్ణుండు
తమ్మునిమాటలు తగదనలేక♦యెమ్మెలాడెడినన్న నెట్టనరాక
యగ్గారనముతోడ నన్నకుమ్రొక్కి♦దిగ్గునగుహకు నిద్రింపగజనియె
జనినపిమ్మటవిభీషణుడు రావణుని♦కనియెజిత్తంబున నలుకరెట్టింప
నన్నవుగాననీ యాపదకులికి♦యిన్నియుజెప్పితి హితవననీకు
బొసగదుబహుముఖంబులుగాననీకు♦వసుధేశ చెప్పిన మాస్వాలబుద్ధి
హితవుచెప్పెడిమంత్రులెందునుగలరు♦హితవనివినురాజు లెందుగల్గుదురు
తగువారుజెప్పుట తగునీకవినుట♦తగుసీతనిచ్చుట తగనీతినీకు
బహుమొంతగలిగిన బరికించుచూడ♦నలవెంతగలిగిన నదియేమిసేయు
బురుషునివెరపున బోనీకపేర్చి♦పరికింపదైవంబు ప్రతికూలమైన
దైవంబవానికిందు దైవంబుగలదె♦దైవంబుదశరథతనయుండుగాక
యనివిభీషణుడాడనారాయణుండువినిబొమల్ ముడివడవిక్రుతాస్యుడగు
మిన్నదగోపించి మీరంబుమిదర♦గన్నులమంటలు గ్రమ్మెట్లనియె [చు
నన్నదురామునినిట్టుదైవముచు♦నన్నరుడే దైవమయ్యెడుచేని
వెడగయితండ్రిచే వెడలంగనోపు♦వడిముడవుల నేలపడిగ్రుగ్గిసుక్కి
విరుమారునలమును వేరువెల్లంకి♦దినియెడివానినే దేవరయండ్రు
ననుదాకవలదె క్రన్ననెదురించి♦తనదేవిగొనిరాగ దైవంబయేని
నలసితమ్ముడుదామ నడవులలోన♦బలవించిపలవించి పలుమారుదిరిగి
వచ్చిసుగ్రీవుడ న్వానరుమేలుగ♦నొచ్చుటదైవంబు చొప్పెరీతలప
బలుమఱునేటికా పంతమాడవుని♦జెలిగినాతో సరిజేసిచెప్పెదవు
అనినరావణుతోడ ననియెగ్రమ్మఱన♦వనలోనవవ్వుచు దగవిభీషణుడు
ఎసగిదివ్వబెంప బుషులరక్షింప♦నసురులశిక్షింప నవనిపాలింప
నాదినారాయణుడర్కవంశమున♦గానశరథునకు నమరజన్మించె
వనజాసనాదులు వర్ణింపలేరు♦సనకాదులునుగూడి చర్చింపలేరు
ఆతనిమహిమను నీకలవియే తెలియ♦రాముడమర్త్యుండెరాజసాధిశ
కానరామునిగని కంజాస్యనిమ్ము♦దానవేశ్వరమన దలచేదవేని
మనుగకయర్థకామంబులవలన♦గలుగగ్గలంబైన ధర్మమెక్కడిది

నీవొల్లవెన్నఁడు నీతిమార్గంబు ♦ నీవారునొల్లరు నీకంటె మున్న
కాన్యగార్యాకార్య గతియెట్టిదనిన ♦ దానవేశ్వరునీకు ధర్మంబు కలదె
నాతూలసుతుచేత వనముచెడ్డట్లు ♦ సీత చేలంకయు జెడగలదింక
వచ్చెదరగచరు ల్వారిధిదాఁటి ♦ వచ్చియీరాక్షస వనితలనెల్ల
మోడ్చినరకముల ముందలల్వట్టి ♦ యీడ్చెదరటువలె నీడ్వకమున్న
యొప్పింపుమా సీత నర్వీశ్వరునకు ♦ దప్పక చెప్పితి దానవాధీశ
మండెడి నగ్నుల మాటికి రాఘవుని ♦ దండి బాణంబు లుద్దండత వచ్చి
నీరొమ్ము గ్రోని కాడ నేర్తునె చూడ ♦ నీరాజ్యగతి చూడ నేర్తుగాకేను
ప్రళయానిలముఖున పర్వతశిఖర ♦ములు గ్రోమ్మ పగిది రాముండు ఖండనము న
నీతలల ద నేలపై గూల్ప ♦ నేర్తు ? వీక్షింప నిర్జరారాతి
యనుడు విభీషణు నదరంట జూచి ♦ మానకొని పది మొగంబుల జేగురింప

—:* రావణుఁడు విభీషణుని దన్నుట *:—

గటములు ప్పొంగ నౌర్కుట నూర్పులెసఁగ ♦
బటుధూమముల తోడి పావకుండనఁగఁ
బదహతిమీఁది పీఠాగ్రంబు వగుల ♦ నదలుపుబెట్టుచు నాకసముగల
వద్దిరాయిలని కోపావేశమునఁగ ♦ గద్దియమీఁద డిగ్గనడిగ్గనురికి
యడిదంబు జళిపించి యటు వ్రేయఁబూని ♦ యుడిగి విభీషణు నుగ్రతఁదన్నఁ
దన్ని నవజ్రంబు తాఁకునఁగూలు ♦ నున్నతగిరిపోలె నుర్విపైఁబడియెఁ
బడిన వెండియు వ్రేయఁ బాటఁ బ్రహస్తుఁ ♦
డెడచొచ్చి వలదని యెడలించె వారు
కొలువెల్ల నాతని కోపంబుఁజూచి ♦ తలఁకొని యెంత వింతలుపుట్టెననఁగ
నపలార్చునత్తులు నడరద్రైతేయఁ ♦ దని యెనిర్దయత ప్రహస్తునిఁజూచి
పీనిదురుక్తులు వింటె ప్రహస్త ♦ పీనినమ్మెడిది యెవ్విధినమ్మఁడనుచు
వెడలంగఁద్రోయుము వేగంబె పీని ♦ నెడచేసి మొగమోడితేని నాయాన
యనినఁబ్రహస్తుండునవ్విభీషణునిఁ ♦ గనుఁగొని పలికె నాగ్రహావృత్తిదోఁప
వలదిటనీవుండ వలసిన యెడకు ♦ వెలుపడి యరుగు మిప్పాటికిఁ బాసి
యనిన విభీషణుం డతికోపుఁడగుచు ♦ ననలుండు ననలుఁడును హరుఁడు సంపాతి
యనువారితోఁగూడి యసురేంద్రుతోడ ♦
ననియె నుద్భట గదాహస్తుఁడై నిలిచి
మదనాతురుండవు మతిపాపములకు ♦ గుదురైనవాఁడవు క్రూరకర్ముఁడవు
మున్నిక దానిన్ను మూర్ఖునిఁ బాయ ♦ నున్నాఁడ పిదిక్రొత్తయును గాదు నాకు
నార్తరక్షకునిఁ గృపాంబుధి దివ్య ♦ మూర్తి జగద్ధితంబుగఁ బుట్టినట్టి

సత్యసంధుని రామ జనపాలచంద్రు ♦ నిత్యయశోనిధి నిర్మలాత్మకుని
శరణని పోయెద శరణన్న నతఁడు ♦ కరుణతోఁ బ్రోచు నెక్కాలంబునందు
నేనుపోయిననైన నిటమీఁద నెఱిఁగి మానైనసీతతో మను దానవేంద్ర
యట్టుసుగాదేని యగచక్కల్లంకఁ ♦ జుట్టినయపుడైనఁ జూనుపునాబుద్ధి
యట్టుగాదేని యర్కవంశజుఁడు ♦ దట్టించునపుడైనఁ దలఁపునాబుద్ధి
నొండేని రఘురాముని శరములు ♦ దండించునపుడైనఁ దలఁపునాబుద్ధి
ననిపల్కి యన్నకు నవనతుండగుచుఁ ♦ దనతల్లినగరి కుద్ధతిగతిఁబోయి
చెలఁగి సింహంబుచేఁ బడితప్పి ♦ మలుఁగనివగతోడి మదకరివోలె
భీకరారావసంస్ఫీతుఁడై వచ్చి ♦ చేకొని పిడుగడఁచిన యద్రివోలెఁ
జనియటఁ గైలాస సదృశమైనట్టి ♦ ఘనతరంబగు విశ్వకర్మ చేసైన
గృహమున నుపవాన కృశమైన మేఁక ♦ మహితశుక్లాంబర మానితయగుచు
వెన్నెలరసమున విదళించితివిచి ♦ మిన్నేటినురువున మెఱుఁగిడ్డకరణి
నరసిన లోమలును నరసిన శిరము ♦ గరమొప్పఁ బెద్దయు గౌరవంబొప్పఁ
బన్నుగా ముదుక కుప్పసములు దొడిఁగి ♦ చెన్నారు బ్రద్దలు చేతులఁ బట్టి
ముదిసిన విప్రులింతులనందఱిని ♦ వదలక చేరి సావాసులై కొలువఁ
గరుణాప్రవాహంబు గావచోఁథంగి ♦ సరిశత్వమూర్తుల చందంబు గాఁగ
బాలుపారుశమదమంబులుతటంబులుఁగ గలసరులెల్లఁ జొక్కపుమర్యాగాక
వెలసిన తనయొద్ది వేదఘోషములు ♦ పలలితఁ బగుచున్న జలఘోషములుగ
వినుత బహుద్విజ వితతులు చెలఁగఁ ♦ గనుపట్టుజాహ్నవి గంగ నానొప్పి
బహుపురాణంబులు బహువేదములును ♦

బహుశాస్త్రములు పెక్కు బ్రహ్మరాక్షసులు
బహుభంగిఁ జనువంగ బహుభక్తివినుచు ♦ బహుళనిర్మలశుభ్రప్రభ దేజరిల్ల
నుండియు రావణు నొప్పమిఁదలఁచి ♦ కొండంతవగపు చేకొనియున్నతల్లి

—:* తల్లియొద్దకు విభీషణుఁడు వచ్చుట *:—

గాంచి దండముపెట్టి కన్నులనీరు ♦ నించి దుఃఖితుఁడైన నివ్వెఱగంది
కైకేసి నందనుఁ గరముల నెత్తి ♦ కైకొనియక్కునఁ గదియంగఁ జేర్చి
లోపలియిండ్ల నాలోకింపరాని ♦ యాపదల్పుట్టెనో యటుగాక మరియు
బ్రాహ్మణవధయుఁ జొప్పడియెనోకాక ♦ బ్రహ్మకోపించెనో పరికించిచూడ
హరియగ్లైనో హరుఁడగ్లైనో రాముఁ ♦ నరుదారఁ గ్రోధసమగ్రుఁడైనాఁడో
యిది యేమి నాపుత్ర యింతశోకింప నిది యేమి తెఱఁగు నాకింతయుఁ దెల్పు
మడిగెదనదివిన్న యంతకు శక ♦ నొడలిలోఁ బ్రాణంబు లుండవయ్యాదిని
అనిపల్కు తల్లికి నా విభీషణుఁడు ♦ మునుకొని కరములు మొగిచి యిట్లనియె

నవధారుదేవి నీయగ్రనందనుఁడు ♦ రవికులాధీశ్వరు రాకకు నేఁడు
మంత్రులు దానును మంత్రకూటమున ♦ మంత్రమిట్టిదియని మదిఁ జర్చసేయ
నిన్ని విచారంబు లేల రామునకు ♦ నెన్నిభంగుల సీత నిచ్చుట లెస్స
యీకున్న రాఘవుం డీయబ్ధిఁ గట్టి ♦ యీకోలంబడపక నేలపో నిచ్చు
ననియొత్తి చెప్పిన నా పంక్తికంఠుఁ ♦ డనలుండు మండిన యాకృతి మండి
తన్ను గద్దియతోడ ధరఁ బడ నన్నుఁ ♦ దన్నియంతటఁ బోక తాలిమి దక్కి
యడిదంబు జళిపించి యటు వ్రేయఁ బూనఁ ♦ జెడక నే బ్రతికివచ్చితి నొకభంగి
బోయెద నా రామభూపాలుఁ గానఁ ♦ బోయి యాతని కృపఁ బొందియుండెదను
ఈపీట నాకింక నెవ్వరుగ రు ♦ భావింపఁగా నాప్తబంధువులోరులు
అనవుండు నతిభీతయై మూర్ఛనొంది ♦ ఘనమైన ధైర్యంబు కతమునఁ దెలిసి
కైకేసి నందనుఁ గనుఁగొని పలికె ♦ నీక మున్ను నే నెరిఁగివదాన [గూడి
నది యెరింగించెద నమరులు మునులు ♦ త్రిదశేంద్రుఁడును బ్రహ్మదేవుఁడు
యమృతాబ్ధికడ కేగి యచ్యుతుఁ గాంచి ♦ తనుపడు నిడుములు తా మెరింగింప
నీరసంబున నమిమ్మ నేచుచునున్న ♦ క్రూరుల రావణ కుంభకర్ణులను
జంపుటకై యుర్వి జనియించువాఁడ ♦ సా. పారవర్తించు సూర్యవంశమున
నవినేవుఁ డాడిన నావార్తనాకు ♦ వినుపంచె మాతండ్రి విశదంబుగాఁగ
విని యేను వెఱచి మద్విభునకిట్లంటి ♦ నెనయంగ నీలం బెవ్వఁడు నిలుపు
నీపుత్రకులలోన నిక్కంబు చెపుము ♦ ఆపుణ్యదేవ్వఁడో యనఘునాకనిన
సత్యంబు ధర్మంబు శౌచంబు గలిగి ♦ నిత్యయశోనిధి నీకడ గొట్టు
కొడుకు రాముని కృపగోరి యీలంక ♦ కడ నొప్ప బాలింప గలవాడు మీద
నని చెప్పి తపమున కరిగె మాతండ్రి ♦ చెంచరనమ్మేరున గోపాంత్యమునకు
గాననాతడు హరి కంజాప్తకులుడు ♦ మానినియా సీత మహాసీయలక్ష్మి
విశ్రసుని మాట వేయొక్కటగునె ♦ విశ్రుతకీర్తి యేవిధములనైన
జనుము రామునిగని శరణని మ్రొక్కి ♦ మనుము రాక్షసకోటి మనుట చింతింపు
ఆయువును శ్రీయు నగుగాక నీకు ♦ నాయన్న పొమ్ము శ్రీవరనాథుఁడకు
ననియక్షతలు పెట్టి యర్మిలి బేర్మి ♦ తనయుని దీవించి తగ వీడుకొలుప
నతఁడు తల్లికి నవనతుండగుచు ♦ మతిలోనఁ బొంగుచు మంత్రులు దాను
రావణుతనూవుప ప్రాణంబులైదు ♦ నీవిధంబున బోవు నిం ననుమాడ్కి
వేగంబె యాకాశవీథికి నెగయు ♦ నాగుణాఢ్యుని జూచి యాలకవారు
తమతమ వీథుల దమదులో గిళ్లి ♦ గుసురులుగా గూడుకొని పల్కిరపుడు
ధర్మంబు దిగనాడి తగ దమ్ముఁడనగ ♦ బేర్మితో బల్కి విభీషణుని డిచె
నీ తెరంగున నిపు డీరావణుండు ♦ నీతియు ధర్మంబు నేర్పుగోల్పోవు

జెడియెగా కీలంక చెప్పనేలనుచు ♦ నుడుగనివగబతో నుండెడువారు
ఈలంకయీరాతిడె యేలుబొమ్మనుచు ♦ బోలించితమ మనంబుల నెంచువారు
కోరియీతడు రాముగూడుగాకేమి ♦ యీరావణుడు ప్రమగ్గునే యనువారు
నరనాథుడీతని నమ్మునేయచటి ♦ కరిగిననను వార లనుచునుండగను

—:* విభీషణ శరణాగతి *:—

అంతవిభీషణు డాకాశవీధి ♦ సంతసంబున మంత్రి జనులతో నెగసి
వచ్చుటగనుగొని వనచరులెల్ల ♦ నచ్చెరువడిచూచి రటుతలలెత్తి
యెత్తినరాముచే నింద్రారియింక ♦ నెత్తడుదలలు పెడెత్తు దక్కులము
ఎత్తినభయమువో నిటసురలార ♦ యెత్తుడాత్మలతల లెత్తుడన్నాడక్క
నప్పుడుసుగ్రీవు డగచరాధిపుల ♦ దప్పకవీక్షించి తగవారికనియె
వనచరులార యీవచ్చురాక్షసుని ♦ గనుగొనుండ దెవాడ ఖండవిక్రముడు
ఘనమైన పర్వతాకారంబువాడు ♦ ధనురాదిశస్త్రముల్ దాల్చినవాడు
మిక్కిలిపొడవున మెఱసినవాడు ♦ ప్రుక్క కయిటువచ్చు చున్నవాడు
ననవుడుగడగి యయ్యగచరాధిపులు ♦ ఘనపర్వతములు వృక్షములు చేబట్ట
మముబంపుసుగ్రీవ మముబంపుదేవ ♦ సమరంబునాదైత్యు జంపెదమనగ
నావిభీషణుడనె నగచరులార ♦ మీవాడనిటు సంభ్రమింపంగవలదు
రావణుతమ్ముడ రాక్షసేశ్వరుడ ♦ భావింపనేను నిష్పాపమానసుడ
శరణనియీరామ జనపాలుగాన ♦ నరుగుదెంచినవాడ నటలంకనుండి
రావణుతో నేను రామభూపాలు ♦ దేవినిమ్మని పెక్కు తెఱగులనంటి
ననవుడునామాట కతడుకోపించి ♦ తనసభలోపల దన్నెనన్నిట్టు
తన్నియంతటబోక తనవీటిలోన ♦ నున్నజంపుదునని యోటిలకాడె
నేనును వెలువడి యీరామచంద్రు ♦ గానంగవచ్చితి గాన జింతింప
గపటుండగాను నిష్కపటమానసుడ ♦ కపులార నాయెడ గపటంబులేదు
నభయమొండనగునాకు సంప్రీతి వెలయ ♦ నభయమిప్పించుడీ యవనీశుచేత
ననవుచ సుగ్రీవు డారాము కడకు ♦ జనివిన్నపము చేసె నవినయుండగుచు
రావణుతోనల్లి రాయిటివుట్టి ♦ దేవవీడొక్క డీతెంచియున్నాడు
మొత్తంబుతో నభయంబుననున్నవాడు ♦ చిత్తంబుమీదెస జేర్చినవాడు
అమరారితమ్ముడ ననుచున్నవాడు ♦ వివులవాక్యంబుల వెలసినవాడు
ఆశ్రితకులనాథ యభయమిమ్మనుచు ♦ మోదవాక్యంబుల మొనసినవాడు
మీకృపకలిమి యెమ్మెయినున్నయదియొ ♦ నాకుజూడగ వీని నమ్మంగరాదు
నరనాథ కపటంబునకు బుట్టినిల్లు ♦ లరయ రాక్షసులు గా కన్యులుగల
దనుజాధినాథుని తమ్ముడేమిటికి ♦ జనుదెంచునీనీచు జంపంగవలయు

—:* రామునకువిభీషణునియోగ్యతనాంజనేయుం డెఱింగించుట *:—

వనవుడువంతట నాంజనేయుండు♦వినయసంభరితుడై విభునకిట్లనియె
దనుజాధినాథుఁ డుద్దండకోపమునఁ ♦ దనుసభలోపలఁ దన్నెనన్మాట
నఖిలంబు నెఱుఁగంగ నాడెనీయసుర♦నిఖిలేశ యీమాట నిజముగానోపు
నుడుగక మనలకై నుచిత మాడుటయు ♦
వెడలఁ ద్రోచినవాని విడిచి వచ్చుటయు
గలుగనోపునుగాని కపటంబుగాదు ♦ వలవదుశంకింప వసుధేశ యితనిఁ
గపటమానసులెట్టిక్రమముననున్నఁ♦ గపటమింతటిలోనఁగానంగవచ్చు
నితనిమాటలలోన నేమాటయైనఁ ♦ గృతకమైతోఁపదు కీడనరాదు
మనుజేశదనుజుల మర్మజ్ఞుఁడితఁడు♦మన దెసనుండుట మానైన నీతి
ననురావణుఁడుపట్టి నాఁడుబంధించి♦యెనలేని బాధ నేచుటఁజూచి
యితఁడునాకై పెక్కుహితవులుపల్కి ♦నితనిచిత్తస్థితి నెఱుఁగుదుఁగొంత
యనినమాటలుదనయాత్మకునెక్కి♦వనజాప్తసుతుఁజూచివసుధేశుడనియె
నర్కజదీనమే లాటగిడౌటఁ ♦ దర్కించి నేటికి ధర్మంబుత్రోవ
శరణనివచ్చిన శత్రువునైనఁ ♦ బరికింపఁగారాచ పాడిరక్షింప
నొకకపోతముడేగ యుద్ధతితఱుమ♦వికలభావంబున వేగఁ బెవచ్చి
శిబిమాటుసొచ్చఁ జొచ్చినడేగయడుగ♦శిబితనువిచ్చి చెచ్చెరగువ్వఁగాచె
నపకీర్తిఁ బొందక నార్తుఁ జేకొన్న♦కృపయశ్వమేధ సత్క్రియఫలంబిచ్చు
నీవిభీషణుఁడేల యేచినయట్టి♦రావణుండైన గర్వముదక్కివచ్చి
శరణన్నఁగాతు నేచందంబునైన♦మరియాదలిట్టివి మాకులంబునకు
నభయమిచ్చితివేగ నర్కజపోయి♦ సభయుని నవ్విభీషణుఁ దోడితెమ్ము
అనవుడు సుగ్రీవుఁ డారామకృపకుఁ ♦ గనుఁ వాల్చియటుశిరఃకంపంబుఁ జేసి
పరికింపనీవేళఁ బగవానితమ్ముఁ ♦ డరయంగ శరణన్న నలరిరక్షింప
నీకెకాకెందునే నృపులకుఁజెల్లు ♦ కాకుత్స్థతిలక నిక్కముధాత్రిలోను
ననిపల్కి సుగ్రీవు డాకాశమునకు ♦ దనసేనతో సముద్ధతగతినెగసి
చేకొనియభయంబు శ్రీరాముడిచ్చె♦నీకువిభీషణ నిక్కంబునమ్ము
రమ్మనికపిరాజు రాక్షసరాజు♦నిమ్ములఁగౌగిట నెనయంగఁజేరి [పించె
తోడ్కొనివచ్చిసంతోషంబుగృపయు♦వేడ్కయునొసంగ నవ్విభుఁగాను
నింతనానందించి నృపుఁజూచియపుడు ♦ దండప్రణామము ల్దగఁజేసిపలికె

—:* విభీషణుడు శ్రీరామచంద్రు నుతించుట *:—

నిత్యసత్యత్రాణ నిత్యకల్యాణ♦సత్యజగత్త్రాణ నిత్యగీర్వాణ
జగదవ్యయాకార జగదేకవీర ♦ జగదుదయాకార జగదబ్ధిపూర

సర్వసంగాతీత సర్వానుభూత♦సర్వజగత్పూత సర్వసమేత
గురుఘనక్రమరూప గురుబోధదీప ♦ గురుమధురాలాప గురుచారుచాప
పద్మసన్నిభనేత్ర బహుజీవసూత్ర ♦ పద్మాకలితగాత్ర పరమపవిత్ర
కవిమనస్సంవేద్య కరుణానవద్య♦వివిధశాస్త్రాపాద్య వేదాంతవేద్య
పరమాత్ముఁడవునీవ పరమంబునీవ♦పరమవిద్యయునీవ పరికింప నెందు
భువనకర్తవునీవ భువనంబునీవ♦భువనహర్తవునీవ భువనైకవీర
యాగభోక్తయునీవ యాగంబునీవ♦యాగఫలప్రదుఁడరయంగనీవ
చంద్రార్కులునునీవ జలధులునీవ♦యింద్రాదులునీవ యిలయునునీవ
శబ్దార్థములునీవ శబ్దముల్ నీవ♦శబ్దముల్ భేదించు శ్రవణముల్ నీవ
మూఁడుమూర్తులునీవ మూఁడుమూర్తులకు♦బోడిమినవ్వలివాఁడవునునీవ
క్షరమునునీవ యక్షరమునునీవ♦క్షరసాక్షివీవ యక్షరసాక్షివీవఁ
త్రిభువనవందిత దేవాదిదేవ♦యభయమీదేవ నాకఖిలాధినాథ
జయజయశతకోటి జలజాప్తతేజ♦జయజయసంసార సర్పసువర్ణ
లలితాగమస్తోత్ర లక్ష్మీకళత్ర♦విలసద్దయాపాత్ర విబుధారిజైత్ర
దినకరశశినేత్ర దివ్యచారిత్ర♦యనుపమశుభగాత్ర యఖిలైకసూత్ర
వేయినోళులభోగి విధుఁడైనసుతులు ♦ సేయంగనోపుకే శ్రీరామనన్ను
నప్పద్మసంభవుం డైననీమహిమ♦యొప్పెల్లనుతియింప నోపునే తెలియ
నేనిన్నునుతియింప నెంతటివాఁడ♦దానవుఁడనువృథా తరళచిత్తుఁడను
భూనాథనీవాది పురుషోత్తముఁడవు♦కానవిన్నితరులు గానఁగలేరు
నరనాథమూర్తుని నన్నురక్షింపు♦పరమదుర్జనదైత్య పతిఁద్రుంచివైవు
మఖిలశరణ్యుండ వైననీమఱుఁగు♦సుఖమనియేవచ్చి చొచ్చితిఁబ్రీతి

—:* శ్రీరామచంద్రుఁడు విభీషణు ననుగ్రహించుట *:—

ననవుడునతని కృపాంబుధిలోన♦మనుజేశ్వరుండు క్రమ్మఱనోలలార్చి
నమ్మువిభీషణ నాకేశవైరి♦తమ్ముఁడవానాకుఁ దమ్ముఁడవింతె
మఱువకుమింక లక్ష్మణుకంటెనిన్ను♦నఱలేనివానిఁగా నాత్మఁగైకొంటి
ననిభయంబుడిపిదయార్ద్రవాక్యముల♦ జననాయకుండువిభీషణునాదరించి
నెయ్యంబుతోడనానృపుఁడప్పుడతని♦చెయ్యూదుకొనివార్ధి జేరంగబోయి
మాకునిక్కముచెప్పు మావిభీషణుఁడ♦నాకారిశక్తియు నమ్మినబలము
ననినవిభీషణుండారామచంద్రుఁ♦గనుఁగొనిమ్రొక్కి నిక్కము విన్నవించె

—*: విభీషణుఁడు రామునకు రావణునిబలం బెఱిఁగించుట :*—

దోయజదళనేత్ర తొల్లినారదుఁడు ♦ వాయువుకడనాగ పరులావుఁబొడిగ
ఫణిరాజుముందఱఁబవమానులావుఁ♦బనుతించివారికిఁజగ సేయుటయును

రాసిలావులకు వారలుమత్సరించి♦భాసురహేమాద్రి ఫణిరాజుఁజుట్టి
పట్టంగ దానిఁ గంపము నొందవీకు♦నెట్టన నేనని నియమించెగాలి
తనసత్త్వమంతయుఁ దగఁబూని శేషుఁ♦డనిమిషగిరిఁజుట్టి యసదృశలీల
వేయుఫణంబుల వేశిఖరముల♦నాయతభుజశక్తి నంటఁగఁ బొదివి
చలమునఁబట్టిన సప్తవాయువులు♦వెలయంగఁ బవనుండు వీవఁగఁ దొడగె
శేషునిభేదింపఁ జేకూడకున్న♦భీషణగతివీచెఁ బేర్చివాయువులు
ఆగాలిచలంబు లన్నియువిఱిగె♦నాగాలిభువనంబు లన్నియు వణఁకె
నాగాలిఁజలియించె నర్కునిరథము♦నాగాలిభూతంబు లన్నియునడఁచెఁ
గదిసిన లోకసంకట మెల్లఁజూచి♦ యిదిమహాపదవచ్చె నిత్తఱిననుచు
నర్థిమైబ్రహ్మాదు లచటికివచ్చి♦ప్రార్థించిపవను మాన్పఁగలేకపోయి
పరమసాత్త్వికుఁడైన ఫణిరాజుఁగదిసి♦యురగేంద్రనీవైన నోర్వంగవలయు
మీమచ్చరంబుల మహిరుండుగూలె♦మీమచ్చరంబుల మేదినిగ్రుంగె
మీమచ్చరంబుల మితిమీఱెనబ్ధి♦మామాటనాలించి మమ్ముమన్నించి
గాలినిగెలిపించి కరుణవాటించి♦కేళిమైమమ్ము రక్షింపవేయనిన
సురలప్రార్థనకు శేషుఁడుశాంతిఁబొంది♦కరువలికినీవఁగా ననువిచ్చి
యించుకయొకఫణంబెత్తినఁజొచ్చి♦మించినబలిమిసమీరుండుద్రోయఁ
జెలువేదియందొక్క శిఖరంబువిఱిగి♦తలకొన్నగాలిచే దవ్వుగాఁదూల
గురుతరగతిన త్రికూటంబుగాఁగ♦ధరణీశయబ్ధి మధ్యంబునఁబడియె
దేవయాసింహళ ద్వీపంబునందు♦దేవేంద్రుపనుపున దేవతాశిల్పి
కరకౌశలమున లంకాపురంబనెడు♦పురమునిర్మించె దత్పురవరంబునకుఁ
గోటలేడొప్పు నక్కోటగోటకును♦వాటమైనాల్గేసి వాకిళ్లుగలవు
తఱుచైనయట్టి కొత్తరములతోడ♦నిఱువైనముందటి యిట్టికకోట
పడమటిద్వార మేర్పడఁగాచియుండు♦రెడపక రాక్షసు లెనుబదికోట్లు
దానవులుత్తర ద్వారంబుగాచి ♦ యేనూటడెబ్బది యేడుకోట్లుండుఁ
దూర్పువాకిలియందుదొలగక కేప్రొద్దు♦దర్పించియుందురుతగనూఱుకోట్లు
దక్షిణద్వార ముద్ధతిఁగాచియుండు♦రక్షణదానవు లఱువదికోట్లు
అరయనాలోపలి యేడుకోటలను♦నరనాథ యిరువది నాల్గువాకిళ్ళ
వరుసనీచెప్పిన పదువుననెపుడు♦దరిగాచియుందురు ధరణీతలేశ
తిరమగుచున్నట్టి దిట్టివాకిళ్ళ♦నురుసత్త్వులుండుదు రొక్కొక్కకోటి
పురమధ్యవీథి నెప్పుడుఁగాచియుండు♦రఱువదిలక్షలు నాన్నూరుకోట్లు
కుంభకర్ణునినిద్ర గుహఁగాచియుండు♦జృంభణమొప్ప వసించాఱుకోట్లు
మొనసియారావణు మొగసాలగాచి♦కొనియుందురొకలక్ష కోటిరాక్షసులు

ఒవరనా వాకిట నుండు రాక్షసులు ♦ వినవయ్య యిఱువదివేల కోట్లుబలిమిఁ
గెలువంబుగా నింద్రజిత్తు వాకిటను ♦ బలవంతులుందురు పదివేలకోట్లు
ఘనులైన యాయతికాయాదివీర ♦ దనుజుఁ వాకిళ్ళ దరలకుండుదురు
ఎన్నికతో మతి యినకులాధీశ ♦ యెన్నరాదా సేన యెంతయు ఘనము
వాసవాంతకులావు వర్ణింపదరమె ♦ యీసునఁ గైలాస మెత్తినవాఁడు
వనజజుండతనికి వరమిచ్చినాఁడు ♦ దనుజులచేత గంధర్వులచేత
నమరులచేత వయ్యక్షులచేత ♦ సమరంబులోపల చావు లేకుండ
సమరంబు లేల యేచందంబులందు ♦ సమయింపరాదు రాక్షసలోకనాథు
నతడుమీచేతన యనిజచ్చుగాని ♦ క్షితినాథ యితరులచే నసాధ్యుండు
కుంభకర్ణుండు చేకొనఁడు చీరికిని ♦ జంభారినైనను సమరంబులోన
గత్తినమదమున నెఱుఁగఁడే భయము ♦ చిత్తంబులో నింద్రజిత్తనువాఁడు
హరునకు బ్రియముగా యాగంబు జేసి ♦ వరశక్తిఁబడసెను వజ్రకవచము
నరుదుగా మాయావి యైవిల్లువట్టి ♦ యరులనాకాశంబు నందుండి గెలుచు
నతిసత్త్వధనుఁడు ప్రహస్తుఁడన్వాఁడు ♦ చతురుండు రావణసైన్యపాలకుఁడు
ఖండేందుధరుచెలికానిసామంతు ♦ భండనంబున మాణిభద్రునినోర్చె
దనుజవీరులు మహోదర మహాపార్శ్వు ♦ లనువారు నతికాయుఁడనువాఁడు దేవ
బలిమిగైకొనిన దిక్పాలురనైన ♦ గెలుతురు రణమున గిట్టినయపుడె
యనిమిషకంటకులైన బల్లిదులు ♦ దనుజేశునకులక్ష తనయులు దేవ
జ్ఞాతులతో బంధు సమితి లెక్కింప ♦ ధాతకునైనను దరముగాదధిప
యరయగు బేరాదు లరిగాపులన్న ♦ విరచింపవచ్చునె విభవంబు కొలది
నెత్తుటమెదడున నెట్టవఁదనిసి ♦ మత్తులై సంగరోన్మత్తులై చాల
నదటెక్కినట్టి మహాదైత్యవరులు ♦ పదివేలకోటులు బలియులుండుదురు
వారిలావునఁ జేసి వసుమతీనాథ ♦ యారావణుఁడు గెల్చె నఖిలదిక్కులను
అనవుడు రాఘవుం డతనితో ననియె ♦ విను విభీషణ మున్న విన్నాఁడ నేను
మీయన్న యంతయు మిక్కిలిబంటు ♦ పాయక మాతని బలమునట్టిదయు
వాఁడెంతవాఁడైన వచ్చినా యెదుర ♦ వాఁడిమి వాటింపవాఁడెంతవాఁడు
హరిహరబ్రహ్మాదు లాదిగాఁగల్గు ♦ సురలడ్డగించినఁ జూర్ణంబుచేసి
వానిఁ జంపుదుని న్నవశ్యంబులంకఁ ♦ బూనియేలింతు నిమ్ములదానవేశ
యనిన విభీషణుండా రాముఁ జూచి ♦ వినయంబుతో మ్రొక్కి విభునకిట్లనియె
నీరావణుఁ డెంత యీలంక యెంత ♦ శ్రీరామ నీ బాణశిఖి పర్వనపుడు
లంకకోటలు ద్రోసి లగ్గలుపట్టి ♦ కిన్కతో నసురుల గిట్టినయపుడు
నాలావుచూడుము నరనాథచంద్ర ♦ కాలాగ్నిరుద్రుని గతిఁ బేర్చువాఁడ

ననవుడుఁ బిలిచి వాని నాలింగనంబు ♦ ఘనముఁగా జేసి లక్ష్మణునకు ననియె
నీ సముద్రము నీట నినజుండు నీవు ♦ భూసురాశీర్వాద పుణ్యనాదములఁ

—:* శ్రీరాముఁడు విభీషణునకు లంకాభిషేకము సేయుట *:—

గట్టుము వేగ లంకారాజ్యమునకుఁ ♦ బట్టంబు వానికిఁ బ్రతి విభీషణుని
అనియానతిచ్చిన నతఁడును నతని ♦ వననిధికలశముల వనచరుల్ దేర
నభిషేక మొనరించి యసురుల కెల్ల ♦ బ్రభుఁడవు గమ్మని పట్టంబు గట్టి
తలపోయ నాచంద్రతారార్కముగను ♦ సలలితంబుగ రామచంద్రుని కీర్తి
యెంతకాలము గల్గు నిల విభీషణుఁడ ♦
యంతకాలంబు రాజ్యము సేయు మనుచు
నార్చె వానరకోటి హర్షించి యంతఁ ♦ జేర్చి రాఘవుఁడు విభీషణుఁ జూచి
యీ యబ్ధి దాఁటంగ నే యుపాయంబు ♦ సేయుద మనవుడుఁ జేతులు మొగిచి
యీ వార్ధిఁ గట్టగ నింద్రాదులకును ♦ దేవ యెమ్మెయి దాఁటఁ దీరదు కాన
నిది గట్టుటకునైన నినకులాధీశ ♦ పదిలంబుగా వార్ధిఁ బ్రార్థింపవలయు
ననిపల్కుచుండంగ నట సుగ్రీవు ♦ ననుమతి శార్దూలుఁ డను దూత వచ్చి
కపిసేన కొలదియుఁ గపులమాలను ♦ గపులతో నాడు రాఘవుని మాటలును
అరసి క్రమ్మఱ జని యసురేశుఁ గాంచి ♦ కరములు మొగిచి నిక్కము విన్నవించె
నుత్తుంగ యశులును నుత్తుంగ భుజులు ♦ నుత్తుంగ సత్త్వులు నుత్తుంగ మతులు
నగు రామలక్ష్మణు లలవు మై విడిసి ♦ నగచర సేనతో నబ్ధితీరమున
గనుతింపనగు నుడుగణములనైన ♦ గనుతింపదగు వృష్టికణములనైన
గనుతింపనగు నబ్ధికరదులనైన ♦ గనుతింపగారాదు కపిసేనసంఖ్య
నుచితమీ వేళ సామోపాయమునకు ♦ బచరింపబంపు వేర్పరులైనవారి
ననవుడు శార్దూలుఁ డను వాని మాట ♦ విని శుకునకు దైత్యవిభుఁ డర్థిఁ బలికె
జని నీవు వానర సైన్యంబుఁ జొచ్చి ♦ యినసూనుతోఁ బ్రియం బేర్పడఁ బలికి
పగ లేమి దెలిపి యా భానునందనుఁ ♦ మగుడి చిరమ్ము సమ్మతి లెమ్ము పొమ్ము
అనవుడు నతఁ డేగి యర్కజఁ గాంచి ♦ యని యె రావణు చెప్పినంతయుఁ దెలియ
వైరంబు సేయ రావణుతోడ నీకు ♦ గారణం బేమి యర్కజ నాకుఁ జెపుమ
వాలి మీ యన్నన వలవదు వినుడు ♦ వాలికి నీకును వైరంబు గలమ
వాలియు దానవేశ్వరుఁ బగవాఁడు ♦ చాల రావణుతోడి సంధి నీకొప్పు
రావణుఁ డీ రాము రామ దెచ్చుటకు ♦ వీవిటు రాదగునే కపిరాజ
యనిగుఁ బేరువి గెల్చి యతని పుష్పకము ♦ గొనిన రావణు నెఱుఁగుట లెస్సగాదె
అక్షీలహారునితో నయ్యద్రి యెత్తి ♦ నట్టి రావణుఁ డల్పుఁడా కపిరాజ
దేవేంద్రుఁ డాదిగా దివిజుల నెల్ల ♦ నావిధంబున గెల్వఁడా వానరేంద్ర

కొలఁదిమీఱినహోమ గుండంబులందు ♦ దలలు ఖండించి యుద్ధతగతిఁ వ్రేల్చి
జలరుహాసంభవు జాలమెప్పించి ♦ వెలయఁగ ద్రైలోక్యవిజయంబు గొనెడి
హీనమానవులతోఁడ నేటికి సఖ్యంబు ♦ దానవేశ్వరుఁడతోఁ దగ జేయు సంధి
యనవుడుఁ గోపించి యాగచరులెల్ల ♦ వినువీథికెగయుచు నసవానిబట్టి
బెడిదంబుగా బెక్కు పిడికిళ్ళఁ బొడిచి ♦ కడుమీఱి మసఁగి రెక్కలు ద్రెవ్వఁగొట్టి
ముక్కును జెవులును మొగిఁ గోసివైచి ♦ యొక్కటఁ గడగిన నుదరి రాఘవుఁడు
దూత నేటికి నింత దొనగులబెట్ట ♦ ప్రీతిగా వీని నేవళఁ బోవనిండు
అనవుడు రాఘవు నాజ్ఞకునులికి ♦ వనచరులందఱు వానివిడచుటయు
మినువీథికెగసి యావినువీథినుండి ♦ యినసూనుతో శుకుం డేర్పడఁబలికె
రావణుతో గపిరాజయేమందు ♦ నావుడు దారాధినాథుండు గినిసి
తానంచ ద్రోహి యీధరణీశ్వరునకు ♦ గాన నాద్రోహిని గనిసైపననుము
సారిది నేలోకంబు జొచ్చిననైన ♦ బొరిగొండుగావిదే పోవవీవనుము
పటుకార్ముకం బెయ్యాపంబుగా నిలిపి ♦ చటులాస్త్రములు పరిస్తరణముల్ చేసి
పరగఁ గెందూళ్లను బ్రభలుగా జేసి ♦ తరుగ రస్రుక్స్రువతతులు చేపట్టి
సమరభూవేదికాస్థలమున నిలిచి ♦ యమరులకెల్లఁ ద్రిభుంబెక్కుచుండ
గర మొప్ప వీరాంగకముల బెల్లుబ్బి ♦ తోరగు మునున్న నెత్తురు నెయ్యి వోసి
మహితగుణధ్వనుల్ మంత్రముల్గాగ ♦ బహు రాక్షస శ్రేణి పశుకోటిగాగ
దనరిన విరహ నాదంబులపేర్మి ♦ యనిమిషావలికి నాహ్వానంబుగాగ
విడువని శాహాళి వితతులమ్రోత ♦ కడువింపుగా సామ గానంబుగాగ
ఘనమైన రామలక్ష్మణుల కోపంబు ♦ మునుకొని నాకోపమును మందుచుండ
ననుపమాగ్ని త్రయంబై యుండనందు ♦

దనదు ప్రాణముల గత్తెనా హుతులుగ
రణమున దనవీర రసమడంచుటయు ♦ బ్రణుతిఁ బగా సోమపానంబుగాగ
బ్రకట రాక్షస వీర పశుపలలముల ♦ సకలభూతవ్రాత సంతృప్తి లెసగ
వికవకసంగ్రామ విపులయజ్ఞంబు ♦ గడునొప్ప జేయు రాఘవసోమయాజి
యటుగాక మున్న సీతాంగన దెచ్చి ♦ యిట యిచ్చి బ్రదుకుటయిదె బుద్ధియనుచు
అని పేర్చి సుగ్రీవుఁడాడు వాక్యములు ♦ విని శుకచారుండు వేగంబె పోయి
యంతనా వృత్తాంతమా రావణునకు ♦ మంతనంబున జెప్పె మఱి రాముఁడచట
వనధితీరంబున వనదర్భశయ్య ♦ గొనరించి తాత్పర్య మొప్పారుచుండ
నమ్మునివర మోదిలో నహిళయ్యమీద ♦ నమలచిత్తంబున నానదమంది
మున్నున్న తనయాది మూర్తిచందమున ♦ నన్నరనాయకుండతికౌతుకమున
నవరత్నకటక మండనమండిరంబు ♦ వివిధోర్మికామణి విపులరావంబు

సుర్వీతనూజా మృదూపధానంబు ♦ గర్వితాహితభిదా కాలదండంబు
ఘోరప్రతాప కుంకుమచర్చితంబు ♦ సారంగమదలేప సంవాసితంబు

—:* శ్రీరాములు దర్భశయనము సేయుట *:—

నిరతమహాదాన నిపుణతానకము ♦ ధరణీధరణ ధుర్యతాసమంబగుచు
బాలుపొందుదక్షిణ భుజశాఖదాన ♦ తలగడగాఁ జేసి ధరణీశ్వరుండు
ఏవిధంబుననైన నిటుదాఁటిపోవఁ ♦ ద్రోవ నా కిమ్మని తోయధిసనుచు
రామభూవరుడు వారకనుపవాసి ♦ మైమూఁడుదివసంబు లటుశయనించి
తెలిడెందమున జలదేవతనిలిపి ♦ పలుమఱునిషతోఁ బ్రార్థనఁ జేసె
కడగానరాని నీకడిదిచిత్తంబు ♦ బడయుటకైయెను బడియున్నవాడ
నీకేచుమాన్యుండ నీరధివేగ ♦ నాకిమ్ముత్రోవ యానాకారిజంప
వనివేడుకొనుటయు నారాము నెదుర ♦ దనరారియంతకంతకు బొంగిపొంగి
తోరంపుదెరల కేతులువిచ్చివిచ్చి ♦ బోరనమురువు తెల్పునవ్వినవ్వి
ఘుసమీనరుచిజాలుకలు గ్రోసిగ్రోసి ♦ చనుమ్రోతసట్టహాసము చేసిచేసి
తుదినికదిక్కులతోఁ జెప్పిచెప్పి ♦ కదిసిసుళ్ళవ్రశ జూపిచూపి [ద
యుదధియూరాముని నొక్కింతగొనఁడ ♦ యుదియట్టిదయెకాదె యూరసిచూ
జడుడైనవాడు దుర్జనుడైనవాడు ♦ కఁ గ్రూరజీవ సంగతినుండువాడు
మలుగకతననోన మండెడువాడు ♦ కులకోత్రమైన చేకొనిమ్రింగువాడు
నెదురెంతవేసిన నెఱుగునే పెద్ద ♦ నదరుచునంతంత వడిమబ్బుగాక
కదియంగవచ్చుచో గడిచిచిత్తంబు ♦ చెదరంగవిషముపై జిలికించుగాక
యడగకతన ప్రార్థనంబుగైకొనక ♦ జడదివోంగినజూచి జానకీవిభుడు
నిడుదకన్నులక్రేవ నిప్పులురాల ♦ ముడివడిబొమలు గ్రమ్ముచుగోపమెసగ
జలధిదిక్కునుమఱిసౌమిత్రిదిక్కు ♦ బలుమాఱుజూచుచుబలికెభూవిభుడు
వీనిగర్వముగంటివే లక్ష్మణుండ ♦ నేనెంతవేడిన నింతగైకొనక
పొడచూపకున్నాడు పొడచూపకున్న ♦ జడనడగింపక పోనేలయిత్తు
నెడపక క్రోలియు నింకింపలేని ♦ బడబానలంబె నా బాణానలంబు [లు
అటుచూచూగాక నాయస్త్రబుకోలది ♦ పటుతరమకరస్వరములుమీనము
గండకంబులుకూర్మకర్కటంబులునుమండూకములనీరుమానినుల్ పశువు
లువడినొండొంటి నొరయంగ బాఱి ♦ కెరలెడితిమితిమింగిలతద్గిలములు
రండిరాఱుసులును డఱుమనెగళ్ళు ♦ కొండలుమునదూరుకొనిరూపుమాపి
పరగుచున్న నా బాణాగ్నిశిఖల ♦ నెరసినతనలోని యెమ్ములోయనగ
జలము గప్పి యూజలచరకోటి ♦ మెలగుటమాన్పించి మీదదేలించి
చిప్పలుఘల్లలు చిక్కంగవన్న ♦ నిప్పుడధూళిగా నింకించువాడ

సిరితండ్రియనిపెద్ద జేసితిగాని ♦ హరిమామయనుచు బాలార్చితిగాని
యిందుకుదనువేడ నేటికినాకు ♦ బొందెటుంగక తేర్చి పోంగెనుజలధి
పన్నశక్తునిగా మనంబునందలచి ♦ యిన్నిచందంబుల నేచెసౌమిత్రి
తేవిల్లునమ్ములు దెగిపొంగియున్న ♦ యీవార్ధినాచేత సంకటబాదు
వనధిలోజగములువడిజాలబుత్తు ♦ ననుచురాఘవుడు విల్లందుమాత్రమున
బలభేదివణకె దిగ్భాగంబువగిలె ♦ జలధులుగలగె నాకశకరులడగె
ధారణిగ్రుంగె భూధరములుగూలె ♦ నీరజాసనుడును నివ్వెఱగందె
చుక్కలుడుల్లె శేషుండుభీతిల్లె – దిక్కులుద్రెళ్లె నద్రివిరియుడ్డగిల్లె
నినకులాధీశ్వరుం డేపుదీపించి ♦ వినుతులుశోభిల్ల విల్లెక్కుపెట్టి
సమవర్తిసంవర్త సమయదండంబు ♦ సమమైనవాని నుజ్జ్వలమైనవాని
ప్రళయకాలానలప్రభనొప్పువాని ♦ విలయోగ్రచండాంశువిధమైనవాని
సాయకంబులుపెక్కుసంధించిపేర్చి ♦ తోయధిలోపలదొడరియే యుటయు
గడకబొంగితినన్ను గరుణింపుమనుచు ♦ జెడక వారిదియోరసిల్లెదుమాడ్కి
గడుమ్రోసిపర్వతాకారంబులగుచు ♦ గడువేగదరగ లాకసమప్పళించ
బలితంపురామభూపాలునిబాణ ♦ ములుపెక్కునాట సముద్రునినోట
క్రమ్మడులాలల కైవడినురువు ♦ లమ్మహావీచుల యందుజెల్లెసగి
సారిదినేలోకంబు జొత్తునన్మాడ్కి ♦ ధరియింపరాక యెంతయుదల్లడిల్లె
జలనిదియుదక మాస్వాదింపవచ్చి ♦ మలుగకరామాస్త్రమహిమకునులికి
మొగుళులుమగిడివెమ్మచుబోవుభంగి ♦ బొగలెడద్రవ్వ పొరిపొరినెగసె
నొలయుచురాక్షసులోలలుటజూపు ♦ తెలుగునలెనెం తేజంతుసమితి
మనుకులవల్లభు మార్గణవహ్ని ♦ తునుకసొచ్చిన సముద్రునిచిత్తవృత్తి
ఘనతరంబగు నహంకారాదులెల్ల ♦ బెలుపేదినిలువక పెడబాయుకరణి
దై తేయులెల్ల బాతాళంబువిడిచి ♦ భీతిల్లిపాఱిరి పెక్కుదిక్కులకు
దనచేతినింకక తనరినవార్ధి ♦ ననయంబునింకితు ననివచ్చుచున్న
యినకులబాణాగ్ని కెదురుగావచ్చి ♦ యనువుగా నాలింగనము చేసెననగ
నుడుగకంతయువడి నొడగూడిలోని ♦ బడబాగ్నివారిదిపై మండజొచ్చె
నప్పుడులక్ష్మణుం డంతకుభంగి ♦ నుప్పొంగి రౌద్రసం యుక్తుడై యున్న
యన్నచందముజూచియడలుచువచ్చి ♦ మున్నిటికెడసొచ్చి మోడ్పుకేలమర
మానవేశ్వరయిది మథనంబుసేయ ♦ రానికాలునివీర రసవార్ధిగాదు
మానవేశ్వరయిది మథనంబు సేయ ♦ రానిరుద్రునిరోష రసవార్ధి గాదు
ఈనీరునిబ్బంగి నెరయింపదొడగె ♦ మానకిప్పుడునీదు మార్గణవహ్ని
వెలికినేతెంచి దిగ్వతతితోగూడ ♦ గలయలోకంబెల్ల గాల్చునోతగదు

సర్వజగద్ధిత చరితంబుఁ బూని ♦ యుర్వీశ యీకోప ముపసంహరింపు
నీకోపమునకు నీనీరధి యెంత ♦ తేకార్ముకంబింకఁ దెగఁగొనకధిప
యనివిల్లునట్టిన నతఁడీకకోప ♦ మినుమడింపఁగఁగను లెఱుపును బొంది
యంబకంబేల నాయ బకంబుల నే ♦ యంబుధి నింకింతు ననిన చందమున
క్రూరదృష్టుల గనుగొని యాడుగఱచి ♦

యోరి సముద్రుండ యోడవు నాకు
నీనీరు నింకించి నీయందుఁ గలుగు ♦ వానినన్నింటిని పడినీఱుఁ జేసి
భర్జింతు నీవింక బంటవై నిలువు ♦ దుర్జనత్వమునను దొడరి నాయెదుట

—:* శ్రీరాములు సముద్రునిపై బ్రహ్మాస్త్ర మేయుట *:—

యిదె తొడిగెద బాణ మేనారినను చు ♦

నదలించి యపుడు బ్రహ్మాస్త్రంబు దొడుగ
బ్రహ్మయు నింద్రుఁడు భ్రమఁగానరైరి ♦ బ్రహ్మాండమెల్లను బగిలినట్లయ్యె
భువనంబులెల్లను బొగిలినట్లయ్యె ♦ భువనత్రయములోని భూతంబులఱచె
గలయుం గదిశల జీఁకట్లగ్గలించె ♦ వెలుఁగవు రవిచంద్ర విపులబింబములు
అళనులువడియె మహానీలమడరె ♦ నశరీరియొఱలె మధ్యాగ్నులు నెగసె
నుడుగక యొక క్రమోతి యూరక మ్రోసె ♦

జడధి యప్పుడు గ్రాహ సమితియుదాను
బొంగెల్ల నెక్కడబోయెనో యనఁగ ♦ దుంగ ఫేనములెందు దూలెనో యనగ
బఱుఘోష మెమ్మయి బాసెనో యనఁగ ♦

జటులోగ్రవిష మెందు సమసెనో యనఁగఁ
బెంపెల్ల నెక్కడఁ బెట్టెనో యనఁగ ♦ సొంపెల్ల నెక్కడఁ జొచ్చెనో యనగ
భంగంబు లేకయు బరికించి చూడ ♦ భంగంబునకుదాన పట్టనంబరఁగి
సత్త్వంబు చెడియు నాశ్చర్యంబుగాఁగ ♦ సత్వసమగ్రుడై చలనంబు నొంది
భ్రమణంబు లేకయు భ్రమణంబు నొంది ♦ యుముత వేగంబున నధికతదక్క
యారాము చేతి బ్రహ్మాస్త్రంబు దనకు ♦ బీరంబు చెడివచ్చి బిందువై యుండె
వరమున బెరుగు రావణు మస్తకములు కరమరుదార నొక్కట ద్రుంచుకొఱకు
గడగి రాఘవుఁ డంపగమినాడి నేయు ♦ బడబాగ్ని నిడిపేట బదనిడుకరణి
జింతింప దేవనా జీవనం బెంత ♦ యింతియకాకని యిబ్భంగి మఱియు
నాసముద్రుండిప్పు డఖిలంబు చూడ ♦ భాసురరత్న ప్రభాయుక్తుఁడగుచుఁ
బ్రబ్బారిలైదుపెను పడగలతోడ ♦ నజ్వాలదహికోటి యొక్కటఁ గొలువ
గంగాదినదులెల్ల గడకతో నడువ ♦ మంగళబహుపుష్ప మాలికలెఱయఁ
దలకొని జలచర తతులోలి నడువ ♦ జలనిధి సను దెంచి సాష్టాంగమెఱఁగి

కరపద్మములు మోడ్చి కడుసంభ్రమమున నరవరాగ్రణికి సన్నుతి విన్నవించె
నేను మీ యలుకకు నెంతటివాఁడ ♦ భూనాథ నీ వాది పురుషోత్తముఁడవు
వాయుభూజలనభో వహ్నులాదిగను♦నీయాజ్ఞ గొనివి నిక్కువంబరయ
నీయందునున్నవానికి లెక్క లేవు♦నీయధీనంబులు నిఖిలలోకములు
తప్పు సేసితినని దండింపవలదు♦చెప్పు మే పనియైనఁ జేసెదగాని
యని విన్నపము సేయ నంతనా రాము♦గనుఁగొని యప్పుడు గంగాదినదులు
ధరశిరములు మోవ దండములొత్తి♦కరములు ఫాలభాగంబునఁ జేర్చి
శరణార్థులము రామ జగదభిరామ♦కరుణింపవే మమ్ము కరుణాసముద్ర
యభయంబు వేడెద మయ్య యిందఱము♦నభినవంబుగ నునీ యబ్ధీశుగాచి
శుభతరమంగళసూత్రముల్నిలుపు♦త్రిభువనాధీశ్వర దీనమందార
యపరాధిగాచుట యది యెన్నిగుణము♦కృపఁజూచి రక్షించు గీర్వాణవంద్య
నీమహిమల నెంచ నేరవు శ్రుతులు♦నేమెంతవారము యిటమిమ్ము బొగడ
దేవతామయుఁడవు దేవదేవుఁడవు ♦ కావను బ్రోవను కర్తవు నీవ
భూమీశలోకేశ భూరిప్రకాశ♦భూమిజాహృదయేశ పుణ్యస్వరూప
యని యిట్లు నదులెల్ల నభినుతుల్ సేయ♦విని యప్పుడా రామవిభుఁడు వారలను
మన్నించి భయమెల్ల మానుఁడటన్న♦నన్నరనాథున కబ్ధి యిట్లనియె
సరసిజోదరపూజ్య జననుతచరణ♦శరణాగతార్తరక్షక దివ్యమూర్తి
తరుచరసేన యుద్ధతి నేగునపుడు♦కరిమకరాదులఁ గదలంగ నీను
ఉప్పొంగి కయ్యాల కొత్తి బెల్వరిసి♦తప్పింప సమ్మారుతముఁజూచి మ్రోయఁ
గడలేక మిగుల నగాధమై యుండు♦సుడివోడమింప నా సొంపు వాటింప
నలరి సేతువుఁ గట్టియైనను నడుపు♦మనఘ విక్రమ యూరకైనను నడుపు
మనిన రాఘవుఁ డమోఘాస్త్ర మబ్ధిశు♦పనుపున మరుభూమిపైఁ బ్రయోగింప
విలసిల్లు నయ్యంపవేఁడిమి చేత♦సలవకందులనీరు శోషింపఁజేసి
యా మరుభూమి కుదాత్తుఁడై సర్వ♦కామసమగ్రంబుగా వరంబిచ్చె
నది మరుదేశమై యంతనుండియును♦వద కయమ్మాడ్కి వర్తించుచుండె
మగుడ గఁజరుదెంచె మనుజేశుశరము♦తగనబ్ధి పూర్వవిధంబుననుండె
నప్పుడంబోనిధి యనియె రామునకు ♦

వ: ఇప్పగు నయమున నొప్పువాక్యముల
మీతండ్రి దశరథ మేదినీశ్వరుఁడు♦దైతేయదేవ యుద్ధమునఁ బెంపొంది
నవ్వయోధ్యఁ గొని నరనాథ పోయి♦మన్నించి యప్పుడు మఘుఁడు వీడ్కొలిపి
పు తేరవచ్చితి భూతలాధీశ♦యిత్తెఱంగున మీకు నేఁదక్కనాఁడ
దొంకొని కట్టు సేతువు రాఘవేంద్ర♦తరుచరసేన యుద్ధతి నడపింపు

—*: శ్రీరాములు సుగ్రీవునితో సేతువుగట్ట నాజ్ఞాపించుట :*—

మనవుడు రఘురాము డర్కజుజూచి ♦ పనుపు సేతువుగట్టఁ బ్లవంగపుంగవుల
రయమున నప్పుడు రవినందనుండు ♦ ప్రియమునఁ బంచె వారిధిఁ గట్టుడనుచు
జనిరంగదుండును జాంబవంతుండు ♦ ఘనులైన యనిలజ గజగవాక్షులును
పనసుండు నలుఁడును పావకనేత్రుఁ ♦ డును గంధమాదనుండును గవయుండు
శరమొప్పనీలుఁడు ఘనుడు తారుండు ♦ శరభుండు ఋషభుండు శతబలి బలుడు
హరిరోమవక్త్రుండు నటసుషేణుండు ♦ సారిది గేసరియును జ్యోతిర్ముఖుండు
దధిముఖుండును వేగదర్శియు మరియు ♦ నధికులు కపిసైనికాదిపులెల్ల
ప్రముఖులు గొండలు మల్లటిగొనగ ♦ వీకతో గొనివచ్చి విమదిలోనైన
నొకటియునీటిపై నుండకమునుగ ♦ వికలురై కపులెల్ల వెఱగందివచ్చి
పతికిఁ జెప్పుటయు భూపతియాత్మలోన ♦ నతివిస్మయుం బంది యబ్ధికిట్లనియె
నిది యేమి కపివరు లిబ్భంగి దెచ్చి ♦ నదలక తరులు పర్వతములు నైన
నొకటియు నీటిపై నునికి లేదనిన ♦ సకలాబ్ధిపతికి నాజలధియిట్లనియెఁ
బరమేశ వినుము లోపలికనివఁ ♦ బారిపోరిజలచరంబులు త్రిమి గెవనియు
సమరంగ శతయోజ నాయతంబగుచు ♦

దిమియనుమత్స్యంబు దిగురునాలోన
మ్రింగునామీను దిమిఁగిలంబోటి ♦ మ్రింగుఁ గామత్స్యంబు మిగుదగ్గిఁము
ఇటువలెనొండొంటి నెఱగొనుచుండు ♦ జటులసత్త్వంబుల సంఖ్యముల్ దేవ
యనవినియట్టి మహాంబునగట్ట ♦ ననువేది చెప్పవే యబ్ధీశ యనుడు
వినకులాధీశ్వర యీనలుబరుపు ♦ ఘనుఁడైన యీవిశ్వకర్మనందనుఁడు
భానుకులేశ యుపాయజ్ఞుఁ డితఁడు ♦ దానంతయును దమతండ్రి చే నేర్చె
వడివాని చేదప్ప వననిధిబట్టు ♦ వడదది యెట్లన్న వసుధేశ వినుము
శిశువేళ వింధ్యాద్రి చేరువ నడవి ♦ బశుకణ్వాదనుముని పజ్జనాడుచును
మునియస్థానమిమ్ముల జేయఁబోవ ♦ ముని వేల్పులనుబట్టి మోరతోపునను
వనదిలోపల బాఱవై చెగినలుఁడు చనుదెంచియమ్ముని చయ్యన నెరిగి
చాలంగ గోపించి శపుగావింప ♦ బాలుండు తగడని పరగజింతించి
తన సొమ్ముపోకుండ దాదెచ్చుటకును ♦ వనవుజి తించియా యర్భకుజూచి
తనతపోమహిమ సత్తాపసోత్తముఁడు ♦ ఘనతరంబగునొక్క కట్టడ సేసె
నీవబ్ధిలోపల నేత్రెంబైన ♦ బాయక వీడేమి పట్టివైచినను
అవి దేలుగాకని యవ్వరంబియ్య ♦ నవియుఁ దలోదేల నతడుగైకొనియె
నదిగాక దేలెడు నతనిచేగిరులు ♦ వదలక నేగట్టు వడియెదనిపుడు
ధరణీశయీవార్ధి దగగట్టునంత ♦ వరుభక్తిమైగొల్చి యుండెదనలుని

దప్పింపుమనవుడు రఘుకులోత్తముడు♦దప్పిచియత్యాదరంబునఁ జూచి
యోవనచరరాయ యోమహావీర♦నీవిక్రమంబెల్ల నీరధి సెప్పఁ
గాననీవిపుడబ్ధిఁ గడఁకతోఁ దులతను♦బూనికఁ గపులచేఁ బొంకంబుమీఱఁ
దరుగిరులండఱు దార తెచ్చెదరు♦ వెరవొప్పనసదృశ విద్యయేర్పడఁగఁ
గట్టుమంభోరాశి గడకతోనీవు♦నెట్టసనీలావు నేర్పున మెఱసి
యనవుడుఁ గరయుగంబర్థితో మొగిచి♦వినయంబుతో రామవిభునకు ననియె
నుర్విపై నేనిట నుదయమొందుటకు♦నుర్వీశ కలిగెఁ బ్రయోజనంబిపుడు
దేవయీజలధి బంధించెదబనుపు♦మా వెరవెల్లను మాతండ్రిచేత
ధారణీతలనాథ తగ నేర్చినాఁడ♦ నారయ దేవర యానతిఁ జేసి
నా నేర్పుమీయొద్ద నరనాథ చెప్ప♦ గా నేలయిపుడు సాగరముబంధించి
చెచ్చెర దేవర చిత్తంబువడసి♦మెచ్చించువాఁడ నమ్మికఁ బంపుమనుడు
నలినాప్తకులమణి నలునిఁ బంపుటయు♦నలునితోఁ గూడ వానరసేనలెల్ల
నేలయు నింగియు నిఖిలదిక్కులును♦వాలిన యార్పుల వ్రయ్యఁ జేయుచును
ఆ కులశైలవృక్షావళి వైచి♦తోయధిఁ గట్ట నుద్యోగించిరపుడు
రామచంద్రుండను రాజు గణేశు♦దామదిలోపలఁ దలఁచి మ్రొక్కుచును
అరయోజనంబైన యద్రిసుగ్రీవు♦డురవడిఁ గొనివచ్చి యుర్వరఁ బగులఁ
గలయంగ దేవతా గణములు వొగడ♦నలవునఁ దొలితొలి నలుచేతికిచ్చి
దొరకొని నలుఁడును దోయధియందు♦
వెరవారనిలిపె నవ్విపులశైలంబు
తనచేయుసేతు బంధమునకు రాము♦ననుపమకీర్తికి నావిభీషణుని
వినుతపట్టమునకు విశదప్రభాతి♦దనరారు శాసన స్తంభంబుమాడ్కి
నంత వానరవీరు లాశావితాన♦మంతయుఁ దారయై యద్రులుదరులు
నవలీల బెఱుకుచు నవిదెచ్చి నలుని♦కవసరోచితముగా నందియిచ్చుచును
ఒకకొండపైనుండి యొకకొండపైకి♦బ్రకటజవంబులొప్పంగ దాటుచును
గెరలుచు నొకకొన్ని గిరులెత్తి కొన్ని♦గిరులక్రిందల బెల్ల గిల్లవైచుచును
గొండలు తల నెత్తి దునిసియాడుచును♦ దెండని కొందరఁ దిట్టనవ్వుచును
గొండపై గొండ యా కొండపై గొండ♦
నొండొండ డొల్ల యుండఁ బేర్చుచును
నిమ్ముల గిరులందియిరుచేతులందు♦ గిమ్మపండులమాడ్కి నెగరవైచుచును
నొకడు కొండల మోచి యురవడి నడువ♦
నొకడదిపడఁ ద్రోచి యుబ్బి యార్చుచును
దాటి యాకొండ లుద్దండత బట్టి♦ మీఁటుదు నా నీవు మెచ్చంగ ననుచు

సీతరులీగిరు లింత వేగరమె ♦ త్రోతునానలునియొద్దకు బాఱనిపుడు
అని బాసలిచ్చుచు నగ్గించుకొనుచు ♦ వనచరులిబ్భంగి వడిదెచ్చి తెచ్చి
తరువులునగములుతగనిచ్చుచుండ♦దారకొనినలుఁడు సేతువుగట్టదొడఁగె
ముందటిచందాన మునుఁగకయుండె ♦ నఁడొక్కటైన నయ్యంబుధిలోన
పట్టిచందంబున నాకపికోటి ♦ గట్టెనుగటకటా కష్టజీవనము
గలిగెనాకనిమదిగలఁగెడుమాడ్కి♦గలఁచునంభోరాశిగలఁగనెంతయును
నలుఁడునిమ్మెయిఁ బదునాల్గు యోజనము♦
ఒలవడఁ దొలినాఁడె యబ్ధి బంధించె
నంతసూర్యుడుగ్రుంకనా సేతువునకు ♦ నంతయుబలుకాపులిడివలీముఖులు
వచ్చి వేలముల నివాసస్థలములఁ ♦ జొచ్చియెంతేనియు సొంపుతోనుండఁ
గృతకృత్యుఁడగురాము కీర్తిపుష్పములు ♦ చతురతమై నెదచల్లినయట్లు
కరమొప్పఁజుక్కలు గాన్పించెనంతఁ♦జిరకాలములసీమ శిశువులమాను
పాలుపొందుకలుపల పోరానివిందు ♦ కలసినజక్కన కవఁబాపుమందు
పాలవెల్లినిద్రచ్చి పడసినవెన్న ♦ శూలియాదలపూవు చుక్కలనవ్వు
నెరిచకోరములకు నెలనెలపంట ♦ యురువేదివిరహుల నడికించుమంట
గగనంబుతొడవు దొంగలగుండెదిగులు♦నొగినబ్ధిఁబొంగించునూరటపట్టి
హరిహరబ్రహ్మల యానందదృష్టి ♦ సరసిజరిపుఁడైన చంద్రుఁడుఁవొడిచె
నినుపారికలశాంబునిధి వెల్లివిరిసె ♦ ననఁగ వెన్నెలపర్వె నటనిద్రలేక
యెన్నంకొకో సేతు వేముగట్టెదము ♦
ఎన్నండొకోలంక యేము నూచెదము
ఎన్నండొకోదానవేంద్రుండుఁగూలు♦నెన్నండొకోసీతయీరాముగూడు
నెప్పుడువేగునో యీరేయియింక ♦ నప్పుడువచ్చితి మాత్మలోసొలసి
యేలవచ్చితిమి రేయెల్లనందుండి♦ యోలిసేతువుఁ గట్టుచుండక మనము
అనుచునవ్వానరు లందఱునట్లు ♦ మనమునఁజింతించి ముక్కువల్ దక్క
యారేయిగడపి సంధ్యాదులుదీర్చి ♦ చారుతరంబుగా సకలవానరులు
నొండొరుఁజీరుచు నుత్సాహమొప్ప♦నొండొరుఁగడువంగ నురవడితోడ
బృథివీధరంబులు పృథునిజములును♦బృథులసత్వంబునఁ బెఱికి యేతెంచి
యంబుధిలోవైవ నపుడుసుగ్రీవుఁ ♦ డంబరవీథికి నరిగివేగమున
పెరవారఁగాఁబట్టి వింధ్యాద్రిశిఖర ♦ మరయోజనము నిడుపై నదివిఱిచి
యాసుషేణునిచేతి కందిచ్చుయును ♦ నాసుషేణుండిచ్చె నానలుచేతఁ
దారాతనూజుండు దర్దురశైల ♦ మారూఢగతిఁదెచ్చి యబ్ధిలోవైచె
మలయాద్రిశృంగంబు ప్రమాతులతోడ ♦ నలునకునీలుఁ డున్నతగతినిచ్చె

ద్వివిదుండు మైందుండు దెచ్చి యావార్ధి ♦ గవగూడి వైచిరి గ్రావంబులెత్తి
గజుఁడు గవాక్షుండు గంధమాదనుఁడు ♦
భుజబలాఢ్యుఁడు శరభుండును గవయు
డిలచలియింప మహేంద్రాద్రిశిఖర ♦ ములు దెచ్చివైచిరి మున్నీటిలోన
నవియెల్ల మునుఁగక యావేళ నలుఁడు ♦ తవిలియుంచి గట్టఁ దరుచరులిట్లు
ప్రకటించి తెచ్చు పర్వతములు దరులు ♦ నొకకేలనంది పయోనిధియందు
ననుపంగఁ గనుఁగొని యుగ్రకోపమున గనలుచుఁ బలికె మైగరువలిసుతుడు
చయ్యన నేను యోజనములకొండ ♦ నెయ్యెడఁగొని తేర నదిరాముఁ డెఱిఁగి
యనయంబు నిరుగేల నందవనజ్ఞ ♦ యొనరింపనట్లని యొనరించె నలుఁడు
అప్పుడు కపిసేనయార్పుల మ్రోతఁ ♦ యుప్పొంగి వారాశి యుబ్బెడు మ్రోఁత
తరుగిరు లొండొంటిఁ దాఁకెడు మ్రోఁత ♦
తరుచరు లొన్నొరుల్దగ బిల్చు మ్రోఁతఁ
గుదిసి భూతంబులు ఘోషించు మ్రోఁత ♦ వదలి దిగ్గజములు వాపోవు మ్రోఁత
కడునగ్గలంబుగా గగనంబుముట్ట ♦ నడుగక పెల్లైన యురవుచింతింప
బృందారకాసుర బృందంబులెత్తి ♦ మందరగిరియెత్తి మథియించునాఁటి
యమృతాబ్ధి మ్రోఁత యోయనఁగ నా మ్రోఁత ♦
కమలభవాండ దిక్తటము నిండె
నంతట మధ్యాహ్నమైన వానరులు ♦ శాంతిఁ బుచ్చుటకు వృక్షంబులు చేరి
పటు తెఱంగుల మంచి ఫలము నమిలి ♦ నెలవుననుఁ జల్లని నీళ్లొప్పఁ ద్రావి
నీడల నొక్కింత నిలిచి క్రమ్మఱను ♦ వేడుక రెట్టింప వేలంబు మిగుల
నా కొండలెత్తితే నరుగుండు కొండ ♦ ఆకొండలను వేగ నెత్తి తెండనుచు
పెక్కైన తరువులు పెక్కైన గిరులు ♦ పెక్కు మొత్తంబులై పెక్కునఁ దెచ్చి
యూరక నలునకు నొప్పించువారు ♦ వారిధిలోపవైచెడు వారు
నటనెదురేగి పెల్లుదుకొవ్వారు ♦ నిటఁ దెచ్చి చేరువ నిడియెడివారు
నలుఁడందుకొనఁగ వానరులందియొసఁగ ♦ బలుతరుగిరులు నిబ్బంగి మర్న్నాడు
ఆసేతు విరువది యాఱు యోజనము ♦ లీసున బంధింప నినుఁడస్తమించె
నప్పుడు సుగ్రీవుఁ డాదిగాఁ గపులు ♦ చెప్పిరప్పను లెల్ల శ్రీరాముతోడఁ
జెప్పి వేలమునకుఁ జెచ్చెర వేగి ♦ యుప్పుడు సుఖనిద్ర నుండి యారాత్రి
గడపుటయును రేపకడ వలీముఖులు ♦ వడినందఱును గూడి వారిధిఁ గట్ట
నేమేమి తెచ్చెద మెల్లభూజముల ♦ నేమేమి తెచ్చెద మెల్లకొండలను
నని పాటితరువులు నద్రులుఁ దెచ్చి ♦ వనధిలోపలఁ బడవైచెడివారు
కొందఱంతియుఁ గనుఁగొనుచుండువారు ♦ కొందఱు నీడల గూర్చుండువారు

కొందఱు సేతువు గొలపెట్టువారు ♦ కొందఱు నిద్రలఁ గూర్కెడువారు
కొందఱు తెలిసీరు గ్రోలెడువారు ♦ నందఱు నిస్క్రియ నలసులై యుండ
నప్పుడు రవిచంద్రుడై తనవొసఁగె ♦ నప్పుడింద్రుఁడు నించె నమృతంపు వాన
యప్పుడు చల్లఁగా ననిలుండు వీచె ♦ నప్పుడు సౌరభం బానంద మొసఁగెఁ
దరుచరులంత నుత్సాహులై శైల ♦ తరువులంబుధి మహోద్ధతిఁ దెచ్చి వైవ
నారభసంబున కతిభీతినొంది ♦ వారిధిలోన జీవంబులన్నియును [చును
దెరలుచు నొరలుచు దిరుగఁ బాఱుచును ♦ నెఱియుచు నటదల లెత్తిచూచు
ముందటిపగిది నమోఘబాణంబు ♦ మ్రందింపవచ్చెనో మమ్మెల్లననుచు
దలఁచి యంతటిలోనఁ దగిలిన భీతిఁ ♦ దెలిసి సేతువుగట్టు తెఱఁగుగా నెరిఁగి
మరి సంతసంబులు మదిలోనఁ గలిగి ♦ వఱలు నిజేచ్ఛల వర్తించుచుండెఁ
బంధురంబుగఁ గపిపతులు నాఁడబ్ధిఁ ♦ బంధించి రెలమి నేఁ బది యోజనములు
రవిగ్రుంకిన త మర్కటనాథులెల్ల ♦ నవిరళలీల సంధ్యలు వార్చి రంతఁ
బంతెంబు మెఱయంగఁ బది యోజనంబు ♦ లితియ గట్టుట యెల్లి యాజలధి
యుదయాచలమున నర్కుఁ జేరి ♦ ముదమునఁ గపిరాజముఖ్యులు మ్రొక్కి
పనివిన్నపము చేసి పరవసంబొప్పఁ ♦ దనితరువులు మహాశైలంబు లెత్తి
యనుపమలీలమై నలిశీఘ్రవృత్తిఁ ♦ గొనివచ్చి నలునకుఁ గొమ్మని యొసఁగ

—:* శ్రీరాములు సేతువును జూచి సంతోషించుట *:—

నప్పుడు శ్రీరాముఁ డాసేతువెల్లఁ ♦ దప్పకగనుఁగొను తాత్పర్యమొప్ప
వనధీశ్వరుండును వనచరాధిపుఁడు ♦ దనుజనాయకుఁడును దనుఁ జేరికొల్వ
సౌమిత్రికరముపై సౌభాగ్యలీల ♦ వామహస్తముఁ జేర్చి వడిఁ గట్టమీఁద
సన్నపుదరహాస చంద్రికల్ వొలయ ♦ నన్నరనాయకుం డటఁ జూచువేళఁ
దరుచరేశ్వరులెల్లఁ దరువులు గిరులు ♦ బిరుదులై దడిఁ బేర్చి పెకలించి తెచ్చి
నలు చేతికొసఁగ నానలుఁ డవిపుచ్చి ♦ తలకొని కట్ట నాతరి నొక్కయుడుత
గొబ్బున సేతువు గొనసాగవలయు ♦ నిబ్బలియులకుఁ దోడేసెగా వింతు
ననుచు శ్రీరామునియడుగుఁదామరలు మనమునఁ జేర్చి యమ్మనుజేశు నెదుర
నచ్చపుభక్తితో నటవార్ధిమునిఁగి ♦ వచ్చి తానిసుకలో వడిఁ బొరలాడి
తడయక చనుదెంచి తనమేనియిసుక ♦ వడిఁ గట్టపై రాల్చి వనధిలో మునిఁగి
తేలి గట్టున కేగి తిరుగంగఁ బొరలి ♦ వాలిన భక్తితో వచ్చి విదుల్చె
నివ్విధంబున నుండ నినకులాధిపుఁడు ♦ దవ్వులఁ బొడగాంచి తమ్మునిఁ జూచి
పొందుగా లక్ష్మణా పొల్లదే చూడు ♦ ముందఱ నొకతరు మూషకం బెలమి
నామీఁదభక్తి యున్నతగతిఁ బూని ♦ తా మేను జలములఁ దడిపి గట్టునకు
జని వేగ నిసుకపైఁ జల్లాడి తిరుగఁ ♦ జనుదెంచి కొండల సందున రాల్చి

కరమొప్పుచున్నది కపికులాధీశు ♦ లురుశక్తిదరుగిరు లొగిదెచ్చుచోట
దానెంతయునిమది దలపక ప్రేమ ♦ బూనిసహాయమై పొదలుచున్నదియు
కనుగొంటివే యన గమలాప్తవంశ ♦

కనుగొంటిభవ దంఘ్రి కమల యుగ్మమును
నెవ్వాడుమదినిల్పి యెనగుదృణంబు ♦ నవ్వేల్పుగిరిబోలు ననినగాకున్న
కావునభక్తియ కారణంబనఘ ♦ ననవుడుముదమంది నలినాప్తసుతుని
గనుగొనిమఱిదాని గనుగొనువేడ్క ♦ బెంగొనుచున్నది ప్రేమనిచ్చటికి
దెమ్మన్నవేగంబె దెచ్చిసుగీవు ♦ డమ్మహాత్మునిచేతి కందియిచ్చుటయు
బలుదెఱంగులజాల బ్రస్తుతిజేసి ♦ కలిఁదక్షిణకరాగ్రమునదువ్వుటయు
నలయుడులేకు వెన్కఁమరేద్రిరేఖ ♦ చులుకనై చూడ్కులసుఖకరంబుగను
నెంతయుసంతోష మినుమడింపంగ ♦ నంతలక్ష్మణుడును నబ్ధినాయకుడు
దనుజేశ్వరుండును దరుచరాదిపుఁ ♦ ననయంబుసంతోషమతిశయింపంగ
నందందగైకొని యలరుచునుండ ♦ జందనమందార చంపకక్రముక
పున్నాగసహకార భూరుహప్రతతు ♦ లున్నచోవిడిపించె నుర్వీశుడంత
హనుమదంగనీల హరిరోమకుముద ♦ పనసాదివానర ప్రముఖులఁగూడి
కనుగొననాశ్చర్యకరమైనయట్టి ♦ ఘనతరంబైన యాకట్టపై నిలిచి
బాపురేయెంత నేర్పరియోకోనలుఁడు ♦ రూపింపబెద్దయు రూఢికినెక్క
యరుగుదీర్చిన[illegible]క్క నలవడదీర్చె ♦ దొరకొనిసేతువు మదిదాకననుచు
దనబాహుబలమున దవిద్యకలిమి ♦ ఘనమైనసేతువు గట్టెనీనలుడు
అదిశతయోజనంగైనట్టినిడుపు ♦ పదియోజనంబుల పరపునుగలిగి
వెలసినమలయ సువేలాచలముల ♦ నొలవియెంతయుజూడ నొప్పవహించి
మొలగియాడెడు గండుమీలమైకుచులు ♦ వెలిగెడుచుక్కలవిధమునసుండ
నిరుదెసనల్లనై యేపారునబ్ధి ♦ కరమొప్పుచున్న యాకాసంబుగాగ
గలయంగదీపించె ఘనసేతునపుడు ♦ వెలసిననక్షత్ర వీథిచందమున
దనునట్టుగాంచిన తనపేర్మిజూచి ♦ తనరారమన్నింప దగుననిరామ
విభుడాసముద్రుని వేడుకతోడ ♦ నభయపట్టముగట్టె ననమించిమఱియు
నప్పుడుదేవత లామింటనుండి ♦ యప్పౌరుషము గన్నులారంగజూచి
నిక్కంబునిట్టిద నీచమృదూక్తి ♦ జక్కనేలగు దండసాధ్యుండుగాక
యటువేడుకొనుటయు నబ్ధిగైకొనమి ♦ నిటుసేయనేరడే యినకులేశ్వరుడ
చేకొనియెవ్వాడ సేతువుచూచు ♦ జేకొనియెవ్వాడీ సేతువుదలచు
నతనికిజయంబు నతులకీర్తియును ♦ వితతపుణ్యంబులు వేవేగగలుగు
నెంతకాలంబేని నీసేతువుండు ♦ నంతకాలంబేని నీయబ్ధియుండు

నెంతకాలము రాఘవేశ్వరుకీర్తి ♦ యంతంత కెక్కుచు నానంద మొసగు
నవిమదిలోపల హర్షించుకొనుచు ♦ దనువున బులకలు దఱుచుగా నెగయ
బువ్వులవానలు పొరిఁబొరిఁ గురిసి ♦ రవ్వేళ దేవతూర్యంబులు మ్రోయ
నప్పుడు రఘురాముఁ డానంద మొంది యొప్పు సేతువుఁ జూచి యొనర నిట్లనియె
నెలమితో నీ సేతు వెల్లకాలంబు ♦ నలపేర సేతువు నా నొప్పుఁ గాత
అనుటయు రఘురాము నానతి నలునిఁ ♦ గనుఁగొని పొగడిరి కపివీరులెల్ల
ముదముతో నపుడు సముద్రుండు రాము ♦
సదనంబునకు సైన్య సహితంబు గాఁగఁ [ములు
బొలుపార దోడ్కొని పోయి దివ్యాస్త్ర ♦ ములు నుదివ్యాంబరములు భూషణ
నౌకవజ్రకవచంబు నురుభక్తి నిచ్చి ♦ యకలంకచిత్తుఁడై యా రాముఁ జూచి
రామభూపాలక రాజపుత్రులకు ♦ నీముని వేషంబు లేల యుద్ధములఁ
జారువస్త్రములు భూషణములు నిపుడు ♦ మీరు ధరింపుడి మ్మియ నుచితంబు
అనవుడు దివ్యాంబరాభరణంబు ♦ లనుపమ గంధమాల్యాదులు దాల్చి
చారుతేజముల భాస్వర మూర్తులగుచు ♦
నారవి చంద్రులో యన నెలుఁగుచును
వననిధి యపుడు దీవనలతో ననుప ♦ ననిలజనీలుర యంసంబు లెక్కి
సకలదేవతలును సన్నుతి సేయ ♦ సకలలోకంబులు జయపెట్టుచుండ
సకలతరంగిణీశ్వరు వీడుకొలిపి ♦ సకలేశ్వరుం డన జన్నుండుఁ దాను
రమణీయమైనట్టి రాక్షసలక్ష్మి ♦ సీమంతవీధిపైఁ జెలఁగెడుమాడ్కి
మునుకొని లంకాభిముఖుఁడునై నడిచె ♦ ఘనమైన సేతుమార్గంబున వేడ్క
దగ విభీషణుఁడు గదాహస్తుఁడగుచు ♦ మొగిఁ గపిసేనకు ముందఱ నడచెఁ
దన మంత్రులును దాను దర్పంబు మెఱసి ♦ వినుత విక్రముఁడును వేలాద్రినుఁడె
మిగుల మొత్తంబులై మిన్నందియుంది ♦ నగచరసేనలు నడువంగఁ జొచ్చె
వడిఁగొని సేతు క్రేవల వచ్చువారు ♦ విడువక త్రోవల వెనవచ్చువారు
వేడుకతో వినువీథి దన్నారు ♦ నాడకాడకు గుములై యేగువారుఁ
దోయధిలోన నీదుచు వచ్చువారుఁ ♦ బాయలుగాఁ గూడి పఱుగిడువారు
నప్పుడు సేనల యార్పుల మ్రోఁత ♦ యుప్పొంగి వారాశి యురుఘోష మడచె
దివియుఁ బాతాళబు దిక్కులు భువియు ♦ నవిరళగతి చేత నల్లలనాడఁ
గడు నొప్పు సేతువుఁ గడచి యిబ్భంగి ♦ విడిసె రాఘవుఁడు సువేలాద్రియందు

—:* శ్రీరాములు సువేలాద్రి చేరుట *:—

దడయక వనచర దళములే తెంచు ♦ కడుసంభ్రమముఁ జూచి ఘనధనుర్ఘోష
ముడరింప బ్రహ్మాండ మవిసినట్లయ్యె నుడువీథి జుక్కలు నురలె మ్రోయుచును

బెడిదంబుగా భూమి బెగడొందియడరె ♦ నుడుకారివై దేహియుల్లంబు చెలఁగె
ఖండపరశుశిరః కంపంబుఁ జేసె ♦ దండిరాక్షసులెల్లఁ దల్లడపడిరి
చారులచే రామజననాథురాక ♦ యారావణుఁడువిని యఖిలరాక్షసుల
బిలిపించి నవరత్నపీఠంబునందు ♦ గొలువుండ నసురులు గొలువఁ బెక్కండ్రు
అంతనావృత్తాంత మంతయు నెరిగి ♦ చింతించి కైకేశి చిడిముడితోడ
వంతగుందుచు మాల్యవంతుని బిలిచి ♦ యెంతయు బొగులుచు ననియె నాతనికి
అలఘువిక్రమశీలుఁ డా రామవిభుఁడు ♦ చలమున వానరసైన్యంబుతోడ
విడిసెను వేలాద్రి వినుమిఁకలంక ♦ చెడునుదప్పదు బ్రహ్మశివులుగాచినను
బడుఁ డింక మనము నప్పఙ్క్తికంఠునికి ♦ విదితంబుగా సీత విడుమని బుద్ధి
చెప్పవత్తము నీతి శీఘ్రంబయిపుడు ♦ చెప్పినమనబుద్ధి చెవియానివినునె
యైననుతలిదండ్రులైనట్టివారు ♦ తనయుండు ధర్మంబు దప్పి నడిచినను
దగబుద్ధి సెప్పుట తగవు ధర్మంబు ♦ లగునంచుఁ జెప్పుదు రనఘాత్మ బుధులు
వినుమున్న నాకు నావిశ్రవసుండు ♦ వినిపించె నంతయు విశదంబుగాఁగ
ననుచు దేవరహస్యమతనికిఁ జెప్ప ♦ విని మాల్యవంతుండు వెఱఁగందకూఁతుఁ
గనుఁగొని యదియట్ల కాకేల పోవు ♦ మనబుద్ధి వినఁడని మానంగరాదు
అమ్మ నీవును నేను నద్దశాస్యునకు ♦ నిమ్మహామంత్రంబు లిన్నియుఁ దెలియ
జెప్పుదుమనయు మీస్థితిగతులెల్ల ♦ నిప్పుడెగదలుద మిదివేళగాన
వలనొప్ప నావిశ్రవసుని యాపలుకు ♦ దలగ బ్రహ్మాదులు దప్పింపలేరు
చెప్పుమునీవు నేర్చిననీతులెల్ల ♦ నొప్పుగ ననవుడు సువిదయాక్షణమె
పసిఁడిపల్లకిమీఁద పరగఁగూర్చుండి ♦ యసమతో నచ్చరయతివలు మోయ
ధవళాంబరంబులు తగునట్లుగట్టి ♦ ధవళచామరములు ధవళమాల్యములు
ధవళగంధంబులు ధవళాక్షతములు ♦ ధవళభూషణములు తలకొన్ని ప్రేమ
నవిరళంబుగఁ దాల్చియితివై ధవమునఁ ♦ దవిలిడవ్యాంగనాతతి వెంటనడువ
సుతభృత్యహితబంధుసోదరుల్ నడువ ♦ మతిమంతులైనట్టి మంత్రులు నడువ
శ్రుతిపాఠతంత్రులు సూనృతోన్నతులు ♦ వ్రతధర్మగుణచారువర్తనుల్ నడువ
గిన్నరగంధర్వ గీర్వాణసిద్ధ ♦ పన్నగాసురయక్ష భామలు నడువ
వంకృతియనుమాల్యవంతుని వనిత ♦ సంకృతియనుమాలి సతి కేతుమతియు
మానిని యైనసుమాలియింతియును ♦ దానవాంగనలుగొందఱు వెంటనడువ
ముగ్గురుతల్లులు ముందఱ వెనుక ♦ డగ్గిరి నడువంగ ధవళచామరలు
గరుడగంధర్వాది కాంతలు సీవ ♦ నరుగుచో నాట్యంబు లచ్చరల్ సేయ
బంధురంబుగ మిత్రభ్రాతలైనట్టి ♦ బంధుజనంబులు బలిమితో నడువ
యూపాక్షుఁ డతికాయుఁ డొగి విరూపాక్షు ♦ డేపునముందఱ నేచితో నడువ

ముదుకకుప్పసములుముదముతో దొడఁగి♦ముదిసినరాక్షసవృద్ధులునడువ
సందడిజడియంగ సాహోయటంచు♦ముందఱఫణిహార ముఖ్యులునడువ
గురుతరబహువేద ఘోషంబుతోడ♦సరిలేనియాబ్రహ్మ సభతోడగదలి
చంద్రదీధితులతో శారదాదేవి♦యింద్రుమందిరమున కేతెంచుతరణి
మందారచంద్రికా మల్లికాశ్వేత♦కందలహిమశైల కర్పూరహార
చందనగోక్షీర శరదిందురుచుల♦నందమైవిలసిల్లు నభినవస్ఫురణ
మందాకినీదేవి మఱిదివినుండి♦బృందారకులుదాను పృథివికేతెంచి
విలసిల్లువిధమున వీక్షింపనొప్పెఁ♦గలితనవీనమై కైకేశికొలువు
వరరత్నమణిగణవలయంబులెలమిఁ గరమొప్పముత్యాలకంఠహారములు
వెలవొప్పఁదనమేన విలసిల్లనమరి♦

మెఱుపులఁ దగుశుభ్ర మేఘమో యనఁగ
దీపించు దేదీప్యతేజంబుగాక♦నేపారియంతయు నిభములునడువఁ
బ్రబలనీలాంబుద పటలంబుభంగి♦నిబిడమైరాక్షస నిచయంబునడువ
రథసింధుఘోటక రాజిసైన్యములు♦పృథివీబీటలువాఱఁ బెల్లుగానడువ
వనజోదరునిపుత్రివాహినుల్ గొలువ♦నెనయంగనజుసభ కేతెంచెననఁగఁ
నమృతవారిధిపొంగి యఖిలదిక్కులకు ♦

విమలమై యటువెల్లి విరిసెనో యనఁగ
నరిదినక్షత్రంబు లన్నియువచ్చి♦గురిగాఁగనొకచోటఁ గూడెనోయనఁగ
నుదధిముత్యములెల్లనొక్కటైవచ్చి♦పొదిగొనిలంకలోఁబొడమెనోయనగ
దిగ్గనివెన్నెల దీవియోయనఁగ ♦ నిగ్గైనగొడుగుల నిచలంబుమెఱయ
నిబ్బంగినప్పు డయ్యింద్రారిసభకుఁ♦బ్రాభవస్ఫురణమైఁ బరఁగనేతేర
విభవశుభాచార వినుతులుచెలఁగ♦శుభలీలగైకేశి జూచిరావణుడు
ముదముతోఁగద్దియ మొగిడిగ్గివచ్చి♦ముదితకునందంద మ్రొక్కికైదండ
ప్రమదంబుతోనిచ్చి పల్లకిడించి♦యమరారిగొనివచ్చి యాస్థానమునకు
దనభద్రపీఠంబు దరియగనొక్క ♦ కనకాసనంబిడి కైకేశియందు
గూర్చుండదల్లుల గూర్మి సోదరుల♦బూర్చినభక్తితో గూర్చుండుడనగ
నంతరాంతరముల నందఱునంత♦నంతంతగూర్చుండి రర్హపీఠముల
నంతనాకైకేసి యనుమతిజేసి♦చింతామణీభద్ర సింహాసనమున
దానవేంద్రుండును దత్ప్రకారమున♦నూనినసంతోష మొప్పగూర్చుండి
యచలితమతిమంతు సమాల్యవంతు♦నుచితాసనంబున నుండంగబనిచి
యావేళరావణుం డమరవల్లభుని♦భావంబుగైకొని భాసిల్లుచుండ

నలయు మ్రోతయు లేని యంబుధి కరణి♦
యల బలంబుడిగె నాయసురేశు కొలువు
ఆలోన నమరారి హస్తము ల్మోగిచి ♦ కైలాసనిభకేశి కైకేశి కనియె
జనయిత్రి యిబ్భంగి జననులతోడ ♦ నెనయంగ నా సభ కెన్నఁడు రావు
చాలంగ నా మది సంతోషమయ్యె ♦ నేల విచ్చేసితి వెరిగింపు మనిన
నప్పుడు కైకశి యమ్మాల్యవంతు ♦ దప్పక కనుగొని తగు నీతి మెఱసి
ప్రాభవస్ఫురణాఢ్యు బఙ్క్తికంధరుని ♦ శోభనగుణశీల జూచి యిట్లనియె

—:* కైకేశి రావణునకు బుద్ధి సెప్పుట *:—

తెలియంగ మీ తండ్రి దివ్యరహస్య ♦ మెలమి జెప్పిన వార్త లెఱిఁగెంతు వినుము
సురలు బ్రహ్మాదులు సొరిది మైమునులు ♦ దరగ నిభీతిచే దనుజారి చేరి
తమతమ యిడుమల దమపాటులెల్ల ♦ దానవాంతకుతోడ దా మొప్ప జెప్పి
రావణకుంభకర్ణాది రాక్షసుల ♦ నేవగ నైనను నేపడఁగించి
కావవే దీనుల గరుణ చేననుచు ♦ గమలజాసను డాదిగా సురలెల్ల
నభయదానము వేడ నతికృపాంబోధి ♦ యభయంబు లిచ్చె నయ్యమరుల కెల్ల
నినకులంబున జనియించి రాక్షసుల ♦ ననిలోన దునిమెద నవలీల ననుచు
వరమిచ్చి సకలదేవతల వీక్షించి ♦ తరుచరులై మీరు ధరణి జన్మించి
యనిలోన నాకు దోడ్పడుడని పలికె ♦ నని చెప్పె మీ తండ్రి యా రీతి నిప్పు
డమరులు వానరులై పుట్టిరెలమి ♦ నమరకంటక నిన్ను ద్రుంపఁ శ్రీహరియు
వనజసంభవు డిచ్చు వరము పాలించి ♦ యినకులంబున బుట్టె నిందఱు బొగడ
జెనటి తాటకి జంపె జిన్ననాడేచి ♦ మునియాగరక్షణంబును జేసి కాచె
పదధూళిచే ఱాయి పడతిగావించె ♦ వదలక జనక భూవరు వీటిలోన
నరుదను దనిజనం బభినుతి సేయ ♦ హరువిల్లు మోపెట్టి యవలీల విఱిచి
జనకభూపతి తనూజను బెండ్లియాడె మొ ♦ నచిన పరశురాము నిభంగపఱచి
తమతండ్రి పనుపున దపసి మైమునుల ♦ కమితసత్త్వంబున నభయంబు లిచ్చె
ఘను విరాధు గబంధు గదువిక్రమమున ♦ దునుమాడి విడువ డే దోషాచరేంద్ర
వెఱపు చెప్పుట కాదు వేయుభంగులను ♦ వెఱవకుండితి వేని వేత్రలసీదు
చెలియలి ముక్కును జెవులును బట్టి ♦ బలిమి గోసిననాడె పగ గెల్వరాదె
ఘనఖరదూషణు ఖండించు మాట ♦ వినియూరకుండుట వెఱచుటగాదె
మారీచు నొక కోల మడియించునాడు ♦ నూరకె యొక వంక నొదిగితి వీవు
రాముని ముందఱ రమణి దేలేక ♦ యేమఱి పాటున నెలనాగ గొంచు
వెనువెక్క జూచుచు వెలవెలనగుచు ♦ నెనలేని భీతిచే నెఱిమి బాఱుచును
వచ్చితిగాక భూనరుల జయించి ♦ వచ్చితివా యోడి వచ్చితిగాక

సచ్చరిత్రను రామచంద్రుని దేవి ♦ ముచ్చలి తెచ్చుట మొగతనంబగునె
వాలంబునను జుట్టి వారిధి ముంచు ♦ వాలిఁ ద్రుంచుట నిన్ను వంచుట కాదె
యిన్ని యెన్నఁగ నేల యినకులేశ్వరుఁడు ♦ మున్నీరు నొకకోల మొనకు దేలేదె
నేఁడోడితే రామ నృపశేఖరునకు ♦ నాఁడోడితివి గాదె నాకేశవైరి
మాటిమాటికి బేల మనుజులటంచు ♦ నేఁటికి నాడెద వెంతయు నేఁచి
ఘనతపోమహిమచేఁ గరుణించి నీకు ♦ వనజభవుఁడు మెచ్చి వరమిచ్చువేళ
నరుల నెన్నక యున్న నాఁటి తప్పిల్లఁ ♦ దరమిడి నేఁడిదే తలకూడె నీకు
గెలుపేది యిఁక నీకు గీర్వాణవైరి ♦ చలమునఁ గులమెల్ల సమయింతుగాక
యేటికిన్ని యు నెంచ నిపుడొక్కకోఁతి ♦ దాఁటి సముద్రంబు ద్రగుఁడై పేర్చి
లంకలోపలఁ జొచ్చి లంక శోధించి ♦ లంకిణి బరిమార్చి లలి శంక లేక
జానకిఁ బొడగాంచి జననాథు సేమ ♦ మూని నభక్తితో నొనరంగఁ జెప్పి
మరలి పోవుచు నీదు మధువనంబెల్ల ♦ బెరికి కావలి కాండ్ర బెక్కండ్ర జంపి
యక్షకుమారుతో నసురాధిపతుల ♦ నక్షణంబున నెందఱైన నుత్రుంచి
బలిమి నట్లనయుండి ప్రచరించి మఱియు ♦ బలమరి లంకను భస్మంబుఁ జేసి
యావిమానము లేక యసురేశ దివికి ♦ బోవగా సురవరుల్ పోరిబోరి నగరె
యింత సేసియు మరి యిటు బట్టువడెనె ♦ యెంతయు నదుకు శ్రీ కేర్చి పెల్లార్చి
నీవు నీవారు నెరి చెడి చూడఁ ♦ బోవడె యల వాయుపుత్రుండు తొల్తి
గురుసత్వమున నిన్ను గొనిపోయి రామ ♦ ధరణీశు ముందట దఱుకున బెట్టి
తెచ్చితి బొమ్మన్న దేవేంద్రవైరి ♦ యచ్చట నీ సత్త్వ మది యేమి సేయు
నటుగాక యీలంక నగలించి పట్టి ♦ తటుకున ధరణిపై దాటించ నేనిఁ
జిందవందరై చెదరి పల్వగల ♦ నందఱు ద్రుంగరె యమరులు పొంగ
నతనికి నోడితి వసురాధినాథ ♦ యతని యేలిక గెల్వ నలవి యే నీకు
వనచరులని కదా వ్రాలుచున్నావు ♦ వనచరులను గెల్వ వశమె మున్నీను ము
వనచరుచేఁ జేటు వచ్చుఁ బొమ్మనుచు ♦ గొనకొని నందిదా గోపించి నీకుఁ
బాయకిచ్చిన శాప ఫలమెల్ల నీవ ♦ వాయుపుత్రుని చేత వాలిచేఁ గనవె
ఫాలాక్ష వాసవ బ్రహ్మాది దివిజు ♦ లీలీల దైత్యారి యిష్టంబు నొంది
నీలంక యురుని నిన్ను నిఖిల రాక్షసుల ♦ గూలద్రోయుటకునై ఘోరరూపముల
భూలోకమున వచ్చి పుట్టిరి కాక ♦ యీలాగు వనచరు లెట్లైన గలరె
యలఘుబలుండవై యఖిల లోకములఁ ♦

జలము పెంపున గెల్చి చనుదెంచునపుడు
కిన్నరగంధర్వ కింపురుషాది ♦ పన్నగ గుహ్యక పక్షీంద్ర యక్ష
సురవర మునివర సుదతులనెల్ల ♦ బిరబిర జెఱలను బెట్టెడు వేళఁ

బరమపతివ్రత ల్వడవడ వడఁకి ♦ పరకాంతనెపమున భస్మమై నీవు
కులముతో బలముతోఁ గూలిపొమ్మనుచు ♦ నలిగి శాపంబిచ్చె రతితఁ గూడ
వాలికి నెక్కుడ వ్వాలినందనుఁడు ♦ వాలికి నెక్కుడ వ్వాయుపుత్రుండు
వారు నీ రణములో వధియింపలేరె ♦ వారికి నెక్కుడ వ్వాలితమ్ముఁడును
సమరంబునను బలసహితంబుగాఁగ ♦ సౌమిత్రి నినుఁబట్టి సమయింపలేఁడె
మరియొక్కటియు వినుమనుజాశనేంద్ర ♦ యరయంగ నీవింక నెఱుఁగవుగాని
రామలక్ష్మణులేల రవిసూనుఁడేల ♦ కోమలి యాసీత కోపానలంబె
యదురుగా బ్రహ్మరుద్రాది దేవతలు ♦ వరదులై యిచ్చిన వరములతోడ
హరుఁడొసఁగిన చంద్రహాసంబుతోడ ♦

నరయ మూడరకోటి యాయువుతోడఁ
గైలాసమెత్తిన ఘనశక్తితోడఁ ♦ జలనంబులేనట్టి సంపదతోడఁ
దక్కని భుజబల దర్పంబుతోడ ♦ దిక్కులు గెలిచిన తేజంబుతోడ
రాక్షసకులములో రావణ నిన్ను ♦ సీతఁ గాఁబునఁబట్టి యెరియింపలేదె
పరమపతివ్రత పతియాజ్ఞ మీఱి ♦ వెఱచియారక యుండ వ్రేగెదుఁగాని
ధర్మపతివ్రత దగదనకీవు ♦ కర్మపాశంబునఁ గైకొని తెచ్చి
యరిముఱి చెఱఁబట్టి యాపుణ్యవతిని ♦ మొఱఁగిన సంకటమునఁ బుట్టువహ్ని
నిన్ను నీకులమును నీవారి నెల్ల ♦ నన్నిభంగులఁ గాల్పఁ గేల పోనిచ్చు
నసురేశ యిది యెట్టి దనినను వినుము ♦ విడువక నీవు దిగ్విజయంబు చేసి
యకలంకగతి పూని యమరులఁ గెల్చి ♦ సకలలోకంబులఁ జరియించునపుడు
ప్రథమయుగంబున బ్రహ్మర్షివరుఁడు ♦ ప్రథితోరుసుజ్ఞాన పరమార్థవిదుఁడు
పరమసాత్త్వికగుణాస్పదకుశధ్వజుని ♦ వరపుత్రియగు వేదవతియను దలఁపఁ
బరమపతివ్రత పాపాత్మ నీదు ♦ వరగర్వమంతయు నమ్మఁగాఁ జేసి [ద
సుతులతో సతులతో సోదరప్రభృతి ♦ హితులతో భృత్యసంఘాతులతో గూ
నమితవిక్రముఁడైన నతని చే నిన్ను ♦ సమరంబులోపలఁ జంపించుననుచు
నరిముఱిఁ గోపించి యాధర్మశీల ♦ మరగుచు శపియించె మఱచితే తొల్లి
యాసతి యాసీతయైన శ్రీదేవి ♦ భూసుతయై పుట్టె భువనరక్షకుఁడు
ఆదినారాయణుం డంబుజోదరుఁడు ♦ వేదవేద్యుఁడు రామవిభుఁడైనవాఁడు

—:* కైకేశి రావణునకు రామునిమహిమ చెప్పుట *:—

అసురులమర్దింప నమరులఁగావ ♦ వసుమతిరక్షింప వచ్చె విష్ణుండు
ఎఱుఁగ నీవును నేను నెంతటివార ♦ మెఱుఁగరు బ్రహ్మరుద్రాది దేవతలు
పుట్టించు బోషించుఁ బొలియించుఁ దుదిదప ♦ నెట్టును గాక తా నేకమై యుండు
నతఁడందరికి మేటి యాతనితోడఁ ♦ బ్రతిపోల్పఁ దలఁచిన పాపంబుగాదె

చెదరిలోకములెల్లఁ జెడినపిమ్మటను ♦ వదలకయుండెడువాఁడువో యతఁడు
శరణన్న వేగనా సామజవరునిఁ ♦ గరుణలీలామతిఁ గాచెనీఘనుఁడు
మధుకైటభాదుల మహిరాక్షసులను ♦ వధిఁ దేజస్ఫూర్తినఁ జేసెనీఘనుఁడు
పొచ్చిసోమకుఁజంపి శ్రుతులర్థితోడఁ ♦ దెచ్చి బ్రహ్మకునిచ్చి దీపించెనితఁడు
అమృతాబ్ధిదా ద్రచ్చి యమృతంబువడసి ♦
అమరులకునునిచ్చె నరయనీఘనుఁడు
భాసురంబుగ దైత్యుఁ బట్టిశిక్షించి ♦ భూసతి నెత్తిన బత్యుఁడీఘనుఁడు
కడగిబాలునిగావఁగంబానబొడమి ♦ తొడరి హిరణ్యాక్షుఁ దునిమెనీఘనుఁడు
ధరణిమూఁడడుగులఁ దానర్థివేఁడి ♦ పెరిగియాబలిఁ జెరపెట్టెనీఘనుఁడు
రాజసంబున భృగురాముఁడై పుట్టి ♦ రాజుల ద్రుంచిన రణదక్షుఁడితఁడు
తప్పక చెప్పితి దనుజలోకేశ ♦ యిప్పుడు దేవతా హితముచింతించి
రాముఁడై జనియించె రవివంశమునను ♦ దామసగుణ మేచి దనుజేశ నీవు
ఏమిపాపమొ కాని యెఱుకచొప్పడదు కామాంధునకు ధర్మగతు లేలకలుగు
గొడుకుచేనైనను గూతుచేనైన ♦ నడఁకీర్తియ కాని యపకీర్తిగాని
వచ్చుగోత్రమునకు వడిబెద్దలకును ♦ జెచ్చెరననిజను ల్చెప్పెడిదెల్ల
నరయనిందలు రెండు నసురేశ చూడ ♦ మఱియెవ్వరికివచ్చె మనకె గాకిపుడు
అదియెట్టిదంటేని నంతయు వినుము ♦ మదిగొంతదలపక మన శూర్పణఖయు
ఆయనపరమాత్ముఁ డనక కామించి ♦ పోయిముక్కును చెవుల్పోకార్చుకొని
బరసతియనకాస పడపట్టి తెచ్చి ♦ కరకరిఁగుల మెల్ల గాల్చెదవీవు [యె
ఇంతకంటెనునింద యిక నెందుగలదు ♦ పంక్తికంధర యిట్టి పాపంబులేల
బలసిరక్షోరాజ్య ప్రముఖులందఱును ♦ నెలమివిష్ణునితోడ నెదిరించికాదె
చక్రంబుఘాతకు సైరింపలేక ♦ శుక్రశిష్యులు భువిఁ జొచ్చిరి వెఱచి
శంక లేటికి నీవు జన్మించు వెనుక ♦ గ్రుంకిన రాక్షసకుల మెల్ల నెగడె
ననిమనంబునఁ గొంతయులరుచుండంగ ♦ దనుజేశ తలపులు దలఁకూడవయ్యెఁ

—:* కైకేశి రావనునికి జలప్రళయము దెల్పుట *:—

జేకొనిలోకముల్ చెడినపిమ్మటను ♦ యేకమైయుదకంబు లేపారుచుండ
మక్కువ నాజలమధ్యంబులోన ♦ నొక్కఁడై తనకెందో డెవ్వరులేక
బాలుఁడై యట వటపత్రము మీద ♦ లోలత దేలాడు లోకరక్షకుఁడు
కమనీయమగుసృష్టి కార్యంబునందు ♦ విమలచిత్తంబున వెసమన్ననంతఁ
గమలోదరుని నాభికమలంబు పుట్టె ♦ కమలంబులో బుట్టుగమలసంభవుఁడు
కమలాసనుఁడు సృష్టికార్యంబుకొఱకు ♦ నమరనవబ్రహ్మలను వారిఁబడసె
వరపుణ్యులైనట్టి వారిలోపలను ♦ పరమాత్ముఁడయ్యె నాపౌలస్త్యవరుఁడు

గమలా ప్తనిభునకు ఘనయశోనిధికి♦విమలాత్ముడై పుట్టె విశ్రవసుండు
నరుదారజన్మించి తతనికినీవు♦పరికింపనాలవ బ్రహ్మవుగావె
బ్రహ్మసంతతియెడ పరదార లేడ♦ఇమ్మహాపాతక మిటు సేయు టేడ
చేకొనిలోకము ల్చెచెరచినీవు♦లోకరక్షణ గుణాలోలురువారు
ధర్మఘాతకుండవై తనరుదునీవు♦నిర్మలధర్మైక నిపుణులు వారు
మీఱితాపసులదు ఖింగెదవీవు♦వారుతాపసులను వడిబ్రోతురెపుడు
చేరిపరస్త్రీలఁ జెఱుతువునీవు♦పరదారరక్షకు ల్పరికింపవారు
వేదబాహ్యుండవై విహరింతువీవు♦వేదార్థ సత్కర్మ విహితులువారు
ధర్మమెక్కడనుండు దగిలిదైవంబు♦నిర్మలస్థితితోడ నిలుచునక్కడను
ఎక్కడదైవంబు లింపారుచుండు♦నక్కడవిజయంబు లమరుచునుండు
వరమిచ్చిచెలఁచిన వనజజుతోడ♦సురగకింకరులతోడ సురగు తోడ
సురసిద్ధఖేచరు ల్సముఖులై వచ్చి ♦ యరిమురినీకుఁగా నడ్డంబునిలిచి
కాచినన్నైనను కాకుత్స్థవంశుఁ ♦ డేచిననినుఁజంప కేలబోనిచ్చు
నొప్పదొప్పదుచల మొప్పదువిడువు♦తప్పక చెప్పితి దనుజలోకేశ
వాలినవరగర్వవహ్నిలోపలను♦నేలకాలెదుపడి యెంతయునేచి
బద్ధవైరముమాని పరికించినాదు♦బుద్ధినిర్మలమగు బుద్ధిలోగొనుము
తల్లిదండ్రులబుద్ధి దలమోచుధర్మ♦వల్లభునకుగీడు వచ్చునేతలఁపఁ
దల్లి చెప్పినమాట తగదనకిపు♦ప్రల్లదంబులుమాని పరికించివినుము
అక్షరుండమృతుండునఖిలరూపుండు♦వక్షీంద్రవాహుఁడుపరమపావను దు
మోక్షమియ్యగజాలు మోహనమూర్తి ♦
రక్షకుండురుకీర్తిరణకర్కశుండు
ఆదినారాయణుం డమరులఁబ్రోవు ♦ మోదంబుతో మునిముఖ్యులగావ
భూదేవిభారంబుఁ బుచ్చిపోవైవ♦నాదశరథునిక ట్లమరిజన్మించె
నేరాజుజలధుల నీఁకింపఁజాలు♦నేరాజుహరువిల్లు నెలమిమోపెట్టి
తృణలీలవిఱిచెను దివిజులుప్పొంగ♦గుణరత్నఘునఖని కోదండగురుఁడు
మనుకులాధీశుండు మాధవుండరయ♦నినవంశుదేవియా యిందిరాదేవి
జగతీతనూజాత జగదేకమాత♦నిగమసన్నుతపూత నిగమవిఖ్యాత
యమితగుణోపేత యైనయాసీత♦ప్రమదంబుతోసీతి పాటించిబుద్ధి
సకలభూషణమణిహితంబుగాఁగ♦సకలేశుడగు రామచంద్రు ప్రార్థించి
యిప్పుడేకొనిపోయి యెలమిరామునకు ♦
నొప్పించినీప్రాణ మొగిగాచుకొనుము
కానొరువరములు దప్పించుఁగాని♦తానిచ్చువరములు దప్పింపలేడు

గురుధర్మపోషణ గుణవిభీషణుని ♦ హరిభక్తితోషణు ననఘపోషణుని
నమరవిభీషణు సత్యతోషణునిఁ ♦ గ్రమమొప్పఁగనుటయుఁ గడు లెస్సనీకు
నతిమృదుభాషణు నావిభీషణుని ♦ నతివేగ ప్రార్థించి యతని రావించి
పరఁగ లంకారాజ్య పట్టంబుగట్టి ♦ శరణని మ్రొక్కు మా జననాయకునకు
శరణన్న నెటువంటి చందంబునందుఁ ♦ గరుణతోఁ గాచు నాకరిగాచు రీతి
నని పెక్కుభంగుల నధ్యాత్మవిద్య ♦ ఘనమతియైనట్టి కైకేశితనకు
నిర్మలతరపుణ్య నీతిమార్గంబు ♦ ధర్మతత్పరబుద్ధి దగిలి చెప్పినను
దలలకెల్లను బెద్ద తలయైనయట్టి ♦ తలతోడఁగూడ నాతల లెల్ల వంచి
దండప్రణామంబుఁ దగనాచరించి ♦ నిండినభక్తితో నిలిచి రావణుఁడు
ఆసనత్సుతునిచే నటమున్ను విన్న ♦ భాసురంబైనట్టి పరతత్త్వమెల్లఁ
దనకు సిద్ధించుటఁ దనలోనఁ దెలిసి ♦ మనమున నెంతయు మగ్నుఁడై యపుడు
తలకొన్న వేడ్కతోఁ దలలెల్ల నెత్తి ♦ తలఁపక యప్పుడు తల్లితో ననియె
నెఱుఁగుదు మున్ను నే నెరిగినయట్టి ♦

మొఱఁగులుగలవె యీమూఁడులోకములఁ
దరమిడి యీపరతత్త్వంబు తెఱగు ♦ లెరిగియెఱుంగవు హృదయంబు చెదరి
తల్లి నీ వెరిఁగిన ధర్మశాస్త్రంబు ♦ లెల్ల నిష్ఫలములై యిప్పుడు తోఁచె
దల్లిదండ్రులు పెక్కు తిప్పాలెన్నైన ♦ నుల్లంబులోనాఁటి యుండవుగాని
యీమహాత్మునకు విష్ణుఁడైన రామునకు ♦ నీ మేనితోఁ బోయి యే మ్రొక్కఁజాల
హేయపదార్థమై యెసఁగుచున్నట్టి ♦ కాయంబు పెంచుట కష్టంబుగాదె
నరులు వానరులు నన్నుఁగ నెంతవారు ♦ సురలకన్నను వారు శూరులే తలఁప
గెలుతు నవశ్యంబు గెలుపు లేకున్న ♦ నిల రాముశరముల నీల్గుదుఁ గాని
హీనమానవునకు నే మ్రొక్కఁజాల ♦ మానుమిమ్మాటమ మ్మాటికో యమ్మ
చాలు నీబుద్ధులు చాలు నీమమత ♦ చాలించవైతేని జననివిచ్చేయు
గానకొని నీపిన్న కొడుకుతోఁ గూడి ♦ యెన లేని సంపద నేలు మీలంక
ఈలోకసంపద లిన్ని నీకృపను ♦ నాలోన మరి నేను ననుభవించితిని
బలిమిని గలిమిని భయమింత లేక ♦ బలసింకేలితిఁ బదిలత లేఁడు
లెలమి నాకును నెదు రెవ్వరు లేక ♦ విలసిల్లు ప్రాభవ విభవంబు మెఱసి
విచ్చేయు నగరికి వేగంబ యనిన ♦ నచ్చుగా రావణుం డాడుమాటలకుఁ
గైకేశి మదిలోనఁ గడుచోద్యమంది ♦

యాకొడుకును జూచి యనియె గ్రమఱను
వరతపోనిధి విశ్రవసుఁ డానతిచ్చు ♦ పరతత్త్వమది యేల పడిపోవుననుచు
వనిత యప్పుడు మాల్యవంతునిఁ జూచి ♦ మనమెంత చెప్పిన మానునే యితఁడు

అనవిని యిట్లనె నమ్మాల్యవంతుఁ ♦ డినయంగ నీవిప్పుడే చెప్పెదవు
బడుగునకునార్యుల చాటువాక్యములు ♦ కడుఁబ్రీతిఁ జెప్పిన గాదనివినఁడు
గానఁగానఁడువీఁడు కార్యంబు తెలియఁడు ♦ మానుమునీవింక మానినియెమ్మ
అనవుడుఁ గ్రైకేశి యట్ల కాకనుచు ♦ నెనయంగఁ జెడుత్రోవ యేటికి దప్పు
నే తెలియంగునఁబోవ దిది దైవకృత్య ♦ మో తండ్రి మననీతి యుచితమే యనుచు
దాతయుఁ దానను దలకెడువగల ♦ భ్రాతలుదల్లులు బాంధవుల్ గలఁగఁ
జనియప్పుడా సభా సదనంబుఁ బాసి ♦ తననగరికిఁ బోయి ధర్మక్రమంబుఁ
దననిత్యకర్మంబు దప్పకయపుడు ♦ మనమునఁ దెలిసి సమ్మదమునను౦డె
నటదశగ్రీవుండు నధికదర్పమునఁ ♦ బటుతరనిస్సాణ భాంకృతుల్ చెలఁగ
జేయించి రాక్షస సేనవారించి ♦ యాయోధనోద్యుక్తులై యేపుమీఱి
యున్నమంత్రులఁ జూచి యుగ్రుఁడై పలికెఁ ♦
గన్నులఁ గోపంబు గడలుకొనంగ
శ్రీరాముఁ డిప్పుడే సేతువుఁ గట్టి ♦ వీరుఁడై వచ్చి సువేలాద్రి విడిసెఁ
బటుగతి నామీఁదఁ బగవాఁడు రాఁగ ♦ నిటనిద్రవోవుట యే నేర్పు మీకు
మిమ్మేమి చేయుదు మీ మంత్రులనుచు ♦ నమ్మిన వీఱిడి ననునంద్రుగాక
కాదుపో మీరు పేతొపరులైన ♦ నాదెసకీడొందునా యివ్విధమున
సామభేదంబులఁ జక్కఁగాకున్న ♦ రామునితోఁ బేర్చి రణము సేసెదను
అని రావణుండాడ నఖిలరాక్షసులు ♦ వనకిన సిగ్గులఁ దలలెత్తలేక
యూరకుండిరి యూరకుండ నేలనుచు ♦ ధీరుఁడై యావేళ దివిజారియైన
రావణుతోడ దర్పంబునఁ దనదు ♦ చేవదోఁపఁగ నింద్రజిత్తుండు పలికె
దేవ రావణకర్య దేవసంఘముల ♦ నావిధంబున గెల్పు నంతటి నీకు
నిలయేఁగాలేని యీ రామలక్ష్మ ♦ ణుల చేత నేకీడు నూల్కొనునింక
వలదుచింతింపనే వ్రాలినవాఁడ ♦ నలవుచలంబు ధైర్యముఁ గలవాఁడ
నాగపాశంబుల నా కేశుఁ గట్టి ♦ యాగతి సేపనా యసురాధినాథ
కాలకేయాది రాక్షసవీరవరులఁ ♦ దోలనా దానవోద్ధురసంగరముల
మనుజులఁ గృశులఁ దామసుల దుర్బలుల ♦ దనుజేశ దశరథ తనయుల నాకుఁ
ఖంపట పెద్దయే సమరంబులోనఁ జంపెద నీమది సందేహపడకు

—:* రావణున కతికాయుఁడు నీతిసెప్పుట *:—

మనవిని యతికాయుఁ డనువాఁడు పలికె ♦ దనుజేశ్వరునితోడ దద్జ్ఞులు మెచ్చ
వినుదానవేశ్వర విశదనీతిజ్ఞ ♦ డను పెంపుతోడ నీయఖిలంబు నెఱుఁగఁ
బరులసొమ్ముల కాసపడక వర్తించు ♦ నరనాథుఁ డిలయెల్ల నాఁడును నేలు
నిది నీతిగతియని యిచ్చగింపింప ♦ కెడుకొందు లేదని యేలచూచెదవు

ఇనకులోత్తముడు నీకొగ్గేమిచేసె ♦ దనుజేశనీకు నాతని దేవి యేల
నీవైదెనలంకయు నిన్నును జెఱుప ♦ నీదుష్టరాక్షసు లెత్తుకొన్నారు
గావునసీత రాఘవునకునిచ్చి ♦ యావిభీషణునకు నటలంకయిచ్చి
యానినభక్తితో నూరకయుండి ♦ మానితంబుగ బుద్ధిమంతుడవగుము
అని పెక్కుభంగుల నతికాయుడపుడు ♦ తనతోడబలుకంగ దనుజేశ్వరుండు
శుకసారణులజూచి శూరులై పలికె ♦ నొకమానవుండబ్ధి నుఱక బంధించె
ఘనుడిట్టివాడెందు గలడదిచిత్ర ♦ మనయంబు రాముడీ యబ్ధిని దాటి
వనుచున్నవారు మీరా సేనజొచ్చి ♦ ఘనమతులై యెల్ల క్రమమువీక్షించి
రండనిపలిచిన రయమునవారు ♦ దండివానర వేషధారులై వచ్చి
వనములయం దుపవనములయందు ♦ ననుపమలీల మహాద్రులయందు
వరసేతువందు నవార్ధికవ్వాలను ♦ గురుగుహాంతరముల గొమ్మరైనయెడల
గలయంగవిడసిన కపిసేనజూచి ♦ తలయూచి వెఱగంది తలకియాచరులు
మేనులుగరుపార మెల్లనజొచ్చి ♦ వానరసేనలో వచ్చుటజూచి
యెరిగివిభీషణుం డేచిపట్టించి ♦ యుఱకవాండ్రను రామునొద్దకు దెచ్చి
మనుజేశ రావణమంత్రులువీరు ♦ వనచరవేషులై వచ్చినవారు
శుకసారణులువీర పొచ్చి యువ్విట ♦ సకలంబు గనుగొని చనగలవారు
అనవుడువారలు నతిభీతినొంది ♦ మునుకొని చేతులు మోడ్చిమ్రొక్కుచును
దేవరావణుడు పుత్తెంచినచరుల ♦ మీవిభీషణుమాటలిన్నియు నిజము
ఏచియారావణుం డేమిమీసేన ♦ జూచిరమ్మనవుడు జూడచ్చితిమి
అనుటయునవ్వుచు ననియె రాఘవుడు ♦ వినుడు రావణుమంత్రి విభులాటజేసి
మిమ్ముబంపుటదగు మిముజంపగాని ♦ మిమ్ముజంపగవచ్చు మేలేమినాకు
నదిచెప్పనేల పీడంతయుజూడు ♦ డదిచూడు మిదిచూడు మనక మీరిప్పు
డిటతెలిగొనక పీడంతయుజూడు ♦ డటబోయి వెసజెప్పు డారావణునకు
నేలావునమ్మని విటసీత దెచ్చి ♦ తాలావుజూపర మ్మనుడాజిలోన
నెల్లియాలంకయు నెల్లరాక్షసుల ♦ ద్రుళ్ళెడినిన్నును దునుమాడుననుచు
చనుడని రావణుచారులబనిచె ♦ జననాథుడా రామచంద్రుండు ప్రీతి
వారువిభీషణు వలనననివ్వీట ♦ వారకసకలంబు నడిజూచిపోయి
రావణుగాంచి యారావణుతోడ ♦ దేవనీపంచిన తెఱగునబోయి
కపిసేనయంతయు గనుగొనుచుండ ♦ నెపమాత్రమున మమ్ము నీతమ్ముడెరిగి
పట్టించికట్టించి భానుకులేశు ♦ కట్టెదిరికి దెచ్చె గలుషంబుతోడ
జంపింపదలచినసదయుండుగాన ♦ జంపింపడయ్యె నిక్ష్వాకువల్లభుడు
నీలంకయునునిన్ను నిఖిలరాక్షసుల ♦ నాలంబులోపల నడగించుటకును

రాముభూపాలు శౌర్యము జెప్పనేల ♦ సౌమిత్రియొక్కడే చాలు లంకేంద్ర
సురవైరి సేతువు జూచితి ముందు ♦ నెకసి వానరసేన నిండియున్నయది
అదిశత యోజనం బైనట్టినిడుపు ♦ పది యోజనంబుల పరపును గలిగి
కపిసేన యెంతయు గణుతింపరాదు ♦ కపులాడకాడకు ఘనగిరులందు
నిడిసిన సేనయు విడియు సేనయును ♦ విడిదలపట్లకు వెదకు సేనయును
నుదధికి నవ్వల నుండు సేనయును ♦ వదలక మఱియును వచ్చు సేనయును
నై యుండుటకు మాకు నాత్మలో వెఱగు ♦ పాయని వెఱపును బ్రభవించె దేవ
యొక్కొక్కచోటన యున్న యా సేన లెక్కించి బ్రహ్మయు లిఖియింపలేడు
కానరా రాముని గనినతనిచ్చి ♦ దానవనాథ మోదంబున నుండు
మనవుడు రావణుం డామాటలెల్ల ♦ విననింపుగాక గ్రొవ్వి నరోషమెత్తి
దేవగంధర్వు లెత్తినన్నైన సిత ♦ నేనిత్తునె యేల యీపందతనము
మిమ్ము గోతులు పట్టి మెదిచిన మీరు ♦ బమ్మరవోవుచు బఱతెంచినారు
వలవదోడకుడు దుర్వారులై మిమ్ము ♦ దలచి కోతులు రారు దాడిమై వెఱక
ననిధీరుడై పల్కి యా రావణుండు ♦ చనితనతో శుకసారణుల్నడువ
మిక్కిలి పొడవైన మేడపై నెక్కి ♦ యక్కపిబలముల నంతయు జూచి
యచ్చెరువంది తానని యెవారలకు ♦ నీ చందమున నున్న యీ సేనలోన
నెవ్వడు ముంగల నేపారి నడుచు ♦ నెవ్వడెవ్వని వెన్క నేమఱకుండు
నెవ్వడు కూడుడి యెవ్వడు వలతి ♦ యెవ్వని మాటలయ్యినూతి సేయు
నెవ్వనితో రాము డిష్టంబు పలుకు ♦ నెవ్వని చేసేన యేపారి యుండు
నెవ్వారు రేపగ లీ సేనగాతు ♦ రెవ్వారు సామంతు లీ సేనలోన
నెవ్వడు సుగ్రీవు డెవ్వడు రాము ♦ డెవ్వడు లక్ష్మణు డేరూపువాడు
చూపుడేర్పడ మీరు చూచితిరేని ♦ కోపింపనే వారి గుణములు విన్న
ననవుడు సారణుం డా రావణునకు ♦ వినుపింపదొణగె బ్రవీణత మెఱసి
దేవ పుళిందానదీ తీరవర్తి ♦ పావకసుతుడైన ప్రబలుండు ధాత్రి
వీడె యీ లంకెల్ల వెసజెల్లగిల్ల ♦ బోడిమి నార్పులు బొబ్బలు చెలగ

—* రావణునకు శుకసారణులు కపిపుంగవుల దెలుపుట *—

గురుతర కపినాయకులు లక్షగొలువ ♦ దరుచర సేనముందఱ నున్నవాడు
అలముసత్త్వాఢ్యు నీలుడను వాడు దేవ ♦ జలజాప్తసుతునకు సైన్యపాలకుడు
వీకతో దిక్కులు వెస బెల్లగిల్ల ♦ కోకః దాటించుచు దుర్దమవృత్తి
వెఱగందజేయుచు వేయుపద్మములు ♦

మరినూఱుసంఖ్యలు మర్కటోత్తములు
బలవంతులగువారు బలసికన్గొలువ ♦ గొలువున్నవాడొక్క కొండయు బోలె

వాలినందనుఁడల్ల వాఁడెయంగదుఁడు ♦ వాలికంటెను బలవంతుఁడువీఁడు
అడరంగ నాచందనాద్రివల్లభుఁడు ♦ కడుఁబ్రసిద్ధుఁడు విశ్వకర్మనందనుఁడు
వినుప్లవంగంబులు వేయుగోటులును ♦ నెనుబదిలక్షలు నేపారిగొలువ
ఘనమైన సేతువుఁ గడఁకతోఁగట్టి ♦ వనచరసేన నవ్వలికిదాటించి
వ్రాలిననలుఁడుపో వాఁడుదైత్యేంద్ర ♦ వాలినందనున కవ్వలనున్నవాఁడు
తరుచరయూథముల్ తను బెక్కుగొలువ ♦ సురలోకకంటకసుతరుఁడన్వాఁడు
తనసేనతోఁగూడ తానొక్కరుండ ♦ మనలంకసాధింప మందుచున్నాఁడు
రజనీచరాధీశ రమణీయకాంతి ♦ రజతాద్రిఁబోలుచు రవిపుత్రునెదుర
బలములనన్నింటిఁ బరిపాటిదీర్చు ♦ వలతియా శ్వేతుఁడన్వానరుఁజూడు [డు
గురుబలాఢ్యులు వేయుకోటులుగొలువ ♦ వఱలు నాతఁడు వేగవంతుఁడన్వాఁ
చూడుమునదిక్కు జూచుచున్నాఁడు ♦ చూడుములంకేంద్రసుగ్రీవసఖుని
దగవింధ్యశైలసుదర్శనముఖ్య ♦ నగములకెల్లను నాథుఁడువాఁడు
కొమరారుసింగంపుగొదయుఁబోలె ♦ నమరినవాఁడులంకాధీశవినుము
గాంభీర్యవారిధి కపిలవర్ణుఁడు ♦ రంభుఁడు ఘనకేసరంబులవాఁడు
బలువిడి నూటముప్పదిలక్షలెలమి ♦ గొలువనున్నాఁడిదిగో చూడుదేవ [డు
కుముదుఁడన్వాఁడుసంకోచనాచలము ♦ నమరంగఁబాలించు నమరారియతఁ
పదికోట్లయగచరపతులోలిఁగొలువ ♦ మదమునమలయునామర్కటుఁజూడు
రమ్యశైల్యమునకు రాజైనవాఁడు ♦ రమ్యారువిక్రమతోరక్షసలుండతఁడు
నలువదిలక్షలు నాలుగువేలు ♦ గొలువంగలంకపై గోపంబుమీఱఁ
గుదియకనిరుగెలంకుల జూచువాఁడు ♦ త్రిదశారియదెచూచి తేశరభుఁడు
బలసితన్నప్పుడేబదికోట్లకపులు ♦ గొలువనున్నాఁడదే గురుసత్త్వధనుఁడు
పారియాత్రాచలపతి ఘోరసమర ♦ ధీరుండుపనసుండు దేవేంద్రవైరి
లలినొప్పడెబ్బది లక్షలకపులు ♦ గొలువనున్నాఁడదె గురుబలోన్నతుఁడు
సింధురగతిజాయ చెన్నగ్గలించి ♦ యందమాక్రోధనుం డనువాఁడు దేవ
యేనచాలుదఁ లంక నిలఁగూలద్రోయ ♦ గాననిపూవియిక్కడఁజూచువాఁడు
బలవంతులగుకపుల్బలసితనెపుడు ♦ లలిఁగొప్పడెబ్బది లక్షలుగొలువ
గవయుఁడున్నాఁడదేకనుఁగొనుదేవ ♦ వివిధప్రతాప సంవృతుఁడైనవాఁడు
కామరూపులువీరు ఘనఘోరసత్త్వ ♦ లీమెయిననిలోన నెక్కుడౌవారు
తలపోయఁగా దేవ దైత్యులకైన ♦ గలగనివారు ముంగలివారువీరు
నడుమనెప్పుడును సేనాసమేతముగ ♦ నడతెంచువారి దానవనాథవినుము
ఉరుభుజుల్వివిధ వర్ణోజ్జ్వలులద్రి ♦ చరులు నానాసహస్రంబులుగొలువ
నీతోడనెక్కటి నెఱిఁబోరఁదివురు ♦ నాతండుహరుఁడను నగచరోత్తముఁడు

నలుపెంతయునుమీఱ నానావిధములఁ ♦ నెలుగులసంఖ్యలు నేపారిగొలువ
నదినీలమేఘమధ్యస్థుఁడై పొలుచు ♦ శతమఖుబోలియుజ్జ్వలుడై నవాఁడు
నర్మదాతీరంబునను ఋక్షనగము ♦ బేర్మితో నేలెడు పృథుబాహుబలుఁడు
వాఁడెధూమ్రుఁడు జాంబవంతుతమ్ముండు ♦ వాఁడిమీఁదనయట్టివారులతన్గొలువ
నీలశైలంబుల నెలవెల్లదార ♦ మైలీలఁజొప్పిన యాకృతుల్గలిగి
యుల్లసిల్లుచునున్నయొకకోటిసంఖ్య ♦ భల్లూకములుగొల్వఁబలసియున్నాఁడు
తొల్లి దేవాసురోద్ధురయుద్ధకేళి ♦ నెల్లవరంబుల నింద్రుచేబడసి
ప్రాలివయాజాంబవంతుఁడువాఁడె ♦ దూలడెన్నదురణధూమ్రమలోచనుఁడు
ఱక్కలుండిదె వీని యుభయపార్శ్వముల ♦
నొక్కొక్కయోజనం బొడలిలోఁబొడవు

గలపద్మసంఖ్యల కపిసేనగొలువ ♦ సలలితుండగువాఁడు సన్నాథుడతఁడు
నాకారిబిరుదు వానరపితామహుఁడు ♦ నాకేశుతోఁబోరి యనిగెల్చినాఁడు
దహానునివలన గంధర్వకన్యకకు ♦ మహనీయమైన జన్మంబుదానొంది
పరపైనయాద్రోణపర్వతంబేలు ♦ దిరముగా జాంబూనదీతీరవర్తి
వేయుకోటులుకపుల్వేడ్కదన్గొలువ ♦ నీయుగచరుజూడు మేచినవాఁడు
నీలునితమ్ముఁడు నిర్జరవైరి ♦ చాలువాఁడింద్రసుజాలుడన్వాఁడు
కుపితమర్కటులాఱుకోటులఁగొలువ ♦ గపివీరుఁడాతఁడుగ్రఘనుఁడన్వాఁడు
కరముసంప్రీతిగంగాతీరమునను ♦ జరియించువాఁడు శాశ్వతబాహుబలుఁడు
చిరతరలీలమై శిశిరాద్రివేడ్క ♦ నిరవొందనెప్పుడు నేలెడువాఁడు
పదికోట్లనగచరుల్బలసితన్గొలువ ♦ నదెచూడుమాగజుం డనువాఁడు దేవ
కోటికోటులవేయుకొమరుగాజముని ♦ పాటిగోలాంగూల బలములుగొలువ
నదెగవాక్షుండను నతఁడాలమునకుఁ ♦ ద్రిదశారియోధుల దీటుచునాడ్ను
ధవళవర్ణాంగు లుద్దండవిక్రములు ♦ రవిసన్నిభులు రణరంగభీమనులు
వివిధరూపంబుల విఖ్యాతులైన ♦ ప్లవగసామజములు బలిసితన్గొలువ
నున్నకేసరిజూడు మొప్పారుకాంచ ♦ నోన్నతశిఖరికి నొడయండువాఁడు
బహువర్ణులై పటుభాషణధ్వనులు ♦ మహిఁగదలఁగదంత మండలివెలుఁగ
సింగంపుగొదమల చెన్నగ్గలించి ♦ పింగళాక్షంబులఁ బెద్దయుమెఱసి
వేయుకోటులకపుల్వేడ్కతోఁగొలువ ♦ బాయకరాము కృపారసంబంది
తనప్రాణములు రామధరణీశ్వరునకు ♦ ననయంబునీగోరునతులవిక్రముడు
అమరారివాఁడె యత్యాయతబలుఁడు ♦ సమరకర్కశుఁడైన శతబలిజూడు
వీడెసుషేణుండు వేకోట్లకపుల ♦ వాడిమిఁ దన్నుగొల్వఁగ నున్నవాఁడు
పదికోట్లయుగచరపతులొలిగొలువ ♦ నొదవునాతనిజూడు ముల్లాముఖుండు

ఇటుజూడుమాపీఁడె ఋషభుఁడన్వాఁడు ♦ భటముఖ్యులతనికిబదికోటులథిప
వనచరశతకోట వలనొప్పఁగొలువ ♦ దనరునాతనిజూడు దాసవాధీశ
కనకాద్రిధైర్యుఁడఖండవిక్రముఁడు ♦ ఘనభుజస్కంధుఁడు గంధమాదనుఁడు
మొనకు వేకోట్లుగా ముయ్యేఁడు మొనలు ♦
తనరఁగల్గినవాఁడు దధిముఖుఁడతఁడు [ములు
వినుమిరువదియొక్క వేయిశంఖంబు♦లునుమఱిరెండు వేల్వాఁబృంద
గలయుల్ల మొనదివాకరసూనుమాఁ ♦ బలమావలీముఖప్రముఖులజూపు
మొలయగిష్కింధలోనుండెడు వారు♦లలి దేవగంధర్వులకుఁ బుట్టినవారు
కామరూపముల సంగర కౌతుకముల♦భీమవిక్రమములఁ బెంపారువారు
అనికిసన్నద్ధులై యార్చుచున్నారు♦కనుఁగొనువారి రాక్షసలోకనాథ
అమృతంబు బ్రహ్మచే నమరంగబడసి ♦ రసురులకంటెను నధికులువీరు
పనుతింప మైందద్వివిదులనువారు ♦ వినుదేవ యేకాంగ వీరులువీరు
విదికోట్లప్లవగులు బలసికొల్వంగ ♦ నుదధితీరంబున నున్నారు దేవ
వీరులుసుముఖుండువిముఖుండునన♦ఘోరవిక్రములగ్గానుములంకేశ
మృత్యువుకొడుకులు మిగిలినచేవ ♦ మృత్యువుకంటెను మీఱినవారు
మిగిలిన తెగువతో మితి మేర లేని ♦ యగచరుల్ తనుభృత్యులై కొలువంగ
నున్నవాఁడ దెచూడు మఁదధిలంఘించి ♦ నిన్నునీబలము ను నీవారిఁగొనక
చనఁ దెంచివనములో జానకిఁగాంచి ♦ వన మెల్ల బెరికి నీవరసుతుఁజంపి
లంక భస్మముఁజేసి లంకిణినొంచి ♦ జంకెతో క్రమ్మరఁ జన్నవాఁడతఁడు
ఆవాయుసూనుండు హనుమంతుఁడగుట ♦ నీవును నెఱుగుదునిర్జరారాతి
వినుచిత్ర మొక్కటివీఁడు బాల్యమున♦దినమ డలంబుదయింపంగ జూచి
పెరిగినయాఁకటి పెల్లునదాని ♦ బరికించిఫలబుద్ధి బట్టంగదివిరి
వేగంబుతో మూఁడు వేల యోజనము ♦ లాగగనంబున కపుడుబిట్టెగసి
య తటనుండి పూర్వాద్రిపై బడియె♦నెంతయురయమున నీవానరుండు
హనువుభగ్నంబయ్యె నంతనుండియును ♦
హనుమంతుఁడనునామ మయ్యెనితనికి
వీరలందఱును బృద్వీధరంబెల్ల ♦ వారక యొక్కంత వడిగెల్చువారు
ఇట్టికపీంద్రు లనేకులు దేవ ♦ యెట్టనిసంఖ్యగా నెన్నంగవచ్చు
ననిసారణుడుపల్క నసురేంద్రుతోడ ♦ నునిశితమతియైన శుకుఁడర్థి పలికె

—:* శుకుఁడు శ్రీరాముల తేజో విశేషములఁ దెల్పుట *:—

వారలకెల్ల జీవనమైనయట్టి ♦ యారాముఁ జెప్పెద నసురేశవినుము
నవశిఖిహారినీల రత్నప్రభాతి ♦ మెయిచాయ నెంతయు మెఱసినవాఁడు

కమలంబులనుబోలు కన్నులవాఁడు ♦ విమలనీతిస్థితి వెలసినవాఁడు
ఆజానుబాహుండు నఖిలేశ్వరుండు ♦ రాజతేజోనిధి రఘుకులోత్తముఁడు
సత్యంబులోపల సారమౌవాఁడు ♦ నిత్యధర్మంబున నెగడినవాఁడు
శస్త్రాస్త్రవిద్యావిశారదుండఖిల ♦ శాస్త్రజ్ఞుఁడురుకీర్తిసంపదవాఁడు
తపనునినైన నగు దమతాతయనక ♦ తపియింపజేయు ప్రతాపంబువాడు
చక్కాడునథవైన శరజాలములను ♦ ప్రక్కలుగాజేయు వసుమతినైన
నలిగిననాతని యలుకవైరులకు ♦ దలపంగమృత్యువు దశకంఠ వినుము
తెగువనీవాసీతఁ దెచ్చితిగాన ♦ జగదీశుడిబ్భంగిఁ జనుదెంచెననికి
వరశరణాగత వజ్రపంజరుడు ♦ బిరుదులకెల్లను బిరుదైనవాఁడు
శరణన్నఁ గాచునే చందంబునందు ♦ దొరకొన్నయలుకకుఁ దుది లేనివాఁడు
మిక్కిలియైన నీమీఁదికోపమున ♦ నక్కన్నులం దెఱ్ఱ యమరినవాఁడు
మూఁడులోకములనిమ్మల నేలువాఁడు ♦

వాడెపో రాముండు వనజాప్తకులుఁడు

వారకశుద్ధ సువర్ణవర్ణాంగు ♦ డారాము వలపట నటనున్నవాఁడు
చలమున నీరేడుజగములనైన ♦ నలుకతో నిర్జించు నతిశక్తివాఁడు
ఆరామునకుఁ బ్రాణమైనట్టివాఁడు ♦ ఆరాముతమ్ముఁడుదగ్రవిక్రముఁడు
భావింపమమ్మోర్చి పట్టినవాడు ♦ దేవయీలక్ష్మణ దేవునిజూడు
మలుకమైనిన్ను నుగ్రాజిలోఁగలచి ♦ చలమొప్పలంక నిశ్శంక నేలుటకుఁ
బట్టంబు రామభూపాలునిచేతఁ ♦ గట్టించుకొని ప్రీతి గ్రాలుచున్నాఁడు
ఆవిభీషణుఁజూడు మసురాదినాథ ♦ భూవరు వెనుక నేపుననున్నవాఁడు
ఆరాముతమ్ముని యావిభీషణుని ♦ చేరువనవ్వాలిఁ జేరియున్నాఁడు
మహనీయతరధర్మ మార్గంబువాడు ♦ మహితనీతిస్థితి మరిగినవాడు
మానఘునాథీన మతినొప్పువాడు ♦ పూనికిష్కంధ నెప్పుడు నేలువాడు
చిరకపిరాజ్యాభిషేచన హేతు ♦ కర హేమమాలికాకలితవక్షుండు
గురుభుజుండంతక ఘోరవిక్రముఁడు ♦ సురవైరిచూచితే సుగ్రీవుడతఁడు
వీనికిగనసేన వివరింతువినుము ♦ దానవనాథ చిత్తంబుననిలిపి
సంఖ్యవేకోటులై చనునూఱువేల ♦ సంఖ్యలుమఱి మహాసంఖ్యనాబరగు
నవిలక్షగూడిన నగుబృందసంఖ్య ♦ యవిలక్షగూడిన నగుపద్మసంఖ్య
యవిలక్షగూడి మహాపద్మమయ్యె ♦ నవిలక్షగూడిన నగుఖర్వగణన
యవిలక్షగూడిన నగుమహాఖర్వ ♦ మవిలక్షగూడిన నగుసముద్రంబు
అవిలక్షగూడ మహాసముద్రంబు ♦ నవిలక్షతో మహాదాఖ్యమైపరఁగు
నవికోటిపోవాలి యనుజునిబలము ♦ వివరించిచూడుము విశదంబుగాఁగ

నీదితుద మొదలని యెన్నంగ దీని ♦ చదురుతనంబున సంఖ్య దేరాదు
కావున రాముతోఁ గదిసి పోరాడ ♦ రావణ రాదు దుర్వారమా బలము
అని శుకుం డెఱిఁగింప నారావణుండు ♦ ఘనమైన కపిసేనఁ గలయంగఁ జూచి
తనలోన బడబాగ్ని దరికొనుచుండ ♦ దనరారు వార్ధి చందంబున నపుడు
వెఱచియుఁ దనలోని వెఱ పడఁగించి ♦ వెఱవనిగతిఁ గోప వివశుఁడై పలికె
మంత్రి యేలిక చిత్త మార్గంబు దప్పి ♦ మంత్రంబు జెప్పనే మన సెల్లవిఱుగ
నే తెఱంగెఱుఁగక యెదిరినా యెదుర ♦ నీ తెఱంగున బల్కుటిది మీకుదగునె
యనవుఁడు దలలెత్త కచ్చోటు వాసి ♦ చనిరప్పుడా శుకసారణులంతఁ
జనినపిమ్మట నాప్త సచివుఁడు దాను ♦ దనుజాధినాథుఁ డెంతయును జింతించి
వారివీడ్కొల్పి దుర్వారుఁడై వైర ♦ మారవిద్యుజ్జిహ్వుఁ డను వానిఁ బిలిచి
రాముని ధనువు శిరంబును బోలె ♦ నీమాయ నతివేగ నిర్మింపుమనిన
నతఁడది నిర్మించి యర్థిఁ దెచ్చుటయు ♦ నతనికి మెచ్చు ప్రియంబున నొసఁగి
సురుచిరంబైన యశోకవనమున ♦ కరిగి యాదశకంఠుఁ డవనిజఁ గని యోఁ
బెల్లగు నీవగఁ బెట్ట నేమిటికి ♦ దల్లి నన్న వసుంధర దూరుకరణిఁ
తలవంచుకొని విన్నదనమున దూలి ♦ సొలవక ధాత్రి జూచుచునున్న దాని
నొడలఁ జిత్తములఁ బెంపొందవు దావాగ్ని ♦
యుడికి పొంగుచు వెలి కురుకుచునున్న
రాక్షసుపై రోషరసధారలనఁగ ♦ నక్షీణ బాష్పధారావళి దాని
పుత్త్రియీదురవస్థఁ బొంది తేయనుచుఁ ♦ ధాత్రి దానును బరితాపంబు నొంది
యాలింగనము సేసి నట్టిచందమున ♦ ధూళి గప్పిన మేనితో నున్న దాని
రావణ నిన్ను నీ రాక్షసకోటి ♦ నే విధంబున ద్రుంప కే నేల పోదు
నని వాని క్రూర ధర్మాది దైవంబు ♦ గొనకొన్న కైవడిఁ గూర్చున్న దాని
నమరారుఁ ను నీరసావనీజములఁ ♦ దమికించి తావిట తాటంబు సేయు
ననిదరికొను విలయానిలు పగిదిఁ ♦ దనరు నిట్టూర్పులఁ దఱుచైన దాని

{ సీతకు శాంబరీమాయచే గల్పితంబైన శ్రీరాముల
శిరోధనువులను జూపి వెఱపించుట. }

గని చెడఁదలఁచిన కష్టదానవుఁడు ♦ తనదిక్కుఁ జూడని ధరణిజకనియె
వెఱవు చాలని యవివేకి దానవుల ♦ ఖరదూషణాదుల ఖండించెననుచు
జనకనందన రాము శౌర్యంబు నమ్మి ♦ ననుగణుతింప వెన్నుఁడు జిత్తమునను
ననమునఁ గపులతో నంబుధి దాఁటి ♦ యసముఁడై యా సువేలాద్రిపై నుండి
యలసి నిద్రింపంగ నగచరసేన ♦ నలమి యీ రాత్రి ప్రహస్తుఁ డన్వాఁడు
నాకూర్చు బంటు చూర్ణంబుగాఁ జేసి ♦ జాకుత్స్థునురు కార్ముకంబును దలయు

గొనివచ్చె రామునికూర్మితమ్ముఁడును వనచరాధిపుఁడును వగచుచునుండఁ
దప్పించుకొని పాఱెఁ దా విభీషణుఁడు ♦ చుప్పనాతినిముక్కు సురియ చేకోయ
నా పాపమున జాఱె నపుడు నీ మఱది ♦ వాపోవుచును జాంబవంతుఁడు పఱచె
నూరక యంగదుం డూడంగఁ బాఱె ♦ దారితప్పనఁ బోయెఁ దారుండు భీతి
నీలుండు శరభుండు నిలిచిపోరాడి ♦ వ్రాలిరి మేనులు వ్రయ్యలై జగతి
బోక నిల్చిన మీరపుత్రుండు వడియె మోఁకాళ్ళువిఱిగి రాముని బాయ లేక
నెత్తుటు గ్రక్కుచు నీగెసుషేణుఁ ♦ డుత్తలంబున ధూమ్రుఁ డుదధిలోఁ బడియె
జెయ్యెత్తి మొక్కు గూల్చిరి దధిముఖుని ♦ మాయచే గేసరిమయి దాచిపోయె
కుముదుండు తల దెగఁ గొట్టినఁ బడియె ♦ సమసె మైందుండు వీగిచనియెను నలుడు
పనసుఁ డెడఁగి దబ్బర వచ్చెననుచు ♦ బనసచెట్టును బోలి భ్రమసి తా నిలిచె
నాలంబులోపల నఖవీరులును ♦ గూలుటయును జూచి కూడిన భీతి
జివ్వఁ జాలించి వచ్చినకపులెల్ల ♦ సవ్వంగ బరుగెత్తె నలినాప్తసుతుఁడు
సేతువుఁ జూడ వచ్చినకపులెల్ల ♦ భీతిచే సిల్లాండ్ర బిడ్డలఁ దలఁచి
ముగిసె కార్యంబని మొఱలిడి కొంకులకుఁ ♦ దగఁ గొట్టఁ బాఱిరి దైత్యులు దరుమ
గా నంగజాస్త్ర రాఘవు నాసవిడిచి ♦ నానారులకు నెల్ల నాథవై యుండు
నాయింట దాసీజనములైదు వేలు ♦ పాయక మణిమయాభరణముల్ దాల్చి
యచ్చరులున్నవా రతివనీసేవ ♦ కిచ్చెదనీ మనసిమ్ము నాకిపుడు
విరిదోటలోఁ గల్పవృక్షంబులైదు ♦ తరుణి నీ ముడిపువ్వు దండలకిత్తు
నమరభూధర రోహణాచలమణులు ♦ రమణి నీకిత్తు నన్ రతులఁ దేలింపు
నా మీఁదగామధేన్వాది ధేనువుల ♦ భామిని నీ యింటి పాడికే నిత్తుఁ
గొమ్మ ముప్పది రెండు కోట్లు చేరువలు ♦ నెమ్మినఁ గొక్కొక్క నికవేయి వేయి
దానవబలంపద్మ మాస్తంబు నాకు ♦ దీనఁ బోఁగలిచితి దేవతాధిపుల
నా బలంబెల్ల నీ జాడుగులు గొలిచి ♦ రామా శాలయిుటమీఁద నప్పొంగ గూరు
ననుచు విద్యుజ్జిహ్వుఁడను వాని బిలిచి ♦ వనజాక్షి ముండడు వైవబంచుటయు
దనుమధ్య యిదె రాముతలయును విల్లు ♦ దనియ టువైచి వాఁడరిగె నవ్వుచును
దలకొని రామభూధవుఁ డిప్పుడసుర ♦ తలలెల్ల ద్రుంచు నుద్ధతి రణస్థలిని
దలఁకకు నీపతి తలయు విం పారు ♦ నిలధర్మగుణముతో నిఁక నను మాడ్కి
దరలాక్షి యాతల తప్పక చూచి ♦ కర మొప్ప రాముని కన్నులు మోము
దలకట్టు మౌళి రత్నప్రభావళియుఁ ♦ బలు నరుసయుఁ గర్ణభాతియు మోవి
తలపోసి రాముని తలయకాఁ దలఁచి ♦ బలుమూర్ఛఁ బొల్పడి పడియె నా ధరణి
యిది బొంకు నీపతి కేమియుఁ గాదు ♦ సుదతి నీకీమాయ చూడఁగాదనుచు
దనయురస్థలికి సత్త్వంగిఁ దవిచి ♦ కొసియె నో కాక యీకుంభినియనగ

బడియంతదలలోనఁ బడఁతుక దెలిసి♦ యడలెడుశోకాగ్ని నలయుచుఁ బలికె
గటకటా కైకేయి కలహంబుబన్ని♦ యిటుక్రుంగఁ జేసితె యిక్ష్వాకుకులము
నీరాఘవేశ్వరుం డెగ్గెమిసేసె♦ నూరక యడవుల నుండంగఁ బనుప
వననిధిబంధించితి వచ్చి నీవింకఁ♦ గొనిపోయెదనియెడి కోర్కి దీపింపఁ
బెద్దనమ్మితిఁగదా పృథ్వీశ నిన్ను♦ నిద్దెసనాదైవ మిటుసేయ నెఱుఁగ
నాకును నీకుఁ బ్రాణంబొక్కటగుట♦ గాకుత్స్థ యిటుబొంకుగా జేయదగునె
పతికంటెముందఱఁ బ్రాణముల్ విడుట♦ కతినగానైతినే నర్కకులేశ
యెఱుఁగుదుగాకేమి యెడరినీకడకు♦ నరనాథపుత్త్రెంతు నాదుప్రాణముల
వసుధనాతల్లి నాఁరుడవునీవు♦ వసుధకౌఁగిట జేర్ప వావియే నీకు
జనకుచేనన్నగ్ని సాక్షి జేపట్టి♦ కొనివచ్చి యిటుసేయ గూడునే నీకు
నెట్లోకో రామ నీవిటనూరకున్న♦ గట్టడిప్రాణముల్ గ్రాఁగవయ్యెడిని
గ్రాఁగని యప్పుడే కారణంబీవు♦ గ్రాఁగుటనిక్కంబు గాకుండుననుచు
నీవిధంబున సీత యేడ్చుచునుండ♦ దౌవారికులువచ్చి దనుజేశుఁగాంచి
దేవ కార్యంబు లెంతేనిబుట్టుటయు♦ నీవరమంత్రులు నిస్సభాస్థలికి
నరుగుదెమ్మని ప్రహస్తాదులువచ్చి♦ తరమిడియున్నారు దారపట్టమున
ననివిన్నవించిన నారావణుండు♦ చనియెశీఘ్రంబున సభకునత్తఱిని
దనుజుండుచనఁగ నాతలయునివిల్లు♦ వినవిస్మయంబుగా వెసమాయమయ్యె
నారావణునిలక్ష్మి యంతలోపలనె♦ బోరసమాయమై పోవునన్నట్టు
ఇదె రాఘవుఁడువచ్చె నెత్తిపైననుచు♦ ద్రిదశారియంతయు ధీరుఁడై కడఁగి
వేగులవానిచే విన్నవార్తలకు♦ వేగనిస్సాణంబు వ్రేయంగఁబనిచి
తనసేనగూర్ప బ్రధానులఁబనిచె♦ జనకనందననంత సరమవీక్షించి
యేలమాయమ్మ నీవిటుప్రలాపింప♦ బోలదీవార్తలు బొంకుగానోపు
వనితనీముందఱ వైచినశిరము♦ దనుజునిమాయగా దలపోయవలదె
వనజాక్షియసుర దుర్వాక్యంబులెల్ల♦ వినియేనుబోయితి వెనుకనేయరయ
నావార్తవినురాము డనికెత్తెననుచు♦ దేవారియంతయు దిరుగంగబడియె
నదెవినిస్సాణహాననఘోషంబు♦ లదెవినుమా రాక్షసావళియుగ్ర
రథములమ్రోతయు రధికసారథుల♦ పృథులభాషణములు పెల్లుగామ్రోసె
నటుగాన రామున కాపదలేదు♦ కుటిలకుఁ తలఁకీవు గుందంగవలదు
అనిచెప్పపాలంక యఁగలనార్చుచును♦ వనచరసేనలు వచ్చుటజూచి
యంతరంగమున బిట్టదరి రావణుడు♦ చింతించిమంత్రుల జెచ్చెరబిలిచి
యదె రాఘవుడువచ్చె ననికిమీరిపుడు♦ విదితవిక్రమశక్తి వేగంబపోయి
మనుజాలనిద్దఱ మడియించిరండు♦ వనచరసేనల వధియించుడోలి

నరుగుడు తెండన్న నా రావణునకు ♦ వరనీతిమతిమాల్య వంతుడిట్లనియె

—*మాల్యవంతుడు రావణునితో నీతి సెప్పుట*:—

నుచితకాలంబున నొప్పగు సంధి ♦ యుచితకాలంబున నొప్పు వైరంబు
గాన నయోచిత కార్యంబు సేయు ♦ వానికి రాజ్యంబు వర్తించుచుండు
నధముతో విగ్రహ మధికుతో సంధి ♦ బుధులమతంబున బోనిచ్చు టొప్పు
వేవదుమనకంటె వనజాప్తకులుడు ♦ బలవంతుడగువాడు బలవైరివైరి
దైవకార్యంబుగా ధరబుట్టినాడు ♦ దైవబలంబు నాతనియందె కలదు
అరయ ధర్మాత్ము డది చెప్పనేల ♦ వారక ఋషుల దీవనలు గన్నాడు
సురల బాధించి భూసురుల మర్దించి ♦ యురుపాపబుద్ధివై యుండుదు వీవు
గెలుపు ధర్మము దెస గీల్కొను గాని ♦ యిలనధర్మము దెస నేలవర్తించు
నక్కమలజుచేత నటునాడు వరము ♦ తక్కిన వారిచేతను జావకుండ
బడసితి కాని యిబ్బంగి నీమీద ♦ నడతెంచు నరుల వానరుల గెలువ
బడయవు నీవెన్ని భంగులనైన ♦ జెడుటతథ్యము వీరచేతను నీవు
దానికింతటికి బ్రత్యక్షంబు జూడు ♦ మానైన విపుల హోమముల ధూమములు
జడిసె రాక్షసుల తేజంబులు మాసె ♦ నడుగక మనవీట నొప్పములు వ్రాలె
నటుగాన నాదినారాయణుండతడు ♦ ఇటు సేయుటకు బుట్టె నిద్ధరమీద
రామునితోడ విగ్రహ మొప్పదుడుగు ♦ రాముని బాణ పరంపరల్వెట్టు
వలదు రాముని గని వతని నొప్పించి ♦ కులమెల్ల రక్షించుకొనుము లంకేంద్ర
యనవుడు దశకంఠు డమ్మాల్యవంతు ♦ గనుంగొని రోష సంకలితుడై పలికె
మిగుల దేజంబున మేటినైయెందు ♦ నెగడిన నాయెద్ద నీపగవాని
జెప్పెదు నిన్నేమి సేయుదు నింక ♦ నెప్పుడు మానవయ్యెదు పందతనము
సీత నేమిటికిత్తు సీతనిచ్చుటకు ♦ భీతి నాకేమిటం బేర్చె నింతటనె
యని మీటి పలికిన నమ్మాల్యవంతు ♦ డని యెనా మాట నీవాత్మకైకొనక
యీరామచంద్రుని నాలంబులోన ♦ శూరత గెలువంగ జాతుము గాక
యొంటుంబోయెదమని హెచ్చికంటకేము ♦

లందంద బలుకుచు నలుకతో బోయె

బోయిన పిమ్మట బుద్ధిలో దలచి ♦ యాయసురేశ్వరుం డప్పుడు గడంగి
యలఘుబలాఢ్యు బ్రహస్తుని బనిచె ♦ దొలితొలి బలు కాపు తూర్పు వాకిటికి
దక్షిణంబున మహోదర మహాపార్శ్వు ♦ లక్షీణబలయుతులై యుండ బనిచె
వారక పడమటి వాకిటనుండ ♦ శూరతనటం బరచె సుతునింద్రజిత్తు
దనమామగా నుత్తర పువాకిటిని ♦ జనియుండుడని పంచె సారణశుకుల
నందఱికిని ముఖ్యుడై పురమధ్య ♦ మందుండగా విరూపాక్షుని బనిచె

ఈవిధంబున లంక కెల్లఁ గాపిడుచు ♦ రావణుం డంతఃపురంబున కరిగె
నంత నక్కడ రాముఁ డనుజు నర్కజుని ♦ నంతకన్నను హితుండగు విభీషణుని
వాలితనూజుని వాయునందనుని ♦ నీలుఁ గవయు జాంబవంతు సుషేణు
నాలోన రప్పించి యందఱితోడ ♦ నాలోచనంబునకై కూర్చి సలి
వనగుణంబున కెల్ల నాలయంబైన ♦ దివిజారి లంక యే తెఱఁగొకో యింకఁ
జూతమా యేర్పడఁ జూడుఁ డా యొకని ♦ చేతఁ దక్కుల మెల్లఁ జెదుట సిద్ధంబు
ననిపల్కి యా రాముఁ డనుజుండుఁ దాను ♦ వినసుతుఁ డాదిగా నెల్లవానరులు
గొలువంగ వచ్చి యొక్కడు వేడ్కతోడ ♦ నలరుచు నాసువేలాచలం బెక్కి
గుణములు గలవాఁడు గోత్రంబునందుఁ ♦ బ్రణుతికి నెక్కనిబ్బంగి లన్మాత్రిక్కఁ
గని యెరాఘవుఁడు లంకాపురంబపుడుఁ ♦ దన చేతఁ గడక సాధ్యంబగు దాని
ననిలజుఁ బట్టిన యంతనుండియును ♦ దనరాకలోపల దరికొన్న చిచ్చు
నాఁడు నేఁడును మండు నామణిప్రభలఁ ♦ బోఁడిమి గలుగు గోపురములదానిఁ
గడు నొప్పు నా రాము ఘాతకుఁ జోనుప ♦ మిడికెడు రావణ మృగముఁ జొనీక
విలయ గాలుండను వేఁటకాఁడర్థి ♦ వెలివారు వారిన విధమునఁ జూడ
దనరారు పెద్ద కొత్తడములతోడఁ ♦ గనుఁగొన నొప్పు ప్రాకారంబు దాని
రావణుఁ బోరిఁ గొన రామ రమ్మనుచుఁ ♦ జేవీచు పడగలఁ జెలువైనదాని
మహనీయతోరణ మంగళసూత్ర ♦ మహిమతో నంబరమణిసంగమమున
దళతళ వెలుఁగు నద్దంబుల నొప్పి ♦ చెలువారఁ గాదట్టు జేతులుగలిగి
పగలును రేయును బాయక కూడి ♦ మగల చే నొప్పు కొమ్మలు గలదాని
నెసఁగ నా రాము కట్టెదిరికిఁ గాలుఁ ♦ దసురేశుఁ డునుకులు లాయముఁ బట్టి తేర
నొరపుగాఁ ద్రవ్విన యూదంబులనఁగ ♦ నెరసిన పరిఖల నెలకొన్నదాని
కైలాసము మురారి క్రమ్మఱఁ బెఱికి ♦ మేలైన పేర్మి నిర్మించిన మాడ్కిఁ
దనరారి యులమిన్ను దాఁకి తెల్పునను ♦ గనుపట్టు మేడలు గలిగినదాని
ఘనలక్ష్మి నెదురుకోఁ గడఁగె రామునకు ♦ నని చెప్పునట్టి తూర్యధ్వని దానిఁ
జిలుకల పలుకుల చెలువు వహించి ♦ యళులనాదంబుల నానందమంది
కలకంఠరవములఁ గడుఁ బ్రీతిఁ జేసి ♦ పలికెడు శారికా స్వాగత మొఱసి
పల్లవ ఘనచయ పల్లవంబగుచుఁ ♦ బల్లవంబుల రాగభరితంబులగుచుఁ
గడిమోనిపూవుల గంధంబువలన ♦ నెడపక నందంద నింపులుచూపఁ
జెప్పఁ బెక్కగుచు నేచిన యట్టితరుల ♦ నొప్పెడివనముల నొప్పారుదానిఁ
గమలకెందును మనఃకమలంబులైన ♦ కమలాకరంబులఁ గర మొప్పుదాని
నటు చోద్యపడి చూచు నా రాఘవునకు ♦
బటుతర ద్యుత్ప్రభా భాతి తానొసఁగి

యాకాశమణి గ్రుంకె నపరాబ్ధిలోనఁ ♦ గాకుత్స్థమణి నమస్కారంబు సేయ
నారాముఁడును సువేలాద్రియందుండి ♦
యా రాత్రి గడతేర్చి యంత ప్రేగుటయు
గపులు వినోదంబుఁ గాఁ బెల్లు రేఁగి ♦ విపినంబులం దెల్ల వెసఁ జొచ్చి చొచ్చి
యందలి శరభ సింహాదులనెల్ల ♦ సందందఁ దోలుచు నార్చుచుఁ దిరుగ
నట్టి కోలాహలం బంత యులంక ♦ ముట్టి రాక్షసుల నెమ్ములు పగిలింప
నది విని రావణుం డది యేమి వరము ♦ పొదఁడని వచ్చి గోపుర మెక్కి చూచె
నప్పుడు గోపురం బతనితోఁ గూడ ♦ నొప్పఁ జాఁపసులను నుజ్జ్వలంబగుచు
ధవళాతపత్రము ల్దఱుచుగాఁ బట్టి ♦ ధవళచామరములు దఱుచుగా వీవఁ
బొరిఁ బొరి సురదంతి పోటుల నమరు ♦ సురముఖ్యఁబతికంబు లొనరుచుఁ గ్రాల
నాయతరత్న సింహాసనాసీనుఁడై ♦ యెత్తయున బాలుపారె నియ్యెడను
నపరాచలము మీఁది యర్కునితోడి ♦
యుపమకు మిత్రుఁడై యుజ్జ్వలుఁ డగుచు
బహువిధ రాక్షస పరివృతుఁ డగుచు ♦ మహితాయుధ ప్రభామండలంబులను
మెఱుపులు గల నీల మేఘంబువోలెఁ ♦ దఱచుగా మెఱసి మదంబులు గురియ
నెసఁగంగ నాదానవేశ్వరుం డప్పు ♦ డసమానుఁడై యుండె నాగోపురమున
మహనీయ రావణ మహిమ చేఁ జేసి ♦ మహిత విద్యుత్ప్రభా మండలంబైన
గోపురం బపుడు దృగ్గోచరంబైన ♦ భూపాలతిలకుఁ డద్భుత మంది పలికె
రా విభీషణ గోపురంబున వచ్చి ♦ యీ విధంబున నున్న యితఁ డెవ్వఁ డొక్క
ప్రళయకాలము నాఁటి భానుబింబముల ♦
వెలుఁగుల పొదిపోలె వెలుఁగుచున్నాఁడు
అనుడు విభీషణుఁ డారాముతోడ ♦ ననఘ యెనయ్యసుమా యన్న రావణుఁడు
సురనాథు సురలను గ్రుక్కించువాఁడు ♦ సురకామినులఁ జెఱఁ జొనిపినవాఁడు
ముల్లోకములఁ దన మూర్తి చేహల్ల ♦ కల్లోలమైపడఁ గావించినాఁడు
అనవుడు సుగ్రీవుఁ డారాముతోడ ♦ ననియె మీయెదుట నీయసుర గర్వించి

—:* సుగ్రీవుఁడు రావణునితో మల్లయుద్ధము చేయుట *:—

వైభవమిటు చూపువాఁడె శ్రీరామ ♦ యీభంగి నుండ నే నెట్లోర్తుననుచు
గుటిలవర్తనుఁడును గ్రూరుండు నగుచు ♦ నటుతలలెత్తిన యసురారి మీఁద
నకుటిల శౌర్య సంపన్నుఁడై యపుడు ♦ ప్రకటదివ్యాంగ సువర్ణుఁడై పేర్చి
మస్తకకోటీర మహిత శృంగముల ♦ విస్తరోరస్స్థల విపుల సానువుల
గురుకొని వాఁ డొక్క కొండయై యున్న ♦ బిరబిరఁ బడవచ్చు పిడుగు చందమున
వెసనగ్గలముగ సువేలాద్రిపైనుండి ♦ యసురేశ్వరుని మీఁది కర్కజుం డెగసి

దేవారిరావణుఁ దృణముగాఁ జూచి ♦ రావణవినుమేను రామునిబంట
మాకునీవైభవయూ చూపెదనుచు ♦ వీఁకతో మకుటముల్ వెసడొల్లవేసె
వ్రేసిననుఱుములై వెలుఁగుచురాల ♦ భాసు కోటీర పఙ్క్తి యొప్పారె
గాలరుద్రుఁడుమిన్న గదగొనివేయ ♦ రాలుతారాగ్రహ రాజిచందమునఁ
జాలఁగోపించి దశగ్రీవుఁడంత ♦ వాలితనూజుఁబట్టి వడిఁబడవైచె
నంతటిలోన నయ్యర్కతనూజుఁ ♦ డొంటియురమున నేచిపెల్లగసి
యసురచేతులలోన నడగంగఁబట్టి ♦ దెసలుగంపింపగ ధృతిదూలవైచెఁ
గటములుమరుదులు కంధరంబులును ♦ విటతాటములుసేసి పీఁపెల్లఁజీరి
కాడకాళ్లబాడలఁ గదియంగబట్టి ♦ వడిగోపురంబులో వైచినొప్పించి
నిటుపోరుచో వారలిద్దఱుదప్పి ♦ పటుగతినేలపై బడగవచ్చియును
నానేలమోపక యతిలాఘవమున ♦ బూనికనెగసి గోపురముమీఁదటను
బెనగిరి పెనగుచో బృథులసత్త్వముల ♦

గొనిన విన్నాణ మెక్కుడుగ గ్రోయుచును

డాసి మోకాళ్లఘట్టనలుసేయుచును బాసిక్రమ్మఱముష్టిబ ము జూపుచును
బవములగుండెలుపగులతన్నుచును ♦ గదిసి మోచేతుపంగములమెత్తుచును
గరవలయంబుల గదిగియావలలు ♦ పారిపారి నెత్తుకల్ పాడమ్ర వేయుచును
దడఁబడఁబెక్కువిధంబులఁ బెనఁగి ♦ కడఁగియప్పాటి తానకములు గైకొనుచు
నుబ్బునార్పులతోడ నొకకొంతసేపు ♦ ఉబ్బరింపకపట్టి యూరకుండుచును
నిమ్మయిబోరుచో నిద్దఱిమేన ♦ గ్రమ్మెబెల్లగయు రక్తప్రపూరములు
జేగురుటేరుల జెలువైనగిరుల ♦ బాగున నెంతయు భాసురులగుచు
నున్నచో రావణుండురవడిమాయ ♦ బన్నితన్నపుడు చంపగ జూచుటయును
నెఱిగి యాకసమున కెగసి వేగమున ♦ గలుకురాక్షసులు వెక్కసమంది చూడ
గపులెల్లమ్రొక్కను తక్కటసంభ్రమమున ♦

గపిరాజువచ్చి రాఘవునకు మ్రొక్కె

భక్తిమైరణరజఃపటల సమ్మిళిత ♦ రక్తపంకముని జోరస్థలంబంట
గపిరాజురాముఁడు కౌగిడిజేర్చి ♦ కృపవళుకొత్త నీక్షించుచు బలికె
వాసవాంతకుని రావణునిగైకొనక ♦ నీసాహసముసేయ నిటనీకుజెల్లె
నేవానిజంపెద నీవిభీషణుని ♦ నావీటఁగలిపెద నను బాసకొఱకు
వానిజపకనీవు వచ్చుటలెస్స ♦ యేను మెచ్చితినిన్ను నినసూనునీవు
వాలితమ్ముఁడవు రావణునిసర్జింప ♦ జాలవేతలపంగ సైరించుటెల్ల
వదినాకు బాలిడి యనని నాకీర్తి ♦ వదలక చెల్లింప వచ్చితిననుడు
దేవయూ ద్రోహిని దెఱగొప్పజూఁచి ♦ యేవిధంబునగోప మేసైరింతు

నవియర్కజుడువల్ల నతినిమాటలకు మనమున హర్షించిమఱియునిట్లనియె
స్ఫురితతారకము భాసురకృష్ణకర్త ♦ పరివేషమున నగు ఘనమండలము
వలనమంటలు దెగి ప్రాలుచున్నవియు ♦
జలదము లెవ్వెక్క రాక్షస రూపములను
జెలగుచు నెత్తురుల్చిలుకుచున్నవియు కలయంగ నొకటభూకంపమయ్యెడిని
మేటిగాడ్పులను భూమీధరకోటి ♦ గూటముల్ధరణిపై గూలుచున్నవియు
బెగడక దినకరాభి ముఖంబులగుచు ♦ నిగిడి వాపోయెడి నెరిజంబుకములు
సారెకునిట్టు రాక్షసకులప్రళయ ♦ కారణోత్పాతము ల్గానంగబడియె
దిరముగా నాంగికాస్తికశుభప్రకర ♦ వరసూచకంబు లేవలనగన్పట్టె
మనకుజయం బనుమానంబు లేదు ♦ ఒనగూడునిక దడయుటగాదటంచు
గరువలిసుతునిపై గరమొప్పనెక్కి ♦ వరపుణ్యనిధిజాంబవంతుడంగదుడు
సౌమిత్రియును విభీషణుండునునలుడు ♦ భీమవిక్రమకళాభేద్యులై కొలువ
నానగస్థలిడిగ్గి యతులవిక్రముడు ♦ వానరసేనలు వడితోడుచూప
దానుముందర ధనుర్ధరుడునై నడిచె ♦ దోనయాలక్ష్మణాదులు చేరికొలువ
దక్కన సేన లుద్దండవేగమున ♦ బెక్కుభంగులదొక్క పెల్లుగాదోచ
నడువనెంతయు బేర్చి నలినాప్తకులుడు ♦ కడుఘోరమైన రాక్షసకోటిచేత
దనరినలంకయుత్తరపువాకిటను ♦ వినవిస్మయంబుగా విడిసె రాఘవుడు

—:* శ్రీరాముడు వానరులచే లంక ముట్టడి వేయించుట *:—

ద్వివిదమైందులతోడ దెగువనీలుండు ♦ నవిరళభుజశక్తి నమరులుపొగడ
బరువడికసిసేన బలసితన్గొలువ ♦ వరమతివిడిసె పూర్వద్వారమునను [డ
గజుడుగవాక్షుండు గవయుండు భూరి ♦ భుజులైన ఋషభుండు పొంకంబుతో
దనతోడగూడిరా దక్షిణద్వార ♦ మునవాలియవ్వాలి పుత్రుండువిడిసె
బతితోసుషేణుని బవననందనుడు ♦ పెసగూర్పుకొని బాహువిక్రమంబొప్ప
వాడెపోయిలంక వడిగాల్చినట్టి ♦ వాడనబడమటి వాకిటవిడిసె
మేటిగా బెద్దనమ్మిన ముప్పదాఱు ♦ కోటులకపినాయకులు తన్నుగొలువ
విసువకవీరుడై విశదంబుగాగ ♦ వెసగామపడమట విడిసెనర్కజుడు
పసగలభల్లూక జలములుగొలువ ♦ నసమానబలయుతుండై మహాబలుడు
అంబుధులేడొక్కటైన చందమున ♦ జాంబవంతుడు రాము సన్నిధివిడిసె
మనుజేశుడవ్వలక్ష్మణవిభీషణుల ♦ గనుగొనిపల్కె నుత్కంఠదీపింప
వనచరావలుల నవారితబలుల ♦ బనుపుడుమఱియును బైదళంబుగను
నెక్కడనేమియు నేమఱకుండ ♦ నొక్కొక్కపద్మ మొక్కొక్కవాకిటను
ననవుడునలుడును హరుడుసంపాతి ♦ యనువారుమనముశస్త్రసంతతుల

మిగిలిరాక్షసకోటిమీఁద బెల్లుగను ♦ వగలియిక్కడ నెయుద్ధంబు సేయుదము
అనిపల్కి రాముఁ డయ్యగచరాధిపులఁ ♦ గనుఁగొని యపుడొక్కట్టడ సేసి
క్రందైన సందడి కయ్యంబునందు ♦ నిందునందును మన మెఱుఁగంగవలయు
కపిరూపములె కాని కామరూపములు ♦ కపటరూపంబులు గాకుండుడనుచు
నిటు రాము డానతి నెల్ల వానరులు ♦ నటు లంక చుట్టు నత్యంత వేగమున
నిశ్చలచిత్తులై నెలకొని పూర్వ ♦ పశ్చిమోత్తరయామ్యభాగముల్ నిండి
పదియోజనంబుల పరపున విడిసి ♦ పదిలులై యుండి రప్రతిమవిక్రములు
వికృతవాలంబులు వికృతాననములు ♦ వికృతదంష్ట్రంబులు వికృతనఖాళి
యమరంగ దరుశైలహస్తులై పేర్చి ♦ సమరంబు సేయంగ సన్నద్ధులైన
వారి యుదల్పులు వారి యార్పులును ♦ వారిహుంకారరవంబులు చెలఁగ
భీమమై లంకలోఁ బేర్చి యాదైత్య ♦ భామినీజనుల గర్భంబులు గలఁగ
నట్టి కోలాహలం బంతయుఁ జూచి ♦ నెట్టన రాక్షసనికరంబు బెదరె
కమలాప్తకులుఁడప్పు డల్లన రాముఁ ♦ డమితసత్త్వోన్నతుఁ డతినయశాలి
రావణునొద్దికి రాయబారంబు ♦ పోఁదను నెవ్వని బుత్తెంత మనుచుఁ
గపిలోత్తముఁడైన కంజాప్తసుతుని ♦ గపిరాజు బంపుట కార్యంబు గాదు
బల్లిదుండగు జాంబవంతు బంపుటకు ♦ నెల్లవిధంబుల నెఱుఁగఁడు వాడు
రమవిక్రమశాలిఁ బవమానసుతుని ♦ మరలను బంపుట మర్యాదగాదు
భుజవిక్రమంబున భూరివేగమున ♦ భుజగవైరికి సరిపోలు నంగదుని
నంపుట మేలని యతివేడ్క నెంచి ♦ సంపద వెలయంగ సర్వజ్ఞుఁడైన
మనుజేశుఁ డంతట మంత్రులతోడి ♦ యనుమతిఁ గైకొని యంగదుఁ బిల్చి
యరిగి రావణుతోడ నజుని చేఁ గన్న ♦ వరగర్వమున మునివరుల దేవతల
నడచి గాధించిన యటుగాదు నేడు ♦ విడిసె నీపై రామవిభుఁ డనిపల్కు
మేలావు నిమ్మనీ వెలనాఁగఁ దెచ్చి ♦ తాలావు చూపరమ్మను మాజిలోన
సందీప్త రామాస్త్రచయఘట్టనలకు ♦ బందవై యెంచనుఁ బాఱకుమనుము
అటు చాలవైతేని నవనిజ దెచ్చి ♦ యిట నిచ్చి బ్రతుకుట యిది బుద్ధియనుము
పరఁగ లంకారాజ్యపట్టంబునకును ♦ గరుణ విభీషణుఁ గట్టినాఁడనుము
చంపెడు రాఘవేశ్వరుఁ డీ దెనిన్నుఁ ♦ జంపక మున్నె నీ సకలబాంధవులఁ
జూడుము లంకయుఁ జూడు మేర్పడఁగఁ ♦ జూడుము నీకూర్చు సుదరీజనుల
నీవు నీ బంధువుల్ నిరవశేషముగఁ ♦ జావంగఁ గలవారు చచ్చిన మీఁదఁ
గార్యంబు నిష్ఫల కార్యంబు మనుట ♦ కార్యంబు విను దశకంఠ నీ వింక
ననుము పొమ్మని రాముఁ డానతిచ్చుటయు ♦

మనమున హర్షించి మర్కటోత్తముఁడు

వినయంబుతో రామవిభునకు మ్రొక్కి ♦ యనురాగమున నేగె నమ్మహాబలుఁడు

—:* అంగదరాయభారము *:—

ఘనతరపర్వతాకారంబుతోడ ♦ ననిమిషుల్ వొగడంగ నాలంకఁ జొచ్చెఁ
గడుదుష్టరాక్షసగహనముల్ గాల్ప ♦ నడరెడు విలయకాలాగ్నియుం బోలె
నెగసి యాకసమున నింద్రారిఁ జంపఁ ♦ దగిలిన మృత్యుదూతయుం బోలె నపుడు
దశరథాత్మజునాజ్ఞఁ దలమోచికొనుచు ♦ దశకంఠు ముందఱఁ దడయక నిలువఁ
గనుఁగొని యపుడు రాక్షసకోటి యెల్ల ♦ నినజుండు క్రమ్మఱ నేతెంచె ననుచు
నాయోధనోద్యుక్తులై సంభ్రమింప ♦ నాయసురులు నెల్ల హస్తముల్ సాచి
వలవదో హో యని వారణ సేసి ♦ పలికె నంగదునితో పంక్తికంధరుఁడు
క్రొవ్వి వానరుఁడ యీ కొలువులోపలికి ♦ నెవ్వగ నొందక నేఁడు వచ్చితివి
ఎవరు నీకుం బంచినా రెవ్వఁడ వీవు ♦ ఎవ్వని తనయుఁడ వేమి నీ పేరు
నివ్వటిల్లెడు లంక నీ విటు చొచ్చి ♦ యెవ్వరి పనిఁ బూని యేగుదెంచితివి
వనచర చెప్పరా వచ్చిన కార్య ♦ మని రావణుండిట్లు లదలించి పలుక
విని క్రోధవివశుఁడై వికృతాస్యుఁడగుచు ♦ వనచరపతి యంత వానికిట్లనియె
నీ వెవ్వఁడని పల్క నెఱుఁగవే నన్ను ♦ రావణ యేను నా రాముని బంట
రాముఁ డెవ్వఁడు పరాక్రమమునఁ బరశు ♦ రాముని గెలిచిన రణవిచక్షణుఁడు
అతఁ డెవ్వఁ డుద్ధాముఁడై కార్తవీర్యు ♦ నతివీరు ద్రుంచిన యతులవిక్రముఁడు
అతఁ డెవ్వఁ డెఱుఁగవా యాజిలో నిన్ను ♦ జితు జేసికొనిపోయి చెఱనిడ్డవాఁడు
ఎవ్వని తనయుఁడో యెఱుఁగవా నన్ను ♦ నివ్వటిల్లఁగఁ బట్టి నినుదోఁకఁ గట్టిన
మొఱపెట్ట వార్ధుల ముంచి ముంచి చీఁచి ♦ కరుణించి విడువ దేఘనుఁడైన వాలి
యా వాలి మఱచితే యకట యంతటనె ♦

యే వాలిసుతుఁ డౌట యెఱుఁగవా యోరి

యంగదుండను వాఁడ నాభావవార్ధి ♦ నంగదని నను మున్ను నా తండ్రి పోలె
మా తండ్రి యెఱుఁగక మఱి నిన్ను బట్టి ♦ యాతతంబుగ నీట నఱమించెగాక
యనవుడు కోపించి యసురేశుఁడనియె ♦ వనచరాధమ నీవు వచ్చిన దూత
ఔనకనిన్నిట శిక్ష సేయరాదనుచు ♦ ఘనముగా బెడిదంపు గాఱులాడెదవు
వలను గాఁ టమున్న వచ్చిన దూత ♦ యలరుచు హనుమంతుఁడను వాఁడ ననుచు
వలనొప్ప నిటవచ్చి వైదేహితోడఁ ♦ గలవి లేనివి కొన్ని కాఱులు వల్కి
యీ చతురోక్తు లనేకంబు లాడి ♦ మా చేతఁ దండన మఱి పొందిపోయె
నోరి యా వానరుఁ డున్నాఁడొ లేఁడొ ♦ వెరవారఁగా నాకు వివరించి చెప్పు
మనవుడు సంక్రందుం డసుర కిట్లనియె ♦ ఘనులు రాముని సేనఁ గపులెల్ల గినిసి
బలితహుంకారోగ్రపటుశక్తి మెఱసి ♦ చెలఁగి యా హనుమంతుఁ జెంపలు గొట్టి

యని రావణునితోడ సరమాటలాడి♦పనివడి లంకకుఁ బనిపూనిపోయి
యడరి యింద్రారిచే నాలంబులోన♦వడిఁబట్టువడి చిక్కి వనచర నీవుఁ
తోఁకఁ గాల్పించుక తొలఁగివచ్చితివి♦వీఁకతో రాముని వీటిలోపలను
సకలకపికులములో నడితెచ్చితనుచు♦వెరఁడితోలిన వీటికిం - సి
యటఁబంపక డకేగ నావానరుండు♦ఇట రాము సేనలో నిద్దఱిమమ్ము
నినజుండు వానరహీనులఁ జేసి♦పనివడి యిట్టువంటి పనులు సేయించు [డె
ననియంగదుఁడు వల్కె నసురేశుఁడంత♦మనమున బెగడొంది మగ్నుడై యుం
మలయుచు జలము క్రమ్మఁగ నూలుకొలిపి ♦

యలఘుఁడై యుంగదుఁ డప్పుడు పలికె

నేం రావణ రాము నెఱుఁగవు గాక♦యీరీతి దర్పింప నేటికి నీకు
లోకవిక్రముఁడు త్రిలోకభీకరుఁడు♦లోకశరణ్యుఁడు లోకైకనుతుఁడు
లోకరక్షకుఁడును లోకశిక్షకుఁడు♦ప్రాకటచంద్రమో భానువీక్షణుఁడు
వేదాంతవేద్యుండు వేదగోచరుఁడు♦నాదినారాయణుండతిసత్యవాది
యసదృశుండా రాముఁ డభిరాముఁ డనఘు♦

డసహాయశూరుఁడు నతులవిక్రముఁడు [ర్తి

ఆద్యంతరహితుండు నాచారపరుఁడు♦నాద్యుఁడు పరుఁడును నగు దివ్యమూ
దశరథరామ భూతలనాయకుండు♦విశదోరుసత్కీర్తి విదితశూరుండు
అడవినీ చెలియలత్యాసక్తిఁడాయ♦నడఁచిన నా శూర్పణఖముక్కు చెవులు
వడిఁబట్టికోసిన వరఖడ్గధార♦వడియు నెత్తురుఁ దుడువఁగఁ గోసి వేసి
ఖరదూషణాంగరక్తములఁ గడిగి♦కరమొప్పజేసిన కాకుత్స్థతిలకు
నెఱుఁగవా రాముని నేటికిఁ బేలె♦దెఱిఁగెదు కాకేమి యెందుబోయెదవు
మూఁడులోకంబులు ముట్టిగర్వంబున♦ మాడించు నిన్ను నమ్రాశ జవల్లభుడు
దునిమెను గ్రత దొలఁగక నిలిచి ♦ యని సేయుబంటవై యింతియచాలు
లంక నీవిఁక నేఁగ లేవు వినుము♦లంకకు బతి సుమ్ము లలి విభీషణుడు
తడయక నీమీఁద దయగల్గి యిపుడు ♦ కడు వేగముననిట్టి క్రమమున మంచి
బుద్ధి నీకును జెప్ప బుత్తెంచె నన్ను♦వద్దు రాక్షస వైదేహి నిమ్ము
మది మదినుండి రామాధిపుతోడ♦గదసి కయ్యమునకుఁ గాలుద్రవ్వకుము
రాక్షసాధమ యోరి రాముని దేవి♦సాక్షిని మొఱగి నీవిట్లు తేఁదగునె
లోకపావన సీత లోకైకమాత♦నీకుఁ దేఁదగదోఁ నీచ రాక్షసుఁడ
నినుఁ జెప్పదోషంబు సనుఁ జూడరాదు♦ఘనతరమగు పాపకర్ముఁడ వీవు
లోకంబులకుఁ దల్లి లోలాక్షి సీత ♦ నీకుఁ దల్లియ కాదె నిర్భాగ్యదనుజ
యని వేళఘుఁ జేసి యపకీర్తిపడితి♦విపకీర్తులాసి నెఱుఁగ లేవైతి

వెడపకరఘురాము డగ్గేమిసేసెఁ ♦ గడుగర్వియనమీఁదుఁ గానంగలేక
యిహపరదూరుఁడ వీవేపుమీఱి ♦ విహితమార్గంబింత వివరింపనైతి
వుడుగకరామాగ్ని యొడిఁగట్టుకొంటి ♦ పుడమిలోభస్మమైపోయెదికొఱకు
వీపాలివిధిపట్టి నీమెడఁగట్టి ♦ యీపాలుచేసె నిన్నీరసమెత్తి
నీవేమిసేయుదు వీప్రాఁతఫలము ♦ గావించియజుఁడిట్లు కట్టడసేసి
కడఁగిరాఘవునంప కార్చిచ్చులోనఁ ♦ బడికలభంబవై ప్రాలెదవెల్లి
చాలనొప్పినయట్టి సౌఖ్యతలంక ♦ యేలుభాగ్యంబులే దేమందునిన్ను
జెడకుముశరణనిచేరుమా రాముఁ ♦బుడమిలోనీప్రాణములుగాచికొనుము
నీపుత్త్రమిత్రాది నిఖిలరాక్షసులు ♦ నేపరిరాముచే నీల్గకమున్న
కార్యంబుమునుపడఁ గైకొనిబ్రతుకు ♦ కార్యమొల్లకపోరు గావించితేని
చుట్టాలనింతుల సుతులసోదరులఁ ♦ నిట్టియందఱఁజూడు మిఁకఁజూడలేవు
ఎలమినీమోహంపు టింతులనెల్ల ♦ గలయభోగింపుము కాంక్షలుదీర
నెలయంగనీరాజ్య విభవంబులెల్ల ♦ బలుదెఱఁగులనేడె పాటించిచూడు
హరిహరబ్రహ్మదులడ్డగించినను ♦దురములోపలనిన్ను ద్రుంచురాఘవుడు
ఇన్నియునేటికా యినకులేశ్వరుని ♦ కున్నతమతిసీత నొప్పించిబ్రతుకు
మిఁకరామునానతి యెఱుఁగజెప్పితిని ♦ గుటిలరాక్షసయేమిగొబ్బునజెప్పు

—:* రావణుఁ డంగదునితో దనపరాక్రమము సెప్పుట *:—

మనరోషచిత్తుడై యద్దశాననుడు ♦ ననియెనంగదుతోడ నప్పుడుకినిసి
రాముజెప్పెదు పరాక్రమశాలినన్ను ♦
రాముఁడెఱుఁగఁడా రణవిజయుఁడుగ
దివిజేంద్రుఁడాదిగా దేవసంఘముల ♦ బవరంబులోపలఁ బఱపినవాఁడ
హరుఁడున్నకైలాస మగలించినాఁడ ♦ నెరియంగఁగాలుని నెదిరించినాఁడ
వరుసతోజగముల వర్ణింపనలరి ♦ సరవిలోకములెల్ల సాధించినాఁడ
వనజాసనునిచేత వరముఁగొన్నాఁడ ♦ మొనసిదివ్యాయుధంబులుగలవాఁడ
నిట్టిపిమ్మటనునే నీరాముచెఱుఁగుఁ ♦ బట్టినదేవతల్ పకపకనగరె [గాక
యనుజుండునాతోడ నలిగటుపోయి ♦ జననాథుమఱుఁగు వంచనఁజొచ్చెఁ
ఏనునుజొచ్చిన హీనతగాదె ♦ వానరాధమనాకు వసుమతిలోన
మగపాడిదిగనాడి మానంబువిడిచి ♦ పగవానిఁగలయుట పంతమేనాకు
పగవాఁడువాఁడెత్తి పైవచ్చినంత ♦మగఁటిమిచెడిసంధి మఱిసేయునపుడె
జగతిరాజులునన్ను సరకుసేయుదురె ♦ తగదురాసంధి యిత్తఱివానరుఁడ
యనినదశాస్యున కనియెనంగదుఁడు ♦
ఘనపరాక్రముతోడి కయ్యంబువలదు

దానవరఘురాముతర మెఱుంగక యుపూనియున్నాఁడవిప్పుడు కావరమున
సురలగెల్చినమాడ్కి శూరురాఘవుని ♦ దురములో నెదిరించితోడరుటయెట్లు
బలమేదిరఘురామ పార్థివునెదిరి ♦ బలుముష్టివిల్లెట్లు పట్టంగవచ్చు
నౌరులగెల్చినమాడ్కి నోర్చి రాఘవుని ♦ శరవృష్టిముందఱ జరియించుటెట్లు
కణకతో నీసత్తగా లేనివిల్లుఁ ♦ దృణలీలఁ విఱువఁడే త్రిజగంబు లెఱుఁగ
వెఱవేదిరఘురాము విక్రమస్ఫురణ ♦ మెఱుఁగనియవివేకి వేమందునిన్ను
జనకనందననిచ్చి శరణన్న లెస్స ♦ యని యంగదుఁ డవల్క నసురేశుఁ డనియె
నోరివానరుఁడ నీవోడక యిపుడు ♦ సారెకు రఘురాము శౌర్యమెన్నెదవు
ఆరాము విక్రమ మారాము కడిమి ♦ మారాము భుజశక్తి యదియెంత పెద్ద
చలమునఁ దాటకఁ జంపెనంటేని ♦ తలపోయ నాఁడుది దానికెక్కెంత
జనకునివిలువిర్చి జనకతనూజ ♦ ఘనతఁ జేతఁ గొన్నట్టి ఘనుఁడంటివేని
నావిల్లు నేఁటిదే యది చెప్పనేల ♦ కావున నదివీర కర్మమే మఱియు
జమదగ్నిరాముని సమరమధ్యమునఁ ♦ గ్రమమున గెలిచిన ఘనుఁడంటివేని
యని బ్రాహ్మణుని గెల్చుటది బంటుతనమె ♦ కినఁబోలదీమాట విక్రమస్ఫురణ
నలవునఖరదూషణాది రాక్షసులఁ ♦ జలమున నొక్కఁడే చంపెనంటేని
నలరవారలు వృద్ధులది చెప్పనేల ♦ తలపోసి యొంచిన ధరణీశ్వరుండు
తెగువ మారీచు మర్దించెనంటేసి ♦ మృగమాత్రమగువాని వేఁరయేదొడ్డ
ఎసఁగ వాలిఁ గూల నేసెనంటేని ♦ వసుధలోఁ బలఁగోఁతి వాఁడెంతదొడ్డ
జవసత్త్వమున వార్ధి శరముఖంబునకుఁ ♦ గవగొని తెచ్చిన ఘనుఁడంటివేని
నావీరవరునకు నారాఘవునకు ♦ నావార్ధి జలమాత్ర మది యేమి బలిమి
ఇవి బంటుతనములే యీరాఘవునకు ♦ నివియెల్ల గెలుపులే యిలరాజులకును
బూని నాముందఱఁ బొడవులు చేసి ♦ వానరరఘురాము వర్ణించెదీవు
అని దశాస్యుఁడు వల్క ననియె నంగదుఁడు ♦

అనుపమోన్నత గుణోద్యముని రాఘవుని

సకలలోకారాధ్యు జగదభిరాము ♦ సకలజగద్ధిత చరిత్రు శ్రీరాము
నకలంకవిక్రము నతివీరవర్యు ♦ నకట దూషింపంగ నర్హమే నీకుఁ
జెలఁగు నీరఘురాము శౌర్యంబునకును ♦ ఖలులగు క్రవ్యాదగణములే సాక్షి
గొనకొని వాలిని గోఁతంటివందు ♦ కనెదనిమ్మంచిన యంబుధుల్ సాక్షి
అలఘువిక్రమశాలి యైనరాఘవుని ♦ జెఁగిదూషించిన జననాథు పెంపు
తప్పెనో నీకేమి ధన్యతవోడమె ♦ నిప్పుడు రఘురాము నిట్లు దూషింప
నీరాజసంబును నీదుభోగంబు ♦ దూరమౌ నాయువు దొలఁగును సిరియు
దనర శ్రీరాము నిఁ దలఁచినంతటనె ♦ ఘనమైన పాపంబు గ్రక్కునఁ బాయు

రాముపాదము సోఁక రాయింతి యయ్యె ♦ రామరామని బోయ రాశికి నెక్కె
రామనామస్తుతి రావణా నీకు ♦ నేమి పాపముననో యెఱుఁగఁ జొప్పడదు
అట్టి శ్రీరాముని యసురేశ నీవు ♦ నెట్టన దూషింప నీ కేది గతియొ
అనియంగదుఁడు వల్క నసురేశుఁ డనియె ♦ వనచర రఘురామ వసుధేశు శక్తి
యెఱుఁగుదుఁ జెప్పఁగా నేల యా స్వామి ♦ పరమైన తారక బ్రహ్మంబు నంగ
నాడవలయు మాట లాడితి కాక ♦ పోఁడిమి రాముతోఁ బురణింపఁగలనె
చలపట్టి రాముతో సమరంబు సేయఁ ♦ గలుగునో యని కోరి క్రాలుచున్నాఁడ
నిందునిందును మెచ్చని నవంశుతోడ ♦ జెందిక య్యము సేయ శివుఁ డెఱింగెడిని
అతనితోఁ బోరాడి యతని చేఁ జచ్చి ♦ ప్రతిలేని వైకుంఠ పదవిఁ గైకొందు
నీలోక సౌఖ్యంబు లింతియుఁ జాలు ♦ నేల చెప్పంగ నే నెఱుఁగుదన్నియును
బలవంతుఁ డగు రాము ప్రాభవోన్నతులు ♦
తెలియు చిత్తంబులో దివురుచున్నాఁడ
నని చెప్పి దశకంఠుఁ డనియెఁ గ్రమ్మఱను ♦ దనవివేకము చెడి తామసుండగుచు
ధరణీతలంబెల్లఁ దమ్ముని చేతఁ ♦ బరగంగఁ గోల్పోయి పడఁతియుఁ దాను
ననుజుండుఁ గూడంగ నడవులఁ బడుచుఁ ♦ దనసతి నొకనిచేఁ దాఁ గోలుపోయి
వచ్చి సుగ్రీవాది వానరవరులఁ ♦ జొచ్చియున్నట మీఁద శూరతఁ జూపఁ
జనుదెంచె రాముఁడు సంగరస్థలిని ♦ ననుదాఁక నేర్చునే నరనాయకుండు
అటుగాన రఘురాముఁ డాలంబులోనఁ ♦ బటుతర శౌర్యసంపన్నుండుగా డు
మనుజులు కోఁతులు మగఁటిమి చేతఁ ♦ దన యొద్దఁ జెప్పకు తరుచరాధముఁడ
వనచరాధమ యోరి వాలికి నీవు ♦ తనయుఁడవై లేని దశరథాత్మజుని
గొలిచితి బంటవై కొఱయీఁగవైతి ♦ చలమున నీ తండ్రిఁ జంపినాఁ డతఁడు
అట్టి రాముని గొల్చి తథమ వానరుఁడ ♦ పుట్టితిం డ్రజు గర్భమున వృథా నీవు
చంపినపగవానిఁ జంపక రాము ♦ పంపు సేయుచు నిట్లు బంటవై తిరిగి
యొలమిఁ గొల్చెదవన్న నీ రాజె కాని ♦ తలపోయ రాజులు ధరణిపై లేరె
గొనకొని పగవాని గొలిచినవాని ♦ నినుగాని యెవ్వరి నెఱుఁగ మెన్నఁడును
నీ మగటిమికిని నీదు పెంపునకు ♦ నీమవా రెల్లను నీ యుని నగరె
కొడుకైన పిమ్మట గుల వైరమెల్ల ♦ వడితోడ నీగక వాఁడెట్టి కొడుకు
ఈ గతి బంధువై హీనమానవుని ♦ జేరి కొల్చుట యెట్లు చేవయు లేక
నిను వాలికొడుకన్న నెఱ నమ్మవచ్చు ♦ వనచర యెవ్వరి వాఁడవో కాక
వినుబుద్ధి సెప్పెద వివరంబుగాఁగ ♦ మన జలగోలుతురే మనుజులు నాకు
బగవారు నీకును బగవారుగాక ♦ నాఁగి దౌత్యమిటు సేయుచుండుట దక్క
నన్ను గొల్చిన నిన్ను నంగద యిపుడు ♦ వనచరులకు నెల్ల వరప్రభుగాఁగ

ఘనభూషణంబులు ఘనవాహనముల ♦ మునఁ జేతు నిప్పుడు మహిమీఁద నిన
దనుజాధిపతిఁ జూచి తారాసుతుండు ♦ ఘనకోపమున జాల గరిమ నిట్లనియె
నగణితోన్నతశక్తుఁ డైనరాఘవుని ♦ తగ నాదుతలితండ్రి దాతదైవంబు
ఏమిగర్వము నీకు నెఱుకఁ జొప్పడదు ♦ భూమీశుతో రిపు ల్పురణింపగలరె
యరయ లేకవివేకులా రామవిభుని ♦ నరుఁడంచు నెంతురు ప క్తంచరేంద్ర
యతఁడు మానవమాత్రుఁ డాయసురేశ ♦

యతఁడు లోకారాధ్యుఁ డతఁ డప్రమేయుఁ
డతఁడు శ్రీవిష్ణుఁడు నతఁ డాదిమూర్తి ♦ యితనికి సరిపోల్ప నెవ్వరుగలరు
సనకాదులును గూడి చర్చింప లేరు ♦ వనజాసనాదులు వర్ణింప లేరు
దానవాంతకుఁడనై దశరథేంద్రునకు ♦ బూని జన్మించిన భూపాలుఁ డితఁడు
నితనికోపాగ్నికి నెవ్వఁడు నిల్చు ♦ నితనితో డీకొని యెవ్వఁడు పోరు
నితని బాణాహతి కెవ్వఁడు నోర్చు ♦ నితని నెన్నవశంబె యింద్రాదులకును
నీవెఱుంగవు రాము నిపుణవిక్రమము ♦ కావరంబున నేల కాఱులాడెదవు
వరరాము నెఱిఁగెదు దురమునఁ దొల్లి ♦ కరిమర్థిదారమున గదలక నిలుము
కర్మపంకములెల్ల గడ తేర్చి వాలి ♦ నిర్మలాత్మకుఁ డయ్యె నృపుచేతఁ జచ్చి
పదపడి వైకుంఠ పదము గైకొనియె ♦ విదికీడుగా మమ్ము నెన్న నేమిటికి
నితని గొల్చిన నాకు నిహపరోన్నతులు ♦ నతులితంబుగ గల్గు నమరులు పొగడ
నీ మదంబును లావు నీరాజసంబు ♦ రామచంద్రుని ఘోర రణరంగమందు
బోయెడు నెబ్భంగి బొలుపేది నీవు ♦ వేయు జెప్పఁగ నేల విధి నిన్ను జుట్టి
కొనిపోవుచున్నది కుటిలరాక్షసుఁడ ♦ మనుపటి వరగర్వములు చెల్లవింక
నిన్నియు నేటి కా యినకులేశ్వరున ♦ కున్నతమతి సీత నొప్పించి బ్రతుకు

{ రావణుడు తన భటులతో నంగదుని బట్టి కట్టుండని నియమించుట }

తొడఁగిన బలవంతుతో సంధి యగుట ♦ పుడమిరాజులకెల్ల బుద్ధి యెసుమ్ము
అనవుడు గోపించి యారావణుండు ♦ ఘనబాహుబలుని నంగదుఁ బట్టికట్ట
బనిచినఁ గొందఱు బలితంపు టసుర ♦ లనయంబు నుద్ధతు లయి పట్టుటయును
సొలవక తనశక్తి చూపెడికొఱకు ♦ గొలఁగ నొల్లక యంగదుఁడు పట్టువడియె
నటు పట్టువడి యతఁ డాకాశవీధి ♦ కటు శక్తి నెగసి యుద్భటవృత్తి మెఱసి
వ్రిదిచినఁబడి వేల వీరులు ధాత్రి ♦ యుద్రువంగను గ్గనూచై త్రెళ్ళిరంత
వలిగి యంతట బోక యంగదుఁ డసుర ♦ కొలువున్న యమ్మేడఁ గూలఁదన్నుటయు
నతివజ్రహతి దుహినావనీధరము ♦ తుదిగూలు పగిది దుత్తునియలై కూలె
వెండియు నంగదు విడువక పట్ట ♦ బొండని దైత్యుల బుచ్చె రావణుఁడు

పుచ్చినవారును బొదివియంగదుని ♦ నచ్చెరువయియుండ నాకాశమునను
బరశుపట్టసభిండి వాలశూలముల ♦ గరవాలతో మరగదలనొప్పింప
బిడికిళ్ళతోడ నే ప్రేవులు వెడల ♦ బెకిదంబుగా నొంచి పృథివిపై గూల్చి
యరుగుచున్న యా యంగదుజూచి ♦ ఖరసూతిసుకరుండు కార్ముకంబెత్తి
నిలునిలు మంగద నీవెందుబోవ ♦ గలవాడవని పేర్చి కాడఁబులైదు
నదురుగాడగ నేసి నొప్పించి వెఱతియు ♦ బదితీవ్రశరముల బాహువులేయ
నలుకతో బిడికిట నంగదుడతని ♦ కన పెక్కువ్రయ్యలై ధరగూలబొడిచె
దానికి దైత్యులు తల్లడమంద ♦ దానవేశ్వరుడు చింతామగ్నుడయ్యె
దారాతనూజుడత్తతి నేగుదెంచి ♦ యారామచంద్రుని యడుగులకెరగి
యోజగదారాధ్య యోరామచంద్ర ♦ భూజనసుతరామ భూపాలతిలక
దేవ మీయానతి ధృతితోడ నేను ♦ రావణునొద్దికి రయమునబోయి
చెప్పగాగలవెల్ల జెప్పితి దేవ ♦ చెప్పినమాటలు చెవిబెట్టడయ్యె
గట్టిగా జావుకు గడు తెంపుచేసి ♦ యుట్టిగట్టుక నూగుచున్నాడు దేవ
యినకులనాథ నీవీదశగ్రీవు ♦ ననిలోన మడియింపు మఖిలలోకేశ
యనుచు నావృత్తాంతమంతయు దెలియ ♦ వినుపించె నంతయు విశదంబుగాగ
జననాయకుండును సంతసంబందె ♦ ఘనతరంబైన యంగదసత్త్వమునకు
నట రావణునితోడ నసురులందఱును ♦ బటుతరవాక్కులై పలికిరెంతయును
ఇది యేమి దేవ నీవిట్లూరకునికి ♦ యదెకపిసేనతో నారాఘవుండు
విడిసినాడీలంక వేడించియింక ♦ గడిమెనెన్నడు చూపగలవాడవీవు [దు
మమబంపు రామలక్ష్మణుల వానరుల ♦ సమరంబులో గెల్చి చనుదెంతుమను

—*: రావణుడు యుద్ధసన్నద్ధుడై యుత్తరగోపురమునకు వచ్చుట :*—

వీనులకరుదుగా వినిదశాననుడు ♦ భానుజాదులకును భయముపుట్టంగ
దనవైభవము రామధరణీశునకును ♦ ఘనముగా జూపెద గాకంచు దలచి
సాంద్రప్రతాపనిస్తంద్రుడై తొల్లి ♦ యింద్రనాగేంద్రధనేంద్రుల గెలిచి
కప్పముల్గైకొన్న ఘనసుస్తుతితతి ♦ చెప్పించి మేలేర్చి దీధితుల్నిగుడ
జీనాంబరంబులు చెలువారగట్టి ♦ నానాదిశల వాసనలు వెదచల్ల
మృగమదశ్రీగంధమిళితమనోజ్ఞ ♦ మగుదివ్యచందనమర్థితో నలది
సరసమంజుళపారిజాతప్రసూన ♦ విరచితమాలికావితతులు ముడిచి
పంకజరాగాది బహురత్నకలిత ♦ కంకణముద్రికాంగదభుజాభరణ
ఘనతరగ్రైవేయ ఘంటికానేక ♦ వినుతహారంబులు విపులంబులైన
సరకంబులాదిగా బహుభూషణములు ♦ పదకశుద్ధిగ వన్నె పచరింపదాల్చి
కుండలంబుల మెండుకొను మణిప్రభలు ♦ గండమండలముల గడలుకొనంగ

చండాంశుమండలోజ్జ్వలములై దిక్కు ♦
లొండొండ వెలిగించు నురుకిరీటములు
దశశిరంబులమించు దహనుఁడో యనఁగ ♦ దశశిరంబులలీలధరియించిమించి
సురవరానలయమాసురనాథ వరుణ ♦ మరుదర్థనాయక స్మరసంహారులను
గండడంచి జయించి కైకొన్న బిరుదు ♦ గండపెండెంబు డాకాలధరించి
శరశరాసనపట్టసప్రాసచక్ర ♦ పరశుతోమర భిండివాలత్రిశూల
కరవాలపాశ ముద్గరచంద్రహాస ♦ పరిఘాదులగు వరప్రహరణశ్రేణు
లిరువదికరముల నేపారఁబట్టి ♦ పరిచారులాగి వెంట బలిసియే తేర
గొబ్బున నుత్తర గోపురంబునకు ♦ గబ్బునుబ్బునుగ్రాల ఖడ్గశూలాది
హస్తులై యెడగల్గి యాప్తరాక్షసులు ♦ నిస్తరంబుగఁ బరివేష్టించి కొలువ
సుర్భితభూషణవస్త్ర భూషితులగుచు ♦ నిరువంక మంత్రుల నేకులు గొలువఁ
దుదలేని రత్నపంక్తులు దాపిసట్టి ♦ పెద్దపెద్ద పసిఁడి కుప్పెలుమీఁద నొప్ప
ప్రవిమలంబగు నెనుబదివేలసంఖ్య ♦ ధవళాతపత్రముల్ దనుజులుపట్ట
నలశేషఫణములో యనఁ గన్నివేల ♦ సలలితవ్యజనముల్ సకియలుపూనఁ
దళుకు వెన్నెలల చందమున నాసంఖ్య ♦ గలచామరంబులు కాంతలిర్వంకఁ
గంకణఝుణఝుణత్కారము ల్మెఱయ ♦ సంకించి చామరలందందవీవ
మరల గెల్చినజయ స్ఫురణ లెల్లెడల ♦ బిరుదులెత్తుచు వందిబృందంబువొగడ
మంద్రమధ్యమతార మానభేదముల ♦
చంద్రాస్య లెఱుఁగ మెచ్చఁగఁ బాడవినుచు
సన్నుతమాణిక్య జాలప్రభాస ♦ మున్నతసింహాసనోపరిస్థలిని
అపరాచలముమీఁది యర్కునితోడి ♦ యుపమకు బాత్రుఁడై యొగిరావణుండు
వలనైనతన వైభవంబెల్ల మెఱసి ♦ కొలువుండె నుత్తర గోపురంబందు
నాగొడుగులనీడ యాదిత్యుఁ గప్పు ♦ వేగంబె చీకటి పిలసిల్లుటయును
నావేళ మాయా మృగాజినంబునను ♦ దేవేంద్రమణికాంతి దీపించుమేని
వామభాగము మోపి వామభుజాగ్ర ♦ సీమఁగపోల మూర్జితముగాఁ జేర్చి
యుగ్రాంశుబింబ సముజ్జ్వలుండయిన ♦ సుగ్రీవుతొడలపై సొంపుసౌందర్య
సంపదలొలుక రాజసముగా నొరగి ♦ పెంపారుమహిమ చేఁ బ్రియభక్తుఁడైన
పవనజుతొడలపైఁ బాదపద్మములు ♦ సవరణఁ జాపి నిశ్చలభక్తినతుఁడు
మృదురీతినొత్తనర్మిలి నంగదుండు ♦ కదిసి దక్షిణభుజాగ్రంబిరుకేల
నందియుంగుళము లొయ్యనబట్టుచుండ ♦ వందిబృందముల వైఖరినిలిచి
నలనీలభల్లూక నాయకప్రముఖు ♦ లలరుచు సకలలోకారాధ్యచరణ
జానకీహృదయాంబుజాతషట్చరణ ♦ దీనార్తిహరణ కీర్తితకృపాభరణ

వారనుతనాయ సూర్యకులాబ్ధిసోమ♦యరిభీమరఘురామయనిసన్నుతింపఁ
గందనిపూర్ణ రాకాచంద్రుఁబోలు♦మందస్మితానన మండలంబునను
నవిరళకరుణామృతా పూర్ణమగుచు♦ధవళారవింద సౌందర్యంబుఁదెగడు
తెలికన్నుఁగవకాంతి దెసలెల్లనిండ♦లలితావలోక విలాసచంద్రికలు
వెదచల్లఁగాఁగర ద్వితయసన్నిహిత♦వదనుండురాక్షస వరమర్మవిదుఁడు
నగువిభీషణుతోడ నతిరహస్యంబు♦లగుమాటలాడుచు నప్పటప్పటికి
రమణీయలీల శ్రీరాఘవేశ్వరుఁడు♦అమరదక్షిణ ముఖుండై యున్నవాఁడు
గావునగోపురాగ్రమునఁగొల్వున్న♦రావణుఁబొడగాంచిరఘురాముడనియె
నోవిభీషణచూడు మున్నతంబైన♦యావిశాలగోపు రాగ్రంబునందు
భోగిమై యెంతయుఁ బొగడొందువాఁడు♦ బాగొప్పవానికిఁ బట్టినయట్టి
శరదభ్రవిభ్రమ చ్ఛత్రసంఘములఁ♦బరఁగెడునీడ భూభాగంబుఁగప్పె
నారూఢవైభవా యతవృత్తితోడ♦నీరీతినున్నవాఁ డితఁడెవ్వఁడనిన
నారాముఁజూచి యిట్లనివిన్నవించె♦ నారావణునితమ్ముఁడగు విభీషణుఁడు
దేవరాఘవవిభు దేవారియైన ♦ రావణుఁడమర విద్రావణుండఖిల
దివిజులచేఁగొన దివ్యభూషణము♦లవిరళంబుగఁబూని యాప్తులైనట్టి
దనుజముఖ్యులుగొల్వఁ దనకునిండార♦బనుపడఁగా నెనుబదివేలసంఖ్య
గలగొడుగులుపట్టఘనచామరంబు♦లలవుమైవీవంగ నాలవట్టములు[దుటఁ
పూనంగదనదు పెంపునురాజసమును♦దానిట్టిదనుచు మోదమునమీఁదె
జూపంగఁదలఁచి ధీ సురవైభవమున♦గోపురోపరిసీమఁ గొలువైనవాఁడు
నావినినవ్వి మానవకులేశ్వరుఁడు♦ దేవారిగర్వంబుఁ దీర్పంగఁదలచి

{ శ్రీరాములు రావణుని ఛత్రచామరంబులు బాణములతో దెగనేయుట. }

వెనుకొనిలక్ష్మణ విల్లుఁదెమ్మనుచుఁ ♦ దనకుఁబిమ్మటనున్న తమ్మునిచేతి
ధనువుడాచేత నెంతయువేడ్కనంది♦కొనిదక్షిణాంఘ్రి యంగుష్ఠానవింటి
కొనసంబుఁబూని గ్రక్కునసెక్కపెట్టి♦ కనదర్ధచంద్ర మార్గణమరివోసి
ధీలక్ష్మితోల్లాసి తెగనిండదీసి ♦ యాలీఁ నొఱగిన యట్లనేయుండి
యలచామరవ్యజనాతపత్రౌఘ ♦ ములమీఁదనేసె నద్భుతవృత్తి మెఱయ
శరమొక్కటియుఁబదిశరములైనూఱు శరములైపదివేలశరములైమఱియు
లక్షమైకోటియై లక్షించిచూడ ♦ నాక్షణ బునసంఖ్య లన్నియుఁగడచి
తాలవృంతంబులు దాల్చుచేడియల మేలిచామరములు మెఱయించుసతుల
సంగీతములు సేయుసరసిజముఖుల♦బొంగుచుఁగైవారములు సేయుబోంట్ల
ధవళాతపత్రముల్ ధరియించుదైత్య♦నివహంబులనుగొల్చినిల్చినభటులఁ

గరములు ద్రుంచక గళములు ద్రెంచ♦కురములు నాటక యురుకిరీటములు
ధరఁ డొల్లఁ జేయక తలలు ఖండింప ♦ కరుదరుదిదియని యమరులుప్పొంగ
నాలవట్టంబులు నాతపత్రములు♦చాలశోభిల్లు వింజామరంబులును
కత్రించికొనిపోయెఁ గంతమాత్రములఁ జిత్రమైతనరిన సితచామరములు
నాలవట్టములు సితాతపత్రములు♦దేలుచుఝల్లని దివినిండ నెగసి [గొన్ని
కొలువులోఁ గొన్ని దిక్కులయందుఁ గొన్ని♦కొలువులో పలిదైత్యకోటిపైఁ
లంకలోఁ గొన్ని యా. వనాబ్ధిఁ గొన్ని♦లంకేశుపైఁ గొన్ని లఘులీలఁ బడియె
నలవుమైనటు చేసియాదివ్యశరముపొలయికరఘురాముపొదిఁ జొచ్చెనంత
మహితాతపత్రచామరతాలవృంత♦రహితదండధరాసురశ్రేణినడుమ
నున్న రావణుఁ డప్పు డొప్పారెఁ జూడ♦దన్నుఁ గొంపోవ నుద్ధతివచ్చియున్న
దుర్వారులగు యమదూతలనడుమ♦గర్వంబు చెడియున్న గతినుండెఁ జాల
వెఱఁగందిరఘురాము విలువిద్య పెంపు♦తతెగొనితలపోసి తలలూచియూచి
బట్టుకైవడి మెచ్చి పఃతరధ్వనుఁ♦బెట్టిత్తిరఘురాముఁ బేర్కొనిపొగడె
నల్లయోరఘురామ నయనాభిరామ♦విల్లువిద్యకుగురు వీరావతార
కరశరలాఘవక్రమకళానిపుణ♦స్ఫురదురుచాపసంతోషితకృపణ
భుజసారదృఢముష్టి భువనవిఖ్యాత♦విజితరిపువ్రాత విజయసమేత
మానవరాజకుమార కంఠీర ♦ వానవ్యదివ్య శస్త్రాస్త్రసంపన్న
స్ఫారఘోరాక్షయ బాణతూణీర ♦ వీరాగ్రగణ్యా యోవిశ్వశరణ్యా
బాపురే రామ భూపాలలోకములఁ♦నీపాటివిలుకాఁడు నేర్చునేకలుగఁ
శాటించిపురముల పైఁబడ్డహరుని♦యేటొప్పునిందు నీయేటొప్పుఁగాక
అదియనిపదినోళ్ళ నందందఁ బొగడ♦విని మంత్రులా దైత్యవిభునకిట్లనిరి
పగవానినీరీతిఁ బంతంబువిడిచి♦పొగడుదురే దైత్యపుంగవయిట్లు
పొగడిన భయమందఁ బోలునటంచుఁ♦బగవారుఁదనవారుబలుచగా జూతు
రదికాన రాచకార్యంబుగాదనిన ♦ మదినవ్వియమరారిమంత్రులకనియె
విలువిద్య పెంపును విక్రమక్రమము♦కలికితనము బాహుగర్వరాజసము
లాదిగాగుణముల నధికుఁడైనట్టి ♦ కోదండదీక్షాది గురునితో రాజ
వరునితో రామభూవరునితోనొరులు♦పరికించిచూడ నేపట్టుననైన
సాటియేయిమ్మాడుజగములయందు♦ మేటిశూరుల పెంపు మెచ్చంగవల
యునినీతి చెప్పుచు నచ్చోటువాసి♦దనుజేశ్వరుఁడువో యెదను జనాయకులు
తెగిపడ్డగొడుగులఁ దెఱఁగొప్పఁ జూచి♦మిగిలినభీతిమై మెల్లనఁ జనుచు
నటురఘురామునియతులవిక్రమము♦బటుగతిబొగడుచుబలుతెఱఁగులను
ఆరాఘవుఁడు కరుణాంబుధిగాన♦ఘోరబాణంబున గొడుగులఁ ద్రుంచె

నిటువంచియేసిన నిందరితలలు♦పటుతరంబుగఁ దెగి పాఱవేయనిరి
ఇటనంత నారాఘవేంద్రుండు కార్య♦ఘటనాప్రయత్నసంగతచిత్తుఁడగుచు
ననుజవిభీషణార్కజాదులై స♦తనవారియనుమతిఁ దగుముహూర్తమున
బనిచెనప్పుడులంకఁ బట్టవానరుల ♦ బనిచినవానర బలములులంక
ఘనభీతినిక్కడక్కడఁ బడనార్చి♦వనజాక్షకులు రామవల్లభుఁ జూచి
దేవమా శౌర్యంబు తెలుఁగొప్పఁజూడు♦మేవిధంబులఁ బ్రాణమిత్తుమునీకు
నవిపర్యతంబులు నవనిజంబులును ♦ గొని వేలులక్షలు కోటానకోటు
లక్షౌహిణులు గుమ్ములై కూడివచ్చి♦యాక్షణంబునమట్టి రాలంకకోట
ముట్టినగెల్పు రామునకునే ననుచు♦దట్టించి పేర్చి యుదగ్రులై కినిసి
బహుకాష్ఠపాషాణ పాదపావళుల ♦ సహితదుర్వారులై యందందఁ గదిసి
తరమిడియాయగడ్తలు పూడ్చునప్పు♦డురుశక్తిఁ గపివీరు లున్నవిధంబు
పాలుపారనపుడు చంపుడఁగట్టమీఁద♦దళముగానున్న చందమునివ్వటిల్లె
గుముదుఁడత్తరిఁ బదికోటులతోడ♦సమతఁదూరుపు మొగసాలకునరిగెఁ
బైదళంబై యుండబలసిరాక్షసులు♦పైద్రోచిరాకుండ బలిమిఁజూపుచును
గొనకొని యెనుబది కోటులకపులు♦తనతోడఁ బేర్చి యుద్దండత నడువ [దు
ఘనబాహుబలుఁడుదక్షిణపువాకిటను♦బనియుండెశబలితబలియుఁడైయపు
సడమటిదెస కఱువదికోట్లకపులు♦నడువసుషేణుఁ డిస్నతినేగియుండె
రామలక్ష్మణులునురాక్షసేశ్వరుఁడు♦నామర్కటేశ్వరుండయ్యుత్తరంపు
వాకిటనుండిరి వనచరోత్తముల♦నాకోట లెక్కించి యడరిమార్చుచును
గజుఁడును గవయుండు గంధమాదనుడు ♦
భుజబలాఢ్యుడు శరభుఁడును గవృత్తి
దట్టించి కోట యంతటికినిలగ్గ ♦ బట్టింపుచుండిరి పలుమాఱుతిరిగి
కోపించి వానరకోటులు గవిసి♦ యోపినంతంత నొండొరుల ద్రోయుచును
ఇదితోరణపుగోటయిది దానికొమ్మ యిదియిది యని యేమియెఱుగరాకుండ
వడిఁగోట లెక్కి యాశ్వరులపైకురికి♦పెడబొబ్బలిడి తమపేరుబాడుచును
ఉడుగక నిడుతోడ లొడిలెల్లుసేసి♦వడిఱాళ్ళలోనికి వైచియార్చుచును
మ్రాకులతుదలు సమంబుగాబట్టి♦పీకలోపలియిండ్లు విఱుగవైచుచును
గుడులునట్టళ్ళును గోపురంబులును♦బడదన్ని కోటపైఁ బరుగులెత్తుచును
అట్టళ్ళతోడనె యసురవర్గములు♦ నెట్టనగూలిన నిలిచినవ్వుచును [ను
ఇమ్ములరూపించియిదె చూడుఁడనుచుఁ♦గొమ్ములువిఱుగంగ గుండ్లునైచుచు
దోరణంబులును గైదువులురాక్షసులు♦చారుతరధ్వజచ్ఛత్రదండములు
కొమ్మలుకోటలు గూలుటజూచి♦క్రమ్మఱదిక్కులు గలయనార్చుచును

ముంచికొండలు కరమ్ములఁ బెట్టువట్టి ♦ దంచ నాలకునిచె దండనాలనుచుఁ
గ్రచ్చఱనట విఱుగంగఁజైచుచును ♦ మచ్చరంబునఁ బలుమఱు నిల్లుకపులు
వడివైచుతమతమ వాటులచేతఁ ♦ గడుఁజిత్రముగను లంకాపురిలోనఁ
గూలెడి మేడలు గ్రుంగు మేడలును ♦ వ్రాలెడి గోడలు వ్రాలుమావులును
నుఱుమైనయిండ్లును నుగ్గునూచన తఱుచుఁ గొమ్మలుచూచి తదనంతరంబు
దానవక్షయకరోత్సాహులై కపులు ♦
పూనియంతయు భీతి బుట్టించుటయును
ఇటుగని యెటుగ మేమెన్నఁడు ననుచు ♦ జటులత రాట్టహాసములు సేయుచును
నార్చు వానరులపై నానాదైత్యకోటి ♦
పేర్చి యెంత కనుగొపించి శూలములఁ
బొడిచియుఁ గరవాలమును దెంచియును
గడు బెట్టిదంబుగాఁ గదల మోదియును [ను
జొచ్చి తన్నియుఁ బరశువులఁ ద్రవ్వియును గ్రుచ్చియుఁ గత్తులఁ గూలఁ ద్రోచియు
దంచెన గుండ్లఁ జేఁదాఁకించి కడిమి ♦ ముంచిన లగ్గ యిమ్ముఁ విడిపించి
యలరి రాక్షసులార్వ నా కపులార్వ నిలయు దిక్కులు జలియించె నెంతయును
నీగిదిక్కరులు ఘీంకృతులొనరించెఁ ♦ గ్రాఁగినయసురల గతి నబ్ధులింకెఁ
గులగిరులెత్తిన గుండుల మాడ్కి ♦ నిలమీఁదనఁ దంద నెత్తిపైఁబడి మె
నురగాధిపతివిషం బొలికెఁ గూర్మంబు ♦
గిరులు నొండొంటికిఁ గ్రిందు మీఁదయ్యె
నాశారియప్పుడు నడుచక్కినున్న ♦ భీకరసైన్యంబుఁ బిలిచి యుబ్బించి
కడిమి సొంపారంగఁ గపిసేనలంక ♦ వెడలి తాఁకుండని నెసఁబురికొలుప
భేరీరవంబులు భీకరకాహ ♦ ళారవంబులును శంఖారవంబులును
బటహారవంబులు బహుతూర్యరవము ♦ పటుతరనిస్సాణ ఢాంకారములను
తురగోగ్రహేషలు తోరంబులైన ♦ కరిబృంహితంబులు ఘననేమిరవము
వత్తటిఁ జెలఁగు భుజాస్ఫాలనములుఁ ♦ జిత్తంబులఁ గలంచు సింహనాదములు
నడరి యొండొండ బ్రహ్మాండంబు నిండ ♦ పడలి దిగ్దేవతా సమితి భీతిల్లఁ
బలువిడి రాక్షస ప్రవరసైన్యములు ♦ వలనొప్ప నాలుగు వాకిళ్ళ వెడలె
నటుజాతవక్రంబు నందుఁ దక్కంగఁ ♦ బటుభీమ నాకృతిఁ బ్రళయరుద్రునకు
నున్న ముఖంబుల నుడుగక వెడలు ♦ చున్న మంటల మాడ్కి నొక్కట మెఱసి

—:* వానరరాక్షసుల ద్వంద్వయుద్ధము *:—

వెడలి వానరసేన వెసఁ దాఁకునపుడు ♦ తడయక ద్వంద్వయుద్ధమునకుఁ జొచ్చె
గడిమిమైనప్పు డంగదునింద్రజిత్తు ♦ గడు బెట్టిదంబుగా గదఁ గొని వేసె

వజ్రంబుఁబట్టి పర్వతముపై నలిగి ♦ వజ్రి వేసినక్రియ వారణ లేక
అంగదుండును బేర్చి యయ్యింద్రజిత్తు ♦ సంగరంబున గిట్టి సమశక్తి మెఱసి
భూరిభూధరశృంగమున వైచెఁ బేర్చి ♦ సారథిరథరథ్య చయములుగూల
వారక యేసె సుర్వారుఁడై మూఁడు ♦ క్రూరాస్త్రములఁ బ్రజఘుఁడు సంపాతి
విజయుఁడై యతఁడును వెసనశ్వకర్ణ ♦ కుజమెత్తుకొని ప్రజఘుపైఁ బడవైచె
వినతునిరంభుని వెసనొంచెఁ బెక్కు ♦ ఘనబాణముల నతికాయుండు పేర్చి
పూనియయ్యిద్దఱు భూరిశైలముల ♦ వాని సేనలవాని వడినొంచి రపుడు
దట్టింపుచును మహోదరుఁడు సుషేణు ♦ గిట్టియాతని మీఁదఁ గినుక సొంపార
నడరించెబాణంబు లయిదును మూఁడు ♦ వెడదవక్షంబున వెడదఫాలమున
వానిరథంబును వానిసారథిని ♦ వానిరథ్యములఁ బర్వతమొకటెత్తి
నలియంగఁ జావఁ జూర్ణంబులై పోవ ♦ జెలగుచు వార్చి సుషేణుడు వైచె
మఱిజాంబవంతుండు మకరాక్షుమీఁద ♦ బిరబిర ద్రిప్పుచు బెనుద్రుమానువైచె
నడుమ నేయ దిద్రుంచి నాటించె నతఁడు ♦

కడు బెక్కు శరము లుగ్రస్ఫూర్తి మెఱసి
యతనిభుజంబుల తననిఫాలమున ♦ నతనివక్షంబున నతిలాఘవమున
నాజాంబవంతుండు నలుకమై వాని ♦ భజనంబుగ జేయు పర్వతంబొకటి
వైచి సరథమును సరథాశ్వములు ♦ చూచెదునంతలో జూర్ణమై రాలె
శరములబెక్కింట శతబలిగిట్టి ♦ యురులాఘవమున విద్యుజ్జిహ్వుఁడేసె
నతనివక్షముదాక నత్యుగ్రభాతి ♦ శతబలియొక్క వృక్షము బూని వైచె
బెక్కండ్రదైత్యుల పీచంబులడచి ♦ పెక్కుచందంబుల బేర్చి నగజుని
దప్పక విక్రమధనుఁడు కోపించి ♦ విప్పైన వానర విభునివక్షంబు
శూలంబుఁ గొని పొడుచుటయు ద్రవేసె ♦

సాలవృక్షమున రాక్షసుని నాగజుఁడు
వ్రేయంగ నతఁడును వెసమృతుండయ్యె ♦ నా యెడ నగచరు లార్చి మోదింప
ననికుంభకర్ణునియగ్రనందనుఁడు ♦ ఘనుఁడు కుంభుఁడు ప్లవంగములఁ బెల్లడరి
కుత్తుకలో వైచికొనఁగ నాధూమ్రుఁ ♦ డె త్రివృక్షంబులే దేఘున వైచెఁ
గ్రూరుఁడై దేవాంతకుఁడు గవాక్షుండు ♦ చారుతరోరు వక్షస్స్థలంబేచు
శరములనేయవచ్చుట నొచ్చియతఁడు ♦ సరభసవృత్తిమై సాలవృక్షమున
వైచినఁ వాఁడేడు వాఁడిబాణములఁ ♦ బూచియగ్గిరి నేసి పొడిపొడిచేసి
తొమ్మిదియమ్ముల దూపిడ్డవానిఁ ♦ గొమ్మనిగిరి యెత్తికొని వైచె నతఁడు
ఋషభునిముసలాన నేసెసారణుఁడు ♦ వృషభుండు సారణు విపులవక్షంబు
వృక్షంబుగొని వైన విల్లునమ్ములును ♦ నాక్షణంబున వైచి యతడుమూర్ఛిల్లె

గిరిఁబోని గజము నెక్కిన త్రిశిరుండు♦శరభుని తల వ్రేసెఁ జని తోమరమున
శరభుండు గోపించి సాలవృక్షమున♦హరి గిరి వ్రేసిన ట్లా త్రిమస్తకుని
వ్రేసి యగ్గజమును వ్రేసెఁ గూలంగ♦రాసి రాక్షసునకు రాక్షసుండగుచు
ననయంబుఁ బేర్చి నరాంతకుండపుడు♦పనసునిపైఁ దీవ్ర బాణంబు లేయఁ
బనసుండు నాతనిపై వృక్షమెత్తి♦ఘనముగా వైచెను గతఁ జూపి యంతఁ
బరిఘంబుగొని యకంపనుఁడు వ్రేయుటయు♦

ధరణిపై మ్రొగ్గి యుద్ధతశక్తి నగసి [ర్ఛిల్లె
కుముదుండు పిడికిట గుపితుడై పొడువ♦భ్రమసి చయ్యన నకంపనుఁడు మూ
గిట్టి ధూమ్రాక్షుండు కేసరిమీఁద♦నెట్టన నంప పెన్నీటను ముంప
వాని సేనలను బర్వతములు వైచి♦మానక నొప్పింప మఱి వాఁడు విఱిగె
మండితభుజ గంధమాదను గిట్టి♦భండనంబున మహాపార్శ్వుండు పెనఁగఁ
దరులను గిరులను దట్టిల వానిఁ♦గరము నొప్పించె నా గంధమాదనుఁడు
దఱచుగా నావేగదర్శిపై శుకుఁడు♦ నెఱి నాటనమ్ములు నిగిడించుటయును
వాని రథంబు దుర్వారుడై వేగ♦పూని కమ్మఁ ద్రొక్కి పొడిపొడి చేసె
నడ నకంపనుఁడంత నలునకు నెదుర♦నడ తేరఁగా దొడ్డ నగమున నతఁడు
ఉరవడితోఁ గ్రుద్దు బుఱుకునట్లుగను♦బెరిఁగి యాతని మీఁదఁ బెట్టుగా వ్రేసె
వాఁడి బాణంబుల వడిపలు మీఁద♦వాఁడేసె నేసిన వానివాలమున
గురుతరంబగు శక్తిఁ గొని జంబుమాలి♦యరుదుగ నురవడి హనుమంతు నేసె
నెరిజవంబున నాంజనేయుండు గినిసి♦యురకరథంబుపై కురికి యుగ్రతను
గిరివరశిఖరంబు క్రియనున్న వాని♦శిరమర చే వ్రేసి చేసె వ్రయ్యలుగ
శరపరంపర విభీషణనిమిత్రఘ్నుఁ♦డురవడి నెత్తురు లురల నేయుటయుఁ
గలుషించి యాతఁడు గద వ్రేయుటయును♦

దలఁకి మూర్ఛిల్లె మిత్రఘ్నుఁ డెంతయును
వనచర సేనల వారక పట్టి♦కొ, లీల మ్రింగు నికుంభుని గిట్టి
ఘూర్ణితారుణ కటాక్షుండునై సప్త♦పర్ణవృక్షంబున భానుజుఁ డడఁచె
మొనసి యుద్ధతి వజ్రముష్టి యన్వాని♦బెనుపార మైందుండు పిడికిటఁ బొడువ
నాలంకగోపురం బవనీస్థలమున♦గూలె నో యనఁ దన్నుకొని వాఁడు గూలె
వినువీధి సుకలార్వ ద్వివిదుండు శైల♦మున నశనిప్రభు మొనఁ గూల నేసెఁ
గరమల్గి నీలమేఘము సూర్యుఁ గప్పు♦కరణి నఁదంద నుగ్రప్రకారమునఁ
బరఁగ దివ్యాస్త్ర సంపదల చే నీలు♦ గురుభుజుండైన నికుంభుండు గప్పెఁ
గప్పిన నీలుండు గదిసి నికుంభుఁ♦జప్పరించుచు రథచక్రంబు దెచ్చి
రథముననైచి సారథిఁ దల ద్రుంప♦భయమంది వాఁడు విభ్రాంతుఁడై పాఱె

శరపరంపరలు లక్ష్మణు మీఁదఁ గనుక • గురియు విరూపాక్షుఁ గొనక సౌమిత్రి
యొక్క బాణము గొని యొగి వాని నేయ • దక్కఁగ మూర్ఛ చే ధరణిపై బడియె
రాముపై సుప్తఘ్ను రశ్మికేతువులు • నామె యినగ్ని కోపాగ్ని కేతువులం
గెరల మేఘంబుల క్రియ సంపసోన • గురిసిరి గుణరావ ఘోర గర్జనల
నలినాప్తకులుఁడంత నాల్గు బాణముల • నలువుర తలలు నున్నలిఁ ద్రుంచివైచె

—:* యుద్ధభూమి వర్ణనము *:—

నక్కడి కయ్యంబు లెఱుచెల్లుచుండఁ • దక్కక విఱిగిన తేరులై చెనవిండ్లు
చెదరిన కరములు చిద్రుపులై పడిన • గదలును దునిసిన కరవాలములును
ముఱిసిన శక్తులు ముద్గరంబులును • పఱిసిన పరిఘలు పట్టసంబులును
గడిఖండలైన చక్ర పాసములును • బొడిమైన సురియలు భూరిశూలములు
తుద లేక పడియున్న తోమరంబులును • గదిసిన రథములు సామజంబులును
గూలి పెల్లుగఁ దన్ను కొను ఘోటకములు • వ్రాలి మస్తల చినరథ చోదకులును
రాలిన కోటీర రత్నపుంజములు • సేలమిట్టెడి బాహు నిచయ ఖండములుఁ
జచ్చిన యసురుల సమరభూభాగ • మచ్చెరువయియుండె నప్పుడు చూడ
మర్దితారాతి రామక్షితీశ్వరుఁడు • దుర్దాంత శరములఁ ద్రుళ్లడచుటయు
మలగొన్న యురుమీన మకరోరగాది • జలచరంబులు చిక్కి జలమెల్ల నింక
వశగతంబై రామవల్లభు నెదుట • గృశమైన యంబుధి క్రియనుండె రణము
అట్టివిధంబున నవరిజఁ దెచ్చి • నట్టి రావణునకు వట్టపై శిరము
లట్టేలనిలుచు నన్నట్టి చందమున నట్టలాకాశంబు నందాడెనపుడు
నెరిగల్లు మజ్జంబు నెత్తురు తాంపి • తెఱుచైన వెంద్రుక తండంబునాఁచు
పునుకలు చిప్పలు పొరిఁబొరినున్న • ఘనములౌ పలుకలు కమఠ తుండములు
తుమురులై పడిన కైదువులు మీనములు •

రమణీయతర చామరములు హంసములు

కొమరారు తెల్లని గొడుగులు నురుగు • లమరు భూషణచూర్ణ మండలియు సుక
యొడ్డనంబు నెగళ్లు నురుదంతిచయము • లొడ్డిపెంపారిన యుద్ధతుల్ గిరులు
తరుచరాసుర దేహతతులు వృక్షములు • దొరిగిన ప్రేవులు దుష్టసర్పములు
కొఱప్రాణములతోడ గుంభినియందు • నొఱగిన రాక్షసులొరలుట ప్రమోత
కలఁగొన ఘనతురంగములు గ్రాహములు •

ఎలిదూలు పడగ లున్నతినందు తెరలు

ఇవ్విధంబున మీఁ యేరులనెల్ల • నవ్వుచుఁ బట్టుర క్తనదు లిబ్బి పాతె
నారయ బాపిష్ఠుఁడగుఁగాక యేమి • యారాముననుద్రోహి యగుఁగాక యేమి
యతిలోక కంటకుండగుఁగాక యేమి • యతులజపిన పాపియగుఁగాక యేమి

హితమతినై యిప్పు డీడేర్పఁదలంచి♦ప్రతిలేనిరఘురాము బాణజాలముల
ధృతిదూలఁగట్టి యా దేవకంటకుని♦హితమతినీ దేహ మిటువిడిపించి
లోగొనివాని నాలోపలముంచి♦బాగొప్పఁగలుషము ల్వాపిరక్షించి

—*: సాయంకాలాది రాత్రి వర్ణనము :*—

ఖలుఁడైనయట్టియుత్కలుని రావణుని♦బాలుపారముక్తికిఁబుత్తునకామాడ్కి
సంగతినొప్పారు జాహ్నవియనఁగ♦సంగరస్థలిమహాశ్చర్యమైయొప్పె
నప్పుడులంకలో నాదైత్యకాంత♦లుప్పొంగుశోకపయోధిలోమునిఁగి
గ్రద్దనఁజేయునక్కయ్యంబునందు♦బొద్దుగ్రుంకినగానిపోదురాఘవుఁడు
ఎప్పుడుగ్రుంకునోయినుఁడింకననుచు♦నప్పటప్పటికిఁబెట్టడరఁ జూచుండ
వంచితకఠినపుంఖాస్త్రాంశుతతుల♦ముంచిరావనుని తమోగుణాబణప
భీమప్రతాపసంస్ఫురితుఁడై యున్న ♦ రాముఁడేచాలు దుర్వారుడన్మాడ్కి
ఘనతరంబగు తనకరములుముడిచి♦వనజాప్తుఁ డపరదిగ్వనధిలోమునిఁగె
ఖలుఁడైన యద్దశకంఠుని చేటు♦దెలుపుటకై నిశీథినికచభరము
విరళమైజల్లున విరిసెనో యనఁగ ♦ పరపొందిచీఁకటి ప్రబలమైపర్వె
నప్పుడుబొబ్బలు నార్పులు వెట్టు♦చప్పుడుల్ మల్లులు చరచునడిదము
లట్టహాసంబులు నడరియొండొరులఁ♦దిట్టెడినెలుఁగులుదీవ్రహుంకృతులు
ఝుంకారరవములుఁజప్పరించుటలు నంకించుపలుకులునాహ్వానములును
రథనేమిరవములురథికసారథు ♦పృథులవాక్యోద్ధతిభీమనాదములు[లు
గుణనిస్వనంబులుగుంజరాగముల♦ఘణిఘణిల్లనిమ్రోయు ఘంటాస్వనము
కరిబృంహితంబులు ఘనతూర్యరవము♦తురగోగ్రహేషలు తోరమైపేర్చె
ప్రొద్దుగ్రుంకినసైన బోవకచలము♦పెద్దయైకపులును బేర్చిరాక్షసులు
నతినిబిడంబైన యంధకారమున♦నతిభయంకరమైన యని సేయునపుడు
పొడుపొడుఁడన్మాట పోకుఁడన్మాట♦విడువిడుఁడన్మాట వ్రేయుఁడన్మాట
చలముడింపక చంపుచంపుఁడన్మాటతొలఁగకతలఁద్రుంచుత్రుంచుఁడన్మాట
యిందురాలేదేడియేడియున్మాట♦యిందు రానిమ్ము రానిమ్మనుమాట[తిఁగి
అటమీఁదహుంకృతుల్ హాసముల్ చెలఁగ♦నిటుచెల్లుమాటలయుక్కువలె
పోరుచోగంధూళి బోరుననెగయ♦పేర్చియాచీఁకటి పెద్దయాటయును
బ్రమయుటఁజేసి యేర్పఱుపంగరాక♦తమతమవారల తామెచంపుదురు
కోపించి వానరకోటులుప్పొంగి♦యాపాపకర్ముల నసురులఁగిట్టి
రథికులఁజంపి సారథులఁగీటడఁచి♦పృథులరథ్యంబుల పీచంబులడఁచి
కడనొగలలమి యొక్కటఁదేరులెత్తి♦యడితురునుగ్గునూచై నేలరాలఁ
దుమురుగాఁజోదుల త్రొక్కడగించి♦సమదవారణముల చరణంబులెత్తి

యురులఁ గేల నురించి యేచి తాటించి ♦ వరుస నల్లటుపాటువై తురు చంపి
చిదురలై దెసలందుఁ జెదరు గుఱ్ఱములు గదసి తోఁకలతోడఁ గడకాళ్లనొడిసి
పట్టి బెట్టుగఁ ద్రిప్పి వడి నేలతోడ ♦ నెట్టన వ్రేసి పెన్నెత్తురులొలుక
గోలెమ్ములురములు గుండెలు బరులు ♦ వాలిన భుజములు వదనదంష్ట్రలును
బునుకలు మెదడును భువిమీఁద జెదరఁ గనుగొని కాల్వురఁ గడగి చంపుదురు
అరదాల పెల్లున నడరు ధూళియును ♦ దురగఖురోద్ధూత ధూళియు నెగసి
దానవానీకంబు తలఁపులోనున్న ♦ కానమి నెల్ల నొక్కట వెల్లవిఱిసె
ననఁగఁ జీకటి కడు నగ్గలంబగుచు ♦ వినువీథి నడుమెల్ల విపులమై నిండె
నసురుల యసువుల నగచరాధిపుల ♦ యసువుల నొక్కట నపహరించుటకు
నామె యునారాత్రి నసురేంద్రచేత ♦ రామునిచేఁ గాళరాత్రియై తోఁచెఁ
దామ వేళ యగుట యుద్దైత్యులందందఁ ♦ గుములుగట్టి త్రికూటాచలంబు
దమ యార్పులకుఁ బ్రతిధ్వనులిచ్చుచుండ ♦ సమరసన్నద్ధులై సరభసవృత్తి
మిగిలి యా రాఘవుమీఁదను గదిసి ♦ గగనంబు నిండ మార్గణములేయుటయు
నా రామవిభుఁడును నగ్నిబాణమునఁ ♦ బేరిన చీఁకటి పెంపెల్ల నడఁచి
తనుఁగిట్టి వమహోదర మహాపార్శ్వ ♦ సన్నుతబలులైన సారణశుకుల
నటు వజ్రదంష్ట్రు మహాకాయు నేసె ♦ బటువేగమున నాలుబాణముల్ దొడిగి
యార్వురు దైత్యుల నని బాటిరపుడు ♦ పర్వినభీతిమై బ్రమసి దిక్కులకు
నటనున్న రాక్షసులా రామవిభుని ♦ బటుబాణశిఖి శలభంబులై పడిరి
అరదంబు సూతుండు హరులు నంగదుని ♦ కరముక్తగిరిశృంగకఠినపాతమున
నవనిపైఁ గూలిన నాజి వర్జించి ♦ పవనశాలకు వేగ చని యింద్రజిత్తు క్రమున
తగు హోమసాధన తతులు రాక్షసులు ♦ మొగిఁ దేరఁ గైకొని ముఖ్యమార్గ
వ నొప్పగా రక్తవర్ణంబులైన ♦ తలచుట్టు నుభయవస్త్రములు మాల్యములు
ధరియించి వహ్నికిఁ దగ పరిస్తరణ ♦ మురుతోమరంబులు నుగ్రవస్త్రములు
గరిలేని శరములు గావించి నలుపు ♦ గరిగొన్న పెనుమేఁక కంఠరక్తమున
నొగిఁ దాడి సమిధల హోమంబు సేయఁ ♦ బొగలేక ముందుచుఁ బొడవు గానిక్కి
ఝుటమితోఁ బ్రదక్షిణంబు లెటిఁగింపఁజా ♦ వలఁతియై యెదటక్షిణ వరమానశిఖల
నొప్పుచున నలుఁడా హుతులఁ గైకొనియె ♦ నప్పుడు నిష్ఠతో నయింద్రజిత్తు
యుక్తక్రమంబున హోమ మొప్పార ♦ భక్తితో నొనరించి పావకువలన
నాలుగు హయములు నానాస్త్రశస్త్రజాలంబు సహిత కాంచనమయరథముఁ
బడసి యా తేరెక్కి బ్రహ్మాండమగల ♦ కడువడి నార్చి యుక్కటకోపుఁడగుచు
నింద్రాది దేవత లెల్ల భీతిల్ల ♦ నింద్రజిత్తుఁడు మఱి యేపుదీపించి
చెచ్చెర దానవసేనతోఁ గూడ ♦ వచ్చి యదృశ్యుఁడై వడి దివినుండి

మసలక రామలక్ష్మణులపై నేసె ♦ నసదృశ కాండంబు లందంద బెల్లు
ఆరామలక్ష్మణు లాకాశమునకు ♦ భూరిశరంబుల బోవనిచ్చుటయు
నందొంత బైనను నయ్యింద్రజిత్తు ♦ నందు దాకమి మఱి యా దైత్యవిభుఁడు

—:* ఇంద్రజిత్తు మాయాయుద్ధము సేయుట *:—

దనుగాన రాకుండ దర్పంబు మెఱసి ♦ వినువీధిఁ గడు బెక్కు విధములఁ దిరిగి
కదిసి యంతటఁ బోక ఘనులగుకపుల ♦ నవలీలఁ దునుమాడి యందంద బేర్చి
నలుదెస నేయుచో నగచరు కును ♦ నలినాప్తకులునకు నలినాప్తకిరణ
నిభములై పరతెంచు నిష్ఠురాస్త్రములు ♦ నభమున నెందు గానఁగ వచ్చుగాని
యరదంబు మ్రోఁతయు నాఘోటకముల ♦
ఖురముల మ్రోఁతయు గుణమునిస్వనము
సారథిపలుకు కశాఘాతరవము ♦ లారథికుని యార్పు లతని మూర్తియును
నారథంబును దాని యధికధ్వజంబు ♦ లీరూపులని కని యెఱుఁగంగ రాక
యావిధంబా సేన కప్పు డోఁచె ♦ నా వాలి దునుమాడి యసమున బేర్చు
రామునిమీఁద సురప్రభుండలిగి ♦ రామణీయక మహోగ్ర ప్రకాండముల
నాతని యునిగూల్చి నాఁడని పేర్చి ♦ యీ తెఱంగున డాఁగి యేసెనో యనఁగ
నప్పుడా కపిసేన యంగంబు లెల్ల ♦ జిప్పలు చిదపలై చెదరంగఁ జూచి
జనలోకపతితోడ సౌమిత్రి పలికె ♦ విను వీధి డాఁగిన పిని చేసిట్లు
మను జేంద్ర మాచితే మర్కటోత్తములు ♦
మనకొఱకై వచ్చి మడియుచున్నారు
విస్మయంబుగ నింక వీని వంశంబు ♦ భస్మంబు సేయుదు బ్రహ్మాస్త్ర మేసి [రను
యనవుడు రఘురాముఁడనుజతో ననియె ♦ జను నెయొక్కరునికై చంపఁ బల్కు
ఎఱుఁగ వేరణధర్మ మెందు రాజులకు ♦ వెఱచి డాఁగినవాని వెన్నిచ్చువాని
ముకుళిత హస్తుడై మ్రొక్కినవాని ♦ జకితాత్ముడై వచ్చి శరణన్నవానిఁ
గదనంబులో బారిఁ గఱచినవాని ♦ బిదప నాయుధములు వదలినవాని
నిద్రవోయినవాని నిర్జింపఁదగునె ♦ భద్రంబు గోరు నప్పరమపుణ్యులకు
నధిక మాయం బేర్చు నయ్యింద్రజిత్తు ♦ వధియింప నోపెడువానరోత్తముల
గామచారుల బంపఁ గాలంబు గాని ♦ సౌమిత్రి బ్రహ్మాస్త్ర సమయంబు గాదు
అనినలునంగదు ననిలనందనుని ♦ ఘనుని గవాక్షుని గంధమాధనుని
భరిత విక్రమధాముఁ బనసుఁ గేసరిని ♦ శరభుని ఋషభుని సన్నాధుఁ గజుని
మఱి గవయుని నీలు మైందు విద్వివిధు ♦ నిఱిమురిఁ గోపించి యసురురపై బనిచె
నట రాఘవుడు పంవ నగచరాధిపులు ♦ పటుగతి మిన్నులపై కప్పడెగసి
తరుశైలములు వైన దర్పించి క్రూర ♦ శరపరంపరల రాక్షసరాజసుతుడు

వారినొప్పించిన వారలాదైత్యు ♦ నేరూపమునఁగాన కెప్పటిపగిది
వచ్చిరిరయమున వసుమతిస్థలికి ♦ నచ్చెరువొంది యింద్రాదులుసూడ
విలయమేఘశ్యామ విపులగాత్రంబు ♦ నలుకఁగెంజాయల నడరునేత్రములు
గలఘోరరూపంబు గానరాకుండు ♦ మెలగుచుబలికె నమ్మేఘనాథుండు
నరనాథసుతులార నన్నుగయ్యమున ♦ నరుదులక్షింప సహస్రాక్షునకును
మీరెంతవారని మిన్నెల్లనద్రువ ♦ ఘోరంబుగాధనుర్గుణము మ్రోయించి
యనిశసంకాశంబు లగుసాయకములు ♦ దశరథాత్మజులపై దళముగాఁ బరపి
మఱియునునందంద మర్కటోత్తముల ♦ గరులిచ్చిపోబెక్కు కాండంబు లేసి
యటనంతబోవక యయ్యింద్రజిత్తు ♦ చటులతరక్రూర సర్పబాణముల
నినకులేశ్వరులపై నేయఁగ వారు ♦ ఘనబాణములవానిఖండించి మఱియు
నిదెవచ్చె బాణంబు లిందేయుమనుచు ♦
నదెవచ్చె బాణ బు లందేయుమనుచు
దేదెసబాణంబు లేతెంచుచుండు ♦ నాదెసలందు నుదగ్రులై యేయు
నురగసమేతులై యుండుటమీకు ♦ గరముప్పఁదొల్లియు గలదటుగాన
ధరణీవంశజువారు తప్పక యిపుడు ♦ నురగసమేతులై యుండుడన్నట్లు
బంధురంబుగ నబ్జగాంధవకులుల ♦ బంధించెపడి నాగపాశసంతతుల
వారును బ్రహ్మ వరముమన్నించి ♦ తారురాక్షసుచేతఁ దద్దయుదూలి
యాదినారాయణు వంశజులైన ♦ మేదినీనాథు లిమ్మెయిఁగట్టువడిరి
నేఁడు రాముఁడుగాక నిక్కమూహింప ♦ నాతఁడితఁడే వామనస్వరూపంబు
నటుదాల్చి భూదాన మడిగియాబలిని ♦ బటుకృతఘ్నుతబట్టిబంధించినట్టిను
ఫలము రామునకిట్లుప్రాప్తంబుఁగాక ♦ పోలియునేమనుజుడై పుట్టియుండగ
అనితమనోదమ యాత్మలఁగుంది ♦ యనిమిషల్ ఋషులును నాశ్చర్యపడగ
ఖిన్నుఁడైయున్న సుగ్రీవునిఁజూచి ♦ సన్నుతమతి విభీషణుఁడర్థిపలికె
నిది యేలచింతింప నెట్టివారికిను ♦ నొదవవే యాపద లొక్కొక్కచోట
నినకులేశ్వరులకు నేమయ్యెనిపుడు ♦ ఘననాగపాశముల్ గట్టినంతటనెన
యనిపల్కియతడుమాయాదృష్టిజూచి ♦ కనియెరావణసుతుగగనమార్గము
గనినీరుమంత్రించి కన్నుదుడిచి ♦ వనజాప్తసుతునకు వలనొప్పఁజూపి
నారవిజాంకును నవ్విభీషణుని ♦ చారుమహామంత్ర శక్తిచేఁ జేసి
యాయింద్రజిత్తుని నప్పుడు కాంచి ♦ యాయతోన్నతమగు నచలంబు పెఱికి
యెగసిప్రేయఁగజూచి యింద్రజిత్తుండు ♦ మొగిదిరిగించె నమ్మూలవెల్లి పఱపి
యినజుండుతిరిగిన నినజునిరాక ♦ గనిమున్ను వెఱచు రాక్షసులు మోదింప
నప్పుడువిజయుడై యయ్యింద్రజిత్తు ♦ ముప్పిరిగొనుమదంబునదన్నుగొల్చు

వారును దానును వడిలంకకరిగి ♦ యారావణునిఁ గాంచి యప్పుడిట్లనిరి
చంపితిఁ గపులను సర్పబాణములఁ ♦ గంపింపఁ జేసి యిక్ష్వాకువల్లభుల
నని వేడ్కతోఁ జెప్ప నంతరంగమునఁ ♦ దనయునిమీఁద నెంతయు సంతసిల్లి
రావణుఁ డప్పుడు రయమున ద్రిజట ♦ రావించి యనియె ధరాపుత్రి నన్ను
నొల్లదారాముని నొనఁగూడుకొనుట ♦ కెల్లంబులో నమ్మి యుండుట జేసి
నేడింద్రజిత్తుచే నేలకువచ్చి ♦ పోడిమిచెడిన యా భూపాలునికి
సీతఁ దోడ్కొనిపోయి చెచ్చెరఁ జూపు ♦ మీతతిఁ బుష్పక మెక్కించి నీవు
అంత రాముని మీఁది యాసలు దక్కి ♦ చింతింపకిటు నన్నుఁ జేరును సీత
యనవుడు రావణు ననుమతి ద్రిజట ♦ దనుజాంగనలు దాను ధరణీతనూజ
నెనయఁ బుష్పకముపై నెక్కించి వేగ ♦ చనుదెంచి సంగరస్థలిఁ బడియున్న

{ ఇంద్రజిత్తుచే నాగపాశబద్ధులై యున్న రామలక్ష్మణులఁ జూచి సీత దుఃఖించుట }

కపులను రామలక్ష్మణులను జూప ♦ జపలాక్షియును నట్టిచందంబుఁ జూచి
కన్నీరు నారలై క్రమ్మ నందంద ♦ విన్ననై కడుఁ దూలి విలపింపఁ దొడఁగెఁ
గటకట రామ నీ కార్ముకవిద్య ♦ యెటు పోయె నీయందె యేపారియుండు
జామదగ్నినినైన సరకుగాఁ గొనవు ♦ నీ మెయిలావున నీ భువి నీవు
సకలమునీంద్రులు సర్వముల్ నీకుఁ ♦ బ్రకటితశౌర్యంగాఁ బలుకుదురెందు
నట్టి సర్పంబులే యవనీశ నిన్నుఁ ♦ గట్టంగ ద్రాడులై కదిసె నే నేఁడు
లాక్షణికులు నన్ను లక్షించి సకల ♦ లక్షణంబులు మేన లలితంబులగుచు
విలసితరేఖారవిందంబు లంఘ్రి ♦ తలమున గలుగుట దరళాయతాక్షి
పట్టాభిషేకంబు పతితోడ గల్గు ♦ బుట్టుదురింపార బుత్రులు నీకు
నైదువవై యుండు దను మాటలెల్ల ♦ నాదిత్యకులనాథ యకట బొంకయ్యె
రోలంబకులనీలరుచిశిరోజములు ♦ నీలమేఘము డాలు నెఱపు మైజిగియు [లు
తొంగలించుకయు లేక తోరముల్ గాక మిగుల వర్తువులునై మించు పెందొడ
కరములు నిటలంబు కన్నులు మోము ♦ చరణముల్ రుచిరలక్షణసమేతముగ
వరకాంతి నునుపారి వర్తువలగుచు ♦ సరినొప్పు నఖములు సంగతాంగుళులు
ఏచి చిత్రాకృతి నెనసి క్రిక్కిరిసి ♦ నీచాగ్రమైనది నీ కుచద్వయము
ఉరుతరస్నిగ్ధంబు లుదరపార్శ్వములు ♦ కరమొప్పుచున్నది గంభీరనాభి
కమనీయతర దివ్యకాంతి జెన్నగుచు ♦ రమణీయమైనది రమణి నీ మేను
సౌభాగ్యమున నీకు సరియెవ్వరనెడి ♦ నా భాగ్య మిట్లయ్యె నరనాథ కంటె
లలనలీపదియేను లక్షణంబులను ♦ గలవారలత్యంత కల్యాణవతులు
ఆని చెప్పునార్యోక్తులవి యెల్లఁ దప్పె ♦ మనుజేశ నా పుణ్యమహిమ గాకిదియుఁ

గెందామరలభంగి గెంజాయ మెఱసి♦యందంబులై చూడ నఱచేతు లొప్ప
బల్లవారుణకాంతిఁ బరగు పాదాగ్ర♦పల్లవంబులు సమస్పర్శంబులగుచు [లు
నడుపొప్ప నెలుగొప్ప నగుమొగంబొప్పఁ గడునొప్పఁ దివికన్యకాలక్షణము
పరికింపనని పల్కు పలుకులు దప్పె♦నరనాథ చూచితే నానోముఫలము
తలఁపులు దైవంబు తలకూఁచి నీకు♦వెలయఁగ నిటు సంభవించె నేనాఁడు
ధరణీశ నను జనస్థానంబునందు♦నురవడిఁ గొనిపోవు నుగ్రదానవుని
బోరిఁబోఁ వెదకి నాపోయిన జాడ♦కరముగ్రగతి దెల్పి కపిసేనఁ గూడి
జలనిధి బంధించి చనుదెంచి పిదప♦బాలుపేది గోష్పదంబున మునింగితి వి
ఆరయ నతిఘోరమగు యామ్యశరము♦వారుణబాణంబు వహ్నిసాయకము
నెఱయ బ్రహ్మాస్త్రంబు నతఁ బ్రయోగింప♦మఱచితివే నేఁడు మనుజలోకేశ
పగవాడు మీదృష్టిపథముల బడినఁ♦దెగ నేలఁ బడుఁగాక తిరిగిపోఁగలఁడె
యిది దైవకృతముగా కెల్లచందముల♦నెదురంగ శక్తులె యెవ్వరైన నిన్ను
మేఘనాదుఁడు మాయ మెఱసి మిమ్మాజి♦నీఘోరశరముల టుకట్టె నేడు
కాలంబు కడిమిమై గడప నెవ్వరికిఁ♦బోలు నే తలపోయ భూలోకనాథ
హానాథ హావీర హారామచంద్ర♦యేనాకు శోకింప నిట నీకు వగవ
నీకుఁ బ్రాణములిచ్చి నిర్మలుండైన♦కాకుత్స్థమణికి లక్ష్మణునకు వగవ
మనసు గుందఁగ నాకు మరుగుచున్న♦జననికి దుఃఖింప సతతంబు నీకుఁ
జిత్తంబులోపలఁ జింతించుచున్న♦యత్తకౌసల్యకై యడలెద నధిప
ఎప్పుడు పదునాలుగేడులు చనునో♦యెప్పుడు వచ్చునో యిటు రాముఁడనుచు
నీ తెఱంగున నీకు నెదురులు చూచు♦నీతల్లి యాసలు నిలిచెనే నేఁడు
మారిచారాదులనైన నదలించునీదు♦శరములగలశక్తి సమసెనే నేఁడు
నీదివ్యశక్తియు నీబాహుబలము♦నీదుర్దమక్రమ నిపుణవిక్రమము
నెక్కడఁ బోయెనో యేమందునింక♦నక్కటా విధి నీకు నలిగెనే నేఁడు
చెలువొంద నేను నోచిన నోములెల్ల♦ఫలియించెనేమని పలవింతు విధికి
నని ప్రలాపింపంగ ననియె నా త్రిజట♦జనకజ నూరార్చి సదయచిత్తమున
రామునికొకకీడు రాదు నీవేల♦నీ మెయి శోకింప నిందీవరాక్షి
యట్టిదయైన యీయగచం సేన♦యిట్టెల పెద్దయై యేచి వర్తించు
నదెచూడుమా దేవి యగచరేశ్వరులు♦పదిఃఖలై నీవిభు బలసియున్నారు
గాదుపో యీపుష్పకంబేల మోచు♦మేదినీతనయ యిమ్మెదిసిఁ బడక
కానరాముఁ గొండు గాదు చింతింప♦మానిని నామాట మనసులో నమ్మ
లంకేశుఁ జంపి యీలంక సాధించి♦పంకజానన నిన్ను భానువంశజుఁడు
నలిఁ దోడుకొనిపోవు నమ్ము నామాట♦కలఁగకు నేఁడల్లి కల్యాణి నీవు

అనపుడుసీత మాయామ స్తంబు ♦ వనువుగాఁబోలని యాత్మలోనమ్మె
సుందరి త్రిజట యశోకవనంబు ♦ నందుఁ గ్రమ్మఱ దెచ్చి యవనిజనునిచె
మనువంశతిలకుండు మదిదెగివొంది ♦ తనకు జేరువనున్న తమ్మునిజూచి
నాతమ్ముఁజూచితే నలినాప్తతనయ ♦ యీతెఱంగున గుందియిట్లున్నవాడు
సీతఁగోల్పడిసీత చెఱమాన్పలేక ♦ యీతనిఁగోల్పోవు టెటుసంభవించె
సౌమిత్రిఁగోల్పడి జనకజనాకు ♦ నేమిటికిటమీఁద నేలనాఁబతుకు
యత్నంబుచేసిన యవనిజబోలు ♦ పత్నిఁ బొండొకచోట బడయంగవచ్చు
గలరు కాంతలుసుతుల్గలరు బాంధవులు ♦ గలరుగాకెందునుగలరె సోదరులు
తమ్ముఁడన్మాత్రమే తలపోయభక్తి ♦ నిమ్ములననుఁగొల్చు నిమ్మహాభుజుడు
అరయఁగౌసల్యకు నాసుమిత్రకును ♦ సరియకావర్తించు సద్భక్తితోడ
దగలక్ష్మణునికంటె దయతోడనన్ను ♦ మిగులమన్నించు సుమిత్రనావలన
వాత్సల్యమెప్పుడు వదలదాపుత్ర ♦ వత్సలయగుతల్లి వగఁబెట్టవలసె
బురికింకొకడును బోయితినేని ♦ భరతశత్రుఘ్నులు భ్రాతృవత్సలులు
ఎటచక్కలక్ష్మణుం డేలరాఁడనిన ♦ నటనేమిచెప్పుదు నకటతమ్ములకు
వనటమైనీవొంటి వచ్చుటజూచి ♦ మనములుగలగెడి మాకనోతనయ
సౌమిత్రితోఁ గల చనుదేవనిన ♦ సేమనియుత్తరం బిత్తుఁదల్లులకు
నేమః యూరార్తు నీమోముతోడ ♦ నేమనియఁ బోదు నీమేనితోడ
బ్రాలేయశైలంబు పగిలిననినుకు ♦ నేలఁగూలినసీరు నిశ్చలంబైన
వనధులింకినగాలి వర్తింపకున్న ♦ ననలుండుకడుజల్లనైయున్ననైన
నామాటగడువడు నాకునప్రియము ♦ లేమాటలునునాడ డెన్నడునితడు
ఇతనిచిత్తంబు నాయెడనొక్కచంద ♦ మితనిబోలెడితమ్ముడింకెందుగలడు
ఇతడనాప్రాణంబులితడెనాబంధు ♦ డితనినొక్కడబుచ్చియేనొంటినుండ
నితడెందుబోయిన నేనందుబోదు ♦ నితనితోడిదెలోక మీలోకమెల్ల
జనుదెంచెనాతోడ సౌమిత్రివాడు ♦ చనియెదనేనేను సౌమిత్రివెనుక
హితబుద్ధిగార్యంబు లెఱుఁగకచేసి ♦ తతులవిక్రమశాలి యవినాకునొక్క
డరుచరోత్తమువాలితనయుడోడ్కొనుచు ♦ గిరిచరసేనతోఁగిష్కింధకరుగు
మేలక్ష్మణునితోడ నేగినపిదప ♦ పౌలస్త్యపతిమిమ్ము బాధింపగలడు
జయశాలియగుచున్న సౌమిత్రిలేని ♦ జయమునాకంధునిచంద్రోదయంబు
మద్భక్తుఁడై పూని మారుతపుత్త్రుఁ ♦ డద్భుతకార్యంబు లవిపెక్కుసేసె
జలనిధిలంఘించి జనకజగాంచి ♦ కలనబెక్కండ్ర రాక్షసులమర్దించె
నీయంగదుండును నీసుషేణుండు ♦ ధీయుతులైనయా ద్వివిదమైందులును
నీగవయుండును నీగవాక్షుండు ♦ నీగజుండునురక్తి నెనయునీలుండు

మెఱయసంపాతియు మేటి కేసరియు ♦
మఱియుదక్కినపేర్మర్కటోత్తములు
నాఁకొఱకై వచ్చి నలినాప్తతనయ ♦ చేకొని లావులు సేసి రందఱును
ఇక్కాలమిక్కడ నెబ్భంగిమమ్ము ♦ ద్రెక్కొన్న విధిదాట దీర దెవ్వరికి
రణభూమిఁ బలువుర రాక్షసపతుల ♦ దృణలీల బొలియించి తీవ్రశాణముల
బగతు చే నిబ్భంగి బడిలోచనములు ♦ మొగియుచు భూరజంబున బ్రుంగినాఁడు
వరతల్పమున నుండు వాఁడు నేఁడకట ♦ శరతల్పమున రణస్థలి నున్న వాఁడు
సంకీర్ణ రవికుల జలధిపాంగడచి ♦ గ్రుంకె నేల లక్ష్మణ కువలయప్రియుఁడు
అనుచు విలాపింప నఖిలవానరులు ♦ మనముల శోకాబ్ధి మగ్నులైరంత

—:* ఇంద్రజిత్తు రెండవసారి యుద్ధమునకు వచ్చుట *:—

ననికి గ్రచ్చఱవచ్చె నామేఘనాదు ♦ డనుబుద్ధి దూరస్థులైన వానరులు
ఘనతరాంజనశైల కల్పుడై యున్న ♦ తనుఁ జూచి వెఱవఁ గదా పాణియగుచు
సైన్యమధ్యంబున జరియించు కపుల ♦ దైన్యంబుఁ బాపుచు దగ విభీషణుఁడు
ఏ తెంచి రవిసూను నీక్షించి పలికె ♦ నీ తెఱంగున మీకు నేల చింతింప
గైకొని యిది యుద్ధకాలంబు కాని ♦ శోకింప వేళయె సుగ్రీవ మనకు
దుర్నివారోర్మిబంధురమైన జలధి ♦ కర్ణధారుఁడు లేని కలము చందమున
మనసైన్యమున్నది మనమింక వేగ ♦ యనికి నుద్యోగించుట దియె కార్యంబు
అనవిని యంగదుం డావిభీషణుని ♦ గనుగొని యీ మాట కడునుత్తమంబు
నరనాథతనయులు నాగపాశముల ♦ నురవడి బెనగొని యుర్విపై నొరగి
బాణక్షతంబుల బలువిడి వెడలు ♦ శోణితంబుల బ్రుంగి సొరిదినున్నారు
ఈ దాశరథుల మీరేమఱకుండు ♦ డాదిత్యుఁ డుదయాద్రి కరుదేరమున్న
యేను రాక్షసకోటి నెల్ల నిర్జించి ♦ జానకిఁ దెచ్చెద జననాథుకడకు
హనుమంతుఁ డాదిగా నఖిలవానరుల ♦ గొనికవాటములతో గోటలతోఁడ
దోరణశ్రేణులతో గూడ లంక ♦ దోరంపుబిడికిళ్ళ దుమురుసేసెదము
విస్మయంబుగ బంధువితతితో గూడ ♦ భస్మంబు సేయుదు పఙ్క్తికంధరుని
నా విక్రమంబును నా భుజాబలము ♦ భూవరువలన నా పూనుభక్తియును
దెల్లంబు సేయుదు దెగువతో నెల్లి ♦ యెల్లభూతంబులు నీక్షింప సమ్ము
మలయుజకేయూర మహితానుభూతి ♦
బలుమఱుఁగన్న నా బహుదండములు
అనవరతంబును నధికదర్పమున ♦ దనరుచున్న విరఘూర్తము కార్యమునకు
రావణు నిర్జించి రఘువీరుఁ డలర ♦ నీవిభీషణు లంక నెలమినిల్పెదను
గాదేని నాజి రాక్షసుల చే జచ్చి ♦ పోదును సౌమిత్రి పోయిన త్రోవ

ననవినిసుగ్రీవు డంగదుజూచి ♦ తనయసివింక నీదశరథాత్మజుల
గొనిపొమ్ము కిష్కింధకును వేగ నేను♦దనయింద్రజిత్తుని సకలరాక్షసుల
రావణునిర్జించి రఘురాము దేవి♦నేవిధంబుననైన నేదెత్తు వేగ
యనిదైన్యపాటుతో నాడుసుగ్రీవు♦గనుగొనిఖిన్నులై కపులుభీతిల్లి
మునుకొనిశోకాబ్ధి మునుగ సుషేణు♦డనువాడువల్కె నయ్యంగదుజూచి
యీనాగపాశంబు లిపుడుబాయుటకు♦వానరేశ్వరులార వలను సెప్పెదను
తొల్లి దేవాసురోద్ధురసంగరమున♦నెల్ల దేవతలకు నివిగట్టియున్న
దేవతలప్పుడు దివ్యౌషధముల♦చేవానిబాధ బాసిరి కట్లువిడిసి
యాయౌషధము లిప్పుడమృతాబ్ధికవల♦బాయకున్నది ద్రోణపర్వతస్థలిని
హనుమంతుబుచ్చుడీ యతడౌషధములు ♦
గొనివచ్చు మీరిట గుందంగవలదు

—*: నారదుడు శ్రీరాములవద్దికి వచ్చుట :*—

అనునంతసూర్య సహస్రసంకాశు ♦ డననొప్పికృష్ణ మృగాజినంబమర
మెఱుగులతోశుభ్ర మేఘమోయనగ ♦
నెరయుబింగళజటా నిచయంబువెలుగ
బొనరనున్నియూర్ధ్వ పుండ్రంబుఁబెట్టి♦తనరంగ గాషీన దండముల్దాల్చి
రమణమైనొప్పు నారాయణమంత్ర♦మమలత దనవీణయందొప్పి మెఱయ
దనతో డియోగీంద్ర తతినాకసమున♦నునిచిచిత్తంబున నుల్లాసమొదవ
బరమయోగీంద్రుండు పరతత్త్వవేది ♦
పరమపావనమూర్తి పరమవైష్ణవుఁడు
నారదుండారామ నరనాథుఁగాన♦గారవంబునవచ్చి కరముబు మొగిచి
వలగొనివచ్చి యవ్వసుమతీశునకు♦దలకొన్నభక్తితోఁ దగవిన్నవించె
దేవర్షి బ్రహ్మాది దేవతలెల్ల ♦ నావార్ధిమధ్యంబు నందొప్పగాంచి
రావణబాధా పరంపరల్సెప్పఁ ♦ గావినివారిపైఁ గరుణించినీవు
వారిఁబ్రోచుటకు రావణుఁజంపుటకు♦ధారుణిబుట్టితి దశరథేశునకు
నటుగాననీనిటు లలమటనొంద♦నిటుతగునయ్య మహీపాలవర్య
నీనామమాత్మలో నిలిసినంతటనె♦భూనాథ యజ్ఞానములు పొందవనిన
నీకునజ్ఞానంబు నెపమైనగలదె♦చేకొనినినునీవె చింతింతుగాక
నారాయణుఁడవు పూర్ణజ్ఞాననిధివి♦చారుకౌస్తుభరత్న సహితవక్షుఁడవు
అనిశంబులక్ష్మికి నాటపట్టైన♦ఘనతరాంగంబులు గలుగుదేవుఁడవు
ఆదిదేవుఁడవు సర్వాంతరాత్ముఁడవు♦వేదవేద్యుండవు విశ్వరూపుఁడవు

తలఁచుయోగీంద్రుల ధ్యానంబునందు ♦
నలువొందు సచ్చిదానందరూపుఁడవు
ధరణియుంబ్రుబులువియుత్తలముమస్తకము పరపై ననిటలంబు పద్మాసనుండు
కన్నులు చంద్రుండు కమలమిత్రుండు ♦
నున్నతంబగుచున్న యూర్పుమారుతము
వదనంబు శిఖి సరస్వతి జిహ్వయొప్పు ♦ రదనప్రతతి వేద రాశి చింతింప
జెలువైన గాయత్రి శిఖ ప్రణవంబు ♦ వెలసిన హృదయంబు వీనులు దిశలు
మహనీయ ధర్మంబు మనసు దేవతలు ♦ బహుజయస్థితిగల బాహుసమృద్ధి
గొనకొన్న బ్రహ్మాండకోట్లు నీకుక్షి ♦ తనరారు దొడలు మిత్రావార్ధిపతులు
ఆశ్వినేయులు జానులాత్మలోఁ జూడ ♦ విశ్వంబు నీరోమ వితతి చింతింప
నిదె చూడు మావీర యెల్ల దేవతలు ♦ గదిసి కిన్నరయక్ష గంధర్వపతులు
నాదిగా వచ్చి జయంబు నీ దెసకు ♦ మేదినీశ్వర కోరి మింటనున్నారు
అకలంకమతివి నీవజ్ఞానము డిగి ♦ సకల రాక్షసులను సమయింప వేగ
వారకనరులైన వారు సంసార ♦ సారంబుఁ జేరు నుపాయంబు లేక
బాళి నాశాపాశ బద్ధులై రేని ♦ నీలీలనటియించు టింతియుగాక
నీవేల యీ సర్పనికరంబు చేత ♦ భావింపఁగాఁ గట్టుపడుదు శ్రీరామ
నీవాదిమూర్తివి నీమూర్తిదలఁపు ♦ నీవాహనంబైన నీకేతువైన
గరుడుండు వచ్చిన గరుడుని చేత ♦ నురగపాశములెల్ల నూడు నీక్షణమె
యని చెప్పి దీవించి యానారదుండు ♦ చనియె గ్రమ్మర సుధాసాగరంబునకు
నానారదుఁడు సెప్ప నారాఘవుండు ♦ తానాదిహరియౌట దలపోసి చూచి
తెలిసి ధీరుని వైనతేయునిఁ దలఁచెం దలంచి ♦ ననతఁడును తలపుతోఁగూడి
యారూఢమగు నమృతాబ్ధియుత్తరపు ♦ తీరంబునందుండి దిగ్గన లేచి
యూనిమెట్టిన పాదయుగము చేబయలు ♦ గానఁగ ధరణిలోపలి శేషుఁడులుక
గడు పెద్దయైన ఱెక్కలగాలిమిన్ను ♦ సుడివడి దిక్కులు సొరవులై తూల
నక్రమోత వెల్లున నఖిలలోకములు ♦ నక్రములై తనుచేత నముదక్కఁ ద్రుక్క
నెఱకలు పిప్పిందించు నెగసిన ధూళి ♦ నెఱసి చీకట్లుగా నఖిలంబు గప్ప
జను దెంచునురువడి శైలంబులురుల ♦ వననిధి పిండలి వండలై కలఁగఁ
బదివేల సూర్యుల ప్రభలెల్ల గూర్చి ♦ మొదిసి చేసిన క్రియ మెయి ప్రకాశింప
మెఱయు ఱెక్కలతోడి మేరునో యనఁగ ♦ బఱతెంచె గరుడుఁ డంబరమున బేర్చి
పఱ తెంచుటయు నాగపాశంబులెల్ల ♦ వెఱచి యా నృపతుల విడిచి పెల్లురికె
నదియట్టిదయ కాదె యనినఁ జింతింప ♦ వదలు బంధంబు లెవ్వారలకైన
దనుఁ దా నె చింతించి తనదు బంధములు ♦ చనద్రోవ రాముండు చాల డేతలఁప

నినసుతుఁడాదిగా నెల్లవానరులు ♦ నినవిస్మయంబుగా వెఱఁగందిచూడ
భానుకోటిప్రభా భవ్యతేజమున ♦ వానందకరమూర్తి యమరులుపొగడ
హీరకిరీటంబు హేమాంబరంబు ♦ గారుత్మతోజ్జ్వలగ్రైవేయకంబు
రత్నకుండలములు రాజీవరాగ ♦ సూత్నమంజీర మనోహరాంఘ్రులును
మౌక్తికమాలికల్ మాణిక్యకవచ ♦ సక్తమైమించు విశాలవక్షంబు
మరకతకేయూరమంజుబాహువులు ♦ నరుణపక్ష్ములు చంద్రాననాబ్జంబు
కరుణావలోకముల్ కంబుకంధరము ♦ వరుణపల్లవకోమలాగ్రహస్తములు
దుందుభీస్వనము లత్తుకచాయమేను ♦ మందరమేరు సమానగాత్రంబు
లలితోర్ధ్వపుండ్ర లలాటపట్టికయు ♦ సెలవుల దేరెడు చిఱునవ్వులొలుక
వైనతేయుండును వలగొనివచ్చి ♦ యానఁ బతులకు నందంద మ్రొక్కి
మెఱుగారు ఱెక్కల మేనులుదుడిచి నెఱకరంబులు మోడ్చినిలిచియిట్లనియె
బాసెమీకీనాగ పాశబంధములు ♦ వాసవాంతకుని రావణు ద్రుంచివైచి
ధరణిజగొనియయోధ్యకు వేగచనుము ♦ ధరణీశ యసురులదండించునపుడు
మాయలు పెద్ద యేమఱకవర్తింపు ♦ మేయుపాయంబుల నికమోసపోకు
మని ప్రదక్షిణముగా నరిగియానృపుల ♦ వినుతించి దీవించి నెసగౌఁగిలించి
మ్రొక్కి యాయమృతసముద్రంబుకడకు ♦ గ్రక్కునగమనించె గశ్యపాత్మజుడు
పాములకట్లెల్ల బాయుటఁ జేసి ♦ రామలక్ష్మణులును రాగిల్లిరపుడు
వనచరులారామవల్లభు నెదుర ♦ ననురాగరసమున నందందఁ దేలి
తనరుచు సింహనాదములు సేయుచును ♦ వినువీధిఁ గోఁకలు విసరియాడుచును
గురువులు వారుచుఁ గుసిసియాడుచును నురవడిఁ దాటుచు నుబ్బి నవ్వుచును
ఘూటించి శైలవృక్షములెత్తిలంక ♦ కోటలోఁ గలెత్తునఁ గొనఁదలంచుచును
మిగిలినవారల మిక్కిలిరభస ♦ ముగలించెలంక పెల్లగలించె నభము

అంతసూర్యోదయమగుటయుఁ జగుల ♦ నంతయు నరయ దశాస్యుండు పనిచెఁ
బనిచిన నక్కోట పైనుండి వారు ♦ గనిరి సుగ్రీవుండు కదిసి కొల్వఁగను
సవినయుండై విభీషణుఁడు సేవింప ♦ బ్రవిమలమతి కపి బలమురంజిల్ల
బోరికి సేవఁ బురికొల్పుకొనుచు ♦ జూరువిశృంఖల సమదేభయుగము
గతినున్న రామలక్ష్మణులనిక్కొకు ♦ పతులబంధంబులు వాసినవారిఁ
గనివిన్ననై వారు గ్రమ్మఱఁబోయి ♦ దనుజేశ్వరున కవ్విధంబెఱిఁగింప
వినిఖిన్నుఁడై కడు వెఱఁగందియపుడు ♦ తనమంత్రివరులతో దశకంఠుడనియె
బన్నగపాశాస్త్రిఁ బడియునుమగుడ ♦ నున్నయారామలక్ష్మణులచే నింకఁ
జెడగలదీలంక సిద్ధంబుగాఁగ ♦ బడయవచ్చునె నాగపాశంబులూడ
జయమెక్కడదినాకు సమరంబులోన ♦ రయమునఁ జెడుగాక రాక్షసలక్ష్మి

గరుడుండు వచ్చునో కాక లేకున్న ♦ నురగపాశము లేల యూడు వారలకు
గరుడుండు నను గల్చెఁ గాక లేకున్న ♦ నరు లెంతవారు వానరు లెంతవారు
అనుచు మత్తేభరవానుకారముగ ♦ ఘనమగు నట్టార్పు నుగ్రధూమ్రాక్షుఁ

—:* ధూమ్రాక్షుఁడు యుద్ధమునకు వచ్చుట *:—

బనిచె వగ్గలమైన బలములఁ గొనుచుఁ ♦ జను వేగ రామలక్ష్మణులపై ననుచుఁ
బనిచిన నాదైత్యపతికి మ్రొక్కుచును ♦ ననికెత్తి ధూమ్రాక్షుఁ డప్పుడు వెడలె
వాని బలంబు వెల్వడఁ జొచ్చె నపుడు ♦ నానావిధంబుల నలుగడలందు
వృకసింహముకముల వెలసిన యట్టి ♦ ప్రకటితస్ఫూర్తి తురంగంబు లొప్ప
బటపటార్భటిఁ జెవుల్ పగిలించునట్టి ♦ పటురవంబుల దిశాపటలంబు లద్రువ
వడి భయంకరము దివ్యంబైన దీప్త ♦ లడర ధూమ్రాక్షుని యరద మొప్పారె
భేరులు శంఖముల్ పృథుమృదంగములు ♦
భూరిఘోషంబు లద్భుతముగా మ్రోయఁ [ములు
దురమునకటు వచ్చు ధూమ్రాక్షునకును ♦ బరువఁడి దోఁచె నొప్పని శకున
నలినార్చి ముందఱ నడుచు రాక్షసులు ♦ నిలిచి యెంతేనియు నిశ్చేష్టులైరి
అయ్యును నిలువక నగ్గలంబైన ♦ కయ్యంబు మీఁదను గవిసి యార్చుచును
వచ్చు ధూమ్రాక్షుండు వారిధివోలె ♦ నచ్చెరువై యున్న యగచర సేన
దాఁకిన నసురులఁ దరుచరేశ్వరులు ♦ దాఁకిరి మిన్నులు దాఁక నార్చుచును
దానవావలి యడిదంబుల వ్రేయ ♦ వానరావళి వ్రేసె వారి వృక్షముల
దానవేశ్వరులు కుంతంబులఁ బొడువ ♦ వానరుల్ పిడికిళ్ళ వారి మోదుదురు
దానవుల్ హరులఁ బంతంబునఁ దోల ♦ వానరుల్ వానిని వ్రత్తురు గోళ్ళ
దానవోత్తములు రథంబులు వఱప ♦ వానరుల్ వానిని వ్రయ్యఁ దొక్కుదురు
దానవుల్ మదకరి తతులఁ డీకొలుప ♦ వానరుల్ వాని నుర్వరఁ గూల్తు రలుక
నివ్విధంబునఁ బేర్చి యిరువాగుఁ బోర ♦ నవ్వనచరవీరు లసురులఁ గిట్టి
యంతకాకృతిఁ గాళ్ళ నలమి మదోగ్ర ♦ దంతుల నేలపైఁ దాటించి చంపి
వానిఁ జేకొని కడువడి వ్రేసి వ్రేసి ♦ దానవానీకంబు దర్పంబు మాపి
గెడపి కొల్లాడిసి పక్కెరలతోఁ బట్టి ♦ పుడమి బెట్టుగ గుఱ్ఱముల వ్రేసి చంపి
వానిఁ జేకొని కడువడి వ్రేసి వ్రేసి ♦ దానవానీకంబు తనువులు చదిపి
యసమున గడునొగ లలమి యందంద ♦ వెస ద్రిప్పి యరదముల్ విఱుగ దాటించి
వానిఁ జేకొని కడువడి వ్రేసి వ్రేసి ♦ దానవానీకంబు ధరఁ గూల్చి కూల్చి
యిరియు కాల్బలముల యెమ్ములన్నియును ♦ నురుముగా దన్ని పీనుఁగులుగా జేసి
వాలి నేర్కొని కడువడి వ్రేసి వ్రేసి ♦ దానవానీకంబు ధర మీఁదఁ గూల్చి [డాడి
మఱియుగ్రస్థుగ జొచ్చి మహితదంష్ట్రముల ♦ గఱకు రాక్షసకోటి గఱచి యీ

చాచినయట్టి శస్త్రంబులువిఱిచి ♦ మోచేతులను వాగి మొగములఁ బొడిచి
పడఁద్రోసి చేతుల బలిమిగా నదిమి ♦ మెడలును గోళ్లను మిడుకంగ బట్టి
మోఁకాళ్ళనూదియిమ్ముల దైత్యవరుల ♦ పీకకోలెమ్ములువిఱుగంగ బొడిచి
కడువడినిడుదతోఁకలు దవిలించి ♦ యుడుగక మెడలకు నురులుగావించి
యఱిమురిఁ బరవశులై గ్రుడ్లు వెలికి ♦ నురికి బెట్టుగఁ జావ నొగిబిగియించి
పెల్లుగాఁ బీనుఁగు పెంటలు సేయ ♦ మల్లడిగొని త్రెళ్ళి మహిమీఁద నపుడు
ఇవి తలలివి కన్ను లివి వదనంబు ♦ లివి చెక్కు లివి ముక్కు లివి కంధరంబు
లివి బాహు లివి మేను లివి జఘనంబు ♦ లివి యూరు లివి జాను లివి చరణంబు
లని యేరుపడకుండ నసురవర్గముల ♦ నెగడును మజ్జంబు నెత్తురు మెదడు
వెరసియుఁ బ్రేవులు నెమ్ములుతోలు ♦ పురియలతోఁ బెనుప్రోవులై యుండె
నప్పుడు ధూమ్రాక్షుఁ డాకపిసేనఁ ♦ జప్పరింపుచుఁ దాఁకి చతురత మెఱసి
తలలు వ్రయ్యలుగ ముద్గరముల వ్రేసి ♦ సలలితుండగుచు బ్రాసంబుల బొడిచి
పరిఘంబులను భిండివాలశూలముల ♦

గరవాలముల మహోగ్రత బెట్టుచూప
గడునొచ్చి నెత్తురల్ గ్రక్కుచుఁ బడిరి ♦ కడిమికిబెడబాసి కపులు పెక్కండ్రు
తక్కటికోఁతు లుదగ్రత దక్కి ♦ దిక్కులఁ బఱచిరి ధృతి పెంపుదూలి
పఱచినఁ గోపించి పర్వతం బొకటి ♦ యరిమురిగొని వైచె హనుమంతుఁ డలిగి
వైచిన గద గొని వారించి యప్పు ♦ డాచావుడకుఁ దప్పి యసురదాటుటయు
నదిదానవాధము నరదంబు మీఁద ♦ జదరంబుగా వచ్చి చదియంగ బడియె
నంతట బోవక యనిలతనూజుఁ ♦ డెంతయుఁ గడఁకతో నేపు దీపించి
యలుకతో జముఁడు బ్రహ్మాండంబు వగుల ♦ బలువురనుగ్గాడుపగిది రోషించి
తరుశైలపాషాణ తతుల రాక్షసుల ♦ శిరములనుగ్గాడి సింహవిక్రముఁడు
అడరి వాండ్రనుదోలి యగశృంగ మొకటి ♦

తొడిబడ గైకొని ధూమ్రాక్షుమీఁద
గడఁగి యేతేరంగ గదఁ గొని యతఁడు ♦

పడియుమంచును హనుమంతు మస్తకము
వ్రేసిన ధూమ్రాక్షు పీఁకయులావు ♦ నీసును శౌర్యంబు నింతగైకొనక
హనుమంతుడుగ్రత రర చేతనున్న ♦ ఘనతర శైలశృంగం బెత్తియార్చి
యేచియద్దానవు నేపెల్లఁ దూల ♦ వైచినఁ దల పెక్కు వ్రయ్యలై కూలె
నప్పుడు కొండ వజ్రాహతిఁ గూలు ♦ చప్పుడు గోఁచె నజ్జగముల కెల్ల
నటువాఁడు మృతుఁడైన హతశేషులైన ♦

కుటిలదైత్యులు గాలికొడుకున కులికి

భూచక్రమగలంగఁ బోరిఁబోరిమగిడి♦చూచుచు వెసలంకఁ జొచ్చిరిపాటి
యంతరావణుడు ధూమ్రాక్షుఁడుచచ్చు ♦
టంతరంగము నెరి యంగఁ జేయుటయు

—:* అకంపనుఁడు యుద్ధమునకు వచ్చుట *:—

గలన దేవతలకుఁ గంపింపకునికి♦గలిగిన వాని నకంపనాహ్వయుని
దివ్యాస్త్రశస్త్ర ప్రదీప్తులవాని♦దివ్యరథోపరి స్థితినొప్పువాని
వడినాజికినిఁ బడవాళ్ళ నుబనిచి♦వెడలించెబహుబల వితతితోఁగూడ
మొనసి కాలాంబుదమూర్తియైవాఁడు♦దనరుభూషణదీప్తి ధామంబులదర
మణిదీధితుల సూర్య మండలంబగుచు ♦
బ్రణుతిగాంచిన హేమ రథముపై నిలిచి
యిదెవచ్చెనాజికి నితఁడని తెల్పు ♦ చదురునఁ గేతువు ల్చదలఁ బెల్లడరఁ
గుటిలరాక్షసవీర ఘోరనిస్సాణ♦పటహభేరీభూరి ఝాంకృతు ల్సెలఁగ
వితతంబుగాలంక వెడలంగఁదోన ♦ చతురంగబలములు చతురత వెడల
నగచరసేనయు నార్చుచుఁదాఁకె ♦ గగనంబువగుల రాక్షససేనతోడ
నుభయబలంబు లిట్లుగ్రతఁ బేర్చి ♦ రభసంబుతోఁదాఁకి రణమొనరింప
నెగసిన కెంధూళి యెల్లదిక్కులను♦గగనభూభాగంబుఁ దప్పకాలోనఁ
జీఁకటిమిగులఁ జేర్చినచందమయ్యె♦నాకపిసేనల కసురసేనలకు
నప్పుడుతమతమ నుడియాలములను♦దప్పక రణము కొందఱు సేయువారు
పలుకులసన్నలఁ బరులనియెఱిఁగి♦తలతడిపేర్చి కొందఱుపోరువారు
వారువీరనక యెవ్వరినైనఁదాఁకి♦దారుణక్రీడఁ గొందఱుపోరువారు
తరుచరావలివైచు తరులును గరులు♦నురుదైత్యులడరించు నుగ్రశస్త్రములు
వెరసినదెసలందుఁ బెల్లుగాబరచి♦పారిబారిజలచరంబుల భంగినొంది
మానైనధూళి తమఃపటలమున♦మానితాంభోనిధి మాడ్కిఁగావించె
నప్పుడాయుభయ సైన్యంబుల నడుమ ♦
నుప్పొంగుతనువుల నెరులు రక్తములు
ధరణీపరాగంబు దక్కనదైత్య♦తరుచరపతులు యుద్ధము వేడ్కఁ జేయ
నావానరులు కడునగ్గలంబైన♦బావకాకృతి నకంపనుఁడుకోపించి
నారిసారించి యున్నతసత్త్వుఁడనియె♦సారథితోడ నుత్సాహంబుమిగుల
మ్రాఁకులగొండల మర్కటసేన♦వీఁకతోరాక్షస వితతి మెప్పించె
నాదిక్కునకుగా రయంబునఁదోలు ♦ మాదర్పమున నీవు మనరథంబనుడు
వాఁడుమబరపిన వాఁడునగ్గలిక♦వాఁడిమిఁదాఁకి యవ్వనచరసేన
బెడిదంపుశరముఁ బెల్లేయుటయును♦జెడివలీముఖులు నిశ్చేష్టితులయ్యె

హనుమంతుఁ డడరిన నతనితోఁ గూడి ♦ దనుజసైన్యంబులఁ దాఁకిరిబెట్టు
అప్పుడు మేరునగాకృతినున్న ♦ యప్పవనజుమీఁద నయ్యకంపనుఁడు
వీరరసస్ఫూర్తి వెల్లువదొట్టి ♦ ఘోరంపుటార్పు నిర్ఘోషమై చెలఁగ
గడుబెట్టుగాఁ యు కాలమేఘంబు ♦ వడువున నురుశర వర్షంబుఁ గురియ
నవిగణింపక యట్టహాసంబు చేసి ♦ పవననందనుఁ డంతఁ బ్రళయకాలాగ్ని
రుద్రుని కైవడి రూక్షగటాక్ష ♦ రౌద్రరసంబు ఘోరంబుగా నిగుడ
విగతభయుండునై వ్రేళ్ళతోఁ గూడ ♦ నగలించి పెఱికి మహాశైలమెత్తి
వైచిన ముచిపయి వజ్రివజ్రంబు ♦ వైచిన చందాన వారణ లేక
దానవుం డర్ధచంద్రప్రదరమున ♦ దానిమగ్గాడె నుద్ధతశక్తి మెఱసి
మానితంబగు సత్త్వ మహిమ దీపింప ♦ గా నగ్నికణములు గన్నులదొరఁగ
జనివేగ వేఱొకశైలంబుఁ బెఱికి ♦ కొనివచ్చి యతిమతిఁ గ్రూరుడై యార్చి
కడుబెట్టిదముగ రాక్షసుమీఁద వైవ ♦ వడిగొని తుమురుగా వాఁడది ద్రుంచ
దానికి మారుతి తనయుఁ డుగినిసి ♦ వేసగంబును బోలు వృక్షంబుఁ బెఱికి
యడుగులబెట్టున నవని కంపింప ♦ మిడుగురుగములు గ్రమ్మ దుకన్నులొప్ప
మసలక తక్కిన మ్రాకులు విఱుగ ♦ విసరి యాడుచు దైత్యవితతిపై గవిసి
రథికులఁ జంపి సారథులఁ గీటడఁచి ♦ రథరథ్యములను ధరాస్థలిఁ జదిపి
కొమ్ములు నెమ్ములు కుంభస్థలములు ♦ నమ్మాదిజోదులు నంకుశంబులును
మురియుంగ ఘంటలు మొరయఁగ బెట్టు ♦ చరణముల్వెసబట్టి సామజప్రతతి
దడఁబడగాఁ వ్రేసి తరమి కొన్నింటిఁ ♦ బొడిపొడిగాఁ జేసి పుడమిపై గెడపి
తుమురుగా రౌతులతోను గజ్జముల ♦

సమయించి కాల్బురఁ జదియంగ మోఁది
యంతకాకృతి బేర్చు హనుమంతుమీఁద ♦ నంతరంగమున గోపావిష్టుఁడగుచు
వాటంబుగా దైత్యవరుఁ డుచ్చిపాఱ ♦ నాటించె నొకపదునాల్గు బాణములు
కరమునగల యశ్వకర్ణవృక్షమున ♦ నురియలుగావించి మానుమిడి యార్చె
నప్పుడు నెత్తురు లడర నశోక ♦ మొప్పఁ బూచిన క్రియ నొప్పి యావేళ
హనుమంతుఁ డొకవృక్ష మవలీలఁ బెఱికి ♦ తనరనకంపను తల వ్రేయుటయును
లోకంబులు గలంగ లోఁగుచు బర్వ ♦ తాకృతి బెట్టుగా నవనిపైఁ గూలి
పొరిఁబొరి జెదరెడి పునుకలతోడ ♦ నరభోజనుఁడు ప్రాణంబులు విడిచె
వాఁడు గూలిన యంత వానరోత్తములు ♦ వాఁడిమి నార్చిరి వసుధ గంపింప
దనుజులు గనుకని తలలోలి వీడఁ ♦ జనిలంకఁ జొచ్చిరి సరభసంబునను [చ్చి
అగచరేశ్వరులును హనుమంతు కడిమి ♦ బొగడిరి తమమనంబులఁ మెచ్చి మె
పరులచే నసిన కంపనుఁ డుగూలుటయు ♦ బరితాపమును విని పఙ్క్తికంధరుఁడు

—:* మహాకాయుఁడు యుద్ధమునకు వచ్చుట *:—

మహాబలకపులను మడియించి వేగ ♦ చనుదెమ్మనిబల శౌర్యమింపార
పనిమహాకాయుని నప్పుడు పనిచె ♦ పనిచిన వాఁడును బనిబూనియపుడు
రమణీయతర మయూరధ్వజంబొప్ప ♦ నమితమణిప్రభ లఖిలంబునిండ
బనిగొనిశస్త్రాస్త్ర పఙ్క్తులు మెఱయ ♦ ఘనపిశాచానన గార్దభప్రతతి
బూనినయరదంబు బొలుపార నెక్కి ♦ నానాస్త్రశస్త్ర సన్నద్ధసైన్యములు
నడువంగనిస్సాణనాదంబు లెసఁగ ♦ నడియాలమైనతూర్యంబులు మ్రోయ
దనరినదక్షిణ ద్వారంబునందు ♦ వినుతవిక్రమశాలి వెడలె వేగమున
నప్పుడు గురిసె బైనస్థులవాన ♦ నొప్పవిడుగులు సోనలై పడియె
గొడుగులు పడగలుగూలెగూలుటయు ♦ నపరిమహాకాయుఁడవియెల్లఁగొనక
కడిమివానర సేన గదిసిదాకుటయు ♦ నుడిమిచలింప నప్పుడు వలీముఖులు
తరుశైలవితతులు తఱుచుగామీఁద ♦ గురియుచుదాకిరి క్రూరదానవుల
నప్పుడుదానవు లాసేనమీఁద ♦ నుప్పొంగిబీరంబు లొలుకుచునుండ
దడబడగా నరదంబులువరపి ♦ కడువేగమున గరిఘటలఁబొల్పి
తురగచయంబులదోలియుగ్రతను ♦ దరముగాముంచిపదాతిక్రోధియును
గరవాలములఁద్రుంచి గదలనొప్పించి ♦ సూఁటియులనాటించి శూలాలఁజించి
పరిఘలవిదళించి ప్రాసాలనొంచి ♦ శరపరంపరలేని చక్రముల్ వైచి
పట్టసంబులఁద్రుంచి పరశులనొంచి ♦ కిట్టిమా ద్దిరముల గినిసికట్టించి
మిగిలినకపులను మేటిరక్కసుల ♦ నగపాదపముల డానలముంచిరంత
నారభసంబున నవనీపరాగ ♦ మారవిమండలం బంతయుఁగప్ప
నారజఃపటలంబు సందిరువాఁగు ♦ గోరువోనొంచోరుఁ జూడఁగానరాక
తరువులుకొండలు దరుచుమ్రోయుచును ♦
దెరలఁగమీఁద నేతెంచుచక్కటికి
నురవడినేయుదు రుగ్రదానవులు ♦ శరపరంపరలాకసంబునఁగప్ప
బరఁగుచక్రంబులు పట్టసంబులును ♦ శరములుతోమరచయముప్రాసములు
పడిమ్రోయుచునుమీఁద వచ్చుచక్కటికి ♦
విడుతురుతరుశైల వితతులు గపులు
అంతఁబోవక చెవులందునుధూళి ♦ యొంతయునిండిన నిరువాగువారు
మ్రోయుచక్కటికినిమ్ములవిక్రమంబు ♦ సేయుసేర్పులుదక్కి చేష్టలుమఱచి
కపులువీరనక రాక్షసులువీరనక ♦ చపలత్వమునఁబెల్లు చంపుదురెలమి
నటుపోరఁదనువులనడరురక్తములు ♦ పటునదులై రజఃపటలంబునణఁప
దిమిరంబుఁబాసియుదీప్తశౌర్యముల ♦ నమరులువెఱగందనని సేయునపుడు

వసుదైత్యులకుఁగాక విఱిగియాకపులు ♦ కసిమిసఁగిరై కనుకనిపాఱుటయును
గనియంగదుఁడు వల్కెఁ గపివీరులార ♦ కనికని యిటుపాఱఁగా నేల నేను
గలుగంగ నని వారిఁ గ్రమ్మఱ ననికిఁ ♦ దలకొన జేసి యుత్సాహంబుతోడ

—:* రాక్షసులతో వానరులు ఘోరయుద్ధము సేయుట *:—

నొక మహా పర్వతంబును వడి నెత్తి ♦ యకలంకుఁడై రాక్షసావలిమీఁద
నడువ నాతనితోడ నలినార్చియార్చి ♦ నడచిరి వానరనాయకులేచి
యంగదుండును బేర్చి యసురులఁ గట్టి ♦ యంగంబులవియఁగ నాసేన నెల్ల
పిడచేతఁబడఁ దాచి పిడికిళ్ళఁ బొడిచి ♦ యడచి ముంజేతులు నంగములొంచి
మోచేతఁ బగులంగ మొగములఁ బొడిచి ♦ పూచిన శస్త్రాస్త్రములఁ బొడిసేయ
గఱకురాక్షసులు నంగదునకుఁ గాక ♦ విఱిగి హాహాకార వివశులై తూలి
నలుగడఁ బాఱ నున్నతశక్తి వారి ♦ వలువదో హో యని వారణ సేసి
ఖ్యాతిమించిన మహాకాయుని మంత్రు ♦ లాతతగతి రుధిరాశనుండనఁగ
బ్రావెలెడివాఁడును వజ్రనాభుండు ♦ కాలదంష్ట్రుడును గాలకల్పుఁడును
మఱి వపాశుఁడు శతమాయుండు ధూమ్రుఁ ♦
డరిమురి దుర్ధరుం డనువాఁడు గడఁగి
యట్టహాసములతో నగచరసేనఁ ♦ గిట్టి నొప్పింప వీక్షించి పృథుండు
పనసుండు మేఘపుష్పకుడు గవాక్షు ♦ డును ఋషభుడు గజుడు క్రోధనుండు
శతబలి తారుండు సబలులై వారి ♦ నతులితగతిఁ దాఁకి యని సేయునపుడు
రుధిరాశనుండంత రోషంబుతోడ ♦ నధిక బాణములు గవాక్షుపై సేయ
వేగఁ బెపర్వత వృక్షంబు లెత్తి ♦ యా గవాక్షుఁడు రుధిరాశుపై వైచె
వైచిన నడుమనె వానినన్నింటి ♦ నేచి చూర్ణములుగా నేసి గవాక్షుఁ
బడసెనే మూర్ఛచేఁ బడిన గవాక్షుఁ ♦ బొడగని తారుఁ డప్పుడు కలుషించి
ఘనమైన సాలవృక్షం బెత్తి వ్రేసె ♦ ననువొంద రుధిరాక్షు నరదంబుమీఁద
నారుధిరాశనుండమ్మహీరుహము ♦ బోరన నడుమనె పొడిపొడి చేసి
పది బాణములదారుఁ బడ నేసి మించి ♦ కదిసి చలంబునఁ గపిసేన గిట్టి
కడు నుగ్రుఁడై లయకాలంబు నాడు ♦ మిడుకలోకము లెల్ల గ్రమిఁగునంతకుని
ఆకృతిఁ గైకొని యాసేనలోన ♦ భీకరవృత్తితోఁ బేర్చుచునుండె
నప్పు శోకింత గవాక్షతారులును ♦ దెప్పరికను విచ్చి తెలియంగఁ జూచి
యంతలో గద వ్రేసె నడరి గవాక్షుఁ ♦ డంత కాకృతి రుధిరాశు మస్తకము
వ్రేసిన నసురయు వికృతాంగుఁడగుచుఁ ♦
బాసి ప్రాణములకుఁ బఱియెఁ దత్తనువు
అనివజ్రనాభుఁ డుదగ్రుఁడై పృథునిఁ ♦ గనుఁగొని పెల్లేసె ఘనసాయకముల

బృథివీరథరమువై చెపృథుడప్పుడలిగి ప్రథితంబుగా నేసె బదిప్రయ్యలుగను
పృథుఁడును రోషసంస్ఫీతుఁడై వాని ♦ రథముపై కొంతయు రయమున నరికి
విల్లుఖండములు గావించి గుఱ్ఱముల ♦ ద్రొల్లించి రథము బెట్టుగ నుగ్గుసేసి
యనయంబుఁ గోపించి యవ్వజ్రనాభు ♦ ఘనశక్తివంకేలఁ గడకాలు వట్టి
వెసఁ ద్రిప్పి నేలతో వ్రేసి రోషమున ♦ నసురుఁ బెడఁ బాపి యాపృథుం డార్చె
బరువడి ఋషభుని పైఁ గాలదంష్ట్రుఁ ♦ డురవడిఁ గొల్చె మహోద్దండదంతి
నటుమీఱి చనుదెంచు నగ్గజంబునకు ♦ నటునిటుఁ దొలఁగక యాఋషభుండు
వేగంబు మైఁబదద్వితియ మొక్కటిగ ♦ లాగించి కుంభస్థలములఁ దన్నుటయు
నుదరకరిఘీంకృతి మానక నిగుడ ♦ నదియొక్కవింటి పట్టరిగ వెన్కకును [కి
నఱీయును ఋషభుండు మానక మీఁద ♦ దరిమి యయ్యేనుఁగు దంతంబు బెఱికి
బాగొప్ప వేసి యప్పటుకరిఁ జంపి ♦ లాగున వేగంబు లావును మెఱసి
కాలదంష్ట్రుని గిట్టి కాలొగిఁ బట్టి ♦ కేళిమైఁ ధర వ్రేసి గీటడఁగించె
నసురసైన్యములు హాహారవంబంద ♦ వసమునఁ గపిసేన యార్చెనందంద
కాలకల్పుఁడు నగ్నికల్పబాణముల ♦ పాలుగావించె నప్పనసునిఁ గిట్టి
పనసుఁ డయ్యురదంబు పైకి లంఘించి ♦ మును బెట్టుగా గుఱ్ఱములఁ జదియించి
సారథిఁ బడదన్ని సత్త్వమేపార ♦ నారథంబెల్ల నుగ్గైరాలఁ గొట్టి
పిటికిటఁ గళసంధి బెట్టుగాఁ గిట్టి ♦ పొడిచెన కాలకల్పుఁడు దన్ని కొనఁగఁ [చు
బొడిచినవాడు నప్పుడు పండ్లుడుల్లి ♦ దొడదొడ నోట నెత్తురుఁ గ్రక్కుకొను
మిడుకుచు గ్రుడ్లు మిడుక ప్రాణములు ♦ విడిచె రాక్షసులెల్ల విస్మయంబంద
బలియుఁడై కపులవపాశుండు గిట్టి ♦ చలమున నేసి జర్ఝరితులఁ జేయ
వానిపైఁ బాషాణవర్షంబుఁ గురిసె ♦ జానుగాఁ గజుఁ డాకసంబెల్ల నిండ
నావపాశుఁడు వాని నన్నింటి నుమ్ముఁ ♦ గావించె దునియలు గానంపగములఁ
గావించి మఱియును గజు నురుమాడఁ ♦ బావకాభము లేడు బాణంబులేసె
నేసి వెండియుఁ గిట్టి యురువదేవింట ♦ నేసి సూతింటమే సేసెఁ దూరంగఁ
గజుఁడునై దమ్ములఁ గడు నొచ్చి వాని ♦ విజరథంబంతయు నెఱనెఱ వీఁకగ
గరుడుని విధమునఁ గడు వేగ దాఁకి ♦ కరిగోపురాగ్రముఁ గ్రక్కద్రోయు కరణి
నావపాశుని తల యట్టుకఁ గాపి ♦ పోవైచె నప్పుడు భూమిపైఁ బడఁగ [రులఁ
రోషించి యపుడు ధూమ్రముండు దుర్ధరుడు ♦ భీషణాస్త్రముల నొప్పించి వాన
దఱిమినఁ గినుకఁ గ్రోధన మేఘపుష్పు ♦ లుఱుక రథంబుల కుఱికి యుగ్రతను
గరతలంబున మస్తకంబులు చరచి ♦ దురమున గెడపి రద్భుతశక్తి మెఱసి
యటువారుహతులైన యసురుల దఱుము ♦ బటురయంబునఁ జెడి పాఱిరి భీతి

నసురులుపాఱుట యప్పుడుచూచి ♦ మసలక వడి శతమాయుండు పేర్చి
కవిసినఁ జే పరిఘంబమరించి ♦ కవిసియాతనిమీఁద. గజుఁడెదిరింపఁ
జలమొప్పఋషభుండు శతబలిపనుఁ ♦ దలుకక గవాక్షునలాంగదుల్ గూడి
కడఁగివృక్షంబులు ఘనశైలములును ♦ మడవక యాశత మాయునిపైన
శరతోమర ప్రాస చక్ర గదాది ♦ వరశస్త్రచయముల వర్షంబు గురిసి
వడిశతమాయుండు వనచరేశ్వరులఁ ♦ బెడిదంబుగా నొంచి పేర్చి పెల్లార్చి
వానిచేనటు నొచ్చి వానరాధిపులు ♦ మానక రోష సమగ్రులై కదిసి
యడరి గవాక్షుండు హయములఁ జంపెఁ ♦ గడిమి ఖండించె నంగదుఁడు పతాక
పఱియలుగాఁ ద్రొక్కెఁ బనసుండు రథము ♦
నుఱుముగా ఋషభుండు నొంచె సారథిని
నలనొప్ప నలుఁడు శస్త్రాస్త్రముల్ విఱిచెఁ ♦ జలమునఁ బిడికిట శతబలిఁ బొడిచె
బిడికిటిపోటునఁ బిమ్మటఁ గొనక ♦ దుర్ఘోషంబున గరుడుండవోలెఁ [యు
బటుఖడ్గము నుబ్బెద్దపరిగయుఁ గొనుచుఁ ♦ జటులవేగంబున శతమాయుఁ డెగ
బరవశంబున వాలు వడిఁ దున్నఁ బద్ద ♦ మఱియను గొని శతబలియుతో నెగసె
నెగసి భేరుండంబు లెదుఱెదఁ గవిసి ♦ యొగిఁ బోరు తెఱఁగున నురువడిమిగుల
ద్రేయుచు దిరుగుచు వెదప్పకొనుచు ♦ బాయుచు డాయుచు బాటవంబొప్ప
గెరలుచు దెరలుచు గ్రిందుమీఁదగుచుఁ బోరిబోరి నాకసంబునఁ బోరు తఱిని
శతమాయుఁ డడిదంబు జళిపించి పూన్చి ♦ శతబలి విపులవక్షు వ్రేయుటయును
సరభసుండై దుష్ట శతబలి బద్ద ♦ పరిదప్ప నొడ్డి కృపాణోగ్రధారఁ [డఁగ
జలమునఁ దెగవ్రేసె శతమాయు తొడలు ♦ తలక్రిందుగా వాఁడు ధరమీఁదబ
డవిసె దైత్యునితలయుఁ దండఁ జెదరె ♦ యవనిపై గిరిశృంగ మవియు చందమున
శతమాయుఁ డపుడు చచ్చినఁ దోడికపులు శతబలితోడ నచ్చట నార్చుటయు
ధరణి మిన్నును గుణధ్వనిబిటులెగయ నరదమత్యుగ్రరయంబునఁ బఱపి [ను
యంగదునపుడు మహానాదుఁ డార్చి ♦ యంగదు మేన మూఁడమ్ములు గుచ్చి

—*: మహానాదుఁ డంగదునితోఁ బోరి మడియుట :*—

మఱియును వెసనేయ మర్కటేశ్వరుఁడు ♦ పఱలుకోపంబున వానిపై గిట్టి
యోజనాయతగిరి యొకటి రథంబు ♦ పై జవంబున వైవఁ బడకుండ వాఁడు
నడుమనే గదపైచె నగ మెల్లఁ బొడిగ ♦ వడిఁ ద్రుంపఁ గోపించి వాలినందనుఁడు
అతనిరథంబునఁ గవలీలఁ దాఁటి ♦ చటులసత్త్వోన్నతిఁ జాపంబు విఱిచి
పట్టిరథంబుపైఁ బడవైచి త్రొమ్మి ♦ మెట్టి గ్రుద్దులు వడి మిలుకగోఁజఁ గను
మొడనుచ్చి త్రెంచి క్రమ్మిన నెత్తురొలుక ♦ బుడమిపై వైచె నప్పుడు వాని శిరము
తమ్ముఁడు చావ నుద్దండకోపమున ♦ నెమ్ములు వగుల నంగ నేచి యార్చుచును

బృథివీరథరమువై చె పృథుఁడప్పుడలిగి ప్రథితంబుగా నేసె బది వ్రయ్యలుగను
పృథుఁడును రోషసంస్ఫీతుఁడై వాని ♦ రథముపై కొంతయు రయమున నురికి
విల్లుఖండములుగా విరిచి గుఱ్ఱముల ♦ డొల్లించి రథము బెట్టుగ నుగ్గుసేసి
యనయంబుఁ గోపించి యవ్వజ్రనాభు ♦ ఘనశక్తి వలకేలఁ గడకాలువట్టి
వెసఁద్రిప్పి నేలతో వ్రేసి రోషమున ♦ నసురుఁ బెడఁబాపి యాపృథుండార్చె
బరువడి ఋషభుని పైఁ గాలదంష్ట్రిఁ ♦ దురవడి గొల్చె మహోద్దండదంతి
నటు మీఱి చనుదెంచు నద్గజంబునకు ♦ నటునిటుఁ దొలఁగక యాఋషభుండు
వేగంబు మైఁబదద్వితీయ మొక్కటిగ ♦ లాగించి కుంభస్థలములఁ దన్నుటయు
మదకరిఘీంకృతి మానక నిగుడ ♦ నదియొక్క వింటి పట్టరిగె వెన్కకును [కి
మఱియును ఋషభుఁడు మానక మీఁద ♦ దరిమి యయ్యేనుఁగు దంతంబు బెఱికి
బాగొప్ప వ్రేసి యప్పటు కరిఁ జంపి ♦ లాగున వేగంబు లావును మెఱసి
కాలదంష్ట్రిని గిట్టి కాలొగిఁ బట్టి ♦ కేళిమైఁ ధర వ్రేసి గీటడఁగించె
నసురసైన్యములు హాహారవంబంద ♦ వసమునఁ గపిసేన యార్చె నందంద
కాలకల్పుఁడు నగ్నికల్పబాణముల ♦ పాలుగావించె నప్పనసునిఁ గట్టి
వనసుఁడయ్యారదంబు పైకిలంఘించి ♦ మును బెట్టుగా గుఱ్ఱములఁ జదియించి
సారథిఁ బడదన్ని సత్త్వమేపార ♦ నారథంబెల్ల నుగ్గురాలఁ గొట్టి
పిటికిటగ శకంధి బెట్టుగా గిట్ట ♦ పొడిచెన కాలకల్పుఁడు దన్ని కొనఁగఁ [చు
బొడిచిన వాఁడు నప్పుడు పండ్లు డుల్లి ♦ దొడదొడ నోట నెత్తురుఁ గక్కకొను
మిడుకుచు గ్రుడ్లు మిడుక ప్రాణములు ♦ విడిచె రాక్షసులెల్ల విస్మయం బంద
బలియుఁడై శరభుల వపాశుండు గిట్టి ♦ చలమున నేసి జర్జరితులఁ జేయ
వానిపైఁ బాషాణవర్షంబుఁ గురిసె ♦ జానుగాఁ గజుఁడాకసంబెల్ల నిండ
నావపాశుఁడు వాని నన్నిఁటిని దుమ్ముఁ ♦ గావించె దునియలుగా నంపగములఁ
గావించి మఱియును గజునురుమాడఁ ♦ బావకాభము లేదు బాణంబు లేసె
నేసి వెండియుఁ గిట్టి యిరువదేవింట ♦ నేసి సూతింట మే నేసెఁ దూరంగఁ
గజుఁడునై దమ్ముఁలఁ గడు నొచ్చి వాని ♦ విజరథంబంతయు నెఱ నెఱ వీఱుగ
గరుమునివిధమునఁ గడువేగ దాఁకి ♦ కరిగోపురాగ్రముఁ గతద్రోయు శరణి
నావపాశుని తల యట్టకఁ గాపి ♦ పోవై చెనప్పుడు భూమిపైఁ బడఁగ [రులఁ
దోషించి యపుడు ధూమ్రుండు దుర్ధరుడు ♦ భీమశాస్త్రముల నొప్పించి వాన
దటిమినఁ గినుక గ్రోధన మేఘపుష్పు ♦ లఱుకరథంబుల కఠికియు గతను
గరతలంబున మస్తకంబులు చరచి ♦ దురమున గెడపి రద్భుతశక్తి మెఱసి
యటు వారు హతులైన యసురుల దఱుము ♦ బటురయంబునఁ జెడి పాఱిరిభీతి

నసురులు పాఱుట యప్పుడు చూచి ♦ మసలక వడి శతమాయుండు పేర్చి
కవిసినఁ జే పరిఘంబు మరించి ♦ కవిసి యాతని మీఁద గజుఁ డెదిరింపఁ
జలమొప్ప ఋషభుండు శతబలి పనసుఁ ♦ డలుక గవాక్షు నలాంగదుల్ గూడి
కడఁగి వృక్షంబులు ఘనశైలములును ♦ మడవక యా శతమాయుని పైన
శరతోమర ప్రాస చక్ర గదాది ♦ వర శస్త్ర చయముల వర్షంబు గురిసి
వడి శతమాయుండు వనచరేశ్వరుల ♦ బెడిదంబుగా నొంచి పేర్చి పెల్లార్చి
వాని చే నటు నొచ్చి వానరాధిపులు ♦ మానక రోష సమగ్రులై కదిసి
యడరి గవాక్షుండు హయముల జంపెఁ ♦ గడిమి ఖండించె నంగదుఁడు పతాకఁ
పతియులుగాఁ ద్రొక్కెఁ బనసుండు రథము ♦
నుఱుముగా ఋషభుండు నొంచె సారథిని
నలనొప్ప నలుఁడు శస్త్రాస్త్రముల్ విఱిచెఁ ♦ జలమునఁ బిడికిట శతబలిఁ బొడిచె
బిడికిటి పోటునఁ బిమ్మటఁ గొనక ♦ డు ఘూర్ణంబున గరుడుండ వోలెఁ [యు
బటు ఖడ్గమును బెద్దపరిగ యుఁ గొనుచుఁ ♦ జటుల వేగంబున శతమాయుఁ డెగ
బరవశంబున వాలు వడి యున్న బద్ద ♦ మఱియును గొని శతబలియుతో నెగసె
నెగసి భేరుండంబు లెపరి డఁ గవిసి ♦ యొగిఁ బోరు తెఱగున నురువడి మిగుఁ
వ్రేయుచు దిరుగుచు వెఁ దప్పుకొనుచు ♦ బాయుచు డాయుచు బాటవం బొప్ప
గెరలుచు దెరలుచు గ్రిందు మీఁదగుచుఁ బోరిబోరి నాకసంబునఁ బోరుతఱిని
శతమాయుఁ డడిదంబు జళిపించి పూన్చి ♦ శతబలి విపులవక్షంబె యుటయును
సరభసుఁడై కష్ట శతబలి బద్ద ♦ పరిదప్పనొడ్డి కృపాణోగ్ర ధారఁ [డఁగ
జలమునఁ దెగ వ్రేసె శతమాయు తొడలు ♦ తల క్రిందుగా వాఁడు ధర మీఁద బ
డవిస్రదైత్యుని తలయు దండఁ జెవరి ♦ యవని పై గిరిశృంగము విఱు చందమున
శతమాయుఁ డపుడు చచ్చిన దోడి కపులు శతబలితోడ నచ్చట నార్చుటయు
ధరణి మిన్నును గుణధ్వని బిటు లెగయ నరదమ త్యుగ్ర రయంబునఁ బఱపి [ను
యుంగదు నపుడు మహానాదుఁ డార్చి ♦ యంగదు మేన మూఁడమ్ములు గుచ్చి

—*: మహానాదుఁ డంగదునితోఁ బోరి మడియుట :*—

మఱియును వెస నేయ మర్కటేశ్వరుఁడు ♦ పఱలు కోపంబున వానిపై గిట్టి
యోజనాయత గిరి యొకటి రథంబు ♦ పై జవంబున వైవఁ బడకుండ వాఁడు
నడుమ నే గదపైచె నగ మెల్లఁ బొడిగ ♦ వడిఁ ద్రుంపఁ గోపించి వాలినందనుడు
అతని రథంబున కవలీల దాఁటి ♦ చటుల సత్త్వోన్నతిఁ జాపంబు విఱిచి
పట్టి రథంబుపైఁ బడవైచి త్రొమ్మి ♦ మెట్టి గుఱ్ఱములు వడి మిలుక గోజఁగను
మెడ నుచ్చి త్రెంచి క్రమ్మిన నెత్తురొలుక ♦ బుడమి పై వైచె నప్పుడు వాని శిరము
తమ్ముఁడు చావ నుద్దండ కోపమున ♦ నెమ్ములు వగులంగ నేచి యార్చుచును

మఱియునుగనలుచు మహనీయరథము ♦
మెఱయుచునలుగడ మెఱుఁగులువారఁ
గదలించియమ్మహా కాయుడుద్వృత్తి ♦
మదమునసింహంబు మలయుచన్దమున [నరుల
గుములుఁగ్రుచ్చినమాడ్కిఁ క్రూర బాణముల♦నెదిరిధారణిఁగూల నేసెవా
వనచరవీరులు వానికిఁగాక ♦ హనుమదాదులుపోరు నచటికిఁజనిరి
సారథిజూచి యీచక్కటిమనల ♦ వారకచుర్కొను వారలులేరు
బోరనరాముపై బోనిమ్మురథము♦నేరుపువాటిల్ల నీవన్నవాఁడు
కడఁగియుగ్యముల పగ్గములువదల్చి♦వడినదల్పగను దీవ్రంబునఁగదల
నాక్రూరతకుఁగాక నగచరుల్ పరువ♦నోకోతులార మీ కులుకనేమిటికి
శివునిచాపముఁద్రుంచి సీతఁజేకొన్న♦యనఘుపైఁగాని యాజినేవలుగ
బరశురామునిభంగపఱచినయట్టి♦నరనాయకుఁడుఁగాని నాయీడుగాఁడు
అజలోకరుని నుక్కడఁచనట్టి♦రాజుమీఁదనెకాని రాదునాయమ్మ
ధృతినమ్మితుదకబ్ధిఁదెచ్చినయట్టి♦పతితోడగాని యేబవరంబుసేయ
త్రిజగంబులందును దీపించునట్టి♦రజతాద్రియెత్తిన రావణుసుతుఁడ
దుదినింకనింద్రజిత్తునికిఁదమ్ముఁడను ♦ నిదెమహాకాయుఁడనేతెంచినాఁడ
ననుచుఁజెప్పుచురాగ నంబుదపటల ♦
మునునున్నసూర్యుండు మొనసినమాడ్కిఁ
గపిరాజతనయుఁ డంగదకుమారుండు♦కపిసేనలోనుండి కడఁగియేతెంచి
వెనుకొనికోపంబు విలసిల్లనపుడు♦ఘనమైనకడిమితోఁ గలుషించిపలికె
నోరిమహాకాయ యుడుగకరజ్జు♦లీరణస్థలమున నేలప్రేలెదవు
మీతండ్రిగిరియెత్తిమెఱసెమాతండ్రి♦మీతండ్రిదోకనిమ్మోయి గట్టియెత్తె
నీకునాకునుదగు నిష్ఠురరణము♦ కాకుత్థ్సనిధియేల కపిముఖ్యులేల [ములఁ
యనిమ్రాఁకుగొనిమీఁద నడరింపనతని♦తనువునిండగగప్పె దారుణాస్త్ర
గదిసివెండియు మహాకాయుఁడంగదుని ♦
గదగొనివ్రేసె నుత్కటకోపుఁడగుచు
వ్రేసినవెంతయు వివశుఁడై పడియె♦ వాసమయంబున నతఁడుమూర్ఛిల్లి
కుతలంబుపగుల నెక్కొనిదైత్యులార్చి♦రతఁడుమూర్ఛిల్లిననగచరపతుల
కవిసియందఱు మహాకాయుపైఁగవిసి♦శిలలుభూజంబులుఁ జెచ్చెఱవైవ
నవియెల్లదనదు బాణావలిచేత♦నవలీలఁదునిమి గవాక్షునింబదిటఁ
బృథునినైదిటనూటఁబృథుసత్త్వగజుని♦బ్రధితంబుగాశతబలిముప్పదింట
నెనుబదియమ్ముల ఋషభునిఁగినుకబనసు♦నిదెబ్బది పటుసాయకముల

మెఱసి క్రోధనుని నమ్మేఘపుష్పకుని♦నఱువదింటను నూట నదరంట నేసె
నిటు వానరుల నతఁ డేపడఁగింప♦నటు మూర్ఛనొందిన యంగదుఁ డపుడు
దెలిసి మోమున గ్రమ్ము దెంచు రక్తములఁ♦
బలుమఱుఁ గరములఁ బాయఁ ద్రోయుచును
నదరుచు నప్పుడ రోషమయుండై న♦గదయెత్తికొని మహాకాయుని రథము
పయికి లంఘించి యుద్భటశక్తితోడ♦జయశీలుఁడై వాని సారథిఁ జంపి
వెనవిల్లుఁ బెల్లున విఱుగంగఁ గొట్టి♦ యసమున హయముల నన్నిటిఁ గూల్చి
తల వ్రేసె వ్రేసిన దైత్యపుంగవుని♦తలబొమలికెయూడి ధరణిపైఁ బడఁగ
నామహాకాయుండు నదరంబు డిగ్గి♦భీమగదాదండ భీషణుండగుచు
నంగదు నంగంబు నదరంట వ్రేసె♦నంగదుండును వ్రేయ నతఁడు దర్పించి
యంగదు మస్తకం బలుకతో మరియుఁ♦ బొంగి గదాదండమున వ్రేసి డాసె
నాఘాతమున నెత్తు రడరిన నైన♦ రాఘవుబంటు శౌర్యంబింత చేడక మెఱసి
గదఁ బుచ్చుకొని మహాకాయుని వ్రేసె♦నుదురు భగ్నముఁగాఁగ నురుశక్తి
నెదిరిన తనతండ్రి యీతని తండ్రి♦విదితంబుగాఁ బట్టి వేమాఱుఁ దొల్లి
మున్నీటిలోపల ముంచుటఁ దలఁచి♦మున్నటి పగకునై ముంచెనో యనఁగ
నసమేదిదనుజుఁడా యంగదుఁ బట్టి♦ వెసఁ బేర్చి నెత్తురు వెల్లున ముంచె
ముంచ రావణుఁ బట్టి మున్నబ్ధి వాలి♦ముంచిన గతి వాని ముంచె రక్తమున
నిటు మహాకాయుండు నింద్రుమన్మఁడును ♦
పటుగతిఁ బోరుచోఁ బరఁగు రక్తముల
జేగురుటేరులఁ జెలునైన గిరుల♦బాగున నెంతయు భాస్వరులైరి
గదయును గదయు నుగ్రంబుగాఁ దాఁకి♦చిదురుపలుగుటయుఁ జెచ్చెఱ వారు
బలుఁడును నిర్జరపతియును దొల్లిఁ♦గలసి పెనంగిన కైవడిఁ దోఁపఁ

—:* మహాకాయు డఙ్గదునితో మల్లయుద్ధము సేసి మడియుట *:—

బహుధూళి యుద్దరి పదహతి నెగయఁ♦దలపడి మల్లయుద్ధము సేయుచోటఁ
జతురతమై వనచరవీరుఁ డీతఁ డితడు రాక్షసుఁడని యెఱుఁగంగ రాక
కీలుబొమ్మలు పోరు క్రియలు నుదోఁప వాలిసుగ్రీవుల వడువునఁ బోర
నాడటఁ గపులెల్ల నంగదుఁ జూచి♦యీదుష్టరాక్షసు నేలపాలార్చ
వాలినందనుఁడవు వాలికై వడిని♦వఱలిన వాఁడవు వరభుజశక్తి
వాలిదుందుభియును వడిఁ బోరుచోట♦వాలి దుందుభి నింత వడనిల్వనీఁడు
వేవేగ చంపు నిలింపకంటకుని ♦ నీవిక్రమంబున నిపుణత మెఱసి
యనిజయశబ్దంబు లడరింప నతఁడు♦దనుజుని తలముష్టిఁ దాటించి బెట్టు
పిడికిటఁ దాచిన బెట్టుగా విరిగి ♦ పడియున దైత్యుండు బలమరి నేలఁ

బడియున్న రాక్షస పతిఁబొమ్ము ద్రొక్కి ♦ మెడనుల్చి తలఁ ద్రెన్చి మీఁదికి వైచి
యంగదుండార్చె నయ్యంగదుఁ జూచి ♦ యగ్గదు నార్చి రయ్యగచరాధిపులు
విచ్చి దానవులును వెసనేగి లంకఁ ♦ జొచ్చియు వారిఁ జొచ్చియు నాల్గు
దెసలకును జికియు దీనతనొంద ♦ నసమున నుతియించి రంగదుఁ గపులు
నుతియించి సీతామనోనాథుకడకు ♦ నతని దోడ్కొనిచని యత్తెఱంగెల్ల
వినిపింప రఘుపతి విని సంతసమున ♦ ఘనముగా నుప్పొంగి కౌఁగిటఁ జేర్చి
కరుణాకటాక్ష మంగదు మీఁద నునిచి ♦ సరసంపు మందహాసంబున నొప్పె
హతశేషులగు రాక్షసావళి చెప్ప ♦ గతపడ్జ యమ్మహాకాయుని దలఁచి
విన్ననై తలవంచి వెఱఁగందికుంది ♦ కన్నీరు నించి రాక్షసకులేశ్వరుఁడు
అంతఃపురంబున కరిగి యారాత్రి ♦ జింతించుచును నిద్రఁ జెందక యుండి
మఱునాఁటి రేపు సామంతులు గొలువ ♦ మెఱుఁగారు నరదంబు మీఁదికి వచ్చి
యరిగి పెంపారిన యాశ్వారి నెక్కి ♦ పరపైన తనకోటఁ బరికించి గాంచి
చూచి పాళెంబులు శోధించి మీఁది ♦ నేచిన బలు గాపు లిడ బంచి యపుడు
ఆరావణుండు ప్రహస్తుతో ననియెఁ ♦ బేరెక్కి యెందు నభేద్యమిక్కోట
యెట్టి శాత్రవులకు నెన్నఁడు డాయు ♦ నట్టిదిగాదిప్పు డగచర ప్రతతి
వచ్చి భేదించి దుర్వారమైయునికి ♦ యచ్చేరువైనది యదియునుంగాక
శ్రీరాము భుజబల శ్రీయెల్లచోట ♦ నారూఢతరము ప్రహస్త కావునను
నీవొండె యటుఁగాక నేనొండె రణముఁ ♦ గావింప నాకుంభకర్ణుండు నొండె
తగువారమిందు నిద్రాసక్తి తనకు ♦ మిగిలి నాతమ్ముఁడు మేల్కొనఁడయ్యె
బోయెదవో యేను బోదునో యనుడు ♦ నాయసురేంద్రునకతఁ డిట్టులనియె
బోయెదనని దనాదు భుజబలంబెల్ల ♦ నాయమరులు మెచ్చ నరులఁ ద్రుంచెదను
డాసి భూతప్రేత డాకినీగణము ♦ లాసవంబున నెత్తు రాని మోదింప
నటుచూడు మాజిఁ బ్రహస్తుండు కపుల ♦ నిటుసేయు సేయన నెంత బేర్చెదను
పోరికి జనుమన్న బుద్ధులు సెప్ప ♦ నారయ శాడిగాదైసను వినుము
దనుజేశ యొకమాట తగదనకింక ♦ వినువినకుండు వివేకించి చూడు
దానికిఁ గాదన దనుజేశ యన్న మానైన బుద్ధులు మంత్రులు సెప్ప
వినవయితివిఁక నైన వినుసీత రాము ♦ జననాథునకు నిమ్ము సమరంబు వలదు
అనుచు రావణునిఁ బ్రహస్తుండు వీడు ♦ కొనివచ్చి తాఁదన కోలలవారి మాఁన
బనిచి యప్పుడు నాల్గు బలములవారి ♦ దనుగూర్చుగొని మహోద్దండ భావ
ఘనమైన కపివరాంగంబుల గాలి ♦ తనమీఁద వీచు నంతకు మ్రోయుచున్న
గొమరున జలద నిర్ఘోషంబు దాని ♦ నమరంగ విహగేంద్రు లనఁగ బెల్లగసి
తక్కక ద్రుంచు నంతకుఁ గ్రాలుచున్న ♦ చక్కని యురగ ధ్వజస్ఫూర్తి దాని

మణిగణకింకిణీ మహనీయభూరి♦రణనంబుఁగలిగిన రథమప్పుడెక్కి
కెక్కుతూర్యముల గంభీరరావములఁ♦దిక్కులుఘూర్ణిల్ల దివియొడ్డగిల్లఁ
జుక్కలుడుల్ల వసుంధరయెల్ల♦వ్రక్కలువాఱఁ బూర్వద్వారమునను
గాలాంతకునిఁబోలి కడగియిబ్బంగి♦నాదంబు సేయ బ్రహస్తుండు వెడలె
నప్పుడాదైత్యులయార్పులునతసి♦రొప్పార బేర్చిన యుగ్రమూర్తియును
నక్కజంబగుటయు నావిభీషణుని♦కక్కడఁజూపి రామావనీశ్వరుఁడు
తేజంబుబలమును దీప్తిశౌర్యమును♦రాజిల్లుచున్న యీరాక్షసవరుని
పేరేమిసాహసస్ఫీతుఁడై కపుల♦పై రాకఁజెప్పజూపఁగ జోద్యమయ్యె
ననుటయువిభీషణుం డర్కవంశుంక♦ననియె దేవాయితం డారావణునకు
గలిగిన సైన్యసంఘములకునెల్ల♦దళవాయియీతని దళములలోన
మూడవపాలిటు మూడులోకముల♦వాడిపేరుండు రావణుమాతులుండు
ఖండే దుష్కరు చెలికానిపామంతు♦ఖండనంబునమాణి భద్రునినోర్చె
తపనకులేశ యీదైత్యునితోడ♦గపినాథులకులెస్స కయ్యంబుగలుగు
నని చెప్పుచుండంగ నగచరులెల్ల♦దనుజులకెదురుగా దరుగిరులెత్తి
యార్చుచువచ్చిన యసురసైన్యముల♦
నార్చుచుమార్కొని యనిసేయునపుడు
ప్రళయకాలాగ్నికి బాడబాగ్నికిని♦గలుషతఁదేఁ బోయఁ గలుగదుగాని
పోడిమిగామిన్ను భువియునొండొండ♦నోడకఁ తాఁకుట యును లేదుగాని
మొనసియాబ్రహ్మాండములుదమలోన♦ఘనముగాఁదాఁకుటగలుగదుగాని

—:* ప్రహస్తుని యుద్ధము *:—

గలగినవిబ్బంగిఁ గపిదైత్యనాథు♦లులుకకపోరుట యుపమింపవచ్చుఁ
పావకనిభబాణపఙ్క్తులదైత్యు♦లావనచరులపై నార్చుచువైవ
నందువెండియుఁగొందఱసిగదాప్రాస♦సందీప్తముసలోగ్రచక్రముల్వైవ
దరుచరబలములు దరులనుగిరులు♦మరలదైత్యులమీఁద నురువడివైవ
ధరమీఁదడొల్లెడితలలునువ్రయ్యు♦నురములునురుమైనయురుకంధరములు
దొరిగెడిప్రేవులు దునియువాలములు♦
మురిసినయమ్ములు ముంచురక్తములు
చెదరినమెదడు విచ్ఛిన్నంబులయిన♦పదములుమిట్టెడు బాహుదండములు
ముడిగిరుద్దలభంగి మురియుపీనుఁగులు♦
నడుములుదెగియున్న బద్దేహములును
ప్రదెళ్ళెడి మేనులుఁదిరిగెడిగ్రుడ్డు♦పెల్లుగానెంతయు భీకరంబగుచుఁ
దలఁకక సంగరస్థమునఁబోరి♦కలగొనఁబడినరాక్షసులుమగపులుఁ

గలగియంతటబోక గలుషించిమించి ♦ చలమగ్గలించి యుత్సాహంబు బెంచి
బెడిదంబుగా దైత్య బృందంబుమీఁద ♦
నడచియార్చుచుఁ గపినాయకోత్తములు
ద్వివిదుండు వైచెఁ బృథ్వీధరశిఖర ♦ మవిరళశక్తి నరాంతకుమీఁద
నకలంకుఁడై కుంభహనుఁ బడవైచె ♦ నొకవటంబునఁ దారుఁ డుగ్ర వేగమున
వడిఁ బెద్దగిరి జాంబవంతుఁ డుగ్రతను ♦ నడరి చిమించె మహానాభుమీఁద
భూరిభూజంబునఁ బొరిగోలనేసె ♦ ఘోరంబుగా దుర్ముఖుఁడు సమున్నతిని
వానరనాథుల వాటులచేత ♦ దానవుల్నలుగురు ధరణిఁ ద్రెళ్లుటయుఁ
దనప్రధానులచావుఁ దప్పకచూచి ♦ యనయంబుగలిగి ప్రహస్తుఁడు కపుల
నొకటబదుండ్రను నొకటనేబండ్ర ♦ నొకటదార్వుర నొకటనూర్వురను
రథచిత్రగతులొప్ప రయమునఁ బేర్చిఁ బృథివిపైఁ గూల్చినఁ బేర్చి వానరుల
ద్రుమశైలములఁ బ్రహస్తుని సేన లెల్ల ♦ జమరినగతినుండఁ జంపిరి కడఁగి
యప్పుడు వెల్లువ లయి పాఱఁజొచ్చె ♦ జొప్పడ మిన్నంటి శోణితనదులు
అందులోపలనుండి యసురులుఁ గపులు ♦ నందందననిసేసి రార్చుచు దేర్చి
యాయగ్గలికఁ జూచి యఖిల దేవతలు ♦ వేయువిధంబుల వినుతించిరంత
నాప్రహస్తుండు కాలాంతకాకారుఁ ♦ డై ప్రతిలేక సొంపారియావేళఁ
గరములుపదములు ఖండించివైచి ♦ యురములునుదురులు నుచ్చిపోనేసి
తలలునుభుజములు ధరమీఁదఁ గూల్చి ♦
తలఁగ నెమ్ములును దంతంబులురాల్చి [-చించి
మురియలుగా జక్రములఁ ద్రుంచిత్రుంచి ♦ పొరిఁబొరి నంకుశంబులఁ జించి
కడునుగ్రమగు పరిఘులఁ గొట్టికొట్టి ♦ ముడిచడ ఘనపాశములఁ గట్టికట్టి
లలిమీఱఁ బరశువులను వ్రచ్చివ్రచ్చి ♦
పోలుపారబలుశూలములఁ గ్రుచ్చిగ్రుచ్చి
మునుమిడిపట్టసంబులఁ జిమ్మిచిమ్మి ♦ గొనకొన్న కడిమిశక్తులఁ గ్రుమ్మిక్రుమ్మి
పలలంబు మెదడుఁ గుప్పలుచేసిచేసి ♦ సాలవక యంపరాసులు నోసిపోసి
పటుభూతకోటికి బలియిచ్చియిచ్చి ♦ పటపటదిక్కులు పగులనార్చుచును
సమరవిక్రమకళా సంరంభమొప్పఁగ ♦ నమితుఁడై మెఱసి ప్రహస్తుఁ డేపొంద
నాకపిసైన్యంబు లడఁగుటఁ జూచి ♦ భూకంపముగ మహోద్ధతవృత్తినడఁచె
బెరిఁగి యుద్భటరణా భీలుఁ డన్నీలుఁ ♦ డురుతరహుంకార హుంకారుఁడగుచు
ధీరుఁడై యపుడు ధాత్రీజంబుఁ బెఱికి ♦ యారాక్షసుని తేరి కఱ లీలదాఁటి
యరమిసారథినొంచి హయములఁ గూల్చిఁ ♦
యురక యవ్విల్లు మహోగ్రత విఱువ

ముసలంబు గొనియార్చి ముదమొప్ప నప్పు ♦
డసమునరథము ప్రహస్తుండుడిగ్గి
నీలునిముందట నిలిచె నెదిర్చి ♦ నీలుండు నెదిరించె నిర్జింతుననుచు
నొండొరు గెల్చు నుద్యోగంబులందు ♦ గండుమీఱిన వృత్రకౌశికులనగ
నలుక నీలుని ఫాల మడిచె వీక్షించి ♦ లలి ప్రహస్తుఁడు ముసలంబునఁ బగుల
నడఁచిన నందంద నడరు నెత్తురులు ♦ దుడిచికొంచును ప్రహస్తుని బెట్టుగిట్టి
వ్రేసె నన్నీలుఁడు వృక్షంబుఁ ద్రిప్పి ♦ వ్రేసిన ముసలాన వ్రేసె నయ్యసుర
వ్రేసిన సోలియు వృక్షంబు విడిచి ♦ యాసమయంబున నందందఁ గదిసి
యార్చుచు నతఁడు ప్రహస్తు మస్తకముఁ ♦
బేర్చి వ్రయ్యఁగ వైచెఁ బెనుగిరి యెత్తి
యానీలు వ్రేటున నా ప్రహస్తుండు ♦ మేనును శిరమును మెయిభూషణములు
చదరి వ్రత్తారిచ్చెఁ జెలువెల్లఁ బొలిసి ♦
కుదిరి ధారణిఁ గూలు కొండచందమున
బడుటయు నాకపి [illegible] మెల్ల నార్చెఁ ♦ జెడిపారి లంకఁ జొచ్చిరి దైత్యులపుడు
సురుచిరామృత వార్ధిసుతయును బోలె ♦ హారియుక్తమైన నిజాంగంబు గలిగి
చారువసంత మాసంబును బోలె ♦ నారక్తపుల్ల పలాశాళిఁ గలిగి
వరదానశీలు నివాసంబుఁ బోలెఁ ♦ గరమొప్ప నధికమార్గణ కోటిఁ గలిగి
దీపించు నేరేడు సీవియుపోలె ♦ రూపింప నవఖండరూపంబుఁ గలిగి
వలచినపతి యొద్ది వనితయుఁ బోలె ♦ సలలితరాగ రసంబును గలిగి
కడిఁదియై చొరరాని కానయుఁ బోలెఁ ♦ గడు నొప్పు పుండరీకంబులు గలిగి
సడలని మృడు నివాసంబును బోలె ♦ గడగి యాడెడు భూత గణములఁ గలిగి
కమలాప్తరుచి నొప్పు గగనంబు పోలెఁ ♦ గ్రమముఁ దప్పిన తారకంబులు గలిగి
నరభసంబైన వేసవియును బోలె ♦ సురుచిరాంబర మణిస్ఫురణంబుఁ గలిగి
కలిసిన శివుఁడును గౌరియుఁ బోలెఁ ♦ దలపోయఁగా నర్ధతనువులు గలిగి
పెక్కుచందంబులఁ బెంపుసొంపడరి ♦ యక్కజంబయ్యె రణావనిస్థలము
అంతనీలుఁడు రాఘవాధీశుకడకు ♦ నెంతయు వేసఁజని యెరఁగె నంఘ్రులకు
బొగడొందఁ గపులెల్లఁ బొగడిరి నీలుఁ ♦ దెగసి రాక్షసులు భీతిలి పాఱి చెప్ప
విని రావణుఁడు శోకవివశుఁడై మంత్రి ♦ జనులతో నసియెను కలఁగ్గలించి
యేవీరులరిగిన నిట రాక లేక ♦ యా వానరులచేత నకట బ్రమగ్గెదరు
వైరులవలని గర్వంబడంగింప ♦ నేరూపమున నైన నేనెపోయెదను
అని పేర్చి కసలుచో నామాటలెల్ల ♦ విని యమందోదరి వెసమాల్యవంతు
కరముచేపట్టి డగ్గరి దైత్యవనిత ♦ లిరు దెసఁ గొలువంగ నెంతయు వేడ్క

నతికాయుఁడును మదోడ నరుగుదేరంగ ♦ ప్రతిహారులురుపడి బలసి యేతేర
నాయుధహస్తు లంతంతటఁ గొలువఁ ♦ ఛాయకచామర ప్రతతులు వీవ
సకలభూషణమణి జాలంబు వెలుఁగ ♦
సకలమంత్రులుతోడ చనుదెంచుచుండఁ [లము
గడు నొప్పు నీలమేఘముఁ జొచ్చు మెఱుపు ♦ వడఁ పునఁ జొచ్చె రావణసభాస్థ
అనతినవ్వా డర్ధాసనాసీనఁ ♦ జేసి రావణుఁడు విశేషప్రియోక్తి
నుచితపీఠంబున నుండంగఁ బనిచె ♦ నచలితమతులగు నమ్మంత్రివరుల
ప్రముఖ్యనయతికాయ మోహాంబుతోడఁ ♦
దక్కఁ గరుణించె నొద్దనగద్దెమీఁద
నంతనక్కలు వెల్ల నతబలంబడుగ ♦ నింతితో నద్దాన వేశ్వరుండని యెఁ
గొలువులోపల కిట్లు కువలయనేత్ర ♦ తలఁప నెన్నఁడు రాని దానవనీవు
నడవడివడఁకుచు వచ్చుటెల్లఁ ♦ గడుచోద్యమైనది కారణంబేమి

—:* మందోదరి రావణునితో శ్రీరాములపరాక్రమము దెలుపుట *:—

యనిన మందోదరి యాత్మేశుఁ జూచి ♦ దనుజేశ నాథరా దరవాయిగాన
వచ్చితినేఁడు నావచ్చుటకెల్ల ♦ నిచ్చలోపలఁ గడు నెగ్గుసేయకుము
అనిలోన ధూమ్రాక్షుఁ డాదిగాఁ గలుగు ♦
మనవారు దనుజేశ మడియుటకంటె
యులజనస్థానంబు నందు రాక్షసుల ♦ నలిఁదునుమాడెఁ బద్నాలుగువేల
సరిఖరత్రిశిరులఁ జంపినవాఁడు ♦ నరుఁడుగాఁడంతే నానరనాథు రాముఁ
డలిగి వెండియు దండకారణ్యమందు ♦ బలవంతుఁడైన కబంధు నిర్జించె
మారీచుఁడును మాడె మాయఁబోసీక ♦
ఘోరాస్త్రమున వాలి గూలంగ నేసె
దేవహితార్థమై తివిరి రాఘవుఁడు ♦ భూవలయంబునఁ బుట్టినవాఁడు
ఆదినారాయణుం డతఁడుగాఁ జేని ♦ మేదిని నింతటి మిక్కిలి నరుఁడు
కలుగునే మతి కటకంతుని చాప ♦ మఁ కొప్పసి టెంచె ప్రఖ్యాతంబుగాఁగ
దమతండ్రిపనుపునఁ దపసియై సత్య ♦ సమయంబుతో వనస్థలి నుండనతని
సీతఁ దెచ్చితి వీవు శ్రీరామచంద్రుఁ ♦ డేతెఱంగున నీకు నెగ్గమి చేసె
రామలక్ష్మణులతో రణమొనరింప ♦ నీమూఁడుజగముల నెవ్వరుగలరు
నతిసామభేద దానంబులు సూప ♦ గలిగిన దండంబు గాదు పాటింప
దండంబుఁ బాటింప దలఁచెద వేని ♦ ఖండింపఁబడుదురే దశరథాత్మజులు
దేవరాముఁడు పరదేవతగాన ♦ నీవు ప్రమొక్కుట యెల్ల నిందగాఁ దెందు
శరణన్నఁ జేకొను శరణన్న నీకు ♦ నురుశుభంబగుఁ గాని యొకకీడు రాదు

గుణరూపదాక్షిణ్య గుణగణకేళి ♦ గణుతింపనలవియె కాకుత్స్థరాముఁ
డలిగినలిలువ రింద్రాదిదేవతలు ♦ దలఁపవయ్యేదునీకుఁ దరముగాదెందు
వలదువృథాగర్వ వహ్నిఁగూలకుము ♦
చలమొప్ప నొప్పదు సంతాప ముడుగ
నింకనైననుసీత నిచ్చుటమేలు ♦ లంకేశకులమును లంకయునిలుపు
మహనీయవాహన మణిభూషణాది ♦ సహితంబుగానీవు జానకినిచ్చి
యూపాత్తునతికాయునొగిమాల్యవంతు♦ భూపాలుపాలుకిఁబుచ్చుసంధికిని
మతిమంతుఁడగుచున్న మనవిభీషణుఁడు ♦
హితబుద్ధిఁ గావించు నీసంధిమనకు
వేయునేటికి కార్తవీర్యుతోసంధి ♦ నేయవేయతనిగెల్చిన భృగురాము
గెలిచినరాముఁడు కీర్తిధాముండు ♦ తలపోయసంధికి దగఁడెచర్చింప
ననిదైన్యపాటుతో నాడువాక్యములు ♦
వినిరావణుఁడు కడువేఁడియూర్పడరఁ
గలయంగనెఱ్ఱని కన్నులఁగోప ♦ మొలుకుచునుండ మందోదరిఁజూచి
హితమతివైనాకు నిన్నియుఁజెప్పి ♦ తతివనీమాటల యందొక్కటైన
మనసునఁబట్టదు మగఁటిమికలిమి♦ఘనుఁడనై మూఁడులోకంబులుగెలిచి
దానవయక్ష గంధర్వదేవాదు ♦ లైనను వెట్టిసేయఁగనున్ననన్నుఁ
దుదిఁబోయియింక గోఁతులమర్గుసొచ్చి♦
బ్రతికెడి వరునకుఁ బ్రణమిల్లు మనుచు
నిదియేమిమాటగా నీసభనాడి ♦ తిదినీకుఁ బాడియె యిక్ష్వాకుకులుఁడు
ఎఱిఁగియెఱింగి మున్నగ్గొనరించె ♦ మఱికదా తెచ్చితి మనుజేశుదే
జడమతినతనితో సంధిచేసినను గడఁగిఖరాదులఁ గడతేర్చినట్టి
బగయునీమఱఁదలి బన్నంబునట్టి ♦ పగిదినీగఁగను జొప్పడునటుగాన
భీమబాణముల విభీషణునినజు ♦ రామలక్ష్మణుల మర్కటములద్రుంచి
గెలుతునవశ్యంబు గెలుదులేదేని ♦చలమొప్పదురమున సమయుదుగాని
మానవేశ్వరుతోడ మఱిసేయసంధి ♦ జానకినీను నిశ్చయమిట్టిదతివ
యాయింద్రజిత్తుండుదాత్తవిక్రముఁడు♦నీయగ్రసుతుఁడుండ నీకేలవెఱపు
నాకెదురెవ్వరు నాతనూభవులు ♦ భీకరాకారు లభేద్యవిక్రములు
అనవినిచింతించి యవనతయగుచుఁ♦జనియెమందోదరి సభనేఁబాసి
నీచైనయట్టి దుర్నీతిచేబట్టి ♦ యేచందమునఁదన్ను నెఱుఁగునేయనుచు
రమణీయతరమైన రావణులక్ష్మి ♦ క్రమమేది దనియెడి కైవడిఁదోఁ
నారావణుండు నప్పుడుగడఁగి ♦ వారకతనపగవాండ్రకునని యోఁ

చిరకాలమేను నాచిత్తంబులోన ♦ దొరకొన్నయలుకఁ దుదిసేయువాఁడు
నాతనిపాలికే నల్లరుద్రుఁడ ♦ నాతఁడునాపాలి కంధకాసురుఁడు
మునుకొనితూణీరముల వెలువడుచుఁ ♦ దనరారునాయంపతండంబుఁజూడ
కుబుసంబులూడ్చిన క్రూరసర్పముల ♦
నుపమింపఁదగువృత్తై యొడియు రాఘవునిఁ
గాలంబుప్రేరేపఁ గపిసేనసమ్మో ♦ ద్రాలుగర్వంబున వచ్చియున్నాఁడు
ధరుదివ్యశస్త్రాస్త్రయుక్తంబుగాఁగ ♦ సరదంబుదెండు కయ్యంబునకనుచు
వాతునర్కప్రభావర రథంబప్పు ♦ డారూఢగతిఁబన్ని యర్థిఁదెచ్చుటయు

—:* రావణుఁడు యుద్ధమునకు వచ్చుట *:—

దొలఁగకతనదెన దుర్మనోరథము ♦ నెలమినెక్కినక్రియ నెక్కె రావణుఁడు
దిక్కులమింటను దీప్తిజాలంబు ♦ లక్కజంబై యొప్ప నరదంబుమీఁద
మెఱసినతొడవులమీఁటుట్లుగొఱచుఁ ♦ దెఱఁగొప్పనప్పుడద్దేవారియొప్పె
నారామబాణానలార్చులచేత ♦ నారథంబును దాను నవిఁగూలుకరణిఁ
బటుతరనిస్సాణ భాంకారములును ♦ బటహభేరీశంఖ భయదరావములు
హాస్తిబృంహితములు నశ్వఘోషములు ♦ ప్రస్తుతిపాఠక ప్రకరరావములు
నరదాలమ్రోతయు నార్పులరవము ♦ ధరణిఁగ్రాలెడు పదతాడనధ్వనులు
నవిరియొండొండ బ్రహ్మాండంబునిండి ♦ కడుభీకరంబులై కలయంగఁబర్వె
లలిసముద్రమునకు నలుగుచందమున ♦ నలిగెనిందును రాఘవాధీశుడనఁగ
మునుకొని లంకాపురములోన ♦ తనువేదిజీవంబు లఱచుచందమున
గొనివచ్చితిమిదైత్యకోటి శ్రీరామ ♦ కొనుమనియొప్పింపఁ గొంపోవుకరణి
భీమరథంబులు పేర్చియుండంగ ♦ రామచంద్రుని మనోరథములై నడిచె
రాముశిలీముఖ రాజిమైనాటి ♦ యీమదంబుడిపెడి ని తలోపలనె
ద్రాగుదమిమ్మద ధారలన్నాడ్కి ♦ మాఁగియాడెడి శిలీముఖములతోడఁ
గరములుకడుభయంకరములై రాము ♦ శరముల కెందుదుష్కరములుగాక
కరమొప్పఁగాసముత్కటములై యపుడు కరికోట్లు వసుమతిఁ గంపింపనడిచె
వలనెల్లఁదప్పి రావణునకురణము ♦ వలనజయంబు మావలననెక్కడిది
వలసేదికూలు రావణుఁడనుమాడ్కి ♦
వలనొప్ప హయములు ద్రాలుచు నడిచె
వ్రాలిన రాఘవేశ్వరుని బాణాగ్ని ♦ గ్రాలుబలంబెల్లఁ గాలుబలంబు
అనినచందంబున నార్చుచునడిచె ♦ ఘనతరంబై సట్టె కాలుబలంబు
కాలమేఘంబుల కరణినొప్పగుచు ♦ శైలంబులోయనఁ జెటురతమెఱసి
ప్రళయకాలమునాఁటి భానుబింబముల ♦ కొలఁదిమీఱినమిడిగ్రుడ్డులతోడఁ

కటములు నుదురులు ఘనదంష్ట్రములును ♦
బటుకేశచయము నొప్పగఁ జూడ నపుడు [మొఱయ
ప్రళయకాలునికైన భయముఁ బుట్టించు ♦ చలమును వికృత వేషములును
బెక్కాయుధంబులుఁ బెక్కు మాయలును ♦ బెక్కు తేజంబుల పెక్కువ గలిగి
యేమేమె రాము జయించెద మాజి ♦ నేమే మొఱుని యాస మెక్కినవారు
రాక్షసవీరులు రాక్షసాధిపులు ♦ రాక్షసేశ్వరునితో రణకాసలిచ్చి
పరగంగ నార్చుచుఁ బటునినాదములు ♦
నురువడి మ్రోయుచు నురుబలోన్నతిని
నడువంగ నప్పు డున్నతశక్తి మొఱసి ♦ నడనడవడఁకి వానరులెల్లఁ గలఁగ
నినవంశునకుఁ ద్రోవ యిచ్చుటకలిగి ♦ వననిధి నింకింప వడి నేగు కరణి
నినుఁడనీతనయుండు సీరాముఁ గూడె ♦
ననియుర్కుఁ గబళింప నరిగెడు మాడ్కిఁ
దనయుర వడి సముద్రంబులు గలఁగఁ ♦ దన ప్రతాపంబునఁ దపనుండు మాయ
దెగువ యెల్లను ముఖదీప్తులఁ ద్రోప ♦ మగఁటిమి జయలక్ష్మి మఱిపొందు పాయ
నారవంబునఁ దాను నాజికి వెడలె ♦ నా రావణుం డట్టహాసంబు చెలఁగఁ
బెక్కాయుధంబులఁ జెన్నుదీధితులు ♦ మిక్కిలి కన్నులు మిఱుమిట్లు గొలుప
పంబి వాయువుల చేఁ బడగలు పెక్కు ♦ యంబులు మిన్నందియుందంద్రగాల
ఘనతర భీషణాకారంబుతోడ ♦ ననయంబు నందంద నార్చుచు రాము
బాణానలంబునఁ గాల్పఁ దనున్న ♦ ప్రాణంబులను దృణప్రాయంబు చేసి
వారణ లేక యిటు వచ్చుచున్న ♦ దారుణాసురసీమఁ దప్పక చూచి
రావణానుజుతోడ రఘురాముఁ డనియె ♦ నిచ్చుచున్న వాఁ డెవ్వఁడో వీఁడు
మిక్కిలి సత్త్వసమేతుఁడై కడిమి ♦ పెక్కువ లింతయుఁ బేర్చినవాఁడు
అనిన విభీషణుం డా రాముఁ జూచి ♦ దనుజనాయకుల నంతటి వేఱు వేఱ
వినుము శ్రీరఘురామ విన్నవించెదను ♦ దనరంగ నని వారిఁ దగఁ జెప్పఁ దొడఁగె
వాఁడె సింధురగంధవారణేంద్రంబు ♦ వాఁడిమి నెక్కి యుజ్జ్వలుఁడైన వాఁడు
ఉదయార్కబింబ సముజ్జ్వరాస్యమున ♦
నొదవిన ఘనరోష మొప్పినవాఁడు
పోరఁ బోరి నంకుశంబున నియమించి ♦ కరిఘటాళి సేయింపఁ గడఁగెడువాఁడు
ఉరువడిఁ జనుదెంచుచున్నట్టివీరు ♦
దురుబలాఢ్యుని గంటె యూపాక్షుఁ డతఁడు
కడు నొప్పు భీకర ఘంటారవంబు ♦ లడరిన రథమెక్కి యావచ్చువాఁడు
పోరులఁ బెక్కండ్రఁ బోరిగొన్నవాఁడు ♦ ధారుణీశ్వర మహోదరుఁడను వాఁడు

భరితరత్నప్రభా పటలంబుతోడఁ ♦ బరువైనయరుణంపుఁ బక్కెరవెట్టి
గరుడవేగంబున ఘనమైనయట్టి ♦ తురగంబు నెక్కి యుద్ధురవృత్తితోడఁ
జనుదెంచువాఁడ పిశాచనాథుండు ♦ ననికిసీతని కెదు రగువార లేరు
మిక్కిలికడిమిమై మెఱసిసింహంబు ♦ నెక్కి శూలముఁ బట్టి యేతెంచువాఁడు
అనిమీఁది వేడుక నలరినవాఁడు ♦ దినకరకులనాథ త్రిశిరుఁడన్వాఁడు
పృథులఘంటారావ స్ఫీతమైనట్టి ♦ రథమెక్కి వడి గుణారవము సేయుచును
ఘనసర్పకేతువు గలిగినవాఁడు ♦ ఘననీలతనుఁడు రాక్షసుఁడుకుంభుండు
కనకమహామణి ఖచితంపుఁబడగ ♦ దనరారు చిత్రరథంబుపై నెక్కి
యరుగుదెంచుచునున్న యారాక్షసుండు ♦

గురుశక్తియుతుఁడు నికుంభుఁడు దేవ
యనలసన్నిభమైనయరదంబు నెక్కి ♦ ఘనగర్వమున మీఁటికయ్యంబు సేయ
గలవాఁడువాఁ డెయ్యాకపి నేనదిక్కు ♦ సోఁకవిషదృష్టిఁ జూచుచున్నాఁడు
శరమటువింటితో సంధించుకొనుచు ♦ నరుదెంచువాఁడు నరాంతకుండధిప
భీషణరూపమై పేర్చువాక్యముల ♦ రోషముక్కిడి మిడిగ్రుడ్డులతోడఁ
గరివక్త్రములఘోటకపువక్త్రములను ♦ హరివక్త్రములఁ గిటివ్యాఘ్రవక్త్రముల
నురగవక్త్రమ్ములనుష్ట్రవక్త్రములఁ ♦ గరముగ్రులైనరాక్షసులుత్సహించి
కొలువభూతంబులు గొలువ హాలాక్షు ♦

నలవొప్పువాఁడు దేవాంతకుండధిప
ఘనమైనఘోషంబు గలపైడిరథము ♦ దనరార నెక్కి యుద్దండభావమున
నతితృణీకృతలోకుఁడై గుణారావ ♦ మతిశయిల్లఁగఁ బుట్టినంతనుండియును
నెన్నఁడునోటమి యెఱుఁగనివీరుఁ ♦ డన్నరభోజను నాత్మసంభవుఁడు
అరుణచందనము మేనలఁదినవాఁడు ♦ తిరమైనయరుణంపు దృష్టులవాఁడు
సంధ్యాంబుదమువంటి చాయలవాఁడు ♦

వింధ్యాచలము వోలె వెలసినవాఁడు
కోటానకోటుల గొడుగులచేత ♦ మేటిచామరముల మెఱసినవాఁడు
అవధరింపుము దేవయతికాయుఁడతఁడు ♦ అవనీశ యాజిలో నధికశూరుండు
భూరిసితచ్ఛత్రములు పదివేలు ♦ చారుచామీకర చామరావళులు
పరగంగసింగంపుఁ బడగతో గ్రాలు ♦ పరమైనఘోటక ప్రతతులనొప్పు
నరదంబుమీఁది గుణారవంబెసఁగ ♦ భరితశస్త్రాస్త్రసంపదఁ దేజరిల్లి
యజునివరంబున నఖిలదేవతల ♦ భుజబలస్ఫీతిఁడై పోరిలో నేచి
సురపతిపురిఁబట్టి సాంపారునట్టి ♦ వరగర్వమునఁజాల వ్రాలినవాఁడు
నిచ్చటమనమీఁద నిడినచూపడర ♦ వచ్చుచున్నాఁడు వాఁడింద్రజిత్తు

ఇంకఁ జూపెదఁ జూఁడు మినకులాధీశ ♦ లంకాధినాథు నుల్లసితప్రతాపుఁ
గనకరత్నప్రభా కలితతండముల ♦ నొనరి చామరంబులు నుల్లసిల్ల
సొలవకపంక్తిఁ దొడుఁ సూర్యబింబములు ♦ గలయంగదళకంబుగా గరఁగించి
చేసినపగిది విచిత్రరత్నాంశు ♦ భాసురకోటీర పఙ్క్తి నొప్పారి
మహనీయతరమైనమణికుండలముల ♦ మహిమదిక్కులనెల్ల మట్టాడుచుండ
రోషమహాదృష్టి రోచులఁ జాల ♦ భీషణాకారతఁ శోర్చినవాఁడు
హరుఁడున్నకైలాసమగలించినాఁడు ♦ సురకామినులఁ జేరఁ బొనిపినవాఁడు
లోకంబునెల్ల బెల్లుగఁ గెల్చినాఁడు ♦ పాకశాసనునని బరపినవాఁడు
ఐరావతముదంత మాడినయురము ♦ తోరమణీయమై తోఁచినవాఁడు
ముల్లోకములఁ దనమూర్తిచేహల్ల ♦ కల్లోలమొపడఁ గలఁచినవాఁడు
వాఁడుసేనామధ్యవర్తియైనాఁడు ♦ వాఁడుపో దేవ రావణుఁడనువాఁడు
అనివిభీషణుఁడోలి నందఱఁ జెప్ప ♦ విని రాఘవుఁడు కడు విస్మయంబంది
హరిహరిచిత్ర మీయసురేశ్వరుంకు ♦ సరిలేనియట్టి తేజంబెరూపైన
యట్టిచందంబువాఁ డసురులయందు ♦ నిట్టి తేజోధనుం డెవ్వఁడుగలఁడు
కడుఁగ్రూరకర్ముండు గాకుండెనేని ♦ బుడమికింతటికిని బూజ్యుండుఁగాఁడె
పరికింపనిందఱు పర్వతాకృతులు ♦ నురుశక్తిగలిగిన యోధులఁ గ్రూర
చరితులుమఱివీని సైనికులెల్లఁ ♦ గరముభీషణులు రాక్షసవీరులనుచు
నుగ్రలోచను పినాకోగ్రచాపంబు ♦ నిగ్రహక్రమకళానిపుణుఁడై నృపుడు
ధరియించి కడఁకతోఁ దానులక్షుఁడ ♦

పరబాణ చయములు వరుసనుప్పొంగ

గోపించియును ధర్మగుణముఁ జేపట్టి ♦ రిపార్థివులకునీఁ డెవ్వరునాఁగ
నారావణుండును నఖిలనిశాట ♦ వీరుల వీక్షించి వినుఁడనిపల్కె
నగరివాకిళ్ళ నున్నతితోడఁ బెద్ద ♦ మొగసాలలందును మోసంబులేక
కడుసురక్షితముగాఁ గావలియుండుఁ ♦ డడరియీలంకలో నందఱుఁ బ్రీతి
నేనునుమీరును నీకయ్యమునకు ♦ మానునాఁ బోయిన మాతివలీముఖులు
లంకలోఁ జొచ్చిన లావేమిసేయు ♦ శంకింపవలవదు చనుఁడన్నవారు
చనిరి రావణుఁడును జటులవేగమున ♦ ధనువునువస్త్రముల్ ధరియించి పేర్చి
కార్చిచ్చువనము లుగ్రంబుగాఁ గట్టి ♦ యేర్చుకైవడిదోఁప నిమ్ములఁగిట్టి
జగతీతలము నాకసముఁ దాఁకుకరణి ♦ నగచరసైన్యంబు నదరంటఁ దాకి
యుదిధరణీభాగ మిదివియత్తలము ♦ ఇదిదిశావలియని యేర్పడకుండ
నతినిశితాస్త్రంబు లందందఁ బరపి ♦ యతులబలోదగ్రుఁడై దశాననుఁడు
కలఁచికొండఁ మందఁగాఁ జేసికపులఁ ♦ జులుకఁగాఁ ఖండించి చూర్ణంబు చేసి

నెమ్ములుమజ్జంబు నెరసియుమెదడు♦గ్రమ్మనెత్తురునేలఁ గలయంగ నించి
తనరియార్చుచు గుణధ్వనిదిక్కులందు ♦
నించి ఘోరాజిలో నెఱయఁ బేర్చుటయు
బడియెడువానరుల్ భ్రమయె వానరులు ♦
మడియువానరులను బ్రమగ్గువానరులు
నొరలువానరులునులుకువానరులునరచువానరులఁరూపఱినవానరులు
గలిగినసంగరాంగణ భూమిఁజూచి♦తలఁకిరిసురలు చిత్తంబులు బెదరఁ
గాలకాలానల కాలదుర్వార ♦ కేళికరాళుఁ డత్యుగ్రుఁడై యపుడు
పేర్చికోపంబున భీముండగుచు♦నార్చుచునున్న♦దశాననుఁజూచి
యతనికినెదురుగా నరిగిసుగ్రీవుఁ♦డతిరయంబున నొక్కయుగమెత్తివైచె
నారావణుండును నదిమధ్యమునను♦భూరిశరంబులఁ బొడిసేసిమఱియు
నొండొండఘునదీప్తు లొందవనాకసము ♦
నిండిమండుచునుండ నిశితాస్త్రమినజు
నురమాడనేసిన నుచ్చియాయమ్ము♦ధరఁగాడెనత్తఱి దానవులార్వఁ
దరుచరులెల్ల నుద్ధతిబొబ్బధార♦లురులిఁపనర్కజుఁ డొరలుచుగూలె
భుజబలాఢ్యుఁడు శరభుఁడుఋషభుండు ♦
గజుఁడుగవాక్షుండు గవయుండు నలుడు
జ్యోతిర్ముఖుండది చూచికోపమున♦నాతతగతిఁ బర్వతావనీజముల
నడరించినతనిపై నవియెల్లనతఁడు♦నడుమనేతునిమి వానరుల నేద్వరను
నొక్కొక్కయమ్ముల నుర్వరమీఁద ♦ గ్రక్కునఁజచ్చినగతి నుండనేసె
నాలోనహనుమంతుఁడాయోధపతులుగూలుటయునుజూచికోపంబుతోడ
నసురాధినాథుని యరదంబుమీఁది♦కసమునలంఘించియతనితోననియె
దేవేంద్రుఁడాదిగా దివిజులనెల్ల♦రావణమతి యక్షరాక్షసకోటిఁ
ద్రొక్కడంచితివని త్రుళ్ళెదవీవు♦చెల్లదుగోరినీ చేవడఁగింతు
నున్నతిఁజిరకాల మూర్విపైబ్రతికి ♦ యున్ననీమీఁద నాయున్నతంబైన
వలకేలునేఁడు రావణయిదెచూడు♦మలమిసాగెడు దనయంతనపేర్చి
యిదెనిన్నుబొరిఁగొని యేచియంతకుని♦సదనంబుకనుపక సైపనునిజము
అనిపేర్చిపలికినహనుమంతుమాట వినిరావణుడుక్రోధవికృతాస్యుడగుచు
గలితనంబునలావు గలదేనినీవు♦నలువొప్పనుప్పొంగి ననుమున్నుబొడిచి
పేరుగొమ్మిటమీఁదఁ బేర్చిననీదు♦శూరతయునులావుఁ జూచియేనేచి
పొడిచెదననుడు నద్భుతశౌర్యుఁడగుచుఁ♦గడఁగిమారుతి దశకంఠునిజూచి
దేవదేవుఁడు రామదేవుండుపనుప♦నీపీటిలో మేదినీపుత్త్రి వెదకి

తడయక పొడగాంచి తగ విన్నవించి ♦ వెడలి యేఁ బోవుచో విక్రమస్ఫురణ
నీతోఁ టనుగ్గాడి నీ లంకఁ గాల్చి ♦ సీతనుమాధవుఁ జంపి నిన్నుదట్టించి [వు
యుక్కున నిలిచి దైత్యులు చూచుచుండ ♦ జక్కనెప్పటి త్రోవ జప్పనాలా
నేఁడు చూచెదనని నీ వాఁడెదుబ్బి ♦ నాఁ డెందు బోతివి నాకారి నీవు [డు
అనవుఁ గోపించి హనుమంతు వక్ష ♦ మనువొప్పఁ బొడిచెన య్యసురేశ్వరుం
పొడిచిన శక్తియుఁ బోనీక యతఁడు ♦ పిడికట రావణుఁ బెట్టుగాఁ బొడిచెఁ
బెకుగాలి యడఁచిన బిట్టు కంపించు ♦ ఘనవృక్షమును బోలి కంపించె నసుర
యంతట నొచ్చిన యసురేశుఁ జూచి ♦ యెంతయు నార్చిర యింద్రాదులెల్ల
దనుజాధిపతియు నంతన మూర్ఛ దెలిసి ♦

హనుమంతుఁ జూచి యిట్లను నీబలంబు
గడు మెచ్చవచ్చు నీ ఘనముష్టిహతిని ♦ గడఁకతోఁ ద్రైలోకముఁ జూచి వచ్చె
దేవారి యనుచు నద్ధిరాత్తుఁ డనియె ♦ రావణ వినుమీవు ప్రాణంబుతోడ
నున్నవాఁడవి దేల యురక నాలావు ♦ సన్నుతించెదు లజ్జ జనియింప నాకు
ననిపల్కి నీవు నన్నటుపిడికిటను ♦ గొనమొన పోటన్నఁ గొనుమని యతఁడు
ననయంబు కోపించి యనిలనందనుని ♦ ననుపమాశనికల్ప మగుముష్టి నార్చి
వక్షంబుఁ బొడిచిన వడి మూర్ఛనొంది ♦ యక్షణంబున త్రెళ్ళెనవనిపై నతఁడు
నరిమురి హనుమంతుఁ డటు కూలుటయును ♦

నెరసి రావణుఁ డంత నీలుపైఁ జనియె
హనుమంతుడును మూర్ఛ యంతలో దెలిసి ♦

దనుజుండు నీలుపై దఱుముటఁ జూచి
యెటుఁబోయెదని పిల్చి యెదురుగా నిలిచె ♦ నటు తన్నుఁ గిట్టి కెల్లార్పుచునున్న
మనుజాశనుని మీఁద మలయశృంగంబు ♦ గొనివచ్చి నీలుండు కోపించి వైవ
నడుమ నెదునుమాడె నాకారి దాని ♦ నెడపని కడఁకతో నేడమ్ము లేసి
వెండియు నీలుండు విపులకోపమునఁ ♦ గొండలు దరువులుఁ గొని వైచుటయును
వానినన్నింటి రావణుఁడు చూర్ణములు ♦ గా నిశితాస్త్ర సంఘంబుల దునిమి
నీలుని మేనఁ గ్రొన్నెత్తురులొలుక ♦ వాలికయమ్ములు వడిఁ బెక్కు లేసి
నేసిన నొచ్చియు నింతగైకొనక ♦ గాసిల్లు నీలుండు కడు లాఘవమున
ధారుణిదైత్యులు దల్లడం బంద ♦ వీరుఁడై దానవవిభు తేరికిరికి
పొలుపొందఁ బ్రవ్వ దద్భుతశక్తి మెఱసి ♦ పిలిచి చలంబున నిగిడి యుప్పొంగి
వడిఁ బేర్చి దానవ ధ్వజమున కెగసి ♦ పొడిచేసి చాపాగ్రమునకు లాగొప్ప
నెగసి చలంబున నెక్కెడలించి ♦ మగిడి రావణుఘన మకుటముల్ ద్రొక్కి
యురుభుజ నిజవిక్రమోన్నతి మెఱసి ♦ సురసిద్ధసాధ్యులు చోద్యంబు నొంద

నొక మౌళిపై నుండి యొక మౌళి వ్రచ్చి ♦
  యొక మౌళిపై నుండి యొక మౌళి యూచి
యొక మౌళిపై నుండి యొక మౌళి దుల్చి యొక మౌళిపై నుండి యొక మౌళి దన్ని
మకుటంబు లన్నియు మట్టిమల్లాడి ♦ యకలంకుఁడై నీలుఁ డంతటఁ బోక
వారక తనుఁ బట్ట వచ్చిన సూత్స్నమై రావణునిఁ జూచి యందందనగుచుఁ జి
గొడుగులు ద్రుంచి గ్రక్కున మీఁద ద్రోచి ♦ పొడిగాగ జామరంబులు ద్రున్చివై
విఱుగంగ వరదంబు వీఁక దాటించి ♦ కరకరితోడ నుత్కంఠ దీపింప
దను జేసు నురుముష్టి దాచి హారములు ♦ పెనచి రాదిగిచి యాపృథులవక్షంబు
జర చియంద దయుత్సాహంబు మెఱసి ♦ యురక నీగతి నాడుచుండుట జూచి
తరుచర సేనలు దైత్య సేనలును ♦ బొరిఁ బరి నద్భుతంబుగఁ జూచుచుండ
వెఱగంది రా రామవిభు నులక్ష్మణుడు వఱి రావణుఁడంతి మహితాగ్ని శరము
నయ్యోష నారితో నలుక సంధించి ♦ యయ్యగ్ని సుతుతోడ ననియె ముందుచును
నీలాఘవము లెస్స నిన్ను మెచ్చితిని ♦ నీలాఘవ మెరాకు నెడపక చూపు
మి దెవచ్చె నా బాణ మిన వహ్నిరుచుల ♦ బ్రదికెదు చందంబు బరికించికొనుము
అని యేయుట యునీలుడగ్ని బాణమున ♦ దను వెల్ల మండుచు ధరణిపై బడియె
నగ్ని పుత్రుడు దాన నాతీవ్ర శరపు ♦ బగ్ని చేజావక యవశుడై యుండె
నంత ధనుర్ఘోష మడర సౌమిత్రి ♦ యంతకు గతి బేర్చి యద్దైత్యు దాక
నగ్గుణారావంబు నతని సాహసము ♦ నగ్గించి యతనితో ననియె రావణుడు
పిన్నవై యుండియుఁ బేర్చుచు ననికి ♦ సన్నద్ధగతి నీవు చను దెంచుటొప్పఁ
బుచ్చెదనంతకు పురికి లక్ష్మణుడ ♦ యిచ్చందమున నిల్వు మించుక తడవు
అవవుడు విని రాఘవానుజుండనియె ♦ దనుజాధముఁడ యీవృథాగర్వమే
డాసినవాఁడ మాటలు సెప్పకిపుడు ♦ చేసి చూపుము గాక చెలఁగి నీలావు
అనిన సౌమిత్రి నేడమ్ములనేసె ♦ దనుజని యమ్మ లుద్ధతి లక్ష్మణుండు
నడుమ నెత్రుంచిన నా కారి యప్పు ♦ డడరెడ కోప ముదగ్రమై పర్వ
ఘునతర జ్యానాథ కలితంబు గాక ♦ నన యంబు నిగుడించె నమ్ములవాన
నయ్యాంపతండంబు లందంద ద్రుంచి ♦ వెయ్యేసి శరములు వెస నేసె నతడు
నాయస్త్రములకు మాఱైన యస్త్రముల ♦ నేయ నేరక దానవేశ్వరుఁ డపుడు
తలకొని యొక బ్రహ్మదత్త బాణమున ♦ లలిత వక్షం బేయ లా వెల్ల దూలి
విల్లూత గాఁగొని వేగంబె తేఱి సి ♦ పెల్లుగా నార్పుచుఁ బేర్చి లక్ష్మణుఁడు
ఘున బాణ మొకట రాక్షసనాథు విల్లుఁ ♦ దునిమి యంతట బోక దోర్బలం బెసగ
మూఁడుగ్నులన బోలు మూఁడు బాణముల ♦ వాడిమి మీఱంగ వడి వక్ష మేసె

సేసినమూర్ఛిల్లి యింతలోఁ దెలిసి ♦ యాపన్నసత్త్వసమగ్రుఁడై కదిసి
తనవిల్లువిఱిచిన దానికినసుర ♦ మనములోఁ జాల విస్మయమునుబొంది
కలుషించినిచ్చలు గంధపుష్పముల ♦ నలవడబూజింప నమరినదాని
నిలయబ్రహ్మాండంబు నెల్లదిక్కులుఁ ♦ వెలుఁగొందుమంటలవిలసిల్లుదాని
నడరెడుపదికోట్ల యసనులఁబోలి ♦ కడుబెట్టిదపుమ్రోఁతఁ గలిగినదాని
నలినమిత్రుని కిరణంశులకంటె ♦ వెలుఁగొందు మంటల వేఁడిమిదాని
నవిమిషులెవ్వఱుఁ గందనాబ్రహ్మశక్తి ♦ గొనిలక్ష్మణునిపై చేఁగూరుఁడై పేర్చి
వైచినఁ గాలాగ్ని వడువున బెద్ద ♦ యేచివజ్రమునకు నెక్కుడై నిగిడి
యనిమిషావలియుల్ల నాహారవంబు ♦ లొనరింపఁ బరతెంచి నుగ్రతఁజూచి
వారింపనమ్ములవానలక్ష్మణుఁడు ♦ ఘోరతరంబుగాఁ గురియంగ ద్రోచి
యదివచ్చిభుజమధ్య మాడలక్ష్మణుని ♦ వదలక తాఁకిన వసుధపైఁబడియె
నరిగిదశాననుం డంతలక్ష్మణుని ♦ నిరువదిచేతుల నెత్తఁజూచుటయు
నాతండువిష్ణుని యంశజుఁడగుట ♦ నెతెఱంగునవాని కెత్తరాదయ్యె
నత్తఱిరావణుం డంతరంగమున ♦ నెత్తరాకుండిన నేనుగైలాస
మెత్తితిలోకంబు లెల్లనునెఱుఁగ ♦ నిత్తఱినాసత్త్వ మెల్లనుదరిగె
మఱియుమేరువునైన మందరంబునైన ♦ నెఱయనెత్తగనోపు నిజశక్తివాడ
వీడింతవ్రేఁగౌట విస్మయంబనుచు ♦ బోడిగాగరముల బూనిరావణుడు
అతులసత్త్వోన్నతి నందఁ దనెత్త ♦ మతిలోనఁగోపించి మారుతిగడఁగి
పఱతెంచినిర్ఘాత పటుముష్టినార్చి ♦ కఱకురాక్షసుని వక్షస్థలిఁబగులఁ
బొడుచుటయును మూర్ఛఁబొంది రావణుఁడు ♦

కడుదూలి యంత మోఁకాళ్లు మ్రోవఁగను
బడియెఁబిఱిందికిఁ బదమిడలేక ♦ పడినరావణుని యెప్పటిభంగిఁజూచి
యార్చిరి దేవత లప్పుడుకపులు ♦ పేర్చిరిరాక్షసుల్భీతిఁగీడ్వడిరి
పావనియటు విష్ణుభక్తుడుగాన ♦ రావణునకునెత్త రానిలక్ష్మణుని
గురుసత్త్వమున నెత్తి కొనిపోయిరామ ♦ ధరశీతలేశుముందఱఁ బెట్టినపుడు
రాముతేజమునఁ బరాజితమగుచు ♦ సౌమిత్రినాటిన శక్తియునూడి
యసురేశురథమునకరిగె సౌమిత్రి ♦ యసమానబలశాలియై మూర్ఛదేరె
నటరావణుండును నటుమూర్ఛదెలిసి ♦ చటులబాణాసన సన్నద్ధుఁడయ్యె
సౌమిత్రియటుపరిశ్రాంతినొందుటకు ♦ నామర్కటులుభీతి నడరిపాఱుకట

—:* రామరావణుల ప్రథమయుద్ధము *:—

రావణుఁడేచి పైరాకకురామ ♦ దేవుండుకోపంబు దీపింపఁబేర్చి
భీకరగుణరవ స్ఫీతుఁడై వేగ ♦ నాకారికెదురుగా నడచుటఁజూచి

యనిలతనూభవుం డనియె రామునకు ♦ నినకులాధీశ్వర యీరావణుఁడు
అరదంబుపై నుండి యాలంబు సేయు ♦ వెరవగు నే నీకు విభుఁడ గాల్నడవ
నామీఁద వడి నెక్కి నాకారికెదు ♦ రామ విచ్చేయుట రాజధర్మంబు
అనవుఁడు గడఁకతో హనుమంతు నెక్కి ♦

యనిమిష కరిమీఁది యమరేంద్రు కరణి
నొప్పి గుణధ్వని యొప్పారఁ జేసె ♦ నప్పుడు కోపించి యాటోప మొప్ప
రావణుఁ డుగ్రుఁడై రాముని నీక్షించి ♦ పావకజ్వాలోగ్ర బాణజాలములు
గురిసిన రాఘవ క్షోణీశుఁ డలిగి ♦ యురు బాణతతు లేసి యురువడి వాని
నింద్రారి తెగ నేసె నేసిన రామ ♦ చంద్రుఁ డుద్ధతి నర్ధచంద్ర బాణమున
దనుజేశు కోదండ దండంబు దునిమి ♦ సునిశితభీకరా శుగ పంచకమున
మర్మము లొప్పింప మఱియును నొక్క ♦ ధనువును జేకొని దశకంధరుండు
బటుబాణ మొక్కట బవననందనుని ♦ నిటలస్థలం బేసె నిపుణుఁడై మెఱసి
యనిలజు ఫాలము గ్రాస్త్రంబు దాఁక ♦ గనుగొని కోపించి కాకుత్స్థకులుఁడు
భల్లంబు దొడిగి యాపఙ్క్తికంధరుని ♦ విల్లంతలో నసనె విఱుగంగ నేసి
యొక్కట సారథి నొకట నశ్వముల ♦ నొక్కట నరదంబు నొకట బతాక
మొక్కట గొడుగును నొకట నస్త్రముల ♦ గ్రక్కున నేసి చూర్ణములు గావించి
మనుజనాయకుఁడు సమంత్రక శరము ♦ దనుజుని వక్షంబు దాఁక నేయుటయు
నా రాముశరమున నా రావణుండు ♦ వారక కడు నొచ్చి వడవడ వడఁకి
యనికి నిశ్చేష్టితుం డగు దశకంఠుఁ ♦ గని యర్ధచంద్రమార్గణ మరి వోసి
దశదిశలందును దనరిన దైత్యు ♦ దశ ఱుఁ డగిచు చందముఁ జూపు కరణి
ద్రిదమెలు మెచ్చ నుద్దీప్త కోపమున ♦ బదిమకుటంబులు వడిడొల్ల నేసె
నేసిన మదిలోన నంతయు స్రుక్కి ♦ భాసుర మకుట ప్రభావళిఁ బాసి
గ్రద్దన జేయు నక్కయ్య బుదక్కి ♦ తద్దయు నిశ్చేష్ట దశకంఠుఁ డై
నప్పుడు రాఘవుఁ డనియె రావణున ♦ కిప్పుడు కపులతో నిబ్బఁగి బోరి
కడు డస్సి వాడవు గాన నిన్ దంప ♦ విడిచితి నీ వింక వేగంబె చనుము
పోలంక కనుచు నప్పుడు చిన్నవోయి ♦ యోలిన వేడి నిట్టూర్పులు నిగుడ
మండెడి కోపంబు మలగి చింతించి ♦ దండి గర్వము దక్కి దశకంధరుండు
బలమెల్ల బొలిసి దర్పము పేర్మి దూలి ♦ వెలవెల బాఱుచు విరథుఁడై నడిచి
పెదవులు వడపుచు బిమ్మిడి గొనుచు ♦ గదరిన భీతి గద్గదకంఠుఁ డగుచు
జేరి యొండొరువుల చేతులు చరచి ♦ బోరన నవ్వుచు భూతంబు లార్వ
గురువులు వారుచు గునిసి యాడుచును ♦ గెలి వానరకోటి గేలి సేయంగ
గళుకెల్ల నుడిగి యొక్కరుఁడును వేగ ♦ ఫణిచి యూలంక లోపల జొచ్చె నప్పుడు

అటులంకలోపలి కరిగిరావణుఁడు♦పటుతరంబగు చింతపడితల్లడిలుచు
బంచాననంబుచే బడియుజావునకు ♦ వించుకతప్పిన యేనుగుపగిది
గరుడునికగపడి క్రమ్మఱబ్రతికి♦సురిగిపోయిన దందశూకంబుఁబోలె
స్ఫీతవిద్యుత్ ప్రభా భీలకీలముల♦నాతతబ్రహ్మ దండాతిశయంబు
లగు రాముశరంబులడరి ప్రాణముల♦దెగటార్చుచునికిఁ జింతించిచింతించి
యుడుగని వేడినిట్టూర్పులబెల్లు♦వడగాలిఁబోలి యెవ్వాలనైనసుడియ
దలకొన్నసిగ్గున దైర్యంబుడూలి♦కొలువులోపలి దైత్యకోటినీక్షించి
నాలావుకలిమి దానవవీరులార ♦ నేలతోఁగలియుట నేడుపోఁగలిగె
సహజపరాక్రమశాలి యొక్కరుఁడు♦మహిమీఁదఁబుట్టి రామక్షితీశ్వరుఁడు
పోరిదియుద్ధములందు సురసిద్ధసాధ్య ♦ గరుడగంధర్వ రాక్షసపక్షి యక్ష
కిన్నరోరగమృగ కింపురుషులను♦నన్నుజయింప నెవ్వఁడు లేకయుండ
వరముగాంచితిబ్రహ్మవలగ నేనపుడు♦నరకుసేఁకను నరసమితిమోసమున
నా మోసమెల్లను నాకుబైవచ్చె♦నేమని చెప్పుదు నీదురవస్థ
కోటమీఁ రేమఱకుండి వాకిళ్ళ ♦ కాటించియెంతయు బలుకాపులిడుఁడు
దురములోపల బ్రహస్తుఁడు మొదలైన♦యుగ్రవీరులందఱు నోగిబోరివడిరి
మఱియొక రాములక్ష్మణుల జయింప ♦ నెఱవీరుడెవ్వఁడు నిజగతిజగతి
బహుసంగరాంగణ పరిణతుండైన♦సహజశూరుఁడు రామజనపాలుమీఁద
నడువనేర్చినయట్టి నాతమ్ముఁడైన♦కడిఁదివీరుఁడు కుంభకర్ణుండుగాక
విరుతింపమరియొండు వీరుండుగలడె♦యనుచునద్దశకంఠుఁ డందఱుచిఁజూచి
నెఱియంగనిరుమాసునెల నిద్రించి♦మఱిమేలుకొనిసభా మంటపమునకు
నలరియేతెంచి మంత్రాలోచనంబు♦పోలుపారగాఁ జేసి పోయిక్రమ్మఱను
నేఁడుతొమ్మిదినాళ్ళ నిద్రమైయున్న♦వాఁడుశత్రులనెల్ల వధియింపఁగలఁడు

—*: కుంభకర్ణుని నిద్రమేల్కొన జేయుట :*—

ఆతని మేల్కొల్పి యతులవిక్రముని♦నే తెఱంగునైన నిటకుఁ దెండనిన
బహుగంధ పుష్పము లభక్ష్య భోజ్యములు ♦
బహువిధంబులఁ గొనిబఱచి రాక్షసులు
అతతానంతభోగా స్పదంబగుచు♦బాతాళమునుబోలె బరగినదాని [ని
మహనీయశతకోటిమహిమ చేనింద్రు♦ మహితాలయముపోలె మానైనదా
నిఖిలంబునందును నెగడు తేజమున♦శిఖినివాసముపోలె జెలువైనదాని
సమధికంబైన భీషణవృత్తిగలిగి♦యమనివాసముపోలె నమరినదాని
వివిధమేదోమాంస వితతిగ్రవ్యాదు♦భవనాంగణముపోలి ఁ సిల్లుదాని
నిరుపమతరవారు ణీయుక్తమగుచు ♦ వరుణాలయముపోలె బ్రాలినదాని

దిరమైనయాసుగంధీస్పర్శనమున ♦ మరుదాలయముపోలె మాన్యైనదాని
విలసితనిధులచే వెలసి కుబేరు ♦ నెలవునుబోలె వర్ణితమైనదాని
నురువిభూతికి నెల్ల నునికిపట్టగుచు ♦ హరునివాసముపోలె నమరినదాని
గలిగినపద్మరాగ ప్రభావళుల ♦ నలువయున్నడపోలె నలరినదాని [ని
నఖిలదిక్కుల యోజనాయతంబగుచు సుఖతరంబగుగుహ జొచ్చియచ్చట
ఆవిపులపుటూర్పు లడరిన దూలి ♦ లావున నెట్టి కేలకు జేరఁబోయి
కడునొప్పనంతయు గరగరికైన ♦ వెడలుపుగల హేమవేదికమీఁద
వంసంబుతో గపోలాంగంబు జేర్చి ♦ హంసతూలికతల్ప మందుశయనించి
యుడుగకతఱుచైన యూర్పులతోడ ♦ బెడగైనయాఘర్మబిందులతోడ
గరమొప్పమోడ్చిన కన్నులతోడ ♦ దఱుచైనకపుర గందపుబూతతోడ
నురమున నెంతయు నుజ్జ్వలంబగుచు ♦ నెరసినమణిహార నికరంబుతోడ
నల్లలితానంద సంపదతోడ ♦ నెల్లప్పుడును దన్ను నెఱుగమితోడ
సరసనింద్రాంగనా సంభోగకేళి ♦ బరిణమించినభంగి భాసిల్లువాని
పలుమఱుదివిజుల భంజించునట్టి ♦ కలలర్థిగను కుంభకర్ణునిగనిరి
కనియిట్టివానికి ఘననిద్రయుంచె ♦ వదరుహాసనుడని వగచుచునపుడు
ఆతనిముందట నన్నరాసులును ♦ బ్రాతిగా మహిమ పరాహమాంసములు
జోసియుంచితగంధ పుష్పార్చనములు ♦ సేసిధూప బులు దెలువొప్పనిచ్చి
పారిబొరిబహుదీపముల నివాళించి ♦ కరములు మొగిచి పొగడ్తలు నెఱపి
పిడుగులు మ్రోసిన పెక్కువకంబె ♦ నెడపకార్చుచుబొబ్బలిడుచుజీరుచును
మరువడిశంఖంబు లూనుచుబెట్టు ♦ మొఱయంగనిస్సాణములును భేరులును
జెందిద్రవేయుచుదోన సింహారవంబు ♦ లందంద చెలగింప నమ్మహారవము
దశుతబాతాళతలము దిక్కులను ♦ నక్షత్రప, ములు నాకంబునిండె
నంతట దెలియక యాకుంభకర్ణు ♦ డంతకంతకుగడు డగ్గలంబైన
నిదురవోవఁగజూచి నిఖిలరాక్షసులు ♦
గదలును ముసలముల్ ఘనముద్గరములుఁ
బెనుపారడట్టసభిండివాలములు ♦ మునుమిడియందఱు ముసరివ్రేయుచును
బదివేలకుంతముల్ బరులగ్రుమ్ముచును ♦ వదలజకొండలు వైచియుబోక
యురముపై నందండనుఱికిపాదముల ♦ గరముమెట్టియుమేలు కాన్పంగలేక
తడబడసి హానాదములు సేయుచును ♦ గడుబెట్టుగాగ శంఖబులూదుచును
బటునాదముల గ్రందుపటుకుంభవాద్య ♦
పటహభేరీ భూరి బహువాద్యములును
దొదరిబాయింపుచు దోడనెమఱియు ♦ నుడుగకపదివేల యుగ్రరాక్షసులు

క్రందుగానిస్సాణ ఘనతరరావ ♦ మందంద చెలగింప నారభసమున
నీలాద్రి యనుబోలె నిశ్చలుండగుచు ♦ నాలోన దెలియక యతడున్న జూచి
కరులహయంబుల ఘనతరోష్ట్రముల ♦
నురులులాయములచే నురము ద్రొక్కించి
కొంకక మేనెల్ల గుదియల మోది ♦ యంకించి సకల వాద్యములు వాయింప
లంక గంపించి కోలాహలంబయ్యె ♦ సంకించె నవ్వనచర సేనలెల్ల
నిటు సేయునప్పుడు నేమియుఁ దెలియ ♦ కటు నిద్రవోవంగ నఖిల రాక్షసులు
కొందఱు దిక్కులు ఘూర్ణిల్ల భేరు ♦ లందంద వ్రేయుచు నధిక దర్పమునఁ
గొందఱు పర్వత గుహలెల్ల నద్రువ ♦ దందడ సింహనాదములు సేయుచును
గలయంగ గొందఱు కరములు పెనచి ♦ పెలుచ శిరోజముల్ పెఱికివైచియును
కొందఱు ఘనకర్ణకుహరముల్ సొచ్చి ♦ క్రందుగా గూబలు గఱచి పట్టియును
నటు ఘోరమగు బాధ లడరించి మఱియుఁ ♦ బటుగదా ముద్గర ప్రాస ఖడ్గముల
ముసలంబులను బెట్టు మొగమునురంబు ♦
ముసలకండలు పలుమఱు వ్రేయ వ్రేయఁ
దననిద్ర యించుక దఱిగియు తటన ♦ మనుజాశను డొక మఱియావులింపఁ
దఱుచుగాఁ గన్నులు దరికొనవైచి ♦ యఱియ వ్రేముల సందులెల్ల బంధించి
తెరలఁగా చివనూనె దెచ్చి కర్ణములఁ గరము గ్రమ్మగ వేయి ఘటములు వోసి
మునుకొని యాతని ముక్కుగోళ్లందు ♦ ఘనమైన పారలు గనఁ జెట్టియును
ఏకయత్నంబున హేమకండముల ♦ భీకరగతి వ్రేయ భేరుల వ్రేసి
విడువక హయకరివితతి నురంబు ♦ గడఁగి త్రొక్కింప రాక్షసుడు శంకించి
చక్కశేషోగ్ర హస్తంబులు చాచి ♦ యొక్కింత మేల్కొని హుమ్మని నీల్గి
బడబాముఖాభమై పరఁగెడి నోరు ♦ కడుఁజూడ విస్తృతంబుగా నావులించి
యురవైనయట్టి సాయుజ్యపదంబు ♦ నెరయంగ రాముఁడు నేఁడు నాకిచ్చు
నీరిత్తనిద్ర నాకేలని దాని ♦ దూరంబుగాఁ బెడఁ ద్రోచెనో యనఁగఁ
గనువిచ్చి యసురులు కంపింప మేలు ♦ కనికుంభకర్ణుఁడు దనుగూర్చుండెఁ
బ్రళయకాలమునాఁటి భానుబింబంబు ♦
చెలువంబుతో మోము జేగురింపంగ
బటు వింధ్యగుహలోపలనుండి వచ్చు ♦ చటులానిలంబుల సరియూర్పు లెసఁగ
బ్రళయకాలాగ్ని బింబంబులఁ బోలి ♦ కలయంగ నెఱ్ఱని కన్నుల మెఱయ
దానవులిట్టు లాతని మేలుకొల్పి ♦ దానవేశ్వరుయొద్దకుఁ బోయి నిలిచి
దేవ నీతమ్ముఁ డెంతేనియు బాధ ♦ గావింపఁగా మేలుకొని యెనంతటను [నుడు
నటు కయ్యమునకు బొమ్మందుమా కాక యిటులోడి తెత్తు మా యేతెఱంగ

రాఁగిల్లితోడ్కొని రండునావుడును♦వేగంబెయాదైత్య విభునాజ్ఞ వచ్చి
తనకట్టెదురనున్న దానవప్రతతిఁ♦గనుఁగొని యాకుంభకర్ణుఁడిట్లనియె
మీరేలవచ్చిట్లు మేలుకొల్పితిరి♦యారావణునకుఁ గార్యంబేమిపుట్టె
నదియేమిచెప్పుడీ యనవుడు వారు♦త్రిదశారిచేతనే తెలియంగవినుము
నినుఁదోడితెమ్మని నిర్జరారాతి♦పనిచెనింతియెకాని పనియేమొ తెలియ
దనవుడు జలక మింపారఁగానాడి♦చనుదెంచియొంతయుఁ జతురత మెఱసి
చారువస్త్రములు భూషణములు దాల్చి♦భూరికోటీరదీప్తులనొప్పుటయును
నతిముదంబుననప్పు డాదైత్యులెల్ల నతనికి నేకభక్ష్యములు భోజ్యములు
మధువును సూకర మహిషమాంసములు ♦

నధికంపుమెదడును నాజ్యభాండమును [నమలి
ముదముతోఁగొనివచ్చి ముందఱనిడిన♦మొదల మేదోమాంసములఁ బ్రీతి
రుధిరంబుమద్యంబురూఢిగాఁ గ్రోలి♦యధికసంతుష్టుఁడై యతఁడున్న జూచి
మ్రొక్కి నిశాచరు లొండొఱనిలువ♦నక్కుంభకర్ణుఁడిట్లనియె వారలకు
మీతినసుతులకు మేటిబంధులకు♦వారకరాక్షసేశ్వరునకు శుభమె
యెడరుపుట్టదుగదా యెవ్వరివలన♦నడఁగియీలంకకు నక్లైననిపుడు
నడచెదనభమైన నమరేంద్రునైన♦నడఁగిట్టినాకంబువలనఁ బాపెదను
నార్చెదఁగాలాగ్ని నైనఁ బెంపొదవి♦తేర్చెదఁబగవారి తీవ్రదర్పములు
అనినయాపాతకుండుహస్తముల్మోగిచి ♦

కనుఁగొని యాకుంభకర్ణుతోఁననియె
వినునిశాచరవీర విబుధులవలన♦దనుజులవలన గంధర్వులవలన
నేభయంబెన్నండు నెఱుఁగనియాకు♦నీభీతిఁబుట్టించి రిప్పుగునరులు
దివిజారిజానకిఁ దెచ్చుటకలిగి♦రవికులోత్తముఁడైన రామచంద్రుండు
కడఁదివిక్రములైన కపులతోఁ గూడి♦విడిసినాఁడీలంక వేడించియిప్పు
డగచరుండొక్కఁడె యక్షకుమారు♦మొగిసేనతోఁగూడి మున్నునిర్జించి
లంకభస్మముచేసి లావుమైజనియె♦నింకనెవ్వఁడుగెల్చు నిమ్మహాకపుల
ననిలోన దేవాసురాదులకంటె♦ఘనవిక్రమఖ్యాతి గలరాముతోడ
నరకకయ్యముసేసి యోడిరావణుఁడు♦వెఱపునబఱతెంచి వెసలంకఁజొచ్చె
ననివిన్నవించిన నన్నిశాచరుఁడు♦కనుగవ విస్ఫులింగంబులు చెదర
యూపాక్షునీక్షించి యుగ్రకోపమున♦దీపించియాకులు దీటుమెఁబలికె
సమరంబు కోనేఁడు సకలవానరుల♦నమితవిక్రములైన యాదాశరథుల[ఁజి
మడియించికపివీర మాంసరక్తములఁ♦దొడరిరాక్షసకోటిఁదృప్తిఁ బొందిం
రామలక్ష్మణుల యారక్తముల్ గ్రోల♦కేమనివత్తునే నింద్రారికడకు

నటుచేసివచ్చెదనసమహోదరుఁడు ♦ నట్లమొక్కి ముకుళితహస్తుఁడై పలికె
ఘనునిదశగ్రీవుఁ గనిసేయవలయు ♦ పనులెల్ల వినిపోయి పగవారిగెలువ
మనవుడొఁ గాకని యాహారకాంక్షఁ ♦ దనయొద్ది రాక్షసతతిఁ జూడ వార
లిరవొందఁ గానప్పుడిరువదియొక్క ♦ పురుషులమాంసంబుఁ బ్రోవుగాఁ బోసి
యెనుబదిమహిషంబు లెనమనూఱజము ♦

లును వేయు క్రోడంబులును నాల్గువేలు
ఘనశశకములు మృగంబులార్వూరు ♦ ననువొందఁగాఁ దెచ్చియవి వేలు వేఱ
జ పిసుపక్వమాంసములుగాఁ దెచ్చి ♦

యింపార నాతని యెదుటఁ బోయుటయుఁ
దనివోవఁ గుడిచియుద్ధతి రెండువేల ఘనఘటంబుల నిండఁ గలమద్యమాని
పటపటదిక్కులు పగుల వేయుచును ♦ జటులంబులై నమీసము లుదీటుచును
జనుదెంచునురువడి జగముగంపింపఁ ♦ గనుదోయి ఘూర్ణిల్లఁగా గుహ వెడలె
నలరావణువదనగహ్వరము నుండి ♦ వినయకాలార్కుండు వెడలినమాడ్కి
బలుగిట్టి ధాత్రియు బ్రహ్మాండతలము ♦ వెలయ దర్పించు త్రివిక్రము పగిది
నాచందమున వికృతాకారుఁడగుచు ♦ నేచినపాడవుతో నేతెరఁ జూచి
కోటయవ్వలి కపికోటులన్నియును ♦ మేటిరాక్షసుఁగని మిగిలినభీతిఁ
గొందఱు వెఱఁ గందఁ గొందఱు డాఁగ ♦ గొందఱట్టిట్టుపడఁ గొందఱు వెఱవ
గొందఱు మూర్ఛిల్ల గొందఱు జలధి ♦ యందుఱువగ గొంద ఱద్రిరాయనఁగ
గొందఱు రాముదిక్కునకొందు గంగ ♦ నందఱఁ గనుఁగొని యాసమయమున
సౌమిత్రి విల్లును శరము దెమ్మనుచు ♦ రాముఁడు పలికె నా రావణానుజుని
వఁదెయాకసంబును నవనీతలంబు ♦ గదిసిన దేహంబు గలిగినవాఁడు
ప్రళయకాలాంబుదపటలంబు పోలె ♦

బాలయుభూషణరుచిఁ బోలుపైనవాఁడు
మూఁడులోకంబులిమ్ముల మ్రింగునట్టి ♦

వాఁడిమి దెరచినవదనంబువాఁడు [డో
కాలుండో యటుగాక కాలానలుండో ♦ కాలరుద్రుఁడో లయకాలమారుతు
కాలార్కుఁడో మహాకాలాహిపతియో ♦

కాలమృత్యువో లయకాలాబ్ధివిభుఁడో [డో
కాలకాలుఁడో లయకాలభైరవుఁడో ♦ కాఁకరుద్రుఁడనఁగను గాఁ రుద్రుం
భీమంపురూపు విభీషణ యిట్టి ♦ దేమన్నఁ డనుజూచి యెఱుఁగము మున్ను
దానవుఁడో వీఁడు దైత్యుఁడో కాక ♦ వీనికులం బేమి వీఁ డెవ్వఁ డిందు
వాఁడయోధ్యాపురవీథి వడి నేగుచున్న ♦ వాఁ డెవ్వఁ డెఱిఁగింపు వాని పేరేమి

వీనిఁ గనుంగొని వెఱచిరి కపులు ◆ వీని చందముఁ జూడ వెఱగయ్యె ననుడు

### విభీషణుఁడు శ్రీరామునితో కుంభకర్ణుని శాపప్రకారము దెలుపుట

నా విభీషణుఁడు రామాధిపుఁ జూచి ◆ దేవ యీదైత్యుని తెఱఁగెల్ల వినుము
వరనందనుఁడు విశ్రవసునకు నితఁడు ◆ కరము గ్రూరుఁడు కుంభకర్ణుఁడన్వాఁడు
రావణు తమ్ముఁడు రణవీథిఁ గిట్టి ◆ దేవసంఘంబుల దిక్పాలకులను [డు
బలుమఱు దోలిన బాహుబలాఢ్యుఁ ◆ డఁఘుశూలాయుధోద్ధతసత్వధనుఁ
బ్రహ్మాండమయినను బగిలింపనోపు ◆ బ్రహ్మాదులకుఁ బట్టువడఁకు సత్వమున
వీఁడు పుట్టిననాఁడె వికృతంపు నోరఁ ◆ బోడిమి చెడ జీవముల మ్రింగఁ జొచ్చె
మును మిడియటు భూతముల మ్రింగ మ్రింగ ◆ విని వజ్రి కోపించి విపులవజ్ర బు
వీనిపై వైచిన వీఁడు గైకొనక ◆ యానాకకజదంత మగిలించి పెఱికి
సురపతిపై వైన సురసుర స్రుక్కి ◆ సురపతి యప్పుడు సురలతో వచ్చి
యంభోజభవుఁ గాంచి హస్తముల్మోగిచి ◆ కుంభకర్ణుండను ఘోరరాక్షసుడు
పొలుపారఁ బ్రజలఁ జంపుచున్నవాఁడు సొలవక సురల నేచుచున్నవాఁడు
గడఁగి పరస్త్రీలఁ గవయుచున్నాఁడు తొడరి లోకములెల్ల ద్రుంచుచున్నాడు
ఈనీచు నీక్రియ నిటమీఁదనున్న ◆ వీని నిగ్రహమున విశ్వంబు పొలియు
ననవిని యప్పు డయ్యంబుజాసనుఁడు ◆ తనమనంబున నల్క దద్దయు మిగుల
రాక్షసావలి నెల్ల రప్పించియుందు ◆ వీక్షించె నప్పుడు వీనిరూపంబు
వీక్షించి యెంతయు వెఱఁగంది వీఁడు ◆ భక్షించుఁబోవెన బ్రహ్మాండమైన
వీని చందముఁ జూచి వెఱపు నాయందు ◆ నూనెడు వీడింత యుగ్రుఁడై యున్న
వీఁడాజిలోపల విదళింపకున్న ◆ మూఁడు కన్నుల వేల్పు ముట్టిననైన
నని వీనితో నప్పు డనియె నా బ్రహ్మ ◆ చనదని మిగుల నాజ్ఞాపింపఁదలఁచి
యాపులస్త్యుని యుత్తమాన్వయంబునను ◆ నీపుట్టు వెల్లను నిఖిలభూపములఁ
బొలియించు కొఱకు నాభువనంబు లెల్ల ◆

నలుకంగ నిట్టి శౌర్యము చూపెదనుచు

జావుతో సరియైన శాపంబు నిచ్చె ◆ నీవుడుగ నియట్టి నిదురబొమ్మనుచు
జలిపిడుగును బోలె శాపంబు దాఁకి ◆ నిలువలేకెంతయు నిద్రితుండయ్యె
రావణుం డప్పుడా బ్రహ్మకు మ్రొక్కి ◆ దేవ చూడుము కృపాదృష్టితో వీని
దారు పెట్టిన చెట్టుఁ దా రెత్రుంపుదురె ◆ యేరూపమున నితఁ డెంతకీడైనఁ
దగుబుద్ధి సెప్పుట తగవగువాని ◆ దగదటు వలె శాపతప్తునిఁ జేయ
వీని నిద్రకుఁ దుది వివరింపుమనిన ◆ దానవుతోడ నుత్తరమిచ్చె నజుఁడు
అక్కజంబుగ నిద్ర యాఱసి నెలల ◆ కొక్కొక్కపరి దెలియుచునుండుననుచు

వంతనుండియునితం డవ్విధంబునను ♦ జింత సేయక నిద్రఁ జెందు మేల్కాంచు
దేవయిప్పుడునీదు దివ్యబాణోగ్ర ♦ పావకశిఖలఁ గాల్పడిసైఁపలేక
యవసరంబునను తానారావణుండు ♦ తను మేలుకొల్పంగ దైత్యులఁ బనుప
దానును బేర్చి యుద్ధప్రసన్నద్ధుఁ ♦ డై నేఁడు నగరికి నరుగుచున్నాఁడు
వెసవీఁడు రావణు వీడ్కొనివచ్చు ♦ ననమున మనమీఁద నంతకుమున్న
వీనియాకృతిఁ జూచి వెసఁ బాఱకుండ ♦ వానరసేనలో వడిఁ జాటఁ బనుపు
దనుజుండు గాఁ డిటు దారుయంత్రమున ♦ నొనరంగఁ జేసిన యుగ్రరూపనుచు
నిటు చాటఁ గాఁ బంచి యెల్ల వానరులఁ ♦ బటుభీతియును బాపి భండనంబునకు
సన్నద్ధులుగఁ జేయు సకలాధినాథ ♦ మున్నయాకృతియిమ్ము మోహరింపంగ
ననవుడు నీలున కానతియిచ్చి ♦ జననాథుఁ డిమ్మెయిఁ జాటంగఁ బనిచె
నా కుంభకర్ణుండు నప్పురాంగనలు ♦ చేకొనపూవుల సేసలు చల్లఁ
జనినిండు వెన్నెలసదన మోయనఁగ ♦ దనరారుచున్న యాస్థానంబుఁ జొచ్చెఁ
బరఁగి వధవళాభ్ర పటలంబుఁ జొచ్చు ♦ సురుచిరకరుఁడైన సూర్యునిభంగిఁ
జొచ్చియన్నకు మ్రొక్క సొంపారనతఁడు ♦ గ్రుచ్చి గాఁగిటఁ జేర్చి కూర్మిదీపింప
గనకాసనంబిడఁ గాఁ బంచుటయును ♦ దనుజాధినాథుని తమ్ముఁడందుండి
యన్ననాలోకించి యసురాధినాథ ♦ నన్ను దెల్పిన కారణం బేమి యిపుడు
ఎవ్వఁడు నీయెడ నెగ్గొనరించె ♦ నెవ్వనిఁ జంపుదు నెత్తెఱంగనుడు
నా కుంభకర్ణున కనియె రావణుడు ♦ నీకుఁ బెల్లగుచున్న నిద్ర పెంపునను
నేకార్యగతియును నెఱుఁగవు గాన ♦ జేకొని యంతయుఁ జెప్పెద వినుము
రాముఁడు దశరథ రాజనందనుఁడు ♦ కోపించి నా మీఁద కోఁతులఁ గూడి
వననిధి బంధించి వచ్చి యీకోట ♦ వెనుకొని బలువిడి విడిసి యున్నాఁడు
అనికిఁ జొచ్చుటయుఁ బ్రహస్తాదివీర ♦ దనుజులనందఱఁ ధరమీఁదఁ గూల్చె
వానరవీరులెవ్వరుఁ జావరందుఁ ♦ గాన నా రామలక్ష్మణుల భంజించి
యా విభీషణ రవిజాదులఁ జంపి ♦ లావునఁ జెడకుండ లంక రక్షింపు

—:* రావణునకు కుంభకర్ణుఁడు నీతి సెప్పుట *:—

మని పెద్దకృపపుట్ట నాడు వాక్యములు ♦ విని కుంభకర్ణుఁ డవ్విబుధారి కనియె
మనునాటి యేకాంతమున మంత్రులెల్ల ♦
        గనుఁగొన్నయాకీడె కాక చింతింప
వారక యిది నేఁడు వచ్చినకీడె ♦ యేరూపమున నిది యేటికిఁ దప్పు [ర్యంబు
మదము పెంపునఁ జేసి మఱియెవ్వఁడైన ♦ దుదిమొదనెఱుఁగక తొడరు కా
వాఁడు గదా యెల్ల వలసఁ జేటొందు ♦ వాఁడని చెప్ప నెవ్వఁడు నీవె కాక
మతిగల మంత్రుల మంత్రానుమతులఁ గృత కార్యములు పరికించు నేవిభుడు

ఒగిఁ బ్రభుమంత్ర సముత్సాహశక్తు ♦ లగణితఫలదంబులై వానికమరఁ
బటిదేశకాల విభాగంబు లెఱిఁగి ♦ చతురజనద్రవ్య సంపదఁ గలిగి
కార్యంబుమీఁదగు కార్యమూహించి ♦ కార్యవిఘ్న ప్రతీకారంబు సేసి
ఫలసిద్ధిఁ గైకొని బహురాజ్యభోగ ♦ ములనిత్యుఁడై యుర్వి మోదింపవలయు
బగవానిబలశక్తి భావించి సంధ ♦ తగుబుద్ధిమైఁ జేయఁ దలఁపోయవలయు
రూపించి సమబలారూఢునితోడ ♦ నేపుమైచని నిగ్రహింపంగ వలయు
నటుకాక బలశూన్యుఁడగుటచింతించి పటుశక్తుఁడై శత్రుపై నెత్తవలయు
విడిసినబలిమి వివేకించి మీఁద ♦ విడిసి మార్తురఁ గెల్వ వెరవూఁదవలయు
వైరులసాధ్యులై ప్రాలుదు రేని ♦ లోరెండుపుట్ట విలోకింపవలయు
నతిసత్త్వులై వైరు లజితులై రేని ♦ హితబుద్ధిమై నాశ్రయింపంగవలయు
నీయాఱుగుణముల నెఱిఁగి వర్తించు ♦ నాయువనీశ్వరుఁ డభివృద్ధిఁ బొందుఁ
గాని యేపురుషుఁ డెప్పుడు సామభేద ♦ దానదండములు చితముదప్పఁ జేయు
నెఱియ వానికిఁ గలనీతిశాస్త్రములు ♦ కొఱమాలియుండు నిక్కువము వ్యర్థంబు
పరధనపరసతీ పరచిత్తుఁ డెవ్వఁ ♦ డరయ నాతఁడు కులం బంతయుఁ జెఱుచు
ననికుంభకర్ణుఁ డిట్లాడు వాక్యములు ♦ విని రావణుఁడు క్రోధవివశుఁడై పలికె
ననునన్నుయనుచు మనంబునఁ గొనక ♦ కీసిసియిబ్బంగి శిక్షించెదు వచ్చి
యీవృథాజల్పంబు లింక నేమిటికి ♦ నేవిధంబున నైన నీకార్యమేను
గడవందఁ జేసితిఁ గాదనకీవు ♦ కడిమిమైనిది చక్కఁగాఁ జేయుమింక
ననవుడు వినియనె నాకుంభకర్ణుఁ ♦ డని సేయఁ బోయెద నైన ననొకటి
వినుదానవేశ్వర వేడుకనొక్క ♦ దినమున నేనిద్ర దెలిసిననాఁడు
చేకొనికడుఁ బెక్కు జీవుల మ్రింగి ♦ యేకాంతమున నెమ్మి నేనున్నచోట
ననఘుఁడు నారదుం డరుగ నేఁగూడఁ ♦ జని విన్నవించితి సంయమితోడ
నెక్కడనుండి సీ కిటుసంభ్రమమున ♦ నెక్కడఁ బోయెద వెఱిఁగింపు నాకు
ననవుడు కనకాద్రియందుండి రాక ♦ వినువార్తలన్నియు వినుపింతు నీకు
బంకజనాభుండు ఫాలలోచనుడు ♦ పంకజాసనుఁడును పాకశాసనుఁడు
ననలుండు యమనైరృతాంబుధీశ్వరులు ♦
ననిలుండు యక్షేశుఁడగు కుబేరుండు
నోషధిపతియును నుష్ణకర్ణుండు శేషగ్రహంబులు సిద్ధులుమునులు
కిన్నరగంధర్వ గీర్వాణయుతులు ♦ పన్నగగుహ్యక ప్రముఖసంఘములు
సభగూడి మంత్రవిచారంబు సేయ ♦ శుభమతి నూహించి సురగురుఁడనియె
గ్రోధించి మనలఁ గైకొనక లోకముల ♦ బాధించుచున్నాఁడు పఙ్క్తికంధరుడు
కుంభద్బలంబున సుడివడఁ జేసి ♦ జంభారిభంజించె సమరంబులోన

వడినంతకునిఁదోన వరుణునోడించె♦నొడి చేఁగుబేరుని నురుబలోజ్జ్వలుని
గట్టల్కతో నతిగర్వంబు మెఱసి ♦ పట్టిధర్మాత్ముల( బలువుర(జంపె
దినకరచంద్రుల తేజంబులణఁచె ♦ దనయాజ్ఞననువంగఁ దట్టించిపనిచి
గ్రహములనందందఁ గాఁచెమంత్ర♦
మహితంబు లగుచున్న మఖములు చెఱిచె
వఱలుమహోద్యానవనములుపెఱికెఁ జెఱవెట్టె నుత్తమస్త్రీలఁబెక్కెంద్ర
నిలలోనుగా బాధ లిట్లు సేయుచును ♦ భువనంబులకుభీతిఁ బుట్టించెఁగాన
నడరిరాక్షసు-తోనద్దశాననుఁడు♦ చెడునుపాయముమీరుచింతింపుఁడింక
ననిబృహస్పతివల్క నామాటలెల్ల♦విని(బహ్మవలికె నావిబుధులతోడ
వరమిచ్చినాఁడ నేవానికిమున్ను♦సురగరుడోరగా సురయక్షవరుల
చేనైనఁజావమి సిద్ధఁబుగాఁగ♦దీనికిమాఱు చింతించితివినుఁడు
డడవఁడుమనుజుల దైత్యేంద్రుఁడుగాన♦దడవనేనును వరదానకాలమునఁ
గానరావణుని సంగరభూమియందు♦ మానవులోర్తురు మనుజలోకమునఁ
జనియింపఁబ్రార్థింపఁ జనునాదివిష్ణు♦వనజనాభుని లోకవంద్యుముకుందు
ననవుడుసురమును లట్లకావింప♦నఘుండుహరిమర్త్యుఁడై పుట్టెఁబుడమి
ననిచెప్పినారదుం డరిగ్గదె తేశ♦దినకరకులుఁ డాదిదేవుండుగాని
మనుజుండుగాఁడు రామక్షితీశ్వరుఁడు♦జనకనందననిచ్చి శరణమువేగ
వనచరులెల్ల దేవతలుగాఁదలఁపు ♦ దనుజేశనామాట తథ్యంబునమ్ము
అనినమాటలువిని యుద్ధశాననుఁడు♦ తనలోననధిక సంతాపాగ్నిఁగుంది
యొక్కకొంత వడియూరకుండినిట్టూర్పు ♦
ప్రకటంబుగాఁబుచ్చి బహుచింతతోడ
వెఱచియువెఱవని విధముననప్పు♦డతిముఱికోపించి యనుజన్ముఁజూచి

—:* రావణుఁడు కుంభకర్ణునిఁ దిరస్కరించుట *:—

సొలవక యెపుడు విష్ణుఁడువిష్ణుఁడనుచుఁ♦ బలికెదనీకింత భయమేలపుట్టె
విష్ణువై యుండిన వెఱవనునేను♦విష్ణుండుమానవ వేషుఁడై యున్న
వెఱతునే నన్నేల వెఱపించెదిట్లు ♦ వెఱచె దేనియునీవు వెఱతుగాకింక
నారాఘవుఁడువిష్ణుఁడగుఁగాక యేమి♦యారామానకుఁదమ్ముఁడైనసౌమిత్రి
యారయశర్వుండె యగుఁగాక యేమి ♦
యారవిసుతుఁడింద్రుఁ డగుఁగాక యేమి
సురలమైయుండంగ సొరిదినేవెఱవ ♦ నిరవొందవీరికి నేనేలవెఱతు
నెఱయంగనీవెల్ల నీతిశాస్త్రములు♦నెఱుఁగుటనిష్ఫలం బిటువిచారింప
వతివిరోధముగొన్న యారాముతోడ ♦ నతిహీనమైత్రికి నాసచేసెదవు

సమిరోర్వ్యమనలను సమయింపమునుల♦నమరులరక్షింప నటునిచారించి
యంచిత దేవత్వ మటుమానివచ్చి♦యంచిననిట మానవత్వంబునొంది
జగదేకరక్షకై సరసిజోదరుఁడు♦జగతిపై రాముఁడై జనియించినాఁడు
వైరంబుగొని మనవధకొఱకైన♦నా రాముతోసంధి యదియేలపొసఁగు
వాలిదూలఁగఁబోయి వానరాశ్రితుని♦నీసమయంబున నేమని కాంతు
బలిజన్మమునకు నీపంకజోదరుడు♦
పొలుచువామనమూర్తిఁ బొంది తానరిగి [ధించె
ధరణిమూఁడడుగులు దానంబు వేఁడి♦ యరుదారఁగొనియప్పు డతనిబం
నొప్పారసుపకార మొనరించినతని♦కప్పుడె కావించె నపకారమితఁడు
పగఁగొన్నమనలను బరిమార్పకేల♦మగుడ నెక్కడిసంధి మనకురామునకు
నేనునీవునుగూడి యింద్రలోకంబు♦పైనెత్తిచని భుజాబలము లింపార
నిబిడవిక్రములైననిర్జరేంద్రాది♦విబుధులఁదోలనా విష్ణుఁడెందరిగె
నినుమేలుకొల్పుట నీతినీచేత♦వినఁగోరియే నీకు వెఱపేలపెట్టె
బ్రాఁ..భయంబునఁ బలుమాటలేల♦ప్రాణంబుతీపైన బ్రదుకు నెమ్మదిని
ఘనమైనమాయువుఁగరమర్థిఁగంటి♦మునుమిడిగలిచితిమూఁడులోకముల
ననుభవించితిఁ బెక్కులగురాజ్యసుఖము♦లనుపమంబగు తేజమంతంత కెసఁగ
నతిహీనవిక్రముఁడై నరామునకు♦నితరులగతినింక నే మ్రొక్కఁజాలఁ
బోరికిఁజనుమన్నఁబోనోపకీవు♦వారకయాడెదు వక్రోక్తులిట్లు
నిద్రవోవఁగఁబొమ్మ నెమ్మదినీవు♦నిద్రవోయెడివాని నిర్జింపరగులు
రామలక్ష్మణులను రవితనూభవుని♦భీమవిక్రములైన బిరుదువానరులు
నేనచంపెదఁబేర్చియెల్ల దేవతల♦నేనచంపెదవిష్ణు నేనచంపెదను
నోలినవ్విష్ణుని యొద్దిశూరులను♦నాలంబులోపల నధికదర్పమున
నెద్దెసఁగదిసిన నేనచంపెదను♦బెద్దకాలమునీవు పిఱికివై మనుము
అనిపల్కి వెండియు నద్దశాననుఁడు♦గనుఁగొని యాకుంభకర్ణుతోననియెఁ
జెలువారఁగానిటు సీతమైలక్ష్మి♦యై జనించుటయే నెఱుంగుదును [వ
అరయంగ రఘురాముఁడావిష్ణుడగుట♦బరికించి యెఱుఁగుదు భావంబులో
వలనొప్పదేవతల్ వానరులగుచు♦విలమీఁదజన్మించు టే నెఱుంగుదును
రాముచే మరణంబు రణములోనాకు♦నీమెయిసిద్ధించు టే నెఱుంగుదును
నెలమిఁగామంబున నేసీతఁదేను♦బలిమిఁగ్రోధంబునఁ బట్టియేఁదేను
రణములోపల రఘురాముచేనీల్గి♦ప్రణుతింపవిష్ణునిపరమపదంబు
దక్కఁగఁబొందంగఁ దలఁచియేసీత♦నిక్కంబు దెచ్చితి నింకేలదాఁప
ననిపెక్కుభంగుల నాడురావణునిఁ♦గనుఁగొని యాకుంభకర్ణుఁడిట్లనియె

నేనీకుఁగలుగంగ నేలతూలెదవు ♦ దానవనాథ మోదంబుననుండు [ముల
పగయడఁచెదనని పలికియాస్థాన ♦ మొగిసంకయునుజూచి యుచితవాక్య
నేఁడిందులోలేఁడు నిర్మలాచారుఁ ♦ డేడివిభీషణుం డింద్రారియనుడు
మనమీఁదరామలక్ష్మణు లెత్తివచ్చిన ♦ రనువార్తవినిసభ నందఱుఁగూడి
యాలోచననుసేయు నంతలోనీవు ♦ వాలినిన్నిద్రవో వడినేగుటయును
నిష్ఠతో రఘురామునికిఁగాఁగఁబెద్ద ♦ నిష్ఠురమతుఁడు నానెరినాటనాడె
నాడినఁదన్నితి నావిభీషణునిఁ ♦ గూడదునాకని కోపంబుపేర్మిఁ
దన్నియంతటఁబోక తాలిమిదక్కి ♦ యున్నఁజంపుదునని యోరటలేకంటి
ననవుడుననుఁబాసియారామునకడకుఁ జనియిప్పుడావిభీషణుఁడున్నవాఁడు
అనిచెప్పుటయుఁగార్యమదితుదముట్టె ♦ ననికిఁజోవుటయుక్తమనివిచారించి
యింకఁబోరాదని యింద్రారియెదుట ♦ నకకాఁడునుబోలెనతఁడిచ్చుబాస
కిట్టిభంజించెదఁ గీనాశునైనఁ ♦ బట్టిమర్దించెదఁ బద్మజునయిన
జిఱజిఱఁద్రిప్పెద శేషునినయిన ♦ వెఱగందఁజేసెద విహగేంద్రునయిన
బలువిడిద్రిమ్మెదఁ బ్రళయాగ్నినైనఁ ♦ జలముపెంగ్రోలెద జలనిధినైన
నేపారఁదోలెద విష్ణునినైన ♦ రూపఱఁజేసెద రుద్రునినైనఁ
గడఁగిఖండించెదఁ గాలునినైన ♦ మెడనుల్చివైచెద మృత్యువునైనఁ
వడిచెడఁజేసెద వరుణునినైనఁ ♦ గడువుచించెద నలకాపతినైనఁ
బిడికిలించెద రవిబింబంబునైనఁ ♦ బడఁద్రోచివచ్చెద బ్రహ్మాండమయినఁ
గోతులఁబట్టి మ్రింగుదుననుచెల్ల ♦ లేఁకనాసమర కేళీసముద్ధతికి
నామర్కటులనెల్ల నద్రుంకనిచి ♦ యామనుజులఁద్రుంతు నసురాధినాథ
నీమనంబలరంగ నెమ్మదినుండు ♦ రాముఁడునాచేత రణములోఁబడిన
సీతయనాథయై చిక్కునంతటను ♦ నీతలంచినకోర్కె నీకుసిద్ధించు
ననినమహోదరుం డావాక్యములకు ♦ ఘనభుజుండగు కుంభకర్ణుతోననియె
సత్కులంబుననీవు జనియించినాఁడ ♦ వుత్కటంబగుకార్యముచితమేనీకుఁ
దగనయానయములు దలపోయకిట్లు ♦ పగతుఁజంపెదనని పలుకునేఘనుఁడు
కోపంబుదీపింప ఘోరసింహంపు ♦ రూపుననున్నవాఁ డెసఁగుతేజమునఁ
గేవలమానవాకృతి గాఁడురాముఁ ♦ డావిష్ణుఁడీరూపమై వచ్చినాఁడు
ఆవాలినొకకోల నడఁచినశూరుఁ ♦ డావీరవరుగెల్వ నలవియేనీకుఁ
బ్రకటవిక్రముఁడైనపగవానిమీఁద ♦ నొకడపోవుటనాకునొడఁబాటుగాదు
బలముతోఁజని మహాబలుఁడైనరాము ♦ గెలువుమీవనిదశగ్రీవుతోననియె
నేముగల్గఁగనీకు నేలచింతింప ♦ నీమనోరథసిద్ధి సెఱపంగలేమె
జా..కికొఱకు విచారమేమిటికి ♦ నేనుసంపాతియు నీద్విజిహ్వుండు

గంభీరవిక్రమ కలితబాహుండు♦కుంభకర్ణునిఁ గూడికొనిపోయి రాము
నెలమి గెల్చితి మేని నేయుపాయమున ♦ నలనొప్పసిద్ధించు వైదేహినీకు
నటు కాక రామ నామాంకితబాణ ♦ చటులోగ్రపాతంబు సైరింపలేక
వడిభిన్నతనులమై వచ్చితి మేని ♦ లడరంగ నేము నీయనుగులకెరఁగి
ప్రణుతోగ్ర వానర బలముతోఁ గూడ ♦రణభూములోపల రామలక్ష్మణుల
వధియించి భక్షించి వచ్చితిమనుచు♦ నధిప చెప్పినమమ్ము నధిక మోదమున
నాలింగనము చేసి యర్థి మన్నించి ♦ పోలంగ నీవార్త పురములో నెల్ల
నీవు సాటించిన నిజముగా సీత ♦ భావించి యటమీఁదఁ బతియాస విడిచి
మతిఁ బూని నీమాట మతి సేయు ననిన♦వడనిఁ గోపించి యయ్యమరారిఁ జూచి
యీ బొంకులగు మాటలెల్ల నేమిటికి♦నా బాహుబల మేచి ననుఁ జూతు గాక
నిశ్చయంబుగ రాము నిర్జింతు బోర♦నిశ్చింతమున నుండు నీ కటమీఁద
ననికుంభకర్ణుఁడు దగ్రుఁడై పలుక♦విని రావణుఁడు గడు వేడ్క దీపింప
దనకుఁ బునర్జన్మ తా సిద్ధి గలిగె♦ నని చాల మోదించి యనుజన్ముఁ జూచి
చని యాజి రామలక్ష్మణుల నిర్జింతు♦వనసమ్మి నాఁడ నీయతులసత్వంబు
శౌర్యంబునందు నీసరియైన వీర♦వర్యులు లేరు ధ్రువంబివ్విధంబు [బుసేయు
మునుకొని శూలంబు మొదలుగాఁ గలుగు ♦ ఘనతరాయుధములఁ గయ్యం
మని ప్రీతి రెట్టింప నతనికి నిచ్చె♦ననుపమరత్నమయాభరణములు
నా రావణుని తమ్ముఁ డాభూషణములు వారక దాల్చి ప్రజ్వలితాంగుఁడగుచు
దనరారుపసిఁడి కత్తళ మొప్ప దొడఁగి♦వినుత సంధ్యాబుదావృతగిరివోలె
బహురత్నమేఖలా బద్ధుఁడై యొప్పె ♦ నహిరాజబద్ధ మంథాద్రిచందమున
నొప్పి రణోత్సాహ ముప్పొంగి పొంగి ♦

యప్పుడు చనుదెంచి యసురపుంగవుడు
త్రిజగద్భయంకర దీప్తమై పర్వ ♦ విజయసూచకభేరి వేయంగ బనిచె

—:* కుంభకర్ణుఁడు యుద్ధమునకు వెడలుట *:—

శూలిశూలముకంటె సొంపారి మొనల♦ వ్రాలిన మంటలుజ్జ్వలములై నిగుడ
నిప్పులు చెదర మానితమైన పూజ♦నొప్పి రత్నప్రభ నుజ్జ్వలంబగుచు
బ్రతివీర శోణిత భంజితంబైన♦యతుల శూలముఁ బట్టి యన్నకు మ్రొక్కి
యతని దీవనలతో నాసభాంతరము ♦ వితతసముద్యోగ వేగుఁడై వెడలె
నీకష్టతనువులో నేమేలనిలుతు ♦ మోకుంభకర్ణ రణోర్వరదీని
వ్రైతువు రమ్మని వాని ప్రాణంబు ♦ లాతతగతి నీడ్వ నరుగు చందమున
నంతరాక్షసకోటి యాకుంభకర్ణు♦నంతంత గూడి కయ్యంబున కరిగె
దురగంబు లెక్కి సింధురముల నెక్కి ♦ యరదంబు లెక్కి సింహాంబుల నెక్కి

కాటుకకొండలఁగతిఁ దనరారి ♦ మేటిదంష్ట్రింబుల మెఱుఁగులు చెదరఁ
గ్రౌర్యమంతయుఁ గూర్చికరులిడ్డకరణి ♦ శౌర్యంబు రూపులై చరియించుభంగి
గయ్యంబు సేసె యేకార్యంబు గాఁగ ♦ నయ్యాయి తెఱఁగుల నాటోప మొప్పఁ
బరిఘపట్టసగదా ప్రాసకోదండ ♦ కరవాలకుంత ముద్గరడించివాల
పరశుచక్రాయుధ పటుసాధనములు ♦ పరఁగఁ బదాతి యుద్భటవృత్తినడిచె
నీచందమునఁ గూడి యెల్లసైన్యములు ♦ వేచను దేర గర్వితచిత్తుఁ బగుచుఁ
బురకామినీతతి పుష్పవర్షములు ♦ గురియ రణోద్యోగి కుంభకర్ణుండు
చంద్రమండలనిభ చ్ఛత్రంబులొప్పఁ ♦ జంద్రబింబాస్యలు చామరలిడఁగ
దురగ హేషలును సింధురబృంహితములు ♦ వరరథ నేమినిస్వనపరంపరలు
పటుశరనిస్సాణ భాంకారములును ♦ పటహ భేరీశంఖపణవరావములు
ఘంటామృదంగ ధణ్కారవంబులును ♦

మింటదిక్కులనిండి మిగులమ్రోయగను

వెడలినయపుడు పృథ్వీచక్రమగలె ♦ జడధులుగలఁగె దిశావలివగిలె
గగనంబువడకె దిగ్గజములుమ్రగ్గె ♦ జగములు బెగడొందె శైలంబులురిలె
దౌర్జన్యమున దుష్ట దానవసీవు ♦ పర్జన్యునేచిన ఘనమింకఁగుడువు
మని రాఘవునకుఁ దోడై వచ్చి పేర్చి ♦ రసరార వాని నదల్చినమాడ్కిఁ
గలయంగ నప్పుడు కాల మేఘములును ♦ పలుమఱు బిడుగులుఁ పరగించి మ్రోసె
ఘోరంబుగా నార్చి త్రుళ్ళెడుపీనుఁ ♦ ఘోరాహవక్షోణిఁ గుపితుఁడై నట్టి
తారాధిపతి చేతఁ దారూపఱుటకు ♦ నీరాజవరుని చే నిటఁగూలుటకును
దారుసాక్షులమని తగఁ జెప్పుకరణి ♦ దారలు మండుచు ధరణిపై బడియె
ఘోరాజిలో నతిక్రూరుఁడై యసుర ♦ దారుణాకారత దర్పము పొంగ
తనుమున్ను నొంచిన దానికి ననిలుఁ ♦ డనయంబు రాముని యానతిపీనిఁ
బడవైతునని పేర్చి ప్రబలినమాడ్కి ♦ వడిగొని ప్రతికూల వాయువుల్ వీచె
రాముఁడుచ పసీ రాక్షసాధముఁడు ♦ నామీఁదబడు వేళ నాకెంత బలువు
పుట్టునోయని భీతిఁ బుట్టికంపించు ♦ నట్టిచందంబున నవనికంపించెఁ
బక్షపాతులమని పరికింపవలదు ♦ రాక్షసాధమసీవు రాఘవేశ్వరుని
ఖగముల చేఁ జావఁ గలవనుకరణి ♦ ఖగములు సుడివడగా బాఱజొచ్చె
నివియెల్లగొనక సాహసము రెట్టింప ♦ సవరణయుడుగ కుత్సాహంబు మిగుల
జూపుల చేతనే చూర్ణంబొనర్తు ♦ గోపించి వానర కులమెల్ల ననుచు
మేటియై వచ్చుచో మీఁటికన్గొనియెఁ ♦ గోటయువ్వలి కపికోటులనెల్ల
గపులును నా కుంభకర్ణుని జూచి ♦ విపరీత మారుత విధుల మేఘముల
కరణిఁ బాఱఁగ గుంభకర్ణుండు లంక ♦ యురవడి వెడలమిన్నొరలంగ నార్చె

నాయార్పువిని వానరావలియెల్ల ♦ బాయనిమూర్ఛలఁ బాల్పడిరంత
శరధిగలంగ భూస్థలిగంప ముందె ♦ సురలకుగడుభీతి నొచ్చె జిత్తముల
నంతవానరవీరు లంతలో దెలిసి ♦ యంత్రాకృతిగల యాకుంభకర్ణుఁ

—:* వానరవీరులు కుంభకర్ణునితో యుద్ధముసేయుట *:—

గిట్టిపాదములు గిరులుశృంగములు ♦ పట్టిబెట్టుగ నెదుర్పడి వ్రేసియార్చి
పోరిబోరిబోరుచోఁ బోనీక కదిసి ♦ తరుచరసేనపై దానవసేన
యురువడిగలన నిట్లుభయసైన్యములు ♦ బరవసంబున దలపడియెనావేళఁ
బ్రళయకాలమునాటి పటుసాగరములు ♦
దలకొనిరొండొంటి దార్కొన్నకరణి
నొడలును నెమ్ములు నూరులుబరులు ♦ పొడిపొడిగాఁ జేసి పోనీక మఱియుఁ
దవిలి ప్రేవులుమెడల్ దలలుఫాలములు ♦
నవియఁగఁ బెట్టు రథ్యముల ద్రొక్కించి
కడలగలించిన కత్తులచేతఁ ♦ గడికండలుగఁ జేసి కట్టల్కతోడ
నంతఁబోవక భూనభోంతరాళంబు ♦ నంతయుఁ గడువాఁడి యమ్ములఁ గప్పి
వడిఁ బేర్చి రథముల వారలిబ్బంగిఁ ♦ గడిమిఁజంపిరి మహోగ్రముగ వానరుల
వానరులు కురథావళులను గిట్టి ♦ పూవించి వెనుకకు బోవదన్నియును
గదునొగలలమి దిగ్గనేలతోడ ♦ నడచియు జఱిచి యల్లంత వైచియును
భయదంబుగాఁ జొచ్చి పదియుగళముల ♦
రయమునజదియ సారథుల ద్రొక్కియును
పెళపెళనరములు పెనచిరాదిగిది ♦ తలలురువడిద్రుంచి ధాత్రివైచియును
రథికులై పేర్చిన రాక్షసాధిపులఁ ♦ బృథుగతిఁజంపిరి పెక్కుచందముల
వదిగని రాక్షసుల్ ధీరరోషమున ♦ వదలక వానరావలిఁజుట్టుముట్టి
మదముపెంపునఁ బఱుమ మఱుకరిఘటల ♦ పదములసన్నలఁ బైగదియించి
కడకాళులొడిసి యుత్కర్షులై పట్టి ♦ యెడపక నేలపై నెత్తివ్రేసియును
మెదడునుబునుకలు మేదినిఁ గలయ ♦ బదములఁ ద్రొక్కించి భయదంబుగాఁగ
నొలిజూర్ణంబులై యుర్వినొండొండ ♦ రాలనుగ్ర ప్రదరంబు లేసియును
కరులపైనున్న రాక్షసులేపుమీఱ ♦ యురవడిఁజంపి రత్యుగ్రతఁ గపుల
గపులు నుగ్రంబుగాఁ గవిసియొంతయును ♦ గుపితులై గజములకొమ్ములబట్టి
గుదిచియూపణఁచియుఁ గుంభస్థలములఁ ♦ బదముఁ బరియలు వారవన్నియును
బలలబురక్తంబుబహుళాస్థిచయము గలయగాళ్ళను బట్టి కడత వేసియును
నాయేనుగుల మీఁద నలవుజలంబు ♦ వేయు భంగులఁజూపి వేగదానవుల
బట్టినవిండ్లను బాహువుల్తలలు ♦ నట్టుఁడమరువులు నవనిగూల్చియును

ననమునగపులుగ జారాఘులైన ♦ యసురులఁజంపి రత్యంతరౌద్రమున
గూడిదట్టము చేసికొని దైత్యవరులు ♦ వాడిమూకలను గ్రొవ్వడరంగగదిసి
పలుదెఱంగుల బాణపంక్తులేసియును ♦ నలుగుల సెలకట్టెయలను వేసియును
సునిశితఖడ్గ విస్ఫురణశోభిల్ల ♦ మొనసాచ్చి నవఖండములుగ వేసియును
ఉక్కులులైన రాహుతులేపుమీఱ ♦ తక్కక చంపిరి తరుచరాధిపుల
గిరుచరవరులును గిట్టియశ్వములఁ ♦ గరములదోఁకలు గాళ్ళనుబట్టి
దెసలకువైచియు దివికివైచియును ♦ వసుమతివైచియు వ్రచ్చివైచియును
బవఘట్టనంబుల బగులదాఁచియును ♦ వదలకయామీఁదివారిఁ వ్రచ్చియును
రాహుతులైన యారాక్షసాధిపుల ♦ సాహసంబుప నేల జమిరిరికడిమి
నప్పుడు రాక్షసు లధికదర్పమున ♦ నిప్పులుకన్నుల నివ్వటిల్లంగ
నమ్ముల వేసియు నసదరికుంతముల ♦ గ్రుమ్మియు సురియల గ్రుచ్చిత్రోఁచియును
శితఖడ్గకమిత్రి వేసియు ముద్గరముల ♦ వితతమూర్ఛలుగావించి మఱియు
గలయాయుధముల సగ్రతలుసూపియును

శిలల బాదపములఁ జెదరఁద్రోఁచియును

కడిమిసొంపు నిల్లు గాల్వురబట్టి ♦ బెడిదంబుగాగ జ పిరితరుచరులఁ
దరుచరపతులు పవాతిపైఁగదిసి ♦ పోరిబోరి నాయుధంబులు విఱిచియును
నెట్టనఁబవకర నికరంబులలమి ♦ చట్టలువాపియుఁ జమరివైచియును
ఇరుచేతులందును నిరువురఁబట్టి ♦ యురవడిఁదాటించి యుసులవైచియును
అట్టలుశిరములు నమరంగఁబట్టి ♦ దిట్టతనంబునఁ ద్రెంచివైచియును
నుడుగక చంపి రత్యుగ్రవేగమున ♦ గడిమిదీపింపఁ బెక్కుండ్రరాక్షసుల
నివ్విధంబుల బెచ్చి యిరువాగుఁబోర ♦ నవ్వనచరులందు నసురులయందు
నిండిన నెత్తురు నీళ్ళభంగియును ♦ గండలు నిండు చెంగల్వలమాడ్కి
మానితాస్యములు తామరలచందమున ♦ నానేత్రములు కుముదావళిపగిది
తోరంపుబ్రేవులు దూండ్లతెఱంగు ♦ పేరినమెదడును ఫేనంబురీతి
మొండువెండ్రుకలు తుమ్మెదలపోలికయు ♦ దండిశస్త్రంబులు దరగలవడువు
చామరావళులు హంసంబులు వొప్ప ♦ భూమిపరాగంబు పుప్పొడిక్రమము
గైకొనియపుడు సంగరమహీస్థలము ♦ భీకరంబయ్యును బెద్దయునొప్పె
ననిమిషారులపాలి యామృత్యుదేవి ♦ గొనకొనివర్తించు కొలనిచందమున
గానఁగదాయింకఁ గాకుత్స్థరాముఁ ♦ డూనినుజయలక్ష్మి కుఱికిపట్టయ్యె
సురఖేచరులు మెచ్చి సొంపారిరపుడు ♦ దురమున నిరువాగుఁ దొడరిపోరాడ
గపికోటినొచ్చిన గడగియుఁదండ ♦ కపినాయకులు చూచి కపటరాక్షసుల
గెరలిక్రోధంబున గిరిమహీజములఁ ♦ దరమిడినొప్పింప దానవుల్ బెదరి

కడువేగమున గుంభకర్ణుని వెనుక ♦ నడఁగిపాఱిరి శరణనుపల్కులెసఁగ
నాకుంభకర్ణుండు నద్దైత్యవరులఁ ♦ జేకొనిదిక్కులుచెదర నార్చుచును
నోడకోడకుఁడని యూరడింపుచును ♦ గూడిపైపై వచ్చు కోఁతుల నెల్లఁ
జూపులచేతనే చూర్ణింతుననుచుఁ ♦ గోపించిశూలంబు గొని పెచ్చుపెరిగి
బలితంపుగపికోటి పాలింటివిధియై ♦ కలుషత నేతెంచు కాలుఁడోయనగ
రావణుతమ్ముఁడు రాక్షసాధీశుఁ ♦ డావనచరకోటి నడఁగింపఁబొచ్చెఁ
గఱకైనయా కుంభకర్ణునియందు ♦ నెఱవైనకడిమికి నిలువకకపులు
వడిమూర్ఛనొందియుర్వరఁబడువారు ♦ కడివడి నెత్తురుల్ గ్రక్కెడువారు
వాతూలగతిదివి వడిఁబ్రాఱువారు ♦ సేతువుత్రోవనే చెడిపాఱువారు
నగువానరుఁ జూచి యంగదుండేచి ♦ తగనప్పుదలిబలోదగ్రుడై పలికె
నేలవానరులార యిటుచెడిపాఱ ♦ నేలినపతిడించి యేపుపోకార్చి
వరకపీంద్రులుమహావంశవర్ధనులు ♦ కెరలిపాఱుదురె ప్రాకృతులచందమున
రామునిముందర రణములోఁబడిన ♦ రామణీయకసుర రాజ్యంబుగలుగు
నటుగాక బ్రతికిన నతికీర్తిగలుగు ♦ నిటుమగఁడుఁడుపాఱ నేఁమిగాకనుచు
బుద్ధులుసెప్పుచు పురికొల్పికొనుచు ♦ గ్రద్దనమఁడించెఁ గపికోటిసెల్ల
నాకపులంగదు నతులవాక్యములు ♦ గైకొనిరొప్ప నాకర్ణించిమించి
ప్రాణ బులిత్తుము రామునకతని ♦ ప్రాణంబుకన్న మాప్రాణ మేలనుచు
గొండలుగొని తెచ్చి కోయనియార్చి ♦ కొండఁబోలినదైత్యు గొండలవైవ
శూలంబుగొసికడుఁ జూర్ణంబుచేసె ♦ నాలోనరాక్షసుం డాపర్వతముల
వదలక యంతబోపక రౌద్రమెసగ ♦ గదచేతఁగొని త్రిప్పికడగి వేయుటయు
బదియేనుకోటులే బదియేడులక్ష ♦ లదనముపదివేలు నార్వూరుకపుల
హుంకారరవముల నుగ్రతమెఱసి ♦ కింకతోనారణక్షితిమీఁదగూల్చెఁ
జెలఁగియంతటఁబోక చేతులఁగపుల ♦ బలుడికబళించెఁబగ రౌద్రమెసగ
గరుడుండువడినురగంబుల మ్రింగు ♦ కరణినెంతయుభయంకరవృత్తిదోప
వీక్షించియిరువది వేవురుకపుల ♦ నక్షణంబునమఱి యార్వూరుకపుల
లక్షించియెనిమిది లక్షలకపుల ♦ రాక్షసాధీశుండు రయమునమ్రింగె
మ్రింగియంతటికంటె మిక్కుటంబగుచుఁ

సంగరాంగణమునఁ జరియింపుచుండె

నరభోజనుండు వానరభోజనుండు ♦ ధరణిపైదానయ్యె దప్పించుచుండ
ఘూర్ణిల్లుచునుముక్కు గోళ్లందునోట ♦ గర్ణరంధ్రంబుల గపిసేనవెడలె
వంతనాతనిగదా హతిఁబడ్డకోఁతు ♦ లెంతయుఁదమమూర్ఛ లెల్లను దెలిసి

యార్పులతోఁదరు లద్రులుదెచ్చి ♦ దర్పించినిలిచిరి దానవునెదురఁ
గనలుచుద్వివిదుండు గండశైలంబు ♦ గొనియపుడసురవక్షోవీథిఁబగుల
నడరింపనదిదాఁకి యంతటమిట్టి ♦ పడియెరాత్రించర బలములుజడియ
నప్పుడుహనుమంతుఁ డధికరోషమున ♦ నిప్పులురాలెడు నేత్రంబులొప్ప
గిరిపాదపములెత్తి గిరికొనవైవ ♦ నురువడిదైత్యుఁ డత్యుగ్రశూలమునఁ
దుమురుసేయుచునుబ్రద్రోచిరామతియు ♦
నమరులు మెచ్చంగ నాంజనేయుండు
నసురపైవైచె మహాపర్వతంబు ♦ నసమానబలుడని యందఱుఁబొగడ
దానిచేనాదైత్యు తనువుగంపించి ♦ మేనెల్ల నెత్తురు మిక్కుటంబయ్యె
దానవెంతయునొచ్చి దానవేశ్వరుఁడు ♦ మానక మెఱుగులుమంటలుగ్రమ్మ
భూతలంబగల నభోభామ్రదువ ♦ భీకల్పినిర్జర బృందంబుదలఁకఁ
గరముగ్రమైనట్టి ఘనతరశూల ♦ మురువడిఁబూని సముల్లాసియగుచు
మడవకశక్తి కుమారుండుపేర్చి ♦ వడిగ్రౌంచగిరిమీఁద వైచినకరణి
హనుమంతుపైనెత్తియుతిరభసమున వనచరుల్ బెదరంగవైచెనయ్యసుర
నటువైవదాన నఖ్యనిఁజనురము ♦ పటపటబగుల నప్పావనియపుడు
ఉరుకోపరసమొల్ల నుమియుచందమున ♦
దురములోబడియె నెత్తురులుగ్రక్కుచును
బ్రళయకాలమునాటిపటుమేఘరవము ♦ బలువున నెంతయుబరగరొజుచును
గపులుగంపింప రాక్షసులు మోదింపఁ ♦ కపిశేఖరుడుగూలె కలలావృదూలి
యాలంబులోనప్పు డనిలజుపాటు ♦ నీలుడుగనుగొని నెరయఁకోపమునఁ
గైకొనివైచె రాక్షసులెల్లబెదర ♦ నాకుంభకర్ణు మహాపర్వతమున
వడిలోడబైబడ వచ్చుపర్వతము ♦ బెడిదపుగావాడు పిడికిటఁబొడిచెఁ
బొడిచినదియు నద్భుతముగాఁ జెదరి ♦ యెడపకచిఱుమంటలెగసినుగ్గయ్యె
నమరారిపై నప్పు డాగ్రహవ్యగ్రు ♦ లమితబలోదగ్రులై మహాకపులు
చలమునఋషభుండు శరభుండుబేర్చి ♦ కలుషతనలుఁడును గంధమాదనుడు
నగ్గవాక్షుండును నధికరోషంబు ♦ లగ్గలింపఁగనప్పు డడరిపెల్లార్చి
తరమిడివానిపై దరులువైచియును ♦ గిరులువ్రేసియు బిడికిళ్లబొడ్చియుకు
బదములదన్నియు బటునఖప్రతతి ♦ విదళించియునుబహువిధములనొంచి
యేచినదన్నియు నింతగైకొనక ♦ యేచియద్దానవుండెసఁగరౌద్రమునఁ
బటుతరంబుగనేలఁ బడితన్నుకొనఁగ ♦ జటులతబిడికిట శరభునిఁబొడిచె
నురువడిఋషభుని నొడిసిరాఁదిగిచి ♦ కరములఁ గొనిముద్దగాఁగబలిండె
గుదికిలఁబడితన్ను కొనిగుండెలవియ ♦ గదిసియన్నీలు మోకాళ్లదాటించె

నసమున నిగుడు గవాక్షుని గిట్టి ♦ యసురేశుఁడర చేత నదరంట నేసెఁ
గ్రమ్మఁ దెగువమై గంధమాదనుని ♦ బిమ్మిటిగొని వ్రేల్లఁ బెడ చేత వ్రేసి
రయమున రాఁగరసములు గ్రక్క ♦ క్రియ నెత్తురులు గ్రక్కి కెడసిరి కపులు
శూలంబు ద్రిప్పి యార్చుచు నట్టహాస ♦ లోలుఁడై యాలంబులో దిరుగుచును
వితత వజ్రాభీల వృత్రారి ధంగి ♦ నతుఁ దండోద్దండ యముని చందమున
గడు భయంకరవృత్తి గాఁగ బెల్లార్చి ♦ మండివడ నెమ్మొగంబున నిప్పులురుల
బ్రళయకాలము నాఁటి పటుశూరుచులఁ ♦
దొలుకాడు నాది రుద్రుని తెఱంగునను
మెఱసె బొమ్మను మాట మిక్కిలిగాఁగ ♦ నెఱవారనందఱ నిర్జించెఁ గాన
నప్పుడు సుగ్రీవుఁ డని సేయ నాకు ♦ నిప్పుడు తఱియని యిచ్ఛ జింతించి
కులశైలపతిమీఁద గోపించి వచ్చు ♦ బలభేది పగిది నప్రతిమసాహసుఁడు
పొరిబొరి సర్వాంగములు పెంచి పేర్చి ♦ పరుషరోషానల ప్రథలుప్పతిల్లి
కొండలకెల్లను గొండయైనట్టి ♦ కొండనా నొక పెద్ద కొండ చేపట్టి
కోతులు నెత్తుట గొమరొప్పఁ దోఁగి ♦ మాఱఁటియుఁ దనువును ముదఱియై తోఁచి
వీక్షింపనరుదైన వేషంబుతోడ ♦ రాక్షసాధీశుపై రయమున వచ్చి
నన్నెఱుంగవె యేను నలినాప్తసుతుఁడు ♦ సన్నుతుఁడగు రామచంద్రుని బంట
నీకు వాకును గాక నిష్ఠుర యుద్ధ ♦ మీక పికోటుల నేల చంపెదవు
అని పేర్చి సుగ్రీవుఁ డాడు వాక్యములు ♦ విని కుంభకర్ణుండు విపులరోషమున
సుగ్రీవ కడు నిన్ను శూరుఁడవను ♦ రాగ్రహింతురె శూరులని వెలిఁగాఁగ
శూరతరణమునఁ జూపుదుఁగాక ♦ యూరక వెడమాట లొప్పునే నీకు
వనరాక్షసుని మీఁద నర్కనందనుఁడు ♦ కినిసి తాఁ దెచ్చిన గిరి యెత్తి వైచె
వైచిన నది వాని వక్షంబుఁ దాఁకి ♦ చూచుచునంతటిలోనఁ జూర్ణమై రాలె
నా బెట్టిదమునకు నార్చి నిర్వాకు ♦ నా బల్లిదుని చేత నసుర స్రుక్కియును
దడయక యత్యంత ధైర్యంబుతోడ ♦ గడు భయంకరవృత్తి గాఁగ బెల్లార్చి
దిగులొందియఁగ చరాధిపులగుండియలు ♦
పగులంగ నిలువున బ్రాణముల్ వోవ
జగతీతలము నాకసంబు దిక్కులును ♦ నగలరాక్షసుఁ డట్టహాసంబు చేసి
హుంకారరవమున నుగ్రత మెఱయఁ ♦ గింకిణీఘటికా ఘీంకారరవము
వాసికెక్కిన యిరుపదివేల తలలఁ ♦ జేసి గంధాక్షతార్చిత మూర్తినొప్పు
శూలంబు నిర్జరాసురులకు నైనఁ ♦ దాలుప వేగ్రైన దాని సక్షణము
సుగ్రీవు మీఁద వైచుటయును శూల ♦ ముగ్రంపు మంటల నుజ్జ్వలంబగుచు
నేలయు నింగియు నిఖిలదిక్కులును ♦ జాలంగ దరికొని సాగి మండుచును

బదివేలపిడుగుల పగిది మ్రోయుచును ♦ వదలకర్కజు మీఁదవచ్చుటఁజూచి
ఘనవిష జ్వాలోరగప్రభుఁగిట్టి ♦ వినతాత్మజుఁడుద్రుంచి వెరవుదీపింప
నెడసొచ్చి హనుమంతుఁడే పారనొడిసి ♦ కడుబెక్కు వ్రయ్యలుగాఁ ద్రుంచివైచి
కప్పించిదాటి యెక్కుడు పేర్మినార్చె ♦ నప్పుడు వానరులందఱుఁబొగడ
శూల బుఱుచుటఁ జూచికోపించి ♦ యాలోన వేగ నయ్యసురేశ్వరుండు
కనలుచువచ్చి లంకా మలయాద్రి ♦ ఘనశృంగమెత్తి యర్కజుమీఁదవైవ
నుగ్రమ్మగా నదియురము దాఁకుటయు ♦ సుగ్రీవుఁడపుడు గోజుచునేఁబడియె

—:* సుగ్రీవుఁడు కుంభకర్ణునిచే మూర్ఛనొందుట *:—

నాతఁడు పడుటకు నఖిలరాక్షసులు ♦ చేతోగతులయందు జెలఁగియార్వఁగను
గుంభకర్ణుఁడతఁ గ్రూరుఁడై వచ్చి ♦ కుంభినిఁబడియున్న గురుసత్త్వధనుని
గనుఁగొనితలపోయఁ గపిబలంబునకు ♦ ఇనకులేశ్వరునకు నీతండెలావు
ఈతఁడు పడుటచే నెల్లవానరులు ♦ భూతలంబునఁబడి పొలిసినయట్ల
సుగ్రీవుమాయున్న చూచుగాకనుచు ♦ నుగ్రుఁడై కొనిపోయె నొకరలంకకును
గాలానిలము వచ్చి కాలమేఘమును ♦ గూలించి గుహకునుఁ గొనిపోవుకరణి
వటసురాళియెల్ల నకటసుగ్రీవుఁ ♦ డిటుపట్టువడిపోవు నేయనివగవ
నక్కుంభకర్ణుని యలవుజలంబు ♦ దక్కకయుందంద దనుజులువొగడ
వెతకొని రవిసుతు విడిపింపలేక ♦ వనచరులాహార కంబులుసేయు
శరభుండు ఋషభుండు జాంబవంతుండు ♦

శరభుండు ధూమ్రుండు సౌముండు హరియు
గిరిభేదిసుతరుండు కేసరిపృథుఁడు ♦ హరిరోముఁడును పాపకాక్షుఁడు హరుఁడు
ద్వివిదుండు మైందుండు వేగవంతుండు ♦ గవయుండు శతబలి గజుండు దుర్ధరుడు
సుముఖుండు తాలపాదుఁడు గవాక్షుండు ♦

కుముదుఁడు జ్యోతిర్ముఖుఁడు సుషేణుండు
దధిముఖుడును వేగదర్శి రంభుండు ♦ గ్రథనుండు ధూమ్రుండు గంధమాదనుడు
తారుండు క్రోధన తపన ప్రజంఘు ♦ ఘోరాక్షజంఘాల గోముఖవిముఖ
పనససన్నాద సంపాతీంద్రజాల ♦ వినుతసుదంష్ట్రిక శ్వేతదుర్ముఖులు
వీరాదిగాఁగల వీరవానరులు ♦ దారుణాకారులు దగ్రవిక్రములు
ధారణీధరములు తరువులుగొనుచు ♦ నాయూథభుజసత్త్వులై మింటికెగసి
యట్టహాసంబుల నార్పులదిక్కు ♦ లట్టిట్టుగాఁగ బ్రహ్మాండంబువగుల
వినసుతువిడిపింత మెల్లననుచు ♦ దనుజునిపైఁబడఁ దమకించునపుడు
కరమెత్తివలదని కరువలిసుతుఁడు ♦ వరనీతిమతిగాన వారికిట్లనియె
భానుతనూజుఁ డుద్భటశౌర్యవర్యుఁ ♦ డూనినమూర్ఛచే నున్నాడుగాని

యామూర్ఛ బాసిన నాత్మలో దెలిసి ♦
    యామహాత్ముఁడువచ్చు నటుగాన మనము
విడువనియసుర బే విడిపించుకొన్న ♦ గడులాఘవంబున గపికులేశ్వరుఁడు
మదిలోననెప్పుడు మఱగుచునుండు ♦ నిదివిచారముగాదు యించుకసైచు
డటుచూడనీలోన నతడురాకున్న ♦ దుటిలంపురావణ కుంభకర్ణులను
జటులవిక్రములైన సకలరాక్షసులఁ ♦ బటుముష్టినిహతుల భగ్నంబు చేసి
హాటకదీప్తుల నలరెడునేడు ♦ కోటలులంకయుఁ గూలంగఁదన్ని [మి
ప్రళయంబునొందించి భానుజుఁగూడి ♦ చలము కోపముమీఱ జనుదెంతమెల
ననియిటుహనుమంతు డాడువాక్యముల ♦
    మనములనలరి యామర్కటేశ్వరులు
వినువీథినత్యంత వేగులై దనుజు ♦ వెదకొనిపోవ నావిభు మెఱుంగకయ
అటగుంభకర్ణుండునర్కజుగొనుచు ♦ బటురయంబున జొచ్చె బలియుఁడైలంక
రాజమార్గంబుల రామేడలందు ♦ రాజిల్లునా గోపురంబులయందు

—:* సుగ్రీవుఁడు మూర్ఛదేరి కుంభకర్ణుని విరూపునిగా జేయుట *:—

నొప్పడిపురకాంత లొగిబుష్పవృష్టి ♦ యప్పుడుకురియంగనర్కనందనుఁడు
దెలిసియాపురవీథిఁ దెరగొనిచూచి ♦ వెలవెలనైకను వెఱఁగందికుంది
యిటుపట్టువడితినే యీదైత్యుచేత ♦ బటుతరమూర్ఛచే బడియింత తడవు
అనికరములబట్టి యాదైత్యుచెవులు ♦ పెనచితమ్మలతోడ బెఱికిరాదిగిచి
బొటములతోముక్కు బోసిపోగఱచి ♦ పటుగతిమీదికి భానుజుండెగయ
నిమ్ములబోనీక నేచిరాక్షసుఁడు ♦ క్రమ్మఱనాతని కాళ్ళొగిఁబట్టి
నేలతో నేసిన నెగసిసుగ్రీవుఁ ♦ డేలినపతికడ కేగెనయ్యెడను
సురలోకసంబున జోద్యంబునొంద ♦ దఱుచరపతులెల్ల దనుజూచిమ్రొక్క
వారునుదానును వచ్చిసుగ్రీవుఁ ♦ డారామచంద్రుని యడుగులకెరఁగ
నాలింగనముచేసె నంతరాఘవుఁడు ♦ నాలోనగపులెల్ల నానందమంది
రాక్షసురేశ్వరుం డటుముక్కుజెవులు ♦ వోయిన నెంతయు బుద్ధిలోరోసి
మునుచెలియలిబన్న మునకునై యాత్మ ♦ నెనసినసిగ్గులు నగ్గొనరింప
వనజాప్తకులునితో నలవనివైర ♦ మునమగటిమితోడఁ బోరాడుచున్న
నాకారికడకు మానముగోలుపోయి ♦ యీకష్టతనువుతో నేమనిపోదుఁ
బోరికినుచితంబు పోవుట యనుచు ♦ నారక్తపూరంబు లందందఁ గ్రమ్మ
తనువుననిండ నుద్దండవర్తనుఁడు ♦ ఘనతరరోషంబు గడలుకొనంగఁ
జేవురుచాయల సెలయేఱులమరఁ ♦ గావచ్చునీలాద్రి కైవడిదోఁప
నటుగాకపోఁడు యుగాంతంబునాఁటి ♦ చటులాగ్నియన రణస్థలికి నేతెంచి

యటిమటిఁ గోపించి యగచరసేనఁ ♦ దటిమిదానవుఁ డత్యుగ్రుఁడై మెఱసి
కడునుగ్రముగఁ గడకాళ్లోఁగిఁ బట్టి ♦ వడిఁ ద్రిప్పి త్రిప్పి యుర్వర వ్రేసి వ్రేసి
బిఱబిఱఁ బ్రేవులు పిడికిటితోఁ ♦ జెతికిరాఁ గొందఱఁ బిడికిళ్ల బొడిచి
విబ్బరంబుగ దాచి నెరయ గుండియలు ♦
ద్రొబ్బలునురకంగఁ ద్రొక్కి పాదముల
బిఱుగులఁ బోలెడు నెడచేతులెత్తి ♦ కడునుగ్రముగ మన్నుఁ గఱువంగ నేసి
తనమీఁదఁ బ్రాకిన తెరుచరాళుల ♦ వినవిస్మయంబుగా వేనిగ్రహించి
యగపడ్డ రాక్షసు నైనను బట్టి ♦ తిగిచి వేగమునఁ గుత్తికలోవవైచు
ఝుంకారరవముల శవములు సేయు ♦ హుంకారరవముల నుసురులు వెఱుకు
దివిజవిమానముల్ దిరుగుడుపడఁగఁ ♦ దివిచి మర్కటులమీఁదికి నెత్తివైచు
నగసినకపులతో నేటుదాఁకంగ ♦ నగచరావలిఁ బట్టి యందందవైచు
నెమ్ములునురుముగా నేపారఁ ద్రిప్పి ♦ యిమ్ములఁ గొందర నెడగల్గవైచుఁ
గొందఱ నిరుగేలఁ గుదియఁగఁ బట్టి ♦ యందందఁ దాటించి యల్లంతవైచుఁ
నీవానరులఁ జూడుఁ డేర్పడననుచు ♦ లావునఁ గొందఱ లంకలో వైచుఁ
బెంపారనిను గట్టి పేర్చినకపుల ♦ ముంపుమీయని యబ్ధి మునుఁగంగవైచు
నివ్విధంబున దానవేశ్వరుం డెలమి ♦ నవ్వానరుల దిక్కులం దెల్లవైచు
మేదినియందును మిన్నులయందు ♦ నే దిక్కులందును నెడము లేకుండఁ
బడఁ జచ్చుకపులును బడిదొల్లుకపులు ♦
బడి కూఁతలిడుకపుల్ భ్రమనొందుకపులుఁ [లు
బడి తన్నుకొనుకపుల్ పడి రోఁజుకపులు ♦ పడియున్న కపులును బడి యెదుకపు
నై రణస్థలియెల్ల నగచరాక్రోశ ♦ మా రాక్షసుని చేత నగ్గలంబయ్యె
నా కుంభకర్ణుని యత్యుగ్రభీష ♦ ణాకృతి కాలాంతకాకృతియైన
వణఁగె దారాపతి యణఁగె నంగదుఁడు ♦ నణఁగె గవాక్షుఁ డున్నతి దక్కె గజుఁడు
చలియించె ఋషభుండు శంకించె నలుఁడు ♦ పెలుకురె నీలుండు బెగ్గలె బృథుఁడు
వెఱఁగందె శరభుండు నెఱచె ధూమ్రుండు ♦
నురుకంపమును బొందె నొగిఁ బనసుండు
కడుభీతినొందెను గంధమాధనుఁడు ♦ నడరి చూచుచుండె ననిలనందనుఁడు
చూడబయఁ బొందె జ్యోతిర్ముఖుండు ♦ జాడ చేకొని పాఱె జాంబవంతుండు
ఉలికిరి వెండియు నున్న వానరులు ♦ కలయ నంతటఁ గుంభకర్ణునిఁ జూచి
ఘనబాహుబలుఁడు లక్ష్మణుఁడు గోపించి ♦ చనుమరనాటించి శరము లేడింట
మఱియు బెక్కంటఁ లక్ష్మణదేవుఁ డేయ ♦ గఱకు రాక్షసుఁడు లక్ష్మణుని గైకొనక
బలువిడి రాఁగ నా పాదమస్తకము ♦ లలమి ప్రాకిరి కపు లాదైత్యుమేన

వలిగిమీసములు నుయ్యాలలూఁగుచును ♦
కలుషతదోఁకలఁ గలయఁజుట్టుచును
నతిమాత్రఁగవిసి యయ్యైసంధులందు ♦ వఱలంగలాగులు వైచిహత్తుచును
జిందఱవందఱ చేసినసుర ♦ డెందంబులోని కడిందికోపమున
పటుసత్త్వలై తనపైనున్నకపుల ♦ జటులమత్తేభంబు జాడించుకరణి
౫౭ కేళిఁదనిసిన సమదసూకరము ♦ వెలయబిందులురాల విదిచినభంగి
ప్రళయకాలమునాఁటి బ్రహ్మాండతలము ♦ దులదులచుక్కలఁదుల్చుకైవడిని
తనమీఁదఁబ్రాకిన తరుచరావళులఁ ♦ తనవుగదల్చి యద్ధరణిపైఁగూల్చె
నప్పుడువిస్మితుండై కుంభకర్ణుఁ ♦ దప్పకఁగనుఁగొని తనకన్నుగవల
నిప్పులురాలంగ నిగిడికోపమున ♦ నప్పన్నగాధీశు నాకృతిగలిగి
కరమొప్పకాంచన కార్ముకంబెత్తి ♦ నిరుపమబాణ తూణీరముల్బిగిచి
భీమవిక్రమకళా భేద్యుఁడై కనలి ♦ రాముండునడుచు సంరంభంబుఁజూచి
సమరమహారంభ చతురులొండొండఁ ♦ దమకంబునిండ నుద్దండవర్తనులు
పరుషాద్రిపాషాణ పాదపావళులు ♦ ధరియించియుగ్రులై తరుచరాధిపులు
నొగిసప్తపాతాళ ములునుభేదిల్ల ♦ నొగిఁగూర్మముగలఁగ నుదధులగలఁగ
దిగిభంబులడరంగ దివితల్లడిల్ల ♦ నగచరాధీశుల కతిధైర్యమొదవ
నదిమికుప్పించి మిన్నగలఁబెల్లెగసి ♦ యుదితవిక్రములు మహోగ్రభీకరులు
సురసిద్ధసాధ్యులు సారెదిగీర్తింపఁ ♦ గరమర్థినడువ రాక్షసుఁడెదురేగ
నాపతిముందట నావిభీషణుఁడు ♦ కోపంబుతోఁగదఁ గొనిశౌర్యమునను
గడువేగమునఁగుంభకర్ణునిమ్రోలఁ ♦ బుడమిచలింప నప్పుడువచ్చినిలిచె
నావిభీషణుఁజూచి యనియెనవ్వుచును ♦ రావణుతమ్ముఁడ రాక్షసేశ్వరుఁడ
వినువిభీషణనీదు విక్రమంబునకు ♦ ననువైనతెఱఁగిది యధిపతియొద్ద
విన్నరనాథుని హృదయంబెపట్టు ♦ మన్నదమ్ములపాడి యనిస్రుక్కవలదు
పూనియెన్నఁడుఁగన్న బాఁదవాపదలు ♦ భానువంశునికృపఁ బడసితిగాన
నారాముదయగల దటమీఁదనీవు ♦ సారదయోదయ శ్లాఘ్యచిత్తుఁడవు
లంకసద్గుణగణా లంకృతినేల ♦ నింకనెవ్వరుగల రిటనీవెకాక [దుట
సాహసబల మహోత్సాహంబుమిగిలి ♦ యాహవంబునవేగ మడరిసాయె
మగతనంబును బాడి మనసునఁదలఁచి ♦ తగనీవునాతోడఁ దాకుమటంచుఁ
బలికితిగాని యీపట్టుననిలువ ♦ వలదొక్కఁడై నను వలయువంశమున
ననినవిభీషణుం డన్నతోననియె ♦ దనుజకులంబెల్లదగ్ధమైపోవు

—:* విభీషణుఁడు కుంభకర్ణునికి నీతి జెప్పుట * —

వసుధయంబున మనయన్నతోఁదెలియ ♦ ఘనమైననీతి ప్రకారంబులెల్లఁ

చెప్పితినేను నేర్చినయంతవట్టు ♦ చెప్పిననామాటఁ జేకొనఁడయ్యె
నట్టుఁగానన్నును నున్ననుబాసి ♦ యిటువచ్చి శ్రీరాము నేఁబొడగంటి
నని చెప్పుచును దనయంతరంగమున ♦ దనుజేశు నవనీతిఁ దలపోసిపోసి
కన్నీరుదొరఁగంగఁ గడుదుఃఖమందె ♦ యున్నజాడఁగలేక యవ్వలఁ దొలఁగ
నారాఘవేశ్వరుఁ డనుజన్మయుక్తుఁ ♦ డై రణోద్యోగుఁడై హరులతోఁ గూడ
ఘనరౌద్రరసము రాక్షసరూపుఁ దాల్చి ♦ యనికి నేతెంచెనో యనఁదగువానిఁ
జారుకోటీర భూషణములవాని ♦ వీరరసావేశ వేషంబువాని
ధీరుఁడై కపులను దెగఁ జూచువానిఁ ♦ దోరంపు నెత్తుటఁ దోఁగినవాని [డు
కనుఁగొని మదిలోనఁ గ వెఱఁగంది మనుకులోత్తముఁడు రామక్షితీశ్వరుఁ
నారికై పుట్టిన నాకోపమెల్ల ♦ నారి చేఁ జూపెద నాకారికనుచు
నార్చుచువచ్చు నయ్యసురుకోపాగ్ని ♦ నార్పెదశరవృష్టి నని బిట్టుఁగవిసి
కరియూనని జధర్మగతిఁ జెందునెడు ♦ కరణి దిక్కరులు ఘీంకారము ల్సేయ
నింకనీలుఁగఁ జేయు శ్రీరాము నలుక ♦ లంకేశు ననుమాడ్కి లంక ఘూర్ణిల్ల
నెరయంగ జగములన్నియుఁ జెవుడ్పడఁగ ♦

గురులేనిరవముగా గుణము మ్రోయించె

నాగుణధ్వనివిని యులుకమై నెదురుఁ ♦ గాగర్వమునఁ గుంభకర్ణుండురాఁగ
మానైన దర్పంపు మాటలింపార ♦ వానితో ననియె నా వనజాప్తకులుఁడు
ఏరరాక్షసునీకు నెదురంగరాదు ♦ ధీరుఁడవై యింకఁ దెగువ వాటించి
యమరులు మెచ్చంగ సమరినా యెదుట ♦ సమరంబుసేయంగ జక్కఁగా నిలువు
మటుగాక కపటుఁడవై మాయఁ బన్ని ♦ యెటుపోయిననునిన్ను నేలపో నిత్తు
గావవేయునిపోయి కమలజుఁగన్నఁ ♦ గావనా బ్రహ్మలోకము నాకు నెదురె
కావవేయనిపోయి కఱకంఠుఁగన్నఁ ♦ గావనారుద్రలోకము నాకు నెదురె
కావవేయని పేర్చి కమలాక్షుఁగన్న ♦ గానవావిష్ణులోకము నాకు నెదురె
యని పేర్చి పలికిన నా రాముపలుకు ♦ వినికుంభకర్ణుండు విపులంబుగాఁగ
దిగులొందియుఁ జరాధిపులగుండియలు ♦

వగిలి నిల్లులతోఁడ బ్రాణములవ్వ

జగతీతలము నాకసము దిక్కులెల్ల ♦ నగలరాక్షసుఁ డట్టహాసంబుచేసి
నలువొందనా రామ నరనాథుఁ జూచి ♦ పలికెను ద్భట రణప్రౌఢిదీపింప
వెడఁగు మాయలువన్ని వెఱచినీచేత ♦ మడియఁగ నే నల్ల మారీచిగాను
రయమున నీచేత రఘురామచంద్ర ♦ భయమున జావఁగ బంధుండఁగాను
గ్రమమొప్ప నీశరఘట్టనచేఁ ♦ రమణమైఁ గూల విరాధుండఁగాను
అనిమొన నొక్కకోల నవనిపైఁ గూల ♦ నినకులాధీశ్వర యేవాలిఁగాను

చేతివిల్లిచ్చి నీచేఁ భంగమొందఁ♦బూతాత్ముఁడగు ఋషిపుత్రుండఁ గాను
రావణుతమ్ముఁడ రాక్షసేశ్వరుఁడ♦దేవకంటకుఁడను దీప్తవిక్రముఁడ
నన్నెఱుంగవె రామ నగచరకోటి ♦ గ్రొన్నెత్తురానిన కుంభకర్ణుఁడను
యెఱుఁగక బ్రహ్మయు నింద్రుండునన్నుఁ♦గఱపిన బేలనై గర్వించిపుట్టి
యీతరుచరునమ్మి యినకులేశ్వరుఁడ ♦ నాతోడియుద్ధంబునకు వచ్చితీవు
ఘనమైన పరుమ రాక్షసభామణములు♦సనకాదియోగీంద్రసన్నుతుల్ గావు
ఉరవడిఁబఱతెంచు నుగ్రదానవులు ♦పరిచారికామర ప్రతతులుగావు
చలమునవార్చు రాక్షసభటోత్తములు నలిఁబాడుతుంబురునారదుల్ గారు
వ్రాలుచునీమీఁద వచ్చువాగాలి♦యాలవట్టంబుల యనిలంబుగాదు
యుద్ధరంగం బమృతోదధిగాదు♦యుద్ధంబుమఱి కొలువుండుటగాదు
ఇట్టేలపుట్టితి వియ్యాజిబోవ♦నట్టిసౌఖ్యంబు నీకవనీశకలదె
యదిచెప్పనేల నిన్ననియెడిదేమి ♦ యిదెచూడునాగద యెట్టిదోరామ
దీనఁబోగెలిచితి దేవసంఘముల ♦ దీనికిసాటియె దివ్యాయుధములు
బలమును శౌర్యంబు బాహువిక్రమము♦గలదేనిఘోరాజిగదియుమునన్ను
నెఱియనీయందలి నిజశక్తిఁజూచి ♦ మఱినిన్నుఁజంపెద మానవాధీశ

—*: శ్రీరామునిచేఁ గుంభకర్ణుఁడు కూలుట :*—

యనుటయురఘురాముఁ డలిగివేగమున ♦
ఘనశిలీ ముఖములు గడుఁబెక్కువేలు
నావాలినేసిన యట్టిబాణంబు♦దేవకంటకుమీఁదఁ దివిరియేయుటయు
జలబిందువులుగ్రోలు చాతకంబనఁగ♦బలువిడి నాబాణపఙ్క్తులగ్రోలి
కరముగ్రమైన ముద్గరముఁద్రిప్పుచును♦బరుపడివానరపతులఁద్రోలుచును
యెదురుఁగాజనుదెంచునింద్రారిఁజూచి మదిలెక్కసేయక మానవేశ్వరుడు
కవిసియుద్భటిగదా కలితహస్తంబు♦నవలీలఁదెగనేసె ననిలబాణమున
దానిపాటునకుఁ గొందఱుతరుచరులు♦నానావిధంబుల నలుదెసఁబాఱ
నదిమీఱిపాఱంగ నలవిగాకున్నఁ ♦ జదిసివానరులు చచ్చిరిదానిక్రింద
నున్నదాపలిచేత నొకపెద్దవృక్ష ♦ మన్నరభోజనుం డవలీలఁబెఱికి
యింద్రాదులడరంగ నేతేరరాముఁ♦డైంద్రబాణంబున నదియును ద్రుంప
నాభూరితరబాహులమరులుప్పొంగ♦భూభాగమగలనద్భుతముగాఁదునిసి
పెక్కండ్రుకపులు నిర్భిన్నులై క్రింద♦నొక్కటఁబడికూల నుర్విపైఁబడియె
నిటురెండుభుజము లనినకులేశ్వరుఁడు♦పటుబాణములఁద్రుంపబలభేదిచేతఁ
గడిమివజ్రమున రెక్కలుద్రుంపఁబడిన ♦
నడగొండయునుబోలె నలినార్చి యార్చి

చేతులు ముక్కు చెవులును లేక ♦ యాతతంబున వికృతాకారుఁడగుచు
నరుగుదెంచుచునున్న యాకుంభకర్ణు ♦ నరవడిఁ గనుఁగొని యుర్వీశ్వరుండు
దురమున నీకష్టుఁ ద్రుంతు నేననుచు ♦ సరభసంబున నర్ధచంద్రబాణములు
దెగనిండ రెండు సంధించి ఖండించె ♦ జగములు మెచ్చఁ దచ్చరణయుగంబు
పదములు దెగియును బాహువు లెగియు ♦ గుదియక యత్యుగ్రకోపుఁడై నడిచి
బడబాగ్ని చక్రంబు పగిది నాననము ♦ కడు వికృతంబుగాఁ గావించుకొనుచు
బలువిడి భాస్కరుఁ బట్టెడు రాహు ♦ నలవాటుగైకొని యారాముఁ గదిసెఁ
గదిసిన నాకుంభకర్ణుని నోటఁ ♦ బొదిగొన్న నిష్ఠుర భూరిబాణములు
ఇనకులేశ్వరుఁ డేయ నేర్పడ నొక్క ♦ దొనకోలలొకదోని దూరిన కరణి
ఘనమైన యాయంపగమి నోరు నిండ ♦ దనుజుఁడు సింహనాదము సేయరాక
యేపారు వికృతపు టెలుఁగు హుంకృతులు చూపుల జంకెలు సూపుచు వచ్చి
వచ్చిన యాదైత్యవల్లభు మీఁద ♦ నచ్చుగా దృష్టించి యైంద్రాస్త్ర మేసెఁ
బ్రదరమమ్మాయి రఘుపతి యేయుటయును ♦

నదియును మధ్యందినార్కు చందమునఁ
దలపోయ నాబ్రహ్మదండంబు పగిది ♦ వలతియై నిగుడుచుఁ బవనుని కరణి
నెఱయ లోకము లెల్ల నిండ నొంకొండ ♦ నెఱమంటలొలుకుచు నేపుతో వచ్చి
కుంభకర్ణుని ఱొమ్ముగొని యుచ్చిపాఱి ♦

కుంభిని నాలు దిక్కులు మ్రోయుచుండ
నంతలో మఱియును నారాఘవేంద్రుఁ ♦ డంతకబాణ మత్యంతవేగమున
సంధించి యేసిన సకలదిక్కులును ♦ బంధురంబుగ మ్రోయ బ్రహ్మాండమవియ
బ్రకటంబుగా భూమి పటపటపగుల ♦ సకలభూతంబులు చైతన్యమెడలఁ
గలయంగ శతకోటికాలచక్రములు ♦ బలు పెక్కు యొక్కటై పఱతెంచు భంగి
బ్రాలిన బడబాగ్ని వడివచ్చు కరణిఁ ♦ గాలకూటంబు మూరణమైన పగిది
విచ్చలవిడిఁ బర్వి వేగంబు మెఱసి ♦ వచ్చి యాబాణంబు వడిఁ ద్రుంచివైచె
బటునీలగిరిశృంగ భాతితో నున్న ♦ కుటిలరాక్షసుతుల ఘోరంబుగాఁ గఁ
బుడమిపై నాదైత్యపుంగవు శిరము ♦ పడునప్డు లంకలోపల వడిబడి యోఁ
బొడవైన గోపురంబులును మేడలును ♦

బొడిపొడియయి రాలి పుడమిలోఁ గలయఁ
బదికోటులగచరపతు లొల్లి మ్రగ్గ ♦ నుదధిలో జలచరయూథముల్ బెదర
వసుధపై సగమును వనధిలో సగము ♦ నసురదేహము గూలె నద్భుతంబడర
నారవంబున నబ్ధు లన్నియుఁ గలఁగె ♦ ధారణి వణఁకె దిక్తటములు వగిలె
లంకాధినాథు నుల్లము వ్రయ్యలయ్యె ♦ లంకలో నెల్ల కోలాహలంబయ్యె

జములు మోదించె సంతోషవార్ధి ♦ నగచరాధీపు లోలాడిర యంద
రవికులాధీశ్వరు రఘురామచంద్రు ♦ వివిధభంగులసురల్ వినుతించి రపుడు
ఘనుఁడు రాముఁడు కుంభకర్ణుని జూచి ♦ తనలోనఁ జిఱునవ్వు దళుకొత్తుచుండ
దేవసంఘములకు దిక్పాలకులకు ♦ భావింప నక్కడి ♦ పడిన రాక్షసుఁడు
ఇంక లోకములకు నెన్నండు నొండు ♦ శంక లేదని మది సంతోషమందె
నప్పుడు కరమర్థి నాహానలక్ష్మి ♦ నుప్పొంగి కైకొని యుజ్జ్వలుండయ్యెఁ
గడు నుగ్రరాహువుఁ గబళించి విడువ ♦

విడిచిన వెలుఁగొందు విమలార్కుఁడనఁగ
దదనంతరంబ యాదానవకోటి ♦ మదిలోన నెవ్వగ మల్లడిగొనఁగ
విన్ననై వదనము ల్వెలవెలఁ బాఱ ♦ నున్న రావణుఁ గాన నురవడిఁ బాఱి
దేవనీతమ్ముండు త్రిదశాంతకుండు ♦ వావిరి నగచరావళి నెల్లఁ దోలి
దెసలు భూభాగంబు దివియుఁ దానగుచు నసమసాహసబలాహవ కేళి వ్రాలి
నెలకొని దుగ్ధాంబునిధి మందరాద్రి ♦ గలఁచియాడెడు క్రియఁ గపికులాంబోధి
నిక్కడక్కడఁ జేసి యింద్రాదులెల్ల ♦ వెక్కసపడఁ బోరి వివశుఁడై తూలి
యంత శ్రీరాముని యధిక బాణాగ్ని ♦ నెంతయు దగ్ధుఁడై యిలమీఁద ద్రెళ్లె
ననికుంభకర్ణుఁ డయ్యనిలోనఁ బడుట ♦ దనుజులు చెప్ప నాదానవేశ్వరుఁడు
తన పాటు నింకఁ దక్కంబన్న కరణిఁ ♦ గొనకొన్న బలుమూర్ఛఁ గుంభినిఁ బడియె
నతికాయుఁ డధిక శోకాయత్తుఁ డయ్యె ♦ ధృతి దూలి శోకించె దేవాంతకుండు
దిక్కు దప్పిన మాడ్కి త్రిశిరుండు వడియెఁ ♦

దక్కక యానరాంతకుఁడు మ్రాన్పడియె
దనుజవీరులు మహోదర మహాపార్శ్వ ♦ లును మహాశోక కలితులైరి

—:* రావణుండు కుంభకర్ణుని మరణమునకు శోకించుట *:—

బలుమూర్ఛ నంతటఁ బాసి రావణుఁడు ♦

పలుమాఱుఁ దమ్మునిఁ బలవింపఁ దొడఁగె
పడిఁ దేర్చు రాఘవ వైరాంబురాశి ♦ నెడపక యేనింక నే తెప్పగడతు
రామలక్ష్మణులను రణములోఁ జంపు ♦ దేమొఱు నీవని యేనున్నచోట
జటులరాఘవ మహా శరవహ్నిశిఖల నిటు నేలఁ గూలితి వేకాంగవీర
నిద్రారతుండవు నేఁడిట్లు దీర్ఘ ♦ నిద్రగైకొంటె నిర్జితత్రివిక్రముండ
కలిశధారకునైనఁ గూలని మేను ♦ యిల నరు నేటున నిటుఁ గూలనలసె
నంతకునకు నీవ యఖిలంబు నెఱుఁగ ♦ నంతకుండవనుంటి వారూఢశక్తి
నంతటి నీకు నీ యవనిలో నిప్పు ♦ డంతకుఁ డయ్యెనే యకట రాఘవుఁడు
నిద్రమేల్కని నీవు నిష్ఠురవృత్తి ♦ రుద్రుఁడవై తమ్ము రూపడంతనుచు

నద్రివిద్రావణుం డాదిగాసురలు ♦ నిద్రఁబోరెన్నఁడు నెరసినభీతి
నీవాజిఁద్రుంగుట నిర్జరులింక ♦ నేవిధంబున నున్న నేలొక్కఁ గొంద్రు
కులమెల్లరక్షించు కొఱకునాతోడఁ ♦ జలమునఁ బలుమాఱు సద్బుద్ధిచెప్ప
వినకవిభీషణు వెసఁదన్నివెడల ♦ చనుమన్నపాపంబు సైఁచు నేనన్నఁ
గడుకొనినీవాదిగా బుద్ధిమంతు ♦ లుడుగక చెప్పిన యుచితోక్తులెల్ల
నెమ్మితోవిననైతి నిన్నఁగోల్పడితి ♦ నమ్మినజయలక్ష్మిఁ జాకేలకలుగు
బలిమిమై నావల పలిమాపుభంగిఁ ♦ గలహరంగంబునఁ గడిమివాటించి
పటుబాహుబలమేది వడితిపీవాజి ♦ నిటమీఁదఁ దిక్కు నాకెవ్వరుగలరు
అనికుంభకర్ణుని యందుఁదలఁచి ♦ వనటనిట్టూర్పులు వడిఁబుచ్చిపుచ్చి
పరితాపమనియెడి బడబాగ్నిగలిగి ♦ పెరిగెడిలాలయ ఫేనంబుగలిగి
వెసలుకన్నీరును వెల్లువగలిగి ♦ కడలేనివగపను కరుడులుగలిగి
ప్రకటరోదనమను రావంబుగలిగి ♦ చకితత్వమనియెడి చలనంబుగలిగి
మునుకొని శోకసముద్రుఁడై పెద్ద ♦ వెనుఁబడియెంతయు వికలుఁడై యున్న
యారావణుఁ జూచి యప్పుడొక్కింత ♦ ధీరత వాటించి త్రిశిరుండుపలికె
బదిలంబుదప్పి యిబ్భంగిశోకించె ♦ దిదియేమి దేవ నీవితరుఁమాడ్కి
వనజాసనునిచేత వరముగొన్న ♦ ఘనశక్తియును దాఁ గలిగియుండఁగను
అవిరళమంత్రపూతాస్త్రముల్వజ్ర ♦ కవచంబునీయందుఁ గలిగియుండఁగను
ఉరుతరగతిగల యుజ్జ్వలరథముఁ ♦ గరమొప్పనీకును గలిగియుండఁగను
శోకింతురే నన్నుఁ జూడుమొక్కింత ♦ నీకెదురెవ్వరు నిర్జరవైరి
వేవేగ యువలీల వెడలిరాఘవుని ♦ నీవిక్రమంబున నేలపైఁగూల్ప
మిటశోకమడుగు నీవింతయుచాలు ♦ నటనేనుబోయి మహాజిరంగమున
నతులవిక్రమకళా హుంకారవృత్తి ♦ నతిశూరుఁడితఁడన నంతటఁబేర్చి
గరుడుండు పాములఖండించుమాడ్కి ♦ దరుచరావళి నెల్లధరణిఁగూల్చెదను
సురపతివృత్రులని ద్రుక్కించుభంగి ♦ హరుఁడంధకాసురు నణఁగించుపగిది
రామునిఁద్రుంచెద రణములోనిప్పు ♦ డీమెయిఁబోయెద నెలమినన్నుపు
మ్మనినరావణుతోడ నప్పుడుకడఁగి ♦ ఘనబాహుబలుఁడతికాయుఁ డుపలికె
యిఁకశోకింపంగ నేటికినీకుఁ ♦ బంతంబుతో దైత్యబలములఁగూడి [గిది
యేనుబోయెద నంపుమిటఁజిత్రముగను ♦ గాననంబులుగాల్చు కార్చిచ్చుప
విపులబాణంబుల విశదంబుగాఁగ ♦ గపులతో రామలక్ష్మణులఁ జంపెదను
అనిపల్కనపుడు నరాంతకుఁగూడి ♦ యనుపమబలుఁడు దేవాంతకుఁడనియె
నేమిద్దఱముఁబోయి యీక్షణంబునను ♦
రామలక్ష్మణుల మర్కటుల ద్రుంచెదము

అనినమాటలకు దైత్యాధీశ్వరుండు ♦ దనశోకముడిగి మోదంబునమండి
తనయులతోఁ గూడితద్దయునొప్పె ♦ ననిమిషగణము క్రుఁడగు నింద్రుమాడ్కి
నవ్విధంబుననుండి యారావణుండు ♦ నవ్వుచుఁ గొడుకుల నలువురఁ జూచి
రామలక్ష్మణులమర్కటసైన్యములను భీమాస్త్రములఁ జంపి పేర్చిరండనుచు
దనతమ్ములగుమహోదర మహాపార్శ్వ ♦
లనువీడుకొలిపి నాలము సేయుఁడనుచు
మారతంబునను నీమనుజాశనుండు ♦ చేకొనిసీతకై శ్రీరాముఁ డోడరె
ననియరిమద్వర్గ మారావణునకు ♦ మునుమున్న రాము నిమ్మలదాఁకఁ బోవు
పగిది నాయూర్వరు బ్రహ్మాండభాండ ♦ మగలంగ నార్చుచు ననికేగునపుడు

**అతికాయమహోదరులు మొదలగువీరులు యుద్ధమునకు వెడలుట**

భూరిశారదఘన స్ఫురణంబు గలిగి ♦ మెరావతేభంబు నంశంబుగలిగి
తనరారుచున్న సుదర్శనేభంబు ♦ నినుఁడస్తశిఖరిపై నెక్కినకరణి
నెక్కి మహోదరుఁ డేపారినడిచెఁ ♦ బక్కెరనిశితాయుధంబులు వెలుఁగఁ
జటుజవసత్త్వప్రభావముల్గలిగి ♦ చటులంబులైన యశ్వంబులఁ బూన్చి
మెసఁగుచాపంబును నింద్రచాపంబు ♦ పసమీఱిసూర్యునిభంగి వెలుఁగ
శరదంబుమీఁద నీలాభ్రంబపోలెఁ ♦ దిరమైన వేడ్కతోఁ ద్రిశిరుండు వెడలె
వితతధనుర్వేధ విద్యాఢ్యుఁడైన ♦ యతికాయుఁడునప్పు డధికతేజమున
శరచాపఖడ్గాది శస్త్రాస్త్రసమితిఁ ♦ గర మొప్పి సూర్యప్రకాశమై వెలుఁగఁ
దనరారు కనకరథంబెక్కి వెడలె ♦ ఘనభూషణద్యుతిఁ గనకాద్రియగుచు
సురవరఘోటక స్ఫురణఁ జెన్నొంది ♦ యురుభూషణప్రభ నుజ్జ్వలంబైన
యవదాతహయమున రాంతకుఁ డెక్కెఁ ♦ బ్రవిమలతేజోవిభాసితుండగుచు
శక్తియుద్భటబాహు శక్తిమైదాల్చి ♦ శక్తిపాణియుఁబోలె సన్నుతికెక్కి
దీపితగదఁ దాల్చి దేవాంతకుండు ♦ రూపింప విష్ణుని రూపుననడిచె
గురుగదాపాణియై గుహ్యకేశ్వరుని ♦ యురుదైనకడిమిమహాపార్శ్వుఁ డొప్పె
గాలచక్రంబుల గతినుజ్జ్వలంబు ♦ లైలీలఁ బెక్కైన యరదముల్ నడలెఁ
గొండలవడువునఁ గోటానకోట్లు ♦ గండుమీఱిన మదగర్వముల్ గలిగి
దండిమై వెడలె నద్దంతహస్త ♦ దండంబులొప్ప వేదండసంఘములు
హేషారవంబుల నెల్లదిక్కులను ♦ ఘోషింపఁ జేయుచు గుఱ్ఱము ల్వెడలెఁ
గాలకింకర సమాకారంబులమరఁ ♦ గాలుబలంబు లుగ్రతనేఁచి వెడలెఁ
జతురంగబలము లీచందంబునొంది ♦ యతులితంబగుట యానప్పుడునడుమఁ
బ్రళయకాలార్ణులభంగి నెంతయును ♦ వెలుగొందిరాదైత్యవీరులార్వురును

అతిశుభ్రమగు శరదభ్రంబులొప్ప ♦ గతివార పుండరీకంబులొప్పారఁ
గడిమిమై గెలుతుము రాదేనిఁ జత్తు ♦ ముమగ మెబ్బంగి రణోత్సాహ మనుచు
నడచిరి కలనికి నానావిధముల ♦ నెడపక పంతంబు లిచ్చుచు వారు
అప్పుడొండొరువుల యాహ్వానములను ♦ జెప్పఁజోద్యంబైన సింహనాదముల
రథ ఘోషములను దురంగ హేషలను ♦ పృథులదంతావళ బృంహితంబులను
ఖరముగ్రమగుపద ఘట్టనధ్వనుల ♦ నిరుపమధ్వజ కింకిణీనిస్వనములఁ
బటహభేరీశంఖ భయదనాదములఁ బటుతరనిస్సాణ భాంకారములను
దిక్కులుఘూర్ణిల్లె దివిపెల్లగిల్లెఁ ♦ జుక్కలుడుల్లెఁ ♦ వాసుకియొడ్డగిల్లె
మేరువుగంపించె మేదినివణఁకె ♦ భారమోర్వక దిగిభములుచలించె
నటుదానవానీక మాకోట వెడలఁ ♦ బటుభయంకరవృత్తిఁ బ్లవగవల్లభులు
భూనభోంతరములాస్ఫోటనధ్వనుల ♦ బూనియొక్కటనిండ భూరిసత్త్వముల
దలకొనిగిరులును దరువులువైచి ♦ చెలఁగించిరప్పుడు సింహనాదములఁ
జలమున దైత్యులు చటులశాణములు ♦ బలువిడిగురిసిరి ప్లవగులమీఁద
ః సురావళికి మున్న యాఁకిపివరులు ♦ నసురులుఁ జంపంగ నడరి పెల్లారి
కపులకు మున్న రాక్షసులుగ్రవృత్తిఁ ♦ గపులఁ జంపెదమని కడక వాటించి
యసమునఁ జలము పెంపారనొండొరుల ♦ వసుమతిపైఁ బడవైతురు కినిసి
యసురుల చేతి శస్త్రాస్త్రంబులొడిసి ♦ వెసఁబుచ్చి పెళ్ళున విఱుతురు కపులు
కపికోటిచేతి వృక్షంబులు గిరులు ♦ కుపితులై విఱుతురు క్రూరదానవులు [రు
కపుల కాళ్ళను బట్టి కదిసి రాక్షసులు కపులతోడనె మహోగ్రతను వేయుదు
అసురుల కడకాళ్లు నలమి వానరులు ♦ నసురులతోడనే యడతురు బెట్టు
అటుపోర జర్జరితాంగులై నేలఁ ♦ గుటిలదైత్యులుఁ గపికోటులుఁ గ్రాలి
దురములోఁ బడియు నెత్తురులు గ్రక్కుచును ♦

బొరిఁబొరి మూర్ఛలఁ బొంది యంతటను

దెలిసి వానరులును దేవశాత్రవులు ♦ కలిసి కయ్యము సేయఁ గానిందుఁ గపులు
దానవులోనత్తి దానవు వేసి ♦ యేనుఁగుతోయెత్తి యేనుఁగు నేసి
తురగంబులోనత్తి తురగంబు నేసి ♦ యరదంబుఁగొనికరి నడరంట నేసి
కరి నెత్తుకొని తురంగముఁ జడవైచి ♦ తురగంబు నత్తి దైత్యుని ప్రోల్ల నేసి
యురుసత్త్వధీరులై యుగ్రత నార్చి ♦ తరుచరవీరులు దర్పంబు మెఱసి
పొరిఁబొరి నిబ్బంగిఁ బరిపుచ్చుటయును ♦ సురరిపుల్గొందఱు క్రుక్కుటఁ జూచి
రయమునఁ గోపంబు రంజిల్ల దైత్య ♦ చయమును వానర సమితిపైఁ గదిసి
ప్రదరంబులేసి చక్రంబుల నేసి ♦ గదల నొప్పించి ఖడ్గంబుల ద్రుంచి
భిండివాలంబులఁ బీఁచంబుల .ాఁచి ♦ ఖండించి సురియల గండలు బధులు

కుంతశూలంబులఁ గ్రుచ్చి వానరుల ♦ నింతలింతలు చేసి యెసఁగి యార్పుటయు
నంతటఁబోక యగచరులార్చి ♦ యంతంతకడరి దైత్యావళిఁ బట్టి
తరుషండములఁ బర్వతప్రకరముల ♦ నురవడి నత్తి యత్యుగ్రత వైవ
బడియెడిదైత్యులు పాఱుదైత్యులును ♦

నుడుగక యందంద నొరలు దైత్యులును
గలయంగ నెత్తురు గ్రక్కు దైత్యులును పొలుపఱి నేలపై బొరలు దైత్యులును
అందందనట్టలై యాడు దైత్యులును ♦ మ్రంది ప్రత్యర్థుల మఱచు దైత్యులును
నెక్కినరౌతుల నిటునిటుఁ బడఁగ ♦ లెక్కసేయక కరాళించు గుఱ్ఱములు
పక్కెరలూడంగఁ బఱచు గుఱ్ఱములు ♦ దిక్కులు సుడివడఁ దిరుగు గుఱ్ఱములు
కీలెడలినఁ గ్రిందుగెడయు గుఱ్ఱములు ♦ కూలి కాళ్లను దన్నుకొనెఁ గుఱ్ఱములు
వికలంబులై పోరు విచ్చు గుఱ్ఱములు ♦ నొకరూపు నేర్పడకుండు గుఱ్ఱములు
కరములు మునిసినఁ గంపించు కరులు ♦ పరవారఁ గొమ్ములు విఱిగిన కరులు
మరలి లంకకు వెస మగిడెడి కరులు ♦ తిరమేది దిర్దరఁ దిరిగెడు కరులు
కొండలై పడిపడిఁ గూలెడి కరులు ♦ కండతుండంబులై కలఁగెడి కరులు
రథికసారథిరక్ష్య రహితరథములు ♦ ప్రథితంబుగా భువిఁ బడు రథంబులును
వారగఁ ద్రుమబద్ధ వరరథంబులును ♦ నారగఁ దలక్రిందులగు రథంబులును
కీళ్లెల్లఁ దప్పి నుగ్గిన రథంబులును ♦ త్రాళ్లెల్లఁ ద్రెళ్లి పోదని రథంబులును
చాలంగ నుగ్గునూచగు రథంబులును ♦ నాలంబులోఁ దఱుచగుటయుఁ జూచి
సురఖేచరాదిక స్తోమంబు చోద్య ♦ తరమని యాత్మలోఁ దద్దయు మెచ్చ
నప్పుడు కినిసి నరాంతకుండార్చు ♦ లొప్పనిజాస్యంబు మఱవడిఁ బఱపి
యసురులనోడకుం డనుచు వానరుల ♦ నసమునఁ గిట్టి బెట్టగలించి తాఁకి
నెలకొని యొక్కొక్క నిమిషంబులోన ♦ నిలఁ గూల్చె నేడునూఱు సేసి వానరుల
సురపతిశౌర్యంబు సొంపారుచుండ ♦ గిరుల వ్రేయుచును నేగిన త్రోవ పోలెఁ
దరుచరకోటులుఁ దలుచుగా బడుట ♦ నిరవొంద వాడు పోయిన త్రోవ యొప్పె
నేవానరుండైన నేఁచి కోపమున ♦ భావంబులోఁ దన్నుఁ బరిమార్పఁ దలఁచు
నంతరంగముఁ జొచ్చి యరయు చందమున ♦

నంతకుమున్ను తానకని నుక్కణఁచు
నేకపిమైనఁ దన్నదురంగఁ దలఁచి ♦ భీకరుండై గిరిఁ బెరుకంగఁ జూచు
నంతకుమున్ను తానధిక రౌద్రమున ♦ నంతంతడగ్గరి యతని మూపణఁచు
నేబలీముఖుఁడైన నేపగ్గలించి ♦ తా బెట్టుగాఁగఁ బాదప మెత్తఁ దలఁచు
నంతకంతకు హెచ్చి యతిభీషణముగ ♦ నింతకుమున్న తా నతని నిగీటణఁచు
నంతటఁబోవక కాయముపైఁ బఱపి ♦ యంతంతవును గుంపులైన వానరుల

ప్రేవులు ద్రొబ్బలు వెల్లుగా నురుము♦గా వివిధములైన గతులఁ ద్రొక్కించు
గుండెలు వగులంగ గోలెమ్ములగలనొండొండఁ దాఁకించి యుర్వరఁ గూల్చు
నలుకతోఁ బ్రళయ కాలానలుపగిదిఁ♦ వేఁకొని యెందును దానయై నిండి
వానరవర సైన్య వనములు విఱుగ♦ మానక ప్రగతిఁ బవమానుఁడై మోవ
వాని శౌర్యంబును వాని శక్తియును♦ వానరులెల్ల నోర్వఁగ లేక యపుడు
వికలులై యుండిరి విస్మితులగుచు♦ సకల దేవతలును జలియించి రపుడు
పటుభీతిఁ బొందిన ప్లవగ సైన్యముల♦ నటు పేర్చుచున్న నరాంతకుఁ జూచి

—*: అంగద నరాంతకుల ద్వంద్వయుద్ధము :*—

యనయంబు కోపించి యంబుదపటల♦
ముననున్న సూర్యుండు మొనసినమాడ్కిఁ
గపిరాజతనయుఁ డంగదకుమారుఁడు♦ కపిసేనలోనుండి కడఁక నేతెంచి
యూరి నరాంతక యుగ్రతఁ గపుల♦ నీరసంబునఁ బేర్చి యేల చంపెదవు
ఇంత చేసినను నీ విటు బటువైతె♦ యంత శూరుఁడవైన ననిఁ దాఁకు నన్ను
ననవుడు నవ్వి నరాంతకుం డనియె♦ వనచర నీ వెంత వాఁడవు నాకు
నఖిలదిక్పాలుర నదటడంచితిని♦ నిఖిల దేవతల మన్నింప కేఁచితిని
అట్టినా తోడ నీ వాయెదిరెదవు♦ పట్టి చట్టలు చీరి పాఱవైచెదను
ననుఁ జూతుగాక నన్న నగుచు నంగదుఁడు♦ దనుజ దశగ్రీవు దర్పంబు మాన్పి
పూని నఖరనూరిఁ బోరిగొనిపివప♦ నే నేగునపుడు నీ వెఱుఁగవే నన్ను
ననుడు దానవుఁడు కాలాహి చందమున♦
ముసిఁకొని యార్పులు మ్రోయంగ వచ్చి
ఘనతర విస్ఫులింగంబులు చెదర♦ ననఘంబు తన శక్తి నంగదువైవ
గరుడు వక్త్రంబు గదిసినట్టనె♦ పరచిన కాలసర్పంబును బోలె
నది వజ్రనిభమైన యతని వక్షంబు♦ గదిసిన యంతనే ఖండంబులయ్యె
వజ్రాయుధంబున వరశైలమఁచు♦ వ్రచ్చదంబున వాలినందనుఁడు
అఱచేత నే వాని హయము మస్తకము♦ పఱియలు వార నిర్భరవృత్తి నేసెఁ
జెచ్చెఱ వేయంగఁ జేట్పడి నోరు♦ విచ్చుచు నాలుక వెడలఁ బెట్టుచును
వెరవిడి కాళ్లును వెసఁ దన్నికొనుచు♦ ధరమీఁదఁ బడి చచ్చెఁ దత్తురంగంబు
అటు తురంగము వడ్డ నరాంతకుఁడు♦ చటుల కాలానల జ్వలితాస్యుఁడగుచు
గెడయుమంచును బిడికిట మస్తకంబుఁ♦
బొడిచి యంగదు మూర్ఛఁ బొందించుటయును
అంతనె తెలిసి నరాంతకు నీక♦ నింత శక్తియెఁ గలదే యని పేర్చి
పెరిఁగిన పిడుగైన పిడికిట వాని♦ వరశైలనిభమైన వక్షంబుఁ బొడిచెఁ

బొడిచిన నెత్తురుల్ పొరిఁబొరిదొరఁగఁ ♦ బొడిపొడియైధరంబునుకలు సెదరఁ
గడుఘోరమైన సంగరభూమిలోనఁ బడిన రాంతకుఁడంత బ్రాణముల్వీడి చె
నార్చిరి దేవత లామింటనుండి ♦ యార్చిరి వానరు లవనితలమున
దనుజాధినాథుని తనయుని పాటు ♦ గనిమహోదరుఁ డుగ్రకరిఁబురికొల్పె
దనుజుండు వడుటకు నడలుచు వాలి ♦ తనయునేచుటకు నుద్దండకోపంబు
ముప్పిరిగొనఁగ నిమ్ముల బరిఘంబుఁ ♦ ద్రిప్పుచుఁ బఱతెంచె దేవాంతకుండు
రవిమండలముఁ బోలు రథ ముగ్రభంగి ♦ నవనిగంపింపనుద్ధతిదోలుకొనుచు
ద్రిశిరముల్ త్రేతాగ్ని తెఱఁగున వెలుఁగ ద్రిశిరుండు గవిసెనుద్దీప్తకోపమున
నప్పుడంగదుఁడు శాఖాయుత బగుచు ♦ నొప్పెడునొకవృక్షమురవడిఁ బెఱికి
యదరంగ నార్చి దేవాంతకుపైన ♦ నడుమన త్రిశిరుండు నలగఁగ నేసె
నేసిసమీఁదికి నగసియంగదుఁడు ♦ గాసిల్లి శైలవృక్షంబులుమిగుల
వదరింపనపుడు దేవాంతకత్రిశిరు ♦ లెడబడఁగాఁ ద్రుంచి యొంతయుమించి
పరగించిరతనిపైఁ బటుతోమరంబు ♦ లరుదారఁగాఁ జేరి యత్యుదగ్రతను
నంతటఁ బోవక యార్చుచు మఱియు ♦ వింతగాఁ బొదువుచు వేగంబు మెఱసి
యావాలిసుతుమీఁద నధికరోషమున ♦ దేవాంతకుఁడు వైచె దీపించి పరిఘ
దరమిడిసింహనాదంబు సేయుచును ♦ దొరలక శరవృష్టి త్రిశిరుండు గురిసె
నురుదంతిఁ గొలిపె మహోదరుండేఁచి ♦ పరగించె నతనిపైఁ బటుతోమరములు
ఎనసి మువ్వురు దమ యేపు చూపుటయు ♦

ఘనరోష మొదవ నంగదుఁడు కోపించె

దంభోళిక్రియ మహోదరుని యేనుఁగు ♦ కుంభస్థలము దాఁక గుధరశృంగంబు
గెరలి వ్రేసిన నది ఘీంకారమెసఁగ ♦ నొరలి గ్రుడ్డులు వెలి కురికి చచ్చుటయు
జయలక్ష్మి రాఘవేశ్వరుఁ బొందఁ గోరి ♦ ప్రియమునఁ గైసేయఁ బెట్టియ దెరిచె
ననఁగ నాకరితల యట్లు వ్రస్సియొప్పె ♦ ననుపమంబైన ముత్యంబులు సెదర
నంతటఁ బోక దేవాంతకు వ్రేసెఁ ♦ దంతిదంతము గల్చి తారాసుతుండు
అటు వ్రేటుపడి వాతహతిఁ జలియించు ♦ పటుసాలవృక్షంబు పగిది దూగాడి
నెత్తురు గ్రక్కియు నెఱసాహసమునఁ జిత్తమొక్కింతగాఁ జేసి యయ్యసుర
పరిఘంబు గొని వ్రేసెఁ బర్వతతటము ♦ కరణి నొప్పారు నంగదునురస్స్థలము
నంగదుండును దాన నవనిపై మ్రొగ్గి ♦ యంగముతోడ ధైర్యము చిక్కఁబట్టి
కోపించి దేవాంతకునిమీఁద నడువ ♦ దీపితాస్త్రంబు ద్రిశిరుండు మూఁట
నా వాలితనయుని నాత్మఁ గైకొనక ♦ లావున ఫాలస్థలమున నాటవేసె
నంత నీలుండును ననిలనందనుఁడు ♦ పంతంబుతోఁ దోడిపడిరంగదునకు
నందు నీలుఁడును మహాశైలమెత్తి ♦ యుందందఁ ద్రిశిరుపై నార్చుచు వైవ

{ హనుమంతుఁడు మొదలగువారలు త్రిశిరాది రాక్షసవీరులఁ జంపుట }

పశనిచందంబగు నస్త్రంబుఁదొడిగి ♦ త్రిశిరుండునగ్గిరిఁ దెగనేసినడుమ
ధీరతవాటించి దేవాంతకుడు ♦ వారిమైయొప్పిన పరిఘఁద్రిప్పుచును
బలియుడై చనుదేరఁ బవమానసూనుఁ♦డలుకతోరాక్షసు నౌదలఁజూచి
బెడిదంబుగా వెసఁ బిడికిటఁబొడిచె ♦బొడిచిననప్పుడుపొరిఁబొరిఁబండ్లు [నూ
డుల్లంగ నోరుబెట్టుగ దెచ్చుకొనుచుఁ♦ద్రెళ్లెదైత్యుఁడు గ్రుడ్లుదిరుగ వైచుచు
దేవతలార్చిరి దివినుండియపుడు ♦ దేవాంతకునిపాటు తెఱఁగొప్పఁజూచి
త్రిశిరుండుకోపించి తీవ్రతనేసె ♦ పశనివేగాస్త్రంబు లన్నీలుమీఁద [చ్చి
దగ వెఁడియును మహోదరుఁడుగ్రవేగ♦ మగునొక్కకరినెక్కి యార్చుచువ
కులగిరిపై వాన గురియుచందమున ♦ నలువుదీపింపంగ నతనిపై నేసె
నానీలుఁడును వానియస్త్రసంతతుల♦దానెంతయును భిన్నతనుఁడునై నొచ్చి
యటుమూర్ఛనొందియు నంతనె తెలిసి♦పటుగతితోడ నభముననెగసి
తరువులతోడ నుద్ధతిమీఁదికెత్తె ♦ ధరణీధరము మహోదరునిపై వైచె
వైచినదానిచే వారణయుక్తుఁ ♦ డై చచ్చెఁదలవ్రస్సి యమ్మహోదరుఁడు
ధరమీఁదనమ్మహోదరుఁడుగూలుటయుఁ ♦

దిరమైన కడిమితోఁ ద్రిశిరుండు పేర్చి
పరిగొందునని పెక్కుశరములు నేసె♦నరవాయిగొనక యాహనుమంతుమీఁద
జెచ్చెఱఁ బర్వతశిఖరంబువెఱచి ♦ తెచ్చియా రావణి త్రిశిరుపై వైచె
పదినడుమనెతుమురై రాలనేసెఁ♦ద్రిదశులు వెఱఁగందఁద్రిశిరుండు పేర్చి
హనుమంతుఁడును దానియరదంబుమీఁదఁ♦

కనువారగా దాఁటి యుత్యుగ్ర మగను
సింగంబుగజములఁ జెలరేఁగివచ్చు♦భంగిరథ్యంబులఁ బటుగతిఁజంపె
నాత్రిశిరుఁడును ననిలజుమీఁద ♦ నాతతంబుగశక్తి యడరించుటయును
బలుమంటలెగయంగఁ బఱతెంచుదాని♦ బలువిడిఁబట్టి యప్పవనిద్రుంప
శక్తిద్రుంచిననిజశక్తిపాటించి♦శక్తిజవ్వాయుఁబోలు చటులాసిఁగొనుచు
నచ్చెరువైన రయంబుసొంపార ♦ వచ్చియాహనుమంతు పక్షంబు దాఁక
వేసిననతఁడును వెసనఱచేత♦ద్రేసెనా రాక్షసు విపులవక్షంబు [గొంద
నటువ్రేటుపడితన యడిదంబుపైచి♦ కటిలరాక్షసుఁడు గ్రక్కునమూర్ఛ
ననిలజుండటుఁబడ్డ యడిదంబుఁబుచ్చు♦కొనిబిట్టుగా నార్చెఁగుంభినిపగుల
నాలోనఁదెప్పిరి యాత్రిశిరుండు ♦ వాలినపిడికిట వాయుజుఁబొడిచె [గ
హనుమంతుఁడంతనత్యంతరోషమున ♦ దనకటంబులుపొంగదర్పముప్పొం

రూపించి యా విశ్వరూపు మస్తకము నేపునఁ ద్రుంచు సురేంద్రు చందమునఁ
జెచ్చెఱ దనుజుని శిరములు మూఁడు ♦ నచ్చెరువైన యా యడిదమంకించి
తెగ నేసె నా దైత్యు తీవ్రకర్మ బు♦దగఁ బుచ్చుకొని త్రుంచు దైవంబు కరణి
దిశమభూ భాగంబు దివియు ఘోషింప ♦ త్రిశిరుఁడు భూస్థలి ద్రెళ్లె ద్రెళ్లుటయు
బటురౌద్రమున నమహాపార్శ్వుండు గినిసి ♦

నిటులంబు బొమలును నెరిముడివడఁగ
నలరు నెత్తుటఁ దోఁగి యాశాకరీంద్ర ♦ కరభీకరంబైన కనక చక్రముల
నురుమణిప్రభల నత్యుగ్రమై యముని ♦ పరుషోగ్ర దండంబు పాటిగాఁ గలిగి
యరుణపుష్పంబుల నరుణగంధమున ♦ నురుతరంబగుచున యోమయంబైన
యుదయార్క భాసమానోజ్జ్వలంబగుచు ♦

నొదవు గదాదండ ముగ్రుఁడై తాల్చి
తనకోపశిఖమండ దర్పము పొంగ ♦ హనుమంతు మీఁద రయంబున నడున
నెడసొచ్చి యొక్క మహీధరమెత్తి ♦ యెడపక దైత్యుపై ఋషభుండు వైచె
నడరి యంతటిలోన నమ్మహీధరము ♦ దొడివడ గదఁ గొని తుమురుగా వ్రేసె
జటులతఁ గద ద్రిప్పి సమదుఁడై ఋషభు ♦

బటుసత్త్వమున మహాపార్శ్వుండు వైచె
దాని చేవతఁ బుఁ దాఁకి యా వృషభుఁ ♦ డూని మూర్ఛచే నొక్కింత దెలిసి
యాలోన వేగ మహాపార్శ్వుఁ డొయ్య ♦ వ్రాలిన పిడికిట వ్రయ్యఁ దాటించ
దాటించుటయుఁ గదాదండంబు విడిచి ♦ మేటిసత్త్వము దూలి మేదినిఁ బడియె
నా గదాదండంబు నా ఋషభుండు ♦ వేగ బెకొని యార్చి వ్రేసిన దైత్యు
వ్రేసిన వజ్రంబు వ్రేటుఁ గొండ ♦ తోఁకరిమైతల తుమురుగాఁ గూలె
నటు మహాధ్వనితో మహాపార్శ్వుఁ డవని ♦

బటుభయంకరవృత్తిఁ బడుటయుఁ జూచి
కరువవలి చేఁ దూలు కారాకులనఁగఁ ♦ ఉరిగి దైత్యులు పలుదెసలకుఁ జనిరి
అచందమున వార నపైఁ బడుటఁ ♦ జూచిన రోషవిస్ఫురణ శోభిల్ల
మిడుకలోకము లెల్ల గ్రిందిగ దనచుఁ ♦ గడగిన క్రియ నతికాయుఁడు పేర్చి
వేయుసూర్యుల భంగి వెలుగుచు మిగుల ♦ నాయతంబై నట్టి యరదంబు నెక్కి
తనరార సింహనాదము చెలఁగించి ♦ తనపేరు సెప్పి యుద్దండకోదండ
నిష్ఠురారావంబు నిగుడఁ గాలాగ్ని ♦ కాష్ఠంబు లడగింపఁ గనయు చందమునఁ
గపిసేనపై మహోగ్రంబుగాఁ గవియఁ ♦ గపులు పిశాచు నాకారంబుఁ జూచి
పటురౌద్రలీల నిప్పటి కుంభకర్ణుఁ ♦ డిటు వచ్చె నోయని యెంతయు బెదరి
కొందఱు మూర్ఛిల్ల గొందఱు వెఱువ ♦ గొందఱు వెఱగుచే కొని చూచుచుండ

గొందలు వాపోవఁ గొందలు గలఁగ ♦ గొందలు రామ చే కొనుమా మ్రొక్క
బర్వినభీతిమైఁ దఱతెంచు కపుల ♦ నుర్వీశ్వరుం డోడకోడకుండనుచుఁ
గలయ లోకములెల్లఁ గప్పి గర్జిల్లు ♦ ప్రళయావసర మేఘపటలంబు పోలె
బెడిదంబుగాఁ బేర్చి పృథుల వేగమున ♦ నడతెంచుచున్న దానవనాథతనయు
నగ్గలికయు లావు నధిక రౌద్రంబు ♦ నగ్గతియును దవ్వులం దేవీక్షించి
యనయంబు వెఱగంది యప్పుడా రామ ♦ జననాథుఁ డావిభీషణుఁ జూచి పలికె
బిడుగు మ్రోసిన మాడ్కి బెడిదంపు మ్రోఁత ♦
నడరి వచ్చుచునున్న యరదంబు మీఁద
నింద్రచాపముతోడ నెనవచ్చునట్టి ♦ సాంద్రప్రభాయుత చాపమొప్పారఁ
బరిఘ గదా ప్రాస పట్టస శూల ♦ పరశు తోమర భిండివాల చక్రాది
వరదివ్యశస్త్ర సిర్వాణంబుతోడ ♦ నరుదైన యట్టిసింహధ్వజం బొప్ప నిచ్చ
నలువొంద నార్చుచు నలుగురు సార ♦ థులు తోలనొక వేయి తురగము లూన్చ
మూఁడు కన్నులుగల మూర్తియుం బోలె ♦ వేడిమి దిక్కుల వెసఁ జల్లుకొనుచుఁ
గపులఁ దోలుచును నిక్కడ కేతెంచుచును ♦ విపరీతగతి వచ్చు వీఁడెవ్వఁడని

విభీషణుఁడు శ్రీరాముల కతికాయుని
ప్రభావముఁ దెలుపుట

దేవయీ దైత్యుఁడు దేవారిసుతుఁడు ♦ రావణుకంటెను రణగరిష్ఠుండు
చతురంగములయందు సమరంబు సేయ ♦ నతినిపుణుండు వీఁడవనీశతిలక
యరుదైన వేదశాస్త్రాదివిద్యలను ♦ బరిణతుండెంతయుఁ బరతత్త్వవేది
లంకయీ వీరుని లావునఁ జేసి ♦ శంక లేకెపుడు నిశ్చలవృత్తినుండు
ననిమిషులలిగిన నని జావకుండ ♦ వనజాసనుని చేత వరము గొన్నాఁడు
దివ్యాయుధంబుల దివ్యశస్త్రముల ♦ దివ్యమంత్రంబుల దీపించువాఁడు
మఱియింద్రాద్యనిమిషులను నాఱు ♦ మాఱులు గెలిచిన మగఁటిమివాఁడు
వాసవువజ్రంబు వరుణపాశంబు ♦ నా సమవర్తి మహోగ్రదండంబు
ధనపతిగదయు నీతనిశస్త్రసమితి ♦ ననిశంబు గడుఁ బ్రతిహతములై యుండు
మనుజాశనుఁడు ధాన్యమాలినియందు ♦ గనినపుత్రుఁ డతికాయుండు వీఁడు
ఈదానవుని చేత నీకపులెల్ల ♦ మేదినీనాయక మెఱుగకమున్న
సమరంబులో వీనిఁ జంపుట లెస్స ♦ యమితవిక్రమకేళి నని చెప్పుచుండ
వాఁడంతటఁ జేగుణధ్వని దిక్కులద్రువ ♦ వాఁడిమి మ్రోయుచు నట వచ్చుటఁ జూచి
ఖండనోదగ్రుండు గవయుండు గోము ♦ ఖుండును జ్యోతిర్ముఖుండు మదుండు
మారుతాత్మజుఁడును మైందుండు నలుఁడు ♦ శరభుండు నీలుఁడు శతబలి గజుఁడు బ
నాదిగాఁ గలుగు మహాకపివరులు ♦ మేదినీజంబులు మేదినీధ్రములు

వడి నెత్తుకొనిపోయి వానికెదురు ♦ నడువంగ నటుచూచి నవ్వి దానవుఁడు
కలహావిక్రమకళా కౌశలసత్త్వములు ♦ గలుగవు తొల్లఁ గుడుకపులార మీరు
త్రిజగంబులను మెచ్చఁ దివిరి వారాశి ♦ నిజశరాగ్రంబున నిల్పిన శూరుఁ
డతఁ డవ్వఁ డిటు చూపుఁ డతని పైఁ గాని ♦

యతులితంబైన నా యస్త్రంబు విడువ

దురమున నింద్రజిత్తుఁడు గట్టినట్టి ♦ యురగపాశంబుల నూడ్చుకొన్నట్టి [వ
యతఁ డవ్వఁ డిటు చూపుఁ డతని పై గాని ♦ యతులితంబైన నా యస్త్రంబు విడు
మూఁడులోకంబులు మునుమిసి గెలిచి ♦ వాఁడిమి మగఁటిమి ప్రాలిన శూరు
నలఘుబలోద్దీర్ణు నా కుంభకర్ణుఁ ♦ దల ద్రెవ్వ నేసి యుద్ధతిఁ బేర్చియున్న
యతఁ డవ్వఁ డిటు చూపుఁ డతని పై గాని ♦ యతులితంబైన నా యస్త్రంబు విడువ
దేవదానవయక్ష దివిజులరాజి ♦ భావింప నెక్కుడై పరఁగిన యట్టి
రావణు నోర్చెద రణములోననుచు ♦ నీవిధంబున లంక కేతెంచు శూరుఁ
డతఁ డవ్వఁ డిటు చూపుఁ డతని పై గాని ♦ యతులితంబైన నా యస్త్రంబు విడువ
నని పెక్కు గర్వంబు లాడుచున్న ♦ దనుజాధినాథుని తనయుసేఁ గిట్టి
కడిఁది కోపమున వృక్షంబులు గిరులు ♦ నుడుగక కపినాయకోత్తముల్ వ్రేవ
నవి యంతపట్టును నతికాయుఁ డడనె ♦ యవిరళమార్గణాహతిఁ ద్రుంచివైచి
గురుతరాస్త్రంబులఁ గుముదుని మాఁట గరముగ్ర శరపంచకంబున ద్వివిదు
నరుదార మైందు నైదమ్మ్రెసింట ♦ శరభుని దొమ్మిది సాయకంబులను
ఘనతర బాణాష్టకంబున గజునిఁ ♦ గిపిసి బెట్టుగ నాలుగింట గవాక్షు
గవయుని నెనిమిది ఘనసాయకములఁ ♦ దవిలి జ్యోతిర్ముఖు దశమార్గణముల
బలుకాండముల శతబలిఁ బదేనింట ♦ నెలమితో సినాని నిరువదేనింటఁ
బెడిదంబుఁగా నేయఁ బృథివిపై నొరగి ♦ కడు మూర్ఛనొంది రా కపివరులెల్ల
దివిజులు వెఱగంది దవి కొండి చూడఁ ♦ దవిలి వెండియును నుద్దండకోపమున
మృగములఁ దోలెడి మృగపతి మాడ్కి ♦

నగచరావళిఁ దోలె నతికాయుఁ డపుడు

తోలియున్న నెదుర్కొను కపుల ♦ నేలఁ గూల్చుచు నిగిడి రాముని మ
బగతోడి భక్తి నప్పుర మేశువలనఁ ♦ దగముక్తి గలుగు నింతట వనితలఁచి
నిగిడి యా రాఘవునికి నతికాయుఁ ♦ డగలని తెగువమై ననియె నవ్వుచును
రామ యీ సమరధరాస్థలిలోన ♦ నీ మగఁటిమి చూపు నిక్కంబు నాకు
నెంతటి వాఁడవో యెన్నఁడ నిన్ను ♦ నింతటి వాఁడని యెఱుఁగ రెవ్వరును
మాతండ్రికతమున మానిసివైతి ♦ మాతండ్రికతమున మహిరాజవైతి
యమరేంద్ర యమ వరుణాది దేవతలఁ ♦ గుమిలోన నొకఁడవు గావు నిన్నదుర

కడముట్టశూరుఁడై కదిసినవానిఁ ♦ గడిమిమైనెదురంగఁ గవియుదుగాక
యేమనీమగతనం బెఱుఁగనేమందు ♦ మానాభిమానముల్మఱినీకుఁగలవె
గణుతింపనన్నయుంగావుగాక నీవు ♦ గుణహీనుఁడవు సత్త్వగుణమెందుఁగలదు
ఏజాతిఁగలవాఁడ వేమిచెప్పెడిది ♦ రాజకులాచారరతుఁడవే నీవు
అనఘమానస మానసాటవుల్దూరు ♦ నను జేరిపోరాడ నాయీడుగావు
గానికొవివేలాద్రి గుహలలోనుండు ♦ నను జేరిపోరాడ నాయీడుగావు
సనకాదిమునియోగిసదనములొప్పరుము ♦ నను జేరిపోరాడ నాయీడుగావు
కాషాయవస్త్రసంకలితులై విగత ♦ దోషులై భవరోగ దూరులై పోయి
కూరలుగాయలు కూళ్లుగాఁగుడిచి ♦ నీరసాహారులై నిష్ఠలడస్సి
ఘోరాటవులలోనఁ గ్రుమ్మరుచున్న ♦ వారిలోపలఁబోయి వర్తింపుమీవు
కలహావిక్రమశక్తికడనటలేదు ♦ తలపోసి యెఱుఁగుదు తగిలినీలావు
నాగనాంటివాఁడవై యుండెడినీరు ♦ జగతిలోనీకపి సైన్యంబుగలిగె
దిక్కెవ్వరును లేక తిరిగెడినీవు ♦ దిక్కయ్యెనిప్పుడు దినకరాత్మజుఁడు
ఎక్కడగురుఁడని యెఱుఁగనినీకు ♦ నక్కడగురుఁడు విశ్వామిత్రుఁడయ్యె
నొకదేశమును లేక యుండెదునీకు ♦ నకలంకమగు నయోధ్యాదేశమొప్పె
నివినీకుఁ బెద్దగా నిచ్చలోనుబ్బి ♦ తివిరకునీవింక ధృతిపెంపుఁదూలి
చలియించిమీనమై సకలవారిధులు ♦ సొలవక చొచ్చినఁ జొత్తుగాకేమి
తలఁపునీమీఁదిదె తప్పదునాకు ♦ పలుకులేటికినిన్ను బట్టెదవెదకి
తలఁగ్రుచ్చికూర్మమై ధరణిలోపలికి ♦ సొలవకవచ్చినఁ జొత్తుగాకేమి
తలఁపునీమీఁదిదె తప్పదునాకుఁ ♦ బలుకులేటికినిన్నుఁ బట్టెదవెదకి
యలిగినరాహంబ వైరసాతలము ♦ సొలవక చొచ్చినఁ జొత్తుగాకేమి
తలఁపునీమీఁదిదె తప్పదునాకుఁ ♦ బలుకులేటికినిన్నుఁ బట్టెదవెదకి
చలమునవికృతవేషమున నందైన ♦ సొలవక చొచ్చినఁ జొత్తుగాకేమి
తలఁపునీమీఁదిదె కుప్పదునాకుఁ ♦ బలుకులేటికినిన్నుఁ బట్టెదనెదకి
కడుగుజ్జవై నీవు కార్పణ్యవృత్తిఁ ♦ బాడవేదిపోయినఁబోదుగాకేమి
తలఁపునీమీఁదె తప్పదునాకుఁ ♦ బలుకులేటికినిన్నుఁ బట్టెదవెదకి
ధారణీసురవేషధారి కుఠారి ♦ నై రాజసంహారి వగుదుగాకేమి
తలఁపునీమీఁదిదె తప్పదు కుఁ ♦ బలుకులేటికినిన్నుఁ బట్టెదవెదకి
అచ్చరువగు వరుణాంబుధిలోనఁ ♦ జెచ్చెఱనిన్ను మోచియుఁదేలియాడఁ
బరికింపనలవట పత్రంబుగాదు ♦ కరముభీషణము నాకంకపత్రంబు
దురమున ననునీకుఁ దొడరంగరాదు ♦ వరగర్వమున నెందు ప్రాలినవాఁడ
వని పేర్చిపలికెదు నయ్యతికాయు ♦ ఘనగర్వమునకు లక్ష్మణుఁడుగోపించి

—:*: లక్ష్మణాతికాయుల ద్వంద్వ యుద్ధము *:—

యోరివిశాట నేనుండ రాఘవుని ♦ తోరణంబొనరింపఁ దొరకొననేల
నాదెసఁజక్కనై నడతెమ్ము నిన్ను ♦ నాదు బాణముల భగ్నంబు చేసెదను
అనిదానవుని గుండె లవియ నదంద ♦ ఘనగుణధ్వని చేసి కదిసినవాఁడు
నారభసంబున నాశ్చర్యమంది ♦ క్రూరాస్త్రమొక్కటిఁ గొనియార్చిపట్టి
నిలునిలులక్ష్మణ నీవుఁ బాలుఁడవు ♦ వలదంతనీకంటె ప్రాలినవాఁడ
నావరశరఘట్టనంబు సహింప ♦ నీవసుంధరయొండె హిమగిరియొండె
రావణుండెత్తిన రజతాద్రియొండె ♦ దేవతలున్న ధాత్రీధరంబొండె
నంజకహరువిల్లు నడఁచి గర్వమున ♦ రంజిల్లుమీ యన్న రాఘవుండొండె
గాక నన్నని మొనఁ గదియ శక్యంబె ♦ నీకు నాముందట నిలువంగఁదరమె
యీవరబాణంబు నిటనిన్నుఁగట్టి ♦ త్రావెడునీదు రక్తంబు సౌమిత్రి
యనిదురహుంకృతి నాడినతఁడు ♦ దనుజుఁడునీకు వృథాగర్వమేల
పోరనీలావు చూపుదుగాకనీకు ♦ నీరిత్తమాట లింకేలనాయెదుట
దీవునుశస్త్రాస్త్ర నిచయంబుతోడ ♦ నీవిధంబున రథమెక్కి యుద్వృత్తి
మానక యిటఁబోటుమగవాఁడపోలె బూనియున్నాఁడవిప్పుడు నిశాచరుడ
యనవుడుఁగోపించి యతనిపై నేసెఁ ♦ దనచేతిబాణ ముద్ధతి వాఁడు దొడఁగి
యేసియార్చిన దితినింద్రాదిసురులు ♦ నాసమయంబున నాశ్చర్యపడఁగ
వదలక రాఘవేశ్వరుననుజుండు ♦ నదియర్ధచంద్ర బాణాహతిఁ ద్రుంచి
చెలువార బ్రహ్మ వ్రాసిన వ్రాఁతయింక ♦ వలదని తాభువి వైచినకరణిఁ
జటులాస్త్ర మొక్కటి సంధించి వాని ♦ నిటలస్థలమునాట నిపుణుఁడై యేసె
నేసినరుద్రుని యేటునవడఁకు ♦ భాసురాసురపుర ప్రాసాదమనఁగఁ
జలియించినాతోడ సమరంబు సేతుఁ ♦ నిగవీఁడని యతికాయుండు పేర్చి
కడిమిమైనరదంబుఁ గదియఁదోలించి ♦ తడయక యారాముతమ్మునిమీఁదఁ
జలమొక్కటియెతక్క చంపవేనన్ను ♦ చెలువున నొక్క నిశితబాణమేసె
మూఁడంబకంబుంమూర్తిగాచినను ♦ జోడిమిఁదక్కంతుఁ బొమ్మన్న కరణిఁ
జటుల వేగంబు నసంధించి మఱియుఁ ♦ బటుతరంబగు మూఁడు బాణంబులేసె
ననయంబు బెరుకుదునైదుప్రాణములు ♦

ననుమాడ్కి వెండియు నైదమ్ములేసె
నేడువార్ధులుఁ సొచ్చి యీఁదిపోయినను ♦ తోడనేసినఁబట్టి త్రుంతునన్నట్టి
కరణి నెంతయు భుజాగర్వంబుమీఱి ♦ యిరవొందనంధించి యేడమ్ములేసె
నవివేగలక్ష్మణుం డంతలోపలనె ♦ వివిధఖండములుగావించి పెల్లార్చి [డిగి
యతికాయుపై నేసె నాగ్నేయబాణ ♦ మతఁడునూ తేసె సౌరాస్త్రంబుఁదో

యా రెండు శరములు నడరి యొండొంటి ♦
తోరణం బొనరించి తుమురులై రాలె
చేకొనిదనుజుఁ డైషిక బాణ మేసెఁ ♦ గాబుత్ స్థితిలకుఁ డాకంపంబు నొంద
నదియైంద్రమునఁ ద్రుంచె నడరి లక్ష్మణుఁడు ♦
అదిగని దైత్యుండు యామ్యాస్త్ర మేసె
నది ద్రుంచె నతఁడు వాయవ్యాస్త్ర మేసి యదిగాక పెక్కమ్ము లసురపై నేయ
నవివాని మైమరు వటుఁ దాఁకి విఱిగి ♦ భువిమీఁద నొఱగినఁ బోక లక్ష్మణుఁడు
వెండియుఁ బెక్కయ విఱుగుటఁ జూచి ♦ కాండంబు లేమొకో కాడవు వీని
ననియని చింతించి యలయుచున్నంత ♦ నెనలేని యామర్మ మెఱిఁగి తానసుచు
నప్పుడా తనితోడ ననిలుండు వచ్చి ♦ చెప్పె లక్ష్మణ బ్రహ్మచే వీఁడు వడసె
వరము గాఁగోరి యీవజ్రకవచము ♦ శరము లెవ్వియు వీనిఁ జాలవు నాటఁ
బలు దునియలుగాఁగ బ్రహ్మాస్త్ర మేసి ♦
పోలియింపు మనవుడు పొంగి లక్ష్మణుఁడు [యేసె
అదిసమంత్రకముగా నార్చుచుఁ దొడిగి ♦ త్రిదశారిసుతు మీఁదఁ దెగఁ గొని
నేసిన బ్రహ్మాండ మెల్లను బగుల ♦ వాసవుండాదర దేవతలు గంపింప
ధరణి వడంక దిక్తటము లల్లాడ ♦ శరధులు ఘూర్ణిల్ల శైలములు వ్రడఁక
ధరణిచంద్రులగతి గప్పంగఁ జుక్క ♦ లురులంగ రత్నపుంఖ జ్వాలంబగుచుఁ
బ్రళయకాలము నాఁటి పావకు భంగి ♦ వెలకొని లోకముల్ నిండిమంచుచును
యమదండమును బోలె ననిల వేగమునఁ ♦

గ్రమ మొప్ప నింతయు కడుర భసమున
నమ్మోయి బ్రహ్మాస్త్ర మరుదేర దైత్యుఁ డమ్ములు నిగుడింప నవియుఁగ్ర కొనక
వచ్చుటయును శక్తి వైచె వైచుటయు ♦ జెచ్చెఱ నా శక్తిఁ జేకొనక దియు
లావునరాఁగ శూలంబు నవైచె ♦ నావిధఁబును గొన కదిమీఱి రాఁగ
గద వ్రేసె వ్రేసిన గదయును ద్రోచి ♦ యదివచ్చుటయు జూచి యడిదాన వ్రేసె
నదిదాఁటి రాఁ బరశ్వాయుధం బెత్తి ♦ వదలక వ్రేయ దీవ్రంబున నదియుఁ
గడచియే తేరంగఁ గడఁగి కటారిఁ ♦ బొడిచిన నందునఁ బోక పై రాఁగ
వలనొప్ప మొలనున్న వంకిని బొడిచెఁ ♦ జలమున నదిమీఱి చటుల వేగమునఁ

—:* అతికాయుఁడు లక్ష్మణునిచేఁ జచ్చుట *:—.

బోవకే తెంచినఁ బొడిచెఁ బిడికిటను ♦ దేవతల్ దలలూపఁ దివిరి యాశరము
మండితకోటీర మండలితోడఁ ♦ గుండలంబులతోడఁ గూల్చెఁ దచ్ఛిరము
నటువజ్రహతిరోహణాద్రిశృంగంబు ♦ చటులతఁ గూలిన చాడ్పునఁ బడ్డ
నతికాయు తలఁ జూచి యతిభీతిఁ బొంది హతశేషులైన దైత్యాధముల్ పఱచి

లంకఁ జొచ్చుటయుఁ గెలంకులకపులు ♦ నంకించి రెంతయు నారాముతమ్ముఁ
డరుదెంచి శ్రీరాము నడుగులకెరఁగఁ ♦ గరముసంతోషించి కౌఁగిటఁ జేర్చి
వినుతించునాకపి నీరులతోడ ♦ ననయంబు హర్షించె నవనీశుఁడంత
నాదైత్యనాథుండు నయ్యతికాయుఁ ♦ డాదిగాఁగల దైత్యు నార్వురుపడుట
విని మూర్ఛపాల్పడి వేగంబె తెలిసి ♦ ఘనముగాఁ గన్నీరు గ్రమ్మ నందంద
నతిదుఃఖమునుబొంది యడలుచునున్న ♦ పతికడకేతెంచి పల్కె మయపుత్రి
యసురేశ లోకంబు లన్నిటిలోన ♦ నసమానసత్త్వుఁడ వై నసీకిట్లు
పాడియె శోకింపఁ బాటవై నీవు ♦ నాఁడేల తెచ్చితి నరనాథు దేవి
నొప్పింప నేరవై తుచితకాలమున ♦ దప్పనారామునిఁ దలపడ్డ దైత్యు
లరుదెంతు రనుమాటలవి యుఁబో విడువు సుర వైరియాజిలోఁ జూపునీకడిమి
యనుమాటలాలించి యాత్మఁ జింతించి ♦ వనితనంతఃపుర వరమునకనిచె
నని చినవగలతో నిట్టూర్పుఁ బుచ్చి ♦ తనమంత్రివరులతో దశకంఠుఁ డనియెఁ
గటకటా తమ్ములు గాదిలిసుతులు ♦ నిటు నేలఁగూలిరింకేమనఁ గలదు
విబుధులకైనను విడిపింపరాని ♦ ప్రబలంబులగు నాగపాశబంధములఁ
బాసిరి మాయపోఁ బలిమినో మనుజు ♦ లాసచేసినఁ జెల్ల దదినాకుజయము
ఆరాముతమ్ముని నాజిలో గెలుచు ♦ వీరుని నెవ్వాని వెదకియుఁ గాన
భయమెన్నఁడును లేక పరఁగు నీలంక ♦ భయమును బొందె నాబలియులవలన
నారామవిభుని పరాక్రమంబునకు ♦ మేర యెయ్యది యిటమీఁద నీలంక
యతనిచేఁ జెడకుండ నరసి యేమఱక ♦ ప్రతిదినంబును గావఁ బంపుయునుచు
నంతఃపురంబున నరిగియొక్కరుఁడ ♦ యంతరంగంబున నడలుచునుండ
నప్పుడు చనుదెంచి యామేఘనాదుఁ ♦ డప్పంక్తికంఠున కనియెనింపార
నేసికుగలుగంగ నిటువగపేల ♦ దానవాధీశ్వర తగదు చింతింపఁ
బటుతరంబైన నాబాణసంహతికి ♦ నెటుసహింపఁగఁ జాలు నీశ్వరుండైన
నటుచూడు రాముని నాతనితమ్ముఁ ♦ జటులాంబకముల జర్జరితులఁ జేసి
యసువులు వెటికియయ్యగచరావళుల ♦ వసుమతిపైఁ గూల్చి వచ్చెదఁ గడిమి
విబుధకంటక నేఁడు వినుము నాప్రతిన ♦ విబుధలోకేశుండు విష్ణుండు యముడు
శిఖియును రుద్రుండు సితకరార్కులును ♦ నఖిలసాధ్యులు బలియజ్ఞవాటమున
నేచివిజృంభించు నెడ త్రివిక్రమునిఁ ♦ జూచినగతి నన్నుఁ జూతురుగాక

—:* ఇంద్రజిత్తు రెండవమాఱు యుద్ధమునకు వెడలుట *:—

యనివీడుకొనిదివ్య మగురథంబెక్కి ♦
దనుజేంద్రతనయుఁ డెంతయు సొంపుమీఱ
నడువంగ నప్పుడు నానాముఖములఁ ♦ గడువేగమున నుర్వి గదలగాఁ గదలి

వెడలెరథంబులు వెడలె నేనుఁగులు♦వెడలె గుఱ్ఱంబులు వెడలెఁ గాల్బలము
పుండరీకంబులఁ బోలుపారువారు♦పుండరీకత్విషలఁ బోలుపారువారు
పుండరీకచ్ఛాయఁ బోలుపారువారు♦పుండరీకోన్నతిఁ బోలుపారువారు
నప్పుడుగ్రతఁ జతురంగసైన్యముల♦నొప్పిరి దానవు లుగ్రాసనముల
నార్పులుబొబ్బలు నతులఘోషములు♦దర్పితసింహనాద స్ఫురణములు
నేమిరవంబులు నిస్సాణరవము♦రామణీయకము లుగ్రంబులై యమర
భాసురధవళాతపత్ర మొప్పార♦నాసుధాకరుతోడి యాకాశమనఁగ
గమలలోచనములు గ్రాలఁగ దండ♦ప్రమదాజనము చామరంబులు వీవ
బహుభూషణ ప్రభాపటలంబు వెలుఁగ♦

సహజవైభవమహోజ్జ్వలుఁడింద్రజిత్తు
చనుదెంచి రణమహీస్థలమున నిలిచి♦ఘనభుజం డత్యంతకౌతూహలమున
రక్తవస్త్రంబుల రక్తమాల్యముల♦రక్తగంధంబుల రాజితుండగుచు
రవమంత్రముల హుతవహు బ్రతిష్ఠించి♦శరములు తోమరచయములు వరుస
బరిధులుఁగా జేసి పలుస్రుక్స్రువములు♦కరమర్థిలో హోముల్ గాఁ ఘటించి
దనలోని నిష్టయు దార్ఢ్యము నొప్ప♦దనుజేంద్రతనయుఁడధర్వణోక్తముగఁ
దగ నెయ్యిలాజలు దాడిసమిధలు♦నొగి వేడ్క వేల్చుచు హోమాంత వేళ
గడిఁదికృష్ణచ్ఛాగకంఠరక్తంబు♦నడరెడు వహ్నిఁ బూర్ణాహుతి వేల్వ
ననలుండు పొడసూపి హవ్యముల్ గొనియె♦

ననలునికరుణ బ్రహ్మాస్త్రంబు రథము
ధనువు రుగవచంబు దద్దయుఁ బ్రీతి♦గొని యార్చుటయును దిక్కులు పెల్లగిల్ల
దానవుండర్కేంద్రుతారకాసమితి♦తోన థంబగులంగ దుర్దాంతుఁడగుచు
రథరథ్యకేతుసారథులతో నెగసి♦ప్రథితవేగమున నంబరవీథిడాఁగి
యగణితబలసత్వుఁడై యొప్పఁబలికెఁ♦దగి యొక బుద్ధిగాఁ దనసేనతోడ
దరలక నిలిచి యుద్ధ సేయుచుండుఁ♦డురక యేనిదె దివినుండి ఘోరముగ
రణమొనరించి యారామలక్ష్మణుల♦గణుతింపకెంత వేగము చంపువాడ
ననిన నుత్సాహవాక్యము విని పేర్చి♦దనుజులు సేనావితానంబుతోడఁ
దరుచరసేనలు దరియంగఁ జొచ్చి♦బరవసంబునఁ బెక్కు భంగులఁ బోర
నాదివినుండి దివ్యాస్త్రంబు లేయ♦ నాదానవుని దెస కగచరులెగసి
యగములు వైవంగ నవి ద్రుంచి గుండె♦లగలించి పెక్కండ్ర నవనిపై గూల్చి
వేయింబదియు నొక్కొక్క విషమబాణమున♦నేగురఁ దొమ్మండ్ర నేడ్గుర నేసె
మఱియు గడిమిమై మర్కటేశ్వరులు♦నెఱసినగిరి ధరణీజంబులై తి
యీఱు న్రజిత్తుపై నడరింప నతఁడు♦సాయకంబుల వానిఁ జతురుఁడై త్రుంచి

పదియు నేన్మిది తీవ్రబాణంబులేసి ♦ మదమెల్లఁ జెడ గంధమాదనుఁ గడిమి
దీపింపన లుఁదొమ్మిదిట రూపుమాపి ♦ నేపారమైందుని నేడింట నొంచెఁ
గదిసి పంచకమున గజుని నొప్పించెఁ ♦ బదియింట భల్లూకపతిఁ గూల నేసె
నూటను హనుమంతు నొప్పించి మించె ♦ మూఁట గవాక్షుని మొగిగాడ నేసెఁ
బదియింట హరిరోము ప్రాణముల్ గొనియె ♦

వదటణఁగ గరంభు నాఱింట నేసెఁ

దగిలి మూఁటిట వేగదర్శిఁ భంజించెఁ ♦ దెగి సుషేణుని నెన్మిదింట నొప్పించె
వనయంబు పదిట సూర్యప్రభు నొంచె ♦ బనసుని యంగంబు బదుమూఁట నేసె
ఘనతర బాణాష్టకంబునఁ గుముదు ♦ నెనసి నీలుని ముప్పదింటను ముంచె
మసలక మఱి పెక్కు మార్గణంబులను ♦ రసకతదూఁ దారాతనూభవుని
సునిశితంబైన యాశుగములనూట ♦ దినపనందనుని నైదిట నింద్రజాలు
గిరిభేది రెంటను గెడపి యాంబుషభు ♦ నిరువది శరముల నిలఁద్రెళ్ల నేసె
కేసరి పదునాలుగిట దధిముఖుని ♦ భాసురంబుగ బాణపంచకంబునను
సుముఖునిఁ గ్రథనుని సారిది నాఱింట ♦ విముఖు నేడింటను ద్వివిదు నాఱింట
శరభు నేడింటను శతబలిఁ బదిట ♦ సరి నెన్మిదిట హరు సన్నాదు మూఁట
నరుదుగాఁ దక్కిన యఖిలయూథపుల ♦ వరదివ్యశస్త్రాస్త్ర వర్షంబు గురిసి
కడు భిన్నగాత్రులఁ గాఁ జేసి నేలఁ ♦ బడవైచి మఱిగత ప్రాణులఁ జేసి
కొందఱి నమ్ముల గొనిగాడనేసి ♦ కొందఱ గద నెత్తుకొని బిట్టువ్రేసి
కొందఱి శూలముల్ గొని గాడనేసి ♦ కొందఱి శక్తులు గొని నిగుడించి ప్ర
దను జేంద్రతనయుఁ డెంతయుఁ బ్రతిలేక ♦ తనరు బ్రహ్మాస్త్రమంత్ర ప్రభావము
నందఱి నీక్రియ నందందఁ బేర్చి ♦ యెందును బోనీక యయ్యింద్రజిత్తుఁ
డున్న వానరసేనయును జంపివైచి ♦ యున్నతజయము సనుగ్రుఁడై యార్చెఁ
గపికోటి నొచ్చినఁ గడఁగి సౌమిత్రి ♦ కుపితుఁడై యన్నఁ గన్గొని విన్నవించె
దేవ బ్రహ్మాస్త్రంబు దీపింపఁ జేసి ♦ రావణసహిత మీ రాక్షసకోటి
నంతయుఁ జంపెద నానతీయుమ్ము ♦ చింతింప నేటికిఁ జెచ్చెఱ ననుడు
వీని మాయఁ జేసి వీని రూపంబు ♦ గానని యప్పుడు గడఁగి లోకములు
భస్మంబు సేయుచు బ్రహ్మాస్త్ర మరుగు ♦ విస్మయంబగు బలావిర్భావ మొప్పఁ
గావున వీనికై కడఁగి లోకముల ♦ నీవేల కాల్చెదు నిష్ఠురవృత్తి
నీ రాక్షసుడు బ్రహ్మ యిచ్చిన వరము ♦ కారణంబున జేసి కపికోటిఁ జంపె
ననయంబు మనమింక నా బ్రహ్మవరము ♦

మనమున నొకకొంత మన్నింపవలయు

ననిపల్కి నింద్రజిత్తు రఘుకులుల ♦ ఘనబాణముల నేపెఁ గదలక నిలిచి

## ఇంద్రజిత్తు బ్రహ్మాస్త్రముచే రాముఁడు మొదలగువారల మూర్ఛనొందించి మరలుట

గర్వితుండగు దశకంఠనందనుఁడు♦పర్విననీలాభ్ర పటలంబుగాఁగ
నడరించుకార్ముకజ్యానినాదంబు♦లుడుగక వెసమ్రోయునుఱుములుగాఁగ
వడిఁబూన్చి దైత్యుఁడు వైచుచున్న♦బెడిదంపుశక్తులు పిడుగులుగాఁగ
నగణితదివ్యశస్త్రావళియందు♦మిగిలినదీప్తులు మెఱుఁగులుగాఁగ
బోరిఁబోరిబుంఖానుపుంఖంబులగుచు♦నరుదెంచునస్త్రాలు నతివృష్టిగాఁగ
గరులనొప్పిన సెలకట్టియరెల్లఁ♦దఱుచుగానాడు చాతకముబుగాఁగ
కనకరత్నప్రభా కలితంబులగుచుఁ♦దనరుచాపం బింద్రధనువునుగాఁగ
నసురులయందును నగచరులందు♦వెసగ్రమ్ము నెత్తురు వెల్లువగాఁగ
బింబాహారములకుఁ బాసినమౌక్తి♦కంబులు నెరి వడిగండ్లునుగాఁగ
నురలినమకుటమహోజ్జ్వలమణులు ♦ పరఁగంగ నింద్రగోపంబులుగాఁగ
లాలితాయతకాహళారవంబులును ♦ ప్రాలిన కేకారవంబులుగాఁగ
సమధికపటహోగ్ర సన్నాహరవము♦రమణీయమండూకరావంబుగాఁగ
ససమునరఘుపతి హాలికుఁడై పేర్చి♦నసురేశవిపుల దేహక్షేత్రమునను
అడరిలోకములెల్లనలరంగముష్టి♦విడువకయమ్మును వెతబెట్టుకొఱకు
వచ్చినతొలుకరి వానకాలంబె♦నచ్చుగానొప్పారె నాసమయంబు
గానఁగదాయింకఁగడఁగిరాఘవుఁడు♦మానక బాహుసమగ్రతఁబూని
కలనికి నద్దశకంఠునిఁదెచ్చి♦తలకోతకోసి యుద్దండతననుచు
ననినచందంబున నతివిచిత్రముగ ♦ నెనయంగ డెబ్బదిరెండువెల్లువల
వనచరులను నృపవరులజయించి♦ఘనతరజ్యానాదకలితుఁడై మగిడి
యాలంబుచాలించి యాయింద్రజిత్తుఁ ♦ డాలంకలోనికి నరిగెనవ్వేచును
మనుజేసుడు నస్థ మదివిచారించి♦కనుఁగొనఁజాలక కన్నులుమొగిచి[డఁ
కొనితొలగిసమాఢ్కిగ్రుంకెచర్కుండు♦వనచరాననపద్మవనములుమొగు
గపికోటిచేలంక కాలువోధూమ ♦ ముపమింపనీగతి నుండునన్నట్లు
గడునగ్గలముగ లోకంబెల్లనిండి♦తడయకెంతయు నంధతమసంబుపర్వె
నప్పుడుతొడిగి బ్రహ్మాస్త్రమంత్రంబు♦లొప్పజపింపంగ నొకటియుఁగాక
నున్నవిభీషణుఁ దుర్వారగూలి ♦ యున్నసుగ్రీవాది యోధులఁజూచి
వనచరులార గీర్వాణారిసుతుఁడు ♦ వనరుహగర్భుని వరమునఁజేసి
పన్ని యేయుటయును బ్రహ్మాస్త్రశక్తి♦మన్నింపఁదగునని మనమునఁదలచి
వందించియారాము వసుమతినాథుఁ♦డించుకసైఁచినాఁ డింత యేయనుడు
వాయుసూనుఁడు బ్రహ్మవరమునఁజేసి♦యీయింద్రజిత్తుదివ్యాస్త్రసంతతుల

జావకుండుట విభీషణుతోడననియె ♦ వింపుమిప్పుడు భండనభూమి
నిటఁబడ్డవారిలో నెవ్వరుగలరు ♦ పటుబాణహతులయ్యుఁ బ్రతికినవారు
అనియిద్దఱును గూడి యంధకారమునఁ ♦ గొనకొని మండెడి కొఱవులుపట్టి
కొసకల నెల్లను గ్రుమ్మరునప్పుడు ♦ ననయంబు నాసంగరావనిలోన
నందంపమడుగక యూడుసట్టలును ♦ గ్రందుగా మాంసముల్గఱచుభూతములు
బెడిదంబుగా నార్చుబేతాళములును ♦ అదరెడురక్తంబులానుఢాకినులు [లు
కండలుగబళించు కంకగృధ్రములు ♦ నొండొండ నెలుగిచ్చునురుసృగాలములు
గెడసిరక్తములు గక్కెడిభల్లుకములునుడుగక యంపందనొరలు కోతులును
గుదిచి శిశ్ళసుదన్ను కొనుపలీముఖులు ♦ కదిసినదంతముల్గలప్లవంగములు
లావరిపడిన గోలాంగూలములును ♦ భావింపరాని రూపముల వానరులు
కీలాలవారిఁ దోఁపగియుగచరులు ♦ కేళిమైధూళి బ్రుంగినవనచరులు [లు
పదుగురనేఁబ్రద్ద బ్రదర మొక్కటను ♦ గుదులు గ్రుచ్చిన క్రియఁ గూలి నకపు
అంతంతఁదుత్తుమురైనశైలములు ♦ నింతింతలైన మహీరుహములును
డంబులైన రాక్షసులశస్త్రములు ♦ దండిగాఁగునకలై ధరనున్నలుగద
పడినసామజనికరముల్ సమర ♦ మండలింబడియున్న మఱి వెఱఁగంది
నుఁగొని ఖిన్నులై కడుదుఃఖమడరి ♦ యునిరిపవిభీషణ హనుమంతులపుడు
వలయుకార్యముజాంబవంతునినడుగ వలయుకార్యంబులపలనాతఁడెఱుగు
నతఁడున్న యెడనింకనరయుదమరసి ♦ యతడు చెప్పినత్రోవ నరుగుదమనుచు
గలనెల్ల వెదకుచుఁ గనుఁగొనరపుడు బలితంపుశరశయ్యఁబడియున్న వాని
గనిజాంబవంతుఁడగ్గతిదైత్యనాథుఁ ♦ డనియెఁ బెద్దయునార్తుఁడై వగనొంది
బ్రతికియున్నాఁడవే పలుకంగఁగలవే ♦ యిదెబుత్త రాజమమ్మెఱుఁగుదెయనిన
దానవుశరహతి దర్పంబుదక్కి ♦ హీనస్వరంబున ఋుత్తిశుఁడనియె
సర్వవిశేషంబు విచారించిబుద్ధి ♦ పరికించి నివని పలికెదఁగాన
కలుషనమ్ముల కండ్లగాడుటఁజేసి ♦ చశితదృష్టిని విభీషణ గానరాదు
చెవులకునింపుగాఁ జెప్పుమునాకు ♦ పవమానసూనుండు బ్రతికియున్నాఁడె
యనవుడు వెఱఁగంది యాజాంబవంతు ♦ కనియెవిభీషణుఁ డతిసంభ్రమమునఁ
గను వెఱఁగయ్యెడు ఘనుఁడైన రాము ♦ గడుఁగకలక్ష్మణు నడుగకయినజు
నడుగకయంగదు నడుగకయతని ♦ నడుగుటయేతలం పగుబుత్త రాజ
యనినవిభీషణా హనుమంతుఁడొకఁడు ♦ తనువుతోనుండినఁ దరుచరులెల్ల
బ్రతుకుదురాతఁడు బ్రతుకఁడేనియును ♦ బ్రతికియుండిననైన బ్రతుకరుపులు
అనుమాటవినిముదంబందివాయుజుఁడు ♦ దనపేరుజెప్పిపాదములకు మ్రొక్కి
మొక్కినబ్రనెఱిఁగి యుమ్మలబుత్త రాజు ♦ తక్కకయాత్మముదంబునుబొంది

తనుఁబువర్గాతుఁగాఁ దలపోసియనియె ♦ ననిలనందనుతోడ సర్థిదీపింప
దలపోయ వాయునందననీవుదక్కఁ ♦ గలుగునేయొక్కఁ డీకపులకుదిక్కు
అదిగాకయిప్పుడీ యంబుధిఁదాఁటి ♦ వదలక యాహిమవంతంబుగడచి
హేమకూటంబును ఋషభపర్వతము ♦ నామేరువును రజతాద్రియుగడచి
శ్వేతాచలముదాఁటి శీఘ్రంబు మెఱసి ♦ యాశతమగుల క్షీరాంబుధిఁగడచి
యరిగిశాకద్వీప మవ్వలికేగి ♦ తరఁగలనొప్పు సుధావార్ధిదాఁటి
చంద్రశైలద్రోణశైలమధ్యమున ♦ సాంద్రదీధితుల నుజ్వలతవహించి
తిరమైనయాయౌషధీ శైలమెక్కి ♦ కరమొప్పు సంజీవకరణి విశల్య
కరణియు సంధానకరణి సావర్ణ ♦ కరణియు నానాల్గుగలవౌషధములు
అవితెచ్చి యీవానరావళినెల్లఁ ♦ బవనతనూభవ బ్రతుకంగఁజేసి
రాగంబునొందింపు రామలక్ష్మణుల ♦ నేగంబెయనవుడు విని వాయుజుండు

{ ఆంజనేయుఁడు యోషధీశైలము దెచ్చి రామలక్ష్మణాదుల మూర్ఛదేలించుట }

అతఁడపిపొక్కని సువేలాచలంబెక్కి ♦ చతురుఁడై పదములు సమముగామెట్టి
లలిత శేషాభ వాలము మీఁదికెత్తి ♦ నెలకొని భుజములు నిక్కించిపొంగి
రామునిఁదలఁచుచు రయమున నెగయ ♦ నామహనీయాద్రి యవనిపైగ్రుంగ
దెసలుగంపించ దిగ్గిరధాత్రిదిరిగ ♦ నసమానమైనట్టి యారభసమున
నతఁడట్టులెగసియ య్యాకాశవీథి ♦ నతిభీషణంబైన యంబుధిదాఁటి [నుచు
హరిచక్రమనుబోలె సరుగుచునడుమ ♦ తరమిడి పెక్కుచోద్యములుగన్గొ
సాంద్రఫేనామృత జలనిధిదాఁటి ♦ చంద్రశైలద్రోణ శైలమధ్యమున
తిరమైనయా యౌషధీశైలమెక్కి యరయుచువచ్చుచో నా యౌషధములు
కామరూపులు గాన కపిశేఖరునకు ♦ నేమియుఁ బొడచూపనీక యొయ్యఁదమ్ము
ననిలనందనుఁడును నవిగానకుండి ♦ తనలోననందంద దలపోసిచూచి
యతివిస్మయంబున నాపర్వతంబు ♦ నతులశక్తోదాత్తుఁడై వేఁడఁదొడఁగెఁ
ప్రాలేయగిరియును బర్జన్యగిరియుఁ ♦ గైలాసగిరియును గైకొనకేను
క్రన్ననవచ్చితి గార్యాతురుండ ♦ నిన్నునుద్దేశించి నిఖిలాద్రినాథ [జూపు
నీయందునిర్జరుల్ నెఱిదాఁచియున్న ♦ యాయౌషధము లెవ్వి యవి నాకుఁ
మారాఘవునకు గార్యము పుట్టియున్న ♦ దేరూపమున నైన నిచ్చుట లెస్స
యనిసనగ్గిరి యట్టహాసంబు చేసి ♦ యనిలనందనుతోడ ననియెగర్వమునఁ
బెలుచ నీవిటువచ్చి పెక్కులాడెదవు ♦ తేఁకక యీయౌషధములు నన్నడుగ
నీవెంతవాఁడవు నిన్ను దెస్సంగి ♦ నేవిధంబున రాముఁ డెంతటివాఁడు
చేకొనిసురలు దాఁచినయౌషధములు ♦ నీకునిచ్చుటకంటె నేరమిగలదె

యనిగర్వమాడిన ననిలనందనుఁడు ♦ కినుకతో ననియె నగ్గిరితోడఁ బేర్చి
యేనిన్ను వలెనని యిటు వేఁడుకొనిన ♦ దాని విచారింపఁ దగదా కొనీకు
నగలించి నా భుజాయతశక్తి నిన్ను ♦ నగమ మూలోన్మూలనంబుగాఁ బెఱికి
యిదె కొనిపోయెద నెఱుఁగని రాము ♦ హృదయంబులో నప్పు డెఱిఁగెదుగాక
యని విభీషణంబుగా హనుమంతుఁ డద్రి యనువారగాఁ బట్టి యగలించి పేర్చి
పెఱికి గంధర్వుల బెదరంగఁ దోలి ♦ గుఱుతిడ రాకుండఁ గొనిరాఁ దొడంగె
ననిలనందనుఁడు సహస్రధారలను ♦ ఘనముగా మండు చక్రముతోడ విష్ణు
కరణి నేతేర రాక్షసవీరముక్త ♦ శరహతి నొచ్చి మూర్ఛలనున్న కపులు
వరమహౌషధ వాతవశతచేఁ దేరి ♦ కరము సంప్రీతితోఁ గడఁది యార్చుచును
అని మొనఁబడిన దైత్యావళిఁ గిట్టి ♦ వనధిలోఁ బాఱంగ వైచిరి చెలఁగి
హనుమంతుఁడును సువేలాద్రిపై నుండి చనుదెంచి యాకపిసైన్యంబు నడుమ
మహనీయమైనట్టి మందులకొండ ♦ మిహిరప్రతాపుఁడై మెల్ల నడించి
తపనవంశజులగు తపనసుతాది ♦ కపిముఖ్యులకును సుక్రక ప్రయోగింప
ధీయుక్తి నటమూర్ఛఁ దెలిసిరి వారు ♦ న యౌషధములమహత్త్వంబువలన
నని మొనఁదునకలైనట్టి దేహములు ♦ ఘనమైన సంధానకరణిచేఁ గదిసె
శరపుంజములు శస్త్రచయములు విశల్య ♦ కరణిచేన పుడూడి గండులు పూడె
సౌవర్ణకరణిచే నకలాంగకములు ♦ సౌవర్ణకాంతి నుజ్జ్వలములై మించెఁ
గలయంగ సంజీవకరణిచేఁ బ్రాణ ♦ ములు వచ్చి చెలఁగుచు మును పటికంటెఁ
గడు నొప్పి రెంతయుఁ గపివీరులెల్లఁ ♦ గడఁకతో నిద్ర మేల్కనిన చందమున
నప్పుడు కపివీరు లనిలనందనుని ♦ నొప్పార నగ్గించి రుత్సాహ మొదవ
నని మొనఁ జచ్చిన యసురులఁ గపులు ♦ వనధి నంతకుమున్నె వైచుటఁ జేసి
కదనంబులోని రాక్షసుఁ డొకఁడైన ♦ బ్రతుకుట లేదయ్యెఁ బరమౌషధముల
వంత సుగ్రీవాదులైన వానరులు ♦ సంతసంబున సూర్యచంద్రులభంగిఁ
గర మొప్పు రామలక్ష్మణులకు మ్రొక్కి ♦ యరుదార నుతియించి రనిలనందనుని
నప్పుడు మ్రొక్కెడు నాంజనేయునకు ♦ నుప్పొంగ విబుధాళి యుర్వీశుఁ డనియె
మనకు వాసవునాజ్ఞ మన్నింపవలయు ♦ ననయంబు గావున నమరులు మెచ్చ
నీ యౌషధీశైల మెప్పటిచోట ♦ వాయుతనూభవ వైచిరమ్మనుడు
మారుతాత్మజుఁ డసమాన వేగమున ♦ నా రాఘవుఁడు మెచ్చ నగ్గిరిచంద్రు
నెనయ నెప్పటిచోట నిరవందనునిచి ♦ చనుదెంచె రయమున సంగరస్థలికి
అంత సూర్యోదయం బయ్యె రాఘవుని ♦ చింతతోడ నెకూడి చీఁకటి వాసె
నప్పుడు సుగ్రీవుఁ డా రామచంద్రు ♦ నొప్పారఁ గనుఁగొని యుల్లాస మెసఁగ
వసుధేశ పొలిసె రావణు బలంబెల్ల ♦ నసమసాహస బలాహనకేళి వ్రాలి

గుదులుగ్రుచ్చినక్రియగుంభకర్ణుండు ♦ మొదలైన రాక్షసముఖ్యులస్థులును
ఆదిగాఁదనవర్గమంతయుఁగడఁగి ♦ త్రిదశారికయ్యంబు తెఱఁగొల్లఁడింక
లంకఁగాల్పంగ గోలాంగూలబలము ♦ పంకజహితవంశపనుపుమీరాత్రిఁ జు
ననుమాటవినికపులందఱుఁగూడి ♦ యినమండలముగ్రుంకు నెప్పుడోయను

—:* వానరులు లంకం గాల్చుట *:—

దమకింపుచుండంగఁదరణిగ్రుంకుటయు ♦ దమమును పెద్దయై దట్టమై సర్వ
అప్పుడుకపివీరు లధికరోషమున ♦ నుప్పొంగిధీరులై యుగ్రులైకపులు
గునియుచునార్చుచుగొరవులుపట్టి ♦ కొనిజవ బులుమీఱ గుప్పించిదాటి
పడిలంకముట్టియు వాకిళ్లవారు ♦ కడుభయంబునఁబాఱఁగాలంకఁజొచ్చి
యారావణునిపురి యడలికాల్చుటకు ♦ నారామవిభునికోపాగ్ని యేమిటికి
నీయనలముచాలదే యనిపేర్చి ♦ పాయకలంకఁ గాల్పంగఁజొచ్చుటయు
అనలుండుదరికొని యందందబర్వి ♦ వినువీథిఁదాఁకి దిగ్వివరంబునిండె
నాయగ్నిబడబాగ్నియైధూమపటలి ♦ తోయమైమిన్నష్ట తోయధివోలె
విస్మయంబుగ మణివితతులుచెదర ♦ భస్మంబుగాఁగాలెఁ బ్రాసాదతతులు
పొడిపొడిగాఁగాలి పొడవెల్లనడఁగి ♦ పుడమిగంపింప గోపురములుగూలె
గ్రక్కునమంట లుగ్రంబుగానెగయ ♦ నక్కజంబుగఁగాలి యట్టళ్లురాలె
మహనీయకాంచన మంటపంబులును ♦

బహురత్నమయగృహ పంక్తులుగాలె

నిండినసొమ్ములు నిండినట్లుండ ♦ భండారగృహములు భస్మంబులయ్యె
వెలలిడగారాని వివిధాంబరములు ♦ దలఁపఁబెక్కైన గంధద్రవ్యములును
బహువిధరత్నకంబళిచయంబులును మహనీయమరకతమౌక్తికాదులును
అగరుకుంకుమమ మలయజఘనసార ♦ మృగమదాద్యములై మేలివస్తువుల్లు
దరగనిబహువిధ ధాన్యరాసులును ♦ మఱియునుగల్గిన మహితవస్తువులు
కడునొప్పుకరితురంగములపక్కెరలు ♦ నెడనెడఁబ్రోవుఁగా నిడినట్టిజోడు
దొరలనేకవస్తువులు దైత్యులకుఁ ♦ గరకరిచిత్రము ల్గ్రిందంగఁగాలె
దడయకపైఁడికత్తళములుపూని ♦ వడినాయుధములు దుర్వారులైపూని
కపురఁజంపెదమనిఁగడఁగినవారిఁ ♦ గపులపైఁబఱతెంచి కదిసినవారిఁ
బాలఁతులతో సుఖంబులనున్నవారిఁ ♦ దొలఁగంగనేరక దూలెడువారి
బోలింపఁగడునిద్రబోయెడివారి ♦ బాలురగొనిభీతిఁ బాఱెడువారి
నాలుగుదెసలకు నలినేగువారి ♦ జాలగోదనములు సల్పెడువారి
నార్పంగ నురుమందిరాగ్రంబులెక్కి ♦ నేర్పునమఱి ధిలనేరనివారి
విడువకసదసముల వెడలంగఁబట్టి ♦ కడుసంభ్రమంబునఁ గదిసినవారి

ద్రోవలుగానక ధూమంబుచేత ♦ నావలిఁ బుచ్చఁబడి యడలెడువారి
గూడి నివ్వెఱఁగంది గుములుగట్టి ♦ వాడవాడలయందు వరలెడివారి
నప్పుడు చూడఁ గాలాగ్నిచందమున ♦ నిప్పులుమంటలు నెరయ నప్పురము
గాలుచునుండఁ గడురభసమున ♦ గాలిచేఁ జెడిరి పెక్కండ్రు నవ్వేళ
లలనలపణిమేఖలారవంబులును ♦ గలయఁ జెన్నొందు కంకణరవంబులును
బొలుపారురత్న నూపురరవంబులును ♦ చెలఁగెడు నా విపంచీరవంబులును
సురుచిర మధుర వచోరవంబులును ♦ సరుదైన నృత్తగీతారవంబులును [ను
గరమింపుగులుకు కేకారవంబులును ♦ చరియింపుచుండు హంసరవంబులు
సొంపారు పంజర శుకరవంబులును ♦ ఇంపారు టెంతయు నేలతోఁ గలిసి
సలలితంబైనట్టి చంద్రికకంటె ♦ తెలుపును బొందిన దీధితుల్ గలిగి
ప్రణుతింపనొప్పిన పద్మరాగాది ♦ మణులచే నొప్పిన మహిమలు బలసి
కాలెడి రవములఁ గప్పెడి పొగల ♦ ప్రేలిపెల్లైగ సెకి విస్ఫులింగముల
నాలంకలోపలి హర్మ్యంబులెల్ల ♦ చాలభీమణముగా సమసెనన్నియును
గానసుఖంబెల్ల గ్రాగిసిత్రైరి ♦ మానినీజను లభిమానంబు దూలి
చండతరంబైన శబ్దంబుతోడ ♦ మండుచునుండెడి మంటలఁ గూడి
నెఱపైన తోరణ నికరంబులొప్పె ♦ మెఱుఁగులతో నొప్పు వేఘంబులనఁగ
వినువారి గుండెలు వీనులు బగులు ♦ ననయంబు బెట్టుగా నాలంకలోన
తరమిడియుండంద దైన్యంబు మీఱి ♦ వరవధూరోదనంబులు వినవచ్చెఁ
గాలికాలక తమకట్టులు ద్రవ్వి ♦ నీలిగి ఏడివడ నేరనికరులు
హయములు గ్రందుగా నా పురంబందు రయమున ముందఱ రామబాణాగ్ని
తలకొని జలచర తతులు సమ్మర్ద ♦ ములను ఘోషించు సముద్రంబు వోలె
బారెడు వారిని బఱతెంచువారి ♦ గూరిన వగలతోఁ గుందెడువారి
నొదిగెడివారిని నొకకొంతగాలి ♦ విదిలించికొంచుచు వెడలెడివారి
లంఘించువారి విలాపించువారి ♦ సంఘంబులై నీరు చల్లెడివారి
బట్టియామటలో బడఁ ద్రోచి త్రోచి ♦ నెట్టన నార్తురు నెరయంగఁ గపులు
అటులంకపికలత నందరాఘవుఁడు ♦ పటుతరకోదండపాణియై కదిసి [చు
త్రిపురములను ద్రెంచు ద్రిణయనుఁ డలిగి ♦ విపులపినాకంబు వీకఁ ద్రిమ్మాయిం
కరణి నిర్వక్రవిక్రమశాలి రాముఁ డురుతరజ్యాఘోష మొనరించుటయును
వసుధాతలంబున నడిఁ జుక్కలురలె ♦ వసుమతి గంపించె వార్ధులు గలఁగె
దెసదప్పిరి రవిశశు లిద్దిగ్గజాద్రి దిమ్మెరగె ♦ దెసలసదులు బ్రీలె దిక్కరుల్ బెదరె
ననమాత్ముఁ డతివిస్మయంబందె భూత ♦ విసరంబు ఘూర్ణిల్లె విధి తల్లడిల్లె
రయమున రోధోంతరాళంబు మ్రోసె ♦ భయమందిరెంతయు బౌలస్త్యులెల్ల

గోడ దరవము రక్షోభటసింహ ♦ నాదంబు వీర వానరులయార్పులును
దిక్కులొక్కటనిండె దివిజారిపురము ♦ దిక్కగోపించుచుఁ దీవ్రవేగమునఁ
గైలాసశిఖరంబుకరణిఁ జెన్నొందు ♦ నాలంకగోపురం బైదుబాఁముల
పడినూఱుతునియలై వసుమతిమీఁదఁ ♦

బడనేసి మఱియును బహుసాయకముల
నేసెగేహములపై నేసెసౌధముల ♦ నేసెదేరులమీఁద నేసెనేయుటయు
నారాక్షసులుపోరు కాయత్తపడఁగ ♦ నారాత్రివర్తించె నతిఘోరలీల
అప్పుడుసుగ్రీవుఁ డఖిలవానరులఁ దప్పకచూచియు దగ్రుఁడై పలికె
లావునొప్పారంగ లంకవాకిళ్లఁ ♦ గావలియుండు రాక్షసుఁడెవ్వఁడైన
వెడలినఁజంపుడు వెఱచితిరేని ♦ కడుదప్పు సైరింపఁ గపివీరులార
అనవుడుకపివీరు లందఱుపేర్చి ♦ కనలుచుగుజములు ఘనశైలములును
చారుభీషణ రణోత్సాహులై పూని ♦ వారరయక్కోట వాకిండ్లనుండి
దర్పించియార్చినఁ దరుచరావళుల ♦ యార్పులు సైరింప కసురవల్లభుఁడు

—:* కుంభనికుంభాదులు యుద్ధమునకు వచ్చుట *:—

కుంభకర్ణునికొడుకుల ననికనిచెఁ ♦ గుంభనికుంభుల ఘోరవిక్రములఁ
బనిచి వెండియునుగంపనుని బ్రజంఘు ♦ ననికిదోడుగ శోణితాక్షుయూపాక్షు
నారాక్షసులును గజాశ్వరథంబు ♦ లారసియుద్ధతి నడరితోసడువఁ
బరిఘపట్టసగదా ప్రాసాదిశూల ♦ కరవాలకుంత ముద్గరభిండివాల
శరశరాసనము లుజ్జ్వలభంగిఁదాల్చి ♦ గురుశక్తిదానవకోటులునడువఁ
జారుపతాకాది చయములు గ్రాల ♦ భూరిభూషణదీప్తి పుంజము ల్వెలుఁగ
నధికమైనట్టితూర్యంబులు మ్రోయఁ ♦ గుధరంబులడల దిక్కులునిండనార్చి
పరువడిఁగల్పాంత పవనసంఘములు ♦ శరమిడి కాలాంబుదంబులఁదాఁకి
విఱియించుతెఱఁగున వీడెల్ల గాల్చి ♦ యతిమతివిహరించునగచరావళుల
నురవడిఁదాకి మహోగ్రులై కదిసి ♦ తెలించినొంచి యుదీర్ణవిక్రముల
వాకిండ్లయందు దుర్వారులై యున్న ♦ యాకపిసేనల నందఁదఁదోల
నాలంకవెడలిన యగచరసేన ♦ లోలివీఁగుటఁజూచి యోడకుండనుచు
నురుబాహుసత్త్వ సమగ్రులై పేర్చి ♦ హరిరోమకేసరు లాదిగాఁగల్గు
వానరులాదైత్య వర్గంబుతోడ ♦ మానకరోష సమగ్రులై కదిసి
తరులునుగిరులును దఱుచుగావైవ ♦ కరవాలముద్గర గదలశూలములఁ
దరిఘపట్టస భిండివాలచక్రాది ♦ పరశస్త్రములనొంచి వ్రాలినవంత
వారునఖంబుల వక్షస్స్థలంబు ♦ జీరియుగర్ణ నాసికలొలిద్రెవ్వ
గడిమిమైపండ్లను గఱచియుదలలు ♦ పిడికిళ్లఁబొడిచియు బేర్కొనసత్వుడు

ఒకవానరుఁడువచ్చి యొకదైత్యుఁ బొడువ ♦
        ఒకదానవుఁడు వాని నుద్ధతిఁ బొడుచు
ఒకరాక్షసుఁడువచ్చి యొకకపిఁ జంప నొకకపి యాదైత్యు నురవడిఁ జంపు
ఒకకపి చనుదెంచి యొకదైత్యుఁ బట్ట ♦ ఒకదైత్యుఁ డాకపి నుగ్రతఁ బట్టు
ఒకదైత్యుఁ డొకకపి యుద్ధమిమ్మనిన ♦ ఒకకపి వానితో యుద్ధంబు సేయు
నెడపక యొద్దుర నెనమండ్ర నొక్క ♦ పిడికిటఁ గపు లేచి పెల్లడంగింప
నందందఁ గూలుచు రసురులు గపులు ♦ నందఱు నుగ్రులై యార్చుచునపుడు
ఇరువాఁగుఁ బోరంగ నింతింతయైన ♦ తరుమహీధరములఁ దరుచరాంగములఁ
గరిహయదనుజనికాయకాయముల ♦ పరశస్త్రముల రణోర్వర ఘోరమయ్యె
గడిమిమైనప్పు డంగదునితోఁ బేర్చి ♦ కడఁగి కంపనుఁడు నగ్గదయెత్తి వైచె
నంగదుండును నొచ్చి యంతలో దెలిసి ♦
        తుంగశైలమున దైత్యుని వేయుటయును
అకంపనుఁడు చూర్ణమై నేలఁ గలిసె ♦ కపినాయకుఁ డార్చి మోదింప
నతఁడు చచ్చిన శోణితాక్షుండు గినిసి ♦ గతిదప్పనరద మంగదుమీఁదఁ గాఱిపి
యక్షురాస్త్రము లేయ నడరి యంగదుఁడు ♦
        రాక్షసుఁడున్న యారథముపైకుఱికి
విల్లుద్రుంచుటయును వెసనొడ్డనమ్ము ♦ నుల్లసి తాసియు నుగ్రతఁ గొనుచు
నాకాశమునకు నయ్యసురపోవుటయు ♦ నాకపివీరుండు నతనితో నెగసి
యారాక్షసుని చేతి యడిదంబుఁ బుచ్చి ♦
        యారాక్షసుని వ్రేయ నతఁడు మూర్ఛిల్లె
నంతకుఁడై రాక్షసాపతిఁ దునుమ ♦ నంతలోన శోణితాక్షుండు తెలిసి
గదఁ బుచ్చికొనుచు నంగదుఁ గూడఁ బాఱ ♦
        గదిసెనప్పుడు తోడుగా బ్రజంఘుండు [డు
యూపాక్షుఁ డది చూచి యొగిరాఁగఁ జూచి ♦ యేపున ద్వివిదుండు నేచి మైందుం
నాయంగదునకుఁ దోడై కూడికొనిరి ♦ ఆ యార్వురకు ఘోరమయ్యె రణంబు
అప్పుడు వానరులగములు గిరియ ♦ జప్పరంపుచును బ్రజంఘుండు ద్రుంచె
మఱియు నామువ్వురు మర్కటేశ్వరులు ♦ దఱుచుగా గిరులును దరులును నెత్తి
కరిరథాశ్వములపై గడు బెట్టు వ్రేయఁ
        నరుదుగా నడుమ యూపాక్షుండు ద్రుంచె [యు
నినవిస్మయంబుగా ద్వివిదమైందులును ♦ బెనఁగొని వృక్షము ల్పెఱికి వైచుట
నవియన్నియును శోణితాక్షుండు నడుమ ♦
        గవిసి చూర్ణములుగా గదగొని యేసె

గలకలధ్వనియొప్పఁగ రవాలమెత్తి జళిపించుకొనుచు బ్రజంఘుండు గదియ
మానైనయొకనల్ల మద్దిమానెత్తి ♦ వానిపై నడరించి వారక మఱియుఁ
బిడికిట వక్షంబు బెట్టుగా బొడువ ♦ నడిదంబు వైచి యయ్యసురకోపించి
పిడుగునకెనయైన పిడికిటఁ బొడిచెఁ ♦ బొడిచిన వెసమూర్ఛఁ బొందియు దెలిసి
సమధికముష్టిఁ బ్రజంఘు మైందుండు ♦ తమకించిపొడిచిన ధరణిపైఁ గూలె
పృథివిపై నిటు దనపినతండ్రి పడుట ♦ ప్రథితంబుగాఁ జూచి రథమటు డిగ్గి
యడిదంబుఁ దాల్చి యూపాక్షుండు నడువ ♦

విడువని తులుకతో ద్వివిదుండు దాఁకి
పరముష్టి యమరించి వక్షంబుఁ బొడిచి ♦

గురుసత్త్వుఁడై పట్టుకొనుటయు నపుడు
అతనితమ్ముఁడు శోణితాక్షుండు వచ్చి ♦ వితతబలంబొప్ప ద్వివిదుని ఱొమ్ము
బిడికిట నొప్పించి పెనుమూర్ఛ బుచ్చి ♦ విడిపించుకొని బోయె వేగ యూపాక్షు
దెలిసి మైందుని తోడ ద్వివిదుండు గూడి ♦ సాలవక యూపాక్ష శోణితాక్షులను
అటు దాఁకి వారితో ననిసేయునపుడు ♦ చటులత ద్వివిదుఁ డాశ్చర్యంబుగాఁగ
నలమి క్రమ్మిన శోణితాక్షునిఁ బట్టి ♦ యిలవైచి ప్రాణము రూపేర్పడకుండ
నడరి మైందుండు యూపాక్షునిఁ గిట్టి ♦ బెడిదంబుగా దనపిడికిటఁ బొడిచి
చలమున ధీరుఁడై చంపెను బేర్చి ♦ నలియ నెమ్ములు మేను నలినలిగాఁగ
నిలమీఁదఁ గపులచే నిట్టి చందమున ♦ నలువురు బడుటయు నానాముఖముల
నేపగిరాక్షసు లెల్లను బాఱఁ ♦ గోపించి యప్పుడు కుంభుండు వారి

—*: కుంభ నికుంభుల యుద్ధము :*—

వెఱవకుండని తనవింటి డావొప్ప ♦ మెఱుఁగుటమ్ములు దొడ్గి మెఱుఁగులతోడి
సురచాపమనఁ జాలి శోభిల్లు దాని ♦ పరఁగఁ బ్రత్యాలీఢపాదుఁడై నిల్చి
తెగఁగొని వేయఁగ ద్వివిదుండు భిన్న ♦ నగముకై వడిఁ గూలె నతిఘోరలీల
ముందఱ ననుగుదమ్ముని పాటుఁ జూచి ♦ యందంద మైందుండు నసమవేగమున
గుంభునిపై నొక్క కొండ వైచుటయుఁ ♦

గుంభుఁడై దమ్ములఁ రుధిరంబుఁ ద్రుంచి
మఱియు నొక్కమ్మున మైందుని నేయ ♦ నొరిగె నయ్యగచరుం డుర్వరమీఁద
ధరమీఁద నీగతిఁ దనమేనమామ ♦ లిరువురుఁ గూలిన నేచి యంగదుఁడు
కుంభునిపై వైచె ఘోరభూధరము ♦ కుంభుఁ డేడమ్ముల గుధరంబుఁ ద్రుంచి
నెరబాణములు మూఁట నిటలంబు నేసి ♦ మఱి పెక్కుశరముల మర్మంబు లేయ
నెరియుచుఁ గుంభుపై నెగసి యంగదుఁడు ♦ తరువెత్తి వైచె నత్తరువును ద్రుంచి
యాకుంభుఁ డంగదు నందంద మఱియు ♦ భీకరబాణసంపీడితుఁ జేయ

నతఁడుమూర్ఛిల్లిన నారాముకడకు ♦ నతివేగమున వానరావలిపాఱి
యంతయుఁజెప్పిన నధిపతి జాంబ ♦ వంతుఁడాదిగఁగల వనచరోత్తములఁ
బనిచిన వారును బాదపశిలల ♦ దనుజులనొంచుచుఁ దఱుమఁగుంభుండు
వారిననేకతీవ్రప్రకాండముల ♦ వారకనొప్పించి వారివారించె
నప్పుడుసుగ్రీవుఁ డాకపివరుల ♦ నప్పరుసునఁబడ్డ యంగదుఁజూచి
కోపంబుముడివడఁ గుంభునిఁజూచి ♦ యేపారఁగాఁజొచ్చి యెన్నఁబెక్కైన
ఘనశైలములు నశ్వకర్ణవృక్షములు ♦ వనచరులార్వంగ వైచిపెల్లార్చె
నవియన్నియునుగుంభుఁ డంతలోఁద్రుంచి ♦
రవిజుని బెక్కుమార్గణములనొంప
స్రుక్కకాతనివిల్లుసుగ్రీవుఁడొడిసి యక్కజంబుగద్రుంచియటుపాఱవైచె
దంతంబుఁదునిమినఁ దఱిమిపైవచ్చు ♦ దంతిచందంబునఁదఱిమికుంభుండు
కడురోషముననుండి కడఁగిసుగ్రీవుఁ ♦ బడవైతునని పాఱి పట్టుకొన్నప్పు
డినజుండుకుంభుండు నిభములురెండు ♦ పెనఁగినకైవడి పెనఁగిరుద్ధతిని
గరలాఘవములొప్పఘనశక్తిమెఱసి ♦ చరణఘట్టనలభూస్థలముగ్రక్కదలఁ
బొగలచందమునసూర్పులుగ్రమ్ముచుండ ♦ మిగిలినతాఁకులమిన్నల్లఁబగుల
నప్పుడుసుగ్రీవుఁ డాకుంభుఁబట్టి ♦ త్రిప్పియంబుధివైచె దేవతలార్వ
దనుజుఁడావారిధితలముఘోరంబు ♦ దనరారఁబడియెమందరశైలమనఁగ
బడియునాదనుజుండుభానుజుఁ జేరఁ ♦ గడఁకతోఁదులమహోగ్రతనేగుదెంచి
బెడిదంబుగాఁఱొమ్ముఁ బిడికిటఁబొడువ ♦
నెడవ్రచ్చియదియును నాయెమ్ములు దాఁక
గడిఁదివజ్రముదాఁకగనకాద్రివెడలు ♦ మిడుగురులోయనఁ మిడుగురులెగసె
దానికిఁగోపించి తరణినందనుఁడు ♦ దానవాధము నురస్స్థలమారఁజూచి
యచ్చెరువుగముష్టి నమరించిపొడువ ♦ నచ్చెనద్భుతబహుసత్వుండు దూలి
వాఁడంతశాంతపావకుఁడునుబోలె ♦ వేఁడిమిచెడిపడ్డ వెఱచిరాక్షసులు
పఱచిరిదివియు భూభాగంబువగుల ♦ నెఱిదప్పియంతయు నీరధిగలఁగ
నప్పుడుదమయన్నయవనిఁగూలుటయు నిప్పులుచెదరెడునెరిచూడ్కులడర
గొలఁదికిమీఱిన కోపంబుతోడ ♦ సలిలకుంభుఁడు సింహనాదంబుచేసి
కనకరత్నప్రభా కలితమైతనరి ♦ యనయంబు గంధపుష్పార్చితంబైన
పరిఘఁద్రిప్పుటయును బ్రహ్మాండమెల్ల ♦ నురిలెడుగతినుండె నుగ్రభావమున
నాశలన్నియుఁ దీరినట్లయ్యెవాయు ♦
పాశంబులును ద్రెస్సి పలువిధంబయ్యె [రి
హనుమంతుఁడప్పు డుద్ధతిదైత్యుఁదాఁకి ♦ యనలనూథపునకు నెడసొచ్చిపే

ఘోరాజిఁ బరిఘ నికుంభుండు ద్రిప్పి ♦ మారుతివక్షము న్మత్తుఁడై వ్రేసె
వ్రేసినవత్యుగ్ర విస్ఫులింగములు ♦ భాసమానంబులై పర్వుచునుండ
నురములోఁ జేయి వెట్టి దోయనవుడు ♦ కరమరుదుగఁ బరిఘము తునుకయ్యె
వాలినపరిఘంబు వాటునఁ దాఁకు ♦ గాలిచేఁ దూలు వృక్షంబునుబోలెఁ
దూలియు ధైర్యంబుతోడ నికుంభు ♦ వాలినపిడికిట వక్షంబు వొడిచెఁ
బొడిచిన నాదైత్యపుంగవు నురము ♦ నగుచు వచ్చి నెత్తురు గ్రమ్మ దెంచుటయు
నతఁడు మహానిలాహతిమహీజంబు ♦ గతిఁ గంపమొందియు గ్రమ్మఱఁ దెలిసి
హనుమంతుఁ బట్టి యుద్ధతి మీఁది కెత్తి ♦
దనుజులార్వఁగ వియత్తల మెల్లఁ ద్రువఁ
గడు వేగమున వైవఁగ పిశంబరుండు ♦ విడిపించుకొని రణోర్వీస్థలికి నెక్కి
కడఁగి నికుంభుఁ నుగ్రతఁ బట్టి వాఁడిగ ♦ వడిఁ బడవైచి యువ్విసుమీఁద
విసరి యమ్ములు పాఱ వ్రేసి యుబ్బెక్కి ♦ దెసలు ద్రువఁగఁ దల ద్రుంచి పెల్లార్చె
నారభసంబున నవనియు మిన్ను ♦ వారిధులును దిశావలయంబు మ్రోసె
హతశేషరాక్షసులాలంకలోని ♦ కేతనయంబునఁ జని యారావణునకుఁ
గుంభనికుంభాది ఘోరసత్త్వధనులు ♦ కుంభిని మీఁద నాగ్గురు దైత్యవరులు
కూలుట చెప్పినఁ గోపించియసురు ♦ వాలిన ఖరుఁడను వానినందనుని
మకరాక్షుఁ బిలిచి సమగ్రసైన్యములఁ ♦
బ్రకటంబుగాఁ గూర్చి పరఁగంగ నీవు
రామలక్ష్మణుల మర్కటులఁ జంపి ♦ రా మగుడి మనసి రావణుఁ డాడ

—:* మకరాక్షుని యుద్ధయత్నము *:—

విని మహోత్సాహుఁడై వేగంబ వాఁడు
దనతండ్రి పగఁ దీర్ప దనరి బ్భనము
ముదమందితన రెండు మూపులుప్పొంగ ♦ త్రిదశారికిఁ బ్రణతుఁడై మ్రొక్కి-
వీడ్కొని రథమెక్కి వెడలి కయ్యంబు ♦ వేడ్కతోఁ దనయొద్ద వీరులకనియె
మీరు సమగ్రత మెఱసి యుగ్రతను ♦ ఘోరుఁ బగ్గపులతోఁ బోరిఁబోరి నేను
రామలక్ష్మణుల మర్కటులనాదైన ♦ భీమశరాగ్నుల భిన్నులఁ జేసి
యేఁ చెదననవుడు నెలమి దానవులు ♦ త్రోచి త్రోచి కడనఁగ దుశ్శకునములు
గలిగెఁ బెక్కైన యెల్లఁగనియు నయ్యసురతేజ ... వాద్యనాదంబులు నింగి
నలి నార్చి కవిసె వానరసేనమీఁద ♦ నిలయు నాకాశంబు నిట్టట్టుఁ బడఁగ
దతిమి వానరులును దరులును గిరులు ♦ దఱచుగా వైచిరి దైత్యులమీఁద
దానవులును గదాదండకోదండ ♦ మానిత ఖడ్గాది మహితశస్త్రముల
వానినన్నింటిని వడిఁ ద్రుంచివైచి ♦ వానరకోటిఁ ద్రీవతనొంది యార్చి

రాసమయమ్మున నమ్మకరాక్షుఁ ♦ డాసర్వకపులపై నతివేగరథము
పఱపుచుఁ గదిసి ముప్పదిటనూఱింట ♦ నఱువదింటను మఱియిరువదేనింట
నిరువదింటను వెస నిరువదాఱింటఁ ♦ బరఁగ నాఱింటను బంద్రెండింట రెంటఁ
బదిటఁ బదేనింటఁ బదునెన్మిదింటఁ ♦ బదుమూఁట నాల్గింటఁ బదునాలుగింటఁ
దెగఁగొని మూఁట నైదింట నేడింట ♦ నగలించి తొమ్మిది యమ్ముల నేసె
నవి సహింపఁ లేక యఖిలవానరులు ♦ భువిఁ దల్లడిల్ల నప్పుడు పాఱుటయును
నేమిభయంబిట నేనుండ ననుచు ♦ రాముఁడు విలుఁగొని రాక్షసుల్బెదరఁ
జతురంగబలములఁ జంపుటఁ జూచి ♦ యతికోపమున మకరాక్షుండు పేర్చి
యురదంబు వఱపించి యారాముఁ డాసి ♦ ఖరసూతి నేను రాఘవ మున్ను నీవు
పెరిగి మాతండ్రిఁ జంపి దాఁగి త్త ♦ మెరియుచునుండె నాకింత కాలంబు
నాకు నీతోడి రణంబబ్బుటయును ♦ జేకొని చింతి తుఁ జేకూడె నేఁడు
తరలకు నీవు మాతండ్రిసూఁడునకు ♦ నెరయంగఁ బోరాడ నిన్నంటి నేను
దుర మొనరింపు నాతో వింటనైనఁ ♦ గరవాలముననైన గదనైన ననుడు
వానితో రాఘవేశ్వరుఁడు కోపించి ♦ దానవాధమ యీవృథాగర్వమేల
భాసిల్లు నా బాహుబలము సొంపారఁ ♦ గాసమరంబున ఖండింతు నిన్ను
ననుడు రాముని మకరాక్షుండు గిట్టి ♦ ఘనమైన నిశితాంబకంబుల నేసె
నేసిన నవి రాముఁ డెడఁద్రుంచి వైచె ♦ నాసమయంబున నవనియు మిన్ను
నిండ నాయిద్దఱ నిష్ఠురచాప ♦ దండమహాగుణధ్వనులు పుల్లడరె
సురఖేచరాదులు చోద్యంబునొంద ♦ నరుదారనేయు రామాస్త్రంబులెల్ల
నతివేగమున మకరాక్షు డుద్రుంచి ♦
యతనిపై బాణంబు లడరించుటయును
రవిరాఘవుఁడు ద్రుంచి యమ్మకరాక్షు ♦ వివిధనిష్ఠురశరావృతుఁ జేయ నతడు
నవియెల్లఁ గడఁగి యత్యంతకోపమున ♦ వివిధఖండములు గావించి పెల్లార్చె
కోపించి కాకుత్స్థకులుఁడు నద్దైత్యు ♦ చాపంబు వెసనొక్క శరమున ద్రుంచి
సారథి నెనిమిది సాయకంబులను ♦ నారథంబును మఱి యన్ని బాణముల
వికలత్వ మొనరింప విరథుఁడై యపుడు ♦
మకరాక్షుఁ డొక్క సమగ్రశూలంబు
వైచిన నది వేగ వచ్చుట విభుఁడు ♦ చూచి మూఁడమ్ముల జూర్ణంబు చేసె
అనిమిషులా రాము నగ్గించి రపుడు ♦ దనుజుండు కినిసి యాదశరథాత్మజుని
బిడికిటఁ బొడువంగ బిట్టుగు దేర ♦ నడుమనె యారామ నరనాయకుండు
ననలాస్త్రమున నహృదయము గాడనేయ ననిమొన నమ్మకరాక్షుండు గూలెఁ
బ్రథితారుణప్రభాభాసియైయుంత ♦ బ్ర మాద్రిపై దోఁచెఁ బద్మబాంధవుడు

హాతవేషరాక్షసు లాలంకకరిగి ♦ యతఁడు చచ్చుటఁ జెప్పనా రావణుండు
కోపంబు చింతయుఁ గూర్చి చిత్తమున ♦ నేపారఁ బనిచె నయ్యింద్రజిత్తునకు
రణమునఁ గపులను రామలక్ష్మణుల ♦ క్షణమాత్రమునఁ జంపఁగాఁ జాలువాఁడ
నీవె కాకింక నా కెవ్వరు గలరు ♦ నీవిట నిర్వాహించిన మేలిమునకఁ
జనియందఱను జంపి చనుదెమ్ము కొల్లి ♦ యనిమిషకోటుల నింద్రాదుల మునురణి
రణమున గెల్చి సంరంభంబుతోడ ♦ బ్రణుతింప నీ తెమ్ము ప్రమద మొప్పార
ననవుడు నింద్రజిత్తా రావణునకు ♦

వినయంబుతో మ్రొక్కి వీడ్కొని కదలె

వాయువేగము లయశ్వంబు బూన్చి ♦ మాయురుంబై నట్టి యరదంబు నెక్కి
శరదభ్రసంవృత శైలంబు కరణి ♦ గురుభుజంబుల్ వెలిగొడుగులనీడ
రమణీయకంకణ రణితము లెసఁగ ♦ రమణులిరువుర్లు చామరమ్ములు వీవ
నొలసి మోము సంగరోత్సాహాలీ ♦ దళుకొత్తనేతెంచి తల్లికి మ్రొక్కి
జననిదీవింపంగఁ జటితసపత్ని ♦ దనయులవీడ్కొని తమ్ముల చావుఁ
దలపోసి కోపాగ్ని దరికొనఁ బేర్చి ♦ యలఘుదర్పంబున నయ్యింద్రజిత్తు
మానకరోష సమగ్రతతోడ ♦ దానవకోటులు దన్ను సేవింప
ఘనకామరూపులు దనమంత్రివరులు ♦ తనుఁగొల్వనుత్తరద్వారంబునందు
నద్రులగతిఁ దేరు లఱువదికోట్లు ♦ భద్రగజంబులు పదుమూఁడుకోట్లు
కొరలెడునాల్గేసి కొమ్ములు కరులు ♦ పరఁగంగఁ గోటిసర్భగవృత్తినడపఁ
దురగంబు లరయంగఁ దుదనూఱుకోటు ♦

లురుతర హేషబు నొప్పుచు నడప

భేరుండములఁబోలి పెంపువహింప ♦ భూరివేగంబునఁ బొలుపారునట్టి
చిలుకవన్నియలతోఁ జెలఁగుగుఱ్ఱములు ♦

కొలఁదులై నాలుగు కోటులు నడువ

వలుదనిస్సాణాది వాద్యముల్ మ్రోయఁ ♦ గలనికి వెడలి లంకాపురినుండి
తనచుట్టు దైత్యుల సంఖ్యులు గొలువ ♦ ఘనతరభీషణాకారంబుతోడ
వానరవీర దుర్వార నాదముల ♦ నూనైన రణమహీమధ్యంబుఁ జొచ్చి

{ ఇంద్రజిత్తు హోమముఁ జేసి కృత్తి యనుశక్తిఁ బుట్టించుకొని మాయాయుద్ధము సేయుట }

యరదంబు డిగి ధీరుఁడై యచ్చియుండఁ ♦ దిరిగి రాద్దైత్యులఁ దెఱఁగొప్ప పిలిపి
గురుతర వేది త్రికోణమై పెద్ద ♦ పరపొంది దక్షిణప్రవణమై యున్న
భూరిశ్మశానాగ్ని పొలుపారఁ దెచ్చి ♦ ధీరుఁడై వేదిలో దీపింపఁ జేసి
రక్తవస్త్రంబులు రక్తమాల్యములు ♦ రక్తచందన మనురక్తుఁడై తాల్చి

దండంబును బవీతతతియు మౌంజియును ♦
నిండుమనంబుతో నెరయంగఁబూని
యలవడ నచట ఖట్వాంగధ్వజంబు ♦ నిలిపి కపాలంబు నిష్ఠతో నెక్క-
పరఁగంగఁ గంకాళపరిధిఁ గావించి ♦ తిరముగా దక్షిణ దిశ స్రుక్స్రువంబు
లినుప పాత్రలనుంచి యేర్పడఁ గృష్ణ ♦ తనుజైనవాని క్తమును మాంసమును
పోరిఁబోరిన వినిండఁ బోసి మహావంబు ♦ ధరియించి యప్పు డధర్వణ క్రమము
దప్పక యుండ మంత్రములుచ్చరించి ♦ చొప్పడ నినుప స్రుక్స్రువము లుపట్టి
కమియఁ బావకుఁడును గడు నొప్పు తాటి ♦ సమిధలు తిలలును సర్షపంబులును
హోమంబు సేయంగ నరుతరంబగుచు ♦
నాకుహోధూమ మజాండంబుఁగప్పె
నాయగ్నిలోనుండి యప్పుడు నేగ ♦ మాయతంబైనట్టి యరదంబు వెలుఁగ
రయమున నుగ్రకరాళ కేశములు ♦ భయదరూపంబు కపాలపాత్రయును
తళతళమను కోఱవడలు మెఱవ ♦ మలఁగ కార్చుచు నస్థిమాలికలలర
నెఱమంటలొలికెడు నేత్రంబులొప్ప ♦ నుఱక హాసముతోడ నొకకృత్తి వెడలి
పంపుముపంపు మేపనికైన నన్ను ♦ సొంపారఁ జేసెద సురవైరి యనుడు
నాకృత్తి నడిగి యింద్రారిశస్త్రములు ♦ నాకృత్తికిఁగైకొని యాకాశమునకు
నరదంబుతోడ నెయరిగి వానరులఁ ♦ దరిగి యేయుటకు నదృశ్యుఁడై యుండె
అందట నారావణాత్మజు సేన ♦ యంతయుఁ గ్రమ్మతి యతిగెలంకరును
అటనింద్రజిత్తును నాకపిసేనఁ ♦ బటుశిలీముఖ పరంపరలనొప్పి ప
వలియుదాఁకెడి శిలావర్షంబు చేతఁ ♦ బలుదెసఁ జెదిపాఱు పతుల్లో యనంగ
చిన్నభిన్నాంగులై చదరిరి కొంద ♦ ఱున్నతగతిఁ దప్పి యుండిరి కొంద
ఱెసఁగంగఁ జీవురు కొఱలతోడి ♦ వసుమతీధరములు వడిఁగూలుకరణిఁ
బసిరి రక్తంబులపైఁ బయిగొరఁగఁ ♦ గుడుసుగా మతియొక కొందఱు గపులు
అప్పుడాయమ్ముల యంధకారంబుఁ ♦ గప్పి యెవ్వరికినిఁ గానరాకుండ
నంత వానరవీరు లంతరిక్షమున ♦ నంతర్గతుండగు నాయింద్రజిత్తుఁ
బొడగానఁజాలక భూనభోంతరము ♦ వడిసిడుంబఁజు తెంచు వాఁడిబాణముల
నడుములుఁదెగువారు నలిగైన వారు ♦ కడికండలై నేలఁ గలిసిన వారు
కడిమి మైనాజికిఁగై కొన్నతరులు ♦ విడిచి యమ్ములుగాడ విసఁజచ్చువారు
నతునిత్తిఁబడు ఘోర నారాచసమితి ♦ పుడమిలోఁగిలింపఁ బొడవులు సెదర
నిలువు చచ్చినవారు నిఖిలాంగకముల ♦
బలుబాణములు గాడఁ బడిపొరల్వారు
మాతంగశవముల మాటుకొన్వారు ♦ చేతులగిరులెత్తి చేష్టించువారు

దృష్టికిఁ దోఁపక తిరిగి విస్ఫూర్తి♦ దృష్టించి యాశలు దీటెడువారు
నఖలాశుగప్రవాహములపై దొరఁగ♦ ముఖగోడములకు మురియరాకుండ
బొందిమీఁదికి నెత్తి భూరిసేతువుల♦ చందంబు గాఁ బ్రకోపము లొడ్డువారు
ప్రేవులు ప్రోవులై పృథివిపైఁ బడఁగ♦ నావులి తలఁతోడ నధికనిద్రలను
గనుమూయువారును గడిమి రామునకు♦ నని ప్రాణమీఁగలటి మని పల్కువారు
చిచ్చఱపిడుగుల చెలువునఁ జదర♦ మచ్చుకోలలఁ గేల వడి నొడ్డువారు
వాలంపపోదువుల వాలఘాతములఁ♦ దూలించువారు నెత్తుటఁ దోఁగువారు
ఘోరాంబుకంబులఁ గొనియు ధైర్యంబు♦లారంగ నిశ్చలులై యుండువారు
దుర్లక్ష్యుఁడితఁడని తొడరంగ నేఁడు♦ దుర్లభంబని బ్రహ్మ దూషించువారు
బ్రహ్మయిచ్చిన శక్తిఁ బదిలుఁడై వీఁడు బ్రహ్మాండమునఁ గానఁబడకున్నవాఁడు
బ్రహ్మవరంబెంత బ్రహ్మాండమెంత♦

బ్రహ్మమొంగటివాఁడు పార్థివేంద్రునకు
దంపోయ ననిలోన ధరణీశుఁ డేటి♦ కలఁగఁ డోయకువారునై యుండ మఱియు
నుద్దండకోదండ మొకచోట మెఱయు♦ నుద్దామశరజాల మొకచోట నిగుడ
నొకచోటఁ దను జెప్పు నొకచోట నార్చు♦

నొకచోట నదలించు నొకచోట నవ్వు
నొకచోట హుంకార మొనరించునట్లు♦ సకలభీకరలీలఁ జరియింప నలిగి
యురుభుజుండాంజనేయుఁడు నంగదుండు♦

శరభుండు ఋషభుండు జాంబవంతుండు [ణుండు
గజుఁడు గవాక్షుండు గంధమాదనుఁడు♦ విజయుండు నీలుండు వెసను షే
పనసుండు మొదలుగాఁ బటుపరాక్రములు♦ వనచరులందఱు వడిదరుల్గిరులు
నిగిడి యాకసమెల్ల నిండవై చుటయు♦ మొగివచ్చు శరములమురియలై చెదరి
జడియుశరానిల చటులవేగమున♦ నుడుగని ప్రమోఁతతో నురువడి వచ్చి
యాశైలములు దరులప్పుడు దునిసి♦ యాశకలంబులపై నందందఁ దొరఁగ
నాశంబులైరి వానరులు పెక్కండ్రు♦ ఆశానరీంద్రంబు లవనికంపింప
మెఱసి వకడిమిమై మేఘనాదుండు♦ నెఱయ గనిగుడించు నిబిడబాణములఁ
గొండలు తునియలై కూలిరి భీతి♦ నొండొకొందఱు పాఱి రొదిగి దిక్కులకుఁ
బ్రదరపరంపర ల్బఱపుచునిట్టు♦ పదికోటులఁ గచరపతులరూపడఁచి
వెండియు నెదిరిన వీరవానరుల♦ ఖండించి యతిచండకాండసంతతుల
నతులవిక్రముఁడైన హనుమంతు వాలి♦ సుతు శతబలిఁ గవాక్షుని నీలు నలుని
బహురబలుఁడైన పనసుని గుముదు♦

గంధమాదను ఋషు కపియూథపతుల

మఱియుఁ గొందఱ నుగ్రమార్గణావళుల ♦ నతిమూర్ఛితులై యుండఁ జేసి
యాదితేయుల గుండె లవియ నమ్మేఘ ♦ నాదుండు పటుసింహనాదంబు సేయ
మనముల భీతిల్లి మానముల్ద్రూలి ♦ వనచరుల్దన వెంట వచ్చి చొచ్చుటయు
సౌమిత్రియును రామచంద్రునిఁ జూచి ♦ భూమీశ యీమాయపాపఁడు వీడు
వినువీథి నత్యంతవిభవంబుతోడఁ ♦ దనుఁ గానరాకుండ దర్పించినాఁడు
గర్వించి యిబ్భంగిఁ గపివీరబలము ♦ సర్వంబు సమయింప సమకట్టినాఁడు
మనమింతలో వీని మడియింపవలయు ♦ ననవుడు శ్రీరాముఁ డనుజుతో ననియె
విను బ్రహ్మవరమున వినువీథి వీఁడు ♦ దనరూపు చూపక దాఁగియున్నాఁడు
మన మెంత యలిఁగిన మనకు లోఁబడఁడు ♦
వినుము లక్ష్మణ నేఁడు వీఁ డసాధ్యుండు
అస్త్రంబు లేమియు నతనిపైఁ గొలువ ♦ వస్త్రములు చెడిపోవు నని పల్కుచుండ
నాసమయంబున ననిలుండు వచ్చి ♦ భాసురమ్మగు వచోభంగి నిట్లనియె
విను వీని మాయకు వెరవు భూనాథ ♦ దనదనాగ్నేయ మంత్రము జపియించు
నీవు బాణం బేయ నెరిఁ దప్పి కృత్తి ♦ దేవారిఁ గాసి యదృశ్యమై పోవు

{ శ్రీరాముఁ డాగ్నేయాస్త్రముచే నింద్రజిత్తుని మాయ దెరల్చుట }

నివియగ్ని దీపింప ననిలుండు పలుక ♦ జగన్నాథుఁ డాహవసంరంభ మొసఁగ
మానితంబగు నగ్నిమంత్రపూతంబు ♦ గా నమ్ము సంధించి కడఁకతో నేయఁ
గృత్తియత్యద్భుతక్రియ నింద్రజిత్తు ♦ నతిశీఘ్రగతిఁ గాసి యరిగె నందేని
ఆయింద్రజిత్తును నవని కేతెంచి ♦ యామెడఁ గార్ముకజ్యానాదమడరఁ
గడఁగిన నంత నక్కపికోటి ♦ సులభగతినగూఁ మూర్ఛ లందఁ దెలిసి
వడిఁ గూడికొని వచ్చి వానిపైఁ గవిసి ♦
కడిఁది యాశైలశృంగము నుఁ వాయుజుఁడు
గండశైలము నంగదుఁడు పైపైఁ దుండు ♦ దండిమైఘనపర్వతముఁ గజుఁడు
జవమూనుపైన వృక్షము నీలుఁడు ♦ రయమున నశ్వకర్ణంబు ననలుఁడు
అవనీధరంబును శరభనందనుఁడు ♦ సరళశాఖిని సటుఁబంసుఁడు
కదసి యుగ్రంబైన గదవిభీషణుఁడు ♦ గిదగుచు సాలవృక్షము ననఁ బాతి
భూజమహాశైలములు లాంగూలముఖులు ♦ నానాంబనత్ప్రముఖాది వీరులును
నలిన ర్చిమూఁడు బాణముల లక్ష్మణుఁడు ♦
కలయుంగ నూరంబకముల రాఘవుఁడు
వానిపై నడరింప వాఁ డంతవట్టు ♦ నానాంబకములఁ జూర్ణములు గావించి
యనలోగ్రఘోరంబు లైన బాణముల ♦ వనచరసేనల వడిఁ బెట్లువలపి

కడిఁదివీరుఁడు కుంభకర్ణుండు మడిసె ♦ నడఁగె మహాబలుండగు ప్రహస్తుండు
మృతిఁబొందెఁ ద్రిశిరుండు మేటివీరుండు ♦
హతుఁడయ్యె నతికాయుఁ డాలంబులోన
నాగి మహాపార్శ్వ మహోదరు లాడిరి ♦ తెగిరి నరాంతక దేవాంతకులును
కుంభకర్ణుని సుతుల్ ఘో[illegible]ములు ♦ కుంభుఁ డువడియె నికుంభుఁ డుసమసె
మకరాక్షుఁ డనిలోన మడిసెఁ దోడ్తోన ♦ సకలనిశాచర సైన్యంబు వాలిసె
లంకఁ గాల్చెను నొక్క యలఁతియాకోఁతి ♦ ఇంక యేటికి మాటలివి యెల్లఁ దలఁచి
రయమునఁ జని నీవు రామలక్ష్మణుల ♦ భయదసాయక పరంపర లేసి చంపు
రణదక్షుఁడవు నీవు రణమునఁ దొల్లి ♦ తృణలీలఁ గెలిచి దేవేంద్రునిఁ గడిమి
నీవేచిన డచిన నిఖిలలోకములు ♦ భావింప నప్పుడే భస్మమైపోవు

{ఇంద్రజిత్తు హోమమును చేసి శస్త్రసమేతముగా రథమును బడయుట}

నరు లెంతవారు వానరు లెంతవారు ♦ పరికింప నీకని పల్కి వీడ్కొలుప నేతెంచి
నెలమితోడను పురోహితునిఁ దోడ్కొనుచు ♦ బోలుపాఁగారణభూమికే
చెన్నొంద హోమంబు సేయంగఁ బూని ♦
యున్నతిఁ బరిచారు లొగి వేగమునను
బరఁగంగ నరసిశలపాలపత్రులు ♦ నెరిదినుర్వనముల స్రుక్స్రువంబులును
శస్త్రంబులును దాటి సమిధలురక్త ♦ వస్త్రగంధాదులు వరుస దెచ్చుటయు
రక్తాంబరంబులు రక్తమాల్యములు ♦ రక్తగంధంబును రయమొప్ప నతఁడు
ధరియించి మారణతంత్రమార్గమునఁ ♦ బరుసడిఁ దోమర ప్రాసఖడ్గములు
సరిసరిధులు వెట్టి సప్రాణకృష్ణ ♦ హరిణంబు మెడ యుస్థి యుదిపుచ్చుకొనుచు
నక్తంచరాధీశు నందనుండెలమి ♦ యుక్తక్రమంబున హోమంబు సేయఁ
దనరిన ధూమ్రప్రదక్షిణశిఖల ♦ ననలుండు వెలుఁగుచు నాహుతుల్గొని య
జయనిమిత్తంబులు చాలఁ గన్గొనుచు ♦ జయశీలుఁడా నిశాచరవీరుఁ డలరి
నియతి హోమము దీర్చి నిరుపమంబైన ♦
హయచతుష్టయముతో నతిఘోరలీల
నురుతరబాణాసనోజ్జ్వలంబగుచు ♦ సురుచిరాలంకారశోభితంబగుచు
నరినొప్పు సింహార్ధచంద్రచిహ్నముఁ ♦ బరఁగుచు వైడూర్యభాసురంబున
పడగ చేఁ మరుచు బ్రహ్మాస్త్రరక్ష ♦ నడరుచు నని నదృశ్యంబయియుండు
నట్టియారథ మెక్కి యనికి నేగుచును ♦ గట్టల్క బల్కె రాక్షసులెల్ల వినఁగ
మిథ్యాతపస్వుల మీఁటి సంగ్రామ ♦ రథ్యఁ గూల్తు నేఁడు రామలక్ష్మణుల
సగదీర్చి మాతండ్రిఁ బత్త్రికంధరుని ♦ విగతశోకునిఁ జేసి విషయమేనిత్తు

భానునందనముఖ ప్లవగవల్లభుల♦ నేనేఁడుసమయింతునిమిషమాత్రమున
మఱియుఁదక్కినయట్టి మర్కటోత్తముల ♦
నెఱయంగ జంపుదు నేఁడాదిలోన [వుల
దెగువతోననుచు నదృశ్యుఁడై యుచుఁ ♦నాగిరాక్షసుల నేయుచున్న రాఘ
బొడగని భీకరభ్రుకుటియై విల్లు♦వడి నెక్కువెట్టి దుర్వారవేగమునఁ
బ్రళయకాలమునాఁడు బలువృష్టిగురియు ♦
జలదంబు విధమున శరవృష్టి గురిసె
గగనంబునిండనాఘనులురాఘవులు♦ నొగి నేసిరలుకమై నుగ్రబాణములు
అమరారియవిద్రుంచియమ్ములసోనఁ♦దిమిరంబువరగించె దిక్కులందపుడు
పృథుచండకోదండ భీకరధ్వనియు ♦ రథనేమిరవముచు రథతురంగములు
నెరిజల్లమోఁతయుగుణమునిస్వనము నరుదారజనియించునతనిరూపంబు
వినఁగానఁబడకుండ విస్మయంబుండ♦ఘనవీథిఁబొక్కి పఁగమ్ముజనతఁడు
అఖిలాంబకంబుల నాదాశరథుల♦నిఖిలావయవములు నిండ నేయుటయు
నాఖరకరకులుం డారాఘవేంద్రుఁ ♦ డాఖరసూనుండు దపుడుకోపించి
వాఁడేయుమార్గణావళు లెందువచ్చు♦వాఁడిభల్లములందు వడినేసియుసి
యా బాణజాలంబులందండతనుమ♦నా బాహుబలశాలి యగునింద్రజిత్తు
బహుముఖంబుల దేహఁబజఁపుము నేసె♦బహుళశరంబునంత భార్గవసుతులు
శమియుఁబూచినకింశుకంబులకోడి♦సమనొప్పిరి శరక్షతయుతాంగముల
శరముగ్రమైనట్టి కాలమేఘంబు ♦ కరణినొప్పినతన ఘనశరీరంబు
తెలియకుండఁగ నామ్యదిక్కుననుండి♦పలికెనయింద్రారి పార్థివేశ్వరుల
ఎక్కడఁబోయెద రెఱుడాఁగెదరు♦చిక్కితిరిటమిమ్ముఁ జేరికావంగ
దిక్కెవ్వరిలమీఁద దివిజులటన్నఁ ♦ జక్క వాల్మానంగఁ జూడవోదుదురు
బక్కక్రోఁతులనమ్మిబవగమ్మునకును♦మొక్కలమ్మునవచ్చి మోసపోయితిరి
పటుతరంబైన నా బాణాగ్నిశిఖలఁ ♦ బెటపెటంబ్రేలక ప్రిదిలిపోఁగలరె
యాబిభీషణునివాక్యములె నిక్కము♦గాఁనినాశక్తిఁ గానలేరైతి
రిదెమిముఁదెగటార్చి యేచియ్యాపొద్దు ♦
కదలియయోధ్యలోఁ గలవారినెల్లఁ
బరిమార్చిమించి యాభరతశత్రుఘ్ను♦లిరువురఁజంపి నేనేతెంతుననినఁ
గపు వెఱఁగందిరి కపులునాకపులు♦నడరుకోపంబున నాయింద్రజిత్తు
పడమటఁదనపేరు పంతంబులాడుఁ♦దడఁకుదీచిన ధనువుమ్రోయించు
ధీరుఁడై యటఁదూర్పు దిక్కుననుండి ♦
ఘోరంపుశరవృష్టి గిరియించు మఱియు

దక్షిణంబున కేగి ధరణిఁ గ్రక్కదల ♦ నక్షీణశక్తిచే నడరి పెల్లార్చు
నిబ్బంగిఁ దిరుగు చనేక మార్గముల ♦ నబ్బాణసూన్యాదు లరుదంది చూడ
శరములవి టితో సంధి చుకొనుచుఁ ♦ బఱవడివాఁ డేయు బాణశాలవములు
జనపతుల్ త్రుంతురు చటులా బకముల ♦ ననిమిషు లప్పు డత్యాశ్చర్యమంద
అప్పుడు శతసంఖ్య లతని చేఁ గలపులు ♦ కుప్పలుకుప్పలై కూలుట మాచి
సౌమిత్రి కోపించి జనపతి కనియె ♦ భూమీశ వీని చేఁ బొలిసిరి కపులు
ఇది యేమి దేవ నీ విట్లూరకున్కి ♦ యిదె చూడుమా భువి నెల్లదిక్కులను
బడి పొర్లుచున్నారు భల్లూకపతులు ♦ మడిసిరి నేఁటలు మర్కటేశ్వరులు
జగదీశ నిను నమ్మి సకలవానరులు ♦ మిగిలిన భక్తితో మేకొని వచ్చి
తగిలి యీయింద్రారి దారుణాస్త్రముల ♦ నొగిలి నీ నామమే నొడవుచున్నారు
పగవాఁడు చేరి నీ బలమెల్లఁ ద్రుంచెఁ ♦ దగ దింకఁ దెగకున్కఁ ద్రైలోక్యనాథ
నగదగ నల్గు నీ బాణజాలములు ♦ గగనంబు దిక్కులు గఁయుఁగ నిండి
నిండిన భక్తితోఁ నిజదివ్యతనువు ♦ లొండొంట ధరియించి యున్నవి వానిఁ
గైకొమ్ము రిపుఁ జంపు కమలాప్తవంశ ♦ నీ కెదురై పోర నేర్తురే రిపులు
ఇంత శాంతము దగు నే నృపులకును ♦ జింతింప వేల విచిత్రంబుగాఁగఁ
బెంగిన నీ బాహుబల పరాక్రమము ♦ తరుణార్కసమతేజ తలపోయ వకట
యీనిశాచరకోటి నీయింద్రజిత్తు ♦ నేనచ ంద దేన నీ మహాత్వము న
నిటమీఁద బ్రహ్మాస్త్ర మే ప్రయోగించి ♦ కుటిలరాక్షసకోటి లమెల్ల నడఁతు
అనవుడు రఘురాముఁ డనుజుఁ గని యె ♦ విను ముల క్ష్మణ యొక వీనికై పూని
చను నెపల్వూర్ఁ జ ప సంగ్రామమునకుఁ ♦ జను దేని వాఁ ల న ముంపవలె నె
యనిమిష బ్రహ్మ రుద్రాదుల చేత ♦ ననిఁ జావఁ డితఁ డని బ్జజుఁ డిడిన
వరము చెల్లింపఁగ వలసి యేపీని ♦ నిరపొందఁగాచితి నిఁక నుండె నేని
వీని జంపఁగఁ జాలు వీర వానరుల ♦ నేను బ చిగ వారె హి. సి తురితని
నటుగాక తక్కిన నమ్మేఘనాదుఁ ♦ డట నింద్రలోకంబునందు డాఁగినను
నట బ్రహ్మలోకంబునందు డాఁగినను ♦ నట రుద్రలోకంబునందు డాఁగినను
ధరణి దూఱిన రసాతలముఁ జొచ్చినను శరధిలో మునిఁగిన జముఁ డు గాచినను
దన తాతయగు ధాత తన నెక్కఁ బెట్టు ♦ కొనినఁ నేఁ బోనీను ఘోరాజి ద్రుంతు
ననిపల్కు రఘురాముఁ నలుక వాఁ డెఱిఁగి ♦ యసి సేయ నొల్లక యాలంకఁ జొచ్చి
ఘోరనిశాచరకోటితోఁ బోయి ♦ యారావణునితోడ ననె నింద్రజిత్తు
కట్టల్కఁ గపులను గయ్యంబునందు ♦ నెట్టన నేసితి నేలపైఁ గూల
వానుజులసిద్ధుల మానముల్గొంటి ♦ ననవుడు రావణుం డతనిఁ గోపించి
యిది యేమి పోక యా యిది యేమి రాక ♦ యిది యేమి సేఁత గా నన్ని చెప్పెదవు

ఒకపతీయునుజంప కూరకవచ్చి ♦ ప్రకటించెదందటు వడిరవినీవు
నీవేచినడఁచిన నిఖిలలోకములు ♦ భావింపనప్పుడే భస్మమైపోవు
నదిగాననిదిరయొక్క యధికమటంచుఁ ♦ మదిఁదలంపకుమునంతోషంబుగాక
మగఁటిమి రామలక్ష్మణుల వానరులఁ ♦ దెగటార్చి కాని నా దెస కేగుదేకు
మనవుడు నాఁగాక యనియింద్రజిత్తు ♦ దనుజేంద్రుపీడ్కొవి తనమదిలోన
నతికాయకుంభకర్ణాదులైదేయ ♦ పతులెల్లమడిసి రిబ్బంగిఁ బ్రాజిఁ
గాననారామలక్ష్మణుల నేరీతి ♦ నైననుగెల్వద నని నిశ్చయించి
సీతచందమునఁగఁ జెలువొందనొక్క ♦ నాతినిఁదనమాయ నాకేశవైరి

—:* ఇంద్రజిత్తు మాయాసీతను దెచ్చి తలఁదఱుఁగుట *:—

యటఁజేసి ప్రీతిమాయాసీతఁ గొనుచుఁ బటుబలసహితుఁడై పడమటవెడలె
వానికిఁగాక యావానరులెల్ల ♦ నానాముఖంబుల నలికిపాఱుటయు [నఁగ
హనుమంతుఁడపుడు మహాశైలశృంగ మనువారఁగాఁబట్టి యసురమార్గ
నరుదారనడచుచో నయ్యింద్రజిత్తు ♦ రథంబుమీఁద మాయాసీతఁజూచె
వెక్కసంబుగ రామశిరహోనలంబు ♦ నిక్కిననాహార నిద్రలుదొరఁగి
కడలేనివగఁ బొంది గతిఁగానఁబడక ♦ వెడలునిట్టూర్పుల వెలవెలఁబాటి
కడుఁగృశంబగుమేను కమలపత్రముల
నోడుచు లోచనముల నొలుకుబాష్పములు
జడగట్టిసీమంత సరణిఁ జక్కదవి ♦ యడగొనిమలినంబు లగుశిరోజములు
ధరణిరజోలిప్త తనుతరాంగములు ♦ గరమువిన్నని మోము కరపల్లవంబు
గటసిన చెక్కునై గాలిచేజాలి ♦ గదలెడులతవోలెఁ గంపించుచున్న
యామహీసుతఁజూచి యటపీఁడించి ♦
నేమిసేయునొ రామ హృదయవల్లభను
నీదీనదశనాకు నీక్షింపవలెనె ♦ హా దైవమాయని హనుమంతుఁడడరి
ఘోరవానరవీరకోటితో నడువ ♦ దారుణాకృతిఁ బేర్చి దనమీఁదనునికి
నడచుచోనవ్వాయునందనుఁ గాంచి కడుఁ గ్రూరుఁడై దశకంఠనందనుడు
ఇది యేలవచ్చెఁ దానీసేనతోడ ♦ ఇదె చూడ నాసీత యీసీతకొఱకు
నలజని వడి యొదరటుఁగాన దీనిఁ ♦ దలద్రెవ్వనేసెదఁ దవిలియేసనుచుఁ
గలఁగి శార్దూలంబు కడనున్న హరిణి ♦
పొలుపునఁ నయనాంబు పూరంబులొలుక
హా రామ హా రామ యనునార్తరవము ♦ లారంగఁ జేయు మాయాసీతనొడిసి
తలవెండ్రుకలుపట్టి దట్టించియాడ్వ ♦
నలగియాదైత్యుతో నదియెవాయుజుఁడు

తగు నెదురాత్మక దనుజుండవైన ♦ నగుదుఁ గాకేము నీవా విశ్రవసుని
మనుమఁడవిబ్భంగి మనుజు లేశ్వరుని ♦ వనితముందలఁబట్టి వారకతిగువ
ననవుఁ గరవాల మెకించియసుర ♦ దనగుమాయాసీత తలఁ ద్రెవ్వనేసె
జనుమింక రామలక్ష్మణులకుఁ జెప్పు ♦ మన ఖిన్నుఁడై యుండె ననిలనందనుఁడు
వసుధాతలంబున పడి నెత్తురొల్కు ♦ నసిధారఁ దెగియున్న యాసీతఁ జూపి
హనుమంతుతోఁ నని నాయింద్రజిత్తు ♦ వనచరోత్తమ రామువనిత నీసీత
ఘనతరంబైన నాకరవాలమునను ♦ దునిమితి మీరణోద్యోగంబు లింకఁ
జిక్కెఁ బొమ్మంచు విజృంభించి పలికి ♦ దిక్కుంభికర్ణము ల్దిశలను బగుల
సంహారఘనఘన స్తనితమో యనఁగ ♦ సింహనాదము సేయఁ జిత్తముల్గలఁగి
యుప్పు మరణములో నాయింద్రజిత్తుఁ ♦ దప్పక కనుఁగొని తనరిన భీతి
వనచరులార్వంగ వాయునందనుఁడు ♦ కనుఁగొని పలికె నోకపివీరులార
సమరవిక్రమములు చాలించి పాఱ ♦ సమయమే వినరొకో సమరధర్మంబు
దలఁప బాధుల కెల్లఁ దలఁవంపు గాదె ♦ కలనఁ బాఱుట కంటె కష్టంబు గలదె
వనిఁ జెద రేమున్న ననఁ గూడి మీరు ♦ కడిమి వాటింతురు గాకంచుఁ బలుక
నందఱు బీరువులు నద్రిశృంగములు ♦ నందంద కయికొని హనుమంతుఁ గూడి
రయమున నార్చుచు రాక్షససేన ♦ పయివైచిరంత నా పవమానసుతుఁడు
చలమున నొకమహాశైలము నంకించి ♦ యలుకలో వైవంగ నానిశాచరుని
నారథిరథమును జనతో నలఁదియు ♦ దారుణధ్వనితోడి ధరఁ గ్రుంగఁ బడియె
ఆలోన వెడియు నగచరుల్తరులు ♦ శైలశృంగములు రాక్షసులపై వైవఁ
దన సేన విఱిగిన దశకంఠసుతుఁడు ♦ కనుఁగొని కోపించి కపియూథపతులఁ
బటుశూలముద్గర ప్రాసఖడ్గములఁ ♦ జాలవేగంబున సమయించె నపుడు
మారుతాత్మజుఁడును మదిలోనఁ గినిసి ♦ ఘోరవిక్రమకళాకుశలుఁడై పేర్చి
కడిమి చేఁగవియు రాక్షసు మూఁకఁ గాంచి ♦ వడిశిలాతరుఘోరవర్షముల్ గురిసి
యానిశాచరసేన నపలీలఁ దోలి ♦ వానరావళిఁ జూచి వాయునందనుఁడు
వనచరపతులార వసుధేశు దేవి ♦ దనుజాధముఁడు చంపెఁ దప్పుఁ గార్యంబు
సమర మేటికినింక జనకజవార్త ♦ కమలాప్తకులున కొక్కట నెఱిఁగింప
నరుగుద మటమీఁద నారాముఁ డెద్ది ♦ వెరవా తిచ్చు నావిధము సేయుదము
మీరి దఱుము సంభ్రమింపనయుఁ డుఁ ♦ డీరాక్షసుఁడు క్రూరుఁ డేమఱవలదు
అని యుఱుమగిడిన హనుమంతుఁ జూచి ♦ తగ మదినప్పు డద్దశకంఠసుతుఁడు
ఈ మహాబలుఁ డేగె నిటమీఁద దనకు ♦ హోమవిఘ్నము సేయనోప రెవ్వరును

—*: ఇంద్రజిత్తు నికుంభిళ యాగము సేయుట :*—

అని నికుంభిళ కేగి యచట నిశాటుఁ ♦ డెనసి నిష్ఠతో నేపుదీపింపఁ

గల్లునెత్తురుపాలు ఘనకచ్ఛపలము ♦ బిల్లులబిల్లుల బలుసర్పములను
గారుకోళ్లనుమంచి గంధంబుతేనె ♦ నారికేళంబుల నల్లనికోళ్ల
సూకరంబులమఱి సారిది కేశములఁ ♦ గాకులఁదెల్లని గార్దభంబులను
గా తెనుపోతుల ఘనమేషములను ♦ నాఱునాలుగురెండు నఱువదికరులఁ
గొండగొఱ్ఱెలు వేయికోటులలక్ష ♦ మ [illegible]కములఁగోటి మాణిక్యములను
ముత్యంపుఁజిప్పలు మూఁడర్బుదములఁ ♦ గాత్యాయనీదేవి కెదనిష్ఠనిలిపి
మనమునని గమనమంత్రపూతముగ ననలునిరుఃకరమాంసాదులఁదనిపి [ను
హోమంబుసేయుచునుండె నయ్యెడను ♦ రాముండుపడమటిరథసమంతయు
వినిజాంబవంతుని వేగంబపిలిచి ♦ యనవచ్చెఁబడమట విపులఘోషంబు [యు
హనుమంతునకు నెట్టియునిమైన యుదిగో ♦ ఘనమైన యట్టి యాకలకలంబర
జనుమురయంబున సైన్యంబుతోడ ♦ ననిఁబుత్తేశ్వరుం డతిశీఘ్రవృత్తి
బలువిడిభల్లూకములఁదన్ను ♦ గొలిచి కప్పుడు నూఱుకోటులురాఁగ
వడిగొనిపశ్చిమద్వారంబు దెసకుం నడుచుచోఁగనియె నన్నడుసు వాయుజుని
వాయుజుండును జాంబవంతునితోడ ♦ నాయింద్రజిత్తు సీతం తయుఁజెప్పి
యీవార్త రామున కెరిఁగించి తత్తు ♦ నేవచ్చునందాక నేనున్న యెడను
గాచియావాకిటఁ గదలకయుండు ♦ మేచినపగవాని నేమఱవలదు
అనిపంచివచ్చుచో నతిదూరమున హనుమంతుఁబొడగని యారాఘవుండు
ఇతనిముఖస్థితి నేమొకోకార్య ♦ గతిదోఁచుచున్నది కనుఁగొన నిపుడు [క్క
ఇదియే తెఱంగని యిచ్చఁజింతింప ♦ గదిసివాయుజుండు రాఘవునకుమ్రొ
దేవ యేమెల్లను దెంపుమైదాన ♦ వావలితోడఁ గయ్యమ్మొనరింప
మాముందటనె తెచ్చి మదిశంక లేక ♦ భూమిజతలఁ ద్రెంచెఁ బొరినింద్రజిత్తు
ఆ వాకిటికని యుక్షాధీశుఁబెట్టి ♦ యీవార్తచెప్పంగ నేను వచ్చితిని
అనువార్త చెవులలో నడరకమున్నె ♦ ఘనవాతనిహతి వృక్షంబునుబోలె
ననతులశోకాగ్నియు నడరి దహింప ♦ ధృతిదూలి రవికులాధిపుఁడు మూర్ఛిల్లి
యవనిపైఁబడియున్న నతిభీతినొంది ♦ యగవల్లభులెల్లఁ బటుశోకులైరి [చు
కైకొనియపుడు లక్ష్మణుఁడన్నతోడల ♦ పైకిరాఁదిగిచి సంభ్రమచిత్తుఁడగు
నక్కటా రామ నీయట్టియుత్తమున ♦ కిక్కళంకము పుట్టెనే యిట్టిచోటఁ
దలపోయఁగా మేలు ధర్మంబునందుఁ ♦ గలదనుమాట నిక్కముగాక పోయె
నదియెనిక్కంబైన నకట నీయట్టి ♦ పదయచిత్తున కేల సంతాపమొదవు
నీచేత రావణునికి జావు లేక ♦ యీచందమున నుండ నేటికి వచ్చు
జానకికేల యీచావు సిద్ధించుఁ ♦ గానధర్మముకంటె ఘనమధర్మంబు
త్యాజ్యంబుగాదని తలపోయకట్టి ♦ రాజ్యంబువిడిచి యరణ్యంబులందుఁ

దిరుగవచ్చితిమటుఁ దిరిగెడుమనకుఁ♦బురుషార్థములుసిద్ధిఁబొందునేయధిప
అవనీశనిర్ధను లగువారుసేయు ♦ వివిధయత్నంబులు వెసనిదాఘముల
నడరెడుసెలయేరు లడఁగినభంగిఁ ♦ జెడిపోవుననిబుధుల్చెప్పంగవినమె
ధరములార్జించినా ధర్మకామాదు ♦ లనుపమస్థితితోడ నధిపసిద్ధించు
ఎసఁగంగనర్థంబు లెవ్వానికొదవు♦వసుధవానికి నెల్లవారుచుట్టములు
అర్థంబుగలవాఁడె యరయంగఁ బురుషుఁ ♦
డర్థంబుగలవాఁడె యధికుండు జగతి
అర్థంబెవిద్యయు నర్థంబెనేర్పు ♦ నర్థంబెకీర్తియు నర్థంబెపెంపు
అర్థంబెబలమును నర్థంబెకులము♦నర్థంబెబలగంబు నర్థంబెగుణము
అర్థంబెశీలంబు నర్థంబెప్రాణ♦మర్థంబెపుణ్యంబు నర్థంబెభూమి
అర్థంబెరూపును నర్థంబెనీతి♦యర్థంబెఖ్యాతియు నర్థంబెభూతి
అర్థంబెగతియును నర్థంబెమతియు♦నర్థంబెయెఱుకయు నర్థంబెసుఖము
అర్థంబు గావున నఖిలకామ్యములు♦నర్థసంపన్నున కరచేతివరయు
అధికులువేదవేదాంగపారగులు♦బుధులుదూర్వ్యంబున బూతాత్మతముల
నర్థంబుగలవాని నమరఁబూజింతు♦రర్థిమోక్షార్థులై యడవులనుండు
మునిపుంగవులు కందమూలంబులిచ్చి♦ధనవంతులగువారిదర్శింతురెలమిఁ
గాయకమంగళపాఠకానీక♦గాయకకులములు కలవారిఁబొగడు
ఉన్నతకుచములునురునితంబములుఁ♦నన్నువనడుములు నలసయానములు
బింబోష్ఠములు చంద్రబింబాననములు ♦
నంబుజలలితంబులగు లోచనములు
రోలంబకులలీల రుచిరధమ్మిల్ల♦లీలాలకంబులు లేఁతసిగ్గులును
ఒయ్యాననవ్వుట నోరచూపులును♦దియ్యమాటలుగాము దీమంబులనఁగ
నెలయించునేర్పులు నా జవ్వనములు♦గలకాంతలర్థంబు గలవృద్ధునైన
మనమారఁగొలుతురు మహితభోగేచ్ఛ♦ధనహీనునొల్లరు దర్పకునైన
లేమియేనరకంబు లేమియేరుద్ర ♦ భూమియులేమియే భూరిశోకంబు
లేమియేరోగంబు లేమియేమృతియు ♦ లేమియేపాపంబు లేమియేజరయు
లేమియేకష్టంబు లేమియేకరువు♦లేమిదైన్యంబు లేమియేవగపు
లేమియేసకలమాలిన్యంబుదలఁప ♦ లేమియేసర్వంబు లేమిగావునను
అచ్చెరువుగరాజ్య మంతయువిడిచి ♦ వచ్చినప్పుడకాదె వచ్చెనాపదలు
జానకిమరణంబు సైరింపఁజాల ♦ మానవలోకేశ మార్గణావళుల
విసుకకాసుర బలాన్వితముగాలంక ♦ మసలనింక భస్మంబుచేసెదను
అనిలాత్మజుఁడుపల్క నావిభీషణుఁడు♦దనమదినూహించి ధరణీశుఁగనియె

నాయింద్రజిత్తుమాయయె కానిసీత ♦ కేయపాయంబునునిటుఁ గాదు వినుము

—:* విభీషణుఁ డింద్రజిత్తుమాయ శ్రీరామునితోఁ జెప్పుట *:—

ఘలుఁడైన యాపఙ్క్తికంఠుఁ డదేఁచు ♦
తలఁపు నేనెఱుఁగుదు త్రైలోక్యనాథ
జానకినొప్పింపు జనపతికనుచు ♦ నే నెన్ని చెప్పిన హితవుగాఁ గొనఁడు
జనకనందన నేల చంపించునతఁడు ♦ మనుజేశ యిది వాని మాయగావలయు
అట్టిదియైన నోయవనీశవర్య ♦ నట్టుఁ బోలియవే నిఖిలలోకములు
ఇదిపొంకుచింతింప నేలయాసీతఁ ♦ బదిలంబుగాఁ జూచి ప్రతివార్త దెత్తు
ననిరామునను మతి నవ్విభీషణుఁడు ♦ దనరూపమంతయు దాఁచి వేగమున
నలియాపుఁగ్గైకొని యసురేశువనము ♦ తాఁకఁ జొచ్చి సీతను గాంచి మరలి
వచ్చియారామ భూవరునకు మ్రొక్కి ♦ యచ్చపుభక్తితో నంతయుఁ జెప్ప
వినివిభీషణ యిట్టి విధమేల సేసె ♦ ననిలోన నింద్రజిత్తని రాముఁ డనుగ
దనుజుఁడాసురహోమ తాత్పర్యబుద్ధిఁ ♦ జనుటకునై యిట్టి చందంబు చేసె
హనుమంతుఁడాదిగా నగచరకోటి ♦ మనములు గలఁచి యిమ్మాడ్కిఁబుత్తెంచి
తనహోమవిఘ్నంబు తగఁజేయువార ♦ లనయంబు లేరింక ననినికుంభిలకు
నరిగినవాఁడు వాఁడచట హోమంబు ♦
పరిసమాప్తముగాఁగఁ బటుష్ఠ నేఁడు
తనహోమమంత్రమింతయుఁ జిక్కకుండ ♦ మనుయుక్తి నవధానమతి జేసెనేని
దేవదానవులైన దృష్టించి నిలిచి ♦ యావీరవరు నెవ్వరసి గెల్వ లేరు
అటుగాన నీలోన నసురవేలిమికిఁ ♦ బటుగతి విఘ్నమాపాదింపవలయుఁ
జనియెవనేందె సైన్యంబుతోడ ♦ మనుజేశ పంపు లక్ష్మణుఁ దోడుమాకు
సౌమిత్రి దుర్వీరుఁ డండకాండముల ♦ భూమిపైఁ బడనేసి పొలియింపఁగలడు
నేఁడింద్రజిత్తును నీతమ్ముఁడోడుచు ♦ వాఁడు నికుంభిలా వనములోపలను
దపముగ్గైకొన్నాఁ డసదశకంఠసుతుఁడు ♦ కపమునిండక మున్న దండింపకున్న
బ్రహ్మ మెప్పించి యాపరమేష్ఠివలన ♦ బ్రహ్మశిరంబను బాణంబు విల్లు
కవచంబు ఖడ్గంబు కవదొనల్మఱియు ♦ నవిరళమంత్రపూతాస్త్రముల్వడసి
కామగాశ్వంబును గమనీయకేతు ♦ భీమంబు మారుతస్ఫీతవేగంబు
నగురథంబాయగ్నియందు వెల్వడిన ♦ దననారథంబెక్కి ధమవంబెనేని
నావాసవారాతి నాలంబులోన ♦ దేవాసురాదులు దృష్టింప లేరు
వానికిని మ్ములవరమిచ్చునప్పు ♦ డానీరజాసనుం డతనివీక్షించి
నీవునికుంభిల నెఱయహోమంబు ♦ గావించితేని నేగతిన జేయుఁడవు
కావించుహోమంబు గడమగునేని ♦ రావణసుత నీవు రణములోపలను

బగతుచేఁ జత్తని పల్కెనవాఁడు ♦ జగధీశ యటుగాన సమరయత్నంబు
సేయించి నేఁ డింద్రజిత్తుఁ జంపు ♦ మాయావియగు వీఁడు మడిసినఁ జాలు
సమరకంటకుఁడగు నద్దశాననుఁడు ♦ సమరంబులో మున్నె చచ్చినవాఁడు
అనిపల్కె రఘురాముఁ డపుడనుజన్ముఁ ♦

గనుఁగొని యనఘాత్మ ఘనుఁ డింద్రజిత్తు
ఘనతిరోహితతిగ్మకరుభంగి నింగి ♦ ఘనమాయఁ దనగతి గానరాకుండఁ
జరియించు నవ్వీరు శక్రాదిసురులు ♦ దురమునఁ గడిమిమైఁ దొడరంగ లేరు
హోమమధ్యంబున నుగ్రరాక్షసుని ♦ సౌమిత్రి నీ వేగి సమయింపు వేగ
పటుతరభల్లూకబలముతోఁ గూడి ♦ చటులవిక్రముఁడైన జాంబవంతుండు
హనుమంతుఁడును దోడు సరుగుదెంచెదరు ♦

ఘనతర వికటవిక్రమ ధురంధరుఁడు
ఇమ్మంత్రివరుఁ తోఁ విభీషణుఁడు ♦ నెమ్మి నయ్యాగంబు నీకుఁ జూపెడిని
అనిపల్కి రఘురాముఁ డనుజాతునకును ♦ వనధి యిచ్చిన యట్టి వజ్రకవచమ్ము
ఘనతరఖడ్గంబు కవదొనల్ విల్లుఁ ♦ బెనుపొందఁగా నిచ్చి ప్రీతితో మఱియు
వరభూషణంబులు వరుసగా నిచ్చి ♦ యురుదైవపేర్మి నిట్లనుచు దీవించ
అనిశంబు జయము శ్రీహరి యొసఁగూర్చుఁ

ఘనతరశుభము శంకరుఁ డిచ్చు నజుఁడు
నీకాయువు ఘటించు నిఖిలదేవతలు ♦ గైకొని దిశలందుఁ గాతురు నిన్ను
అనిలుండు ననలుండు నభిరక్షణంబు ♦ దనరఁ జేయుదురు ముందఱ వెన్క నీకు
అనవుడు లక్ష్మణుఁ డప్పుడుప్పొంగి ♦ ధనువందుకొని తను త్రాణంబుఁ దొడిగి
కవదొనల్ ధరియించి ఖడ్గంబు దాల్చి ♦ వివిధభూషణముల విలసితుండగుచు
నా రాముఁ గనుఁగొని యతిభక్తి మ్రొక్కి

ధీరవాక్యంబులఁ దెలుఁగొప్పఁ బలికె
నలినాకరములోన మరాళములు ♦ కలఁగొనఁ బఱచునట్టి గతిగా నడఁగి
నా తెల్లగరులబాణము లింద్రజిత్తు ♦ వేతూరిచని నేఁడు వెసలంకపను
విపులతూలస్తోమ విధమున దాని ♦ నృపశిరవిశిఖాగ్ని నీఱు చేసెదను
అనినయథోచితభంగి నా రామచంద్రు మనమార వీడ్కొని మహిత తేజమున

## —:* లక్ష్మణుఁడు యుద్ధమునకు వెడలుట *:—

గరుడుని నెక్కిన కమలాక్షుపగిదిఁ ♦ గరువలిసుతు నెక్కి కర మొప్పమిగిలి
పంబిగోలాంగూల బలములు గొల్వ ♦ జాంబవదాదులు చను దేరఁ గదలి
బలువిడి పటకు ముప్పదియోజనలు ♦ గలనికుంభిళ కేగి ఘనతరంబుగను
నురుమదేభంబులు నుత్తమాశ్వములు ♦ నరిదిరథంబులు నలరుకాల్బలము

బలిభూతములకిచ్చి పావకవలనఁ ♦ గలశక్తిఁ బహితులఁ గడఁగిజయించుఁ
దొల్లియునిటుచేసి దుర్మదవృత్తి ♦ బల్లిదుఁడై యునిఁ బర్జన్యుఁ గెలిచె
నిప్పుడునిదె చూడు మీహోమవహ్ని ♦ నొప్పార వెడలుచు నున్న దిరథము
అరుణనేత్రంబు లరుణకేశము ♦ లరుణవస్త్రంబుల నరుణమాల్యముల
జడిగొన్న పల్లని సారథితోడఁ ♦ గడునొప్పవగు తురంగంబులతోడ
వాఁడు క్రమ్మఱవచ్చి వరహోమశక్తి ♦ నేఁడిమి నెంతయు వెడలించిమించి
యీరథంబెక్కిన నింద్రాదులైన ♦ నారావణాత్మజు ననినోర్వరాదు
కాననింతటిలోనఁ గడఁగి సౌమిత్రి ♦ వానినిఁ బటుశరవ్రాతంబు చేతఁ
బొలియింపుమనుడును బొంగి లక్ష్మణుఁడు ♦ తలఁగక కార్ముకధ్వని చెలంగింపఁ
గరవాలహస్తుఁడై కవచంబుఁ దొడిగి ♦ యరుదార శిఖివర్ణమగు రథంబెక్కి
తనరూపు చూపి దశకంఠసుతుని ♦ గనుఁగొనఁ గని సౌమిత్రి కడునల్కఁ బల్కె
మాయలఁబని యేమి మగవాఁడవేని ♦ నాయెదుటికి వచ్చి నను జూతుగాక
నిక్కంపు లావున నీవు గయ్యమున ♦ జక్క నిల్వుము నిన్ను జముఁ గూర్పఁ బుత్తుఁ
కపటంబుఁ గైకొన్నఁ గైకొనకున్న ♦ కపటరాక్షస నిన్నుఁ గడతేర్తు వేగ
నెఱసిన కడిమితో నిలువు నాయెదురఁ ♦ గఱకు రాక్షసుఁడును గడు నింద్రజిత్తు
భీలకరాళసంక్షోభితుఁడై పలికె ♦ బాలుండవై యిట్టి పంతంబులేల
లక్ష్మణ నిన్ను నాఁడంబున వీర ♦ లక్ష్మికిఁ బెడఁబాపి లావెసలించి
యసువుల నాఁడు బాణావలిఁ బెఱికి ♦ వసుమతిపై గూల్చి వారక వచ్చి
కాకులగ్రద్దలఁ గండలఁ దనుప ♦ భీకరాకారతఁ బెంపారువాఁడ
ఉరకనాఁ గట్టిన యురగపాశముల ♦ వెఱచితె లక్ష్మణ మదినింతలోనె
అనిలక్ష్మణునిఁ బల్కి యటవిభీషణుని ♦ గనుఁగొని యింద్రారి కడునల్కఁ బలికె
వినఁ దండ్రివంట నీవు ప్రియుచుఁ గర నేను ♦ దనయుఁడ నాకెగ్గు దలఁపఁగఁ దగునె
దుర్మతివై కులద్రోహంబు సేయ ♦ ధర్మఘాతుక నీకుఁ దగవేల గలుగు
ఎడరైన బంధుల నెట్టినీచుఁడును ♦ విడిచి శత్రులఁ బొంది వేఁడునే శరణు
తగవు దప్పిననైనఁ దనవారిఁ బాసి ♦ పగవారి సేవించి బ్రతుకుటే బ్రతుకు
ఆనిశాచరనాథుఁ డధికతేజుండు ♦ నీ నిష్ఠురోక్తులు నీతిగా వినునె
అన్న కోపించిన నటయింటి మూల ♦ నున్న నేమగు నుండకున్న నేమగును
నీలావుబలిమి నేనెల్ల దేవతల ♦ నాలంబులోఁ గెల్చె నాదశాననుఁడు
హితుఁడవై మర్మము హితమెఱింగించి ♦ యతని చేత నచెను మన విభీషణుకు
నావర్తనము మేఘనాదయీ వెఱుంగ ♦ దీవృథాతల్పంబు లేల యియ్యెడను
ఆగంధ్రడికొడుకైన యవనీతిమతికి ♦ నీతి యుధర్మంబు నీకేల గలుగు
పాసఁగఁ జేబట్టిన భుజగంబు పగిది ♦ వెస క్రూరుఁడగు బంధువిడువఁగావలయు

పాపాత్ముఁడగునట్టి పఙ్క్తికంధరుఁడు ♦ నాపలుకులువిన్న నాఁడింతలగునె
పరధనంబులకును బరకాంతలకును ♦ బరితాపములఁబొందు పాపకర్ములకుఁ
దగ వేలమేలేల ధర్మంబు లేల ♦ జగదేకహితమైన చరితంబు లేల
మగ్నమామామది మదముగర్వంబు ♦ నగ్నులై కాల్పక యవి యేలపోవు
తెఁగొని యెపుడు సధర్మవ గృహమె ♦ కలిగినవర్తింతురు కడుఁగ్రొవ్వి మీరు
సురలబాధఁతురు సువ్రతులైన ♦ పరమమునీంద్రులఁ బట్టిచంపుదురు
కావున నాదశక మునితోడ ♦ నీవునులంకయు నిఖిలబంధువులు
మానకచ్చెరమాడు మంత్రులు గూడ ♦ సేనలు రాజుచేఁ జెడుటసిద్ధంబు
బుద్ధిశూన్యుఁడవై తి స్ఫుటకాలపాశ ♦ బద్ధుఁడవై తేమి పల్కినఁ బల్కు
మిటుమీఁదనీమాయ లెక్కవువినుము ♦
వటముక్రిందికి హోమ వాంఛఁ బోరాదు
చనరాదల కకు సౌమిత్రిఁదొడరి ♦ చనవచ్చు నిక వేగ జముపురికనఁగఁ
ప్రథమాద్రిపయివచ్చు భానునిఁ గదిఁ ♦
బృథుగాత్రు హనుమంతు బెంపారనెక్కి
యమగినలక్ష్మణు నావిభీషణుని ♦ సమరార్థులగు నగచరులవీక్షించి
వీరులై నాబాణవృష్టికి మీరు ♦ సైరించెదరుగాక సమరోర్వినేఁడు
ఉడుగక నావింట నొదవు బాణాగ్ని ♦ యడరిమిమ్ముఁ దఱు నాహుతిగొనుచు
గరవాలపట్టిన ఘనభిండివాల ♦ శరజాలములమిమ్ము సమయింతుననుచు
రోదసీకుహరంబు మ్రోయఁగసింహ ♦ నాదంబుసేయుచు నానాశుగముల
వెసనేయుచును బాహువిక్రమస్ఫూర్తి ♦ నెసగునాముఁదఱ నెవ్వండునిల్చు
అనవుడులక్ష్మణుం డాగ్రైత్యుతోడ ♦ దనుజాధముఁడ యీవృథాగర్వమేల
చేరకయడఁగిముచ్చిలిపోటువోడుచు ♦ పోరణంబునఁ గాడియే మగతనము

—:* ఇంద్రజిత్తు లక్ష్మణుల ద్వంద్వ యుద్ధము *:—

నీమాయలన్నియు నిరసించినిల్వ ♦ నామార్గణములఁ బ్రాణములహరింతు
అనవుడుఁగోపించి యతఁడేసెనతని ♦ ఘనకాలసర్ప ప్రకాండకాండముల
అవిలక్ష్మణుఁ బగడి యవ్వ వెడలి ♦ యవనీస్థలముగాడె నద్భుతశక్తి
మతియుతువాఁడుఁ ద్రుణదేవుమీఁద ♦ గరులాడగా బెక్కుకాండంబులేయ
బడివచ్చి తాఁకి యవ్వాలు గ్రుచ్చిపాఱె ♦ వెడలు నెంద్రరసంబు వెల్లియపోలెఁ
గడుఁజెల్లు నెత్తురు గంబువెడ ♦ నడరంగ రాక్షసు లార్చుచునుండ
జంకెలనట్టహాసములు చేయుచును ♦ లంకేంద్రతనయుఁడా లక్ష్మణుఁ జేరి
నరనాథసుత నేఁడు సన్నాజిఁ గదిసి ♦ బిరుదవై యిట విజృంభించిననిన్ను
దొలుతఁగత్తళము చుత్తునియలుసేసి ♦ తలత్రుంచి వై చెద బాఱనాస్త్రముల

పెనుపేరిపడియున్న ప్రియసహోదరుని ♦
నినుజూచు రాముఁడు నేఁడవశ్యమును
అనిపల్కె లక్ష్మణుం డన్నిశాచరునిఁ ♦ గనుఁగొని యీవృథాగర్వ మేమిటికి
పలుకులఁ బనియేమి బవరంబులోనఁ ♦ దొలఁగక నాతోడ నోడకుండు గాక
మాటలాడక వహ్ని మడియించు మాడ్కి ♦
మాటలాడక నిన్ను మడియింతు నిపుడు
పని లేని పంతము ల్పలుకంగ నేల ♦ యనుచు నుగ్రాస్త్రంబు లరివోసి తిగిచి
ఘనతరభీషణాకారుఁడై పేర్చి ♦ కనుగవఁ గెంజాయ గడలుకొనంగ
సమరంగఁ గోపించి యర్కదీధితుల ♦ గమియంగ దిక్కులఁ గలయంగఁ బర్వ
విలయాగ్నికీలల విస్ఫులింగములు ♦ కనుఁగొనఁ దెరలెడు ఘనతరశక్తి
కలయమ్ము సంధించి కఱకురక్కసుని ♦ యలఘువక్షస్థల మటగాడ నేయ
దానవదైత్యుండు రక్తము గ్రక్కి మూర్ఛనూని యంతనె తెల్వినొంది పెల్లార్చి
వాఁడిమి మిగులఁ దీవ్రంబుగ నేసె ♦ మూఁడు బాణముల రాము తమ్ముని నురము
అప్పుడు ధీరులై యధిక రౌద్రముల ♦ నిప్పులు గన్నుల నివ్వటిల్లంగఁ
జెలఁగుచు నయ్యిద్దఱు సింహనాదములు ♦ బలువిడిఁ బఱతెంచు బాణఘట్టనలు
నురుగుణస్వనములు నొక్కట నెసఁగ ♦ వరయమ్ము శౌర్యపు నట్టహాసంబుఁ బోలె
వెలసినలావుల విక్రమంబులను ♦ బోలుపుఁ జలముల భూరిరౌద్రముల
ననిశంబు వెలుఁగు చంద్రార్కులఁ బోలెఁ ♦ దనరు చతుర్దంత దంతులఁ బోలె
గోమరారు సింగంపుఁ గొదమలఁ బోలెఁ ♦
గ్రమమొప్ప శంబరకాముఁ బోలె
సమరఁ ద్రినేత్రాంధకాసురుల్ వోలె ♦ రమణఁ గుమారతారకులను బోలె
నేపారు వృత్రాసురేంద్రులఁ బోలె ♦ రూపింపఁ బ్రళయకాల రుద్రులఁ బోలెఁ
బాయనిజయకాంక్ష బలియురై పోర ♦ నాయిద్దఱును నొప్పి రప్పుడు చూడ
కోపించి కోదండగుణఘోష మెసఁగఁ ♦ జాపరథధ్వజసహితంబుగాఁగ
నామేఘనాదుని నంపవర్షమున ♦ సౌమిత్రి ముంచిన సైరింపకతఁడు
ప్రతిసాయకము లేయ బలువిడి ద్రుంచి ♦ విరతంబు బాణవృష్టిఁ గప్పుటయు
ఆయింద్రజితుఁ డప్పు డలవెల్లఁ బొలిసి ♦
మాయాస్త్రములకు మాఱైన యస్త్రములు
నెరి నేయ నేరక నిట్టూర్పు పుచ్చి ♦ సరిగొని చూడ నత్తఱి విభీషణుఁడు
సౌమిత్రిఁ గనుఁగొని జననాథతనయ ♦ నీమార్గణంబుల నిర్విణ్ణుఁడగుచు
దశకంఠసుతుఁ డున్న దశఁ జూడుమింక ♦ దశరథాత్మజ రణస్థలి వీని గెల్వు
మనవుడు నుగ్రంబులైన బాణములుఁ దొనియంగకము లెల్ల గ్రుచ్చిపో నేయ

నీక ముహూర్తము మూర్ఛవొందితివే తెలిసి ♦
యకటమాం దేవాసవాదులఁ గల్చి
పరికింప దైవంబు ప్రతికూలమై నరునకు నిటు నేఁడు నాకోడవలసె
ననిలోన రాక్షసు లందఱుఁ దోలిసి ♦ రిపువశజు చేత నిఁక నేటి బ్రతుకు
అనుచు గోపమున నయ్యమరకంటకుఁడు ♦ జననాథసుతుఁ జూచి చలమగ్గలించి
నరనాథనందన నా విక్రమంబుఁ ♦ బరికి చిసివింగ బాటవై నిలువు
మనుచు నేడమ్ముల నతని నొప్పించి ♦ హనుమంతుఁ బదియింట నదరంట నేసి
వెస విభీషణుమీఁద విశిఖము లాఱు ♦ మసలక నిగుడించి మఱి విజృంభించెఁ
గాకుత్స్థతిలకుఁ డాడిమిగ్రైకొనక ♦ రాకేంద్రపురిఁ జూచిన వ్యూచుఁ బలికె
నధికుండు పంతంబు లాడకే గెలుచు ♦ నధముండు పంతంబు లాడియు నోడు
ననుచితస్థితి శూరు లగువారు డాఁగ ♦ రనిలోన వంచించుట దియొక్క గెలుపె
కుటిలయుద్ధము సేఁత క్రూరాత్మ నీకు ♦ బటుగతి నిహమానుబరము లేదనుచు
దినకరజాల తీవ్రార్చులడరఁ ♦ గనకపుంఖంబులు గలుగుశా..ములు
వానిపై నిగుడించి వడి జోడుఁ ద్రెంచి ♦ మేనుచ్చిచఁగ నమ్మొయిమరునపుడు
కాలోగ్రసర్పంబు కంచుకంబనఁగ ♦ నాలోకనాభీలమై నేలఁబడియె
తాఁడు వెండియు శౌక్రవజ్రాంగిదొడగి ♦ వాఁడి బాణంబులవడి నేయునపుడు
పరువడి నొండొరు బాణఘాతముల ♦ నురువడి వెలువడు నురుశోణితముల
గైరికనిర్ఝర కలితంబులైన ♦ భూరిభూధరములు పోలుపుఁ గైకొనుచుఁ
గరవేగశిగవేగ గతులు నెర్పులును ♦ గరమొప్పఁ బోరుచోఁ గా రాకురాలి
పూచిన కింశుక భూజంబులొప్ప ♦ నా చ ద నొప్పి రస్త్రఘాతముల
సమరగంధర్వాదు లచ్చెరువందిఁ ♦ సమరంబు చూడ నానమయుంబునందు
కలభవేష్టితమత్తగజలీలమంగ్రి ♦ కలితుఁడై భీకర తివిభీషణుఁడు
విలుగుణధ్వని చేసి విపులరోషమున ♦ వెలుఁగు మంటలతోడి విశిఖంబులేయ
బిడుగులు చఱచిన పృథులభూజముల ♦ వడువున రాక్షసు ల్వసుధపైఁ బడిరి
అనలుండు మొదలుగా నతిసిసుంద్రులును ♦ ఘనశూలపట్టిసఖడ్గఘాతముల
నగడి రాక్షసకోటి నేలపైఁ గలిపి ♦ నగచరావలిఁ జూచి యవ్విభీషణుఁడు
ఇంకనీతనిఁ జంపుడిందఱు బోదవి ♦ లంకేంద్రు డలసున్న లావన్ననితఁడే
అనినీతఁడీల్గిన నాదశాననుఁడు ♦ దస సేనతోఁ గూడఁ దా సీల్గిపాఁడు [యు
మును ప్రహస్తుని వజ్రముష్టిఁ బ్రజఘుఁ ♦ డనువానిసు ప్తఘ్నుడను వానిమఱి
కుంభనికుంభుల ఘోరవిక్రములఁ ♦ గుంభకర్ణుని మహోగ్రుని నతికాయు
వికటు మహాపార్శ్వు వెలయ ధూమ్రాక్షు ♦
మకరాక్షు రక్తాక్షు మఱిశోణితాక్షు

యూపాక్షుఁ ద్రిశిరు మహోదరు నగ్ని ♦ కోపుని దేవాంతకుని నరాంతకుని
ఖరుదంబుమాలిని కంపను మఱియుఁ ♦ బరుష విక్రములైన పగతురఁ జంపి
యాహవసాగరం బవలీల దాఁటి ♦ బాహాబలంబులఁ బరఁగి తిరింక
సౌమిత్రికి నిమ్మాకు సమయంబు దాఁటు ♦ డా మెయి నింద్రజిత్తను గోష్పదంబు
కొడుకుఁ జంపఁగ నాకుఁ గూడదు వీఁడు ♦

చెడును పాయము మీకుఁ జెప్పెద వినుము
హింసగావించిన నెదిరి చేఁ బంచి ♦ హింస సేయించిన నిని రెండు సరియె
ఇది రాముకార్యార్థ మిది లోకహితము ♦ నదికాన పాతకం బైనఁ గానిండు
సౌమిత్రి చే నేఁడు చంపింతు వీని ♦ నేమాయలును గొల్వ విటుమీఁద ననఁగ
జా బవంతుఁడు ఋక్షసంఘంబుతోడ ♦ నంబరంబగలంగ నార్చి రాక్షసుల
నగశృంగ తరుసింహ నఖదంతము ♦ న బగతుర నవలీలఁ బాల్పడి సొచ్చి
నొప్పింపఁగ పులచే నొగిలి రాక్షసులు ♦ నిప్పులు సెదరంగ నెరిదారు ఘోర
పరశు ముద్గర తూల పట్టిస ప్రాస ♦ పరిఘ శరాసన పాణులై పెరయఁ
బోరి సురాసురులకుఁ బోరెనయ్యద్రి ♦ చరనిశాచరులకు సంగ్రామ మయ్యె
హనుమంతుఁ డా సమయంబున నలిగి ♦ ఘను లక్ష్మణుని డించి కాలు నివగిది
నొక్కొక్క వాటున నొక్కొక్క మాటు ♦

పెక్కండ్ర దైత్యులఁ బృథివిపైఁ గూర్చె
శైలశృంగంబుల సాలవృక్షముల ♦ లీలమైఁ జంపి బల్లిదుఁడునై పేర్చె
సరభసంబున విభీషణుఁ డంత నలుక ♦ నురుతర జ్యాఘోష మొనరించి మించి
తన మంత్రులును దాను దద్దయుఁ గడిమి ♦ దనుజులఁ బెక్కండ్ర దరమిడి చంపి
శరము మొప్పఁగ నశ పుంఖ ప్రదరములు ♦ దొరఁగించె నింద్రజిత్తుని మేను గాడ
తరమిడి వాఁడు నదగ్రుఁడై కినిసి ♦ యరిది శరంబు లేయఁగ నవి వచ్చి
పొరి విభీషణు నురంబున నుచ్చిపాఱి ♦ ధరఁగాడె ధరణియుఁ దల్లడపడియె
దురము విభీషణుతో నింద్రజిత్తు ♦ కరము గ్రక్కున నిట్లు కావించుచుండఁ
గనుఁగొని యపుడు లక్ష్మణుఁడు కోపించి ♦

హనుమంతు నెక్కి తీవ్రాస్త్రసంతతుల [గానపుడు
వడిమీఱి రాక్షస వరునిపైఁ సేయఁ ♦ గడు నొచ్చి భయమును భయంకరము
మగుడ వాఁడు జ్వాల మార్గణపఙ్క్తి ♦ మిగులంగ లక్ష్మణు మీఁదఁ బెల్లేసె
అడరియు య్యద్దఱు నతికోపులగుచుఁ ♦ గడిఁది బాణంబులు గ్రతసేయ నపుడు
అయంపతండంబు లడరి యొండొరుల ♦ కాయంబులందంద కప్పిన నపుడు
అంబు ధారలతోడి యంబుదంబులను ♦

నంబుదంబులతోడి యర్కచంద్రులను

బోలిరామార్గణంబులు వచ్చుచున్న ♦ యాలోని వేగ మేమని చెప్పవచ్చు
తొడిగినశరములు తొడిగినయట్లు ♦ పిఱవరొకోయను విధమునను౦డె
ఆ రెండు తెఱఁగుల యమ్ములుగనఁగ ♦ ము రంగఁగప్పిన నడ రేఁజీఁకట్లు
పిరరసావేశ వివశత నెఱఁగ ♦ రైరియొండొరుల మహాజిరంగమున
ఆయవసరమున నచ్చెరువడర ♦ వాయువు గణభూమి వర్తింపదయ్యె
అలుండు వెలుఁగొందఁడయ్యె దిక్పతులు ననిమిషగంధర్వయక్షకిన్నరులు
చకితాత్ములై వచ్చి శరణంబుసొచ్చి ♦ సకలదేవతలు లక్ష్మణుఁబ్రశంసించి
యాలక్ష్మణునకు జయఁబలుకనటుల ♦ చాలదీవనలిచ్చి సమ్మదంబునను
నతిలోకకంటకుండై పరయాదైత్యు ♦ మృతునిగాఁజేయు సౌమిత్రిసీవనుచుఁ
బలుకుచును డ నాథానుకులుంను ♦ పెలుచ నార్చుచు గుణాభీలరావంబు
చెలఁగంగనా యింద్రజిత్తునుగిట్టి ♦ బలుకాండములు మీఁదబరగించుటయును
ఆ రాక్షసుఁడు వేగ యుః ద్రుంచివైచి ♦ ఘోరనారాచము ల్గురిసి పెల్లార్చి
మదిలోనఁగోపించి మఱియులక్ష్మణుఁడు ♦

కదిసియాశాఖామృగంబులార్వఁగను [వైచి
జల నరాక యర్ధచంద్రబాణమున ♦ బలియుఁడై వాని చాపము ద్రుంచి
ప గ యేసింటను బడ నేసియొకట ♦ దడయక సారథి తలద్రెవ్వనేసి
పదియు టవత్తుంబు పగులంగ నేసి ♦ యదరంట నేసె రథ్యములనాల్గిటి
ఆరావణుసుతుం డప్పుడు తాన ♦ సారథిరథయుండై సౌమిత్రిగిట్టి
నెట్టన నేయుడు నిగుడుకోపమున ♦ నట్టహాసముసేయ నాలక్ష్మణుఁడు
నరవంబుఁగడపుచు ననిసేయుద్ధత్యు ♦ వరుదారవీక్షించి యదరంట నేసె
ఆ వాఁడియమ్ముల నధికంబునొచ్చి రావణసుతుఁడు మూర్ఛాగతుండగుచు
నంతన తెలివొందియాత్మలోఁబెట్టి ♦ చింతించియిది యేమి చిత్రమోసరుఁడు
నన్నునొప్పించె నెన్నఁడు పుట్టి దెఱుఁగ మున్న నే కాహవంబులఁబోరునపుడు
కాలమెవ్వరికిని గడవ రాదనుచు ♦ వాలిన యుష్ణనిశ్వాసంబులడరఁ
జాపంబు తివియంగ శరముసంధింప ♦ నోపకపరిపంథి నొనరంగఁజూడ
నేరకయుండిన నిఖిలదేవతలు ♦ నారా తమ్ముని నగ్గిఁ చిరపుడు
వెలవెలనగువాని విన్ననిమోము ♦ కలయఁగఁగనుఁగొని కపివీరులార్వ
వీరులుగ్రగనుండు వెనఁబ్రమాథియునుఁ ♦

మేనసన్నిభుఁడగు మేమ నిస్వనుఁడు
శరభుండు బుమండుః శైలమ్ములెత్తి ♦ రయుదారసింద్రారియరదిబుమీఱుగ
నటుపైన కేతురథ్యఁబులతోడ ♦ విటతాట మైకూల విపులకోపమున
ననురనాయకసుతుం డంత బిట్టార్చి ♦ వెసవిభీషణు రామవిభుననుజన్ము

నుదురును వక్షంబు నొనాటఁ జేసె ♦ వదలక మూఁడేసి వాఁడిబాణముల
నేసి గుణధ్వని యొసఁగంబు గాఁగ ♦ జేసి చెలంగించె సింహనాదంబు
అప్పుడు కోపించి యధికరౌద్రమున ♦ నిప్పులు కన్నుల నివ్వటిల్లంగ
రావణుతనయు నురంబుచ్చిపాఱఁ ♦ గా విభీషణుఁ డేసెఁ గాండంబు లయిదు
అతఁడు గోపించి యాగ్నేయబాణ ♦ మా తంత్రిపయి నేయ నది రాఁగఁ జూచి
వారుణాస్త్రం బేసి వడి లక్ష్మణుండు ♦ నా రెండు నటుఁ బోరి యవనిపైఁ బడియె
ఉరగాస్త్రము దైత్యుఁ డుగ్రుఁడై యేయ ♦
గరుడాస్త్రమునఁ ద్రుంచెఁ గడిమి సౌమిత్రి [మున
తగఁ గుబేరాస్త్ర ముద్ధతి నాతఁ డేయ ♦ నగణితంబుగఁ ద్రుంచె యామ్యబాణ
నతఁడు వేఁడియును వాయవ్యాస్త్ర మేయ ♦
నతఁ డదియును ద్రుంచె నైంద్రాస్త్ర మేసి
దానవుం డపుడు గంధర్వాస్త్ర మేయ ♦ దాని లక్ష్మణుడు రౌద్రంబునఁ ద్రుంచె
చలమున నిట్లు వారు సమరంబు సేయఁ ♦
బ్రళయకాలము నాఁటి భంగియై తోఁచె
సౌమిత్రి రణకతిక్రాంతి మాన్పుటకు ♦ నా మందవాయువు లల్లన వీచె
అంత లక్ష్మణుఁడు నాయుంతకుపగిది ♦ నంతకంతకు నుగ్రుఁడై యింద్రజిత్తు

—*: లక్ష్మణునిచే నింద్రజిత్తు చచ్చుట :*—

నటు చూచి కార్ముకజ్యానినాదంబు ♦ పటుశక్తితో దిశాభాగంబు వగుల
జెలఁగించి మయి పెంచి సింహనాదంబు ♦ సెలఁగించి దేవేంద్రుచే గొన్న యట్టి
తారాధిమానమైన యింద్రాస్త్రంబు దొడిగి ♦ యా రామవిభుఁడు ధర్మాత్ముఁ డేని
జెలియ యా సీత పతివ్రతయేని ♦ దేవతాకరుణ నా దెసఁ గల్గెనేని
నింద్రాదులకు నెల్ల హితముగ నేని ♦ నింద్రజిత్తుని తల యిమ్మహాశరము
త్రెంచుఁగావుత యని దృష్టిసంధించి ♦ మించి యేయుటయును మిన్నెల్ల నిండి
పృథుశీర్షనిర్ఘాత భీషణంబగుచు ♦ బ్రహ్మనవిశాసన ప్రారంభమగుచు
బహురత్నపుంఖ శోభాయితంబగుచు ♦
మహాగేంద్రసనుజనావిర్భావమగుచు [చు
సహిమాంశుభానుశకటాలోకమగుచు ♦ సహిమాంశుబింబ ప్రభాభీలమగు
మంతుచూరుచులశోభాయమానకము ♦ నిండుచు నత్యుగ్రనిగ్రహోరగ్ర
గతులమైఁ బఱచి రాక్షసలోకసాధు ♦ సుతుఁ గిట్టియుండఁద సురల మిన్నంద
తనరిన నమ్మహోద్దండాస్త్ర మతని ♦ యనుపమమణికుండలాంచితంబైన
లలితానుమేషణా లంకృతంబైన ♦ తలబొమిడికముతో ధరఁగూలఁ ద్రోసె
గలుషభావమున లంకాసిధానంబు ♦ చలమున నుగ్రుఁడై సాధింపఁగోరి

బలియుచ్చుకొనుకు నైపుణులు లాయంబు ♦ తల ద్రుంచి వైచి విభుఁ బచ్చుపడగ
ననిలోనఁ బడియున్న యాయింద్రజిత్తుఁ ♦ గనుఁగొని జయఁ ల్మీగ్గ కొని దిశలు
గలయంగ నపుడు శంఖంబు పూరించి ♦ విలుగుణధ్వని చేసి వెస లక్ష్మణుండు
నలినప్పుడు రుసింహ నాదంబు సేసెఁ ♦ జెలువొంద నప్సరస్త్రీల లాస్యములు
వీనుల సాలయించి విశ్రుత శ్రుతులఁ ♦ మానైన గంధర్వ మధుర గానములు
అంత విభీషణుం డంతంత కెచ్చు ♦ సంతోషమున ఁగ్రుచ్చి సౌమిత్రి నెత్తి
యాలింగనము సేసె నాలంబులోన ♦ నాలోన వనచరులందంద చెలఁగి
రంతలో హత శేషులగు నిశాచరులు ♦ నంతయు భీతిల్లి యాశల్లఁ బాసి
వనచరుల్ దోలంగ వడిఁ గృతఘ్నులై ♦ దనరారు పదహతి ధరణి కంపింపఁ
గలఁగొని చీఁకట్లు కన్నులఁ గవియఁ ♦ దలలు వీడగ నాయుధంబులు వైచి
చెందిన భయమునఁ జెడిపాఱి లంకఁ ♦ గొందలముఁ జొచ్చిరి కుధర శృంగములు
కొంద ఱెక్కిరి వార్ధిఁ గొందఱు పడిరి ♦ కొందఱు దూఱిరి గుహానికుంజములు
అనలుండు తీవ్రార్చు లడరంగ వెలిఁగె ♦ దినకరుఁ డుజ్జ్వల దీప్తిఁ జెన్నొందె
జలము లెందును నతిస్వచ్ఛంబులయ్యెఁ ♦ గలయ దిక్కులప్పు డాలి రివి తేసె
గగన ప్రసన్నత గలిగె నిష్కంప ♦ మగుచు భూతల మొప్పె నప్పుడంతయును
బవనసూనుఁడు శతబలియును నలుఁడు ♦
జవశాలి పనసుండు శరభుఁ డృషభుఁ
డతులవిక్రమశీలుఁ డావాలిసుతుఁడు ♦ నుతబలుండగు సుషేణుండు ఋక్షుండు
గజుఁడును గవయుండు గంధమాదనుఁడు ♦
విజయులైనట్టి యాద్వివిదమైందులును
దక్కిన వానరోత్తములు నేతెంచి ♦ ప్రొక్కి కీర్తించిరి ముదితాత్ములగుచు
నప్పుడు లక్ష్మణు నఖిల దేవతలు ♦ నొప్పార నుతియించి యొగిఁ బుష్పవృష్టిఁ
గురిసిరి వానరకోటి పెల్లార్చెఁ ♦ బరిమళయుతముగఁ బవనుండు వీచె
నాలక్ష్మణుఁడు విష్ణునంశంబు గాన ♦ నాలంబులోపల నతనిచేఁ దెగిన
కపటరాక్షసుఁడును గాయంబు విడిచి ♦ యుపరాబ్ధిగ్రుక్కి వయఃరుక్కుండు వోలె
విష్ణుసాయుజ్యంబు వెలయంగ నందె ♦ నుష్ణాంశుకులకీర్తు లొగి దిశల్ నిండ
సౌమిత్రి కటజయస్తంభంబు నిల్పి ♦ రాముని యొద్దకు రయమున జనియె
సర్వవానర విభీషణ వాయుజులును ♦ బర్విమొంతయుఁ దన్ను బలిసి యేతేర
వచ్చి రాముని పద వనరుహంబులకు ♦ నచ్చుగా నెఱఁగిన నప్పుడు పొంగి
యలరి కౌఁగిటఁ జేర్చి యానందబాష్ప ♦
ము తోడఁ దొడలపై ముదమొప్ప నునిచి
పొరినంటి ముల వీరి పులకలసంగ ♦ నరగి రుల్చోర గాడినట్టి బాణముల

మునుకొనునాదుఃఖమున మేఘనాదుఁ♦డనిలోనఁగూలిన యాసంతసమున
నశిరయంబున మూర్ఛ యంతలోపలన ♦
ధృతిదూలుకొనఁ దోన తెలివియుఁగలిగి
యాయోధనంబున నలవుమైనింత ♦ సేయునేయాతండ జేయుఁడై నేడు
బహుదివ్యశస్త్రాస్త్ర బలునింద్రజిత్తు ♦ సహితభయంకరు ననిలోనఁజంపె
నటుగాననాచేతననిఁజచ్చునింకఁ♦ బటుశౌర్యధనుఁడైన పఙ్క్తికంధరుడు
ఆతనివిభవంబు నాతనిబలిమి ♦ యాతనిసుతునితో నటనేఁడుపొలిసె
నిఖిలశస్త్రంబు నిపుణుఁడై మెఱసి ♦ యఖిలరాక్షసులకు నాధారమైన
కొడుకుచావున కెల్లకోర్కులువిడిచి♦ కడిమిమైవాతోడఁ గయ్యంబుసేయ
సర్వాయుధోజ్జ్వల సన్నద్ధుఁడగుచు♦గర్వించి దుర్వారగతివచ్చునేని
చతురంగబలదైత్య సంఘంబుతోడ♦ వితతాహవక్షోణి విశిఖజాలముల
బలువిడిదునుమాడి బలిభూతములకు ♦ నలవడఁగావింతు నద్దశాననుని
అనిసుషేణుఁజూచి యారాముఁడనియెఁ ♦
దనరు నోషధశైల తటవనంబునను
నురుతరప్రభలతో నొప్పువిశల్య ♦ కరణివే తెచ్చి లక్ష్మణవిభీషణుల
వానరావలి శరవ్రణవేదనలను♦వానరోత్తమపాప వలయునీవనిన
ఆతండునత్తెఱం గటుసేయువారు ♦ వీతక్షతాంగులై వెసనల్లసిరి
ఇనసూనుపనుపున నెల్లవానరులు ♦ మనమారఁగైసేసి మహితతేజము స
జంద్రదివాకర సదృశులై రామ ♦ చంద్రసౌమిత్రుల సరిగొల్వనపుడు
రామలక్ష్మణులును రవితనూజుండు ♦ యామినీచరవరుఁ డగువిభీషణుఁడు
నతబలుండనిల సూనుఁడుసుషేణుఁడు ♦
శతమన్యుమనుమఁడు జాంబవంతుండు
నీలుండుమొదలుగా నిఖిలయూథపులు ♦ పౌలస్త్యులకునెల్లఁ బట్టుగొమ్మైన
యావీరవరునిచా వధికసమ్మదము ♦ గావింప సంపూర్ణకాములైరిటను
అంతనారాక్షసు లటలంకకరిగి ♦ యెంతయుఁగోపంబు లెసఁగనవ్వేళ
రావణులోకవిద్రావణుఁ గాంచి♦దేవనీపుత్రుఁడు దేవేంద్రవైరి
తనబాహుబలమునఁ దఱిమివానరుల ♦
దునుమాడిపెక్కండ్ర దురములోపలను
దివిజులచ్చెరువంద దివ్యాస్త్రకోటి ♦ నవిరళంబుగఁ బేర్చి యంతటఁబోక
బలువిడిలక్ష్మణుఁ బ్రాణముల్గొనఁగ ♦బలుసాయకంబులఁ బ్రౌఢుఁడైయేసి
యామేఘనాదుండు దగ్రవిక్రముఁడు ♦
సౌమిత్రిచేఁజచ్చె సమరమధ్యమున

## —:* రావణుఁ డింద్రజిత్తు మరణమునకు శోకించుట *:—

ననవుడు రావణుం డధికశోకమున ♦ మునిఁగి పెద్దయుఁ బ్రొద్దుమూర్ఛిలి తెలిసి
హా వంశవర్ధన హా మహావీర ♦ హా వీరరణధుర్య హా శూరవర్య
ఆశతమన్యుని నవలీలఁ గెలుచు ♦ నీ శౌర్యమెవ్వఁడు దగ్గుఁడై యడఁచు
బలసూదనాదిదిక్పతులు ఖేచరులు ♦ పలుమాఱు నీ వన్నఁ బాఱుచుండుదురు
నీయుగ్రశక్తికి నిలిచి నిన్నెదిరి ♦ యాయోధనంబున నడఁచె నే నరుఁడు
చటులకోపంబునఁ జండకోదండ ♦ పటుబాణపాణివై బవరంబులోన
నిలిచిన జముఁడైన నీకోడునట్టి ♦ బలిమి యెక్కడఁ బోయెఁ బరికింప నేఁడు
వక్రమై దైవంబు వలను గాకున్న ♦ శక్రారి నీకంటె జనుఁ డెక్కుడయ్యె
అక్కజంబుగ మందరాచలమైన ♦ వ్రక్కలు సేయు నీ వాఁడిబాణములు
రణములోపల మున్ను రామలక్ష్మణులఁ ♦ దృణలీలఁ గెలిచితి తివిరి పల్మాఱు
ఆమహాత్మము దూలి హా పుత్ర నీవు ♦ సౌమిత్రి చేనిట్లు సమసితే యకట
అమరులు మునులును సమరారి నీవు ♦ సమయోగ్యంబునటకు సంతసించెదరు
సంహారఘనఘనస్తనితమైనట్టి ♦ సింహనాదము నీవు చేసిన బెదరు
నిఖిలలోకంబుల నీవ జేయుదువు ♦ నఖిల నిర్జరులకు నీ పేర్మి దక్కి
యల్లువిగతిఁ గూలి తరటమ్ము బమ్మ ♦ కల్పవదప్పినఁ గా నేరవైతి
సచరాచరములైన జగములీరేడు ♦ సుచిరవిక్రమ వీరశూన్యమైనదియు
నందన నీ లావు నమ్మిన నన్ను ♦ బృందారకులు నవ్వఁ బెడఁబాయఁదగునె
చెవులార రాక్షసస్త్రీవిలాపములు ♦ వివిధభంగులు నేఁడు విననాకు వలసె
నీయౌవరాజ్యంబు నిడులంగ యును ♦ నీయిష్టబంధుల నీతల్లి నన్నుఁ
దనయ నీపత్నులఁ దనయులఁ డించి ♦ చనఁజాలితే యెందుఁ జనితివి యకట
నాఁడంతకుని గెల్చినాఁడ వాలమున ♦ నేఁ డెట్టు వోయితి వీవు తత్పురికి [యి
పరలోకకృత్యముల్ భక్తితోఁ దనయుఁ ♦ డరయఁ దండ్రికిఁ జేయు నవియెల్ల బో
యే నీకు జేయంగ నిటు నేఁడు వలసె ♦ నే నింక నేమందు నేమి సేయుదును
రామలక్ష్మణులును రవితనూజుండు ♦ యామినీచరపాలుఁ డగు విభీషణుఁడు
భీమవిక్రమలీలఁ బెంపొందకపులు ♦ నా మర్మములు దూర నాటియున్నారు
అట్టి నా హృదయశల్యంబులో పుత్ర ♦ నెట్టనఁ బెఱుకక నేఁ డెందుఁ జనితి
నా పాలి దయుమయ్యగా తేజమయ్యు నా పుణ్యఫలమయ్యు నా భాగ్యమయ్యు
నా పెంపు గతియయ్యు నా కీర్తిమయ్యు ♦ నేపారనో పుత్ర యెంచిన వెల్ల
నీవమై యుండుదు నీ పుట్టిదుడుకు ♦ చావఁ జూచితి నింక జన్మ మేమిటికి
ఈకష్టశోకాబ్ధి యెట్లు తెగకీద ♦ నాకు నెయ్యది తెప్ప నలినాప్తతేజ
నినుఁ గొని రాముని గర్జింతుఁ బోర ♦ నని నమ్మియుండితి నదియును దీరె

ఆశలన్నియుదీరె నకటయేనింక ♦ నీశోకదవవహ్ని నెరియంగఁజాల [ది
ననియనిశోకించియుండందపాగిలి ♦ ఘనసుతుఁదగుయుగ్రమ్మఱమూర్ఛనొం
యున్నదశగ్రీవుఁడుగ్రప్రభావు ♦ నున్నతాత్ములుమంత్రు లొయ్యనఁ దెలుప
బహురోషశోకము ల్పలిసి నిశ్వాసములు ♦ పలుమఱుముడిచి నడఁబరవసంబొప్ప
నేదినకిన్కమై నేదిక్కు చూచెఁ ♦ చూచినదిక్కున స్రుక్కి రాక్షసులు
ఘనభీతిఁ బఱవ రాక్షసలోకవిభుఁడు ♦ కనదుగ్రదంత సంఘట్టనరవము
లతిభయంకరవృత్తి నప్పుడుదిశలఁ ♦ బ్రతిరవంబొనరింపఁబదిముఖంబులను
గనుఁగవలను నగ్నికణములుదొరఁగ ♦ దనమంత్రివరులనవ్వఱఁజూచి పలికె
విడువనితపమున వేధమెప్పించి ♦ పడసితిశస్త్రాస్త్ర పంక్తులు పెక్కు
ఎన్నఁడునపజయం బెఱుఁగ యుద్ధముల ♦ నెన్నఁడునేశోకమెఱుఁగ జిత్తమున
నిరుపమస్థితినొప్పు నీలాభ్రమనఁగ ♦ బరమేష్ఠి మెప్పించి పడసినజోడు
గైకొనిరథమెక్కి కదలితినేని ♦ నాకనాయకుఁడైన నను గెల్వఁగలఁడె
నలినసంభవుచేత నాఁడేనుగొన్న ♦ విలునమ్ములును మీరు వేగంబతెండు
వాఁడిమిమీఱంగ వడిఁగిట్టికలన ♦ నేఁడు నేగొల్తు నానృపులను గపుల
నని పేర్చి ప్రళయవాలాగ్నియుఁబోలె ♦ మనమున జాజ్వల్యమానుఁడై యుండి
దివ్యవాద్యములతో దిక్కులు మెఱయ ♦
నవ్యాఙ హాస్ఫాల నంబుసేయుచును [యె
అనియెనిట్లుగ్రుఁడై యధికరోషంబు ♦ పెనఁగొన మఱియును బేర్చియిట్లని
నేఁడునాతమ్ముల నేఁడునాసుతుల ♦ నేఁడునాబాంధుల నేఁడునాభటులఁ
జంపెను సీతకై చనుదెంచి కడిమి ♦ పెంపార రాముఁ డభేద్యుఁడై పేర్చి
యాయింద్రజిత్తు మాయాసీతఁ జంపె ♦ నాయుపాయంబు నిరర్థకంబయ్యె

—:* రావణుండు సీతను దెగవేయఁ బోవుట *:—

నేనింకనిజముగా నిప్పుడపోయి ♦ జానకి దెగటార్చి చలముసాధితు
నని హస్తమునఁ జంద్రహాసంబుబూని ♦ తనరినపదఘాతి ధరణిగంపింపఁ
జనుచుండ వృద్ధరాక్షసమంత్రివరులు ♦ దనరంగనూహించి తమలోననని రి
దశరథాత్మజుల నీదశకంధరుండు ♦ నిశితబాణంబున నిర్జింపలేఁడె
కైకొనకీతఁడు కడిమిమై సకల ♦ లోకపాలుర నాజిలో మున్ను గెలిచె
నోలిమరుత్తుల నుగ్రాహవమునఁ ♦ దోలెను సలువలఁ దొమ్మండ్రఁ గెలిచె
నినమంద్రువసువుల నేపడఁగించె ♦ ఘనతతోఁ గొమ్మినిగ్రహములనడఁచెఁ
దెగువబన్నిద్దరాదిత్యులనొంచెఁ ♦ బగ గెల్చి రుద్రులఁ బదునొక్కరుండ్ర
నరుదారగంధర్వ యక్షరాక్షసుల ♦ నురగులగరుడుల నుగ్రదానవుల
నతిభీతిపొందించె నారసిచూడ ♦ నితనికి సరులన నెంతటివారు

తమకించి సతిఁ జంపఁదగవు గాదనుచు ♦ సమవర్తి బోలెనా సమయంబునందు
లోకభయంకరాలోకుఁడై తివిరి ♦ నాకేంద్రవైరి జానకిఁ జంపఁ గదిసె
అప్పుడప్పాపాత్ము నత్యుగ్రదృష్టి ♦ కప్పుణ్యవతి స్రుక్కి యనద చందమున
నొందిన భీతితో నుగ్రగ్రహంబు ♦ ముంగట నిల్చిన మోదంబుఁ దక్కి
పడియున్న రోహిణి పగిది నా సీత ♦ పతితుఁడౌ రావణు భావంబుఁ జూచి
యీదురాత్మునిచేత నింకఁ జావవలసె ♦ హా దైవమా యని యతిబాధ పొంది
దురమున నింద్రజిత్తుఁడు చచ్చుటెఱిఁగి సురవైరి చంపవచ్చుచున్నవాఁడో
కాక యా రామలక్ష్మణుల జయించి ♦ చేకొని నన్నుఁ జంపఁ జేరుచున్నాఁడో
వీని చేచావ నా విధి చేరఁబెట్టె ♦ నేనేమి సేయుదు నీ మీఁద నింక
నక్కటా దైవంబ యతిపుణ్యధనులఁ ♦ బెక్కుసంకటములఁ బెట్టితే తెచ్చి
రామాభిరాముల రామలక్ష్మణుల ♦ నా మీఁదఁ బగ నంచు నలినాయతాక్షి
వలవించి పలవించి ధ్యానమధ్యమున ♦ నెలకొన రఘురాము నికమూర్తి నిలిపి
పరవశయై తూలి పడి మూర్ఛవోయె ♦ ధరణిపైఁ బడియున్న ధరణిజఁ జూచి
ధరణిజ దెసఁ జల్లు దశకంఠుఁ జూచి ♦ కరము శోకించి రాక్షసులెల్లఁ గలయ
హాహానినాదంబు లందందఁ జేయఁగ ♦ నోహో గురుంతమీ యుగ్రకృత్యంబు
అనుచుండ నత్తఱి నమరారిఁ జేరి ♦ ఘనుఁడా సుపార్శ్వుఁడు ఘననీతిధనుఁడు
వెఱవక తననీతి విధవంబు మెఱయఁ ♦ దొడఁ బ్రసన్నతఁ దెస బోధించుచుఁ బలికె
ధాతపులస్త్యుండు తాఁ బ్రసిద్ధుఁడైన ♦ సజ్జనుఁడు రుచిర శోభితవిశ్రవసుఁడు
నీవు వేదాగమవిధులఁ గనినావు ♦ భావింప కేలఁ దుర్భావుఁడవయితి
తగదు తమస్త్రీలఁ దవిలి వధింపఁ ♦ నగణితంబగు దోషమెఱుఁగానవలదు
ఈకోపము తీయ నెల్లి యుద్ధమునఁ ♦ గైకొని రామలక్ష్మణులపైఁ జూపుఁ గూడ
మని చెప్పి యా చంద్రహాసంబు పుచ్చి ♦ కొని సుపార్శ్వుఁడు దోడ్కొని వచ్చెను
అంతనా దశకంఠుఁ డధికరోషముఁ ♦ జింతించి విన్ననై చిత్తంబునందు
మఱపు పుట్టని పుత్రమరణాతురముఁ ♦ మఱుఁగుచు నాస్థానమంటపంబునకు
జనుదెంచి కొలువుండి చలము వేమఱుఁ ♦ తన మంత్రి బాంధవ తతులరప్పించి
కొందలమందుచుఁ గొడుకు చందంబు ♦ మదినగ్గడించుచు మౌనతనుండె

—*: ఇంద్రజిత్తుభార్య సులోచన శోకించుట :*—

అంతఃపురంబున నతివలు గూడి ♦ చింతింపఁగా విని శేషునిపుత్రి
యైనసులోచన యాత్మేశుచావు ♦ విని చాల వగచుచు వివశతనొంద
పొలుపొందగా బెద్దప్రొద్దుకుఁ దెలిసి ♦ తెలుపఁగా నొకకొంత తెలివొంది కుంది
నానావిధంబుల నాథునిఁ గూర్చి ♦ యానసంబదరఁ బ్రలాపింపఁ దొడఁగె
హా ప్రాణనాయక హా జీవితేశ ♦ హా ప్రాణనాథ నీవాజిలో నదిరి

యేపారనిన్ను జయించె నేనరుఁడు ♦ చూపోపఁ జాలకఁ జులకఁగాఁ జూచి
పాపపుబ్రహ్మయీపట్లనిద్దఱినిఁ ♦ బాపంగఁదగునె తాత్పర్యంబు లేక
యెప్పుడెక్కడికైన నేఁగుచోఁ బిలిచి ♦ చెప్పిపోదువు నన్ను సేమముప్పొఁగ
నాకుఁ జెప్పక నీకు నాఁ యీచావు ♦ చేకూరునే శత్రుచేత నీలాగు
మాతండ్రి నన్ను ప్రేమము మీఱ నీకు ♦ ప్రీతి నెట్టి పఁగఁ బెండ్లి గావించు
తఱి నీవు జయకాంక్ష దలఁచితివేని ♦ సవికార్యంబులీ సతితోడఁ దెల్పి
అరిగిన నజహరాదుల కజేయుఁడవు ♦ నరులనఁగా నెంత నాకేశవైరి
ఁడనుచు శిరోరత్నమపుడు నా చేతి ♦ కొనరఁ గనిచ్చి నాకొకబుద్ధి దెల్పె
తనయ నీపతి శత్రుతతి మీఁదఁ బోవ ♦ మానుగా తలపయి మణిని వాళించి
పఁపినఁ బగఁ దీర్చుఁ బగతుల నెల్ల ♦ నింపుగాఁ జెప్పిన నీమామ మాట
మఱచియిప్పుడు నీవు మత్వైరిదివ్య ♦ శరవహ్నిచే రణస్థలిని వ్రాలితివి
అకన ప్రాణంబు లాత్మేశునకును ♦ మునుకొని మదిదారఁ బోసియాతణమె
నెసయులఁ జూచి యాతరలాయతాక్షి ♦ ఘనమైన శోకసాగరమున మునిఁగి
భీతిల నేల విభీషణుండుండ ♦ నాతఁడు మన్నించు నధికతేజమున

వర్ధిష్ణులై తనూభవులార మీరు ♦ వర్ధిల్లుఁ డెప్పుడు నరగుణోన్నతిని
న కింకనుండుట న్యాయంబుగాదు ♦ ప్రాకటంబుగఁ గోదు ప్రాణేశుకడకు
ననిముదమందుచు నన్నిటరోసి ♦ మనమునఁ గలవాంఛ మమత రెట్టి పఁ[...
నలయుచు సొలయుచు సురుసురనుచు లలిఁ దూలియుజ పుష్పలతిక చందము
జఱిదశకంఠు నాస్థానంబుఁ జేరి ♦ తనకన్నులను బాష్పతతులు నుదొరఁగ
మదిరాక్షి యేడ్చుచ మమత రెట్టింపనొందుచు ... తో నొయ్యనబలికె
పతివియోగంబైన సతియునాక్షణమె ♦ పతినంటయేగుట పరమధర్మంబు
ఇటుగాన బడినట్టి నరుగంగవలయుఁ ♦ బటుబుద్ధితోడ నాపతికళేబరము
తెప్పింపుమిప్పుడు తీవ్రంబుగాను ♦ పంపుమిప్పుడు భటవర్గబాంధవుల

ననిన నాతఁడు నాత్మ నల్లఁ జింతించి ♦ మనుజాశనుఁడు నాముగువకిట్లనియె
విన్ననై యాహవవిముఖ మధ్యమున ♦ పన్నుఁగా బడియున్నవాఁడతి నీవిభుని
నేను బోయడిగిన నిత్తురే వారు ♦ కాననా చేతను కాదు మృగాక్షి
నీకునసటు మీఁద నే నేమి చెప్ప ♦ భామ నీ వెఱుఁగని పని యేమి కలదు
చెప్పితి నాఁడె తోఁచినవిధఁ బనిన ♦ నప్పన్నలోచన నతఁ డిట్లనియెఁ
గైలాసనగము వేగమె కేల నెత్తి ♦ పాలాక్షుఁ గుసతి ధరమ్ముఁ బట్టిచి
కసఁకమై మూఁడులోకములను గెల్చి ♦ కడిమిగల్గిన మహాఘనుఁడవు నీవు
సురనాథు గెల్చిన శూరుస కిపుడు ♦ నరులెంత వారు వానరు లెంతవారు
నరులలో హీనవానరులలోఁ బడిన ♦ గురుసత్త్వశాలి నీకొడుకు దేహంబు

తే లేను నేనని ధీరత్వ మెడలి ♦ యీలీలనం గాల హేతువో యనుచుఁ
గర మొప్పఁగా బాహ్యకర్మంబులకును ♦ తరుణులు పతిరహితంబైన నగ్ని
సరణిఁ దోఁజన ధర్మసరణి యగుఁగాన ♦ వెఱపక నే విన్నవించిన మాట
నెగ్గుగాఁ గొన కానతిచ్చి నన్నుపు ♦ దిగ్గునఁ బతిఁ దెచ్చుకోవలయు
ననిన నా దశకంఠుఁ డతివ వీడ్కొలుప ♦ మానిసియును తన మామకు మ్రొక్కి
మెలుపైన దోలుకరి మెఱుపుచ దమున ♦
    కలితమౌ తన మేని కాంతిజాలములు
తలకొని భూనభోంతర మెల్లనిండ ♦ జలరుహనేత్రి నిశ్చలబుద్ధి చేత
వినువీథి రాఁ గపివీరులందఱును ♦ మనమున నాశ్చర్య మగ్నులై చూడ
నంతఁ గొందఱుఁ గొప్పయాశ్చర్యమునను ♦ కింతి రెప్పలువిచ్చి వేవేగ చూడ
వెఱఁగొందుచున్న యా వెఁదులు మేటి ♦ సురపురినుండి యీసుదతీలలామ
దేవత లంపిన జయలక్ష్మి గాఁడ ♦ దేవుని కడ కేఁగ దెంచెనో కాక
తనయుఁడు మృతుఁడైన దశకంధరుండు ♦ మనమున రోషంబు మెఱయింత లేక
కక్కస బుడిగి వేగ మొసీరెణము ♦ నెక్కించి మగుడ నంపించెనో గాక
కక వేఱొక దేవకాంతయో నిందు ♦ రాఁగారణంబేమి రయమున ననుచు
అంగదసుగ్రీవు లాంజనేయుండు ♦ సంగరస్థలినున్న తరుచరాధిపులు [దు
వెగడొప్ప శ్రీరామవిభుఁడు లక్ష్మణుఁడు ♦ దొడ్డ గొని చోద్యమందుచునుండి రపు
పరమపావనుఁడైన పవమానసుతుఁడు ♦ వెరవున నాకాశవీథినే తెంచు
భామినీమణిఁ జూచి పరఁగ రామునకు ♦ తామసింపక వేగఁ దగ విన్నవించె
ఈ మానవతి మది నెంచఁగా దేవ ♦ భామ కాదిది ధరాపుత్రియు కాదు
మానుగాఁ బతిలేని మగువయే కాని ♦ దానికి దిగొ ప్రత్యక్షంబు గలదు
అప్పుడంతుక యున్న యరదంబు మీఁదఁ ♦ గప్పినఘనాళి రాఘవ విలోకింపు

—*. సులోచన శ్రీరాముల నుతించుట :*—

మని చూచుచుండ నయ్యబ్జాక్షి వేగ ♦ చనుదెంచి యరదంబు చయ్యన డిగ్గి
పుత్తడిబొమ్మయో పొసఁగఁగ మొదల ♦
    కొత్తగుముత్తెమో కొదమరాయంచో [గ
యొసఁగ సన్నపు నడుము పసియాడుచుండ గనుఁగవలను బాష్పకణములు దొరు
నందండఁ దూలుచు సురుసురనుచు ♦ మందయానంబున మగువ రాఘవుని
గదిసి పాగిలి నమస్కారంబు సేసి ♦ ముదితహస్తంబులు ముకుళించి నుదుట
రవికులాంబుధిసోమ రామాభిరామ ♦ ప్రవిమలగుణధామ పరరాజభీమ
జలదసన్నిభగాత్ర సారసనేత్ర ♦ విలసితచారిత్ర వితతపవిత్ర
కలశాబ్ధిగంభీర కరకాద్రిధైర్య ♦ లలితోక్తిమాధుర్య లావణ్యధుర్య

జననాథ నీపాదసంసేవకతన ♦ యెనయు నాపాపంబు లెల్లను బాసె
ననివిన్నవించుచు నరనాథునెదుట ♦ వినయంబుతో నున్న వెలఁది వీక్షించి
మానవేంద్రుని జానుమతిమీఁద జేరి ♦ భానుతనూజుఁ డాపడఁతి కిట్లనియె
నెలనాఁగ నీ వెవ్వ రిచటికిఁ బ్రుడు ♦ వెలయంగ నద్భుత విధ మేమి నేఁడు
వెలఁది నీ పేరేమి విభుఁడు నీ కెవఁడు ♦ పొలుపొందె నెవ్వని పుత్త్రివి నీవు
చెప్పు మేర్పడ నీదు చందంబ టన్న ♦ నప్పు డప్పడఁతి తా నశ్రువు లొలుక
ఘోరుజనిను భోగిపతి నాదు తండ్రి ♦ యేను సులోచన యిది యనాపేరు
నాదునాథుఁడు మేఘనాథుఁ డాపుణ్య ♦ ప్రాకటబహుభోగ భాగ్యశీలుండు
నధిక బాహాటోపుఁ డధిక తేజుండు ♦ కదనభీకరుఁడు వాసవభంజనుండు
కడిఁది శూరుఁడు దశకంఠ నందనుఁడు ♦ కడఁక మందోదరీ గర్భసంభవుఁడు
అని చెప్పి శ్రీరాము నతివ వీక్షించి ♦ మనమున నతిశోక మగ్నయై పలికె
నిట్టి శూరుని రాఘవేంద్ర నోర్వఁ ♦ బట్టి చంపితి కృపాపరుల య్యెమీర
లెట్లు చంపితి రయ్య యినకులాధీశ ♦ పుట్టునే యిటువంటి భూరివిక్రముఁడు
పతివియోగాగ్ని చే బడఁ తొలుమదిని ♦ పరితాప మొందెద పలు తెఱంగులను
ఎఱుఁగవే సర్వజ్ఞ సౌఁబిఁగాసి ♦ ధరణిజ వైధవ్యంబు దాల్పఁగఁ గలనె
శరణార్థి రక్షక సదయాంతరంగ ♦ పరిపూర్ణ హృదయ శోధ సకృపాపాంగ
మఱుఁగుఁ జొచ్చితిఁ గాన మన్నించునట్టి ♦ బిరుద నీబిరుదు రూపింప నా విభుని
మరలఁ బ్రాణము లిచ్చి మన్నించు నాకు పురుషభిక్షము పెట్టి భువి నన్ను నిలుపు
మనుచుఁ బ్రార్థించిన నవనీశ్వరుండు ♦ ఘనదయాపరమూర్తి గాన నయ్యాతి
పురుషుని బ్రతికింప బుద్ధి నూహించు ♦ టెఱిఁగి మారుతియును మఱి విన్నవించె
నిది యేమి రాఘవ యెఱుఁగ రే మీరు ♦ వదలక యాబ్రహ్మవరము తప్పి ప
నీతి యేమీరు మానినికిఁ జెప్పి ♦ ధాతను మన్నింపఁ దగును భూ [illegible]
యని మారుతాత్మజుఁ డాడు వాక్యములు ♦ అనవినిద పోసియు పుడిట్టులనియె
జలజాక్షి యీ కొఱకు జన్మంబునందు ♦ కలసెదు భువి పెద్దకాలంబు దాఁక
పెక్కు సంపదల చేఁబెం సంసార ♦ యక్కజంబుగ భోగ మనుభవం బొంది
యామీఁద వైకుంఠ మందు నిర్వృతు ♦ కామితార్థోన్నతి గాంతురు గాక
యని సంతోషించి యతిదయాపరుని ♦

వినయపూర్వకముగా వినుతింపఁ దొడఁగె
ననయాంతరంగ శోధ నకృపాపాంగ ♦ సదమలగుణధీర సాధుసాంగత్య
పరఁగ నా పతికళేబరము తెప్పించు ♦ పురమున కతివేగఁ బోషంగ వలయు
ననవుడు సుగ్రీవుఁ డపుడిట్టులనియె ♦ వనజలోచన పతివ్రత వౌదు వేని
నీ మపురుషునితోడ నీ చందమొల్ల ♦ తగ బల్కు మిప్పుడు తడయక ననినఁ

గడువేగమునఁబోయి కదనరంగమున ♦
దడయక చొచ్చి యా తరలాయతాక్షి
పడియున్న తలఁ జూచి పలు తెఱంగులను ♦ అడలుచు పతిఁ జేర నరిగి యు దుఃఖ
జలధిలో మునిఁగి మూర్ఛయుఁ బొంది తెలిసి ♦
పలువిధంబుల బడి ప్రాణేశు మీఁద
నెలుఁగెత్తి హా యని యేడ్చి ధైర్యంబు ♦ నిలిపి సుస్థిరమున నిలిచి యా లేమ
పలికె సత్యప్రభా భాసితయగుచు ♦ వలనొప్ప నా మనోవాక్కాయకర్మ
ములయందుఁ బతిభక్తి మొనసితినేని ♦ సలలితధర్మ సంచారంబునందు
పతియె దైవంబని భావంబులోన ♦ సతతంబు వ్రతముగా సలుపుదునేని
చెలఁగి నా విభునకు జీవంబు వచ్చి ♦ యలమి నాతో మాటలాడుఁ గాకనుచు
అనితమ యాత్మ మర్యాదలు కొంత ♦ యనినఁ గన్విచ్చి దశాస్యనందనుఁడు
నెలఁత చంపినవాఁడు నీ తండ్రిగాఁడె ♦ తలపోయ నొరులకు తన మెన న్నెల్ల
నిలిచి యుద్ధము సేయ నిమిషమందైన ♦ బలుచింత పడ నీకు పని లేదు వినుము
తనదు ఋణానుబంధము గూడియున్న ♦
నెనసి యుందురు నరులింతులఁ గూడి
వెలయుఁగ యోగవియోగముల్ బ్రహ్మ ♦ వెలయంగ గల్పించె వెలఁది జీవులకు
ఇటుగాన మతి కాలహేతువుగాన ♦ కుటిలకుంతల యిట్లు కూలితి ధరణి
జగమని కన్నులు చయ్యన మూసెఁ ♦ గని మదిలోఁ జింత గడలుకొనంగ
నప్పుడు బహుదుఃఖ మైకొంత సేపు ♦ అప్పలఁ తందుండ నతివేగ వచ్చి
శ్రీరాము విభునకుఁ జేతులు మొగిచి ♦ యారాము వినుతించె నతి మోదమునను
నప్పుడు రఘురాముఁ డంగదుఁ బిలిచి ♦ యిప్పుడఁ తుకపతి నిప్పింపుమనిన
తరమిడి యారామ ధరణీశునాజ్ఞ ♦ తల నిడి యాయింతి పతికళేబరము
నిచ్చిన యురముపై నిడి రాఘవునకు ♦ నచ్చపు భక్తితో నతివ వీడ్కొలుప
నతివేగమున పురి కప్పుడే పోయి ♦ యతివ మందిరమున కప్పుడు పోక
వామాక్షి పతికళేబరము చందగిన ♦ భూమిని నిల్పి కాపుండఁగాఁ జేసి
యంతఃపురంబున కటు చేర నరిగి ♦ చింతించి తన మదిఁ జింతించి మఱియుఁ
దన పుత్రులను ప్రేమ దగఁ జేరఁ దీసి ♦ కనుఁగవలను బాష్పకణములు దొరుగ
శిరము మూర్కొని ప్రేమఁ జెక్కిలి నొక్కి ♦ కరమర్థితోఁ దన కౌఁగిటఁ జేర్చి
సుతులార మీ ముద్దు చూడంగ నాకు ♦ హితవు మీఱఁగ దైవమియ్యక పోయె
మహిమీఁద నుండ ధర్మము గాదు తనకు ♦
సహగమనంబు నిశ్చయముగాఁ గూర్తు
నిక్కడ నుండుట యిది బుద్ధి కాదు ♦ తక్కక పొందు పాతాళంబునకును

స్థిరబుద్ధి మీరాది శేషునియింట ♦ వెఱవకుండుఁడటంచు వేగంబె పంపి
కడువేగమున దశకంఠుసన్నిధికి ♦ గడగడవడఁకుచుఁ గమలాక్షి పోయి
విన్ననై వదనారవిందంబు వాంచి ♦ కన్నీరు విడిచి గద్గదకంఠ యగుచుఁ
గరములు మొగిచి యగ్గపుభక్తితోడఁ ♦
బురపురఁ బొక్కుచు పొలఁతి మామకును
బోయినవృత్తాంతమును విన్నవించి ♦ కాయము దెచ్చిన క్రమ మెఱిఁగించి
రామచంద్రుని దయారసము లక్ష్మణుని ♦ ప్రేమాతిశయము విభీషణుకూర్మిఁ
గపికుంజరుల పరాక్రమము నామహిమ ♦ విపరీతమని చెప్ప విని రావణుండు
విన్ననై మోమున వేడుక లేక ♦ తిన్నని స్వరమునఁ దెలిసి తెలియక
యాయింతి తెగువయు నాయింతి తెలివి ♦
నాయింతిసమబుద్ధి కామహామహిమ
కాయింతిపతిభక్తి రాయింతి వేగఁ ♦ గాయము దెచ్చిన క్రమశక్తియుక్తి
కేమనఁజాలక యేయుత్తరంబు ♦ కోమలికియ్యకఁ గొంతుకుచున్న
కనిసులోచన దైవకారణంబునకు ♦ మనమునఁ జింతించి మఱియేలయింక
నాకానతీవయ్య నాకేశవైరి ♦ యేకచిత్తంబున నేగదనింక
ననఁగ వ్యాకులచిత్తుఁడై రావణుండు ♦ తనదుకోడలి మోము తప్పక చూచి
యాయింతి తెగువయు నాయింతి తెలివి ♦ పాయక యిఁక నిల్వఁబట్టరాదనుచు
నేమి చెప్పుదు నీకు నిందీవరాక్షి ♦ నీమదిపూనిక నీతెఱ గదియు
ప్రియసుతాగ్రపుఁ జంపిభీతులచేత ♦ భయదుఃఖవార్ధిలోఁ బడియున్నవాడ
నాకేమితోఁచదు నాతియీమీఁద ♦ నీకుఁదోఁచినజాడ నీవేగుమనిన

—:* సులోచనా సహగమనము సేయుట *:—

తరలాక్షి మ్రొక్కి సంతసమందిమదిని ♦
కరమొప్పదనకు భాగ్యము గల్గెననుచు
గృహమునకేగి కోకిలవాణి తనదు ♦ సహవాసులౌ పెక్కు సతులు గొల్వంగ
దశకంఠునానతిఁ దగుబాంధవులను ♦ దశదిశల్నిండ మృదంగనిస్సాణ
పటహభేరీశంఖ పటుకాహళాది ♦ చటులనాదములు విచ్చలవిడి మ్రోయ
సతతనిశ్చలకృత స్నానయై యపుడు ♦ నతివేగమునను గార్యార్థియై యచట
సిరిపట్టుఁబుట్టంబుఁ జెలువొందఁ గట్టి ♦ సరసతరరత్న భూషణములుఁ బెట్టి
పువ్వులదండలు పొలుపొందవేసి ♦ యవ్వారిగాఁ జుట్టి యాణిముత్తెముల
సూచకంబొనరించి సుందరినొసలఁ ♦ బ్రాచుర్యగంధ లేపనము గావించి
తిరమొప్పఁగా నింద్రజిత్తుదేహంబు ♦ కరమొప్పఁగా నలంకారంబొనర్చి
మంచివస్త్రంబులు మహితభూషణము ♦ లంచితశృంగార మలవడఁ జేసి

వరవిమానంబుపై వరుఁదెచ్చి పెట్టి ♦ వరవాద్యతూర్య రావంబును చెలఁగ
బ్రేతాగ్నులనుగొంచు దిరముగా దైత్య ♦
లాతతంబుగ వెంటఁ నరుగు దేరఁగ
వెతుకొని వేదోక్త విధిపూర్వకముగ ♦ మోసి యుత్తరభాగమునఁ జితి పేర్చి
యాగశాలైనము త్రైదులకపుడు ♦ బాగైనపసిఁడి శూర్పములు దానముల
నిచ్చి వస్త్రంబు లనేకంబులొసఁగి ♦ యుచ్చపుభక్తితో నాచితిమీఁద
బరఁగఁ బ్రవేశించి ప్రాణేశునురము ♦ కరమర్థితోఁ దనకౌఁగిటఁ జేర్చి
యనలంబుసంధింప నాయింతి మేను ♦ పనిగొనిపతి సమర్పణముగాఁ జేసి
సకలదేవతలును సన్నుతుల్సేయఁ ♦ బ్రకటంబుగాఁ దనపతితోడఁ గూడి
దేవవిమానంబు తెఱఁగొప్ప నెక్కి ♦ దేవతాకోటిలోఁ దేజరిల్లుచును
గడువేడ్కఁ బుణ్యలోకంబునఁ జేరి ♦ పడఁతియుండెను దనపతితోఁ గూడి
యంతట రావణుఁ డధికకోపమున ♦ నంతయు మూలబలాళిరప్పించి
చలము నుబలమును సమరనైపుణియుఁ ♦ గలసైనికులనెల్లఁ గలయనీక్షించి
కపులను రామలక్ష్మణులమీఁ రేఁగి ♦ నపమారనిర్జించి నెఱిఁబగఁదీర్చి
రండుపొండనవుడు రథసంబుతోడ ♦ నొండొరుఁగడచుచు నుద్దండవృత్తి
సామజఘోటక స్యందనసుభట ♦ సామగ్రితో యుద్ధసన్నద్ధులగుచు
వజ్రసమానేక వరసాధనములు ♦ వజ్రాంగులాదిగా వలయువర్మములు
కరమరుపయి భయంకరలీలదనర ♦ ధరియించిమించి యుదగ్రులై పేర్చి
కరఘటాఘీంకార ఘంటికానేక ♦ తురగోగ్రహేషిత దుందుభిశంఖ
పటహాఘమామికా పణవాదివాద్య ♦ పటురథసధ్వజ పటపటాత్కార
రథనేమిశింజనీ రావసంకులము ♦ మథితార్ణవధ్వనిమాడ్కి ఘూర్ణిల్లఁ
బలుధూళిజలరాశి పట్టుగయ్యంపు ♦ గలనుసేయఁగ నేగు కరణిఁ బెల్లెగయ
బింకముల్జంకె నల్పప్రథుతరఘోర ♦
హుంకారములును నొండొరులపంతములు
నంకించునెలుఁగులు నార్పులు చెలఁగ ♦ నంకితమణికుండలానేకహార
కంకణకోటీర కాంతులునిగుడ ♦ లంకేశుసైనికుల్లంక వెల్వడిరి
భూకంపమొపఁగ నార్పులు దిన్నుముట్ట ♦ భీకరగతినేచి పెనుబొబ్బలిడుచు
ఘనసత్త్వముసఁ బేర్చి కపికులాంభోధి ♦
గనుఁగొని బెగడొందఁగా నుత్సహించి
కడఁకతోనపుడు లంకావార్ధి వెడలఁ ♦ బడబాగ్నికోటులభంగి శోభిల్లి
కాటుకకొండలగతిఁ దనరారు ♦ మేటిదైత్యులఁ జూచి మిగిలి నకడకఁ
నప్పుడుకపివీరు లార్పులునిగుడ ♦ నుప్పొంగిచెలఁగుచు నుడుపదంబవియఁ

క్రుంకిదిగ్గజములు కుదికిలఁబడఁగ ♦ నింగికిలంఘించి నేలకుడాఁటి
బ్రహ్మాండమగలంగ బాహువుల్సరచి ♦ బ్రహ్మాదిదివిజులు పరికించిచూడఁ

—*: మూఁకబలయుద్ధము :*—

కొండలుతరువులు గోటానకోట్లు ♦ గండశైలంబులు కడువడిఁజెఱికి
కొనివచ్చి తాఁకిరి క్రూరులైయంత ♦ ననిలోనరఘురాము హస్తవైచిత్రిఁ
గనుఁగొనువేడుకఁ గపులబాంధవుఁడు ♦
చనుదెంచెననఁ బూర్వశైలాగ్రమెక్క
వననిధివననిధి వడిఁదాఁకునట్లు ♦ దనుజబలంబును దరుచరబలము
నొండొంటిదలపడియుగ్రతమెఱయ ♦ మెండుగాఁ గపిసేనమిగులంగఁజొచ్చి
యరదముల్విఱుపుచు హరులదోలుచును ♦
గదులుడీకొలుపుచుఁ గవిసిరాక్షసులు
మునుమిడినొప్పింప మొక్కలంబునను ♦ వనచరుల్దరులెత్తి వైవంగనపుడు
వాటులవ్రేటుల వడినిందుసందుఁ ♦ జోటులఁగాటులఁ బొరినందునిందు
గరవాలములభయంకరవాలములను ♦ ఖరఖడ్గములఁ గదాఘనదండములను
బరశులఁబరిఘులఁ బట్టసంబులను ♦ గిరులనుదరులను గిరిశృంగములను
దరుచరుల్వైవంగ దనుజులువైవ ♦ ధరణిపై శోణితధారలుదొరుఁగ
వనచరుల్గొండలువాలయంత్రములఁ ♦ గొనిమీఁదవైవ నాకొండలనదుము
యుత్తములై నేల దూఱఁగఁజక్రంబు ♦ లెత్తివ్రేసియుగద లెత్తిమోదియును
సరిపోరిరొండొరుల్బలమునఁగిట్టి ♦ సురలద్భుతంబంది చూడంగనపుడు
కరులనుహరులను ఘనరథంబులను ♦ పరిఁదోలికపుల రాక్షసులు నొప్పింప
వనచరేశ్వరుఁడును వాలినందనుఁడు ♦ ననిలజుండునునీలుఁడాదిగాఁగలుగు
వగచరప్రముఖులు నధికవేగమున ♦ నగపాదపములవానలు వెసఁగురియఁ
బరియలై పడియెడు బహురథంబులును ♦
గరముగ్రగతిగూలి కరిసమూహములు
నఱిముఱిగెడయువాహనములు నేల ♦ కొఱగుదానవులుసై యుండంగగినిసి
రథరథ్యవేగంబు రథికులగ్గింప ♦ రథములుపఱపి సారథులుబిట్టార్వ
రథములు తమతమనొరథములకరణిఁ ♦ బృథివీతలంబెల్లఁ బెల్లుగానద్రువఁ
గవిసినకడనొక ల్కరములఁబట్టి ♦ యువలీలదివికెత్తి యువనిపైవైచి
తురగముల్గోలినఁ దోలఁగకకపులు ♦ తురగంబుతోనెత్తి తురగంబువ్రేసి
కరులడీకొలిపినఁ గరులపైఁగవిసి ♦ కరిఁగరిఁదాటించి గములకునుఱికి
డాకాలనొక్కని డాకెలనొకని ♦ నాకేలనొక్కని నాకాలనొకని [ను
నదిమినొంచియునదరంటవ్రేసియును ♦ గుదియించివైచియుగూలదగ్నియు

బెక్కువిధంబులఁ బేర్చి రాక్షసుల ♦ నిక్కుటక్కడ సేయు నెడఁ బెచ్చు పెరిఁగి
తురగ కరిం ఖాదుల ధూళికప్పటయుఁ ♦ దరుచ రాధిపులును దానవాధిపులు
నరుదైన యానిబిడాంధకారమునఁ ♦ గరవాల రోచులఁ గలకలంబెసఁగ
వీరు వారును బోర వెడలినరక్త ♦ ధారామరీచులు దఱచుగాఁ గవిసి
బలురేణువను తమఃపటలంబు నడపఁ ♦ జలమరికయ్యంబు సందడియైనఁ
గుంజర రథ తురగ ఘోటకమకర ♦ పుంజధ్వజానేక భూరుహాసుభట
కరకాండకల్లోల ఖడ్గపాఠీన ♦ కరికరోరగ ఖేట కచ్ఛపనికర
వికలభూషణరత్న విసరవికీర్ణ ♦ శకటసైకత కేశజాలశైవాల
జనితచామరఫేన చయరక్తనదులు ♦ వనచరుల్దనుజులు వడిదాఁటిదాఁటి
తాఁకుదురాలోనఁ దరుచరుల్గినిసి ♦ పీఁకఁ గోలెమ్ములు విఱుగనొక్కియును
మోఁకాళ్ల మో చేత ముష్టినందంద ♦ తాఁకించిపడఁదీసి తలలుద్రొక్కియును
బొట్టలు చీల్చియుఁ బోసీక పట్టి ♦ చట్టలు వాపియుఁ జదియ వ్రేసియును
గఱదియు విఱచియుఁ గడకాళ్లుపట్టి ♦ జిఱజిఱఁ ద్రిప్పియుఁ జిదిమి పైచియును
బలువిడి వలలోఁగిఁ బట్టి వెంట్రుకలు ♦ పెళపెళ మసఁ బెల్చఁ బెఱికి పైచియును
నిరుచేతులందును నిరువురఁ బట్టి ♦ పోరిఁ బోరి దాటించి పొల్లుసేయుచును
నరసిరంధ్రంబుల నెత్తురులొల్కఁడల ♦ నురువడిఁ బడఁద్రోచి యురములు సరచి
నఖరదంతంబుల నాసికాకర్ణ ♦ ముఖపాలపట్టికల్ మసరిత్రెంచియును
నొప్పించియును గపులుఱ్ఱూఁ రొక్కొకని ♦

నుప్పొంగ కొంకొక్కం డొసరనూర్వరను
బట్టిచంపియుఁ జలబట్టి దానవుల ♦ నట్టిట్టుపోనీక యవనిపైఁ గూల్చి
చిందరవందర సేయఁగ నప్పు ♦ డంత వెసఁ జూచి యధిక రోషమున
ధరణి గంపింప దిక్తటములు వగుల ♦ శరధులుగలఁగ మజ్జగములు బెగడ
దారుణాకారులై తద్దయుఁ బేర్చి ♦ భేరీ మృదంగ గంభీర వాద్యములు
చెలఁగి చి యక్కపిసేనపైఁ గవిసి ♦ బలసూదనాది దిక్పతులు భీతిల్ల [లును
వికృతమస్తకములు వికృతహస్తములు ♦ వికృతప్రకోష్ఠములు వికృతోష్ఠములు
వికృతనఖంబులు వికృతముఖములు ♦ వికృతగాత్రములును వికృతనేత్రములు
వికృతహాసములును వికృతనాసములు వికృతవక్షములును వికృతకక్షములు
వికృతకర్ణములును వికృతవర్ణములు ♦ వికృతపాదమును వికృతనాదములు
గలసైనికులు లయకాలాగ్నిపజ్జ ♦ బలువిడివిడివడి పటు తెంచు కరణిఁ
బరిఘగదాచక్ర పట్టసప్రాస ♦ పరశుతోమర భిండివాల త్రిశూల
కరపత్ర కుంత ముద్గర యష్టి పరశు ♦ కరవాల ఖేటక క్రకచాసినాగ
ముఖశిలీముఖచాప ముసలాయుధాది ♦ నిఖిలసాధనములు నెరయఁగఁ బూని

నరికియు నడిచియు నలియ మోదియును ♦
నురువడఁ జిమ్మియు నొనరఁ గుమ్మియును
వ్రేసియుఁ బోడిచియు వీఁక వైచియును ♦ నేసియుఁ గోసియు నీరీతిఁ గపుల
నొప్పింప నంతయు నొచ్చి భీతిల్లి ♦ యప్పుడుం దిరుగిరు లవనిపై వైచి
మన కేల యుద్ధంబు మన కేల చలము ♦ నిన కులేశ్వరుఁ డేల యినసూనుఁ డేల
యడవిలోఁ గాయ పండాకులు నమలి ♦ కడుపు నించుక యుండఁ గానవచ్చి
మదిమది నిచ్చట మడియంగ నేల ♦ పదపదండని కపితులు రాఘవుల
విడిచి దైర్యంబులు విడిచి రాక్షసులు ♦ విడువక చలమున వెను వెంటఁ దఱుమ
సేతువు దిక్కుకై చెడిపాఱునపుడు ♦ వాతూలసుత నీల వాలినందనులు
గని సేతువును దాఁటి గ్రక్కున నెందుఁ ♦ జనకుండ మరలింపఁ జను దెంచి భీతి
వనచరుల్దన వెన్క వచ్చి చొచ్చుటయు ♦ గనుఁగొని రాముఁడక్క పివరులెల్లఁ గ

—:* శ్రీరాముఁడు మూలబలముపై మోహనాస్త్రము వేయుట *:—

దనుజుల మనములు తల్లడంబంద ♦ ధనువందుకొని గుణధ్వని సేసిడాసి
కరలాఘవము చిత్రగతి నొప్ప మెఱయ ♦ శరములు గురిసి నిశాచరుల్బెగడి
తెరువులు గానక తిరుగుడువడుచుఁ ♦ దెరయు మరలియుఁ దీవ్ర కోపమున
ధరణీశుఁ గానరా ధరణీశుఁడేయు ♦ శరములు తెఱచున సమరాంగణమున
రవికులతిలకుండు రభసంబుతోడ ♦ వివిధ భంగులఁ దనవిలువిద్య మెఱసి
యేసిన శరముల నేకంబులగుచుఁ ♦ గాసి సేయుచుఁ దాకఁగా దైత్యవరులు
నడుమునఁ దెగియు నెన్నడిమికిఁ దొడకు ♦
కడిఖండమయ్యు వక్షములు వ్రస్సియును
వదనముల్వ్రాడి భావంబులఁ జెదరి ♦ పదములు దునియలై బాహువుల్విఱిగి
గళములు దునిసియుఁ గరములు దెగియు ♦ దలలవిసియుఁ దనుత్రాణములూడఁ గి
శరములు మెయినుచ్చి నడఁగ నెత్తురులు ♦
దొరుఁగ నంగములఁ దుత్తునియలై రపుడు [సులు
కెడయు రాక్షసులు బెగ్గిలెడు రాక్షసులు ♦ పుడమిపై మూర్ఛనుబొందు రాక్ష
నొగులు రాక్షసులును నోరులు దెఱచి ♦ దిగులొందు రాక్షసు ల్ధరతసలి
వారణంబులు వారు వాజులవారు ♦ దేరులవారునై తిరుగుడువడుచు
నదె రాఘవుండేసె నదె రాముఁడేసె ♦ నదెడాసె నిదె పాసె నదెయిదె యనుచు
వీక్షింపరానట్టి వేగంబు మెఱసి ♦ రాక్షసబలములు రయమునఁ బఱద
నంతఁ బోపక రాఘవావనీనాథుఁ ♦ డెంతయు ఘనరోష మెసఁగ వెండియును
నమ్మోహనాస్త్రంబు సంధించి పఱపఁ దమ్ము దా మెఱుఁగక దనుజులు భ్రమసి
దానవుండీతఁడు తరుచరుండితఁడు ♦ దానని తెలియక ధనుజుండు ధనుజుఁ

గనితాఁకునప్పుడు గాంధర్వశరము♦ఘనమహాత్త్వమున రాక్షసులకుఁ జూడ
నొక్కొక్కనికి రాముఁ డొక్కొక్కఁడగుచు ♦
నొక్కొక్కనికి రాము లొగిఁ బదుండ్రగుచు [రగుచు
నొక్కొక్కనికి రాము లొగ్గినూర్గురగుచు♦నొక్కొక్కనికి రాము లొగి వేవు
నొక్కొక్కరికి రాము లొగిలక్షయగుచు ♦
నొక్కొక్కనికి రాము లొగిఁ గోటియగుచు
శతకోటి యర్బుద సంఖ్యలు గడచి♦యతులితంబైనట్టి యాజిరంగమున [డ
మతిసర్వమును రామమయమయ్యెనపుడు♦ గిరికొనియుండ నీక్రీడనల్లతో
వడినేయుచట్టిడు వారకగుడుసు♦పడియున్న రఘురాముపసిఁడివిల్ చూచి
సమరసమాభీల చక్రియుగ్రతను ♦నమిచిపైచిన నాఁటిచక్రంబొ
కిరణజాలంబుల గిరికొన్న భాను♦పరివేషచక్రమో పరికింపననుచుఁ
దమమనంబుల నెంచి దైత్యులయ్యంప గములమెఱుంగులు గనుఁగొని పఱప
నమరారిసేనలో నప్పుడొక్కొక్క♦లిమిషంబులోపల నెత్తురువాన
లానవాజులు పదునాలుగువేలు♦నేనుఁగులో పదునెనిమిది వేలు
లక్షతేరులు రెండు లక్షలవీర ♦ రాక్షసవీరులు రణభూమిఁ గెడయ
శరములరంబులై చాపంబు నేమి♦కరణిమ్మైగుణారవ క్వణితమై మెఱసి
కిరణస్ఫులింగము ల్గిరికొన్న రామ♦శరచాపచక్రంబు కాలచక్రంబు
గతినుల్లసిల్లంగఁ గనుఁగొని పెలుచ♦హతశేషదైతేయు లతిభీతిఁ బొంది
కడుఘోరమైన సంగరభూమి విడిచి ♦ వడిలంకఁ జొచ్చిరి వనచరులార్యఁ
గాలాంతమునఁ గాలకంధరుండలుకఁ ♦ గేళ సల్పిన నాఁటి క్రియనుండె రణము
వలనయినట్టి రావణుమూలబలముఁ ♦ జలమున రఘుపతి సమయించునపుడు
పదివేలు కరులు నిర్వదివేలు హరులు ♦ పదపదులరదము ల్పద్మంబు బలము
నాలంబులోపల నతిదారుణముగఁ ♦ గూలిననొకయట్ట గునియుచునాడు
నట్టలుకోటాడ నా రాముని వింటఁ♦గట్టిన యొకఘంట ఖణిలని మొరయు
నొరయుఘంటలు నాద మూరకీరేడు♦ మొరసెనవ్విభుచాపమున నరజాము
భావింపరాకుండఁ బడి యేడుగడియ ♦ లావీరవరుని బాణాసనవిద్య
కిన్నరగంధర్వ ఖేచరసాక్షి ♦ పన్నగామరవరు ల్పొగడుతించి రెలమి
ఆరామచంద్రుండు నప్పుడింపలర ♦ శూరపుంగవుఁడగు సుగ్రీవుఁ గనియె
జగదేకభయదమీ సమ్మోహనాస్త్ర ♦
మొగిఁ బ్రయోగింపను నుపసంహరింప
నేనొండెవిషధరుం డీశ్వరుఁడొండెఁ ♦ గాని నేర్పరు లౌకులోకముల
కౌశికుండిచ్చిన నకదస్త్రమహిమ ♦ గానిదానులకైనఁ గనన శక్యంబు

అనిన విభీషణుఁ డా రాముఁ జూచి ♦ వినయసంభ్రమములు వెలయ నిట్లనియె
దేవ యీ బలములు దేవేంద్రుఁ డాది ♦ దేవతలకునైనఁ దెరల వెన్నఁడును
పౌలస్త్యునకు మూలబలమిది నేల ♦ పాలయ్యె నిఁక గూలుఁ బంక్తికంధరుఁడు
తలకొని నీపెంపుఁ దలఁపవుగాక ♦ తలఁచిన నెదురింపఁ దరమె యెవ్వరికి

—:* రాక్షసస్త్రీలు రావణుని నిందించుట *:—

అనివిభీషణుఁ డాడునట్టి వాక్యములు ♦ వినియప్పు డా రామవిభుఁ డాత్మ నలరె
అంత నక్కడ దానవాంగన లెల్ల ♦ నంతంతఁ బెనుమూఁకలై లంకలోనఁ
బోరిఁబోరి శోకాగ్నిఁ బొగులుచుఁ బలికి ♦ రరయ జగన్నింద్యమగు చరిత్రంబు
ప్రాయిడి మోమును బలితరోమంబు ♦ లై యున్న శిరమున ఛ్ఛాయతో దరము
వికృత వేషంబును వికృతయావనము ♦
గ్రకచోగ్రదంష్ట్రలు గలుగు శూర్పణఖ
సకలగుణోజ్జ్వలు సత్యసంపన్ను ♦ సుకుమారు మరుతేజు సుముఖు నా రాముఁ
గందర్ప సురుచిరాకారుఁ గామించి ♦ నందనిపంటికి నఱుచావఁ దగునె
యీ లంకలోఁ గల యెల్ల రాక్షసులు ♦ కాలగోచరులైన కారణంబునను
భానువంశజునకుఁ బంక్తికంఠునకు ♦ నా నిశాచరి సేసె నధికవైరంబు
తగవు చింతింపక దాని మాటలకుఁ ♦ బగగొని వచ్చి యీ పంక్తికంధరుఁడు
తనచావునకె కాదు ధరణీశు దేవిఁ ♦ గొనివచ్చె రాక్షసకులమెల్లఁ జెఱుప
నింతట సిద్ధించె నే సీత దనకు ♦ నింత తెంపునకుఁ దా నితఁ డేల దొడఁగె
మారీచు నొకకోల మడియించె దండ ♦ కారణ్యమునఁ జంపెఁ గసలి విరాధు
నిది యెఱింగియు రాము నెఱుఁగలేఁడయ్యె ♦
మదిలోన గర్వించి మన రావణుండు
అనలసమానంబులగు సాయకముల ♦ జననాయకుఁడు జనస్థానంబునందుఁ
బదునాల్గువేవురఁ బరిమార్చి రోష ♦ మొదవంగ నేచి యత్యుగ్ర శాణములఁ
ద్రిశిరు దూషణు ఖరు దృణలీలఁ జంపె ♦
దశకంఠుఁ డదియును దలపోయఁడయ్యె
రుధిరాశనుని నతిక్రూరవిక్రముని ♦ నధిక యోజనబాహు నా కబంధకుని
గ్రౌంచవనంబునఁ గడ తేర్చి పుచ్చి ♦ రంచితవిక్రము లగు దాశరథులు
ఇట్టి రాక్షసుల చా వెఱిఁగి యుఁ దొడరె ♦ నట్టి రాముని గెల్వ నలవియే తనకు
జగదీశుఁ డగు రామచంద్రుతోఁ బోర ♦ మగఁటిమి గలుగునె మన రావణునకు
నవలీల వాలి నొక్కమ్మునఁ గూల్చి ♦ రవిజుఁ గిష్కింధకు రాజుఁ గావించె
నధికపరాక్రము నా కుంభకర్ణు ♦ వధియించె నొక్కఁడె వసుధేశ్వరుండు
కరిసహస్రంబు లగ్గలముగా పెక్కు ♦ తురగలక్షలు రథస్తోమకోటులును

గణనకుమిక్కిలి గలకాలుబలము♦నణుమాత్రముగఁజంపెనాజిరంగమున
నట్టిపరాక్రమం బదియెల్లఁగనియె♦నిట్టివాఁడనిరాము నెఱుఁగలేడయ్యొ
ఆమేటియతికాయు నయ్యింద్రజిత్తు ♦ సౌమిత్రియొక్కడ సమయించెనాజి
ఇంకనైననురాము నిటశరణనఁడు♦లంకవింటింట విలాపముల్పుట్టె
తమబంధులీల్గిరి తమమగల్దెగిరి ♦ తమసుతుల్మృతులైరితమసహోదరులు
హతులైరిరణభూమినని యెల్లవారు♦ నతిశోకమునుబొంది యడరుచున్నారు
దుర్మతియును నీతిదూరుండు క్రూర♦కర్ముండునైనాఁడు కపటరూపమున
సీతనీపురికిఁ దెచ్చిననాఁటనుండి♦ తోఁతెంచుచున్నవి దుర్నిమిత్తములు
దశకంఠుఁడింక నీదశరథసుతుని ♦ విశిఖాగ్నిఁగూలుట వేగంబయుండు
నక్కటా నీతిజ్ఞుఁడగు విభీషణుఁడు♦ పెక్కుభంగులఁజెప్పె ప్రియమున బుద్ధి
నతఁడు చెప్పినబుద్ధు లన్నియునాఁడు ♦ హితవులుగా విన్న నీలంక సెడునెఁ
కులశైలపక్షముల్గూల్చినఘాతముఁ♦నలుకమైఁదునుమునా పురందరుఁడో
మధుకైటభాదులమర్దించునట్టి♦ యధిపుఁడా విష్ణుఁడో యదయుఁడంతకుఁడో
ప్రళయకాలమునాఁటి ఫాలలోచనుఁడో ♦

యిం రాముఁడై పుట్టి యిటుచంపఁదొడఁగె

దశరథతనయుండు దర్పంబుమెఱసి♦దశకంఠునవనిలోనఁ దగఁజంపునపుడు
సురలగుసు నైన గంధర్వులైన ♦ మునులైనవీనికి మునువరంబిచ్చు
వనజసంభవుఁడు శర్వాణీశుఁడయిన♦ వినుఁడు రాక్షసులైన విడిపింపలేరు
వరమిచ్చునప్పుడావనజసంభవుఁడు♦నరులచేఁజాకుండ నాఁడీకుగానఁ
బరికింపఁగా సర్వబంధుతోడ♦ధరణీశుచేఁ జచ్చు దశకంధరుండు
ఇదినిజమెట్లన్న నింద్రాదిసురల ♦ మదిదయలేక పల్మాఱునొప్పింప
నీరావణునిచేత నెంతయునొచ్చి♦నీరజాసనుఁగాంచి నిఖిలదేవతలు
సభయంబువేఁడిననా చతుర్ముఖుఁడు♦శుభతరస్థితివారిఁజూచియిట్లనియె
నీబాధలనుజెంద విటమీఁదమీకు♦మీబుద్ధివర్తించి మీరుండుఁడెలమి
ననివారు దాను మహాదేవుకడకుఁ♦జనిప్రస్తుతింపఁ బ్రసన్నుఁడై శివుఁడు
కమలాసనాదులఁ గరుణనీక్షించి♦యమరరక్షార్థమై యఖిలరాక్షసుల
నమరంబులోపలఁ జంపించుకొఱకు♦నమరనిందిరపుట్టు నాసతీమణికిఁ
బతియయి ప్రజల నాపదలొందకుండ♦సతతంబు గావ దుర్దశలరాక్షసులఁ
జంపంగ విష్ణుండు జన్మించుబుడమి ♦ నింపారననిన యానతిచ్చె రాముండె
యరయంగనా విష్ణుఁడా మహీజాత ♦ పరికింపనిందిర భావంబులోనఁ
దలపోయశివుమాట దప్పదుగాన♦మలఁగనిశోకంబు మనకుఁబాటిల్లె
మనకుదిక్కెవ్వరు మనరావణుండు♦మననేరఁడికమీఁద మరుగంగనేల

మనకందఱకుదిక్కు మనవిభీషణుఁడు♦చని రామచంద్రుని చరణంబు సొచ్చె
నని పెక్కుభంగుల నసురకామినులు♦పనుపుచుండఁగ విని పంక్తికంధరుఁడు
చింతాసమాకుల చిత్తుఁడై యపుడు ♦ వంతతో నొక్కింత వడియూరకుండి
చండకాలవ్యాళ సమలీలదోఁప ♦ నిండుకోపంబున నిట్టూర్పువుచ్చి
యవుడులుదీటుచు నందందకన్ను♦గవలనిప్పులురాలఁగా నుగ్రుఁడగుచు
నురవడిఁగనలి యుద్ధోన్మత్తుమత్తు ♦ సారిదివిరూపాక్షుఁ జూచి మీరెలమి
దండడిసింహనాదములుతూర్యములు ♦ సందండమెఱయంగ ననికి నేఁగెందు
అనిపెక్కుభయమున నానిశాచరులు♦ వినియూరకున్న నవ్విధమువీక్షించి
యాలంబునకు వేగ యత్నంబు సేయు ♦

జేలయుత్సాహంబు లిటుమానియుండ
ననినవారిరిగి పుణ్యాహకర్మంబు ♦ లొనరించుసన్నాహ మొప్ప నేతెంచి
యారాక్షసేంద్రు వకవనతులైన ♦ నారాక్షసుఁ జూచియతఁడల్కఁబెల్కె
నానాఁటికిబ్బంగి నాబలంబెల్ల ♦ హీనమయ్యెను భృత్యులెల్ల జచ్చుటయు
నసురేంద్రవిక్రముఁడైన యాఖరుఁడు♦నమితబలోదగ్రుఁడగునింద్రజిత్తు
నాకుంభుఁడును శూరుఁడగు నికుంభుఁడు♦ నాకుంభకర్ణుండు నాప్రహస్తుండు
భీమవిక్రమవిజృంభితుఁడతికాయుఁ ♦

డామహాకాయుండు నామహోదరుఁడు [నుఁడు
నాసురాంతకుఁడును నానరాంతకుఁడు ♦ భాసురయశుల కంపనుఁడుగఁప
నాకాధిపతినైన ననినోర్చువారు ♦ నాకునై పోలిసిరి నాగర్వమడఁగె
నటుగానశత్రుల నడఁచఁదునిమి ♦ పటుపరాక్రమమునఁ బగదీగువాఁడ
మీటినశరముల మిన్నులుముట్టి ♦ యేఱులుజధులు నేఱుఁగరాకుండ
నఖిలంబుఁగప్పుచు నచ్చెరువార ♦ నిఖిలవానరులను నేఁడునిర్జింతు
నేపునన్నే నేయుబాణమ్ము ♦ లాపు ఖమ్ముగఁగాడి యగచరాస్యముల
సాళముగల్గిన నవపంకజములఁ ♦ బోలగ నేఁడాడి భూమిఁగ్రుసేతు
మగలుతనూజులు మాసహోదరులుఁ♦దెగిరింక నెవ్వరు దిక్కుమాకనుచు
లంకాపురస్త్రీలు లలిఁదూలిసోలి ♦ యింకనీశోకాబ్ధి నిటమునింగెదరు
మార్తురఁ లియించిమతిఁపుగజకుల యార్తివాపుదుశోకమడఁచెదఁగాక
నేఁడాజిఁబ్రతిపక్షనికరస్త్రైస్యముల♦వాఁడిబాణములవడిఁద్రుంచివైచి
కరమొప్పఫేరవకంకగృధ్రములఁ♦బోరిపిశాచప్రేతభూతజాలములఁ
దనివోవమాంసరక్తంబులతృప్తి♦యొనరింతునను చు యుద్ధోన్మత్తుమత్తు
నక్షీణబలుఁబగు నవ్విరూపాక్షు ♦ నీక్షించిరణమున కిప్పుడ వేగ
యనుపమంబగునట్టి యరదంబు దేరఁబనుపుడు నేఁడు నాపటుసాయకముల

ఘనులైన రామలక్ష్మణుల ప్రాణములు♦గొనివారిరుధిరముల్గ్రోలఁగోరెడిని
శతసంఖ్యలొక్కొక్క సాయకంబునను♦
మృతిబొందఁగపి గోట్లమీఁదనేసెదను
అనికిబలాఢ్యులు లగువారిఁజూచి ♦ కొనిరండుసేనలఁ గూర్చుకవేగ

—:* రావణుఁడు రెండవసారి యుద్ధమునకు వెడలుట *:—

యనివారుపిలిపింపనఖిలరాక్షసులు♦వినువీధియద్రువంగ వీఁకనార్చుచును
గరవాలచక్ర భీకరభిండివాల ♦ పరశుశూలప్రాస పట్టసగదలు
ముసలంబులును గాఢముద్గరంబులును♦నసిగెదుశక్తు లనేకవిచిత్ర
వివిధాయుధంబులు వెలుఁగనేతెంచి♦రవిరళోత్సాహంబు లడరంగనంత
దనుజులునానాస్త్రతతులతోఁగూడ ♦ దినకరప్రభగల తేరుతెచ్చుటయు
రమణీయరత్నాంశు రాజివిరాజి ♦ తములైన కర్ణావతంసంబులమరఁ
బదికంఠముల రత్నపదకముల్గ్రాలఁ ♦ బదిముఖంబుల వింతపంతముల్దనర
మహనీయకేయూరమణికంకణాది ♦ బహుభూషణాంకిత బహుదండముల
శరశరాసనఖడ్గ చక్ర సిపరశు ♦ పరిఘాదిసాధన ప్రకరంబు మెఱయ
దివిజారిచెఱఁబెట్టె దినకరునొకని ♦ దివినొక్కదినమణి పరుగుచున్నాఁడు
తలఁపఁదక్కనభానుదశక మొయనఁగ♦దఁకొనికోటీర దశకంబు వెలుఁగ
నంతనాదశకంఠుఁ డారథంబెక్కి ♦ దంతిరథాశ్వ పదాతులునడవఁ
బటుతరలిస్వాణ భాంకారవీర ♦ భటసింహనాదారి బహునినాదముల
విలయకాలాభీల వేళఘూర్ణిల్లు ♦ జలరాశితోలంక నరినోలుచుండ
నపిరళవంది జనావలివినుత ♦ రవముతోడుద నుత్తరద్వారమపుడు
బలువడి వెలువబి పౌలస్త్యముఖ్యుఁ♦డలుకయుద్ధోన్మత్తు నావిరూపాక్షు
మత్తునివీక్షించి మహిప్రవర్యావార ♦ నొత్తిలియార్చుచు నోలినాలంక
వెడలంగరవిదీప్తి వెలవెలఁబాఱె ♦ నడరిదిక్కులనిండె నంధకారంబు
ధరణికంపించె రథంబులువిఱిగె♦ దరగంబులొఱగె నెత్తురువాననురిసెఁ
గడుఁగీడుశకునము ల్గానంగఁబడినఁ ♦ 7 డిమిడి పక దశకంధరుఁడడరె
లం కేశునానా బలంబులఁజూచి ♦ పంకజగర్భుని భాండంబువగులఁ
నిగుడునార్పులతోడసఖిలవానరులు♦నొగివీఁకతోఁదాఁకి రుగ్రదానవులఁ
గలుషించియాలోనఁ గపిసేనగట్టిబంములు నెరయంగఁబంతముల్మెరయఁ
గఱకురాక్షసులును గ్రముగనేయుదురు ♦
నెఱకులుదూరంగ నిశితబాణముల
ముసలతోమరశక్తి ముద్గరచక్ర ♦ విసరములై వ్రతురు వీఁకకఁబెల్లేచి
యంకుశకుంత శూలాదులఁబొడుతు♦రంకించి వ్రేయుదు రాభీలగదల

నడిదమ్ముల్లిఖి పింఛియులకనంగములు ♦ కడిఖండములఁ జేసికడిమిఁజూపుదురు
కపులనుగుపితులై కడిమివాటించి♦విపులశైలంబుల వృక్షజాలములఁ
బడవంతనఖవాల పాళహస్తముల ♦ సదయులై యారాక్షసావలినెల్ల
శిరములఁ నరములు చేతులుమూతు♦లురములు బాహువులోష్ఠకంఠములు
ద్రెంచియునొంచియుఁదీవ్రవైఖరులఁ♦జించియువంచియుఁజిదిమియు నదిమి
తరమిడినిబ్బంగి దనుజులనొంపఁ ♦ దరుచరావలిఁజూచి దనుజేశుఁడంత
డారుణాకృతివత్సదంతాళ్వకర్ణ♦ నారాచభల్లాది నానాస్త్రవితతి
నగచరరుధిరంబు నవనిపైఁదొరుఁగ ♦

నిగుడించియొక్కొక్క నిశితబాణమునఁ
గపిపంచశంబును గపిసప్తకంబుఁ ♦ గపినవకంబును గదనరంగమునఁ
గుదులుగ్రుచ్చినక్రియఁగూలనేసియునువదలకతరుచరులెల్లఁచు శైలములు
ఘనశరుల్శకలము లాగానేసిమిఱియుఁ ♦ గనలియేసమ్ముల గంధమాదనునిఁ
బదునెన్మిదింటను బనసునిమఱియుఁ♦బదియింటనీలునిఁ బదియింటనలునిఁ
ద్వివిదునాఱిటను వినుతునేడిటఁ ♦ బవనన దను లిరువదిటగవాక్షు
నైదైదులనుమైందునైదిఁటఁగుముదు నైదింటగోముఖునైదిఁటబుషభు
నేడిటశరభుఁ బదేడిఁటగజుని♦ నేడమ్ములచుబృథు నేడిటహరునిఁ
దరిమియొక్కొమ్మిడి దారునిగ్రథునిఁ ♦ జెరిమూఁట సాయకాళితిన గదుని
డెక్కనవనచరతతి నిలఁగూలఁ ♦ బెక్కుబాణంబులఁ బేర్చియుగ్రతను
వేసనేసెమగఁటిమి వీఁకతోమెఱయ♦ నసురేశుమునుమన న దండ కపులు
నడుములునిశిత బాణంబులవిఱిగి ♦ పడువారునిలలేక పడితూలువారు
నురుములువ్రయ్యలై యొగిగూలువారు ♦

చరణము ల్తునియలై సరి గ్రుమ్గువారు
చేతులు దెగువారు శిరములుపగిలి♦భూతలంబునఁబడి పొరలెడివారు
గళము లూరులును జ ఘలుద్రెవ్వనొచ్చి

పలుగూఱుమూల్గుచు బడియెడివారు
నంగంబులివియవి యనియేరుపడక ♦ సంగరాంగణమునఁ జచ్చినవారు
బాణముల్గాడినఁబఱచుచునసుమఁ♦ బాణములోవ్వయియుర్వరఁబడువారు
నయ్యెండనప్పు డయ్యసురేశుఁజూచి♦చయ్యనరణమున సైరింపలేక
వానరుల్వాఱిరి వసుధగంపింప ♦ దానవేంద్రుండును దవిలివెన్వాటఁ
బడివిడినేతేరఁ బాఱనేమిటికి ♦ నిలునిలుండనిపల్కి నిలువక పాఱు
సేనలఁగావ సుషేణునినునిచి♦భానుసూనుడు వృక్షపాణియైనడచె
తరుశిలాహస్తులై తరుచరపతులు ♦ నిరుగెలంకులవెన్క నేపుదీపించి

నహనుమంతుఁడు సింహనాదంబు చేసి ♦ తోడరి కాలాగ్ని రుద్రునివిధంబునను
వృక్షతాడనముల వెసఁ జంపిచంపి ♦ వృక్షశిలాఘోర వృష్టి నందంద
రాక్షసబలముపై రయమునఁ గురియ ♦ రాక్షసవరులు శిరంబులు పగిలి
కులిశోగ్రహతిభగ్నకూటంబులైన ♦ కులశైలముల భంగిఁ గూలిరి మఱియు
రవినందనుఁడు క్రోధరక్తాక్షుఁడగుచు ♦ నవనిధరాభీల హస్తుఁడై నడవ

—:* సుగ్రీవుని చే విరూపాక్షుఁడు మొదలగు రాక్షసవీరులు చచ్చుట *:—

నంత విరూపాక్షుఁ డధికరోషమునఁ ♦
బంతంబు మెఱయంగఁ బయిఁ దేరు వఱపి
విలుగుణధ్వని సేసి విపులవిఖ్యాత ♦ తులితంబులగు వాఁడితూపుల నేయ
నవి లెక్క సేయక యరదంబుపైకి ♦ రవిజుండు లంఘించి రథసూతహయులఁ
బృథివీధరంబునఁ బృథుశక్తితోడఁ ♦ బృథివిపైఁ బడ నేయఁ బృథివికి నెఱికి
విరథుఁడయ్యును దైత్యవీరుండు వివిధ ♦
శరము లేయుచుఁ బాదచారియై నిలువ
నమరారిపనుపున నఖిలాయుధములు సమకూర్చి మావతుల్ మదసామజము
దెచ్చిన వెసనెక్కి దీకొని కపుల ♦ విచ్చలవిడి సేసి విక్రమం బెసఁగ
నుగ్రదానవులార్వ నుగ్రబాణముల ♦ నుగ్రాంశుతనయుపై నురవడి నేసె
నక్కజంబుగ విరూపాక్షుండు మఱియుఁ ♦
బెక్కాయుధంబులఁ బెక్కుబాణముల
వసమర నేయంగ వసుధ గంపింప ♦ వెసఁ బాఱుతనవారి వెఱవకుండనుచు
నలుకతో సుగ్రీవుఁ డతని నిర్జింపఁ ♦ దలపోయ గ్రక్కునఁ దన్దనుచరోత్తముఁడు
విపులవృక్షమున ద్విరదంబు శిరము ♦ గపితుండై యేయంగ గుంభంబు పగిలి
తెఱచుచుగా శోణితధారలు దొరుఁగ ♦ బిఱిఁదికి నొకవింట పెట్టొనరించి
యది మ్రొగ్గ నేలకుయ్యసుర యుదాంటి కదురుచు ఖేటకఖడ్గముల్ గొనుచు
మర్కటపతిదాఁకె మార్కొని వాని ♦ నర్కసూనుఁడు వైచె నతులశైలమున
నక్కొండఁ దెగ వ్రేసె నదరి దానవుఁడు ♦ రక్కసుఁ బిడికిట రవిజుండు నొడిచె
నాలోనఁ గరవాలఁ ఝంకించి యసుర ♦ వాలితమ్ముని వ్రేసె వడి చెడకపుడు
పిడికిటిపోటునఁ బెలుచ దానవుఁడు ♦ పడిదంబు వ్రేటున నర్కనందనుఁడు
నొక్కటఁ బడియంత నొక్కట దెలిసి ♦
రొక్క లాంగునఁ బోరి గొని ముక్కుమిఁగిలి
యప్పుడు సుగ్రీవుఁ డఱచేత వ్రేయఁ ♦ దప్పించుకొని హేతి దనుజుండు వ్రేసె
గరవాల నిహతి కగ్గలిదప్పు నెఱికి ♦ కరహేతి జడిసి పోఁ గపిరాజు వ్రేసె
మగఁటిమితో నంత మల్లయుద్ధమున ♦ మిగిలిన వెరవుల మెఱసి పోరుచును

దినవల్లభులభంగిఁ దేజరిల్లుచును ♦ ఘనలుకాలాగ్నుల కరణిమండుచును
బలిబిడౌజులమాడ్కి బాహుగర్వముల వెలయుచునిరుపురువిజయంబుగోర
నక్కజంబగుశక్తి నఱచేతనినజు ♦ మొక్కలంబునవాఁడు మూర్ఛిల్లవ్రేసి
కరవాలహస్తుఁడై కపులపైఁబాఱ ♦ దరణిజుండాలోనఁ దనమూర్ఛ దెలిసి
పఱతెంచి నిర్ఘాతపాతమైనట్టి ♦ యఱచేత నావిరూపాక్షువక్షంబు
నెఱిలావుతోవేయ నెత్తురుగ్రక్కి ♦ యఱలుచుధరఁగూలె నుగ్రదానవుడు
తరుచరుల్చెలఁగిరి దానవుల్గలఁగి ♦ తిరుగుడువడిరంత దీనాస్యులగుచు
గ్రుక్కియుద్ధోన్మత్తుఁ జూచిరావణుఁడు ♦

తక్కనికడకయెంతయుఁ దోఁపఁబలికెఁ
గంటెయాసుగ్రీవుకడిమిమీయన్నఁ ♦ గంటివిరూపాక్షుగల నగరంగమున
బడిరనేకాసురభటులును బెక్కు ♦ మడిసెఁగుంజరములు మడిసెనశ్వములు
విఱిగెరథంబులు విరిసెమూఁకలును ♦ నుఱకనొప్పించుచు నున్నారుకపులు
సమయంబునీకిది సమరంబుసేయ ♦ సమరాంగణంబున సమయింపురిపుల
ననవినియనిగూలియక్షిలేశుఁడైన ♦ మనుజేశుఁగలయంగ మదినిశ్చయించి
తరుచరానీకంబు దరియంగఁజొచ్చి ♦ శరగదాఖడ్గాది సకలాయుధముల
నడరివిరూపాక్షు ననుజుఁడుకపుల ♦ గడిమిమైనొప్పింప గనిభానుసుతుఁడు
నగమెత్తివైచిన నదుమనదానిఁ ♦ దెగనేసెననుజుఁడాదినకరాత్మజుఁడు
తనరసాలమువైచె దానిదానవుఁడు ♦ దునియలుగామాఁడు తూపులనేసె
లక్షించిశాణజాలము లేయుచుండ ♦ రాక్షసులదరంగ రథముపైకుఱికి
భానుసూనుఁడువాని పరిఘాయుధమున ♦ వానికేతువువిల్లువడిద్రుంచివైచి
రథసూతుఁదెగవ్రేయ రయమునవాడు ♦ పృథుగదాపాణియై పృథివికిదాటి
యిరువురుపోరాడి రిలచలియింపఁ ♦ బరిఘగదాభీల బాహువుల్మెఱయఁ
గంఠీరవంబుల కరణిగర్జిలుచుఁ ♦ గంఠముల్వదనముల్గరములంసములు
చరణముల్నఖములుజానుజంఘములు ♦ నురములు వెన్నులు నూరులువ్రేళ్లు
బరులునుబిరుదుజబ్బలు మధ్యములును ♦

శిరములుఁజెవులును జెక్కులోష్ఠములు
వరుసతోనపుడు రవడిఁదాఁకితాఁకి ♦ వెరవులుచిత్రముల్వెలయఁగల్గుచుండ
సరిగాఁగనత్యంత సాహసలీల ♦ నిరువురునోలి ననేకమార్గముల
నాలోనఁ బరిఘగదాభీలహతులఁ ♦ వాలుదునొక్కట వ్రాలియాలోనఁ
గడిమిమై నొండొరుకంటెముద్దలిపి ♦ వడినార్తురంతయు వసుధగంపింప
దానవుండురుగదా దండంబురెండు ♦ సేనలవారు నచ్చెరువందఁద్రిప్పి
భానుజుఁబడవైచెఁ బడిలేచివచ్చి ♦ వనజాప్తసుతుఁడేసెఁ బరిఘుంబుద్రిప్పి

దనుజాంగనిహతి దత్పరిఘంబుదునియఁ ♦
గనలుచుదనుజుండు గరవాలమునను
వనచరపతిపైవ వడిఁదత్ప్రహాణ ♦ మినజుఁడుగొనిదీప్తు లెనఁగనంకించి
వికలమైధరఁ ద్రెళ్ల వ్రేసెదైతేయు ♦ మకరకుండలదీప్తి మయమస్తకంబు
కనుఁగొనివిరిగి రాక్షసులురావణుని ♦ వెనుకకులంకకు వెసఁబాఱిరపుడు
బలగర్వమెసఁగసుపార్శ్వుఁడంగదుని ♦ బలుసేనపైఁగిట్టి పటుసాయకముల
వానరశిరములు వడిఁగూలనేసి ♦ తోనహస్తంబులు ద్రుంచెఁగొందఱను
గొందఱబాహువుల్ ఘోరబాణముల ♦ నందందతునమాడెనంతవానరులు
నానిశాచరునకు ననిఁబాఱఁజూచి ♦ వానితేఁటికిదాఁటి వాలినందనుఁడు
పసయేరుపడవాని పరిఘాయుధంబు ♦ వెసఁబుచ్చుకొనినేల వివశుఁడైకూల
వడినేసె నాజాంబవంతుండునొక్క ♦ వెడఁదపాషాణంబు వీఁకతోనెత్తి
యరుదారనంకించి యా[illegible]ద బువిఱుగ ♦
హరులుసూతుఁడు జావ నలుకతో వ్రేసె
దనుజుఁడాలోఁ దేరి దశసాయకములఁ ♦ గనలుచునంగదు ఘనభుజంబేసి
యంబకత్రయమున నధికరోషమున ♦ జాంబవంతునినేసి చలనంబునొంద
నేసెగవాక్షుని నిషుపంచకమున ♦ నాసమయంబున నంగదుఁడలిగి
వజ్రసన్నిభముష్టి వడిఁగిట్టిపొడువ ♦ వజ్రాబుతాఁకున వసుధాధరంబు
వసుధఁగూలినక్రియవాఁడాజిఁగూలె ♦ నెసఁగదేడతలార్చి రేఁచిమిన్నద్రువ
నంతరాక్షసబలం బతిభీతిఁబాఱ ♦ నంతయుఁజూచి దశాననుండనియెఁ
బరుషవిక్రముఁడు సుపార్శ్వుండుమడిసె ♦
నురుబాహుబలుఁడు యుద్ధోన్మత్తుఁడీల్గె
ననిఁగూలెనా విరూపాక్షుఁడుమఱియు ♦ ఘనమైనరాక్షసు ల్గడతేరిరింక
బలసమన్వితులైన పార్థివసుతుల ♦ బలుమిడిగెలిచి నాబంధులవలన
నెలకొన్నశోకాగ్ని నెరియునీలంక ♦ గలవారివగపెల్లఁ గడఁకతోఁదీర్తు
నవిరళక్షత్రధర్మైక మూలంబు ♦ నవజయోన్నత లక్ష్మణప్రకాండంబు
భానునందనముఖ ప్లవగశాఖంబు ♦ మానవపతికీర్తి మంజరీకంబు

—:* రావణుఁడు రామలక్ష్మణులపైఁ గదియుట *:—

ప్రకటసీతానామ ఫలభాసురంబు ♦ సకలామరాశ్రిత చ్ఛాయంబునైన
రామద్రుమంబేను రయము రఁబెఱికి ♦ నామనోదుఃఖంబునకు మందుచేసి
యెసఁగదజగములో [illegible]చునప్పు ♦ డసురేశుఁడధిక రోషాయత్తుఁడగుచు
పారథికనియు సీచతురతమెఱసి ♦ తేరురాఘువులపైఁ దీవ్రతఁబఱపు
వారిఁజంపెద నేఁడు వారాజిఁబడిన ♦ తారేగుదురునిచ్చి తరుచరుల్చెదరి

యనవిని వాఁడట్ల యరదంబు పఱపె♦ ఘననేమిరవము లుత్కటముగా జెలఁగ
సాయకాసనధను ర్జ్యానినాదంబు♦ మ్రోయంగ నిస్సారణముబోరుకలుఁగ
వందిమాగధనూత వరనుతుల్మ్రోంచ♦ నందందనిజసేన యార్పులుప్పొంగఁ
దరుచరసేనపై దారుణాస్త్రంబు♦ లరుదారనిగుడించె నద్దశాననుఁడు
అజనిర్మితంబులౌ నాశాణతతుల♦ భుజబలంబులఁ దూలి భూరిసత్త్వలును
నేలఁగూలిరి పెల్లు నిఖిలప్లవంగు♦ లాలోన రఘురాముఁ డనుజుండు దాను
గోదండపాణులై కోపించినిలిచి♦ రాదశాననుఁడును నలుకమాఱొ్క వఁగ
నుడువీథి వియంగ నుదధులు గలఁగఁ♦ గడు తేర్చి దిక్కుంభి కర్ణముల్వ్రగల
నడరు రామునిధను ర్జ్యాఘోషమునకు♦
గడుమాన సంబులు గలఁగి రాక్షసులు
గుపితదశగ్రీవ కోదండముక్త♦ తపనోగ్రసాయక ధ్వనికి వానరులు
భయమంది ధరణిపైఁ బడిరి యుక్కడఁగి♦ రయమార నాలోన రామలక్ష్మణులు
రవిసుధాంశులభంగి రాగిలి కదియ♦ దివిజారి రాహువు ప్రదీప్తుఁడై కవిసె
నంతనాలక్ష్మణుం డతితీవ్రవిశిఖ♦ సంతతులేసె దశగ్రీవుమీఁద
నడుమన తెగనేసె నాకేశవైరి♦ కడిఁదిబాణముల నుత్కటముగా మఱియు
నొక్కొక్కశరమేయ నుగ్రుఁడై వాని♦
నొక్కొక్కశరమున నొగి ద్రుంచి వైచి
మూఁడేసి శరము లిమ్ముల వడినేయ♦ మూఁడుమూఁడమ్ముల మురియలు చేసి
పదియమ్ములేసినఁ బదియింట వానిఁ♦ జిదురుపలై ధరఁ జెదరిపోనేసె
నూఱేసి యేసిన నూతనగతుల♦ నూఱునూఱమ్ముల నుగ్గుగావించి
సౌమిత్రి నటు రణస్థలిఁ జిక్కువఱచి♦ రామచంద్రునితోడ రణముసేయుటకు
దనుజాధినాథుఁ డుద్ధతి నేగుదేరఁ♦ గనుగొని సమవర్తిఁ గని పాఱు కరణిఁ
గనునికనిఁ జెదరి మర్కటులనిఁ బాఱఁ♦ గనికన్నుగవఁ గెంపుగడల రాఘవుడు
విల్లందిదివిజులు వినుతింపధరణిఁ♦ దల్లడపడఁ దాఁకె దానవేశ్వరుని
ముఖములఁ గోపంబు ముడివడినతఁడు♦ నఖిలలోకాతిభయంకరంబుగను
రామునిఁ దాఁకె నారామరావణులు♦ భీమాట్టహాసము ల్బెరయించి మించి
సైన్యద్వయంబున సరి నార్పులెసఁగ♦ నన్యోన్యకార్ముక జ్యానినాదములు
పరువడి రశదిశాభాగంబులందు♦ మొఱయఁ బరస్పరముక్తబాణ బు
లొఁడొఁటితో దాకనుగ్రంపురవము♦ మండుమంటలున భోమ డలినిండ
సరినొప్పి యురువుగు శరలాఘవముల♦ గరలాఘవంబులకరణి నొఁడొరులు
మెచ్చుచు నొఁడొరు మీఱువైచిత్రి♦ కచ్చెరువడుచును పనిసేయునపుడు
క్షోణీశుపై నొక్క ఘోరతమాస్త్ర♦ బాణంబునిగుడించెఁ బంక్తికంధరుఁడు

ఆకాండమడరిన నఖిలవానరులు ♦ చీఁకటిగప్పి నిశ్చేష్టితులైరి
అప్పుడుగన్నులు గెంజాయ♦లొప్పఁగ రఘురాముఁడుగ్ర బాణములు
పదిపదు లేసినఁ బాణభల్లసమితిఁ ♦ గ్రదదనారి వాసినిఁ దెగ నేసిమఱియు
నిశిత బాణము లేయు నృపుఁ డర్ధచంద్ర ♦ విశిఖంబు డిగించి వేగంబ త్రుంచి
యసురేశునిశిఖలావయవములుదూర ♦ నసదృశంబగున నేకాస్త్రముల్వాఱి పై
రౌద్రబాణంబంత రావణుండేయ ♦ రౌద్రబాణంబున రఘురాముఁడేసె
అవి రెండునన్యోన్య హతముల్లై పడఁగ ♦ నవనీశదరుజేసు లాలోనఁ గినుక
దివిరియొండొరులేయ తీవ్ర బాణములు ♦ దివినిండఁగప్పినఁ దిమిరంబుగప్పె
రణములోనప్పుడు రయమున మ్రోఁగు ♦ గుణరావముల చేత ఘూర్ణిల్లుచున్న
యురుచాపసాగరయుగము సంగయు ♦ శరధి మలోగిఁ దరస్ఫురఘట్టనముల
విరియంగ దైతేయవిభుఁడు కోపించి ♦ నరనాథునురమేసె నారాచసమితి
నదియుండె నీలోత్పలావలికరణిఁ ♦ గదిసి రాముఁడు చండకాండముల్గొడిగి
కవచంబు సించి వక్షముగాడ నేసె ♦ దనుజారి యప్పుడెంతే నొచ్చి మఱియు
నహిశిలీముఖములనడరింపఁ దోన ♦ యహిమాంశకులనాథుడవి త్రెవ్వనేసె
నాసమయంబున నమరేంద్రవైరి ♦ యాసురసాయకం బడరింపఁ బెక్కు-
ముఖముల శార్దూలముఖసులునుష్ట్ర ముఖములు సూరథిముఖములును రగ
ముఖములు కరివైరి ముఖములు దంతి ♦

ముఖములు ఘనగృధ్ర ముఖములు దనరు
ఘనశిలీముఖములై కడఁ బెళ్లునిగుడఁ ♦ గని వానిదునుకలుగాఁ జేసి మఱియు
జగనాథుఁ డాగ్నేయసాయకం బేయఁ ♦

గనుఁగొని నెండు సుల్కా-ముఖాస్త్రములు [కములు
మహితవిద్యున్ముఖమార్గణబులును ♦ గ్రహముఖంబులుగలుగు ఘనసాయ
మిహిరముఖంబుల మెఱయు బాణములు ♦

దహనముఖంబులై తనరు శస్త్రములు
నగుచునచ్చెరువుగా నడరంగ వానిఁ ♦ దగ నేసి యప్పుడు దైత్యవల్లభుఁడు
మయుని చేఁబడసిన మాయాశరంబు ♦ రయమున సంధించి రాముపై నేసె
నేసినదాన ననేకంబులగుచుఁ ♦ గ్రాసతోమరగదా పరిఘంబులడరె
గాంధర్వశరమంతఘనకార్ముకమున ♦ సంధించిసిగుడి చెజ లోకవిభుఁడు
నాదిత్యతులితంబులైనచక్రంబు ♦ లాదిత్యబాణంబునం దనేకములు
జగములు భయమందఁ జనియించిరుచుల ♦ నిగిడి యాకసమెల్ల నిండఁ బెల్లడరి
యామార్గణంబున నడరిన పరిఘ ♦ తోమరాదుల నెల్లఁ దునియలు సేయ
దశకంఠుఁడంత నద్ధరణీశుమీఁద ♦ నిశితనారాచము ల్నిగిడించె నలుకఁ

బరగించె నప్పుడును బ్రతిసాయకముల ♦
బోరిఁబోరిఁ బుంఖానుపుంఖంబుగాఁగ
జగతీశ దనుజేశ శరపరంపరలు ♦ గగనభాగంబెల్లఁ గప్పె నాలోన
నడఁజొచ్చి లక్ష్మణుం డేడుబాణముల ♦ బడగయు విల్లొక్క పటుసాయకమున
సారథిశిర మొక్క శరమున ద్రుంచి ♦ యారావణుని వక్షమైదింట నేసె
నీలధరాధర నిభతురంగముల ♦ గూలంగ నేసె మూఁడొక్కని విభీషణుఁడు
విరథుఁడై దైతేయవిభుఁ డంతలోన ♦ ధరణికి లంఘించి తరుచరుల్బెదర
భ్రూకుటి వదనక విస్ఫురితాస్యుఁడగుచు ♦ భీకరశక్తి విభీషణుపైన
నడుమనె మూఁడుబాణంబుల దాని ♦ మిడుగురుల్మంటలు మింటబెల్లెగయ
ధరణిపైఁ బడ నేసె దరుచరులార్వ ♦ ధరణీశుననుజుండు దశకంఠుఁ డంత
కడునల్గి మయునిచేఁ గన్నయాశక్తి ♦ వడి విభీషణు మీఁద వైవ నంకింప
శరణాగతత్రాణ సద్ధర్మపరులు ♦ శరణాగతుల చావు సైతు రేయనుచు
దనుజేశు తమ్మునిఁ దన వెన్క డిగిచి ♦ కొని రాము తమ్ముఁడు క్రూరబాణములు

—*: రావణుని శక్తిచే లక్ష్మణుఁడు మూర్ఛిల్లుట :*—

పరఁగించె నప్పుడు పంక్తికంధరుఁడు ♦ బిరుదవై వచ్చి విభీషణు వెనుక
నిడుకొంటి లక్ష్మణ యీశక్తి హతికిఁ ♦ గడిమివై నోర్తువు గాకంచుఁ బలికి
ప్రళయకాలాదిత్య పరివేష ఘోర ♦ వలయమై దీపింప వడిఁ ద్రిప్పి వైచె
నదికింకిణీఘంటికానేకరవము ♦ లొదవంగ మ్రోయుచు నుదధులు గలఁగ
వడిఁ గులాచలములు వడఁకాడ దిశలు ♦ బెడఁగ దివాకరబింబంబు గదలఁ [దర
బిడుగులు దొరుగంగఁ బృథివి గంపింప ♦ నుడుపథంబవియంగ నుడుపంక్తిచె
మిడుగురులెగయంగ మింటఁ బెన్మంట ♦ లడరంగ శేషజిహ్వాకారమగుచు
రయమున బరతెంచి రాముఁ డాలోక ♦ భయదసాధనముచే బ్రాణభయంబు
సమకొనకుండెడు సౌమిత్రికనఁగ ♦ సమరులు మింట నాహాకృతుల్సేయ
నెడనెడఁబయి నేయు నిషుపంక్తి జడిసి ♦ వడిమీఱఁగా వచ్చి వక్షంబునందు
భీకరఘనశక్తి పెల్లుగా గాఁడ ♦ రాజకుమారుఁడు దూలి రణభూమి వ్రాలెఁ
గాలావసానంబు గదియఁబెంపేది ♦ కూలు మహామేరు కుధరంబు పగిది
ధరణిపై బడియున్న తమ్మునిఁ జూచి ♦ దరికొన్న శోకాగ్ని దనచిత్త మెరియఁ
గనుగవ బాష్పముల్గ్రమ్మిపై నిగుడ ♦ దనుజేశు పటుబాణతతులు గైకొనక
పృథుతరవక్షంబు పెల్లుగాఁ గూడి ♦ పృథివి గూడిన యట్టి భీకరశక్తి
బఱతెంచి వానరపతులెల్లఁ గూడి ♦ పెఱుకఁ జాలక యున్నఁ బెలికి పోవైచి
యర్కజానిలసుతులాదిగాఁ గలుగు ♦ మర్కటేశులఁ జూచి మనుజేశుఁ డనియె
శౌర్యంబు సలిపెడి సమయంబు గాని ♦ కార్యంబు లడఁచు శోకపు వేళ గాదు

ఘనులార మీరు లక్ష్మణుఁ గాంచికొనుఁడు ♦ వినుఁడు నా పలికెడు వీరప్రతిజ్ఞ
వెనుకకు రాజ్యంబు విడుచుట బంధు ♦ జనులఁ బాయుట పనస్థలులఁ గ్రుమ్మరుట
కడిఁది మాయావిరాక్షసులతో సనికిఁ ♦ దొడరుట మొదలైన దుఃఖంబు లెల్ల
ఘోరాజిలోఁ బాపుకొనువాఁడ నేను ♦ దారుణకర్ము నీ దశకంఠుఁ దునిమి
సమరోర్వి నీతనిఁ జంపెడికొఱకు ♦ నమితవిక్రముఁడైన యావాలిఁ గూల్చి
కపిసేనకై దినకరతనూభవుని ♦ కపిరాజ్యపట్టంబు గట్టితిఁ బ్రీతిఁ
జడతరగ్రాహసంకులంబగుచు ♦ నొండొండ మిన్నందు నూర్ములు గలిగి
కడలేని యావార్ధి గట్టగట్టించి ♦ కడచి వచ్చితి మహాకపిసేనతోడ
వచ్చి లంకాపురవము వేఁడించి ♦ యిచ్చట సౌమిత్రి నిటు గోలుపడితి
నా దశాననుఁ డేచి యాలంబులోన ♦ నా దృష్టిమార్గంబునకు వచ్చెనేని
దృష్టివిషంబులఁ దీవ్రసర్పంబు ♦ దుష్టజంతువుగాల్చు తెఱఁగు చూపెదను
బ్రదికిపోనీ నింకఁ బఙ్క్తికంధరునిఁ ♦ బ్రదరపరంపర పాలు చేసెదను
గిరులెక్కి నేఁ డెల్ల గిరిచరావలులు ♦ సొరిది మారణకేళి చూతురుగాక
లోకపాలురు నెల్ల లోకులు నేఁడు ♦ నా కార్ముకప్రౌఢి నలువారఁ జూచి
రణములోపల నేను రఘురాముఁ డగుట ♦ ప్రణుతవిక్రమలీల బరికింపనిండు
సురకంటకుఁడు డాఁగి సురలోకమునకు ♦ నరిగిన నబ్ధిమధ్యమునఁ గ్రుంకినను
ధరణిఁ దూఱిన రసాతలముఁ జొచ్చినను ♦ బోరి వుత్తుఁ గాకేల పోనిత్తుఁ దన్ను
భువి నర్కకులమునఁ బుట్టితినేని ♦ రవితేజుండగు దశరథుతనూజుండ
నైతినే రాముఁడ నైతినే సంక ♦ దైతేయపతి రణస్థలి నిచ్చనేని
నే విధంబున నైన నిపుడె నిర్జింతు ♦ రావణుండయ్యెడి రాముఁడయ్యెడిని
నిల రామరావణు లిరువురయునికి ♦ గలుగంగ నేరదీ కదనరంగమున
ననుచు నారాచంబు లందందఁ దిరిగి ♦ దనుజేశుపై నేయ దశకంధరుండు
ప్రతిశిలీముఖపరంపరలు పైఁ బఱప ♦ నితరేతరాశుగానేకసంఘములు
మండుమంటలు నభోమండలి నిండ ♦ నొండొంటితోఁ దాఁకు నుగ్రంపురవము
గురుతరకోదండగుణనినాదములు ♦ బెరసె నొక్కొట లోకభీకరగతుల
అంతజర్జరితాంగుఁడై రామువిశిఖ ♦ సంతానవేగంబు సైరింపలేక
గజవైరిఁ గని పాఱు గజము చందమున ♦ రజనీచరేంద్రుండు రణభూమి విడిచి
కచభరములు వీడఁ గమనీయరత్న ♦ ఖచితభూషణములు గనుకనిఁ జెదర

—*: రావణుఁడు విభీషణాదులమాట దలఁచి చింతించుట :*—

ఘనపాదహతి నేల కంపింపఁ బాఱి ♦ వనచరులార్వంగ వడి లంకఁ జొచ్చి
కొలువుకూటంబున గూర్చుండి బుద్ధిఁ ♦ దలపోసి తనకు ముందర విభీషణుఁడు
చెప్పినబుద్ధులు చిత్తంబులోన ♦ నప్పుడు తలఁచుచు నారాముఁడేయు

నేటులుదలఁచుచు నెల్లందుసుభట ♦ కోటులుగొనియాడఁ గుంభకర్ణుండు
నతికాయుఁడును ఘనుండగు నింద్రజిత్తు ♦
మృతులౌటఁదలఁచుచు మిగులఁజిత్తమున
గవిసినశోకాంధ కారంబువలన ♦ నవశభావముఁబొంది యాలోనఁదెలిసి
యంతఃపురంబు నకంతనే తెంచి యంతరంగంబునఁ జింతాక్రాంతుఁడగుచుఁ
దనసతిరావించి తలవాంచిపలికె ♦ వినురాణి జగదేక విక్రమక్రమము
నేమని చెప్పుదు నిదెనాకు నెదుర ♦ రామసహస్రము ల్రమణితోఁ జెడిని
ఎక్కడఁజూచిన నీలంకలోన ♦ నక్కడ రఘురాముఁడై యున్నవాఁడు
ఇఁక జయోపాయ మేమియులేదు ♦ శంకరుచరణము ల్శరణంబు నాకుఁ
ద్రిపురంబులే దేవు దివ్యోగ్రబాణ ♦ విపులాగ్నికీలయ్యె విస్మయఁ బెసఁగ
నిందుఖండంబున నే దేవుమకుటం ♦ మందమై విలసిల్లు నభినవస్ఫురణఁ
దవరనే దేవు హాసమునఁ గిరినాక ♦ సునిశితఖడ్గ త్రిశూలముల్మెఱయు
నే దేవుఁ డఖిలలోకేశుఁడే దేవు ♦ డాదక్షుద్రుంచి యాగంబు చెఱిచె
అలుకతోనే దేవుఁడంధకాసురునిఁ ♦ బొలియించెనే దేవుఁ బొగడు వేదములు
తెలియనే దేవుఁడు దేవుఁడు దేవుఁ ♦ డెలమి వాదేవుని నేభజించెదను
అనికృతస్నానుఁడై యగ్రజన్ములకు ♦ దనియంగ బహువిధ దానముల్చేసి
మదిలోనమదదర్ప మాసముల్విడిచి ♦ పదిలుఁడై సాత్త్విక భావంబుపూని
రక్తాక్షమాత్రము ల్రాజిల్లఁ బరమ ♦ భక్తితో మంత్రజపంబు సేయుచును
నీశ్వరాలయమున కేతెంచి రాజు ♦ నీశ్వరుం డచలితహృదయుఁడై నిలిచి
తగవేదిగావించి దర్భాంకురంబు ♦ లొగిఁ జేర్చి తనకుఁగా నుగ్రదానవుల
నన్నిదిక్కులనుండ నమరించి వేల్వ ♦ నున్నంత నెఱిఁగి మందోదరివచ్చి
కనుఁగొని యోపఙ్క్తికంధరనీకు ♦ జనునె దీననిభంగి శౌర్యంబువిడువ
ఉఱక నీవలిగిన నుదధులు మ్రోయ ♦ వెఱచు సమీరుండు వీవంగ నళుకు
వినువీథినర్కుండు వెలుఁగ శంకించు ♦ ననలుండు తీవ్రార్చు లడరింపనోడు
జగములు నీసన్నఁ జలియించు నేల ♦ మగఁటిమి చెడి విప్రమతముగైకొంటి
నేఁడింత ధైర్యంబు నీకు లేకున్న ♦ నాఁడేల తెచ్చితి నరనాథు దేవి
మారీచుమాటలు మదిలోన నాఁడు ♦ నేరముల్గాఁ గొంటి నీతిగాఁ గంటి
నీతివిచారించి నీచేటుసైఁప ♦ కాతతధర్మాత్ముఁ గదు భీషణుఁడు
తోడరిపల్మాఱును ద్రోహాచరేంద్ర ♦ చెడుత్రోవ లేటికి సీతనిప్పైసి
విడుచుట గడుమేలు విడుమంచు నీకు ♦ విడువక చెప్పఁడె వినవైతిగాక
నూతామహుండైన మాల్యవంతుండు ♦ నీతిదాఁ జెప్పఁగ నీనుగైకొంటె
తప్పక మాతల్లి తగవుచింతించి ♦ చెప్పిరబుద్ధులు చెవియొగ్గివింటె

జననాథుతో నేల శాత్రవంబనినఁ ♦ గనలవేచుతి కుంభకర్ణుమాటలకు
వలదని చెప్పిన వారివాక్యములు ♦ తలఁగూడ నేనేఁడు దనుజలోకేశ
భుజవిక్రమంబెల్లఁ బోవంగవిడిచి ♦ నిజముగా మునివృత్తి నేఁడుగైకొంటి
ఇంద్రుండెయనినోడ నెఱుఁగఁడు రామ ♦ చంద్రుని సనిజగజ్జనులు నిన్నగరె
యనివానిగెల్తుగాక సురేశ నీకు ♦ ననదచదము లేల యనితూలఁబల్క
నెలకొన్న సిగ్గున నిట్టూర్పువుచ్చి ♦ నెఱిఁగి నీమాటలు నిజమగునైన
రామచంద్రునికిఁక రమణి నేవెఱవ ♦ హోమంబు గావించి యుద్ధరంగమున
జననాథవరులను జంపెద నీవు ♦ చనుమన్న మ్రొక్కి గొప్పంబులందంద
దొరుఁగ మందోదరి దుఃఖించి లోని ♦ కరుగుచో నాడిన యార్ద్ర వాక్యములు
విని సిగ్గుపడి క్రేళ్ళ విడిచి రావణుఁడు ♦ చని యొసజ్జునంత జననాథుఁడిచట
ఒడలు నెత్తుట దోఁగియూర్పులు సడలి పడియున్న శేషాహిపతిఁ బోలియున్న
యనుఁగుఁదమ్మునిఁ జూచి యాలోన ధృతికిఁ ♦
బానుపనిమతితోడ శోకింపఁదొడఁగె

—:* లక్ష్మణుని మూర్ఛకు శ్రీరాముఁడు శోకించుట *:—

ఇబ్భంగి సౌమిత్రి యిలమీఁదనుండ ♦ నెబ్భంగిఁ బ్రాణంబు లేను నిల్పుదును
లలిరణంబొనరింప లావెల్లఁగలుగు ♦ బలముష్టి విల్లెట్లు వట్టంగవచ్చుఁ
గన్నుల వ్వము ల్గ్రమ్మంగ నెట్టు ♦ పన్నిపైఁబఱతెంచు పరిసంధిఁ జూతు
నాకన్న లెదుట నేనా సహోదరుఁడు ♦ నాకూర్మిబంధుండు నా ప్రాణసఖుఁడు
నాకుఁ బ్రాణములిచ్చి నను డించిపోయె ♦ నా కుసిగ్గయ్యెడి నా శౌర్యమునకు
నా కేల రణమింక నా కేల జయము ♦ నా కేల రాజ్యము నా కేల సీత
నా కేల శౌర్యంబు నా కేల బ్రతుకు ♦ నాకు సీతతోడిద నాకంబుగాక
జయశాలివై మున్న శరభశార్దూల ♦ భయదాటవులలోనఁ బాటించి తెచ్చి
యరుదైన తుచ్ఛదైత్యాటవియందుఁ ♦ బసిఁ నికై వడిఁగాఁడు పఱచి తేసన్ను
ఉన్నతోన్నత బుద్ధినోరంత ప్రొద్దు ♦ నన్నుఁ గాఁచుటకుఁ గానన భూములందు
నిద్రవోవన్నఁడు నేఁడిట్లు దీర్ఘ ♦ నిద్రపోవుట నీకు నీతియే తండ్రి
పలుమఱు నిబ్భంగిఁ బనవుచుఁ బిలువ ♦ నెలుఁగెత్తి యోయన వేమి లక్ష్మణుఁడ
ఇంక నెవ్వరు గల రే నెందుఁ జొత్తు ♦ నింకఁ బాలయితిగా యీశోకవహ్ని
శుభలక్షణోపేత సురుచిరాకారుఁ ♦ డభిరామ బలుఁడు నా కతిభక్తిపరుఁడు
ప్రియసహోదరుఁడు గంభీరుండు సమర ♦
జయశాలి నా ప్రాణ లఖుఁడు లక్ష్మణుఁడు
ఇతఁడు నాతోఁ గాన కేతెంచె నిప్పు ♦ డితని తోఁ గద నేనింద్రపురికిఁ
గలరిఁదు నొందురు గలదు గాంధర్వులు ♦ నిలనిట్టి సోదరు లెక్కడఁగలరు

యత్నంబు చేసిన నవనిజఁ బోలు ♦ పత్ని నొండొకచోటఁ బడయఁ జొప్పడును
ఇట్టిసద్గుణశీలుఁ డిట్టిదయాళుఁ ♦ డిట్టిబాహుబలుఁ డిఁక నెందుఁ గలఁడు
తమ్ముఁడ శస్త్రమే తలపోయ భక్తి ♦ నిమ్ముల ననుఁ గొల్వ నిమ్మహాభుజుఁడు
ఇతఁడె నాపౌరుషం బితఁడె నాశాంతి ♦ యితఁడె నాకీర్తియు నితఁడె నాస్ఫూర్తి
యితఁడె నాశౌర్యంబు నితఁడె నాధైర్య ♦
మితఁడె నానయమును నితఁడె నాజయము
భావింప నాపాలి భాగ్యంబు నితఁడె ♦ పావనంబగు రాజ్యపదవియు నితఁడె
యని పెక్కుభంగుల నడలుచునుండ ♦ వినిసుషేణుఁడు రామవిభుఁ జూచి పలికె
ఇది యేమి దేవ నీ కింత శోకింప ♦ హృదయంబుఁ గుందింప కిదె చూడు మితని
మొదలఁ బ్రాణములు లేకున్న నావనము ♦
కమ నొప్పియుండునే కళలు దేరుచును
గన్నులిందీవర కమనీయకాంతి ♦ జెన్నొందియుండునే చెలువంబు మిగిలి
అందంబులై యున్న నఱచేతు లెలమి ♦ గెందామరలభంగి గెంజాయ మెఱసె
ననిపల్కి రఘురాము నడలు వారించి ♦
హనుమంతుఁ గనుఁగొని యతనితో ననియె [లియ
మును జాంబవంతుండు మోదముతోఁ దెల్ప ♦ వినినాఁడ వౌషధవిధ మెల్లఁ దె
బోలుచు మహాద్రోణభూధరేంద్రమున ♦ జెలువొందు దక్షిణశిఖరంబునందు
బరికింప దీప్తులఁ బరఁగు విశల్య ♦ కరణియు సావర్ణ్యకరణియు మఱియు
సంధానకరణియు సంజీవకరణి ♦ బంధురతరశుభప్రభ నొప్పుచుండ
నాలుగౌషధములు నవి దెమ్ము వేగ ♦ మీలక్ష్మణుని ప్రాణ మత్తంగ వలయు
లవణసముద్రంబు లంఘించిపోయి ♦ యవశుశద్వీపము లవియును గడచి
వడి నేగి దుగ్ధార్ణవము నాక్రమించి ♦ తడయక పోయి చంద్రద్రోణగిరులఁ
బంబి దేవాసురు ల్బలువడి దొల్లి ♦ యంబుధి మథియించి యమృతంబు వడసి
యందు దాఁచుటఁ జేసి యమృతంబువలన ♦ నంకుజన్మంబు నా నౌషధలతలు
అందు దేవేంద్రుని యనుమతంబును ♦
మందరంబులఁ బోలు మహనీయతనులు [య్యాబు
గంధర్వులాగి వానిఁ గాచియుండుదురు ♦ గంధర్వులకు నీకుఁ గలుగుఁ గ
తెరవున రాక్షసు లిరుగుచుండుదురు ♦ వరుసమాయావులై వారి నేమఱుచు
ద్రోణాద్రి కవలీలతో నేగి యితని ♦ ప్రాణమెత్తుము రఘుపతి సంతసింప
నిరుమూఁడు లక్షలు నిరువదివేలు ♦ పరికింప నిన్నూట పదియోజనములు
వాయునందన నీవు వాయువేగమున ♦ బోయి రమ్మిటఁ బ్రొద్దుపొడువక మున్నె
భానుండు పొడిచినఁ బ్రభఁ దూలి శక్తి ♦ హీనలంబులై పోవు నీయౌషధములు

అటమీఁద లక్ష్మణుఁ డాయువెత్తుటకు ♦ ఘటికయిల్ల సేరదుగాన నీలోన
వానరోత్తమ నీవు వడిఁబోయిరమ్ము ♦ వానిలక్షణములు వలయు నీకెఱుఁగ
హరితఫలంబులు నరుణపుష్పములు ♦ నకదారఁ దెల్లని యాకులు నమరు
జననాథనుత విభీషణు జాంబవంతుఁ ♦ నినసూను నంగదు నెలమి వీడ్కొనుము
అని సుషేణుఁడు వల్కె నాఁగాక యన్న యనిలనందను జూచి యవనీశుఁ డనితె
బడియున్న లక్ష్మణు ప్రాణంబులెత్తి ♦ పడయుము త్రిభువన ప్రఖ్యాతకీర్తి
అనుజులు మును ముప్పు రరయ నాకిప్పు ♦ డనిలనందన నల్వురైరి నీతోడ
ననవిని నీబంటు హనుమంతుఁ డుండ ♦ నినకులోత్తమ నీకు నేల చింతింప
నీయాజ్ఞ దలమోచి నృపసింహ వేగ ♦ మాయోషధీవుల కవలనుండినను
నినుఁ డుదయాద్రికి తేరకమున్న ♦ కొనివత్తు నౌషధ కుధమే ననుచు
నడుగులకెరఁగిన హనుమంతు నెత్తి ♦ నడుఁ గ్రుచ్చి యాలింగనము సేసి విభుఁడు
ఇంద్రుండు నీశిర మినుఁడు నీముఖము ♦ చంద్రుండు నీమది శక్తి నీపిఱుఁదు
లనిలుండు నీవెన్ను హరుఁడు నీవాలం ♦ బనలుండు నీయంఘ్రు లజుఁడు నీబుద్ధి
వరుణుండు నీశక్తి వాణి నీవాణి ♦ గరుడకేతనుఁడు నీఘనబాహుయుగము
కుంజరావణుఁడు నీకు రక్షింతు ♦ రంజనాసుత వేగ యరిగి రమ్మనిన

—:* హనుమంతుఁడు సంజీవకరణికొఱకు ద్రోణాద్రికిఁ బోవుట *:—

సరవి నగ్రజ విభీషణ ఋక్షరాజ ♦ పురుహూతపౌత్రు లప్పుడు వీడుకొల్ప
మేదిని వడి వ్రయ్య మెట్టిన నగము ♦ పాదంబు లూఁదిన బలువడిఁ గ్రుంగ
మెయిగాలి యుర్వీరు మిన్నలు గలఁగ ♦ రయమున లంకాపురంబు గోపురము
వెసఁ గూలఁ గుప్పించి వినువీథి కెగసి ♦ లసితవిద్యున్నిభ లాంగూలలతయు
నుగ్రభాభర్గశ యుగళంబు నెత్తి ♦ యుగ్రాంశుపటుమండ లోదగ్రలీల
వదనంబు గడు సముజ్జ్వలితమై వెలుఁగ ♦ బవనర్ణ సంకోశభంగిఁ జెన్నగుచు
బహుపర్వతంబులు బహుదేశములును ♦
బహునదీనదములు బహువనంబులును
పురములు సాగరంబులు గనుంగొనుచు నరుదారఁ గుహినాద్రి నవలీలఁ గడచి
దెసలు ఘూర్ణిల్లంగ దిగ్భాగమగల నసహాయశూరుఁడై హనుమంతుఁ డరిగె
దేవుల వారట్టి విధ మెల్లఁ జెప్పఁ ♦ గావిని విఘ్నంబు గాఁ జేయఁదలఁచి

—:* కాలనేమి వృత్తాంతము *:—

యొంటి నైరావణుం డొగిఁ గాలనేమి ♦ యింటికి నడురేయి నేగుదెంచుటయు
భక్తితోఁ డుత నర్ఘ్యపాద్యాదు లిచ్చి ♦ నక్తంచరేంద్రున కాతఁ డిట్లనియె
నీమధ్యరాత్రి మీ రిటకు విచ్చేయు ♦ టేమి కారణ మానతిండ నాకనిన
ననినేఁడ నాశక్తి రాతిమృతుండై నయనుజునికై రాముఁ డటుఁ దన్నుఁ బనుప

సంజీవకరణిచే సౌమిత్రిఁబడయ ♦ నంజనాసుతుఁడిప్పు డరుగుచున్నాఁడు
చనివేగ హనుమంతుఁ జంపుః దేవి ♦ వినుభానుగనునంతవిఘ్నంబుసేయు
కలదు దేవాసుర కల్పితంబైన ♦ నలినాకరము ద్రోణనగసమీపమున[త
మదముతో నొకమహామకరియున్నుండు ♦ నదిదేవతల్రమి గునగచరుండెం
ఆసరోవరమున కనిజుంటకుఁగ ♦ మోసపుచ్చును వేగముగ నేగుమనిన
మనముననట నీతిమార్గంబు దెలియు ♦ దనుజేశుతో నాడెఁ దగఁగాంనేమి
మాయామృగాకృతి మారీచుఁడరిగి ♦ మాయమైపోఁడె కూమశమ పోనిమ్ము
ఘోరాజిఁగూలిరి కుంభకర్ణాది ♦ వీరదానవులెల్ల వినుమింకనైన
మనుజేశునకు సీత మరలంగనిచ్చి ♦ దనుజేశలంక నీతమ్మునికిచ్చి
యరిమృడావాసమైన కైలాస ♦ ధరణీతలంబున తపసివై యుండు
కాదేనిబిరుదుమైఁ గదనరగమున ♦ మేదినీపతిచేత మృతిఁబొందిమీఁద
నావరంగవిష్ణుసాయుజ్యంబునొందు ♦ మనిపల్కఁగన్నుల నలుక గెంపెసఁగ
నాయెడ వెసఁ జంద్రహాసంబు పెఱికి ♦ వ్రేయదలంచె నావిధమాతఁ డెఱిఁగి
యిదెచనుచున్నాఁడ నేనంచు నచటు ♦ గదలి మనోవేగ గతిలావుమెఱసి
చనిచూతపున్నాగ చంపకక్రముక ♦ పనసచందనజంబు పాటలీవకుళ
కదలికాఖర్జూర కర్పూరతరులు ♦ మొదలుగాఁగల భూజములసొంపుమిగిలి
బహుశిష్యగణవేదపఠనంబు చెలఁగ ♦ మహనీయమణిదీపమాలికల్వెలుఁగ
భాసురమంజరీఫలహోమధూమ ♦ ధూసరీకృతలతాద్రుమలఁ బెన్నమిగిలి
కలకంఠశుకనీల కంఠశారికల ♦ కలహంసకలరవ కలకలఁ బెఱఁగ
హుతదానమంత్రస్వరోదీర్ణమైన ♦ కృతకాశ్రమము ద్రోణగిరిసమీపమున
నిర్మించిమునివోలె నియతితోఁగపట ♦ నిర్మలాకృతిదాల్చి నేత్రముల్ మూసి
నన్నపుటెలుఁగున జపమాలపూన ♦ లెన్నుటమంత్రమై యొకరికిఁదోఁప
నావనంబుననుండ నాకాశవీథిఁ ♦ బోవుచో మారుతపుత్రుఁడీక్షించి [తినొ
యిదియొక్కమునివనం బింతయొప్పగునె ♦ యిదినాఁడు లేదిప్పుడెదువచ్చి
యెక్కడిదుగ్ధాబ్ధి యెక్కడిమేరు ♦ నెక్కడిమునివనం బిది త్రోవదప్పెఁ
దెరువిమ్మునీంద్రుచేఁ దెలియంగనడిగి ♦ యరిగెదఁగాకంచు నవనికేతెంచి
వనపక్వఫలములు వాంఛఁబుట్టించి ♦ మునిశాపభయము నమ్ముట్టనోడుచును
మునిఁజేరఁజను దెంచి మ్రొక్కి కేల్మోగిచి ♦ మునినాథ దుగ్ధసముద్రంబుకడకు
మనుజేశకులశిఖామణియైనరాము ♦ జననాథుపనుపునఁ జనుచున్నవాఁడ
హనుమంతుఁడనువాఁడనధికమాతృష్ణజనియించెనిచ్చోటజలములుగలవె
చెప్పవేయనవుడుఁ జెఱునవ్వునవ్వి ♦ దప్పివోమాకమండలువుతోయములు
ద్రావుమీఫలములు దనియంగనములు ♦ నీవింక రాతిరి నిద్రింపుమిచట

నగచరోత్తమ యతీతానాగతంబు ♦ లగు మేర లెఱుఁగుచు నంతరంగమున
రాము వంచించి యారాముని దేవి ♦ భూమిజఁ జెఱఁగొనిపోయి రావణుఁడు
అవనీశుఁడును వాలి నవలీలఁ జంపి ♦ లవణాంబునిధిఁ గట్టి లంకపై విడిసి
యనిలోనఁ గుంభకర్ణాది రాక్షసులఁ ♦

దునుమాడి యింద్రజిత్తును ద్రుంచి వైచఁ
బుత్రశోకంబునఁ బుట్టినయలుక ♦ రాత్రించరేంద్రుండు రణభూమిలోన
మయుని చేఁ బడసిన మహనీయశక్తి ♦ రయమునఁ గొని సుమిత్రాపుత్రుపై చ
బడిన యా సౌమిత్రి ప్రాణముల్వడయ ♦ వడి నౌషధములు దెచ్చితివీవు
వినుము నీ విప్పుడు వేయోజనంబు ♦ లనిలనందన వచ్చి తనిలవేగమున
నన్ను నధర్మాత్ములకుఁ గానఁగాదు ♦ నిన్ను నుత్తమునిఁగా నిశ్చయించితిని
జగదేకహితముగా జనియించెఁ గాన ♦ జగదీశుపని మాకు సమకూర్పవలయు
దివ్యౌషధంబులు దీపించునట్టి ♦ దివ్యమంత్రంబు లుపదేశితు నీకుఁ
గంజాప్తునుదయంబు గనిశక్తి మిగుల ♦ సంజీవనీముఖ్య సకలౌషధములు
గలవు మావనమునఁ గనుఁగొని యందు ♦ వలసిన వవి గొంద వడి లంక కరుగు
కను రెప్ప వెట్టెడు కంటె వేగమున ♦ జనియెదు నా మంత్రసామర్థ్యమునను
అనవుడుఁ గపటసంయమిఁ జూచి పవన ♦ తనయుండు వల్కె నో తాపసాధీశ
అక్కడ లక్ష్మణుం డబ్బంగి యుండ ♦ నిక్కడ నుచిత మే యిటు నాకు నిలువ
ఫలములు నాకేల పతిపంచు కోర్కి ♦ ఫలమౌఁ గా సౌమిత్రిఁ బడయక మున్న
నిద్రవోవుట నాకు నీతియె దీర్ఘ ♦ నిద్రఁ గైకొని రామనృపుతమ్ముఁ డుండ
జలములొల్లంబులు చాలవు లేదె ♦ నలినాకరంబైన నదియైన ననుడు
ఉన్నది చేరువ నొక దివ్యసరసి ♦ కన్నులు మూసి యాకమలాకరమున
నమృతోపమానంబులగు నిర్మలోద ♦ కములు ద్రావిన దివ్యకాయుండ వౌదు
దృగ్గోచరములగు దివ్యౌషధములు ♦ దిగ్గనఁ జనుమందుఁ జెరువు సూపుటకు
గపటసంయమిశిష్యగణమునంపుటయు ♦

గపివీరుఁ డేతెంచి కనియె నక్కొలను
మాకందమందార మాధవీవకుళ ♦ శాకోటకుటజక చందనసాల
నీపార్జునాశోక నింబకదంబ ♦ తాపిచ్ఛతరుల సత్తటములదాని
కమనీయకోమల కమలకల్హార ♦ విమలకైరవముల విలసిల్లుదాని
లలితకల్లోల డోలాకేళిఁ దేలు ♦ కలనాదకలహంస కతులొప్పుదానిఁ
బకహంసవేష చుంబక పికక్రౌంచ ♦ పటల కారండవ ప్రతతులదాని
వెనుకొనఁ దమకంబిల్చి విరహులఁ బోదఁ ♦ బనిచిన గెల్చి నిర్భరవృత్తిఁ గొన్న
విపులాభిమానార్థ వితతులీకున్నఁ ♦ గుపితుఁడై రతిరాజు కొల్చులఁ బెట్టె

ననఁబెక్కుబంధంబులై వాఁడిమిగుల ♦ మొనసినకైరవ ముకుళాగ్రశిఖల
మూఁగిచలింపని మొకరితుమ్మెదల ♦ బాగొప్పనొప్పుల బలిసినదాని
మఱికొన్నియెడల సుమకరందములకుఁ దెఱపిచూపక తమ్ముఁదిప్పుచున్న
కమలగేహాంతర కమలశ్రీఁ బోలి ♦ సమరీతి మంగళాచార గీతములు
నలిఁబాడుగాయక నాయకులనఁగ ♦ మెలపునందంద మృదురీతిమ్రోయు
మధుపానరసమత్త మధుకరతతుల ♦ బధిరాబ్జపుటసమీపములొప్పుదానిఁ
గామునుగ్రాక్షుచేఁ గ్రమ్మఱఁబడయఁ ♦ గామించినీరమా కందబృందంబు
లలరునగ్నులలోన నాజ్యహోమములు ♦
చెలువొందన దంద చేయుచందమునఁ
జిలుకలుచంచులఁ జించినఁదొరుఁగు ♦ ఫలరసధారలు పర్ణాగ్రవీథి
దొలఁగక యురిలి చెందొవలలోఁ దొరుఁగు ♦
పొలుపెంతయును జూడఁ బొసఁగెనుదాని
ఫలరసంబులువచ్చిపైబడుదొరుఁగ ♦ వేలసిచెందొవలలోనుండరాకున్న
దొలఁగునుజ్జ్వలహోమ ధూమంబులనఁగ ♦
నలులాకసంబున నమరెను దాని
నాకంజపత్రంబు లనుపళ్లెరముల ♦ శ్రీకరాక్షతములు చెలువొప్పనునిచి
కొలనప్పుడున్నతుల్లఁగువలయవలయ ♦ దళవిలోచనములఁదనరాక కెదురు
చూచు తెఱంగున శోభిల్లుదానిఁ ♦ జూచిడగ్గఱవచ్చి సుఖకేళిఁ దేలి
యడరుసమ్మదమున నానందమంది ♦ కడువిస్మయంబంది కన్నులుమూసి
యక్కొలనికిడిగ్గి హనుమంతుఁడంత ♦ నెక్కొన్నతృష్ణతో నీళ్లుద్రావఁగను
బొలుపారసంసార భూరివారాశి ♦ మలఁగుచువర్తించు మాయావధూటి
విషయరసంబులు వేడ్కతోఁ గ్రోలు ♦ తృషితునిఁగబళించు తెఱఁగుదీపింప
నురవడిసందుండి యొకమహామకరి ♦ హరినాథుపాదంబుల లమిపట్టుటయు
దగిలినయంఘ్రియు లుద్ధతశక్తిఁ దిగిచి ♦ తిగువఁజాలక చాల ధీరుఁడై నిలిచి
యిదియేటిదోయని యేర్పడఁజూచి ♦ మదివాయుసూనుండు మకరిగానెఱిఁగి
యంతకంతకుమది సలుకరెట్టింప ♦ నంతలోనతినిష్ఠురాకారుఁడగుచు
వేవేగరఘురాము విజయవల్లభుఁ ♦ డా వాలమ్మైవాలు నావాలమెత్తి
రాగరసోద్రేక రావణాయోగ ♦ భోగసంచితపాపములు దుల్చుపగిది
వాలను కించి దుర్వారుఁడై విజయ ♦ లోలుఁడై మకరిపండులు దుల్లవేసె

—:* హనుమంతుని మకరి మ్రింగుట *:—

సంతతమునికృత శాపరోగమునఁ ♦ కంతమీయౌషధ మని మ్రింగుకరణి
నరిముఖకరిముఖహేషమొత్తి మెఱసియాహనుమంతుమ్రింగఁదొచ్చుటయు

నక్కటా రాముకార్యము నిల్వఁబడియె ♦ నిక్కడ దీనిచే నిట్టిచందమునఁ [దు
దెగిపోదునో యింకఁ దెఱఁగేది యనుచుఁ ♦ దగ విచారించి యుద్ధతి వాయుసుతుఁ
డదుపులోపలఁ జొచ్చి కడతేర్తు ననుచు ♦ నొడసి స్రమించుచు నున్న సూనకయుండి
దేహంబులోపలి ధృతిదీలకించి ♦ దాహంబు పెంపున ధరియింపరాక
వరవట్లు వెట్టుచు వదనగహ్వరము ♦ తెఱచి నిల్చుటయు నెత్తెరువున వచ్చి
క్రూరనక్రగ్రాహ ఘోరప్రవాహ ♦ వారిఁ బైఁబడుటయు వాయునందనుఁడు
పెనచి తెంచిన దాని ప్రేవులు మూర్ద ♦ గొనివచ్చి చెచ్చెఱఁ గుత్తుకడరిగ
ఆలోచమకరియు నాహా మరుగఁ బోలకపొమ్మని బుద్ధిఁ జింతించి
పరవశంబగుటయుఁ బవననందనుఁడు ♦ దరిఁ జేర్చి మకరి నుద్ధతి వచ్చి వెడలి
కోరి చూడఁగ నొప్పె ఘోరాంధకార ♦ దారుణనిర్ముక్త తరుణార్కు పగిది
ప్రబలమారుణోదగ్ర బడబాగ్నిశిఖ ♦ కలయఁ బర్విన నాటి ఘనపయోరాశి
కరణి నమ్మకరి రక్తము లోలిఁ బెనసి ♦ యరుణమై కడు నొప్పె నప్పుడా సరసి
యంత నా మకరియు నమరియై యమరి ♦ యంతరిక్షమున నుద్యద్దివ్య వసన
జలదంబులోపలఁ జపలత మాని ♦ మెలచు తిరమ్మైన మెఱుపు చందమున

—*: ధాన్యమాలి తన శాపప్రకారము హనుమంతునితోఁ దెల్పుట :*—

నిలిచి మారుతిచేత నిజశాపముక్తి ♦ గలిగిన నలరి యక్కపిముఖ్యుఁ జూచి
యో శపికుంజర యో వానరేంద్ర ♦ నీ కతంబున శాపనిర్ముక్తిఁ గంటి
నే నింకఁ బోయెద నింద్రలోకమున ♦ కేను నీకొక వార్త యెఱిఁగింపవలయు
నని మున్న హనుమంతు నక్కొలనికిని ♦ బనిచిన కపటదాపసిఁ జూపి పలికె
వానరోత్తమ మునివరుఁడు గాఁడరయ ♦ వీని నమ్మకుమయ్య వీఁడు రాక్షసుఁడు
చలమున దానవేశ్వరుని యోగమున ♦
బలియుఁడై నినుఁ జంపఁ బనిపూని వచ్చి
యేనిందులో నుక్కి యెఱిఁగినా చేత ♦ దూని నిర్జింపఁ బుత్తెంచినాఁడు
వీఁడు వధ్యుఁడు నీకు వీని నమ్మకుము ♦ వీఁ డొప్పఁ డిటమీఁద వేవేగఁ జంపి
పొమ్ము నీ వౌషధంబులకు ద్రోణాద్రి ♦ కిమ్ముగా నటఁ బోవ నిదె నీకుఁ ద్రోవ
అనవిని హనుమంతుఁ డాశ్చర్యమంది ♦ వనితఁ గనుంగొని వలనొప్పఁ బలికె
మదిరాక్షి యునునీవె మకరివై యుండి ♦ త్రిదశభామినివైన తెఱఁగేమి యనిన
వినవయ్య పావని వీరాగ్రగణ్య ♦ కనకాద్రిసమధైర్య గాంభీర్యధుర్య
ధాన్యమాలినియనఁ దనరు గంధర్వ ♦ కన్యక నాజన్మకథ యే వరింతు
నఖిలలోకారాధ్యుఁ డగు సదాశివుఁడు ♦ సుఖగోష్ఠి రజతాద్రి శోభిల్లుచుండ
నరుదార నే పాడి యాడి మెప్పించి ♦ హరుచేత నసమాన మగు విమానంబు
వడసి యిక్కొలనిలోపల జలక్రీడ ♦ లెడపక కావింప నేఁగుదెంచుటయు

శాండిల్యుఁడనుముని చనుదెంచినన్ను ♦ నిండినప్రేమంబు నెలకొనఁజూచి
యాలోనఁదనలోన నానందకేలి ♦ నాలోకనాలోలుఁడయి తేలితేలి
కొనకొనితూఁకొన్న కోర్కులప్రాలి ♦ మనసిజజ్వరమున మానంబుదూలి
యేనుబ్రహ్మాత్మజుండ నేతపోధనుఁడ ♦ నేనేడ యెలనాఁగ యేడపొమ్మనక
యూనినగ్గామించుచున్న కన్నఱేఁగి ♦ యేనేడయీవేడ యీదృష్టియేల
నీవుతపస్వివి నీవుపుణ్యుఁడవు ♦ భావింపనిది తపఃఫలవిఘ్నకారి
యనవినిమునినాథుఁ డతికాముఁడగుచు ♦

ననుఁజూచి మదిలోని యాసవోవిడిచి
యిదితపఃఫలసార మెలనాఁగలాఁకు ♦ నిదిపుణ్యఫలసార మెలనాఁగనాకు
నిదిమోక్షసాధన మెలనాఁగనాకు ♦ నిదిస్వర్గసోపాన మెలనాఁగనాకు
ననినరజస్వల యగుటఁగానేఁడు ♦ మునినాథనను మీరు ముట్టఁగారాదు
ఇమ్మూఁడుదివసంబు లేనుమీయింట ♦ నిమ్మితోవసియించి నిజశుద్ధిఁబొంద
మఱిపొందుమనిగంధ మాదనంబునకు ♦ నెఱినేగిమునియింట నిష్ఠతోనుండ
దిక్కులుసాధించి తివిరిరావణుఁడు ♦ నక్కొండసబలుఁడై యారాత్రివిడిసి
యాపర్వతాగ్రంబునం దేనుపాడ ♦ నాపాటవిని దశాననుఁడేగుదెంచి
తనసొంపుదనపెంపు దనప్రతాపంబు ♦ తనపేరునెఱిఁగించి తగబుజ్జగించి
వనితనీరూపయౌవన విలాసములు ♦ మునుమిసిఁదుదముట్ట ముట్టవేనన్ను
ననినఁబరాధీన నటఁగారాదు ♦ ననుముట్టఁదగదన్న నరభోజనుండు
అరయరజస్వల లయినకామినులు ♦ పరభామినులుసువ్వె భామనామెచ్చు
వనితసంగాతింపవలదురమ్మనుచు ♦ ననుఁబ్రియోక్తులఁదేల్చి నాతోరమింప
నతికాయుఁడుదయించె నంతనాపుత్త్రు ♦ నతివేగమున దానవాగ్రణికిచ్చి
దివసత్రయంబును దీఱినపిదప ♦ ప్రవిమలతనుశుద్ధిఁ బాటించియేను
మునిగణాధీశ్వరు ముందఱనిలువ ♦ గనుఁగొని నాయున్నగతివివేకించి
నాయింటిలోనుండి ననుఁడాఁగురించి ♦ పోయినీవెవ్వరిఁ బొందితిప్రీతి
నింతినీయౌవన మెవ్వండుగొనియె ♦ చింతింపకిట్లు చేసితివీవు
పరమపరిజ్ఞాన భావమార్గమున ♦ నరసిచూడినవది యట్టిదకాదె
పరహితమేయారుపడఁతులేయారు ♦ గురుశీలమేయారు గొంతులేయారు
జలజాక్షులేయారు సత్యమేయారు ♦ కలకంఠులేయారు కరుణలేయారు
వనజాక్షులేయారువసుసలేయారు ♦ ననఁబోఁడులేయారు నచ్చికేయారు
తరజాక్షులేయారు తగవులేయారు ♦ పరికింపసతులకు బాసలేయారు
అనితీరఁగోపించి యమ్మునీశ్వరుఁడు ♦ ఘనశాపమిచ్చె సత్కరుణఁబోవిడిచి
యీసగోపంబున నీవిలాసంబు ♦ గాసిగాఁబడనీవు గ్రాహివైయుండు

మెందేని బహుపుణ్యహీనుఁడై నిన్నుఁ♦బొందినవాఁడును బుత్రమిత్రాది
బలములతోఁగూడ భస్మమైపోవ ♦ గలఁడింక నీపాతకంబుననుచు
శాపమిచ్చుటయును జలనంబునొంది ♦

యాపుణ్యనిధిమ్రోల హస్తము ల్మోగిచి
యోమునివల్లభ యోమునిచంద్ర ♦ యోమునిసింహమ యోమునిశ్రేష్ఠ
యీశాపజలరాశి యేతెప్పఁగడతు ♦ నీశాపదావాగ్ని యేనీటనార్తుఁ
గరుణింపవే దయాకరనన్ననుచు ♦ నురుభీతినొందుచు నున్నవీక్షించి
తిరమైనసుజ్ఞాన దృష్టినూహించి ♦ పరమకృపామూర్తిపరుఁ డిట్టుపలికెఁ
గామినియొకకొంత కాలంబుచనఁగ ♦ రాముకార్యార్థమై రానున్నవాఁడు
హనుమంతుఁడిచటికి నతనిచేనీకు ♦ ఘనశాపనిర్ముక్తి గలుగుఁబొమ్మనుచు

—:* మునివేషధారియగు కాలనేమిని హనుమంతుఁడు చంపుట *:—

బోయెగంగాతీరమునకు సవన్నాని ♦ పోయెశాపంబేను బోయెదనింక
ననిచెప్పిదీవించి యాసరోజాక్షి ♦ యనిలజువీక్షించి యరిగనద్దివికి
ఎడపనికపటకతో నిటఁగాలనేమి ♦ కడవచ్చినిలిచె నాకపికులోత్తముఁడు
అప్పుడప్పాపాత్ముఁ డపలసమాధిఁ♦దప్పకయున్న చందమునఁ గూర్చుండి
యొడలిపూరంబుతోనుర మెల్లవిచ్చి నడుమునిక్కించియాసనమొప్పవంచి
కపటచింతావృత్తిఁగన్నులుమూసి♦జపమాదివరుసఁబూసలుత్రోసిత్రోసి
నిక్కంపుజపముగా నెరినోరుగదల♦చక్కలిగనువిచ్చి హనుమంతుఁజూచి
యీయున్నమడువేల యీతడవేల ♦ పోయినపనియొంతి ప్రొద్దింతవోయె
నోలసినీమదిలోన నుపదేశవాంఛ ♦ గలదేనిగురుపూజ గలదెయేమైన
మాకిప్పుడనవుడు మారుతాత్మజుఁడు♦ నీకిదెగురుపూజనిమ్మిఁగొమ్మనుచుఁ
బ్రథననిష్ఠురుఁడు నిర్భరవృత్తివాని ♦

పృథుబాహుమధ్యంబుఁ బిడికిటఁ బొడిచె
నాక్షణంబునదైత్యుఁ డారూపముడిగి♦పక్షియైరణపీఠిఁ బావనిఁగదిసెఁ
గదియుటయునుబట్టి కడిమిదీపింప ♦ జదిపిరెక్కలురెండు సరిద్రుంచివైచె
నారూపముడిగి మాయాశక్తిమెఱసి♦ఘోరసింహాకృతిఁ దివిరిలంఘించి
గర్జించిదంష్ట్రిల గడునుగ్రుఁడగుచు♦గర్జించిరణవీథి దర్పించెనసుర
ఆలయుకహనుమంతుఁ డక్కాలనేమి♦తలబిట్టువగుల నుద్ధతశక్తిఁబొడిచెఁ
బొడిచిననారూపు పోనిచ్చియసుర♦కడఁగిసుగ్రీవుఁడై కడియనేతెంచి
యిదియేమిమారుతి యిచటనేమిటికి ♦ పదపదలక్ష్మణుఁ బ్రాణముల్వచ్చెఁ
దాలఁగకనీవింక ద్రోణాద్రికరుగ♦వలదౌషధంబులు వలదింకమనకు
ననవుడుహనుమంతుఁ డతనిసుగ్రీవుఁ♦డనిచూచి తెలిసికాఁడనినిశ్చయించి

యలిగి రాక్షసు నుర మదరంట వ్రేయ ♦
నిలఁగూలి మూర్ఛిల్లి యింతలోఁ దెలిసి
యలుకను శతశృంగుఁడై హనుమంతుఁ ♦ డతిశాతనఖముల నడరి నొప్పింప
ముష్టిఘట్టనముల మొగిఁ బాదహతుల ♦ నష్టసత్త్వునిఁ జేసి నలజిక్కువట్టి
యమితసత్త్వక్రీడన లీలఁ దిగిచి ♦ కనులనాళముఁ ద్రెంచు గంధసింధురము
పరుసున రాక్షసప్రవరమస్తకము ♦ తెరలిచి వెరనుల్చి త్రెంచిపోవయిచి
నలినేచి వెసిసింహనాదంబు చేసి ♦ తొలఁగక మారుతి ద్రోణాద్రి కరిగి
నరిగి యాగిరిమీఁద నౌషధలతలు ♦ పరికించి పరికించి పవననందనుఁడు
బహుదివ్యలతికా విభాభాసమాన ♦ మహిమయు నిర్మలమణిగణప్రభల
దీపవృక్షంబుల దీప్తులుపర్వ ♦ దీపించు నక్కొండ ద్రిమ్మరిచూచి
హితపుష్పగంధంబు లివెంతలనుచు ♦ తనఁడు దగ్గరఁబోవ నవిడాఁగిపోయె
నంతనా హనుమంతుఁ డంతరంగమునఁ ♦ జింతించి సంతాపచిత్తుఁడై పలికె
నోపర్వతాధీశ యోయద్రిరాజ ♦ యోపుణ్యవత్సల లియోగిరిచంద్ర
యనఘుఁడా రఘురాముఁ డౌషధంబునకుఁ ♦
బనిచిన వచ్చితిఁ బనిపూని యేను
సన్నిలోకములకు హితమైన నపనికి ♦ నన్నేలవంచింప నగ ... జనికు
నడరినీయందున్న యౌషధలతలు ♦ పొడసూపవేవేగ పోఁబనిగలదు
ఇమ్ములనిదిలోకహితకార్యమగుట ♦ మిమ్ము వేఁడెదమీరు మీప్రభావముల
దీపింపుఁడీ యోషధీలతలార ♦ చూపుఁడీనాకు మీసురుచిరాకృతుల
ననిపల్కవంచన నపుడు తేజముల ♦ పొనుపడఁ దనకవి పొడసూపకున్న
నకులోత్తమునీకు నారాక చూచి ♦ తగఁ బ్రియుం బొనరింపఁ దగదూరకుండ
ననితన్నుఁ బ్రార్థించి యడుగుచున్న ♦ తనకు నౌషధము లాధరణీధరంబు
చూపకుండుటయును జూచియెంతేని ♦ కోపించి వానరకులవజ్రపాణి
యేనెంత వేఁడిన నేలనీమనసు ♦ నానదు యెడ నగకులాధముఁడ
తలకొనితాలకు దయగల్గునన్నఁ ♦ గలుగునే గుణశూన్యకఠినమూర్తులకు
నని మ్రొగ్గకోపాగ్నులంగరోమములఁ ♦ గనదగ్నికీలలై క్రమ్మ బైఁగ్రమ్మ
రాముతో నెదిరిన రావణాచలము ♦ నీమొయింబెకుఁగుదు నిలననిమాడ్కి
దశయోజనముల విస్తారబుపంచ ♦ దశయోజనోన్నతత్వంబునుగలుగు
నాభీలతరశైలమవలిఁబెతికె ♦ భూభాగమగల నభోభాగముద్రువ
నపుడాగిరిసురేంద్రు ననుమతిఁగాచు ♦
తపనతేజులుత్రయోదశకోటిసంఖ్య
గలచిత్రసేనాది గంధర్వపతులు ♦ బలశౌర్యములుమీఱఁ బావనిఁజూచి

యిదిదివ్యగణవాస మిది మేరుతుల్య ♦ మిదిజగజ్జీవనం బిదినీకువలదు
నీకిదిదక్కదు నెరిడించిపొమ్ము ♦ పోకున్నఁ బ్రాణము లోఁగొందువనుచుఁ
గదనోగ్రసమవర్తి కపివీరుఁడార్చి ♦ వదలనికడిమిమై వాలివీక్షించి
బంధురంబగు వాలపాశంబుతోడ ♦ బంధించిబంధించి బలువిడిఁద్రిప్పి
యలుకమైఁగొందఱ నబ్ధిలోవైచె ♦ నలుకమైఁగొందఱ నడరికారించి
నలుకమైఁగొందఱ నదరంటవేసె ♦ నలుకమైఁగొందఱ నవనిపైఁగూల్చె
నామహావీరు నుద్ధతశక్తిఁజూచి ♦ సోమింపరాదని స్రుక్కికేల్ మొగిచి
ఓకపికుంజర ఓవానరేంద్ర ♦ యీకొండగొనియేగు మెలమితోనీవు
అనివాయువందను నర్థిదీవించి ♦ వినుతించిగంధర్వవీరులుదోలఁగ
నధికసత్వంబున ననిలనందనుఁడు ♦ కుధరంబు బిట్టెత్తుకొని మింటికెగసి
కడువేగమున భయంకరవృత్తిదోఁప ♦ నడరిజితారాతియై సొంపుమిగిలి
భూచరఖేచరాద్భుత వేగుఁడగుచు ♦ నాచందమునఁ బోవ నామధ్యరాత్రి
ప్రథామిదమిత్రుఁడౌ భరతుస్వప్నమున ♦ రామసౌమిత్రులురణమధ్యమునను
దలమూఁసియలతోడ దనువులుడస్సి ♦ బలహీనులై క్రుస్సి పంకమధ్యమున
బడిపలవించుచు నలుగోదనంబు ♦ లుడుగక కావించుచున్నబిట్టులికి
భరతుండుమేల్కని పాపంపుఁగలకుఁ ♦ బరితపించుచు వెలుపలికినేతెంచి
కలలోన రామలక్ష్మణులున్నతెఱఁగు ♦ తలపోసితలపోసి తలఁకుచునుండఁ
దొడఁగిదానికిఁ దోడు దుర్నిమిత్తములు ♦

కడఁగిపెక్కులు దోఁపఁగాభీతిఁబొంది [గఁదొ
యిదియేమిపాపమోయిదియేమి తెఱఁగొ ♦ యిదియింకఁటమింఁదనేమిగా
రామసౌమిత్రు లరణ్యమధ్యమున ♦ నేమైరొజానకి యేమైనయదియొ
యెన్నంగఁబదునాలు గేండ్లునిండు ♦ చున్నవివినఁగరాదొకవార్తయైన
నాసత్యధనులకు నాయుదారులకు ♦ నాసదాచారుల శాస్త్రార్థులకు
నేకీడుఁగాకుండ నేనునాసుకృత ♦ పాకమిచ్చితినని భరతుండుపలికి
భావించి వేదతత్పరులభూసురుల ♦ వేవేగరావించి వేదోక్తయుక్తి
సకలదానంబుల సకలధర్మముల ♦ సకలహోమంబుల శాంతిచేయించె
నాలోనహనుమంతుఁ డాకాశవీధి ♦ నాలోకబాలార్కుఁడై వచ్చివచ్చి
బలిసిననిష్ఠతో భరతేశుఁడున్న ♦ పొలుచునందిగ్రామపురిఁ జేరవచ్చి
ఘనజటాభారవల్కలములతోడ ♦ ఘనఘనశ్యాముఁడై కమలాప్తకులుఁడు
భరతుఁ డారఘురాముభంగిఁ దోఁచుటయుఁ ♦

గరమద్భుతంబంది కపిముఖ్యుఁ డపుడు
సౌమిత్రిమృతుఁడైన జానకిడించి ♦ రాముఁడొక్కరుఁడిటురాఁబోలుననుచు

నడుగుదునోయంచు నడుగఁబొమ్మనుచు ♦
గడఁకతో దలపోసి కపికులోత్తముఁడు
శరణాగతత్రాణచరితార్థచరితుఁ డరయంగ రఘురాముఁ డభిరామబలుఁడు
తనసూనృతము డించి మమ్ము నిడించి ♦ తనకులసతి డించి తనపేరు డించి
యంగదసుగ్రీవు లాదిగాఁ బ్లవగ ♦ పుంగవకోటులఁ బోరిలో డించి
మొనసి రావణుబాణములతో డగించి తనమేనఁ దెచ్చునే దశరథాత్మజుఁడు
మానవసామాన్య మతిఁ జేసి రాము ♦ నే నేల చూచితి నీపిన్న చూపు
బలసి రామునిఁ బోలునొకతపోధనుఁడు ♦ కలిగినాఁ డింతియ కాఁబోలు ననుచు
నతివేగమువలనఁ గరిగెనుత్రోవ ♦ నతులబలోదాత్తుఁడై పోవఁబోవ
కలగన్న భరతుఁ డాకాశంబుఁ జూచి ♦
యాలఘుఁడై చనుచున్న హనుమంతుఁ గాంచి
యిటదోప నేలనో యీదుర్గ్రహంబు కటుబాణము దీనిబడ నేయవలయు
ననిశరచాపంబు లాటోప మొప్ప ♦ ఘనసత్త్వుఁ డప్పాతు కైకొన్నఁ జూచి
కాకుత్స్థతిలకుఁ డాకర్ణించుకొలఁదిఁ ♦ నాకాశమున నుండి యశరీరిపలికె
నీతనిదిక్కున హితబుద్ధిసేయు ♦ మీతఁడు మీబంధుఁ డివల్గవలదు
అనియొప్పఁబలికిన యశరీరిపల్కు ♦ వినిశరచాపము ల్విడిచె నవ్విభుఁడు
అంతనా హనుమంతుఁ డంభోధిఁగదియ ♦ నంతలో రాక్షసు లక్షీణబలులు

—:* హనుమంతునితో మాల్యవంతుఁడు పోరుట *:—

ఉదితబలోదగ్రు లుగ్రవిక్రములు ♦ పదివేలుకోటులు బలిసి తన్గొలువ
రావణుపనుపున రణజయస్ఫురణ ♦ వావిరి సమ్మాల్యవంతుఁడు వచ్చి
చదల నెదుర్పడి జలధిమధ్యమునఁ ♦ బాడవియా హనుమంతుఁ బోనీక కదిసె
గదిసిన నక్కొండ ఘనబాహుశక్తిఁ ♦ బదిలంబుగాఁ బట్టి పవననందనుఁడు
దాఁకిన భుజబల దర్పము ల్మెఱయ ♦ వీఁకతో రాక్షసవీరులు గదిలి
పరశుతోమరచక్ర పట్టసప్రాస ♦ శరవాలశూల ముద్గరభిండివాల
తతులనొప్పింపనుద్ధతిఁ బెచ్చు పెరిగి ♦ యతులవిక్రమపక్షుఁ డవి లెక్కగొనక
యమరుల చ్చెరువందఁ ననిలనందనుఁడు ♦ సమరలీలాభీల చటులవాలమునఁ
గడఁకతో నొడిసి రాక్షసవీరవరుల ♦ వడిఁ జుట్టిపట్టి యవ్వనధిలో వైచె
భంజించెఁ గొందఱఁ బదతాడనముల ♦ భంజించెఁ గొందఱ భయదనాదముల
భంజించెఁ గొందఱ బెట్టువాలహతుల ♦ భంజించెఁ గొందఱఁ బరుషోగ్రదృష్టి
గొందఱఁ బడఁద్రోసెఁ గొందఱ వ్రేసె ♦ గొందఱ గారించెఁ గొందఱ నొంచె
నంతరోషాయత్తుఁడై మాల్యవంతుఁ ♦ డంతకాకారుఁడై హనుమంతుమీఁద
నవయబాణములు నూటేసె నేయుటయు ♦ ఘనవాలమున వాని ఖండించి వైచి

యలుకవిల్గొడిసి యల్లటుఁ బాఱవైచి ♦
బలుతోఁక చేఁ గాళ్లుబంధించి యెత్తి
వడివైచుటయు మాల్యవంతుఁడు మగిడి ♦ పొడిచె నమ్మారుత పుత్త్రు శూలమున
నది లెక్కసేయక యతఁ డున్నఁ జూచి ♦ యదరులు చెదరంగ నత్యుగ్రశక్తి
నురమునొప్పించిన నురుశోణితంబు ♦ లురువడిఁ దొరుఁగంగ నొక్కఁ తనిలిచి
యలుకతోఁ గపివీరుఁ డసమున వాని ♦ తలఁ దాచిచని వియత్తలమున నిలిచె
దలకొని దివిజులు త లూఁచి పొగడఁ ♦ దలఁచన్నటయు వాని తలబిట్టువగిలి
రాలిఁ గీలాలంబు లొలుకలోఁ దారి ♦ సోలోన మూర్ఛిల్లి యంతలోఁ దెలిసి
కదనరంగమున నిగ్గదగ దానీకుఁ ♦ మదిరించు గదయుల్కతో బిట్టువైచి
తడయక యది తాకు తఱిమంట లెగయ ♦ వడిజూచి యమ్మాల్యవంతుఁ డిట్లనియె
నోరి వానరుఁడ యీ యుదధిలోనద్రి ♦ బోరనఁ బడవైచి పోనిన్నుఁ జంప
మొనసేసితొల్లి సముద్రమధ్యమున ♦ వినతాత్మజుని నెక్కి విష్ణుండు వచ్చి
నాతోడ యుద్ధంబు నలిఁ జేసి చేసి ♦ భీతుఁడై చాలక పెనపేది పోఁడె
లోకంబు లెఱుఁగ ముల్లోకమీకడిమి ♦ నీకోర్వరాదురా నెరినాదు కినక
అనవుడు హనుమంతుఁ డమ్మాల్యవంతు ♦
గనుఁగొని పలికెను త్కటకోపుఁడగుచు
యుద్ధమధ్యమున మహోద్ధతి మెఱసి ♦ వృద్ధరాక్షస నీవు వెఱవక నన్నుఁ
గదియ నెవ్వఁడవని కదియు నవ్వీరు ♦ మద భాషలకు నల్గి మాల్యవంతుండు
ఘనచంద్రహాసాగ్ర ఖడ్గమంకించి ♦ హనుమంతు వక్షు ముద్ధతిశక్తివైవ
నదివజ్రనిభకాయుఁ డగునాంజనేయు ♦ విదితంబుగాఁ దాఁకి వెసఁబెల్లు విఱిగె
నవిలజుఁ డాఖడ్గహతికిఁ దనొచ్చి ♦ కినిసి నిశాచరుఁ గిట్టి బిట్టలిగి
భూతభయంకరా ద్భుతవాలమెత్తి ♦ యాతని నడుఁ జుట్టి యలుకతోఁ బట్టి
చెలఁగి యాకసమున జరజిరఁ ద్రిప్పి ♦ యులఘువిక్రమశీలుఁ డబ్ధిలో వైచె
వైచినఁ బడి మాల్యవంతుఁడాత్రోవ ♦ వేచని పాతాళ వివరంబుఁ జొచ్చె
హతశేషరాక్షసు లన్నిదిక్కులకు ♦ ధృతిధూలి పఱచిరి దివిజులు పొంగఁ
గొండంత గెలుపుతోఁ గొండతో సమర ♦ మండలి వాఁగడధీమండనుండరిగెఁ
బర్వతదీప్తిఁ బ్రభాతవిభ్రాంతి ♦ పర్వినభీతిమై భానువంశజుఁడు

—*: శ్రీరాముఁడు లక్ష్మణునిఁ జూచి పరితపించుట :*—

సమరలక్ష్మీరతిశ్రమనిద్రనొందు ♦ క్రమమునఁ జెలువుఁడై రణశయ్యనున
తమ్మునిఁ గనుఁగొని తమ్ముఁడా నీవు ♦ తమ్ముఁడవై యుండు టది నోచనైతి
నిలజీవులకు నెల్ల నిదె వేగఁ బ్రొద్దు ♦ పొలుపేరి నాపాలి బ్రొద్దస్తమించె
సతిముత్తెనడవిలో నాలిఁ గోల్పడితి ♦ నెఱయ నేఁ డాజిలో నిన్నుఁ గోల్పడితి

కడనారుకైన దుష్కీర్తిపంకంబు ♦ గడపదిక్కెవ్వరు గలరుసౌమిత్రి
మానపయోనిధి మహనీయశీలు ♦ నానోచికన్న యున్నతపుణ్యశీలు
నేనునీచేనమ్మి యిచ్చినవకట ♦ కానలోఁగొనిపోయి కడతేర్చితన్న
యేమేమిసేయుదు నిటమీఁదనన్న ♦ నేనుసుమిత్రతో నేమననేర్తుఁ
గదిఁబోయిభరతశత్రుఘ్నులనన్ను ♦ గదియనేతెంచిలక్ష్మణుఁడేడియనిన
నేమనిచెప్పుదు నేమనిపోదు ♦ నాముఖంబునను దైన్యము దోఁపనింకఁ
దేనికిఁజింతింప దేనికివగవ ♦ నేనుజింతించెద నిసుదీర్ఘచింత
బలుఁడైనరావణు గతులకుఁజేసి ♦ దలపోసిమదిఁగోసి తమయన్నఁబాసి
హితభృత్యవృత్తిమైనీవిభీషణుఁడు ♦ చతురుడైననువచ్చిశరణంబుజొచ్చెఁ
జొచ్చినఁబ్రీతి రక్షోరాజ్యమెల్ల ♦ నిచ్చితినీకని యేనూఱడించి
పట్టంబుగట్టితిఁ బ్రతినతోఁబలికి ♦ నెట్టననిండించెప నేర్పులేదయ్యె
నిదివేగుచునువచ్చెనింకలక్ష్మణుఁడు ♦ బ్రదుకఁడునకింకఁబ్రాణముల్వలదు
దురితదూరుని వీనితోడిదెలోక ♦ మరసిచూచిననింక నడలోర్వరాదు
శరణన్నవారి నెచ్చటపీడరాదు ♦ ధరణిపైక్షత్రియ ధర్మమూహింపఁ
దారులోనైనను దమ్మాశ్రయించు ♦ వారలరక్షింప వలయురాజులకు
నీవిభీషణుఁగొంచు నీవేగిపుణ్య ♦ భావుఁడైనట్టి మాభరతుతోడుతను
నరయనిక్కడికార్య మంతయుఁజెప్పి ♦ పరఁగంగలంకకుఁ బ్రతిగాఁగనతని
వెలయునయోధ్యకు విజయలగ్నమున ♦ ఫలసిద్ధిసొంపారఁ బట్టంబుగట్టు
మనియేనుజెప్పితి ననియొప్పఁజెప్పి ♦ యొనరంగనందుండి యుచితంబుతోడ
వానరేశ్వరనీవు వాలినందనుఁడు ♦ సేనఁగొంచుఁ గిష్కింధకునరుగు
మనదైన్యపాటుతో నాడభీతిల్లి ♦ వనచరాధీశుండు వలనొప్పఁగదిసి
పరికించిచూడఁ బ్రభాతంబుగాదు ♦ నరనాథ యిప్పుడు నాలవజాము
సొచ్చెనింతియువాయునూనుండునిపుడువచ్చుసంతాపింపవలదంచుఁ దేర్చి
తేర్చిననంతయుఁ దేలకమఱియుఁ ♦ జేర్చినశోకాగ్ని పెల్లునమిగులఁ
బొరిఁబొరిభూమిపైఁబొరలుచునగలఁ ♦ బురపురబొక్కుచుభూవరతనయుఁ
డన్నసేజనకాజ్ఞ నడవికేతేర ♦ నిన్నుఁబొమ్మనకున్న నీవునావెనుకఁ
జనుదెంచియిడుమలఁజాలంగఁబడఁగఁ ♦ గనుఁగొనిమనమునగరముశోకి తు
రేఁడునీవారుచేత నీలావుదూలి ♦ పోడిమిచెడియిట్లు భూమిపైనుండ
నేనెట్లుబ్రదుకుదు నేమనివగతు ♦ నేనినుడించి యెల్లగురుఁబురికి
సీతనాకేటికి జీవమేమిటికి ♦ నీతరుచరసేన లేటికినాకు
నోతండ్రినాకింకనుర్వి యేమిటికి ♦ నాతండ్రిక్రియనన్నునరయుచుండుదువు
నావిధివినునేఁడు నాకారిచేత ♦ నీవిధినిటుసేసె నీరసంబెత్తి

దేశదేశముల నతిజనంబులను ♦ దేశదేశములందుఁ దివిరి బాంధవుల
నరసి కానఁగవచ్చునట్టి దేశములఁ ♦ బరఁగుతమ్ముని నొందుబడయంగవచ్చు
ననియు చేతనుఁడగు ననుజు పై వ్రాలి ♦ కనుఁగొని దుక్కులు కడు దైర్యమెడలి
యన్న రో నీవు నన్నన్న పిలువ ♦ నెన్నఁడు వినఁగల్లు నింక వీనులకు
సీత సుమిత్రగా నీమతిఁ జూతు ♦ చూతు నన్దశరథ క్షోణీశుఁగాఁగ
నెప్పుడు నాతోడ నెడఁబాయకుండు ♦ దిప్పుడు పాడియే యెడఁబాయ నన్ను
నాతతవిషమ ఘోరారణ్యభూమిఁ ♦ బ్రీతిని రాముఁ ద్యాగాఁ బెంపునఁ జూతు
పూవుపాన్పున నిద్రఁ బొందించు మేను ♦ నీ వెట్లు చేర్చితి నేఁడు బా నేలఁ
బడియు నిద్రించెదు పరిణామ మొందు ♦ పుడమిపై నందన పొలుపొంద నీవు
పదునాలుగేండ్లును బాయక నిద్ర ♦ పదిలంబుగా డించి పన్నుగా నడవి
నరసి నవ్రతిుంచి యాజిమధ్యమున ♦ నరులఁ జంపక పోప నగు నయ్య నిద్ర
నిద్ర నీ విట్లున్న నిజమయ్యె దీర్ఘ ♦ నిద్ర మీ యన్నకు నృపనందనుండు
మీ యన్నకెప్పుడు మిక్కిలి భక్తి ♦ సేయుదు నేఁడేల చింతింపవకట
యున్నవంతయుఁ దూలి యుండెడు మాట ♦ లిన్నియుఁ బొంపిరి నేల పల్కదవు
రావణకోటుల రణముఁ గూల్చి ♦ భూవిభునందను భూసుతఁ గూర్తు
నని నాకు వీనుల కసలారఁ బలుక ♦ కునికికిఁ గతమేమి రూపుణ్యమూర్తి
యిప్పుడు మేల్కని యేల శ్రీరామ ♦ తప్పఁ బల్పఁగ నీకుఁ దగు నయ్య యనుచు
నొప్పెడి మాటల నూఱడఁ జేసి ♦ తప్పక కనువిచ్చి తనుఁ జూడు మనుచు
రాసుతు కెంగేలు రమణమై యొదిగిచి ♦ భాసురంబుగ గండపాలికఁ జేర్చి
ననుఁ దేర్ప వేయని నరనాథుఁ డపుడు ♦
మనమునఁ దెలియక మహిమీఁద బడియె [పులు
బడియున్న యా రఘుపతి మూర్ఛ దెలిపి ♦ యడలు వారించి రాయఁగ చరాధి
అంతప్రభామండలాభీలుఁడగుచు నంతలో హనుమంతుఁ డరుగు దెంచుటయు
దేజంబు పెంపున దృష్టిఁ బరాక ♦ తేజోదివాకర దీప్తుఁడై యున్నఁ
గపులెల్లఁ గలఁగి యుత్కటభీతిఁ బొంది ♦ విపులతర భ్రాంతివివశులై తూల
నాలోనఁ గమలాప్తుఁ డని చూచి విభుఁడు ♦ కాలకాలోదగ్ర గతి నిండనుండఁ
గపికులాధీశులఁ గని యనీకించి ♦ కపులార సూర్యునిఁ గంటి రేమింటఁ
జేకొని బహుపుణ్య శీలంబులందు ♦ మాకులంబున కెల్ల మహిఁ గర్తమైన
యంధకారారాతి యకటయాపద్మ ♦ బంధుండు నేఁడు నాపగ వాని కూడి
యుదయించుచున్న వాఁ డుగ్రతమిగిలి ♦ యి దేవడి సౌమిత్రి యిబ్బంగి నుండ
నీసూర్యమండలం బిలమీఁదఁ గూల ♦ నేపెదనంచు నహీనసాహసుఁడు
బ్రహ్మాండకోటుల భంగింపఁ బొంగి ♦ బ్రహ్మాదులదరంగఁ బ్రబళయకాలంబు

నాఁడుగ్రవృత్తిఁ బినాకివిల్లంది ♦ వాఁడిమిమెఱయ నవ్వేడుపుదీపింప
నాపూర్ణభుజనైపుణాటోపకోపుఁ♦డాపినాకియుదా నెఱుగుటఁదెల్పుచును
విల్లంటిభుజబల వీసూర్తిమెఱయఁ♦బెల్లుకోపించినసంభృతవేగుఁడగుచు
జటులరౌద్రాస్త్రంబు సంధింపఁదివురు ♦

పటువృత్తిఁగనుఁగొని భయవృత్తిఁగెంగి
యునమానసత్త్వతో నతికోపుతోడ♦వసుధేశుతో జాంబవంతుఁడిట్లనియె
నగణితశక్తిమై నలుకదీపింప ♦ జగతీశనీవిటు శరముపుచ్చుటయు
ధృతిదూలినలుకడ దేవగంధర్వ ♦ పతులెల్లభీతులై పాఱుచున్నారు
ఇదియేమిరఘురామ యిచ్చలోనీవు ♦ పదిలుండవై చూచి భావింపలేవు
వెలుగొందుబహుదీపవృతీదీధితులు♦దొలుకాడునుజ్జ్వలద్రోణాచలంబు
గొనివచ్చుచున్నాడు గురుసత్త్వధనుఁడు ♦

అనిలసూనుఁడుగాని యర్కుండుగాడు
భానుప్రభాభాసిపవనసూనునకు ♦ భూనాథయెదురుగాఁబుచ్చువానరుల
ననుటయుశ్రీరాము నానతివడసి ♦ హనుమంతునకునెదు రరిగిరికపులు
ఆకాశముననుండిహనుమంతుఁడంత♦నాకొండఁగొనివచ్చియవనిపైనునిచి
జననాథుఁడగురామచంద్రునకర్థి ♦ వినతుఁడై కరములు వెరవొప్పమొగిచి
యుర్వీశనేఁబోయి యొగినౌషధముల♦పర్వతంబునఁబెక్కుభంగులవెదకి
పనిఁబడిఁగానక పర్వతంబెల్లఁ ♦ గొనియేనువచ్చితిఁ గువలయాధీశ
యుతిరిమియానతినటఁబోవునపుడు ♦ నెడపనికడఁకతోనిటవచ్చునపుడు
కడఁగివిఘ్నములనేకములయ్యెనదుఁమ♦దడయుటదప్పుగాదలపోయవలదు
ననవుడురాముఁడా హనుమంతుఁజూచి♦ ఘనతరసంతోషకలితుఁడైపలికె
నీకేటితప్పులు నీచేతఁబడికెఁ ♦ గాకుత్స్థకులలీల గౌరవోన్నతులు
సురుచిరశక్తిమై సురలకునైన ♦ నరుదైనపనిచేసి తనిప్రీతినొందె

—:* సుషేణుఁడు సంజీవకరణిచే లక్ష్మణుని మూర్ఛఁదేర్చుట *:—

నాసమయంబున నర్కతనూజుఁ ♦ డాసుషేణునిఁజూచి యర్థిదీపింప
నిక్కొంతఁదడయక యీవువానరులు♦నెక్కి మహౌషధు లేర్పడఁదెచ్చి
భావించిలక్ష్మణు ప్రాణముల్వడయు ♦ వేవేగ యనవుడు వినిసుషేణుండు
పనిపూనియనపాడు బరవసంబొప్ప ♦ వనచరసహితుఁడై వడిగొండనెక్కి
యమరేంద్రుఁడిక్కడ నర్థితోఁదొల్లి ♦

యమృతపానముచేసె నమరులుదాను
నిచటవిష్ణుఁడుజగద్ధితబుద్ధిఁపూని♦యచలుఁడై తనచక్రహతిఁద్రుంచివయిచె
నురురాహుమస్తకంబుగ్రుఁడై యనుచు♦దరుచరవరులకుదవిలిచూపుచును

నోగిఁ బర్వతమున మహౌషధుల్దెచ్చి ♦ తగఁ బ్రయోగింపనంతన దానిశక్తిఁ
దగిలినాటిన బాణతతులోలి వెడలి ♦ మగిడెఁ బ్రాణములు లక్ష్మణకుమారునకు
నప్పుడు వానరులందఱుఁ గొలువ ♦ నెప్పటి పేర్మితో నినవంశుకడకుఁ
జనుదేరఁ గౌఁగిట సౌమిత్రిఁ జేర్చి ♦ కనుఁగవ హర్షాశ్రుకణములు దొరుఁగ
నాసమీరజుఁ జూచి యతులపుణ్యాత్మ ♦ యీసుమిత్రాపుత్రు నిచ్చితి నాకుఁ
గాకుత్స్థకులమిత్రుఁ గమనీయగాత్రు ♦ నేకతంబునఁ గంటి నేఁడు లక్ష్మణుని
బడిననామ్ముని ప్రాణంబులెత్తి ♦ వడసితి నిపుడు నా ప్రాణముల్గూడఁ
బ్రాణంబులను నాకుఁ బరికింప నితఁడు ♦ ప్రాణబంధుఁడవు పరమబంధుఁడవు
కపిచరోత్తమ నీవ తలఁపనీ చేయు ♦ పురుషార్థ మొరులకుఁ బోలునే చేయు
నుపకారమునకుఁ బ్రత్యుపకార మేమి ♦ కపివీర సేయుట గడునుత్తమంబు
నీకుఁ బ్రత్యుపకృతి నేనేరఁ జేయ ♦ నీకాపదలు లేవు నిఖిలలోకముల
ననిపల్కి రఘురాముఁ డంతసుపేఁణు ♦ గనుఁగొని కొనియాడి కౌఁగిటఁ జేర్చి
ముదితాత్ముఁ డగుచు నిమ్ములను పేఁణు ♦
నుదధిపొంగిన క్రియనుబ్బి యారాము

ననుమతిరణములో నటఁబడియున్న ♦ వచనగోత్తముల జీవము లెల్లఁ బడసె
నంత వానరవీరు లంతరంగమున ♦ సంతోషమొప్పఁగ నాశైలంబుఁ గదిసి
సకలరత్నోజ్జ్వల నానాశృంగముల ♦ సకలంకరుచిఁ బొల్చు నాసొంపు చూచి
యవనీశు ననుమతి నగ్గిరి యెక్కి ♦ వివిధస్థలంబుల వేడుకఁ దిరిగి
పరిపక్వఫలములఁ బరితృప్తి వొంది ♦ పెరయ తేనియలాని పెన్నిరుగ్రోలి
యవగాహనము చేసి రందఱు నంతఁ ♦ బవననందనుఁ జూచి పలికె భూవిభుఁడు
ఎప్పటిచోటనే యేర్పడఁబెట్టు ♦ మిప్పర్వతాధిపు నింక నీవనుచు
రాముఁడు వంప సంరంభంబు మెఱసి ♦ యామహాశైలంబు ననిలనందనుఁడు
అలఘుఁడై కొనిపోవ నాకాశవీథి ♦ జలధిమధ్యమున రాక్షసులు వీక్షించి
పఱచియిత్తెఱఁగెల్లఁ బఱవడిఁ దనకు ♦ నెఱిఁగింప నేర్పడ నెఱిఁగి కోపించి
లంకాధిపతి జయాలంకారధనుల ♦ శంకుకర్ణస్థూలజంఘులతోడ
నటమహానాదుని నటమహావక్త్రు ♦ నటజతుర్వక్త్రు నినట మేఘజిత్తు
నటహస్తికర్ణు మహావీరజైత్రుఁ ♦ గఱువాక్యశాలి నుల్కాముఖుఁ జూచి
యలవు సొంపున మీర లడ్డంబు దాఁకి ♦
బలియు నాహనుమంతుఁ బట్టి తెండొండె

కొనిపోవుచున్న యక్కుధరంబువుచ్చి ♦ వనధిలోపలఁ బాఱవైచిరం డొండె
ఈరెండు తెఱఁగుల నేర్పడనొకటి ♦ ధీరులై చేసి యేతెంచినఁ జాలు
నచ్చుగానగనికి నర్మిలి వెలయ ♦ నిచ్చమొసగ రాజ్య మిచ్చెదనిపుడె

నావిని విపులసేనాసహస్రముల ♦ తోవారు వెడలి బంధురసత్త్వధనులు
దానవామరవేషధారులై కినుక ♦ లూనిరణోదగ్రు లుగ్రవిక్రములు
క్షురికాసితోమర శూలకోదండ ♦ పరశుకుంతాదిక ప్రముఖశస్త్రములు
ధరియించి మించిన దర్పంబు మెఱసి ♦ యురుతర హుంకార హుంకారు లగుచు
గనుకని గర్జించు కాలమేఘము లు ♦ పానుపడ సూర్యునిఁ బొదువుచందమున
బొదివి యాహనుమంతుఁ బోనీక కదిసి ♦ మదమునఁ బేర్చి దుర్మదులు బిట్టార్చి
దేవాసురులమున్ను దృష్టింపఁ గోరి ♦ పోవుచున్నాఁడవు భుజశక్తి మెఱసి
యీకొండఁ గొనుచు నీ వెటఁ బోయెద వని ♦ నా కపివీరుఁడా యసురులఁ జూచి
విలయకాలాచల విస్ఫులింగములు ♦ తోలుకాడను జ్వాల దుర్జయాభీల
కాలచక్రాకార ఘనవజ్రకఠిన ♦ వాలచక్రముఁ ద్రిప్పి వడి వ్రేయఁ దొడఁగ
నప్పుడా రాక్షసు లదరి యెంతయును ♦ నొప్పింప వాయుజుం డుగ్రకోపమున
భంజించెఁ గొందఱఁ బటువాలనిహతి ♦ భంజించెఁ గొందఱఁ బరుషోగ్రదృష్టి
భంజించెఁ గొందఱఁ బదతాడనముల ♦

భంజించెఁ గొందఱ భయదనాదముల

ఘనసత్త్వుఁ డిబ్భంగి గయ్యంబు చేసి ♦ వినుతవిక్రమమున విజయంబు నొంది
తోయజాప్తుఁడు పేర్చి తుప్పలదూఁగ ♦

దోయదంబుఁ దూలఁ దోచు చందమున

రాక్షసవీరుల రణవీథి నోడిచి ♦ నక్షత్రవీథి నున్నతశక్తి మెఱసి
పోవుచునుండ నాభుజశక్తిఁ జూచి ♦ దేవగంధర్వులు దివి నుండి యపుడు
పొరిఁ బొరి నతనిపైఁ బూవులవాన ♦ గురియుచునుండిరి కొలఁది కగ్గలము
అంతలో హనుమంతుఁ డతివేగుఁ డగుచు ♦ నంతరిక్షంబున నరిగి యక్కొండ
మున్నున్న చోటనే ముదమొప్పఁ బెట్టి ♦ క్రన్న రఘురాము కడకు నేతెంచి
వినతుఁడై తనపోవు వృత్తాంత మెల్ల ♦ వినుపింప శ్రీరామ విభుఁడు హర్షించి
యావాయునందను నాలింగనంబు ♦ కావింపఁ గనుఁగొని కపివీరు లెల్ల
వచ్చి లంకాపుర వర మెల్లఁ గలఁగ ♦ జెచ్చెఱఁ జేసిరి సింహనాదములు
భూరిదశాననుపుణ్యచిహ్నములు ♦ బోరన నొండొండ పోవు చందమునఁ
దఱిఁగి యాకసమునఁ దారలొండొండ ♦ యఁగిపోవఁగ జొచ్చె నట వేగ బ్రొద్దు
దారుణస్ఫుటరోష దైత్యగర్వాంధ ♦ కారంబుతో నంధకారంబు విరిసె
ననిమిషవానరా వనసరోజాత ♦ ములతో సరోజాతములు వికసించెఁ
దమపొంపు లొగిఁ దూలి దనుజాస్యకైర ♦

వములతో భువిఁ గైరవమ్ములు మొగిడె

భాదువ శాధీశ బహుళప్రతాప ♦ భానుతో భానుండు ప్రాగ్దిశఁ దోఁచ

జానకీవిభుఁడంత సౌమిత్రిఁ జూచి ♦ యానిసర్గతోష ముల్లంబునిండ
సదమలగుణముల సౌమిత్రి నీవు ♦ బ్రదికితి నా పాలి భాగ్యమెట్టిదియొ [క్రి-
మనియని కొనియాడ నతులవాక్యములు ♦ విని లక్ష్మణుఁడు రామవిభునకు మ్రొక్కి
దేవ ప్రాకృతుఁడవె దేవ దీనుఁడవె ♦ దేవ నిర్ధనుఁడవె దేవ యల్పుఁడవె
యీభంగి యానతియీ నేల నాకుఁ ♦ బ్రాభవంబునఁ బెంపుఁ బరికింపమఱచి
మునుదండకారణ్య మునులకు నాథు ♦ జనులకిచ్చిన ప్రతిజ్ఞలు విచారించి
యిచ్చలో మిము నమ్మి యీ విభీషణుఁడు ♦ వచ్చిననిచ్చిన వరముఁ జింతించి
యినుఁడస్తశిఖరికి నేగకమున్న ♦ యని రావణునిఁ జంపు మఖిలలోకేశ
యనవుడు రఘురాముఁ డౌఁగాక యనుచు ♦ ఘనతరవిక్రమక్రమశక్తి మెఱసె
నంతనా వృత్తాంతమంతయు నెఱిఁగి ♦ యెంతయుఁ జింతించి యిచ్చలోఁ గలఁగి

—*: శుక్రునివద్ద రావణుఁడు శోకించుట :*—

విక్రమక్రమశక్తి విడిచి రావణుఁడు ♦ శుక్రుసన్నిధికేగి స్రుక్కుచు మ్రొక్కి
చుట్టాల భృత్యుల సుతుల సోదరుల ♦ నెట్ట రఘురాము నిశిత బాణాగ్ని
దరికొనఁ గానిచి దగ్గులఁ జేసి ♦ పరఁగి యమోఘమై ప్రళయాగ్నిపగిది
నున్నది మాన్పరాకున్నది పోర ♦ నన్నియుఁ దెట్టారె సన్నియుఁ బొలిసె
నేను బ్రాలములతో నెబ్బంగి నిలుతు ♦ నానతియిమ్మన్న నా శుక్రుఁ డనియె
నలఘుసంగరవీథి నరుల సాధింపఁ ♦ గలయుపాయంబును గలుగ నేమిటికి
నే విఘ్నములు లేక యీవు హోమంబు ♦ గావించు పుణ్యంబె కలిగినఁ జాలు
భీమసంగ్రామ గంభీరంబులగుచు ♦ హోమాగ్నిముఖమున నుండి నీకడకు
నురురథాశ్వంబులు నుగ్రఖడ్గములు ♦ శరచాపకవచముల్ సనుదెంచు గడగి
యవి సాధనములుగా నరుల సాధింపు ♦ మవి నీకు జయసిద్ధులనుచు నాతనికిఁ [చి
హోమమంత్రములెల్ల నుపదేశమిచ్చి ♦ హోమమంత్రములెల్ల నొగి నేర్పరిం
పొమ్మన వీడ్కొని పోయి రావణుఁడు ♦ క్రమ్మన కడఁకతోఁ గడునుగ్రుఁడగుచు
బురవరరక్షకు భూరిసత్త్వులను ♦ బరికించి చతురంగ బలముఁ బనిచి
యవధానతత్పరుఁ డయి వేగ లంక ♦ గవకులు వేయించి కలయ శోధించి
యంత విద్యుజ్జిహ్వుఁ డనుమహావీరు ♦ నంతకాకారు నుద్ధతిశూరుఁ బిలిచి
నీవు నీబలమును నెలకొని నగరు ♦ గావు మేమఱకుము గదలకు మనుచుఁ
బనిచి యనుష్ఠానపదశుద్ధిఁ బొంది ♦ చని మృత్యువక్త్రంబుఁ జనఁ జొచ్చుభంగి
బాతాలగుహఁ జొచ్చి పదిలుఁడై నిలిచి ♦ యాతతహోమకృత్యములకుఁ దగిన
రక్తవస్త్రంబులు రక్తమాల్యములు ♦ రక్తచందనము నురక్తుఁడై తాల్చి

—:* రావణుఁడు పాతాళహోమము చేయుట *:—

బంధురదక్షిణ ప్రవణవేదికకు ♦ గంధపుష్పాక్షత లగ్రమొప్పనిచ్చి

యామహావేదిలో నగ్ని సంధించి ♦ హోమమంత్రములెల్ల నొగినుచ్చరించి
పరవొప్పగా హోమ వేదిలోఁ గలయఁ ♦ బరికించి నిశితాస్త్ర పరిధులఁ జేర్చి
శ్రీవృక్షఫలాత సితముఖ్యసమిధ ♦ లావృత్తిఁ గైకొని యంతట మఱియు
నోజ సర్షపములు నొనర దూర్వములు ♦ లాజలు దగ గుగ్గులంబును నగరు
నేయి దేనియ గల్గు నెత్తురు బెరుఁగు ♦
పాయసాన్నములు దర్భలు ప్రవాళములు
తగరులు మీలు గ్రద్దలు వరాహములు ♦
నొగి నివి మొదలుగా నొప్ప వేల్చుచును
నాశ్చర్యకరమైన యామహావేది ♦ నిశ్చలతాధ్యాన నిరతుఁడై యుండె
బలువిడి రావణు పాపంబులెల్లఁ ♦ గలసి సెల్లెగసిన కైపడిదోఁప [చుఁ
నామహాగుహాకుండ యప్పుడత్యుగ్ర ♦ ధూమంబులురుతర స్తోమంబులగు
బటుతర నిర్ఘాత పవనసంఘాత ♦ చటులంబులై నిక్క చదలఁ బర్వుటయు
వెఱచిరి దివిజులు వెఱచిరి మునులు ♦ వెఱచిరి దిక్పతు ల్వెఱచిరి కపులు
ఆమహాధూమంబు లప్పుడు చూచి ♦ రాముతో ననియె నారావణానుజుడు
నెలకొని యని మొన నినుఁ దాఁకి గెలువ ♦ నిలువ నేరక పోయి నేఁడు రావణుడు
కపటకర్మారంభ గంభీరవృత్తి ♦ విపులజయార్థియై వేల్చుచున్నాఁడు
అవధరించితె పొగ లాకసంబునను ♦ నివుడుచున్నవి నిండి యొండొండ
హోమంబు నిర్విఘ్న యోగమైయితఁడు ♦
కామించు తెఱఁగునఁ గడముట్ట నేని
రావణు లోక విద్రావణుఁ బోగ ♦ దేవాసురులకైనఁ దెగి గెల్వరాదు
కావున హోమవిఘ్నము సేయవలయు ♦ వేవేగ వానరులఁ బనుపు
మనవుడు రఘురాముఁ డగుఁ గాక యనుచుఁ బనిచినఁ జనిపూని బలువిడిఁ గడగి
గురుబలాఢ్యుఁడు గవాక్షుండు దారుండు ♦
శరభుఁడు క్రథనుండు శతబలి నలుఁడు [గదుఁడు
గవయుండు మైందుండు గంధమాదనుఁడు ♦ పవమానసూనుండు పనసుడం
కుముదుండు జ్యోతిర్ముఖుండు గోముఖుఁడు ♦ క్రమమున వీరాదిగాఁ గపివరులు
పదికోటులుద్భట ప్రధనవిక్రములు ♦ విదితప్రతాపులు విదితకోపనులు
గగనమార్గమున లంకకు నేగుదెంచి ♦ యగణితాహంకారులై పెచ్చువెరిగి
పదఘట్టనముల భూభాగంబు వగులఁ ♦ జదియ దిగ్గజములు చదలు గ్రక్కదల
నార్పులు బొబ్బలు నడరఁ బెల్లడరి ♦ దర్పితనిర్భరోత్సాహ సాహసులు
నలిఁ దాకి రావణు నగరు గాపున్న బలియుర బెక్కండ్రఁ బట్టి చెండాడి
క్రూరులై దౌవారికులఁ జంపి వైచి ♦ భూరిసత్త్వములఁ దల్పులు వీడదన్ని

నగరుద్ధవిడిఁజొచ్చి నగరూపధరులు♦నగరుల్వడి దశాననురోయువారు
పృథురథశాలలు బిరుదులై చొచ్చి♦రథములఁవిఱుగనుర్వర వ్రేయువారు
జలశాలలోఁజొచ్చి ఘనముష్టిహతుల ♦
గజమస్తకములు వ్రక్కలుసేయువారు [వారు
హయశాలలోఁజొచ్చి హయశరీరములు♦భయదోగ్రనఖముల బడ వ్రచ్చు
సారిదిశాలలనున్న జోడుపక్కెరలు ♦ దరమిడిచింతించి దరలాడువారు
చలమొప్ప నాయుధశాలలఁజొచ్చి ♦ కలకశస్త్రాస్త్రము ఖండించువారు
నేచిబండారపుటిండ్లలోఁజొచ్చి♦రాచియర్థములు చూరలుచల్లువారు
నురుసత్త్వగతులొప్ప నుప్పొంగిపొంగి ♦
వరుసతోరణములు వడిఁద్రెంచువారు [వారు
పసిఁడిగోపురములు భగ్నహర్మ్యములు♦వెసనుర్విఁగూలఁబ్రోవిడిఁద్రోయు
కట్టల్కఁగొందఱు కసిజగద్రోహి♦బట్టి తెంపనిపట్టి బాధించువారు
వనితలుసుతులును వాపోవఁగన్న ♦ జననులడ్డముచొర సదనముల్చొచ్చి
నెట్టన వెలికీడ్చి నెరసి రాక్షసుల ♦ దట్టించితలలూడఁ దాటించువారు
వాసిమైనిబ్బంది వనచరుల్గాడి♦గాసిపెట్టుచునుండఁగా భీతినొంది
దీనదశాతుర స్థితిదూలపోయి♦దానవపురీడు విధ్వస్తమై కలఁగి
హరిపీడితానేక హయహేషితములు♦కరిఘటానేక భీకరబృంహితములు
వృద్ధబాలాంగనా విలవిలాపములు♦సిద్ధవిక్రమకపి సింహనాదములు
గలయఁబర్వినలంక కల్పాంతకాల ♦
ములఁబేర్చుబడబాగ్ని ముఖశిఖార్చులకు
నులికివాపోవుపయోధిచందమునఁ♦గోలఁదిగ్గలముగా ఘూర్ణిల్లఁదొడఁగె
అంతసూర్యోదయ మయ్యె రావణుఁడు♦నంతటఁబరికించి యతఁడున్న చోటు
కానకచింతించి కడుసంభ్రమమున ♦ వానరుల్వెదకంగ వారినీక్షించి
చతురతమై విభీషణుఁడెన్నిసరమ ♦ పతిహితంబాత్మలో భావించియపుడు
వడినంగదునకు రావణుఁడున్న చోటు♦చిడిముడిపాటుతోఁ జేసన్నఁజూపె
చూపుటయును జూచి సుభటదంభోళి ♦ కోపించియప్పు డగ్గువాదాతనున్న
శిలనుగ్గుగాఁదన్ని చెచ్చెఱఁజొచ్చి ♦ యలఘువిక్రమకళాయతికేళివ్రాలి
పొలుపొందభుజసత్త్వమునఁబెపుమీరి ♦
కలఁగిరాక్షసులెల్లఁ గడుభీతిఁబొంద
జనిహోమనియతినిశ్చలుఁడైనవాని♦ఘనమంత్రతంత్రసంగతుఁడైనవాని
రావణు సమరవిద్రావణుఁగాంచి ♦ రావణుఁబొడగంటి రండు రండనిన
తననిలబూభవుం డాదిగాఁగలుగు ♦ వనచరాధిపులెల్ల వడిఁ గూడముట్టి

యగ్గుఘోరరక్షకు లైన రాక్షసుల ♦ నుగ్గునూచము చేసి నుతశక్తి మెఱసి
రొక్కఁడై వేల్చుచు నున్నయద్దనుజు ♦ నక్కడఁ బొడగని యలుకదీపింప
దోడెవ్వరును లేక తుదినొంటిఁ డియోఁ ♦ దోడు వేలుతమని దొరకొని కపులు
పొరిదిన వేదిక చుట్టుముట్టన్న ♦ పరిధులు సమిధలు బహుకలశములు [లు
హా స్రుక్కుటజాజు కాశోష్ట్ర)శునక ♦ మస్తకంబులు ఘృతమధుపాత్రతతు
వఱిముఱిఁ బుచ్చి హోమాగ్నిలోఁ వైచి నెఱసి యార్చిరి దైత్యనికరంబు బెదర
నప్పుడు పాపాత్ము నంగంబులందు ♦ విప్పులు సల్లుచు నెఱమంటలొందవు
గుండంబులోఁ మండుకొఱవులు వచ్చి ♦ యొండొండ వేయుచు నుండిరి కపులు
చేతి స్రుక్స్రువములు చెనసి రాఁ దిగిచి ♦ వాతూంసుతుఁడు రావణు వేసి డాసె
నిత్తెఱంగునఁ గపు లేచి కాఱింపఁ ♦ జిత్తంబులోఁ సిగ్గు చెదరంగనీక
కనియు కదలక క్రతువిష్ఠుఁడుండెఁ ♦ గొనకొని నిద్రించు కొండ చందమున

—*: అంగదుండు మండోదరిని రావణువద్దికి నీడ్చుకొని వచ్చుట :*—

సంగరక్రమశౌ సంగుఁడభంగు ♦ డంగదుండు గద నంచితాంగదుఁడు
అంతఃపురంబున కరిగి యాదైత్యు ♦ కాంతానివాసంబు కరమర్థిఁ జొచ్చి
పరికింపరోహిణిఁ గాసిన చంద్రుఁ ♦ తరుణపల్లవశయ్యఁ దగఁ జేర్చు కరణిఁ
గందిన ముఖచంద్రుఁ రపల్లవమునఁ ♦ బొందించి వగలచేఁ గ్రాగిలెడి దాని
ఘోరాహవంబునఁ గుంభకర్ణాది ♦ వీరులు పెక్కండ్రు విషమవిక్రములు
దక్కఁ గందఱు విభుఁ డొక్కఁడ చిక్కె ♦ నెక్కటి రఘురాముని తఁడేమి గెలుచు
ననియుని రావణు నపజయంబునకుఁ ♦ దనబంధువులు జుందాను దలఁకెడు దాని
చిత్తంబులో నింద్రజిత్తు చావునకు ♦ నొత్తిలి యేడ్చుచు నున్నట్టి దాని
రమణీయమణిమందిరమునఁ గొల్వున్న ♦ రమణి మండోదరి రాజాస్యఁ గదిసి
రొలసిన గతి రాహు వొడిసి పట్టుటకు ♦ జలదిందుమండలీ చంద్రికవోలెఁ
దిగిచినఁ బెకమరదిరుగు వేగమున మృగనేత్ర మొగమున మెఱుఁగులు సెదర
నెఱుఁ మితోఁ గూడ హృదయంబు గలఁగు ♦
తెఱఁగున నలివేణిఁ దిగిచిపట్టుటయు
గమ్మసౌరభములు గలుగు సఁఫుల్ల ♦ ధమ్మిల్ల మల్లికా దామంబులనఁగ
గెడఁ గూడి రావణు కీర్తిపుష్పములు ♦ గడివోయి భువి రాలు కైవడిఁ దోఁప
సేసముత్తియములు చెలువంబు వాసి ♦ గాసిలి వసుధపై గనుకనిఁ జెదర
వలనేసి చెడిన రావణు రాజ్యపదవి ♦ చెలువున నెరిదప్పి సీమంతవీథిఁ
గృశకంపు దైత్యలక్ష్మి వదాబ్జమున ♦ శ్రితచంచరీకములై చెదరు చందమున
నాలోలలోల ముఖాంభోజనీల ♦ నీలాలకంబులు నెరిదప్పి చెదర
నుకుమంగళంబులై యొప్పెడి నాత్మ ♦ వరభూషణములు రావణులక్ష్మి చెవుల

నుండని క్రియవడి నాండొండకర్ణ ♦ మండనంబులు మహిమండలిరాల
దను జేకునపక్తి కీర్తి ధారలోయనఁగ ♦ గనుగవఁగాటుక కన్నీరుదొరుగ
నొగిదైత్యపతికి మహోల్కలుడుల్లు ♦ పగిదిభూషణమణి ప్రకరముల్డుల్ల
వరభర్మనిర్మలా వరణాంబుకలఁగ ♦ నిరవేదిరావణు నిహపరోన్నతులు
చలియించు తెఱఁగునఁ జనుగట్టుదొలఁగిచలియింపనున్నత స్తనకలశములు
కొమరేచిసురవైరిగుణవల్లినులియ ♦ క్రమమున నెంతయుఁగాఁదీగెనులియ
నిర్మలుఁడగు రామనృపతిచేఁదెగిన ♦ కర్మబంధములు రాక్షసలోకపలికి
వదబునీక్రియనను వడువునసీవి ♦ వదలుచు మేఖలా వల్లియుపీడఁ
బ్రమదరాక్షసరాజ్య పదసంధిరోసి ♦ విమలవర్ణావలి వీడుచందమున
నుదితరావంబులై యొండొంటిఁగడపఁ ♦

బదనూపురములూడి పడి మ్రోయుచుండ
వెఱచిరాక్షసవధూ వితతిశోకింపఁ ♦ జెఱనున్న నిర్జర స్త్రీలుత్సహింప
నీరసంబునఁబట్టియాడిచి తెచ్చి ♦ వారక రాక్షసేశ్వరునిము దకిటిక
నంతమండోదరి యాత్మేశుఁజూచి ♦ యంతరంగమున శోకాగ్నులునిగుడ
నింద్రు గెల్చినసత్త్వ మెక్కడఁబోయెఁ ♦ జంద్రహాసము వాడిసమసెనేఁడు
ఫాలలోచనుతోడఁ బ్రమథుఁతోడఁ ♦ గైలాసమెత్తిన గర్వమొందణఁగె
మూఁడులోకంబులు మునుమిడి గెలిచి ♦ నేఁడేలతూలెదు నీపేర్మివిడిచి
యింద్రజిత్తుఁడునన్ను నిటఁబాఱవైచి ♦ నింద్రలోకంబున కేగకయున్న
నన్నిట్లు చూచునే నాకొడుకున్న ♦ నిన్నిచదుర్దశ లేనుబొందుదునె
సిగ్గులజ్జయులేని చెనఁటిరోఁ నన్ను ♦ బగ్గించు చున్నారు పగతులిబ్బఁగి
నీహోమమేటికి నిష్ఠయేమిటికి ♦ ఁ హుతుల్నిన్నుఁ బూర్ణాహుతిఁ జేసెఁ
బటుబుద్ధివై రామబాణాగ్నిఁబ ... ము కుటిలక్రియలకింకఁగొలదిగాదుడుగు
మనవిఁ దశకంఠుఁ డలుకదీపింపఁ ♦ దన చేతియాహుతు ల్ధరణిపైవైచి [లు
యురుతరంబగునిష్ఠ రోగ్రకోపాగ్నిఁ ♦ బురవధూతోరణంబులువోవిభౌమ
ముడివడసమవర్తి మూర్తియైపేర్చి ♦ కడకమైనత్యుగ్ర ఖడ్గమంకించి
యతులరత్నాంగదు నంగదువ్రేసి ♦ వితతవిక్రముఁడింతి విడిపించిపుచ్చి
పీడినకౌటివేణి వెన్నునజార ♦ వాడిన మోముతో వగలఁదూలుచును
నంతఃపురంబున కరిగెదైతేయు ♦ కాంతచింతించుచుఁ గనుఁజిన్నవోయె
నప్పుడుహనుమంతుఁ డత్యుగ్రమ ష్టిఁ ♦ దప్పకదశకంఠు తలబట్టువొడిచె
నావాలిసూనుండు నంతలోఁదెలిసి ♦ రావణు వేసె విక్రమకేలివాని
తోరంపునెత్తుటఁదోఁగియెంతయును ♦ గ్రూరుడై జేగురు కొండచందమున
నతిఘోరకోపాట్టహాసంబులెసఁగ ♦ నతులసత్త్వోదాత్తుఁడై దశాననుఁడు

అంగదుఁ దెగ వ్రేసె ననిలనందనుని ♦ భంగించె నిశితాశిఁ బటుశక్తి మెఱసి
నలిశూలముఖమున నలుని నొప్పించె ♦ నలవునఁ గజుఁ నొంచె నంకుశనిహతి
మొగినీలు ఘట్టించె ముసలఘాతమునఁ ♦ దగుశక్తి శతబలి దర్పంబు మాపెఁ
బవితుల్యముద్గర ప్రదరంబు పుచ్చి ♦ ద్వివిదుని మైందుని వ్రేసె వ్రేయుటయు
వానరవరులు దుర్వారులై తమదు ♦ సేనలఁ జొచ్చి రచ్చెరువుగాఁ బఱచి గ్రిచి
యనిలసూనుఁడు రాఘవాధీశుకడకుఁ ♦ జని మ్రొక్కి హస్తాబుజంబులు మొ
రామావనీశ్వర రాక్షసేశ్వరుని ♦ హోమంబుఁ జెఱిచితి మొప్పవచ్చితిమి
అనవుడు విని రాముఁడంతరంగమున ♦ ననయంబు హర్షించె నటు దైత్యపతియు
గడువేగమునఁ బోయి ఘనశోకవహ్ని ♦ నుడుకుచున్న మందోదరిఁ జూచి
యతివ నీమనమున నక్కటదైవ ♦ కృపమున కింత శోకింప నేమిటికి
వని మొఱ నేఁడు రామావనీనాథుఁ ♦ డని మొదనటుగాక దుర లోనతఁడు
ననుసమయించిన నలినాయతాక్షి ♦ జనకనందనఁ జంపి సాహసం బొప్ప
వేవేగ యగ్నిప్రవేశంబు సేయు ♦ నీవనుటయు వింతి నిజనాథుఁ జూచి

—:* మందోదరి శ్రీరాముల మాహాత్మ్యము రావణునికిఁ దెల్పుట *:—

ఓదశానన నీకు యుద్ధమధ్యమున ♦ రాదు జయింపఁగ రఘురాము దేవు
నీవొక్కఁడవ యేల నెఱసి రాఘవుని ♦ దేవాసురలకైన దీఱదు గెలువ
నీమది రాజుగా నిర్ణయింపకుము ♦ రామచంద్రుండు పురాణపూరుషుఁడు
ఆమేటి తొల్లి మత్స్యావతారమున ♦ సోమకు నిర్జించి శ్రుతులుద్ధరించె
ఘనమంధశైలంబు కమఠమై యతఁడు ♦ దనవీపు గుదురుగా ధరియించె దొల్లి
రా[illegible]ఁడు మున్ను హిరణ్యాక్షుఁ జంపి ♦ భూమి వరాహమై పొగడొంద నెత్తె
నతఁడు నృసింహుఁడై యలుక మైఁ దొల్లి ♦ పతితు దైత్యునిఁ జంపి ప్రహ్లాదుఁ గాచె
నలిగి యాతఁడు వామనావతారమున ♦ బలి నర్థిమై వేఁడి బంధించెఁ దొల్లి
జమదగ్ని రా[illegible]ఁడై జన్మించి యతఁడు ♦ విమలశౌర్యనిఁ గార్తవీర్యుని ద్రుంచె
వీకను జేకొన విశ్వమంతయును ♦ నాకశ్యపబ్రహ్మ కర్థితో నిచ్చె
సన్నుతగతి విరోచనుఁ జంపివైచె ♦ మున్ను మాయారూపముఖుని నిర్జించె
జలధిమధ్యంబునఁ జరణఘాతమున ♦ బలువిడి రాక్షసపతుల రూపడఁచె
లవణాసురుని జంపె లలి బార్ష్ణిహతుల ♦ జవమార నీరామచంద్రుండు మొదల
నధికుఁడై యాతఁడ యాదికాలమున ♦ మధుకైటభాదుల మర్దించె నతఁడు
తనసత్త్వమంతయుఁ దలకొని వచ్చి ♦ నినుఁ జంపనిప్పుడు నిష్ఠమైఁ బూని
దిశలందేజంబులు దీపింపఁజేసి ♦ దశరథేశ్వరునకుఁ దనయుఁడై పుట్టె
నామహామహిమ లత్యద్భుతక్రియలు ♦ నేమని చెప్పుదు నేను వాక్రుచ్చి

యలఘువిక్రమశౌర్యశక్తి మెఱసి బలియుడై యీతఁడు బాల్యంబునందు
గౌశికప్రముఖ దిక్పతులెల్లఁ బొగడఁ ♦ గౌశికుఁ డొనరించు క్రతువు రక్షించె
శతసహస్రాయుత సంఖ్యలు గడవ ♦ నతనిచేఁ బడసె దివ్యాస్త్రశస్త్రముల
జనకుండు మొదలుగా జగమెల్లఁ బొగడ ♦ ఘనశక్తి విఱిచె శంకరుశరాసనము
దైవయోగంబునఁ దనకుఁ బట్టము ♦ దేవిగాఁ బూని వైదేహిఁ గైకొనియె
సోమించి నిజబల స్ఫురణంబు చూపి ♦ రాముఁడా భార్గవరాము భంగించెఁ
దనతండ్రి పనుపునఁ దప మొప్పఁ బూని ♦ మునివృత్తి వనవాసమునకు నేతెంచె
సన్నుతశక్తిమైఁ జంపె విరాధుఁ ♦ బన్నుఁగా జేర్చి శూర్పణఖ శిక్షించె
నడుగుల నాదండకారణ్యభూమిఁ ♦ గడుఁ బుణ్యభూమిగాఁ గావించినాఁడు
ఖరదూషణాది రాక్షసవీరవరుల ♦ ధరఁ గూల్చె మఱి చతుర్దశసహస్రముల
మారీచుఁడును మాఱెమాయఁ బోనీక ♦ ఘోరరూపుఁ గబంధుఁ గూలంగఁ జేసె
నీ గండుగుణమెల్ల నిలిపి దట్టించి ♦ లాగొప్ప నిన్ను వాలమున బంధించి
చతురబ్ధిజలములఁ జలమున ముంచి ♦ యతులసత్త్వక్రీడ నడరి కాఱించి
విడిచిన యావాలి వెసనొక్కకోలఁ ♦ బడ నేసె సుగ్రీవుఁ బట్టంబు గట్టె
నలవుమైఁ దనదు బాణాగ్నికీలలను ♦ జలనిధి నింకించె జగములు మెచ్చఁ
గలనిలోపలఁ గుంభకర్ణు ఖండించెఁ ♦ జలమున నఖిలరాక్షససమేతముగ
సమరంబులోపలఁ జంపె లక్ష్మణుఁడు ♦ నమరనయ్యతికాయు నయ్యింద్రజిత్తు
నలుగఁ డెన్నఁడును రాఘవనీశాఘుఁ ♦ డలిగిన నిలుప రింద్రాదులు నెదుట
మదిమదినుండ నామను జేసు దేవిఁ ♦ ద్రిదశారి వంచనఁ దేసికుఁ జనున
నీవెఱుంగవె రాము నిత్యసత్యములు ♦

నీవెఱుంగవె రామ నృపు మహత్త్వములు
రాముసత్త్వస్థితి రావణ నీకు ♦ నేమి పాపమునపో యెఱుఁగఁ జొప్పడదు
నీవింక రఘురాము నిష్ఠురబాణ ♦ పావకజ్వాలల భస్మమై పడక
జనకనందనతోడ సకలరాజ్యంబు ♦ నెనయ రాఘవునకు నిమ్ము వేవేగ
మరలి తపోవృత్తి మన మరణ్యములఁ ♦ జరియింత మింతియు చాలు భోగములు
నీవు దీఱిన నాకు నీతోడఁ గూడఁ ♦ బావకుముఖమునఁ బడి కాలరాదు
మున్ను మాతండ్రియు ముదిమియుఁ జావు ♦

నన్నుఁ బొందక యుండ నాకిచ్చె వరము
వరభోగమేనొల్ల వలవదీ త్రోవ ♦ తరముగాదింక దుస్తరము తద్వరము
సరమకునొండె నా జనకజకొండె ♦ వరవుడనై యేను వర్తింపవలసె
ననవుడు దశకంఠుఁ డాకలకంఠిఁ ♦ గనుఁగొని పలికె నుత్కటరోషుఁడగుచు
నింతేల చింతింప నెలనాఁగ నీకు ♦ నింతకు వచ్చితినే యేను నేఁడు

చుట్టాలభృత్యుల సుతులసోదరుల ♦ నెట్టఁ జంపించి నేఁడింక నాకు
దేవదానవభయోద్వృత్తిఁ బోనాడి ♦ మీపటిప్రాణంబు లేలరక్షింప
దురమున నింద్రజిత్తువి వంటికొడుకుఁ ♦ బరులచేఁ జంపించి బ్రదుకనేమిటికి
గరుడోరగామర గంధర్వవరులఁ ♦ బోరిఁ గొంటిఁ జెఱిచితిఁ బుణ్యగేహములఁ
దపసులఁ జంపితిఁ దరుణియే నింకఁ ♦ దపసినై పోయినఁ దపసులు నగరె
కావనీ యూటలు కార్యంబు తెలుఁగు ♦ భావింపనేరవు పద్మాయతాక్షి
ఏనెల్ల భంగుల నింక రాఘవులఁ ♦ బోనీను జంపుదు భూమిజనీను
ఆరూఢబలుఁడనై యటుఁగాక యేను ♦ శ్రీరాముశరములచేఁ జత్తునేని
నాకవాసులు మెచ్చ నాకోరుచున్న ♦ వైకుంఠ మెదురుగా వచ్చు నిచ్చటికి
లలన నీ వేటికి లంక యేమిటికిఁ ♦ దలకొన్న ముక్తిసత్పథముఁ గైకొందు
ఎలనాఁగ నీవింక నేను లేకున్నఁ ♦ గల పుణ్యాలక్షణ కళలెల్లఁ బొలిసి
కమలబంధుఁడు లేని కమలినిఁ బోలె ♦ కొను రేది శశి లేని కుముదినిఁ బోలె
రేరాజు లేనట్టి రేయును బోలె ♦ శారిక లేని పంజరమును బోలె
ఎనయఁ గోయిల లేని యెలమావిఁ బోలె ♦ దినమణి లేని యా దినము బోలె

—:* రావణుఁడు మూఁడవసారి యుద్ధమునకు వెడలుట *:—

ఉండుము నీవన్న నొండాడ వెఱచి ♦ యుండె మందోదరి యదరి లజ్జించి
యంత దశగ్రీవుఁ డాహవోద్యోగ ♦ సంతోషపోషితోత్సాహుఁడై కినిసి
యాదిత్యులదర బ్రహ్మాండభాండంబు ♦ భేదిల్లఁ బటురణ భేరి వేయించి
కలహవిక్రమకళా కల్పుఁడై తివిరి ♦ బలములఁ బన్నింపఁ బడవాళ్లఁ బనిచి
యుదయార్కబింబ సముజ్జ్వలప్రభలఁ ♦ బది కిరీటంబులు పదిలమై యొప్ప
వినుతరత్నప్రభా విద్యోతమాన ♦ ఘనకుండలంబులఁ గర్ణంబులడర
నాయతభుజశాఖ లన్నియు రత్న ♦ కేయూరకంకణాంకితములై తనర
నిరవొందదాకాల నింద్రాదిభయద ♦ బిరుదభీషణ గండపెండేర మొప్పఁ
గరములన్నిటను భీకరచంద్రహాస ♦ శరశరాసన గదా చక్రాదులమరఁ
బటురోషదృష్టి ప్రభావహ్ను లెందుఁ ♦
జటులంబులై పర్వఁ జనుదెంచి యపుడు
స్ఫుటబంధబంధుర షోడశచక్ర ♦ ఘటితకోటిద్వయ ఘంటికాబద్ధ
భయదోగ్రసంపుల్ల భల్లూకవర్మ ♦ హయసహస్రోదగ్రమకరరథంబెక్కి
కాకుత్స్థశరములఁ గడతేరి మీఁద ♦ వైకుంఠరథ మెక్క వడువు దీపింప
నెఱకొనిరథ కళా నిధికాల కేతుఁ ♦ డలఘుబలోద్దారుఁ డాతేరుఁ గదప
దీపించు వెన్నెల తేటలై మీఁద ♦ నేపారు గొడుగు లనేకంబులొప్ప
మండితమార్తాండ మండలచంద్ర ♦ మండలక బళనో న్మదసముద్యోగ

రాహుగ్రహముపోలె రహిమిన్నుముట్టి ♦ సాహసరాహుమ స్తకముప్రశస్త
బిరుదధ్వజంబు లాభీలమైమూఁడు ♦ దరలంగఁ బటపటధ్వనులతో వెడలె
భేరీమృదంగాది భీమగంభీర ♦ భూరిభాంకృతులును సంభోధులుప్పొంగ
నుప్పొంగుకడకల నుర్విగంపింప ♦ నప్పుడుకరులును హరులుఁ దేరులును
బలసముత్కట మహాభటకదంబములు ♦ బలువిడి వెడలె దిగ్భాగంబునిండఁ
బ్రళయకాలమునాఁటి ఘనులభంగి ♦ దలకొని వెడలి రుద్రగులై ఖడ్గ
రోముండునగ్నివర్ణుఁడు గయ్యమునకుఁ ♦ దామేగఁ బదహతి ధరణిపెల్లడరె
నప్పుడంభోనిధు లన్నియుఁ గలఁగె ♦ నప్పుడులోకంబు లన్నియుబెదరె
నప్పుడుదిగ్దంతు లన్నియు వ్రాలె ♦ నప్పుడుకులగిరు లన్నియువడఁకె
నడపనికడఁకతో నిబ్భంగివెడల ♦ నుడువీథిసురలుదా రొండొండనిండి
రావణోద్యోగ సంరంభంబుసూచి ♦ దేవారియిటుగ్రింద దేవదేవారి
యోధులపైఁ బేర్చియు ద్వృత్తినత్తి ♦

క్రోధించిమించి పేర్కొనిపోవువాఁడు
ఈరీతియీభాతి యీరణోద్యోగ ♦ యీరోషమీవేమ మెన్నఁడులేదు
నేఁడులక్ష్మణసమన్వితుని రాఘవునిఁ ♦ బోడిమితోఁదాకిఁ పోరాడుకున్న
యనిరత్నమయవిమానారూఢులగుచు ననిమిషానిమిషులై చూచుచుండ
రాశివానరబలారణ్యంబుఁగాల్పఁ ♦ గాసాంపుతో వచ్చు కార్చిచ్చుపగిది
వడతెంచె నసురసేనాసహస్రమును ♦ బాడగని కపివీరపుంగవులెల్ల
నంగదఁజెల రేఁగియట్టహాసమును ♦ పొంగనుప్పొంగి యార్పుసునింగిముట్ట
దరమైనతరులు నుద్ధతమైనగిరులు ♦ గిరిశృంగములఁగొని గిరిసమాకృతుల
దరమిడిబరువడిదనుజసైనికులు ♦ దురమునునిరువాఁగుదొడరిరొండొంటి
వక్షీణబలము లేపారంగఁదాఁకు ♦ దక్షిణోత్తరసముద్రముల చందమున
నప్పుడుదానవు లాసేనమీఁద ♦ ముప్పిరిగొను రోషములు మండుచుండ
నార్పులుజంకెలు నతులహుంకృతులు ♦

నేర్పులుకడఁకలు నిండనొండొండఁ
గటమదోత్కటదంతి ఘుడాడికొల్పి ♦ పటుజవాశ్వంబుల బలువిడిఁదోలి
యలవొప్పనరదంబు లతిముతిఁబఱపి ♦ నలుగడఁగాల్వ్వార నలిఁగవియించి
కరవాలముసల ముద్గరభిండివాల ♦ పరశుతోమరశర ప్రాసఖడ్గములఁ
గనుకనివైచియుగాడఁబొడిచియు ♦ మునిమియు మొఱమియు దూలనేసి కూసు
వ్రచ్చియుమోదియు వసుధఁగూల్చియును ♦

గ్రుచ్చియుఁగపుల బేర్కొని విదళింప
మొసలివానరవీర ముఖ్యులుగడిమిఁ ♦ గినిసియుద్భటరణ గ్రీడమైగదిసి

యుఱికిసమీపమందున్న శైలములు తఱుచైనగిరిశృంగతతులువృక్షములు
శిలలునుపడవేసి చెలరేఁగినుఱియుఁ ♦ దలఖూఱిగుజ్జుపుదళములఁకుఱికి
యుదితోగ్రసత్త్వంబులొప్పఁగుప్పించి ♦ కుదియక రౌతుల గూలఁదన్నియును
గరముగ్రులై కరిఘటలపైఁగవిపి ♦ సారిదిశైలములెత్తి జోదులుపెలుచ
గుంభమధ్యంబులగ్రుంగనేనుఁగులఁ ♦ గుంభినినొక్కటఁ గూలనేయుదురు
రథములతోడ సారథులరథ్యముల ♦ రథులనొక్కటనెత్తి రణమధ్యవీథిఁ
బెలుకురనందంద పృథివిగంపింప ♦ నలవుననట్లువేసి నలియఁజేయుదురు
ధరణీధరంబులఁ దనుకదంబముల ♦ నురువడిఁగాల్వ్రేర నురకమోఁదుదురు
కఱతునుపండ్లనుగరతలాగ్రములఁ ♦ జఱతురుపదములఁ జదియఁబ్రాముదురు
ప్రత్యుజ్జ్వల నఖావలులవాలముల ♦ మొత్తుదురలతురు ముష్టిఘట్టనల
పనసనీలాంగదప్రముఖులుమఱియు ♦ వనచరతతులు దుర్వారులై యెగసి
తనియనికడిమి నుద్దండదానవుల ♦ మొనలపై నాకసంబుననుండినిండి
భూరిధారాధరంబులులయవేళ ♦ ఘోరనిర్ఘాతము ల్గురియుచందమున
గురుశైలపాషాణకోటులందంద ♦ కురియనుద్భట రణక్షోణినెల్లెడలఁ
గూలునేనుంగులు కుంభమధ్యముల ♦

వ్రాలుమావుతులుపై వ్రాలుచందములు
విఱుగువిండ్లునుగూలు వీరరాక్షసులు ♦

నొఱుగునశ్వములుపై నురులురావుతులు [ములు
చదియురథంబులు సమయుసారథులుఁ ♦ జిదియపీఠంగులు చెదరుమాంస
పడుకిరీటంబులు పగులుమస్తకము ♦ లడరు నెత్తురులు బెల్లవియు గాత్రములు
తోలంకాడుప్రేవులుఁ దునియు ఖడ్గములుఁ ♦

గలిగి యప్పుడు రణాంగణమొప్పెఁ జూడ
బహుభోగపర్జన్యభాగ్యంబపోలె ♦ మహితాభ్రమాతంగమదసిక్తమగుచు
నతిరౌద్రరుద్రవిహారంబపోలె ♦ హతగజాసుర పిశాచానందమగుచు
నక్షీణరామకటాక్షంబపోలె ♦ ప్రేక్షణాహృష్టవిభీషణంబగుచుఁ
గలియుగాంత్యోదగ్రకాల బపోలె బాలశూన్యవిధ్వస్తబహుధర్మమగుచు
గతతోమసంపుల్ల కమలినిపోలె ♦ శ్రితశిలీముఖపుండరీకౌఘమగుచుఁ
జారుశుభోదారు సదనంబపోలె ♦ నారక్తఘనమార్గణాకీర్ణమగుచు
స్థిరపుణ్యమాల నదీభర్తపోలె ♦ హరిసత్వనిర్మతి తాబీలమగుచు
ననగక్రమాగను యాగంబుపోలె ♦ ననిమిషలోక చింతాభీష్టమగుచు
నొప్పెడిరణములో నుగ్రభావమున ♦ నుప్పతిల్లుచుసురలొగిఁ జూచుచుండ
దొడగినెత్తుటదొప్పదోఁగిలోఁగలయ ♦ బడియున్నప్రేవులుపవడంపుఁబొదలు

రథములు యానపాత్రము లూడిపడిన ♦
రథచక్రతతులు గూర్మములమొత్తములు
మొగినున్న శవములు మొసళులుగలయ ♦ దెగిపడ్డభుజములుదీర్ఘ సర్పములు
ఆయుధరజమును మస్థిసమూహ ♦ మాయతశైలంబు లతులదంష్ట్రములు
తిమితిమింగిలములు దీర్ఘఘోటకపు ♦ గములుసముల్లోక కల్లోలతతులు
వివిధాశ్వలాలలు వెలినుర్వులందు ♦ ధవళాతపత్రసంతతుల హంసములు
బహుకిరీటప్రభ ల్బడబాగ్నిశిఖలు ♦
మహిమీఁదఁజెదరిన మాంసముల్పంకములు
ప్రీతనిశాచర ప్రేతబేతాళ ♦ భూతాట్టహాసము ల్భూరిఘోషములు [చు
చంద్రుండురఘురామచంద్రుడవ్విభుని ♦ సాంద్రహాసద్యుతుల్సాంద్రి కలగు
నడరెడురక్తాబ్ధి యబ్ధిలోఁదొరసి ♦ యుడుపీథిలోరాసి యుప్పొంగుచుండె
నప్పుడుహనుమంతుడసురేశుమీఁద ♦ నుప్పొంగికవియనుద్యోగంబు సూచి
యచలాచలాకారుడతిబలోన్నతుఁడు ♦ రుచిరఖడ్గుఁడుఖడ్గరోముంకుగినిసి

{ ఖడ్గరోముఁడు మొదలగు రాక్షసులు వానరవీరులతో యుద్ధము సేయుట }

యందెందుఁగడగెద వందేలనీకు ♦ నిందురమ్మనిలజ్జ యేనున్న వాఁడ
ననవుకుగుప్పించి యతనిపైకిలేక ♦ తనరోమశితఖడ్గధారల మునిఁగి
రొయికభంగినిగిడి మహోగ్రుఁడైకడఁగి
ప్రకటసత్త్వోన్నతిఁ బవమానసుతుఁడు
కులశైలఁమనబోలుకొండచేఁబూని ♦ పెలుచనార్చుచువచ్చిపృథివిగంపింప
వానిపైనురువడి వైచివైచుటయు ♦ దానివాఁడురు రోమధారాభిహతిని
గంద్రించిప్లవగులఖండించుకొనుచు ♦ దండినప్పవమాన తనయుదాకుటయు
బావనిమతియును బర్వతంబొకటి ♦ వేవేగ దానవవీరుపై వైవఁ
గులిశధారాహతిఁగూలుపర్వతము ♦ పోలుపునగూలె నప్పుడురక్కసుండు
సర్పరోముఁడుతీవ్ర సర్పాంగుడగుచు ♦
దర్పించికడఁకతోఁ దాఁకియంగదుని
దనురోమసర్పసంతతుల నొప్పింప ♦ ఘనమైనకడిమి కంగదుఁడుగోపించి
గ్రద్దవ లయకాలకాలుఁడైమడి ♦ యద్దైత్యుమస్తకం బటచేతవ్రేసి
దనుజునిశిరమంతఁ దద్దయుఁబగిలి ♦ ఘనరక్తధార లొక్కటఁగ్రమ్ముచుండ
రోషాగ్నులొలుకుచు రోమసర్పముల ♦ భీషణాకారుఁడై నేర్చియద్దనుజుఁ
డంగదునంగంబు నంగదవ్రేయ ♦ నంగదుం డధికరోషాయత్తుఁడగుచు

నసురశిరోధ్య మతిఘోరముష్టిఁ ♦ బసచెడఁ దాటించి పడవైచి త్రొక్కి
తలఁ ద్రుంచి వైచి యుద్ధతిశక్తివాని ♦ బలువిడి నిర్గతప్రాణుఁ గావించె
భీషణరణకళాభీలు నన్నీలు ♦ రోషించి వృశ్చికరోముండు దాఁకి
ఘనవిషజ్వాల లొక్కటఁ బిక్కటిల్లఁ ♦ దనురోమవృశ్చికతతుల నందంద
యేచినొప్పింప సహింపక నీలుఁ ♦ డాచేతదానవుఁ డాత్మఁ గైకొనక
విరథులై రాక్షసవీరులు పర్వ ♦ నురుసాలతరువున నురువడి వేసె
వేసిన దనుజుఁ డావృక్షంబుఁ ద్రుంచె ♦ గాసిల్లి విషరోమకంటకాగ్రముల
ద్రుంచిన కనుఁగొని తోరంపుఁ గడిమి ♦ కంచితజయశీలుఁ డానీలుఁ డలిగి
ఘోరబాహాశక్తిఁ గుశలుఁడై పేర్చి ♦ భూరిశాఖల నొప్పు భూజంబు వెతికి
కొనివచ్చి దాని వక్షోవీథి వేసి ♦ యనిమిషు లుప్పొంగ హతజీవుఁ జేసె
భగ్నారివీరుఁడ భగ్నప్రతాపుఁ ♦ డగ్నివర్ణుం డనునతఁ డాగ్రహించి
పడిమహాటవుల దుర్వారతఁ బేర్చి ♦ కడఁగి యుగ్రత నేర్చు కార్చిచ్చుకరణి
నగణితస్ఫుటవహ్ను లంగంబులందు ♦ నిగిడించి కోఁతుల నీఱు సేయుచును
ప్రళయాగ్నియునుబోలి పఱతెంచుచుండ ♦
నలుకమై వీక్షించి యవనీశ్వరుండు
బలిముఖప్రముఖుల పరిభవక్రమము ♦ తిలకించి కరుణావిధేయుండు గాన
దలఁపువనోర్వ కద్దనుజునుగ్రతకుఁ ♦ దలయూఁచి దశకంఠుతమ్ముని కనియె
నోవిభీషణ నాకు నూహింపఁ దెలియ ♦ దీవచ్చుచున్నవాఁ డెవ్వఁడో చూడ
నారావణుఁడు పంపనని సేయఁగోరి ♦ ధీరుఁడై యనలుఁడే తెంచుచున్నాఁడొ
వీఁడొక రాక్షసవీరుఁడో కాక ♦ వీఁ డెవ్వఁ డేర్పడ వినుపింపు నాకు
ననవుడు దేవ వీఁ డగ్నివర్ణుండు ♦ దన మేని మంటలు దరికొల్పి వీఁడు
పర్వతంబుల నైన భస్మీకరించు ♦ గర్వదుర్వారుఁ డఖండవిక్రముఁడు
అనిన నచ్చెరువంది! యర్కవంశజుఁడు ♦ ఘనమైన వానియుగ్రత జూచి యలిగి
వాసవసుతుఁ డంత వరుణాస్త్ర మేసె ♦ నేసిన నదిమింట నెడమీక నిండి
కప్పారు మేఘంబు గప్పియార్భటము ♦ లుప్పొంగ జడివాన లుడుగక కురిసి
యలవేఁడిమంటల నార్చి పెల్లార్చి ♦ ఖలు లగ్నివర్ణు నొక్కట నేలఁ గూల్చె
నాలంబులో నప్పు డగ్నివర్ణుండు ♦ గూలుట యనుజూచి క్రూరుఁడై పేర్చి
కోపంబు పేర్మి నక్షుల నిప్పులురులఁ ♦ జూపుల లయకాల సూర్యుఁడై మండి
రాముఁ గనుంగొని రాక్షసేశ్వరుఁడు ♦ రామ నన్నెఱుఁగవే రణమధ్యవీథి
క్రూరనిష్ఠురవజ్ర ఘోరదుర్వార ♦ ధారావిదారితోద్ధతకులాచలుఁడు
దేవేంద్రుఁ డుద్వృత్తి దేవసంఘముల ♦ తో వచ్చి యెదిరినఁ ద్రుంతు నేనాజి
నిన్నెలఁ గైకొందు నీచ కాపేయ ♦ సన్నాహ మేనన్ను సాధింప నహహ

పదిలుండై మఱపాడి పాటింతుఁగాక ♦ తుదిమట్టనన్ను నెదుర్కొందుగాక
త్రోచిశస్త్రాస్త్ర పఙ్క్తులనొంతుగాక ♦ యేచినీలావు నాకెఱిఁగింతుగాక
యనవుడు రఘురాముఁ డద్దురాత్మకుని ♦ చెనఁటిమాటలువినిచిఱునవ్వునవ్వి
గంధసింధురము ఘీంకారమాలించి ♦ సింధురాంతక మత్తసింహంబపోలె
నూరకుండుటయు మహోగ్రుఁడై కినిసి ♦
వారాముతమ్ముఁ డయ్యసురారిఁదాఁకి
ఘోరనారాచముల్గురియుఁదద్బాణ ♦ ధారలుద్రుంచి యాతనిలెక్కగొనక
యెంతయుఁద్రోచి పెల్లేచిలంకేంద్రుఁ ♦
డంతకాకారుఁడై యఱిమిపై దఱిమి
భానుపై నడచు స్వర్భానుచందమున ♦ భానువంశాధీశుపై నప్పుడడరి
దారుణస్ఫుటవజ్ర ధారానుకారి ♦ నారాచతతుల నన్నరనాథుఁగప్పెఁ
గప్పిననప్పుడా కాకుత్స్థుఁడలిగి ♦ నిప్పులురాలెడు నిష్ఠురాస్త్రముల
నుగ్రుఁడై యేయంగ యుద్ధమధ్యమున ♦
నిగ్రహింపఁగజొచ్చె నెఱసి రావణుఁడు

—:* దేవేంద్రుఁడు శ్రీరామునకు రథంబుఁ బంపుట *:—

ఆసమయంబున ననియెమాతల్లికి ♦ వాసవుఁ డారామవల్లభుఁజూచి
దేవహితార్థమై తివిరి రాఘవుఁడు ♦ పోవక దనుజుతోఁ బోరుచున్నాఁడు
వాఁడెపదాతియై వసుధనున్నాఁడు ♦ వాఁడు రథస్థుఁడై వ్రాలుచున్నాడు
ఎందులోకోన్నతుఁ డితఁడె దుఃఖముల ♦ డిందియుక్కుమతికి దిగువనున్నాడు
వేదపల్లవముల విహరించుసౌఖ్య ♦ వేదికర్కశరణవీథి నున్నాఁడు
కమలామనోరథగతుల నున్నతుల ♦ నెమకెడుసుఖి నేల నిలుచున్నవాఁడు
ఇనకులాధిపునకు నీదివ్యరథము ♦ గొనిపొమ్ము వేవేగ కుంభినికనుడు
ననిలమనోవేగ మగుతురంగములఁ ♦ గనకదండాబద్ధ ఘనకేతనముల
మహనీయరుచిరోరువాణికదంబముల ♦ మహితమై బాలార్కమహిమదీపింప
దనరారురథము మాతలిమహీస్థలికిఁ ♦ గొనివచ్చి వేడ్కతోఁ గుంభుని నిలిపి
యారాముముందట హస్తముల్మోగిచి ♦ యారూఢబలశాలి యైవిన్నవించె
దేవరాఘవ ధరాధీశసమస్త ♦ దేవతారాధ్య వందితభక్తసాధ్య
శరచాపకవచాదిసన్నాహరథము ♦ పురుహూతుఁడీదెసకుఁబుత్తెంచినాడు
కాకుత్స్థనీవింకఁ గౌశికుపనుపుఁ ♦ గైకొని యావజ్రకవచంబుఁబూని
యీదివ్యరథమెక్కి యీయాయుధముల ♦ నీదుర్మదాంధుని నెదిరిసాధింపు
మనుసారథిగాఁగ నింద్రుండుసకల ♦ దానవావలిగెల్చె ధరణీశతొల్లి
ననవుడువినిరాముఁ డవ్విభీషణుని ♦ యనుమతితోఁగూడ నారథంబునకు

వలగొనివచ్చియుజ్జ్వల తనుప్రభలు ♦ పొలయంగనీరేడు భువనంబులలర
జదలనొక్కటఁబర్వ జయజయధ్వనులు ♦
పొదివిశాఖాశృంగంబులుమిన్నుముట్ట [లుఁడు
నురవడిగమలాప్తుఁ డుదయాద్రినెక్కు ♦ కరణినారథమెక్కఁగమలాప్తకు
నప్పుడునభమెల్ల నల్లాడుచుండి ♦ యుప్పతిల్లుచునుండె నొండొండనిండి
శరదభ్రసంధ్యాభ్ర చయసమానములు ♦
గరుడోరగామరగణ విమానములు
సరిచూచుసురలు ఖేచరులుగిన్నరులుపరమసమ్మదమునుభయమునుపొంగ
నీపర్వతద్వంద్వ మీయబ్ధియుగళి ♦ మీపావకద్వయ మీనభోయుగము
గదిసెపోఁబోరాడఁగదిసెఁబోపోర ♦ నిదిసమానస్కంధ మెట్లొకోయనుచు
గంపింపజగము లాకంపింపనిట్లు ♦ కంపింపనిరువాఁగు కంపింపఁగడఁగి
రణజయోదగ్రులై రామరావణులు ♦ రణజయవ్యగ్రులై రామరావణులు
గదిసినదృష్టి నిర్ఘాతపాతముఁ ♦ బదిసినమెఱుఁగులు చదలపైఁజెదర
జెలఁగెసేనలరెంటసింహనాదములు ♦ గలఁగెనాకాదిలోకంబులన్నియును
నామేటివిలుకాండ్రులన్యోన్యవిజయ ♦ కాములై రథచిత్రగతులొప్పమెఱయ
దివకరానలకల్ప దీర్ఘనిర్ఘాత ♦ ఘనశాతశరసముత్కరపరంపరలఁ
గరములుగళములుకటములుభుజము ♦ లురములునిటలంబులూరులుబరులు
నేసినొప్పించుచు నిరువురుగదిసి ♦ త్రాసులై దొరసి విత్రాసులై బెరసి
యంపకయ్యముసేయ నప్పుడొండొరుల ♦
సొంపుబెంపును దెంపుచూడ నచ్చెరువు
ఫలితవిక్రమసమ ప్రారంభులగుచుఁ ♦ దాఁగక చేతులదొనలయమ్ములకుఁ
జాచిరితివిచిరి సంధించిరేయఁ ♦ బూచిసేసిరిపోయెఁ బొమ్మని తెలియ
రాకుండెనప్పు డారామరావణుల ♦ భీకరకరశరా భీలవేగములు
గణనలుక్రమములు గడచియందంద ♦ రణచండకోదండ రవిమండలముల
బ్రేంఖచ్ఛరాంశులఁ బేర్చిపు ఖాను ♦ పుంఖంబులఁగుటయుఁబోఁకుగానించి
బాణబాణాసన ప్రౌఢులక్షీణ ♦ తూణీరులేయుచోఁ దొడగియొండొరుల
బ్రతిసేసియొకటికిఁ బదియింటవెనుక ♦ నుతశక్తిదానికి నూఱింటివెనుక
వెనుకొనిదానికి వేయింటివెనుకఁ ♦ బనిగొనిదానికిఁ బదివేలువెనుక
నుడుగకదానికి నొకలక్ష వెనుక ♦ మడువకదానికి మఱికోటివెనుక
నేసినశరము మున్నేసినశరము ♦ రాసిరొక్కటదాఁకు రామరావణుల
సరినప్పుడమరారి నారిసారించి ♦ తలకొని దేవగంధర్వబాణములు
నురవడినేయంగఁబఱతెంచుచునికిఁ ♦ బరికించిచూచి యప్పరమాస్త్రవేది

తడయక దేవగంధర్వబాణముల ♦ వడినేసిపొడిసేసె వసుధేశుఁడంత
నలుకమైరావణుం డారామునిూఁద ♦ బలువిశిరాక్షస బాణమేయుటయు
మిడిగ్రుడ్లునిడుదలై మెఱయుకోఱలును ♦
సుడిగొన్నకఱకు జుంజురువెండ్రుకలును [గుడ
నసదృశోన్నతిమించు నట్టికాయములు ♦ పొసఁగదానవరూపములతోడని
గనుఁగొని రఘుకులాగ్రణి యల్కమదిని ♦
దనరంగ వైష్ణవాస్త్రముఁ బ్రయోగించి
తరణిదీధితినంధ తమసంబున-ఁచు ♦ కరణిరాక్షసబాణ గౌరవంబడఁచె
నంతరావణుఁ డురగాస్త్రంబువింట ♦ నెంతయుసంధించియేసెనేయుటయు
నామహాబాణమునందు బాణములు ♦ భీమసర్పంబులై పేర్చియందంద [నేను
పదియునిర్వదియును బంద్రెండురెండు పదుమూఁడునుమూఁడునుబహునేరు
తలలతోఁదలలపైఁదళతళరుచులు ♦ గలమహామణులతోఁగడఁకమైఁబేర్చి
గరుడవాహనుఁడలికాకుత్స్థుమిూఁద ♦ బరవసంబునవచ్చుపాపదండనఁగఁ
జ్వలనతుల్యోజ్జ్వల జ్వాలలెల్లెడల ♦ వెదచల్లుచునువచ్చు విధమువీక్షించి
కాకుత్స్థకులభర్త గారుడాస్త్రంబు ♦ గైకొనిసంధించి కడఁకనేయుటయు
గడుకొనికారుడాకార బాణములు ♦ వడిపందుఁబ్రభవించి వసుధ ంపింప
వరపక్షసంఘాత వాతవిధూత ♦ ధరణీధరంబులై తడయకనిగిడి [ర్వ
నదుమనత్రుంచె నన్నాగబాణముల ♦ నుడువీథిసుఁ లుఁడి యుప్పొంగియా
వెండియునాదైత్య విభునిపై నగ్ని ♦ కాండంబునిగిడించెఁ గాకుత్స్థుఁడలిగి
అదిధూమవిస్ఫులింగాక్రాంతదిశము ♦ నదిసికాదగ్ధ సురాధీశవనము [ను
నగుచునేతెంచు సురారాతి యుగ్ర ♦ మగువారుణాస్త్ర మాద్ధతిసేయుటయు
ఘనసమూహంబు నాకసమెల్లఁగప్పి ♦ పౌనరశంపాకలముల వానగురిసి
యనలసాయకము పెంపడఁచిగర్జిల్లఁ ♦ గనుఁగొనిరాముఁడా కాండంబుమిూఁద
వాయవ్యశరమేసి వారించెదనుజుఁ ♦ డాయెడదంతి ముఖాస్త్రంబుపఱప
దానఁబెక్కగు దంతితతిగళద్బహుళ ♦ దానజంబాలిత ధాత్రియైకదియ
శ్రీరాముఁడునునారసింహాస్త్రమేసె ♦ బోరునదద్బాణమున సింహచయము
దారుణతరసటా తాంతసకల ♦ నీరదనివహమై నిజఘోరనాద
చలితదిగ్ద్విరదమై చటులతనిగిడి ♦ కులిశోగ్రనఖములఁ గుంభముల్వ్రచ్చి

—:* రావణుఁడు శ్రీరాములపై శూలము వేయుట *:—

హస్తిసంతతిఁద్రుంచె నయ్యెడసురలు ♦ ప్రస్తుతిచేసి రాపార్థివోత్తముని
గలుషించియుప్పుడుకల్పాంతవహ్ని ♦ తులితమైమంటలుదొలకాడుచుండ
నాలోకలోకభయంకరాకార ♦ శూలంబుగొనిరాముఁ జూచిరావణుఁడు

వసుమతికంపింప వారిధుల్గలఁగ ♦ దెసలనెల్లెడలఁ బ్రతిధ్వనుల్సెలఁగ
బిట్టులిక్కి భూతముల్బెదరఁగట్టలుక ♦ దట్టించి సింహనాదము చేసిపలికె
పన్నిరారామ యీపటుశూలవహ్ని ♦ నిన్నుసీతమ్ముని నీఱుగావించి
పోరినిన్నదిరించి పోరాడిచన్న ♦ వారినారుల బాష్పవారివారింతు
జూడుమునీవంచు శూలమంకించి ♦ యోడక రాముపై నుంకించివైచె
దానిపై రాముఁ డుదగ్రుఁడై కినిసి ♦ వానలుకల్పాంత వహ్నిపైఁగురియు
పురుహూతుపగిదినద్భుతశితాస్త్రములుగురియంగనదిదానగుదియక వాని
నుఱకనీఱుగఁ జేసియుగ్రవేగమునఁ ♦ బఱతెంచుగతిఁజూచి భానువంశజుఁడు
దేవేంద్రుఁడర్థిఁ బుత్తెంచినశక్తి ♦ వావిరిఁగైకొని వైచెవైచుటయు
నదినిర్గళద్ఘంటి కారావమగుచు ♦ నదిఃస్ఫురత్పావ కారంభమగుచు
నదియక్షసురఖేచ రానందమగుచు ♦ నదిరాక్షసాలోక నాభీలమగుచు
వఱలుమనోవేగ వాయువేగమునఁ ♦ బఱతెంచుశూలంబు భస్మంబుచేసె
నప్పుడురావణుం డలుకచిత్తమున ♦ ముప్పిరిగొనఁగఁ గార్ముకదశకంబు
ధరియించిపేర్చి యుదగ్రుఁడై యార్చి ♦ శరవృష్టిముంచినజననాథుసుతుడు
తానేకకోదండ ధరుఁడయ్యుఁదునిమె ♦ వానియస్త్రములెల్ల వారనికడిమి
మదముమత్సరమునుమానంబుచలము ♦ గదురఁగన్నులనిప్పుకలునివ్వటిల్ల
రావణుఁడెంతయు రఘురాముమీఁద ♦ వావిరినమ్ముల వానలుగురిసి
కుదియనికోపంబుకొలఁదికిమిగులఁ ♦ బదియింటమాతలిఁ బదియింటహరుల
వికలసత్త్వులఁజేసి విషమాస్త్రమొకటఁ ♦
బ్రకటంబుగాద్రుంచెఁ బటుకేతనంబు
విపులచింతాభర వివశులైతూలి ♦ కపులునకపులు నొక్కటవిన్ననైరి
భువనముల్కంపించె బుధుఁడువేధించె ♦ జపమున రోహిణీశకటంబునందుఁ
బటుతరతేజంబు భయదంబుగాఁగ ♦ నటవిశాఖకువచ్చె నంగారకుండు[లె
చటులోగ్రతరభంగిజలధులుప్పొంగ ♦ నటుదూర్మిమాలికల్నభమందిపార
నెగయునొర్వ్యాసలనిష్ఠురశిఖలు పొగలచందముగాఁగఁ బొగయంగదొడగె
నుగ్రాంశుబింబంబునొరయుచువచ్చి ♦ యుగ్రదీప్తులతోమహోల్కలుడుల్లె
నవిరళతరతేజ మట్టుమ్రానుపడఁగ ♦ రవియునుగడుమంద రశ్మియైతోఁచె

—:* శ్రీరాములకగస్త్యులాదిత్యహృదయ ముపదేశించుట *:—

నలినప్పుడేచి మైనాకంబుపోలెఁ ♦ దలఁకఁగనందంద దశకంఠుఁడేయు
శరవేగగతిఁజూచి జనలోకనాథుఁ ♦ డరుదందిచింతింప నటయగస్త్యుండు
చనుదెంచియారామచంద్రునీక్షించి ♦ విమలమహాభుజబల వీర యోరామ
వితతంబుగానాజివిజయంబుచేయు ♦ నతిగోప్యమగుచున్నయట్టిమంత్రంబు

నేలమితో నాదిత్యహృదయంబు హృదయ ♦ మలర ననుష్ఠింపు మవనీశతిలక
యిమ్మహాజపమున నిప్పుడు నీవు ♦ సమ్మదంబడరంగ శత్రుఁ గెల్చెదవు
ఇది యాయువొసరించు నిది దుఃఖమడఁచు నిది సర్వమంగళహేతుభూతంబు
వెలయ సురాసుర వినుతుఁడై పొల్చు ♦ జలజాప్తుఁ బూజింపఁ జను నీకు నధిప
యీలోకలోచనుం డెల్లలోకములఁ ♦ జాలరశ్ములు నిండఁ జరియించుచుండు
బ్రహ్మయు విష్ణుండు ఫాలలోచనుఁడు ♦ బ్రహ్మకల్పాదిని భానులై నారు
మది సర్వదేవతామయుఁ డనిఁ గానెఱిఁగి ♦ కదనంబు నప్పుడీ కమలబాంధవుని
నెవ్వఁడు కీర్తించు నింపుసొంపార ♦ నవ్వీరునకు గల్గు నాహవజయము
అనుచు నమ్మునివరుం డాశ్రమంబునకు ♦ జనుటయు నాసార జపమాచరించి
యప్పుడత్యున్నతుఁడై రాఘవేంద్రుఁ ♦ డుప్పొంగి రావణోద్యోగంబు జూచి
ఘోరావలోకనాగ్నులు మండుచుండ ♦

భూరిధూమ్రాయత భ్రుకుటి నిక్కించి
పెరిఁగి రావణు రథాంభీల ఘోటముల ♦ నురుతరాస్త్రంబుల నుఱక నొప్పించి
వరశరత్రయము రావణు లలాటమున ♦ సరిఁ గ్రుచ్చి యురురక్తసంసిక్తుఁ జేసె
నప్పుడు రక్తసిక్తాంగుఁడై చూడ ♦ నొప్పెలం కేశ్వరుం డొగి రామచంద్రు
శరవసంతాగమ సముదసంఫుల్ల ♦ తరుణారుణాశోక తరువు చందమునఁ
గుపితుఁడై యంతరక్షోభర్త రాము ♦ విపులవక్షం బేసె వేయి బాణములు
నధమప్రయుక్తంబులై సురద్రోహు ♦ విధి కోసరింపక విషసక్తి మెఱసి
నిర్మలగుణయుక్తి నెఱిఁ బెడఁబాసి ♦ ధర్మంబు విడిచి యుద్ధతశక్తి నిగిడి
చనుదెంచి రాఘవేశ్వరుని నొప్పింపఁ ♦ జనన ధోగతిగాక సద్గతి గలదె
యనిన చందంబున నద్దశాననుని ♦ ఘనబాణములు వచ్చి తాకత్ స్థుగాడి
జగదద్భుతంబుగాఁ జనిభూమి దూరి ♦ తిగుడక నిగిడి పాతాళంబుఁ జొచ్చె
నురుతరక్షతములనుఱక పెల్లుబ్బి ♦ తెరుఁగు నెత్తుటఁ దొప్పదోఁగి రాఘవుఁడు
ప్రళయకాలాభీల పావకజ్వాల ♦ లలవుమై నెట్లుండు నననిండమండి
మండుచిచ్చుఱకంటి మంటలు మింట ♦

నొండొండ పర్వ కాలోగ్రుఁడో యనఁగఁ
జండతేజమునఁ బ్రచండమార్తాండ ♦ మండలకిరణ సమానాసమాన
మానితశరపరం పరలోలిపఱపి ♦ మానగర్వముతోఁడి మదమును నుడిపి
యనిసేయఁ గాలుసేయాడక యుండఁ ♦ దను వెల్ల జర్జరితంబుగాఁ జేయఁ
బర్విడి రఘురాము బాణవేగమున ♦ నిర్విణ్ణుడై యుండె నిల్చి రావణుఁడు
ధశరథసుతుఁడు ప్రతాపభాస్కరుఁడు ♦ దశకంఠుఁ జూచి యుదగ్రుఁడై పలికె
నేలరా రావణ యిట్లు నిర్విణ్ణ ♦ శీలుఁడవై యుండఁ జేష్టలు మఱచి

రూఢ నెన్నఁడు ననియుగ్రాహవముల ♦ నాడుదు బీరంబు లవి యొండుఁ బోవె
బొరిఁగి మాయన్నఁ గుబేరుఁ గాఱించి ♦
పరుని చందమునఁ బుష్పకముఁ దెచ్చుటయు
మఱి యరణ్యములందు మము డాఁగురించి ♦ చెఱఁ గొని లంకకు సీతఁ దెచ్చుటయు
నివి వీరకృత్యంబు లే దశగ్రీవ ♦ యివి పౌరుషములని యిందు గర్వింతు
వడిఁ బరాకృత దోషవశుఁడవై చిక్కి ♦ పడి నేఁడు నాదృష్టిపథమునఁ బడితి
పడితి గాకింక నీప్రాణముల్లొనక ♦ విడుతునే నిన్నేల విడుతు నే లంక
హరిహరబ్రహ్మాదు లడ్డమై రేని ♦ బొరిఁ గొందుఁ బోనీనుఁ బోర సాధింతు
రావణ నేఁడు నీరక్తమాంసములు ♦ సేవింపఁ జేయుదుఁ జెలఁగి భూతములఁ
గష్టచిత్తుఁడ వతికామాతురుఁడవు ♦ దుష్టబుద్ధివి సురద్రోహివి గానఁ
బదిలమై నిలువక పాఱితేనియును ♦ బొదివి నిన్ జంపుట పుణ్యంబు నాకు
నాసన్నమృత్యుండ వైన నీతోడ ♦ నీసు మాటలు పల్క నింక నేమిటికి
నీవిక్రమందును నీభుజాబలము ♦ నీవైభవంబును నేఁడు మాపెదను
గలన సీతమ్మని ఖరుఁడును వాలి ♦ బొలియించు కోలఁ గనవే భువనభీకరుని
నింక నొక్కటి నీకు నెఱిఁగింతు వినుము ♦ శంకింపవలవదు జనకజ నిచ్చి
శరణను కాచెద సమరంబు సేయ ♦ నురుజయం బిది నీకు నోటమి గాదు
ఆయువు పరశక్తి నధికంబు వడసి ♦ మాయావిధంబులు మఱి పెక్కు లెఱిఁగి
సమరోగ్ర శాస్త్రాస్త్ర సామగ్రి గలిగి ♦ యమ కేంద్రుఁ డావిగా నఖిలదిక్పతుల
మూఁడు లోకంబులమును గెల్చియున్న ♦ వాఁడ వీవని నిన్ను వధియింతు ననిన
మర్కటయూథపుల్ మది సంతసిల్లి ♦ రక్కసనాథుండా విభీషణుఁడు
భూవరజయమును బొందు నీవనఁగ ♦ రావణు వీక్షించి రఘురాముఁ డనియె
నింక నొక్కటి నీకు నెఱిఁగింతు వినుము ♦ శంకింపవలవదు జనకజ నిచ్చి
శరణను కాచెద సమరంబు సేయ ♦ నురుజయంబిది నీకు నోటమి గాని [యను
యనుచున్న రఘురాము నత్యుగ్రభాష ♦ లంకలార్చులై తన్ను నదరి కాల్చుట
నలుకమై నులుకుచు నద్దశాననుఁడు ♦ బలియుఁడు జానకీపతిఁ జూచి పలికె
దురమునఁ గొండఱుఁ దుచ్ఛరాక్షసులఁ ♦ బెరిఁగి జంపితినని పేర్చెదు కడఁగి
నన్నెఱుంగవు నీవు నాలావు గోలఁది ♦ మున్నెఱుంగవు నేను మును మిడిదొల్లి
యతిలోకకృతులైన యక్షగంధర్వ ♦ పతుల దేవతల దిక్పతులఁ బెక్కండ్ర
చలువిడిఁ గారించి భంగించి నొంచి ♦ చెలఁగి వర్తింతు విశృంఖలవృత్తి
సమబలప్రౌఢి విచారింపకేను ♦ సమరంబులో నిన్ను సరకు సేయుదునె
నిన్ను సీతమ్మని నేఁడాజిఁ జంపి ♦ కన్నుల పండువుగాఁ జూచి కాని
యీలంకఁ జొరనింక నేనంచు మిండి ♦ కాలాగ్నికల్పుఁడై కడఁగి రావణుఁడు

మహియునాకసమునుమండ రాఘవుని♦బహుదివ్యశస్త్రాస్త్రపంక్తు బొదివె
బొదివినఁగోపించిభూపాలుఁడేసెఁ♦బొదిగొని ప్రతిబాణములు సహస్రములు
అప్పుడు రఘురాముఁ డధికసంతోష ♦
మఁహప్పొంగ రెట్టించి యురుపరాక్రమము
చెనఁటియాతాటకఁజీఁకినవాఁడు ♦ మునియిచ్చుదివ్యాస్త్రము మదిఁదలప
దలఁపులోననవచ్చి తమమూర్తులొప్ప♦విలసితజయలింగవిస్ఫులింగముల
నమరిదివ్యాస్త్రంబు లవివెలుంగుటయు♦సముచితస్థితివాని సంధించిమించి
కొండపై బిడుగులు గురియుచందముఁ బ్ర♦చండతరవ్యాపసవ్యంబులేసి
తనియఁ మఱియు నుద్ధతిఁ ఱేసిన ఘోరబాణములకైఁ గప్పినొప్పించి
కడఁకమైఁబోరాడఁ గ్రణ... గాతు♦లాతతాంబుజవైరికంతు నలిఁజిక్కువఱచె
నారాముశరహతి నసురంగము ♦ సారథిరథమధ్యంబునందు వ్రాలుటయు
గనుఁగొనిభీతుఁడై ... లేఁగ ♦ ♦ గొనిపోయెనరదంబు ఘోరాజివెడల
సురలప్పుడే తయుఁ జూచి మూర్ఛంగఁ♦దరుచరయూథముల్దగనుత్సహింప
నాలసినలావున్నై నొక్కడొ తననికి ♦ బలిశాలిరాక్షస పతిమూర్ఛఁ దేరి
ప్ర సవ్విక్రమసమ ప్రారంభుఁడగుచు♦రథముపై నిలిచి సారథిఁ జూచిపలికె
ఓరి రాముఁడు నన్ను నోరుకీర్తిఁ దెవ్వఁ♦దేనింత యెడనవ్వు దెత్తురే యునిన
నోడినవాఁడవై యుండనీపగసుఁ ♦ గూడినవాఁడవై కొనిరాకగాదు
రథిసంకటంబు సారథిఁగన్నచోట ♦ రథముమఱలుచుట రణధర్మమొందు
నటుగానఁ దెచ్చితి ననవుడు వాని♦పటువివేకమునకుఁ బలుమాఱు మెచ్చి
పరమసమ్మదమున బసదనంబిచ్చి ♦ సురవైరియప్పుడు సూతునీక్షించి
రాముఁడు వ్నాఁడదె రణమధ్యవీథి ♦ రామునిరథముపై రథముఁ బోనిమ్ము
నావుడునరద మన్నరనాథుఁగదియ♦ద్రోవ నశాఖాలకేతుఁడు బిట్టువఱచె
దశకంఠునరద మద్ధతిరాఁగఁ జూచి♦దశరథసుతుఁడు మాతలిఁ జూచిపలికె
నదె రావణునిరథ మరుదెంచుచున్న ♦ దదె మారథమును నటఁబోవనిమ్ము
దృష్టిచలింపక తీవ్రబాణముల ♦ దృష్టించి వెఱవక తిరుగుడుపడక
వ...కకుదియక వరుసఁబగ్గములు ♦ పదిలంబుగాఁబట్టి పటుపురథ్యముల
తలిహాయముల మనసునీ వెఱుఁగు♦దాతతరథవేగ మతివిచిత్రముగ
హరథ్యమొనరింపు సకలంబునీవు ♦ నేరనియది లేదు నీకేల చెప్ప
ననవుడునపసవ్య మగుత్రోవనాతఁ ♦ డనిమిషారాతిపై నరద ముపఱప
లోకకంటకుఁడు త్రిలోకభీకరుడు♦భూకంపముగ మహాద్భుతశితాస్త్రములు
రథముపైఁ గప్పిసారథిజిక్కువఱచి♦రథవాహములనొంచి రౌద్రంబు మించి
కాండమొక్కటవిల్లు ఖండించిపెక్కు♦కాండంబులేసి రాఘవుని నొప్పించె

నొప్పింపనొచ్చి మనోవీథినలుక ♦ ముప్పిరిగొన నుగ్రమూర్తియై కడఁగి
దేవేంద్రుఁడర్థిఁ బుత్తెంచినవిల్లు ♦ వావిరి రామభూవరుఁ డెక్కువెట్టి
నెఱసి నఘనశింజినీని నాదములఁ ♦ బఱియలై బ్రహ్మాండభాండంబు వగుల
దానవగర్వాంధతమసంబడంగ ♦ భానుభాసురములై పరఁగు నస్త్రములు
శతములు వేలు లక్షలు కోట్లు మఱియు ♦ శతకోటు లర్బుదసంఖ్యలు గడవ
వాసవప్రముఖ గీర్వాణులు పొంగ ♦ నీసున నింద్రారి నేసె నేయుటయుఁ
గడుఁ జాపకర్మండు గష్టుఁ డస్థిరుఁడు ♦ వెడమాయముల బ్రోగు వీని లోనునికి
ధర్మప్రయుక్తిమైఁ దనడ్డైడిమాఱు ♦ ధర్మంబు గాదని తలపోసి రోసి
పోవుపోలిక నుచ్చి పోవుహింసములు ♦ సేవింపఁగొని వాఁడి రాముబాణములు
ఎడలేదు రావణుం డిలఁ గుశురుఁడవు ♦ దుష్టబుద్ధివి స్ఫోఁటనని ముదంబాదవ
ధరణీసురలకు ధరణీనందనకు ♦ బాదివిసర్జిఁ జాఁపఁ బోవుచందమున
నొకకొన్ని ధరణికి నొకకొన్ని దివికి ♦ న[illegible]కు నురువడిఁ బోవు
పావకోగ్రంబులై పరువడి నిగిడి ♦ రావణుఁ గని కాఁడు రాముబాణములు
నెఱసియుత్తెఱఁగున నిబిడంబులగుచు ♦ నఱిముఱిజడిగొన్న యంపవానలకు
దెరలక మరలక దివిజారి దివిరి ♦ ధరణీశు నురుశరోత్కరముల నొంచె
ఘనబాణవిక్రమక్రమబాహులగుచుఁ ♦ బెనఁగి రిబ్బంగి నభేద్యవిక్రములు
సమవత్వసమవేగ సమబాణవిభవ ♦ సమసమరారంభ చతురులై కదిసి
బలముల నేర్పుల బాహుగర్వములఁ ♦ దులదూగి యిద్దఱు దురము లోపలను
నెఱసిన నకినుకలు నిండ నొండొండ ♦ చెఱవిడిపోరాడు సింగంబులనఁగ
నేడహోరాత్రంబు లెడ తెగకుండ ♦ రూఢిఁ బోరాడి రాయాఢివిక్రములు
అత్తఱి రావణు నరదంబుమీఁద ♦ నెత్తుకు వర్షించె నిల్చి మేఘములు
ఘనరథాశ్వముల తోఁకలనిప్పులురిలె ♦ నినరుచిచ్ఛాయల నేకంబులయ్యె
నిలువవు చచ్చెదు నేఁడు నీవనుచుఁ ♦ బలికె రావణుఁ జూచి బలసి భూతములు
గెలిచెదు రాఘవ క్షితిప నీవనుచు ♦ వలనొప్ప నాకాశవాణి భాషించె
తనకైన దుర్నిమిత్తములటు సూచి ♦ యనిమిషారాతియు నాసపోవిడిచి
ధృతి పెంపు దీపింపఁ దివిరి కాకుత్స్థు ♦ నతిశాతశరముల నడరి నొప్పించెఁ
కరవాలములు మహాగదలు చక్రములుఁ ♦ బరిఘలు శక్తులుఁ బ్రాసములై వ్రాల
వైచినవానిపై వజ్రసన్నిభము ♦ లై చండకాలానలాకృతులైన
సాంద్రార్ధచంద్రాస్త్రచయమేసి రామ ♦ చంద్రుండు నడుమన చక్కుగావించె
నా రావణుండును నత్యుదగ్రతను ♦ ఘోరనారాచముల్ దురియించె మఱియుఁ
జలమున రాఘవేశ్వరుఁడును వాని ♦ నలి నర్ధచంద్రబాణములేసి త్రుంచె
నారీతి నిరువురు నన్యోన్యసమర ♦ ధీరులై జయకాంక్షఁ దెగి పోరుచుండ

సమరంబులో నద్రిచరనిశాచరులు ♦ దమతమయుద్ధ సాధనములుగొనుచు
రణవిచక్షణులైన రామరావణుల ♦ రణకేళిఁ గనుఁగొని రణకేళిమఱచి
పరువడి జిత్రరూపంబులోయనఁగ ♦ నరుదందిచూచిరి యద్దశాననుఁడు
తనచావునిక్కంబు దానెఱింగియును ♦
గినిసి రాముఁడు దన గెలుపెఱింగియును
నెంతయుఁ గడఁకతో నిరువురుఁ నిలను ♦ లంతకంతకు నెక్కుడై పోరుతఱిని
గనలి కాలానల కల్పుఁడై రోష ♦ మునఁ గన్నుగవల నిప్పుకలుప్పతిలఁగ
నింద్రారిరథకేతువిలగూల్చె రామ ♦ చంద్రుండు నిశితార్ధచంద్రశరాణమున
నా రావణుండును నధికరోషమున ఘోరబాణముల నెక్కొనిర థాశ్వముల
మాతలి నేసె నామార్గణ... తు ♦ లాతతాంబుజనాళ తాతులచందమున
నారాఘవేంద్రుని నాతురంగము ♦ సారథి నొప్పింపఁ జాలక యుండ
పాసంబులను నట్టిపాసము ల్సెలఁగ ♦ వాసిగఁగ పులు రావణుని మార్గొనినఁ
దరుచర సేనపైఁ దనమాయ మెఱసి ♦ సురకంటకుఁడు మహాశుగవృష్టిఁ గురిసె
గురిసినఁ దద్బాణకోటులచేతఁ ♦ దరుచరుల్డిసి రత్తఱి రామవిభుఁడు
సారథిరథరథ్యసహితుఁగా దైత్యు ♦ భూరిమార్గణములఁ బొదివి నొప్పించె
దశరథసుతునిపై దశకంధరుండు ♦ విశిఖజాలంబుల వృష్టిగా నపుడు
కురిసినఁ గనుఁగొని ఘోరబాణముల ♦ నరుదుగా సంధించి యమరులు పొగడ
నతని నాశాశంబు నవనీతలంబు ♦ నతిరయంబున ... డమ్ములఁ గప్పె
బగ తెల్లనమ్ముల పందిరి నీడ ♦ నాగిరాత్రిశరదీప్తి నుడుకయుండి [న
తనరు మహేంద్రమందర మహీధరము ♦ నొనరుద్దైర్యంబులనొప్పు చందము
నలిఁదిరంబై నిల్చి నభముతో నభము ♦ జలధితో జలధియు సరిఁబోరుకరణి
రామరావణుల సంగ్రామంబుతోడ ♦ రామరావణుల సంగ్రామంబె పోలు
ననుటకుఁ దగి మహోదగ్రకోపనులు ♦ దనరార నిరువురుఁ దమకించి పోర
జలదగర్జితఘన జ్యాఘోషములను ♦ గలహనిష్ఠురబాణ ఘట్టనధ్వనుల
జితవర్మసమరోగ్ర సింహనాదములఁ ♦ జతురరథాశ్వ హేషావిరావముల
నుదధులుఘూర్ణిల్లె నల్కలుండుల్లెఁ ♦ ద్రిదశులు వ్రాంగిరి దిక్కులల్లాడె
బెగడె భూతంబులు పృథివి గంపించె ♦ దిగిభంబులూటాడెఁ దిరిగె లోకములు
నగములు వడఁకెఁ బన్నగభర్తదలఁకె ♦ నగణితప్రౌఢి నిట్లరిమిపోరాడఁ
గడకలువిడిచి యుగ్రతలుడ్గికొంత ♦ తడవిద్దఱును బాహుదర్పముల్నడలి
ఘనబాణసంధానగతులుజ్జగించి ♦ కనుఁగొనుచుండిరి కలయ నొండొరులఁ
దెమలిపై వయినపూత్కృతులు నార్పులును ♦
జెమటలవఱదలు చిఱుతహుంకృతులు

నలయికలును ఘుట్టికార్ధానఁ దేరి ♦ మలుగని చలములు మఱియుఁ బ్రేరేప
నత్యుగ్రవిగ్రహవ్యగ్రులై కదిని ♦ రత్యంత కాల కాలాకృతినప్పు

—:* శ్రీరాములు రావణుని కరశిరంబులఁ దెగనేయుట *:—

డలవు దైర్యంబును నలుకదీపి పఁ ♦ బ్రళయకాలమునాఁటి ఫాలాక్షుపగిది
ఘనశాతకర్కరి క్రకచభల్లంబు ♦ నినవంశవల్లభుండేపఁగ సంధించి
యురుదరుదనఁ ద్రుంచె నర్ధశానమని ♦ శిరములుపదియును జేతులిర్వదియుఁ
ద్రుంచుట బొంకాకో ద్రుంచితిననుచు ♦ ద్రుంచిన రాముఁడద్భుతమందిచూడ
గరవాలముసలము ముద్గరభిండివాల ♦ శరచాపకేయూర చయములఁ దనరు
కరములిర్వదియును ఘనకిరీటముల శిరములుపదియును జెచ్చెర మొలచె ద్రుం
మొలచి గోపించి మొగి ద్రుంచె మఱియు ♦ దలలు చేతులు పెచ్చు దశరథాత్మజు
తలలుద్దవిడి ద్రుంచు తఱిఁ గ్రింద మొలచు ♦ తలలకిరీటము ల్వద్బాణతతులు
తాఁకి మ్రోయుట చెవిఁ దాఁకకయున్న ♦ తాఁకిన త్తలలయుదగ్రహాసములు
తరమిడి ద్రెవ్విన తలలోని మొలవఁ ♦ బర మేష్టి చేఁదొల్లి పడయుచో వరము
గలకరంబులతోడఁ గనుకని మొనబయుఁడై యీతెఁచ వడసెనోయనగ
దలలొగి మొలతేఁ దడబకత్తుల ♦ నలిఁగాడి రాము బాణములుం డెనోలి
మొగిఁ ద్రెంచి మతలలు నమ్ముఁ తోఁ మీఁదిఁ ♦
కెగయఁ ద్రోఁచుచు వెస నెయ్యున త్తలలు
దొంతులుగత్తుకల్దుంచు నస్త్రములు నెంతయు మ్యామైయెసఁగెఁ జూపరకు
ఫలిత సారథ రామ బాణోత్పలముల ♦ గలిపి రావణశిరః కమలసంతతులు
రమణమై రక్తధారాసూత్రితతులఁ ♦ గ్రమమొప్ప నెత్తుల గట్టవేల్పులకు
బొలుపొంద నాకాశపుష్పలావికుఁడు ♦ పొలవక పలుమఱుఁ జూపు చందమున
దనుజాధిపతి గొంత దడపుచూపక్కలకు ♦
నినకులాధీశ్వరుం డేయుచో మఱియుఁ
ద్రెవ్వ రాలెడునెడఁ ద్రెవ్వనితలలు ♦ గ్రువ్వని పేరులై కోమరొప్ప నప్పు
డనిమిషావళులెల్ల నచ్చెరువంది ♦ కనుఁగొన నర్ధకంధరుండమరె
లలి శిరోమాలికాలంకృతుండైన ♦ ప్రళయావసర ఘోర భైరవుపగిది
నావేళ రఘురాముఁ డాగ్రహవ్యగ్ర ♦ భావుఁడై రణబల ప్రౌఢిదీపింప
లక్షించి దృఢముష్టి లాఘవగతుల ♦ దక్షుఁడై రావణు తలలు బాహువులు
ద్రెంచుఁ గనుఁగొను మొలచుచు వాఁడియును ♦
ద్రెంచుచుఁ గ్రమ్మఱ మొలల త్రెంచు నిబ్భంగి
గరములు శిరములు కాకుత్స్థతిలకు ♦ శరపరంపరలచే జతుల వేగమునఁ
దెగుటలు మొలచుట లెలియరాకుండె ♦ నగచరావలికి నయ్యనిమిషావలికి

నాలోనరఘురాము నమ్ములఁద్రెస్సి♦రాలుచునున్న యారావణుతలలు
ఆవులింపవునొవ్వ వలసముల్గావు ♦ రావుదూలవు నిజోల్లాసముల్సెడవు
గాజువారవుమిసుకవురెప్పవేయ ♦ లోఁజదప్పవువైరముడుగ వెంతయును
బగరయుండె బొమముడి పాఁగొండెనిండు ♦

నగవొండె నార్పొండె నలుకచూపొండె [రయుండె
పలుకొండెనుచ్చొండె బైవడఁబోరు ♦ నలవొండెధృతియుండె హుంకృతి
గలుగనితలలేదు ఘనరణభూమి♦తపముసఁబడియున్న తలలోనొకటి [లు
తలలందుసమములై తలకొనుచుండ♦మొలతెంచుతలలందు మొగినుర్విగూ
దానవాధీశ్వరుతఁలు బాహువులు♦భూనభోంతరము లద్భుతముగానిండ
నిండుటఁగనుఁగొని నిండఁగోపించి ♦ వెండియు రామభూవిభుఁడేయుచుండ
ద్రెంచినశిరమును ద్రెవ్వినకరముఁ♦ద్రుంచినశిరమును దునిఁగినకరము
బలువడిఁబుట్టిన బాహుఖండముల ♦ నలమి యుప్పొదువట్టి యుద్ధశౌనకుఁడు
గణుతింపరాని వేగములావుమెఱసి ♦ రణరోషదృష్టిమై రాముపైవైచె
నతిమఱిదశకంఠుఁడుదండవైపఁ♦బఱతెంచుశిరములు బాహుదండములు
గువలయహితవృత్తి కుశలఁడై కళల♦. విరళాకృతి జగదానందుడగుచుఁ
గమనీయవానరగ్రహమధ్యవీధి♦ మణఁడై యొప్పెడు రఘురామచంద్రు
గనిచంద్రుడని బుద్ధిగమ షండములు ♦ ఘనరాహుకోటులగడఁకతోఁగూడి
యడరియన్యోన్యసహాయముల్వడసి♦ వడిఁజేర్చివచ్చుకై వడిఁదాఁకుచుండ
శిరములుఁగరములు సెలఁగియేతెంచు ♦ వరుసలుపంక్తులు వర్ణింపనొప్పు
శ్రీరామవిజయలక్ష్మి వివాహమున ♦ నారణదేవత లర్థిశోభిల్ల
బల్లవరత్నదర్పణ తోరణంబులు ♦ తెల్లమొకట్టిన తెఱఁగుదీపింపఁ
దగిగినతలలు నుద్దామబాహువులు ♦ గురిసెడిగరములు ఘూకకాకాది
ఖగములుజగము లాకంపింపఁజేర్చి ♦ గగనమండలమెల్లఁ గలగొనవిండ
గురుతరంబైజము కొలువుకూటమునఁ♦గరముగ్రముగ మేలుకట్లనఁబరగి
యిదిదివమిదిరాత్రియిదిసంధ్యయనుట♦ త్రిదశులకైనను దెలియరాకుండ

{ రావణుని కరశిరంబులు మరల మొలుచుటకై శ్రీరాములు చింతించుట }

పఠితబాణాసన బాణదీప్తులును ♦ ప్రథనంబులోఁ బట్టపగలయిలోఁ జె
ద్రనప్పుడురఘురాముఁ డాదైత్యుఁగెలుచు♦చొప్పింతయైనను జొప్పడకునికి
గనుఁగొనిశరసంధి గతులుఁజాలించి ♦

తనలోనఁబలుమాఱు దలపోయుచుండగ
తెరలకశిరములు ద్రెంచివేసరితి ♦ నారకొనికరములు ద్రుంచివేసరితి

నెసఁగుమర్మములెల్ల నేసివేసరితి ♦ వినువరకపలుమాఱు వ్రేసివేసరితి
నెబ్భంగిఁ దెగటార్పఁ డీదుష్టచిత్తుఁ ♦ డెబ్భంగి దెగటార్తు నిద్దురాత్మకుని
ననియనితలపోసి యలయుటఁజూచి ♦ జననాథుతో విభీషణుఁడర్థిబలికె
వనజాతజాతుని వరమునఁ జేసి ♦ యినకులాధీశ్వర యీతనినాభి
నమృతమున్నదికుండలాకృతిఁగలిగి ♦ యమృతత్వమూలమై యదిచంపనీదు
దానవుతలలు నుద్దండబాహువులు ♦ మానక నీవెన్ని మాఱులేసినను
మొలతెంచుచుండు నున్మూలనగ్లావు ♦ తలఁకఁడుదీన నద్దనుజవల్లభుఁడు
తఱిమియిమ్మెయినీవుతలలుబాహువులు ♦ నఱకుచున్నాఁడవు నరనాథ కడగి
తుదియేది దీనికి దొసదొడ్డిసేవు ♦ చదురొప్ప నాగ్నేయశర మేయుమింక
నానాభిమూలమూలామృతఁబిగురు ♦ దానదానవపతిదానలోదారు
నిగిడెడుభవదీయ నిష్ఠురాస్త్రములఁ ♦ దెగిమఱిచేతులు త్రిదశారితలలు
దురములోపల నూటతొమ్మిదిమాఱు ♦
లరుదుగామొలతెంచు నంతటఁబొలియు
ననవుడువిని నక్ష్మణాగ్రజుండతని ♦ వినయనయజ్ఞాని విశ్వాసభక్తి
భావశుద్ధికినాత్మఁ బలుమాఱుమెచ్చి ♦ దేవతలుప్పొంగ దివిజారిఁగ్రుంగఁ
గ్రుంగనిధర్మంబు కొనలుసాగంగఁ ♦ గాగినవదులెల్లఁ గలఁకదేఱంగఁ
దేరనిచిత్తంబు దేరిరాఘవుఁడు ♦ ఘోరంబుగా ధనుర్గుణము మ్రోయించి
కనలెడి దీర్ఘనిర్ఘాతముల్గురియు ♦ ననలాస్త్రమరివోసి యలవొప్పనేసి
యారావణుని నాభియందున్నయమృత ♦ మారూఢశరవహ్నికాహుతిచేసి
మఱినూటతొమ్మిది మాఱులుద్రుంచి ♦ తఱికొని రావణు తలలుబాహువులు
నిరుపమాస్త్రంబున నృపకులాధిపుఁడు ♦ పరికింపమఱి నూటపదియవసారి
యొక్కశిరంబును నాగిగరద్వయము ♦ దక్కంగఁదక్కినతలలుబాహువులు
దెగనేసెనేసినఁ ద్రిదశులుచెలఁగి ♦ రగచరవరులార్చి రందందపేర్చి
తలలోలిఁదెగి రక్తధారలుధాత్రి ♦ నొలుకఁగదివికుబ్బ నొప్పెరావణుడు
లోకభావిర్భాగ లోఅకీలములు ♦ పైకొనిమండెడి ప్రళయాగ్నిపగిదిఁ
దనువున ఘనరక్తధారలునిండ ♦ దనుజేశుతనువుపై దలయొప్పెఁజూడ
నరుణారుణచ్ఛాయ లడరునస్తాద్రి ♦ బరఁగెడి భానుబింబంబుచందమున
నప్పుడురావణుం డావిభీషణునిఁ ♦ దప్పకచూచి యుదగ్రుఁడై యలిగి
యొన్నరునెఱుఁగని యిట్టినామర్మ ♦ మిప్పసుధీశున కెఱిఁగించెవీఁడు
వీనిద్రుంచెదనందు విపులోగ్రశక్తి ♦ పూనివైచుటయు నభోవీథినుండి
యఱిముఱినిగిడి కాలాగ్నిచందమున ♦
నెఱిమంటలుమియును నేతెంచుచుండ

నారామవల్లభుండచలుఁడై ఘోర ♦ నారాచములదాని నడుమనే త్రుంచ
జడిగొని రఘురామశరవృష్టి పర్వె ♦ యెడుగకుండుటయు నందుండ రాకున్న
వలనేది రాక్షసేశ్వరుకోపవహ్ని ♦ పోలుపరఁబెడఁబాపి పోవుచందమునఁ
బోయె రావణు దేహమున నున్న తేజ ♦ మాయవసరమున నద్భుతంబగుచు
తలలు చేతులు ద్రెవ్వె దశకంఠుఁడొక్క ♦

తలయుఁ జేదోయునై దర్పించి యపుడు
వీరరసంబను వెల్లిచందమునఁ ♦ దోరమై తొరుఁగు నెత్తుటఁ దొప్పఁదోఁగి
తడఁబడ నెత్తుట దడిసి రణోర్విఁ ♦ బడియున్న తలలును బాహుదండములు
వానిచంచులఁ జించు వరపక్షిగణము ♦

బూని యొక్కటఁ జూచి భూనాథుఁ జూచి
చఱిగొని తనదైన నటలెల్ల బెఱుక ♦ చెఱవిడి వడి మ్రోయు సింగంబు భంగి
నేపారు తనకోఱ లెల్లనుఁ బెఱుకఁ ♦ గోపించి పైఁబడు ఘోరాహికరణి
మీసంబులూఁచిన మిగుల గోపించి ♦ శాసింపఁగడఁగిన జముని చందమున
మెఱసి లోకము లెల్ల మ్రింగెడి రీతి ♦ నుఱక కోపించి మహోగ్రుఁడై తొంటి
యన్ని చేతులఁగల యాసత్త్వమెల్ల ♦ నన్న చేతుల రెట్ట నుగ్రమై తోఁప
నాసురవరుఁ డట్టహాసంబు చేసి ♦ ప్రాసతోమర శూల పరశుఖడ్గముల
శరములసురియల శక్తుల గదల ♦ నురువడి వేసియు నురక వైచియును
బొడిచియు నడచియుఁ బోనీక రాము ♦ నడుగక నొప్పించి యుగ్రుఁడై యేచి
దేవతల్భయమందఁ దెగి మహారణము ♦ గావించుచుండె నక్కజమైన కడిమి
గడఁకయు లావును గర్వంబు మిగుల ♦ నడరి ధీరతఁ బోరు నమరారిఁ జూచి
మాతలి భీతుఁడై మఱి రాముననియె ♦ సీతడ చేటికి నిసకలాధిశ
తలలు బాహువులు నిద్దనుజాధిపతికి ♦ మొదలచునో క్రమ్మఱ మొలవక మున్న
యెడపక బ్రహ్మాస్త్ర మేసి యీసీచుఁ ♦ బడవైతు కాక దోర్బలశక్తి మెఱసి
యనవుడు విని రాముఁ డభిరామబలుఁడు ♦ వినుతవిక్రమభుజావిభవనిర్భరుడు
విదితమా శస్త్రాస్త్రవేది గావునను ♦ నిదివేళ బ్రహ్మాస్త్ర మెత్తంగ ననుచు
భూదేవదేవ తపోధను వేద ♦ వైదికకర్మ ప్రవర్తనఁ దలఁచి
తన ప్రతాపంబును దర్పంబు మెఱసి ♦ ధనువు మ్రోయించుచు ధరణి గంపింప
గౌశికకృతమైన క్రతువేళఁ దనకు ♦ గౌశికుఁ డిచ్చిన గైకొన్న యట్టి
యక్షయ బ్రహ్మాస్త్ర మప్పుడు దలఁచి ♦ దక్షత వేదమంత్రములతోఁ బుచ్చి
శిరముగా నరివోసి తెగ నిండఁ దిగిచి ♦ పరఁగఁ బ్రత్యాలీఢపాదుఁడై నిలిచి
దేవేంద్రుఁడాది దివిజులు పొంగ ♦ దేవారి యురముపై దృష్టి సంధించి
యేసె నేయుటయుఁ బెల్లేచి యాబాణ ♦ మానురాలోక కీలాభీలమగుచు

వసువులు కెలఁకుల వనజాతమిత్ర ♦ వసువులగ్రంబున వసురత్నతతులు
పిఱుఁదుముందఱ మహాపృథులమారుతము ♦
గరులనుజ్జ్వలదివ్య కళలెల్లకడల
సహజంబులై పేర్చి సంతతామోఘ ♦ మహితమై దేదీప్యమానమై సకల
శాఖామృగాభీష్టఫలమై చతుర ♦ లేఖావలోకనాలీఢమై నిగిడి
నిలువక విలయాభ్రనిర్ఘోషఘోష ♦ ములుపర్వ రాక్షసముఖ్యులు బెదర
జయజయధ్వనులతోఁ జనులు గ్రక్కదల ♦ రయమున రావణోరస్స్థలిగాడి

—*: రావణుఁడు బ్రహ్మాస్త్రముచే మడియుట :*—

యయ్యింద్రయమ వరుణాదులచేత ♦ వ్రయ్యనిమర్మము ల్వ్రచ్చి రావణుని
ప్రాణముల్గొని యుచ్చిపతి యాదివ్య ♦ బాణంబు వెసమహీ భాగంబుగాడి
నీరూఁతుఁ జెఱఁబెట్టి నీచభావమునఁ ♦ గైకొనఁదలఁచినఖలుని ప్రాణములు
కైకొంటినేనని కదిసిభూస్థలికిఁ ♦ బ్రాకటంబుగఁ జెప్పఁబఱచెనో యనఁగ
మహిఁగాడిపఱతెంచి మగిడి రాఘవుని ♦ మహితతూణీరమున్మఁదవృత్తిఁజొచ్చె
నల్బ్రహ్మమనుమని నాటిచంపుటకుఁ ♦ గలిగినదోషంబు గడతేర్చుకొనఁగ
నేచందమున నెందునీతరంబు లేమి ♦ చూచిరాఘవునుర్వ్యసాక్షినో యనఁగ
రాఘవాస్త్రాహత రక్తాంబుధార ♦ లోఘంబులై పర్వ నొరయుచువచ్చి
కులిశధారాహతిఁ గుభినిగూలు ♦ కులశైలమునుబోలెఁ గూలెరావణుడు
ఆదైత్యభూరిదేహాతి పాతమున ♦ భూదేవి యప్పు డద్భుతముగాఁ గ్రుంగ
గ్రుంగె శైలంబులు గ్రుంగె దిక్కరులు ♦
గ్రుంగె భుజగంబు గ్రుంగె గూర్మంబు
తలఁకిరి సప్తపాతాళవల్లభులు ♦ దలఁకిరి హాత శేషదనుజపుంగవులు
గిరిచరులార్చిరి కీర్తించిరమర ♦ వరులు కిన్నరులు దిగ్వరులు ఖేచరులు
ఆరఘురాముపై నప్సరస్త్రీలు ♦ బోరనఁ గురిసిరి పుష్పవర్షములు
దివ్యదుందుభులును దివ్యకాహళులు ♦ దివ్యశంఖంబులు దివినిండ మ్రోసె
శీతలపరిమళాశ్లిష్ట వాయువులు ♦ వీతెంచె దిక్కులు విమలంబులయ్యె
సురమునిఖేచర శోకంబుడించి ♦ పరికించి సకలభూభారంబుడించి
యభిమతజయశీలుఁడై పేర్చిరామ ♦ విభుఁడంతఁ దనచేతివిల్లెక్కుడించి
యానందమయచిత్తుఁ డగుచు నవ్విల్లు ♦ జానకీవిభుఁడు లక్ష్మణుచేతికిచ్చె
సకలవానరులును సకలఖేచరులు ♦ సకలదిక్పతులును సకల భూవరులు
సకలభూతంబులు సకలదేవతలు ♦ సకలలోకంబులు సన్నుతిసేయ
నని మొనగర్వాంధు నంధకాసురునిఁ ♦ దునుమాడి విలసిల్లు ధూర్జటిపోలె
రావణులోకాభిరాముఁడై విజయ ♦ ధాముఁడై నవసుధాముఁడై యొప్పె

నంతవిభీషణుం డధికశోకమున ♦ సంతాపమందుచు సమరమధ్యమున
నలఘుఁడై పడియున్న యగ్రజుఁజూచి ♦
పలుమఱు నెలుగెత్తి పలవింపఁదొడగె
నాహావోదగ్రసురాసురభయద ♦ బాహువులు పక్షులపాలయ్యె నేఁడు
సురుచిరమృదుతల్పసుభగదేహంబు ♦ పరుషసంగరభూమిఁ బడియెనే నేఁడు
అహితాంధకార బాలార్కబింబములు ♦
మహిఁగూలెనే నేఁడు మణికిరీటములు
వినయవిక్రమనయ విఖ్యాతులందు ♦ నినుఁబోల రెవ్వరు నీయంతవాఁడు
కడపటనరయంగఁ గష్టంపుఖలుఁడు ♦ బెడిదుండుపీఁడనఁ బృథివినేర్పడితి
తప్పుటతప్పని తలపోయవైతి ♦ చెప్పినమాటలు చెవిఁబెట్టవైతి
నెమ్మినయమార్గ మెఱుఁగ లేవైతి ♦ విమ్మన్నజానకినీనేరవైతి
మంతనంబున రాము మర్త్యుగా నీవు ♦ చింతింపవలదన్నఁ జేకొనవైతి
నీమానగర్వంబు నిన్నింతచేసె ♦ నేమని శోకింతు నేనింక నీకు
వలదు రామునితోడి వైరంబు విడువు ♦ చలమొప్పదని నీకుఁ జాటనే తొల్లి
నిరుపమనయనిధి నీయట్టిసుకృతి ♦ పరసతిఁదల్లిఁగా భావింపవలదె
జగతిలోఁ దగవు విచారింపవైతి ♦ తగిలినామాటలు తనకూడె నేఁడు
అనియనిశోకించు నన్ననేరములు ♦ మనమునఁ జింతించు మఱియు శోకించు

—*: మందోదరి మొదలగు రావణుని భార్యలు శోకించుట :*—

నంతమందోదరి యాదిగా దనుజ ♦ కాంతలుగూడి లంకాపురి వెడలి
యంగుల కెంజాయ లవనిపై నొలుకఁ ♦ దడఁబడి మేఖలాదామముల్ సడల
నడుకౌనులసియాడ నలసయానములు ♦
మెఱయలోయలతల మెఱుదీఁగెలులియ [దలం
హారముల్ తెగిరాల నశ్రుపూరములు ♦ తోరంబులై యొల్కఁ దొలఁగఁబయ్యె
వీడినవేణులు వెన్నులనొరయ ♦ వాడినమోములు వరవట్లుగట్ట
మొకములు దలలును మొగి మోఁదుకొనుచుఁ ♦
బ్రకటరోదనములు బహువిలాపములు
గుదియఁగ రోదసీ కుహరంబు నిండఁ ♦ గదిరెడి శోకాగ్నిఁ గాలుచు వచ్చి
విఱిగినరథములు వికలభావములఁ ♦ బఱియలై యున్న కపాలకుంభములు
తునిసినచేతులు తునియలై పడిన ♦ తనువులు నుఱుమైన దంతిదంతములు
చిదిసినతలలు విచ్ఛిన్నంబులైన ♦ గదలును బోడిమైన ఘణకంకణములు
తెగినగుండియలు నుద్ధృతమస్తకములు ♦ పగిలినగళములు భగ్నశస్త్రములు
ప్రేవులు బ్రోవులు పిశితఖండములు ♦ జీవముల్ విడిచియుఁ జెలువొందు కపులు

హయములు చిద్రుపలు నద్రిశృంగములు ♦
పయిఁబయిబడిన కబంధబృందములు
నిలువక పాఱెడి నెత్తురుకాల్వ ♦ కలిసిమొండెముగఁ బాఱు గరటితుండములు
నడ్డంపునిడుపునై యద్రులక్రింద ♦ గ్రుడ్డులువెలిఁగ్రక్క కూలినభటులు
చేకొని శవములఁ జిట్టుముట్టాడు ♦ కాకఘూకానేక కంకగృధ్రములు
రామశరక్షత రక్తపాపములు ♦ సోమపానములని సోలుభూతములు
రామునిఁ గికురించి రాక్షసేశ్వరుఁడు ♦ భూమిజఁ జెచ్చుట పొగడుభూతములు
శిరములుపదియును జేతులిర్వదియు ♦ సరుదారనొకరిత్త యట్టఁబొందించి
దైతేయకులనాథ తగదు రామునకు ♦ సీతనిమ్మని బుద్ధి చెప్పుభూతములు
కోఁతిహాండులుసొచ్చి కోఁతులై వచ్చి ♦ భ్రాంతులై నరకరటికబంధముల్ దెచ్చి
వడిఁ బేర్చి ఘనరక్తవార్ధిలో ముంచి ♦ కడఁకతో సేతువుఁ గట్టుభూతములు
నారాయణుఁడ నేను నాకపులు మీరు ♦ మీరు రాక్షసులని మేరలు చేసి
పనివడి కరటికబంధముల్ దెచ్చి ♦ ఘనతఁ బ్రేవులు శేషుగాఁ జేసి చుట్టి
కోరి నరకాబ్ధిలోఁ గొని తెచ్చి వైచి ♦ ధీరత మించి మర్దించుభూతములు
మా రాము బాణ నిర్మథిత మాంసముల ♦ కీరాదేసీనాక మేలయిచ్చెదవు
సొలవక మేఁకసంజుల్లకునుచు ♦ నళినీంద్రుదెసఁ జూచి నవ్వుభూతములు
మదిఁ జేవగలిగి కుమార తారకులు ♦ గదిసిన సంగ్రామంగణముఁ జూచితిమి
అదయులై విషకంధరాంధకాసురులు ♦ గదిసిన సంగ్రామంగణముఁ జూచితిమి
త్రిదశేంద్రవృత్రులు దెగువమై మెఱసి ♦ కదిసిన సంగ్రామంగణముఁ జూచితిమి
ఈమాంసఖండంబు లీకబంధంబు ♦ లీమహారక్తంబు లీవింతచవులు
పొడగాన మేనుని పొంగియొండొండ ♦ నడరుచుఁ దొడరుచు - డుభూతములు
రవికులాధిపుఁడైన రామవిక్రమము ♦ తివుటమైఁ గడఁగి కీర్తించుభూతములు
ఈరామవిక్రమం బేటివిక్రమము ♦ ఘోరారావంబులు కోటులుసలిపి
వరమాంసరక్తప్రవాహముల్వాఱిపి ♦ పరితృప్తిగావించు పంక్తికంధరుని
నని మొనఁ దెగటార్చె నాచవులంక ♦ మనకెందుఁ గలవని మురుగుభూతములు
ఉరురథధ్వజదండయుగళముల్ నిలిపి ♦ పొరిఁబొరి బ్రేవులు పొందొందమడిచి
పరమసమ్మదమునఁ బ్రమదలుఁ దారు ♦ సరసడోలాకేళి సలుపుభూతములు
ఎమ్ములునమ్ములు నెడలుగఁ గ్రోసి ♦ యిమ్మైన చోటుల నెడగల్గనిలిచి [ దేలి
ప్రియమొప్పఁ బ్రియులును బ్రియులనుగూడి ♦ ప్రియరక్తపానసంభృతకేళి
చెలువొప్ప రాముఁడు సీతతోఁగూడి ♦ వెలయుఁ గాకంచు దీవించుభూతములు
కలిగి భయంకరాకారమైయున్న ♦ కలహరంగముఁ జొచ్చి కడుచోద్యమంది
పనవుచు నేప్పుచుఁ బతిబేరుకొనుచు జనుదెంచియందు రాక్షసవధూజనము

తునిసి నెత్తుటఁ దొప్పదోఁగిన కేలు ♦ తనుపారు కిసలయ తల్పంబు గాఁగఁ
నకలంకతరములై యడరి పైఁ బర్వ ♦ మకుటరత్నారుణ మండలప్రభలు
తనుఁ బెక్కగప్పినఁ దద్దయు నొప్ప ♦ ఘనధాతువస్త్ర నికాయంబు గాఁగ
ననివడఁ బర్వె సర్వాంగంబులందుఁ ♦ దలకొన్న మెదడు చందనచర్చ గాఁగఁ
జతురసంఘట్టన జాతాస్థిరజము ♦ ప్రతిలేని పుష్పపరాగంబు గాఁగఁ
దాలసముత్తాల దండముల్విరిగి ♦ వ్రాలి తూఁగాడెడు ధ్వజముఁ గ్రాలు
కోమలమృదుల దుకూలఖండములు ♦ వేమఱుఁ బైఁ బీచు వీవనల్ గాఁగఁ
నంతంతఁ జట్టును నపని పైనున్న ♦ దంతావళోరు ముక్తాఫలావళులు
వరుసతో బడిసి పైఁ బైచినఁ జెదరి ♦ కర మొప్పు మల్లికా కళికలు గాఁగఁ
నరుదు గాఁ బర్విన యారామచంద్రు ♦ శరచంద్రికలచేత సంతాపమంది
వీరలక్ష్మీఘనవిరహాగ్నిఁ గ్రాగి ♦ ధారుణిఁ బడియున్న దశకంఠుఁ గనిరి
కనియంత శోకాబ్ధి కరడులఁ దేలి ♦ దనుజేశుపైఁ బడి దానవాంగనలు
పనువ మందోదరి పతిమీఁద వ్రాలి ♦ తన రెడు శోకాబ్ధిఁ దరియింపలేక [గొ
కలసి బాష్పంబులు కన్నుల దొరుఁగ ♦ బలుమాఱు నెలుగెత్తి పలవింపఁ దొడఁ
హా రాక్షసేశ్వర హా వీరవర్య ♦ హా రణాలంకార హా నాథ యనుచు
నలఁతయుఁ బలువగ లడలు దీపింపఁ ♦ బలుమాఱుఁ బలవించి పతిఁ జూచి పలికె
లంకేశ నేఁడు నీ లంకలోపలికి ♦ శంకింపకి నరశ్మి జాలముల్చొచ్చె
నెడరయ్యె నిపుడని యింద్రాదిదివిజుఁ ♦ లుడువీధి నందఱు నుబ్బుచున్నారు
అమరాధిపతి గెల్చి యనలుని గెల్చి ♦ సమవర్తి నాజిలో సాధించి మఱియుఁ
బాశహస్తుని గెల్చి పవమాను గెలిచి యీశానుసుఖు గెల్చి యీశాను గెలిచి
నీలావులావుగా నిఖిలలోకముల ♦ వాలుదు వెందు దుర్వారుండ వీవు
నీకిట్టి దుర్దశ నేఁ డేల కలిగె ♦ నీకంటె బలియురు నేర్చి రేకలుగ
ధారణీసుత నిమ్ముతగదు రాఘవుఁడు ♦ నారాయణుఁడుగాని నరుఁడుగాఁ డతడు
అని నీకుఁ జెప్పితి నకట నా పలుకు ♦ విన వైతి నీవిధి విన నేల నిచ్చుఁ
దపమాచరించుచో దశకంఠ దొల్లి ♦ విపులైకనిష్ఠతో విదితంబు గాఁగ
నీవింద్రియంబుల నెఱి నిగ్రహించి ♦ తావైరమున నిప్పు డవి యేమరించి
యనుకూలశత్రులై యాయింద్రియములు ♦ జనకజ దెప్పించి సమరంబులోన
నవివంశుచే నిన్ను నిట్లు చంపించె ♦ ననినీకు హితు లెవ్వ రసురాధినాథ
సురలకు నెబ్బంగిఁ జొరరాని లంక ♦ నుర వడి హనుమంతుఁ డొక్కఁడే చొచ్చె
గలఁగక జలరాశి కట్టె వానరుల ♦ కలవియే సురలు వీరంటి నే నపుడె
తరమిడి నా జనస్థానంబు నందు ♦ ఖరదూషణాది రాక్షసులఁ బెక్కండ్ర
బలువిడి నొక్కండె పటుబాహుశక్తిఁ ♦ నలిరేఁగి చంపిన నాఁటనుండియును

దలఁకుదు రాముని దలఁచినిఁ జూచి ♦ తలఁకుట యెల్లను దలకూడ నేఁడు
ధర్మతత్పర యరుంధతికంటె నిత్య ♦ నిర్మలమతి రోహిణీదేవికంటె
భూరిగుణోజ్జ్వల భూదేవికంటె ♦ సైరణగల పుణ్యసాధ్వి జానకిని
దెగిఁ దెచ్చినప్పుడే దేవిశోకాగ్నిఁ ♦ బొగిలినాఁడవు గదె భువనంబు లెఱుఁగ
గైకొని యెవ్వఁడే కర్మంబుఁ జేసె ♦ నా కర్మఫలము వాఁ డందక పోఁడు
అతినీతిపరుఁడైన మా విభీషణున ♦ కతులసౌఖ్యము గల్గెన ఘనాత్ముఁ డగుట
ఏపున లోకంబు లెల్లఁ గాఱించు ♦ పాపికి దురవస్థ పాటిల్లె నేఁడు
కలరు సీతాదేవికంటె సౌభాగ్య ♦ కలితరు పెక్కండ్రు కామినుల్ నీకుఁ
గామాంధకారంబు కన్నులఁ గప్పి ♦ నీమదిఁ దెలియంగ నేరవు గాక
కులరూపదాక్షిణ్య గుణగణాకేళిఁ ♦ దలఁపవై దేహి నాతరముగా దెందు
నాకంటె నెక్కుడో నాతోడ సరియొ ♦ నీ కానమికిఁ జెప్ప నేరగా కేను
మృత్యువొక్కొక్క నిమిత్తంబు వలన ♦ సత్యంబు గలుగుట సకలజీవులకు
నెడరై నమృత్యువు నిటఁ జేరఁ దెచ్చు ♦ వడువునఁ దెచ్చితి వైదేహి నీవు
భాగ్యంబు గలసీత పతితోడఁ గూడి ♦ యోగ్యంబులగు సుఖం బొనర బెంపొందె
నాథభాగ్యము లేని ననుఁ జూడు దుఃఖ ♦ పాథోధిలోపలఁ బడి మునింగెదను
పాలుపార నీతోడఁ బుష్పకంబెక్కి ♦ లలితంబులైన లీలావిహారములు
సలిపితి మందరశైలంబునందుఁ ♦ గలధౌతగిరియందుఁ గనకాద్రియందు
నాతత నంగనోద్యానంబునందుఁ ♦ బ్రీతిమై మతియును బెక్కుదేశముల
వక్కటా యాలీల లన్నియు నన్నుఁ ♦ ద్రెక్కొన్న విధి కడతేర్చె నేఁడు [జిత్తు
మయుఁడు నా తండ్రి నామగఁడు రావణుఁడు ♦ ప్రియపుత్రుఁ డాహవప్రియుఁ డింద్ర
దని గర్వమున నుండి యనిలోన రామ ♦ జననాథు చే నీవు చచ్చుటే నెఱుఁగ
పిడుగడచిన యద్రి పృథివిపైఁ గూలు ♦ వడువునఁ జూర్ణమై వసుధపై బడితి
మృత్యువునకు నీవె మృత్యువై యుండి ♦ మృత్యువు పాలైతి మేదినిఁ గూలి
వైరుల సతులకు వైధవ్య మిత్తు ♦ నీ రామలకుఁ గల్గె నేఁడా ఫలంబు
అని యేడ్చుఁ బలవించు నసురేశు మోముఁ ♦ గనుగొని వర్ణించుఁ గన్నీరు నించు
దౌడలపైఁ దలయిడుఁ దొరఁగు కన్నీట ♦ గడుగు నానన ధూళిఁ గడుఁ జిన్నవోవు
కీలించి కేలు కెంగేలిలోఁ దారు ♦ వాలు డెందము గంద వగచు నాత్మేశు
తల యెత్తి డాకేల ధరియించి చూచు ♦ తల యూఁచు వలచే ధరణిఁ బొరల్చు
పోమెఁ బొమ్మను రామభూపాలుఁ డింత ♦ సేయునే నేనేమి సేయుదు నింక
వనితయలమటఁ బొందు నవనిపైఁ బొరలుఁ ♦ దనదిక్కు లేమికిఁ దద్దయు వగచు

—*: విభీషణుఁడు మందోదరిని చూచి దుఃఖించుట :*—

తుది లేని శోకాగ్నిఁ దొడరి యుబ్బంగి ♦ వదలక శాలెడి వదినెనుఁ జూచి

యడుగులపైఁబడి యాత్మలోఁ బెద్ద ♦ యడలిస్రుడింపఁగ నవ్విభీషణుఁడు
వడితోడఁ బేర్చి రావణపయోరాశి ♦ పడఁతుక రఘురాముబాణాగ్ని నిగిరె
పటితెంచి రాఘవప్రళయమారుతము ♦ సరసరావణపారిజాతంబుఁ గూల్చె
గమివిచ్చిపాఱి రాఘవనాగవైరి ♦ సమదరావణసామజంబును జంపె
నతులితనిశితరామామోఘబాణ ♦ శతకోటి రావణశైలంబు దునియె
బలువిడి రాఘవప్రళయదావాగ్ని ♦ ననిదశాననకాననము నీఱుచేసెఁ
బడఁతుక రాఘవాపరపయోరాశిఁ ♦ గడఁగి రావణదివాకరుఁ డస్తమించె
ఖరకరామోఘ రాఘవనీలమేఘ ♦ శరవృష్టి రావణసప్తార్చి నార్చె
నని పెక్కుభంగుల నడలుచునున్న ♦ ఘనవిభీషణుఁ జూచి కాకుత్స్థుఁ డనియె
నీవనితలయేడ్పు లింక వారింపు ♦ మీరు నశోకింప కిటమీఁద నుడుగు
పరిగొని శూరులు బవరంబులోనఁ ♦ బరులచేఁ జత్తురు పరులఁ జంపుదురు
జయమిద్దఱికి లేదు సమరంబులోన ♦ జయపరాజయము లస్థిరము లగ్గావు
సకలసుపర్వుల సాధించె నితఁడు ♦ సకలగంధర్వుల సాధించె నితఁడు
సకలదిక్పాలుర సాధించె నితఁడు ♦ సకలభూపాలుర సాధించె నితఁడు
ఏకాంగవీరుఁ డహీనసాహసుఁడు ♦ లోకైకజితుఁడు త్రిలోకభీకరుఁడు
మీయన్నగణమున మిక్కిలి కడిమిఁ ♦ జేయూపఁ దెలియఁ జూచితి కాదె నీవు
ఈ చందమున నిల్చి యెవ్వండు పోరు ♦ నీ చందమున నెదిర్చి యెవ్వండు చచ్చు
నీ లావు నీ చావు నెవ్వరు వడయఁ ♦ జాలుదురక్కటా జయమేమి సేయు
ననఘ మీయన్న కృతార్థుండు వగవ ♦ బని లేదు ధైర్యంబు పాటించి వినుము
కడఁకతో నగ్నిసంస్కారాదివిధులు ♦ తడయక చేయు మీదనుజాధిపతికి
న వుడు భీతుఁడై యావిభీషణుఁడు ♦

ఘనభక్తియుక్తిమైఁ గరములు మొగిచి
యెక్కడి సంస్కార మీతఁడు నాకు ♦ నెక్కడితోఁబుట్టు వితఁడు నాపగఱ
నీ దేవిఁ దెచ్చిన నీచుండు కష్టుఁ ♦ డీదుష్టచిత్తున కెక్కడివిధులు
పరవధూజనుల సంస్పర్శంబు సేయు ♦ పురుషులధోగతిఁ బోయి కూలుదురు
అట్టివారల ముట్ట నర్హంబు గాదు ♦ గట్టిగాఁ గనుఁగొనఁ గాదటుఁ గాన
నీపాపకర్ముని నేముట్టుటకును ♦ నోప వైదికవిధి కుచితుండు గాఁడు
అనుటయు సమ్మాన్యు లంతరంగమునఁ ♦ జొనిపి విభీషణుఁ జూచి రాఘవుఁడు
అనఘ నీ చెప్పిన యంతకుఁ గలఁడు ♦ దనుజాధిపతి నింకఁ బగదు దూషింపఁ
గడఁకతో సమరగంగాప్రవాహమున ♦ గడిగికొన్నాఁడు పోగిగల కల్మషములు
అచ్చుగా నాపను లన్నియు నయ్యెఁ ♦ జచ్చిన పిమ్మటఁ జనదు వైరంబు
పరువడి నితనికిఁ బరలోకవిధులు ♦ కరమర్థిఁ జేయుము కడఁకతో నీవు

అనవుడు నౌఁగాక యనివిభీషణుఁడు ♦ తనబుద్ధివైదిక ధర్మంబుఁబూని
యచటికినగ్నిత్రయంబుఁ దెప్పించి ♦ యచలమానసుఁడప్పు డగ్రజన్మునకుఁ
గర మొప్పనగ్ని సంస్కారాదులైన ♦ పరలోకవిధులెల్ల భక్తితోఁజేసి
చనుదెంచి యారామచంద్రునగ్రజులకు ♦
  వినతుఁడై యున్న యవ్విమలాత్ముఁజూచి
ప్రియభాషణంబులఁబెద్దమన్నించి ♦ దయపెంపుమిగులనాతనినూఱడించి
ధరణీశుఁడప్పుడు తమ్మునిఁజూచి ♦ నిరుపమకారుణ్య నియతుఁడై పలికె

## —:* విభీషణుని లంకాపట్టాభిషేకము *:—

నీవింక లంకలోనికిఁబోయిపుణ్య ♦ భావువిభీషణుఁ బట్టంబుఁగట్టి
రమ్మనిపొమ్మనపుడు రాఘవానుజుఁడు ♦ నెమ్మితోలంకలోనికిఁబోయియపుడు
తడయక తరుచరోత్తములనుబనిచి ♦ కడఁక సముద్రోదకముఁ దెప్పించి
వారిపురోహితవరుల రప్పించి ♦ వారిసజ్జనమంత్రివరుల రప్పించి [జేసి
భూరిమంగళతూర్యములు మ్రోయనతని ♦ నారూఢనియతితో సభిషిక్తుఁ
సంచితమంగళాచారములెల్లఁ బరఁగ ♦ నంచితసింహాసనాసీనుఁ జేసి
కర మొప్పనతని లంకారాజ్యమునకుఁ ♦ బరమసమ్మదమునఁ బట్టంబుఁగట్టి
యెందాఁక రవిచంద్రు లెందాఁక ధరణి ♦
  యెందాఁక కులగిరు లెందాఁక నభము
నెందాఁక జలనిధు లెందాఁక దిశలు ♦ నెందాఁక రాఘవాధీశుకీర్తనము
లారూఢముగఁ జెల్లు నందాఁక నేలు ♦ మీరాజ్యమనియప్పు డిట్లనిదీవించి
పరఁగ రక్షోరాజ్యభరణమెవ్వరికిఁ ♦ బరికించినడపుట పరమదుర్లభము
దీనినేమఱక వర్తింపుమునిత్య ♦ మైనధర్మముసేయు మనియొప్పఁబలికె
నంతవిభీషణుం డక్షీణరాజ్య ♦ సంతోషముబొంది చతురమానసుఁడు
తడయక మంగళద్రవ్యముల్గొంచి ♦ తొడవులంబరములుదూర్వాక్షతములు
గొనిలక్ష్మణునిఁగొల్చికొనచొప్పవచ్చి ♦ జననాథునకునిచ్చిసద్భక్తిమ్రొక్కి
నలపుమైరఘురామువదలియెల్లఁబుచ్చి ♦ యెలమితోమాతలికిచ్చివీడ్కొలిపె
మాతల్లిరథమెక్కి మహనీయమహిమ ♦ నాతతరథవేగుఁడై పోయెదివికిఁ
దదనంతరంబ యద్ధరణివల్లభుఁడు ♦ మదిలోవిచారించి మారుతిఁజూచి
జనకపుత్రికి మనజయముసేమంబు ♦ వినుపింపులంకకు వేగపొమ్మనుఁడు
చనిహనుమంతుఁడు సంతోషమొదవ ♦
  ఘనవేగమునలంకఁ గడఁకతోఁజొచ్చి
యారామువిజయంబు నాత్మఁజింతించు ♦ నారామసతి నశోకారామవీథిఁ
గనిమ్రొక్కివచ్చితిఁగల్యాణియనుచు ♦ వినతుఁడై పలికెనువినయంబుతోడ

సంతోషమొంతయు జానకి నీవు ♦ చింతించుపగిది నే సిద్ధించె నీకు
దేవి నీపతి రామదేవుండు వచ్చి ♦ రావణు లోకవిద్రావణుఁ జంపి
తోడరియనేకుల దుష్టరాక్షసులఁ ♦ బొడిచేసి సమర మద్భుతముగాఁ జేసి
తమ్ముఁడు సౌమిత్రి తనుఁ గొల్వఁ బరము ♦ సమ్మదంబున రామచంద్రుఁ డున్నాఁడు
అని చెప్పి యాదేవి యడలార్పఁ దొల్లి ♦ పనివచ్చి యాడిన బాసలు దలఁచి
జలజాక్షి నీపతి జలధి బంధించు ♦ లలన నీనాథుండు లంకపై విడియు
రమణి నీరమణుండు రావణుఁ ద్రుంచుఁ ♦ గమలాక్షి నీభర్తఁ గైకొను నిన్ను
నని విన్నవించితి నర్థి నాఁడిచట ♦ వనిత నా ప్రతినలు వచ్చె నన్నియును
పనివిని యెవ్వనింకఁ బతిపాలికేను ♦ బనులాన తిమ్మన్నఁ బవనజుఁ జూచి
రావణుమరణంబు రఘు ముజయము ♦ భావించి భావించి పడఁతి హర్షించి
తెగినప్రతాపంబు దీపింప రామ ♦ జగతీశ్వరుఁడు వచ్చి సాధించెఁ గాక
ఘనదైత్యగర్వాంధకారమీ లంకఁ ♦ జనఁ జొచ్చి పరులకు సాధింపఁ దరమె
నీధైర్యగాంభీర్య నిరవద్యశౌర్య ♦ మాధుర్యపర్యాయ మహిమ లేమందు
నేమని వర్ణింతు నేను నీచరిత ♦ మేమని పొగడుదు నేను నీకడిమి
నూర్నభూషణ జగన్నుత వస్త్రహేమ ♦ రత్నసంపదలతో రాజ్యమిచ్చినను
బరఁగ నీచే ధనపౌరుషంబునకుఁ ♦ బరికింపఁ సరిగావు పవమానతనయ
సంతోషమందితిఁ జాల నీవలన ♦ నంతరంగంబున ననిసీత వలుక
హనుమంతుఁ డత్యంతహర్షంబు తనదు ♦ మనమున బెనఁగొన మగువకిట్లనియె
నన్ను మీ రిటు కరుణాదృష్టిఁ జూచి ♦ మన్నించి యాడిన మాట యెచ్చాలు
భావింప దేవేంద్రపదము నకంటె ♦ నేవస్తువులు తంటె నిది ఘనంబరయ
నని పల్కు మతియును సమ్మహీపుత్రి ♦ హనుమంతుఁ గనుఁగొని యతనికిట్లనియె
బలములు శౌర్యంబు శాహువిక్రమము ♦ నలఘు తేజంబును నంచితక్షమయు
శ్రుతము మాధుర్యంబు సుస్థిరత్వంబు ♦ సతతంబు నిశ్చలస్వామి భక్తియును
వినయంబు మొదలైన విశ్రుతగుణము ♦ లనుపమస్థితి నొప్పు ననఘు నీకనినఁ
గడు భీకరాకృతులు గలిగి యుద్దేవి ♦ కడనున్న రాక్షసాంగనల నీక్షించి
యాపాపకర్ముని యాజ్ఞ వాటించి ♦ యీపాపమతులు నీ కెగ్గు సేయుదురు
ఘనముష్టిఘాతలఁ గడ తేర్చిపుత్తు ♦ ననవుడు జానకి హనుమంతుఁ జూచి
యేసినవాఁడుండ నీవేమి సేయు ♦ దాసీజనం బెందుఁ దగదు చింతింపఁ
దొల్లి నేఁ జేసిన దుష్కర్మఫలము ♦ తెల్లనుగంటి వీరేమి సేయుదురు
అనఘ దుశ్చారిత్ర పాపాత్ములందైన ♦ ఘనులు దయాబుద్ధిఁ గలిగి యుండుదురు
గాన వీరాక్షసకాంతలఁ జంప ♦ వానరోత్తమ నీకు వలదన్న నలరి
నిర్మలగుణరత్ననిధివి నీవరయ ♦ ధర్మపత్నివి గాఁగ దగుదు రామునకు

భూనాథుకడకింకఁ బొమ్మనినాకు ♦ నానతియిమ్మన్న నద్దివిపలికె
భావంబుతానని పట్టితిఁబ్రాణ ♦ మేవానరో త్తమ యింతకాలంబు
తన్నుఁజూడకయింకఁ దడవోర్వఁజాల♦నున్నదానని తెల్పు మర్వీశునకును
బొమ్మనిదీవించ భూమినందనకు ♦
నెమ్మతితోఁ బ్రమొక్కుచు నిపుణమానసుఁడు
చనుదెంచి యారామజగతీశ్వరునకు♦వినతుఁడై పావని వెసవిన్నవించె
దేవనీసేమంబు దేవనీజయము ♦ దేవితోఁజెప్పిన దేవిహర్షించె
వనజానేత్ర దేవరఁజూడవలయు ♦ ననివిన్నపముసేయ మనిపంచెనన్ను

—:* శ్రీరాములు విభీషణునితో సీతను దెమ్మనుట *:—

ననిననిఁచుకతడ వాత్మఁజింతించి ♦ జననాథుఁ డావిభీషణుఁజేరఁబిలిచి
జనకజమంగళ స్నానంబుసేయఁ♦ బనిచి దివ్యాంబరాభరణమాల్యములు
వెలయఁగై సేయించి వేడ్కనిక్కడికిఁ♦ బొలఁతుకఁదోడైమ్ము పొమ్మన్న నతడు
సంతసంబుననేగి సరమాదులైన ♦ యంతఃపురస్త్రీల కంతయుఁజెప్ప
జనకజఁ దెండన్న సంప్రీతివారు ♦ చనిభూమిజకుమ్రొక్కి సద్భక్తితోడ
దేవనీపతి రామదేవుండుపిలిచి ♦ యావిభీషణుతోడ నానతియిచ్చి
పుత్తెంచుటయుమమ్ముఁ బుత్తెంచెనీవు♦ చిత్తంబులోపలఁ జెలువువాటించి
యభిమతమంగళాయతుఁడైనరాము♦విభుఁడున్నచోటికి వేంచేయవలయు
నీవేష మేటికి నెలనాఁగనీకు ♦ నీవుకల్యాణివి నీరేరుహాక్షి
యనిమంగళస్నాన మర్థిఁజేయించి ♦ తనులతాతన్వికిఁ దడియొత్తులెత్తి
దివ్యాంబరంబుల దివ్యమాల్యముల ♦ దివ్యభూషణముల దేవిఁగైసేసి
యనమానమహిమతో నసురకామినులు ♦
పసిఁడిపల్లకియందుఁ బడఁతుకనుంచి
తోడితెచ్చుటఁజూచితోరంపుభక్తిగడునొప్పమిగులరాక్షసులేశ్వరుడు
ప్రకటరాజ్యమునకు ఫాలపట్టమును ♦ నకలంకనియతికి హస్తవేత్రమును
ధరియించియత్యంత ధన్యతఁబొంది ♦ పరమానురక్తుఁడై బంటునై కడఁగి
ముందరరాక్షసముఖ్యులునడవ ♦ సందడిజడియుచుఁ జతురుఁడై వచ్చి
యనతిదూరంబున నద్దేవినునిచి ♦ చనుదెంచి యావిభీషణుఁడు రామునకు
జెచ్చెరవినతుఁడై చేతులుమొగిచి ♦ తెచ్చితివిచ్చేసె దేవినావుడును
అతిహర్షరోషదైన్యాయత్తుఁడగుచు♦ మతినింతచింతించి మనుజవల్లభుడు
పిలిచి తెమ్మనుడు విభీషణుండరిగి ♦ యొలసినకడఁకతో నుచితసంవేది
పావనవీథి నప్పరమపావనుఁడు ♦ దేవిజానకిఁ దోడితెచ్చుచోఁగదిసి
ఘనవేత్రహస్తుఁడై కపులరాక్షసులఁ♦గనుగొనిసందడిఁ గ్రంద్రవేయుటయు

నామహాశోకలకలం బప్పుడాలించి ♦ రాముఁడు రాక్షస రాజువీక్షించి
ఓహో విభీషణ యుచిత మేనీకు ♦ నూహింప నేఁటికి నుగ్రకృత్యములు
వింతవా రెవ్వరు వీరిలో మనకు ♦ నింత నొప్పింతురే యిబ్భంగిఁ గడఁగి
వలవదు వారింప వచ్చియుందఱును ♦ గలసి చూతురుగాక కలదె యిందేగు
కాలదేశాంతర క్రమమునఁ జెడని ♦ యీలువొక్కఁడమకు వింతియకాక
యొంసికోటలు నిండ్లును దెరలు ♦ వనితలకెందు నావరణముల్గావు
వ్యసనంబు ందు వివాహంబుల దు ♦
నెసఁగుకయ్యము ల దు నిష్ఠలయందు
తలకొని చెల్లు నుత్సవములయందు ♦ వలవదావరణము ల్వారిజాక్షులకు
నేనిందుతున్నాఁడ నిదిరణభూమి ♦ గాన నగ్గేమియుఁ గాదు రానిమ్ము
అనినవిభీషణుం డారాఘవుండు ♦ పనిచిన తెఱఁగున బద్మాక్షిఁ దెచ్చె
నప్పుడు కల్యాణి కవనీతనూజ ♦ కప్పాంగుసంతోష ముల్లంబు నిండి
వెలికినే తెంచిన విధ నఁజెమటఁ ♦ గలయుఁ దనూలత గ్రమ్మిదైవార
రాకాసుధాకర రామచంద్రాన ♦ లోకనామృతపాన లోలమై తేలి
చిరవిరహాగ్నుల జెచ్చెరనార్చి ♦ పరమానురాగ సంభరితాత్మయగుచు
నేచినకోర్కుల నెలమిదీపింప ♦ జూచెఁజూడఁగనాఁ జూచిరాఘవుని
నవనతవదనయై యశ్రుపూరములు ♦ ధవళవిలోచనోత్పలముల దొరుఁగ
భయమును బ్రియమును బై పాటుసిగ్గు ♦ పయిఁబడుచుండ నప్పడతుక యుండె
నప్పుడు రఘురాముఁ డాత్మలోఁ గోప ♦ ముప్పొంగఁ దప్పక యుగ్మలిఁ జూచి
మానంబు ప్రాణంబు మహితవృత్తులకు ♦ మానాభిరక్షణ మతిచింత చేసి
మానిని వినుము నామహితవర్తనకు ♦ నేనింన్నుక దెచ్చితి నింతియకాని
యింతినీ దెసనారు ని తక మిగుల ♦ నంతరంగంబున నాసక్తిలేదు
కాకుత్స్థకులజులు గాంభీర్యధనులు ♦ లోకరక్షణ కళాలోలతత్పరులు
వారివంశంబున వచ్చిజన్మించి ♦ భూరివృత్తోన్నతిఁ బోకార్చెనంద్రు
పగవానియింటి లోపలనున్న నిన్నుఁ ♦ దగిలి వరించుట ధర్మంబుగాదు
ఆలిఁగోల్పడి పోయి యక్కటా మగుడఁ ♦ దేలేఁడిత డను తిట్టువాటునకు
వెఱచి తెచ్చితిఁ గాని వెలఁది నిన్నెల్ల ♦ నొఱుపైనచోటుఁ నుంకపొమ్మనిన
జననాథుపరుష భాషాసాయకములు ♦ గొనికాడ నొప్పింపఁ గువలయనేత్ర
యప్పటిస తోష మంతయు మఱచి ♦ చెప్పనోరాడక చేష్టలుదక్కి
తాపంబుఁ బొంది యుత్తలమందికుంది ♦ కోపించి వగచి డగ్గుత్తిక వెట్టి
జలజాప్తకులు రామచంద్రునిఁ జూచి ♦ యెలనాఁగ యేడ్చుచు నిట్లని పలికె
దేవ నా చిత్తంబుఁ దెలియదె నీకు ♦ నీవు సర్వజ్ఞ మనీషివిగావె

ననుఁ దెచ్చి నాపిన్ననాఁటనుండియును ♦ బెనిచి రక్షించి గాంభీర్యంబునించి
యీనీచభావల నేలనొప్పించెఁ ♦ దే నేలపో వేల యీమాట లేల
భూదేవి కడుపునఁ బుట్టితి జనకుఁ ♦ డాదట ననుఁ బెంచె నంతటిమీఁద
నృపశిరోమణివైన నీదేవినైతి ♦ చపలవధూవృత్తి నైఁచు నే నాకు
మగవారు నమ్మని మగువల నాడు ♦ తగవులనాడెదు తగులువోవిడిచి
నమ్మని వాఁడవు నాఁడు నన్నరయఁ ♦ బొమ్మని హనుమంతుఁ బుచ్చిపయపుడె
చెప్పి పుత్తెంచినఁ జెనఁటిప్రాణముల నప్పుడె విడువన యడిగూసలుండిగి
యని లక్ష్మణునిఁ జూచి యనఘ మీయన్న

యనుమాన ముడిగి నన్నాడుచున్నాఁడు
తగునె యాక్రియ నాడఁదరము నాతరము ♦ తగనిమాటలు నీకుఁ దగదనదగదె
కలపుణ్యగుణములఁ గడచన్నప్రోడ ♦ నొలసి నీ మెఱుఁగని యుచితంబు లేదు
నావర్తనముఁ జూడు నాయందుఁ గలదె ♦ భావింపగల్మష భావమింతైన

## —:* సీత యగ్నిఁ జొచ్చుట :*—

శంకింపవలదు విచారంబు చేసి ♦ యింకమీ నిశ్చయ మిట్టిదయేని
యిక్కడ సాదఁ బేర్చుఁడిందఱుచూడ ♦ సుక్కకయనలంబు సొచ్చెదఁ జొచ్చి
పావకుముఖమునఁ బతికింక బరమ ♦ పావను రాలనై బ్రహ్మాదిసురల
మెచ్చించి మిమ్మెల్ల మెచ్చించి భూమిఁ ♦ జొచ్చెద ననవుఁడు సుక్కి లక్ష్మణుఁడు
రాముఁగనుంగొని రాము కన్నెఱిఁగి ♦ భూమిజకప్పుడ దద్భుతముగాఁ దెచ్చి
సొదపేర్చుటయు మహీసుత సీత ప్రీతి ♦ సొదఁ జూచి ప్రణమిల్లి సొదచుట్టుదిరిగి
యభినుతులింపొంద నగ్ని దేవునకు ♦ నభిముఖయైనిల్చి హస్తముల్ మొగిచి
ధర్మదేవతలార ధర్మంబులార ♦ నిర్మలమతులార నియతాత్మలార
జగదధిపతులార చంద్రార్కులార ♦ నిగమసాధకులార నిగమంబులార
వందితోన్నతులార సర్వజ్ఞులార ♦ పంచభూతములార పరహితులార
నరవరులార కిన్నరవరులార ♦ సురవరుల్లార భూసురవరులార
గరుడసాధ్యులార దిక్పతులార విమల ♦ హరులార తపసంహకులార యేను
ఘనమనోవాక్కాయకర్మంబులందుఁ ♦ బనిగొన రామభూభర్తఁ దప్పఁ
దప్పితనీయగ్ని దరియింపలేక ♦ యిప్పుడు నీతోడు నిందఱుచూడ
ననియొప్పఁ బలుకుచు నమ్మహీపుత్రి ♦ తం చిత్తమున నున్న తాత్పర్య మొప్ప
గనుఁగొని బ్రహ్మాండకటకంబు నిండి ♦ యనుపమాకారంబులై పేర్చి పేర్చి
మొండొండ శిఖల మహోద్రగమగుచు ♦ మండెడు నగ్నిలో మానిని చొచ్చె
నావంతయును గందదాపువుఁ బోఁడి ♦ పావకసరసిలోఁ బసెలమై నిలిచి
కరచరణానన కమలంబులొప్పఁ ♦ వరకుచద్వయ చక్రవాకంబు లొప్ప

నవబాహువల్లి మృణాళంబులొప్పఁ ♦ బ్రవిమల త్రివళీ తరంగంబు లొప్ప
మహితలోలన్నేత్ర మత్స్యంబులొప్ప♦సహజరోమావళి శైవాల మొప్ప
కమలిని తెఱఁగున గర మొప్పుచున్న కమలాక్షిఁ గనుఁగొని కపులురాక్షసులు
శోకింపఁదొడఁగిరి సురసిద్ధసాధ్య ♦ లోకంబులెల్ల నాక్రోశింపఁదొడఁగె
నామరుత్తనయుండు నర్కనందనుఁడు♦సౌమిత్రియును విభీషణుఁడు గదుండు
దరుచరయూథపుల్దానవాధిపులు సరమాదులైన రాక్షసభూజనులు
నధికశోకంబున నడలుచునుండి ♦ రధిపతినిర్విణ్ణుఁడై యుండెనంత
హరుఁడు వాగ్వరుఁడును నఖిలదిక్పతులు ♦ గరుడగంధర్వులు ఖచరవల్లభులు
వరవిమానస్థులై వచ్చిరందఱును ♦ బరఁగఁ బ్రభుత్వస్థానపరుఁడైన రాము
వీక్షించి వేదాంత వేద్యుండ వఖిల ♦ సాక్షివి కర్తవు సంవిదాకృతివి
నిర్వాణ రుఁడవు నిత్యపూర్ణుఁడవు ♦ సర్వసంవేదివి జగదేకనిధివి
యక్షీణపుణ్యుండ వవ్యక్తపరుఁడ ♦ వక్షరత్రయమూర్తి వాద్యంతపతివి
భువనంబులద్భుత భూతిముల్నదులు ♦ సవనంబులద్రులు జంతుసంతతులు
తరువులు తెరువులు తంత్రముల్విధులు ♦
సురలు నక్షత్రము ల్శ్రుతులు శాస్త్రములు
గనుఁగొన వేలు లక్షలుకోట్లుగణన ♦ ననుపమశతకోటు లరసియెవ్వరును
గడగానరా కోర్కె కమలజాండమున ♦బడియట్టి బ్రహ్మాండపఙ్క్తులుగలసి
నీకుక్షినున్నవానికి లెక్కలేదు ♦ నీకడఁ గానంగ నేర్తురేయొకలు
భవదీయమాయా ప్రభావంబు దెలియ ♦ భవదీయులకుఁగాక పరులకువశమె
యొకనిఁజంపితిగెల్చి తొకఁడునిన్గలిచె ♦
నొకఁడుసాధ్యుఁడు నీకు నొకఁడెక్కుడనుచు
స్తుతినిందలవినిన్ను సోకవెన్నఁడును ♦ నతిమహాత్మోన్నతు లట్టివినీకు
దానభావంబునఁ దక్కనొండొకట ♦ నీసంవిదాకృతి నిత్యదుర్ఘటము
నరనాథ నీవాదినారాయణుండ ♦ వరయనజ్జానకి యాద్యాదిలక్ష్మి
లోకైకరక్షణ లోలతనీవు ♦ కాకుత్స్థ డనఁగఁ బ్రఖ్యాతుండవైతి
నిన్నేలమఱచితి నిష్ఠురవహ్ని ♦ నున్న జానకిఁ జూచుచుండుటతగదు
పిలిపించికైకొమ్ము ప్రీతిమన్నింపు ♦ వలవదుపేక్షింప వనజాక్షినింక

—*: అగ్నిదేవుఁడు సీతను శ్రీరాముల కొప్పగించుట *:—

నని పెక్కుభంగుల నఖిలదేవతలు♦ గనుఁగొని బలుకుచోఁ గడఁగిపావకుఁడు
వనిత చెమర్పదు వాడదుమోము ♦ తనువల్లిగందదు తలఁకదింతయును
బాలఁతిధరించిన పుష్పమాలికలు ♦ నలఁగవు తొలఁగవు నాఁతిమైపూఁత
యనుచుదైత్యులుకపులందందనిక్కి ♦కనుగొంచునుబ్బుచుగనదశ్రులగుచు

జగదీశుఁ డీపుణ్యసతి నింతపలుకఁ ♦ దగ దంచు నీతెంపు దగ దంచు నుండఁ
గోమలిఁ దగ నెత్తుకొని వచ్చి ప్రీతి ♦ రాముఁ డన్నిధి నిల్పి రాముతో ననియె
నీవె దైవంబును నీవె ప్రాణంబు ♦ నీవె చుట్టంబును నీవె సర్వంబు
గా నుండు నొండొకగతిఁ జిత్తవృత్తిఁ ♦ గాన దీకల్యాణి కడుముద్దరాలు
రావణుపనుపున రాక్షసస్త్రీలు ♦ వేవురు వేవేల విధముల వచ్చి
తతిమి నొప్పింతురు దారుణక్రియల ♦ వెఱపింతు రలఁతురు వెడ్డువెట్టుదురు
ఇన్నియుఁ జేయంగ నింతయు సాధ్వి ♦ తన్నింత మఱవదు తలఁకదెంతయును
నీయందె చిత్తంబు నిలిపి సర్వంబు ♦ నీయధీనము చేసి నిల్చె నీయింతి
కైకొమ్ము నెమ్మి నీకమలాక్షి నింకఁ ♦ గైకొనకుండుట గాదు ధర్మంబు
అని పావకుఁడు వల్క నా రామవిభుఁడు ♦ దన మది నొక్కింత తడవు చింతించి
యాదిదేవుండు బ్రహ్మాదులు వినఁగ ♦ నా దేవసభలోన నప్పుడిట్లనియె
నీయి తిదెసఁ బాప మింతయు లేదు ♦ నా యెడఁ దప్పదు న్నతచిత్తరాలు
వెలుగును భక్తియు విమలశీలంబు ♦ నెఱుకయు ధైర్యంబు నీయింతియందు
గల దెఱుంగుదు నట్లు గాక దైత్యునకు ♦
మెలఁతుకఁ గదియ రామి యెఱుంగుదును
అధిగతబహుదోషుఁ డగు దశగ్రీవుఁ ♦ డధికబలోన్మత్తుఁడై కొనిపోయి
తన వినోదారామ తరుమధ్యసీమ ♦ నునిచిన జానకి నూరక తెచ్చి యును
నిలమీఁద రఘురాముఁ డిట్టి కాముకుఁడు ♦ గలఁడె దుష్కీర్తిఁ గలఁగఁ డేమి
అని లోకమునఁ బుట్టు నపవాదమునకు ♦ జనకజ నిబ్భంగి శాసింపవలసెఁ
గలశంకలన్నియుఁ గడతేరె నింక ♦ మెలఁతుకఁ గైకొంటి మీమాట వింటి
ననిసమీపంబున నద్దేవినుండఁ ♦ బనిచి రాఘవుఁడు చూపఱు చూడ నొప్పె
దివి నుండి రోహిణీదేవియు దాను ♦ నవిరళప్రభ నొప్పు నమృతాంశుభంగి
నప్పు డయ్యఖిలలోకారాధ్యచరణుఁ ♦ డొప్పు మహోల్లాసడముల్లంబు నిండ
శ్రీమహాదేవుఁ డాశ్రితకల్పతరువు ♦ రాముఁ గనుంగొని రాఁగిల్లి పలికె
నెవ్వఁ డుద్యోగించు నింతటిపనికి ♦ నెవ్వఁడు సాధించు నీజగద్ధితము
లోకకంటకుఁడు త్రిలోకభీకరుఁడు ♦ నాకాదిలోకప్రణామసాధకుఁడు
రావణుఁ లోకవిద్రావణబలుఁడు ♦ రావణు మర్దింప రాదెవ్వరికిని
వీనితోఁ బగఁగొని వీనిపై విడిసి ♦ వీని నిర్వ్యాధిఁ జంపి వీనిఁ గాల్పించి
బలవిక్రమక్రమప్రౌఢిమ మెఱయఁ ♦ గలరె లోకమున నెక్కడైన మగలు
ఆ రావణునిఁ జంపి తనఘ నీవలన ♦ నీ రేడుభువనము లిటు మీఁద బ్రదికె
మీ తండ్రి దశరథమేదినీనాథుఁ ♦ డే తెంచె దివి నుండి యీయొప్పు చూడ
న దేవిమానారూఢుఁడై యున్నవాఁడు ♦ త్రిదశగణాధీశదీప్తుఁడై వాఁడె

ఆజగద్ధితకృత్యుఁ డగుసత్యనిధికిఁ ♦ బూజానమస్కారములు సేయఁబొమ్ము
అనవుడురఘురాముఁ డభిరామశీలుఁ ♦ డనుజన్మయుక్తుఁడై యవనీశునకును
నిండినప్రేమంబు నెలకొననపుడు ♦ దండప్రణామముల్ దగఁ జేయుటయును
చిత్తసమ్మదమునఁ జేనిండఁగూర్చి ♦ యెత్తికౌఁగిటఁ జేర్చియినవంశుఁడనియె
గైకేయిమాట లాకర్ణించినిన్ను ♦ లోకరక్షణకళా లోలుఁగా నలుకఁ
బుచ్చితిఁ దగవింత పోలింపనైతి ♦ నిచ్చలోకశుభకర్మ మెఱుఁగ లేనైతి
నిన్నుఁ బట్టముగట్టి నీవురాజ్యంబు ♦ కన్నులపండువుగాఁ జేయుచుండఁ
జూచిలోకంబులుసుఖయించుచునికి చూచుపుణ్యమునాకుఁ జొప్పడదయ్యె
బుత్రశోకంబునఁ బోయిననాకు ♦ సుత్రామలోకంబు చొరఁబూటగలదె
ఆతాపమెప్పుడు నంతరంగమున ♦ నాతతస్ఫుటవహ్నులై మండుచుండు
నమరలోకంబున నాఁడదాచిచ్చు ♦ శమియించె నేఁడు నీసన్నిధిఁ జేసి
కమలాప్తసమతేజ కమలాభిరామ ♦ కమలాప్తవంశ యక్షరకీర్తులొప్ప
నీవయోధ్యకుఁ బోయినిఖిలధర్మములు ♦ భావించిమదిఁ బెట్టినట్టంబుఁ బూని
రాముఁడ రాకాభి రాముఁడనుతుల ♦ తోమహి యేలుము తుదముట్టననుచు
సౌమిత్రిఁ గనుఁగొని సౌమిత్రినీవు ♦ రాముని వెనుక నరణ్యభూములకుఁ
జనుదెంచియుత్తమసాహసక్రియల ♦ ననఘుఁడై వర్తించి తతులపుణ్యుఁడవు
మెలకువనిటమీఁద మీయన్నమనసు ♦
నలగకుండఁగ నీవు నడపుమీ యనుచు [యొ
దనకర్థిమ్రొక్కెడు యాదలవాంచియున్న ♦ జనకనందనఁజూచి జననాథుఁడని
బరమపాతివ్రత్య పదశుద్ధినీకు ♦ సరియెవ్వ రుత్తరు సాధ్వివినీవు
నినురాముఁడాడిన నిష్ఠురోక్తులకుఁ ♦ గినియకునొవ్వకు గీడ్పడియుండు
ఘనకీర్తియుతులరాఘవుఁ బోలుసుతులఁ ♦
గనుముపుణ్యములెల్లఁ గైకొని మనుము
అనిమువ్వురను మెప్ప లలరదీవించి ♦ తలలోన మోదించె దశరథేశ్వరుడు
చంద్రశీతలురామ జననాథచంద్రు ♦ నింద్రాదిదేవత లెల్లవీక్షించి
మనుజుండవై నీవు మాకుఁగావచ్చి ♦ జనియించిరాక్షస క్షయముగావించి
యీభంగిదుఃఖంబునిన్నియునోర్చి ♦ భూభారమంతయుఁ బుచ్చిపోవైచి
మమ్మిటరక్షించి మాజీవనములు ♦ నెమ్మిలోమాకిచ్చి నిలువకడలొసఁగి
పుచ్చుచున్నాఁడవు పుణ్యాత్మవరము ♦ లిచ్ఛదమడుగు మభీష్టంబు లేమి
యనవుడురాముఁడాయమరులఁ జూచి తనలోనచిఱునవ్వుదళుకొత్తఁ బలికె
నింపొందు మీకృప నెల్లకామ్యములు ♦
సంపూర్ణములు మాకు జగములయందుఁ

దమతమభూములఁ దమమందిరములు ♦ దమబంధుజనులను దమతనూజులను
దమకళత్రాదులఁ దగవొప్పవిడిచి ♦ సమరంబులోపల సకలవానరులు
తెగిరమ్ము డాపక తివిరి నాకొఱకుఁ ♦ బగరతోఁ బోరాడి ప్రాణముల్విడిచి
యున్నారు కపివీరు లున్నతాత్మకులు ♦ నన్నుమన్నించుట నాకిందు వీరి
ననవుడు విని దివ్యులాఁ గాక యనుచు ♦ వనచరప్రాణము ల్విచ్చుఁగాక నిగి
అనిమహాదేవుండు నబ్జసంభవుఁడు ♦ ననఘులై యింద్రాదులైన దిక్పతులు
మునులును సురలు నిమ్ములనుతించుచును ♦ జనదశరథుఁడును జనియొనద్దివికి
ననిలోనఁ దెగిపడ్డ యగచరులపుడు ♦ ఘననిద్రమేల్కను కైవడిఁ దోఁప
నమరులవరశక్తి నద్భుతంబెసఁగ ♦ సమరోర్వినందఱు సప్రాణులగుచుఁ
జనుదెంచి యా రామచంద్రుని వేఁడఁ ♦

కనుఁగొని హర్షించి కలయ మ్రొక్కుటయు
దన తారనందఱ దయతోడఁ జూచి ♦ జనలోకనాథుండు సంతోషమొందె
నంత విభీషణుం డారాముతోడ ♦ నెంతయు భక్తితో నేర్పడఁ బలికె
దేవ రాఘవ ధరాధీశ నీవింక ♦ వేవేగ లంకకు వేంచేసి యచట
నవిరళమతితోడ నభిషేకమిప్ప ♦ డవధరింపఁగ వేళ యనిన రాఘవుఁడు
భరితశిరోజటాభారవల్కలుఁడు ♦ భరతుఁడక్కడఁ దపోభరమున నుండ
నతనిఁ జూడక మాకు ననుచితంబిచటఁ ♦ జతురభోగక్రమసముచితక్రియలు
అనుటయు నుచితజ్ఞుఁడగు విభీషణుఁడు ♦ ఘనభక్తియుక్తిమైఁ గడఁక దీపింప
గనకపాత్రంబుల గంధాక్షతములు ♦ ఘనరత్నభూషణ కనకాంబరములు
పుణ్యనాదములతోఁ బుణ్యలతోడఁ ♦

బుణ్యచిహ్నములతోఁ బుణ్యభామినులఁ
బనిచి తెప్పించి నిర్భరభాగ్యధనుఁడు ♦ వినయాభిరతి వినువీధినందంద
సురదుందుభులు మ్రోయ సురలు నుతింప ♦ సరసాక్షతముల సేసలు నిండఁ జల్లి
రామలక్ష్మణులకు రాజీవనేత్ర ♦ భూమినందనకు నప్పుడు గట్టనిచ్చె
నంత రాముఁడు నిశ్చలానందుఁడగుచు ♦

నెంతయుఁ బ్రియ మంది యింపొందఁ బలికె
గడుఁ బెద్దకార్యముల్గలవు మాకిఁక ♦ దడయుటగాద యయోధ్యకుఁ బోవవలయు
ననుటయు రామునినా విభీషణుఁడు ♦ కనుఁగొని భక్తితోఁ గరములు మొగిచి
భీషణరణకేళిఁ బేర్చి రావణుఁడు ♦ రోషించి మును కుబేరుని గెల్చికొన్న
పుష్పకంబున్నది పురుహూతలోక ♦ పుష్పక్రమమహాద్భుతవేగమరయ
నెలమి నా పుష్పకమెక్కి సమ్మదము ♦ వెలయ నయోధ్యకు వేంచేయవలయు
ననవిని రఘురాముఁడనుమతించుటయు ♦ జనిమహాసంభ్రమసంప్రీతులొప్ప

సరిదివ్వైభవములనమరుపుష్పకముఁ గరమర్థిఁ దెచ్చె రాక్షసకులేశ్వరుఁడు
రావణులోకవిద్రావణుశక్తి ♦ భావించి యెంతయు భయమునుబొంది
యతిముక్తిఁ గదలుపననిలుండుఁ గదియఁ ♦ వెఱచునో దీపముల్ వెఱచునో కదల
నవరత్నదీపంబు లచలరూపముల ♦ నొనరుమందానిలంబుల నొప్పుదాని
ఘనవిమానోదర కలితపుష్పములఁ ♦ గొనకొన్నగంధముల్ గ్రోలనే తెంచి
యులికిలోపలఁ జొరఁ గొన్నతుమ్మెదల ♦ చెలువునదీపుల చెన్నగ్గలించు
నావిమలద్వార హారినీలమణుల ♦ భావింపనెంతయు భాసిల్లుదాని
తలగొనితోఁటలఁ దనపిన్ననాఁడు ♦ వలపించితమఁ బాసి వచ్చినఁ జూచి
పొగులుచుషట్పదంబుఁ తోడవచ్చి ♦ మొగిసున్నమల్లికా ముకుళంబులనఁగ
నానీలమణులతో సలపడఁ గ్రుచ్చి ♦ మానైనమౌక్తికమణులొప్పుదాని
త్రిభువనంబులయందుఁ దిరిగెడుగంగ ♦ శుభమతివిశ్రాంతికై యున్నధరణి
ఖచితహంసావళి కమలదుకూల ♦ రచితవితానంబు రంజిల్లుదాని
నెవ్వఁడువచ్చునో యిందునా రాముఁ డెప్పుడుచూతుమో యేము రాఘవుని
ననియనిచింతించి యమరకన్యకలు ♦ తనువులుజ్జ్వలమణిస్తంభముల్ చేర్చి
నిలిచినచెలువున నిర్మలస్తంభ ♦ ముల మణిపుత్రికల్ మొగిసున్నదానిఁ
జేకొనివసుధపై సృష్టిరక్షింప ♦ వైకుంఠపతి రామవల్లభుఁడైనఁ
బొలుచువైకుంఠంబు పుష్పకంబైన ♦ చెలువునవంతయుఁ జెలఁగెడుదాని
గనుఁగొనియప్పుడా కాకుత్స్థతిలకుఁ ♦ డనురక్తితో రాక్షసాధీశుఁ జూచి
రావిభీషణవీర రావణోదగ్ర ♦ పావకునార్చిన పటుపయోదముల
వీరినారాధింపు వీరిఁ బూజింపు ♦ వీరిసంభావింపు విపులసంపదల
ననివానరులఁ జూపి యర్థిదీపింపఁ ♦ బరచినరాక్షసపతి విభీషణుఁడు
ధనములంబరములుతగుభూషణములు ♦ కనకముల్దెప్పించి కడుఁ బ్రీతి మెఱసి

—:* శ్రీరాములు పుష్పకవిమాన మెక్కి యయోధ్యకుఁ జనుట *:—

జనపతిసన్నిధి సంభ్రమం బొప్ప ♦ వనచరపతులకు వరుసతో నిచ్చె
బతిరాముఁ డపుడు పుష్పకమునర్చించి ♦
సతియుఁ దమ్ముఁడు దాను సద్భక్తియుక్తి
గృతకృత్యుడై ప్రదక్షిణముగా వచ్చి ♦ యతిహర్షమున నెక్కె నవ్విమానంబు
లెక్కె సుగ్రీవాది హితులవానరులఁ ♦ దక్కటవీక్షించి దశరథాత్మజుఁడు
మీరుచేసినయట్టి మిత్రకార్యములు ♦ నేరరు సురలైన నిష్ఠతోఁ జేయ
నెల్లతేజంబులు నెల్లసౌఖ్యములు ♦ నెల్లయశంబులు నేనుమీవలనఁ
బడసితిఁ బుణ్యులు పరమపావనులు ♦ కడుధన్యులగు మీరు కపులార యింకఁ
బొందుమీ మీ దేశములకు నావుడును ♦ నిండారు వేడ్కల నృపుఁ జూచి కపుల

ధరణీశ మేఘరావాధ్యుఁ గొల్చి వచ్చి ♦ పరమానురక్తిమీ పట్టంబుఁ జూచి
నిరుపమచరితుల నీసహోదరుల ♦ భరతశత్రుఘ్నులఁ బరమపావనులఁ
జూచి మీతల్లులఁ జూచి మీపురము ♦ చూచి భాగీరథి చూచి వచ్చెదము
అనవుడు విని రాము డంతరంగమున ♦ ననయంబు హర్షించి యావిభీషణుని
భానుజు నంగదుఁ బవనుజు నీలు ♦ మాననీయాత్ముల మఱియుఁ బెక్కండ్రు
వనచరప్రముఖుల వాత్సల్య మొప్ప ♦ ననయ నాపుష్పక మెక్కించుటయు
ధరధీశు మన్ననఁ దగ నుత్సహించి ♦ పరమపావనులు పుష్పక మెక్కి రంతఁ
ద్రిజటాదిసతులు ధాత్రీజకు మ్రొక్కి ♦ నిజగృహంబులకు దజనెమ్మితోఁ జనిరి
దశరథాత్మజుఁ జూచి దానవేశ్వరుఁడు విశదంబుగాఁ బల్కె వినుము శ్రీరామ
యెలమి నీపుష్పక మొందఁ జెక్కినను ♦ సలలితంబుగఁ జోటు చాలి వెండియును
నొకకోటి కడమయై యుండు నేనూటి ♦ కకలంకగతిని జోటనముదంబంది
ధరణీశుఁ డప్పుడు తరుచరాసురులఁ ♦ గరుణ పుష్పక మెక్కఁగా నానతిచ్చి
వత్వాడ బుష్పకం బాకాశవీథి ♦ నొప్పెడి వేడుక నుప్పొంగి యెగసి
ఘనమనోవేగంబుఁ గైకొని నిగిడి ♦ వినువీథి దివ్యులు వినుతింపఁ బేర్చి
పర్విన ప్రభలతో భానుబింబంబు ♦ పూర్వపశ్చిమ పక్షంబులఁ బోక మగిడి
దక్షిణంబుననుండి తగ నుత్తరమున ♦ కక్షీణగతిఁ బోవు నాకృతిఁ దోఁపఁ
బోవునప్పుడు నిత్యపుణ్యుండు రామ ♦ దేవుండు జానకీదేవితో ననియె

—*: శ్రీరాములు సీతకు రాక్షసవీరుల విక్రమముఁ దెల్పుట :*—

శుకవాణి జానకి చూచితే లంక ♦ యకలంకలక్ష్మిఁ దనరుచున్నదియుఁ
గమలాక్షి యిది విశ్వకర్మ నిర్మింపఁ ♦ గొమరు దీపించెఁ ద్రికూటమధ్యమున
నీలంక నిమ్ముగ నేలు పుణ్యంబు ♦ చాలక పోలిసె దుర్జనుఁడు రావణుఁడు
అనిరక్తమాంసగజాశ్వతండముల ♦ ఘనమైన సమరభాగముఁ జూపి విభుఁడు
కదనవిక్రమశక్తిఁ గడఁగి యేతెంచి ♦ మదిరాక్షి యిక్కడ మడిసె రావణుఁడు
ఘనసత్త్వుఁడై కుంభకర్ణుండు దొడరి ♦ యనిఘోరముగఁ జేసి యక్కడఁ గూలె
సహితుఁడై నీలుఁ బ్రహస్తుఁడు దాఁకి ♦ బహుసత్త్వుఁ డిక్కడ భస్మమై పోలిసె
శూరతఁ బవమాన సుతుఁడు ధూమ్రాక్షు ♦

నారూఢబలు ద్రుంచె నతివ యిక్కడను
భేదించి యిచట నభేద్యుఁడై మేఘ ♦ నాథుండు మముఁ గట్టె నాగపాశముల
ధృతియు లావును బేర్చి తెగువమైఁ బోరి ♦ యతికాయు సౌమిత్రి యక్కడఁ గూల్చె
నలఘుఁడై మకరాక్షుఁ డక్షీణబలుఁడు ♦ బలమేది యిక్కడఁ బడియెఁ బోరాడి
భగ్నారివీరుండు భగ్నప్రతాపుఁ ♦ డగ్నివర్ణుఁడు గూలె నయ్యెడ నతివ
కడిమిమైఁ బోరాడి గర్వంబు లావు ♦ నెడలి యకంపనుం డిక్కడఁ గూలె

నలుకమై సౌమిత్రి యాయింద్రజిత్తు ♦ నలవొప్పఁ దెగటార్చె నయ్యెడ నబల
యనుపమబలుఁడగు నమ్మహాకాయు ♦ దునిమె నియ్యెడ నంగదుఁడు సరోజాక్షి
తఱిమి యయ్యెడ మహోదర మహాపార్శ్వ ♦

లఱిమి చచ్చిరి మహోదగ్రవిక్రములు [అను
క్రూరులై దేవాంతకుఁడు నరాంతకుఁడు ♦ పోరాడి యిక్కడఁ బొలిసి రిద్ద
ఱదె పయోనిధిమీఁద నేపు దీపింపఁ ♦ గదిసి మా కట్టిన ఘనసేతు నబల
ఱదె గంధమాదనం బిదె పుణ్యతీర్థఁ ♦ మిదె సదాశివ సమాహితనివాసంబు
కమలాక్షి యీతోఁచు కాంచనాచలము ♦

రమణీయ మిదియ హిరణ్యనాభంబు
పవమానసూనుండు పడఁతి నిన్వెదక ♦ జప మొప్ప లంకకుఁ జనుదెంచు నాడు
అతనికి నాతిథ్య మర్థిఁ గావించు ♦ మతిసద్ధి వెడలె నమ్మహితశైలంబు
నని చెప్పుచును రాఁగ నారాఘవునకు ♦ ఘనతర భీషణాకారంబుతోడ
నేతెంచి దశకంఠుఁ డెదుటఁ దోఁచుటయు ♦ భీతిల్లి యపుడు విభీషణు కనియె
జలజజుండాదిగా సకలదేవతలు ♦ పలుమఱుఁ గొనియాడఁ బఙ్క్తికంధరునిఁ
దునిమితి నాజిలో దోర్బలశక్తి ♦ నెరయ నారావణుఁ డేతెంచి యిటకు
గదియుచు నాకనుఁగవ మ్రోల నిలిచె ♦ నిది చిత్ర మేర్పడ నెఱిఁగింపు మనుడు
జననాథ యాబ్రహ్మసంతతియందు ♦ జనియించినట్టి దుర్జనుని రావణునిఁ
దెగటార్చితటు గాన దేవ యాహత్య దిగిలి యేతెంచి ముందటఁ దోఁచె మీకు
గడఁక నీపాప మక్కడఁ బాపి వేద ♦ గడిచి పోయినఁగాని కార్యంబు గాదు
అవనీశ మీ యాత్మ నబ్జసంభవునిఁ ♦ దవిలి తలంపుము దలఁచిన నతఁడు
అతిముదంబున వచ్చి యమరులుఁ దాను ♦ మత మెఱిఁగించెడి మనువంశతిలక
యనపుడుఁ బుష్పక మవనికి డించి ♦ తనమదిలోపలఁ దాత్పర్య మొప్ప
భూమీశుఁ డప్పు డంబుజసంభవునిని ♦ గావించితఁప నక్కడి కేగుదెంచె
నఖిలదిక్పాలురు నఖిలదేవతలు ♦ నఖిలసంయములును నందందఁ గొలువఁ
బ్రేయనిక్టేతెంచి ప్రియపూర్వకముగ ♦ రాముతోఁ బలికె నారాజీవభవుడు
దేవ రాఘవ యేమి తెలఁగుననన్ను ♦ రావించిన తనపుడు రఘువల్లభుఁడు
తనముఖంబున దోఁచు తత్క్రమం బెల్ల ♦ వినిపింప నాతఁడు విస్మయం బంది
దేవదైత్యుఁడు నాదు తేజంబునందు ♦ నీవను మతిఁ బట్టి యున్ని పాపముల
నురుతరంబుగఁ జేసి యుగ్రత మెఱయఁ ♦ బరికింపఁ బిదప నిష్పాపుఁడై పొలిసె
ధరణిపై విప్రుండు దనకులక్రమము ♦ సరసి తా నిలుపక యన్యవర్తనము
వరయుచు సతుల దోషాచారుఁడైన ♦ గురుదూషకుండైనఁ గులశత్రుఁడైన
నారయ గోబ్రహ్మహత్యాదిఘోర ♦ దారుణకర్ముఁడై తనరువాఁడైన

వధకునర్హుఁడుగాఁడు వసుధపై నెన్ని ♦ విధములనైనను వివరించిచూడ
నట్టిదుర్జనునకు నట్టిక్రూరునకు ♦ నట్టిపాపాత్మున కాజ్ఞ యేమనిన
నతనికులంబున కంత్యంబుఁ జేసి ♦ పతితనభూమిలోపల నుండనీక
తగ వెడలించుట దండంబుసుమ్ము ♦ జగతీశయిపుడు విశ్రవపుత్రుండు
మోక్షంబుఁ గోరి నీముందటఁ దోఁచె ♦

మోక్షకాముని జేయు ముదముననిపుడు
భావించినీవీర భవునిఁ బ్రతిష్ఠఁ గావింపుమున్నీటి కట్టపై నొప్ప
రమణమైనొక మహూర్తము లోననుచు ♦

క్రమమొప్పఁ దెలిపి యాకమలజుం డరిగె

—:* శ్రీరాములు లింగప్రతిష్ఠ సేయుట *:—

నావేళ రఘురాముఁ డాసన్నుఁడై ♦ పావనినీక్షించి పలికెనిట్లనుచు
సన్నుతబలశౌర్య సాహసధుర్య ♦ పన్నగాశనవేగ పరమానురాగ
మాకార్యమీడేర్చి మమునుద్ధరించి ♦ మాకీర్తి నెగడించి మముఁ బ్రోచితీ
వినయవిక్రమధైర్య విఖ్యాతులందు ♦ నినుఁ బోలరెవ్వరు నిఖిలలోకములఁ
గావున నిపుడొక్క కార్యమీడేర్పు ♦

మావార్తయెఱిఁగింతు మదియెట్టులనిన
నగచరాధీశ యత్యంతవేగమున ♦ నగణితఫలరాశి యగుకాశిడాసి
కరమొప్పనొక్క లింగముగాని తెమ్ము ♦ పరఁగ నిన్నూటనల్వది యోజనములు
గలదిచ్చటికి రెండు గడియలలోన ♦ నిలుపక చనుదెమ్ము నీవాహనమున
ధరమీఁదఁబడిన నాతమ్మునికొఱకు ♦ నిరుమాఁడులక్షలు నిరువదివేలు
పదియోజనములును బవనవేగమునఁ ♦

గదలిమందులకొండఁ గ్రక్కున దెచ్చి
తిరుగ నప్పటిచోటఁ దిరముగా నునిచి ♦ యరుగుదెంచితివప్పడరజాములోన
నదిగాన నీకిదియధిక మేయనిన ♦ ముదముననుప్పొంగి మ్రొక్కి వీడ్కొనుచు
నరిగి యప్పుడు మహేంద్రాచలంబెక్కి ♦ యురుతరశక్తిమై యుంకించి యెగసి
ఘనతరంబగు కాశికాపురిడాసి ♦ యనఘతరంగిణి నాగంగఁ గ్రుంకి
కాశికానిలయుని ఘనువిశ్వనాథు ♦ వాసవనుతునీశు వరదయాలోలుఁ
గని మ్రొక్కి నుతిఁ జేసి కదలియాఘనుఁడు ♦

ఘనబుద్ధినొక్క లింగంబుఁ గైకొనుచు
నధిక వేగంబున నరుదెంచుచుండె ♦ బుధజనవినుతుఁడా భూమీశుఁడంత
హనుమంతురాకకునటుచూచిచూచి తనరంగనిటముహూర్తము చేరవచ్చె
జనుదేరఁ డేమొ రాక్షసుఁ డెవ్వడైనఁ ♦ జెనకినజగడంబు సేయుచున్నాఁడో

యేమి కార్యమొ యని యిచ్చఁ జింతించి ♦
యీముహూర్తముదప్ప కిటలింగమొకటి
నెనయఁ బ్రతిష్ఠింతు నిసుకచేననుచు ♦ జననాథుఁడట సమస్థలమున కరిగి
కరములనొక్క లింగముగాఁగ నిసుకఁ ♦ గర మొప్పఁ జేసినఁ గంజాక్షి సీత
సందిగావించినా నగజాధినాథు ♦ నుండటనిసుకచే నొగిరామవిభుఁడు
నామొదఁబూజసేయఁ గడంగునంత ♦ వాయువేగంబున వాయునందనుడు
అరుదెంచి రఘురాము నడుగులకెరఁగి ♦ ధరణీశుఁడుంచిన దర్పకారాతిఁ
గనుఁగొని ఖిన్నుఁడై కళవళంబంది ♦ తనువుగంపింప గద్గదకంఠుఁడగుచు
నంజనాసుతుఁడప్పు డనియెనోరామ ♦ కంజాప్తకు సోమ కాశికి నన్నుఁ
బనిచినఁ బనిపూని బ్రహ్మాదిసురలు ♦ గనుఁగొన నచటి లింగమును దెచ్చితిని
ననుఁబంపి యిచ్చట నగజాధినాథు ♦ ననుపంగఁదగునయ్య యుర్వీశచంద్ర
ఆనువొందనేఁ దేర నర్హుండుగానొ ♦ మనమున నామీఁద మక్కువ లేదొ
అనుడు రాముఁడు మందహాసంబు చేసి ♦
హనుమంతుఁ జూచి యిట్లనియెనాకరయఁ
దమ్ములలోనొక్క తమ్ముఁడవీవు ♦ నెమ్మితో నీమీఁద నెయ్యంబుఘనము
ఈమహూర్తముఁదప్పకనీక యీశివునిఁ ♦ గామించి యిసుకచేఁ గావించితర్థి
నంతలోనన నీవు పరుగుదెంచితివి ♦ సంతోషమయ్యె నీశ్వరుని నవ్వాలికిఁ
దెమలించి నీ తెచ్చు దేవుని నిలుపు ♦ మమకులు వొగడంగ ననిన వాయుజుడు
ముదమంది తనవాలమున నీశుఁజుట్టి ♦ కదలించి కదలించి కదలింపలేక
మదిలోన శంకించి మతియునుంకించి ♦ మొదలింపఁజాలక మిగులఁ జింతించి
యక్కటమున్ను ద్రోణాచలంబేను ♦ దక్కక యగలించి తనరఁ దెచ్చితిని
భుజగకంకణుతోడ భూతాలితోడ ♦ రజతాద్రి నెత్తిన రావణునకును
నెత్తంగ నలవిగా కెసఁగు సౌమిత్రి ♦ నెత్తితి నింద్రాదు లెల్లఁ గీర్తింపఁ
దటుకున మేరుమందరములనైన ♦ బొటవ్రేలఁ జిమ్ముదు భూరిసత్త్వమున
నిదియేల వ్రేగయ్యె నీరీతినాకు ♦ బదిలంబుఁదప్పెనో భానువంశజుని
గినిసి యేమాటుపల్కిన పాపమునొ ♦ కనుఁగొననటుఁగాక కాశిశునిటకుఁ
జేకొని యేను దెచ్చినపాపమునొ ♦ కాకున్న నిదియేల ఘనమగుననుచుఁ
బదిలంబుఁగా దన బలమెల్లఁ గూర్చి ♦ త్రిదశులు నెఱగఁదఁ దివిరి వెండియును
నగచరేశ్వరుఁడు దైర్యముతోడ నభవుఁ ♦ గదలింపలేక బాహాగర్వ మెడలి
పటురక్తములుగ్రక్క ప్రాణముల్గలఁగి ♦
యటమూర్ఛతోడ నయ్యవనిపైఁ ద్రెళ్లె
నానమయంబున నారామవిభుఁడు ♦ భాసురమృదుకర పద్మముల్సాచి

హనుమంతు నత్తనొయ్యన మూర్ఛ దెలిసి ♦ జననాథవరునకు సాష్టాంగ మెరగి
జయభూమిజాస్వాంతజలజషట్చరణ ♦ జయఘోరకుటిల - తుసచయహరణ
జయఖండితోద్దండ శర్వకోదండ ♦ జయశోషితాబ్ధి ప్రచండోరుకాండ
జయరావణోన్నతశైలామరేంద్ర ♦ జయభక్తపరిపూర్ణ సత్కృపాసాంద్ర
జయనిర్మలాత్మ సజ్జనకల్పభూజ ♦ జయపద్మబాంధవ శతకోటితేజ
నీమహిమంబులు నేర్తురే తెలియ ♦ నామహేశ్వరుఁడైన నమరేజ్యుఁడైన
నాగేంద్రుఁడైనను నాకేంద్రుఁడైన ♦ వాగీశుఁడైనను వసుధాతలేంద్ర
ఏనిన్ను నెఱుఁగంగ నెంతటివాఁడ ♦ నేనిన్నుఁ గొనియాడ నెంతటివాఁడ
బేలనై మీరు నిల్పిన యీశు నెఱుఁగ ♦ కేలీలఁ దెమలి ప నెంచినయట్టి
నాతప్పులోఁ గొని నన్ను మన్నించి యీతటి మీయాజ్ఞ నేఁ దెచ్చినట్టి [చున్న
యీయీశునకు వెర వెఁగింపుమనుచుఁ ♦ బాయనిభక్తితోఁ బ్రణుతించు
హనుమంతుఁ జూచి యిట్లనియె రాఘవుఁడు ♦ మనమున నీవేల మరిగెద విట్లు
నీవు దెచ్చిన కాశినిలయుని చొప్పటఁ ♦ బావనియును పుమీభవునకు మును పు
ప్రీతిఁ బూజనొనర్చిన పిదప నాయీశు ♦ నాతతభక్తితో నర్చింతు సకల
భూజనంబులు నిట్లు పూజగావింతు ♦ రా జాహ్నవీజలం బవనిలో జనము
తెచ్చి నీ తెచ్చిన దేవునకర్థిఁ ♦ జెచ్చెర నిట నభిషేకంబు సేయ
నతఁడొనర్చిన బ్రహ్మహత్యాదియఘము ♦ లతనిఁ బొందవు కీర్తులలర సిద్ధించు
నతులితపుత్త్రపౌత్త్రాభివృద్ధియును ♦ నతులభోగంబులు నమరంగఁ గలుగు
ననిపల్కె హనుమంతుఁ డతిముదంబంది ♦

మనమున సంతోష మగ్నుఁడై పొంగెఁ

బరమాత్ముఁ డటను మాపతిఁ బ్రతిష్ఠించి ♦ యురుభక్తిగ దషోడశోపచారముల
గర మొప్ప మును మున్న కాశికావాసు ధరణివంశ్యుడు సొంపు దనరారఁ బూజ
గావించి పిదప దాఁ గావించు శివుని ♦ భావించి యర్చించెఁ బరమహర్షమున
రమరఁ బూవులవాన రఘురాముమీఁద నమరులు గురియింప నగచరులురియ
నంత విభీషణుం డధిపతికనియె ♦ సంతోషముప్పొంగ జగతీశ యిప్పు
డీకట్ట తెరవుగా నెవ్వరికైన ♦ రాకుండఁ జేయుమో రామ లంకకును
నావుడు హర్షించి నలినాప్తకులజుఁ ♦ డా విభీషణుఁ జూచి యౌఁగాక యనుచు
నడరంగ నటఁ గొన్ని యడుగులు మగుడి నడుసేతుమీఁద నున్నతితోడ నిలిచి
కపులుగ్రముగ నబ్ధిఁ గట్టినయట్టి ♦ విపులబంధము లెల్ల విడిచెనో యనఁగఁ
దనసహోదరు చేతి ధనువందిపుచ్చు ♦ కొని వేగమున ధనుష్కోటిఁ గావించి
వరదారగమనంబు బ్రహ్మహత్యలను ♦ గురుజనద్రోహంబు గోగణవధము
సోదరీరతియును సురఁ గ్రోలుటయును ♦ వేదదూషణమును విత్తాపహారము

సుందరీచ్ఛేదంబు చోరసంగమము ♦ మందిరదహనంబు మాంసభక్షణము
మొదలైన పాతకంబులు చేసినయైన ♦ గదిసి యిచ్చట నవగాహంబు సేయు[దు
పురుషముఖ్యున కనుపుణ్యసంఘములు ♦ అరుదార నాయువు నారోగ్యమెపు
పరహితాచార సౌభాగ్యసంపదలు ♦ చిరకీర్తులును వేగ చేకూరుననుచు
నా రాఘవేశ్వరుండపుడు పుష్పకము ♦ నా రూఢగతి నెక్కి నధిక మోదమున
నమరులు దీవింప నగచరుల్ వొగడ ♦ నమరంగ నెప్పటి యట్ల పుష్పకము
ఘన వేగమున జనగ గనమార్గమున ♦ మనకులేశ్వరుఁ డంత మహిపుత్రిఁ గనియె
హిమకరబింబాస్య యిదె విభీషణుఁడు ♦ మము గన్నచోటు సమ్మదమున వచ్చి
ఇక్కడఁ గుశతల్ప మేను గైకొంటి ♦ యిక్కడనుండితి నేకతంబునను
పూని బ్రహ్మాస్త్రమద్భుతశక్తి మెఱసి ♦ యేను బయోధిపై నిక్కడఁ దోడుఁ గ
నదులతో నన్నదీనాథుండు వచ్చి ముదముతో నను గాంచి మ్రొక్కిన చోటు
అలఘువిక్రమశక్తి నమ్మున సాధించి ♦ జలజాస్య యిక్కడఁ జంపితి వాలి
పుష్కరబహుఫలాద్భుత కాననములఁ ♦ కిష్కింధ కంటె సుగ్రీవుపట్టణము
అని యని తెల్పుచో నాలోలనేత్ర ♦ జనకనందన రామచంద్రుతో ననియె
జననాథ సుగ్రీవుసతులతోఁ గూడ ♦ వినుఁ డయోధ్యకుఁ బోవ వేడ్క పుట్టెడిని
ననవుడు పుష్పకం మయ్యెడ నిలిపి ♦ జనపతి యనిచినఁ జతురుఁడై యరిగి
తారాధినాథుండు తారాద్రికీర్తి ♦ తారాపథంబునఁ దారాదిసతులఁ
జెలువొందఁ దోడ్తెర సీతకు మ్రొక్కి ♦ యెలమిఁ బుష్పకమెక్కి రింపార వారు
ఎంతయుఁ బదిలమై యేపు దీపింప ♦ నంత నెప్పటి మాడ్కి నరిగె బుష్పకము

**{ శ్రీరాముఁడు మార్గమధ్యములోని విశేషములు సీత కెఱిఁగించుట }**

ఆలోన రఘురాముఁ డాఋష్యమూక ♦ శైలంబు డగ్గరి జానకిఁ జూచి
హితవానరానీక మీ ఋష్యమూక ♦ మతిలోకమీగిరి నర్థితో మున్ను
శరణాగతుండయి చనుదెంచుటయును ♦ కరుణ సుగ్రీవునిఁ గాన్పించుకొంటి
నానన్న రవికిరణాసక్తకమల ♦ భాసురోదరము పంపాసరోవరము
ఇదె మాచి తేయొప్పు నీపుణ్యసరసి ♦ మృదులతీరంబున మెలఁత నిబ్బాసి
బహుదుఃఖములఁ బొంద బవమానసుతుఁడు ♦

మహితపుణ్యాత్ముండు మము వచ్చి కాంచి
హృదయపద్మమునకు నింపు పుట్టించి ♦ మది రాక్షి కాన్పించె మర్కటేశ్వరుని
ఒదవు కాననముల నొప్పుచున్న ♦ దదె శబర్యాశ్రమ మబ్జాయతాక్షి
యలిగి యిక్కడ మహాహవకేళి వాలి ♦ బలశాలియైన కబంధుఁ జంపితిని
నినుఁ జెఱఁగొనిపోవు నీచరావణుని ♦ గనుఁగొని పోనీక కడిమి మైఁ దాఁకి

